# రచనలు



- మోదుగు పూలు
- మానవత
- శర తల్పం
- దేహదాసు ఉత్తరాలు

# దాశరథి రంగాచార్య రచనలు

## రెండవ సంపుటం

- ★ మోదుగుపూలు ★ మానవత
- ★ శరతల్పం ★ దేహదాసు ఉత్తరాలు



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001

**Dasaradhi Rangacharya Rachanalu Vol-II**

ప్రచురణ నెం. : 2029

ప్రతులు : 1000

వి. పి. హెచ్. ప్రథమ ముద్రణ : అక్టోబరు, 1997



టైటిలు డిజైను : చంద్ర

**వెల : రూ. 100-00**

ప్రతులకు :

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

4–1–435, విజ్ఞాన్ భవన్, బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్–500 001

విశాలాంధ్ర బుక్ హౌస్

హైదరాబాదు, విజయవాడ, గుంటూరు, విశాఖపట్నం,
అనంతపురం, తిరుపతి, హన్మకొండ, కాకినాడ.

ముద్రణ : నాగార్జున ఎంటర్‌ప్రైజెస్, విజయవాడ - 520 004

# ఈ సంపుటిలో....

పేజి

# దాశరథి రంగాచార్యగారి సృజనాత్మక సాహిత్యం

## 5 సంపుటాల్లో

| | | | | రూ. |
|---|---|---|---|---|
| ★ | మొదటి సంపుటం : | చిల్లర దేవుళ్ళు | — | 20-00 |
| ★ | రెండవ సంపుటం : | మోదుగుపూలు, మానవత, శరతల్పం, దేహదాసు ఉత్తరాలు | — | 100-00 |
| ★ | మూడవ సంపుటం : | జనపదం | — | 120-00 |
| ★ | నాల్గవ సంపుటం : | మాయజలతారు, రానున్నది ఏది నిజం, నల్లనాగు | — | త్వరలో |
| ★ | ఐదవ సంపుటం | జీవనయానం | — | త్వరలో |

# "మోదుగుపూలు"కు సువాసన

స్వాతంత్ర్యాత్పూర్వం వాయవ్య సరిహద్దు రాష్ట్రంలోని 'మచ్' కారాగారం అమానుష శిక్షలకు ప్రసిద్ధి. వాటిని తలచుకుంటేనే ఒళ్ళు జలదరిస్తుంది నేటికీ. ఖైదీలను తలక్రిందులుగా వ్రేలాడగట్టి కొరడాతో కొట్టడం, గంటలకొద్దీ పిండి విసిరించడం, విసరలేక పడిపోయేవారిని దావబాది కూర్చోబెట్టడం, వంగబెట్టి వీపులపై బరువు మోపి నిలబెట్టడం ఇలాటి శిక్షలను తలచుకొంటేనే మృత్యువు సాక్షాత్కరించేది. అందువల్లనే భారత సైన్యంలో "మచ్ కే జేల్ మేఁ పడో తో మౌత్ కే ముఁహమే బడో" అనే నానుడి ఏర్పడింది. నేరాన్ని మించిన దండం వుండరాదని మన ప్రాచీనార్థ శాస్త్రజ్ఞుల ఆదేశం. పర పరిపాలకులు, వారి ఆశయం ప్రజాపీడనమే అని సరిపెట్టుకోవచ్చు.

కాని మచ్ కారాగార ఘోరకృత్యాలు సామాన్య జీవితంలోనే నిజాం పాలనలో వుండినవని తెలిసినప్పుడు ఎవరైనా దిగ్భ్రాంతులవుతారు. విభ్రాంతులు అవుతారు. ప్రాక్ స్వాతంత్ర్య కాలంలో శ్రీ అడవి బాపిరాజుగారి సంపాదకత్వాన హైదరాబాద్ నగరం నుంచి వెలువడుతున్న 'మీజాన్' పత్రికలో పనిచేసే భాగ్యం కలిగినప్పుడు ఈలాంటి రాక్షస కృత్యాలు తెలుసుకొనే అవకాశం కలిగింది. బాధిత, తాడిత, సంత్రస్త, సంభ్రాంత ప్రజలు తండోప తండాలుగా మీజాన్ కార్యాలయానికి వచ్చి తమ గోడు చెప్పుకొనేవారు—అమీన్ నా కొడుకును చావ బాదిండు. గిర్దావరు మా పోరిపై జులుం చేసిండు. తాసిల్దారు మా కొంపకు చిచ్చు పెట్టిండు. మాలీపటేల్ మా పోరగాణ్ణి చెట్టుకు కట్టి నోట్లో మూత్రించిండు-అని. ఈ పైశాచిక కృత్యాలు విని సహృదయులయిన బాపిరాజుగారి గుండె మండిపోయేది. యువకులయిన మా రక్తం ఉడుకెత్తేది. ఆ మంటను, ఆ వుడుకును మీజాన్ పత్రికలో ప్రతిబింబించడానికి మా పరిమితులలో మేము ప్రయత్నించాము. అధికారుల దుష్కృత్యాలను ప్రజలకు, ప్రజాప్రతినిధులకు, ప్రజాధికారులకు శాయశక్తులా తెలియజేశాము; కొంతకు కొంత ఫలితాలు చూచి ఆనందించాము.

శ్రీ దాశరథి రంగాచార్యులుగారు ఆనాడు నిజాం పరిపాలనలో ప్రజలుపడ్డ బాధలు, అన్యాయాలు, అక్రమాలు, అధికారుల నిరంకుశత్వం, ప్రజల నిస్సహాయత మొదలయిన వాటిని కన్నులకు కట్టేట్టు చిత్రించారు ఈ నవల "మోదుగు పూలు"లో.

శ్రీ దాశరథి రంగాచార్యులుగారు కవితా ప్రపంచంలో లబ్ధప్రతిష్ఠులయిన శ్రీ దాశరథి కృష్ణమాచార్యుల అనుజులు. బి.ఎ; బి.ఎల్., ఎల్.ఎస్.జి.డి. పట్టభద్రులు. సంస్కృతం, తెలుగు, హిందీ, ఉరుదూ, ఇంగ్లీష్ భాషా సాహిత్యాలను ఆకళించుకొన్నవారు. సాహిత్యంలో అన్ని ప్రక్రియలలోను ఆరితేరిన నవలా రచనా ప్రక్రియలో మొదటి దెబ్బకే పోలీసు చర్యలకు పూర్వం నిజాం ప్రజల కడగండ్లను చిత్రించే 'చిల్లరదేవుళ్ళు' అనే గొప్ప నవల రచించి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ నుంచి ఈ యేడు బహుమతి పొందినవారు. ఈ మోదుగుపూలు వీరి రెండవ నవల. దీని ఇతివృత్తమూ నిజాం పరిపాలనలోని దౌర్జన్యమే.

రెండవ ప్రపంచ యుద్ధం జరుగుతున్న కాలం. నిజాం నవాబులలో ఆఖరి వాడైన మీర్ ఉస్మాన్ అలీఖాన్ పాలనలో ఒక జాగీరు. ప్రజలను పీడించడంలో జాగీర్దారది నవాబులకన్న పైచేయి. ప్రజలకు స్వేచ్ఛ సున్న. కనీసపు హక్కులూ పూజ్యం. స్త్రీలకు రక్షణ హుళక్కి. ఏ స్త్రీపై నయినా అధికారుల కన్ను పడిందో ఆ స్త్రీ మానం ఆనాటితో అంతం అన్నమాట. దానిని వారించడం అట్లా ఉండగా, ప్రశ్నించే సాహసం ఎవరికీలేదు. అధికారులకు ఎదురుతిరిగి బ్రతగ్గలరా? నిప్పుతోనా చెలగాటం? ఎంతటి బాధనైనా, ఎటువంటి శిక్షనైనా నోరుమూసుకొని అనుభవించడం ప్రజల వంతు. పెత్తనం చెలాయించడం, వెట్టిచాకిరి చేయించు కోడం అధికారుల వంతు, హక్కు. అయినదానికి, కానిదానికి కోపగించుకోడం, దండించడం, అధికారుల వాడుక, వేడుక. వారు విధించే శిక్షలు అమానుషమైనవి- కట్టు గొయ్యలకు కట్టి కొట్టడం, ఎండలో నిలబెట్టి వీపుమీద బండలు ఎక్కించడం, మనిషిని గుర్రానికి కట్టి ఈడ్చుకపోవడం, దూలానికి తలక్రిందులుగా వ్రేలాడదీసి చింతబరికెలతో కొట్టడం, గోళ్ళలో సూదులు గుచ్చడం, జనపనార తలకు చుట్టి నిప్పుపుల్లలు పెట్టి తిప్పడం — ఇవీ.

ప్రజలు పత్రికలు చదవడం తప్పు. అందులోనూ ఇంగ్లీషు పత్రికలు చదవడం పెద్ద తప్పు. రఘు హైదరాబాదులో చదువు ముగించుకొని స్వగ్రామానికి తిరిగివస్తూ తనతో ఒక ఇంగ్లీషు పత్రిక తెచ్చుకొంటాడు. ఆ తప్పిదానికి పోలీసు అమీను చేత చెంప పెట్టు తింటాడు. రఘులో తిరుగుబాటు ప్రారంభమవుతుంది. ఉద్యమం మొదలవుతుంది. రఘు ఉద్యమానికి అతని మేనమామ వీరయ్య, వీరయ్య కూతురు జానకి, అదే గ్రామంలోని నాగేశ్ తోడ్పడుతారు. నాగేశ్‌కు హింసలో నమ్మకం. రఘు అహింసావాది. రఘు, జానకి ప్రేమించుకొంటారు. నాగేశ్ సావుకారు వెంకయ్య కూతురు రుక్మిణి ప్రేమించుకొంటారు. అధికారుల దౌర్జన్యాలు, ప్రజల అగచాట్లు చూచి రఘు తన సిద్ధాంతాలు మార్చుకొని హింసామార్గం త్రొక్కుతాడు. తాసిల్దార్ కొడుకు రషీద్ రజాకార్ల నాయకుడు. అతడు రుక్మిణిని మానభంగం చేస్తాడు. రుక్మిణి నూతిలో పడి మరణిస్తుంది. జానకి తనను

మానభంగం చేయవచ్చిన రషీద్‌ను కత్తితో పొడిచి చంపుతుంది. దుండగులు జానకిని కాల్చి చంపుతారు. జనం తాసిల్దారుపై పగ తీర్చుకొంటారు.

ఈ బరువైన కథను మధ్య మధ్యన వివిధ సంస్కృతులకు చెందిన ఉప కథలతో సుందర గంభీరంగా, వ్యంగ్య మర్యాదతో చెప్పుకువచ్చారు శ్రీ రంగా చార్యులుగారు. కోయల ఆచార వ్యవహారాలు, వారి నృత్యాలు, కథలు, మొహర్రం కథ నవలకు నిండుదనాన్ని, సహజత్వాన్ని చేకూర్చాయి.

రంగాచార్యులుగారు అందమయిన భావాలను అందమైన భాషలో మనస్సులో హత్తుకొనిపోయేటట్టు చెప్పగలరు.

"చంపడం చావడం వ్యక్తులకు చెల్లుతుంది. అది జగడాలకు, ద్వేషాలకు, రోషాలకు, కావేషాలకు, పరాకాష్ఠ....హింస పిరికితనానికి చిహ్నం, పలాయనానికి మరొక రూపం" అంటాడు రఘు నాగేశ్‌తో.

"వ్యక్తిమీద నాకు ద్వేషంలేదు. వ్యవస్థ అతణ్ణి దుష్టుణ్ణి చేస్తున్నది....వ్యక్తిగా అతడు పశ్చాత్తాపపడ్డాడు. శాసనం పశ్చాత్తాపం ఎరుగదు. మనిషిగా నేను దాన్ని గుర్తించకుండా ఉండలేను" అంటాడు రఘు మరొక సందర్భంలో.

రంగాచార్యులుగారు కనబరిచిన వక్రోక్తి వైచిత్రికి, సున్నితమైన హాస్య ధోరణికి కొన్ని మచ్చు తునకలు.

ఒంటినిండా గాయాలతో వచ్చిన మస్తానును చూచి తాసిల్దారు "మగవాడివి అనుకున్నాను గాజులు తొడిగించుకొని వచ్చావు. పో ఇక్కణ్ణించి ఇక నీ ముఖం చూపించకు" అంటాడు.

"మస్తాను రక్తం సలసల కాగింది. కాని, గాయాలు మండసాగాయి. తలవంచుకొని వెళ్ళిపోయాడు సలాం సైతం చేయకుండా."

"జాగీర్దారు గుండె దడదడలాడింది. అయినా కళ్ళెర్రజేసి అరిచాడు."

జాగీర్దారు కష్టాలను గురించి వ్రాస్తూ రంగాచార్యులుగారు ఇలా వ్రాస్తారు. "కన్నీటికి ఏం తెలుసు కలవారి బాధలు? పాపం, జాగీర్దారుకూ కథలున్నాయి; గాథలున్నాయి; బాధలున్నాయి. అతడు చెప్పడు. చెప్పరాదు. అదొక రాచరికం. అదొక ఠీవి. అందుకోసం ఖర్చుకు వెనుదీయరాదు....బెంగాల్లో ఒక నవాబుకు చెప్పులు తొడిగించే దాసీది రాలేదు. ఇంగ్లీషువారు కోట ముట్టించారు. కాబట్టి ఆమె పారిపోయింది. చెప్పులు లేక నవాబుగారు ఎలా పారిపోతారు? ఇంగ్లీషు వారికి పట్టు పడ్డారు. అదీ వారి రాజసం. ఆ రాజసమే వాళ్ళను రాళ్ళను చేసింది."

తాసిల్దారును గురించి — "అతనికి చదువురాదు. ఆ విషయం చాలామందికి తెలీదు. జాగ్రత్తగా చదివించుకునిగాని సంతకాలు పెట్టడు. వ్యవహార దక్షుడని అతని పేరు. అందుకు కారణం అతడు గట్టిగా అరవగలడు."

హాస్యానికి పరాకాష్ఠ ఈ మాటలు. సింగడు సింగి అడవిలో చేరువగా ఉన్నప్పుడు పులిరాగా సింగడు పులితో కలియబడి చంపుతాడు. "దొరలమీద తిరగబడ్తావా?" అని అమీను సింగడిని చితకబాత్తాడు. అతణ్ణి గుర్రానికి కట్టి స్వస్థానానికి ఈడ్చుకుపోతాడు.

తొలినవలతోనే నవలా రచయితలలో అగ్రేసరులై రాష్ట్ర సాహిత్య అకాడెమీ బహుమతి పొందిన శ్రీ రంగాచార్యులుగారు ఈ రెండవ నవలతో భారతీయ నవలా సాహిత్యంలోను పెద్ద పీట వేసుకొన్నారు.

"చిల్లరదేవుళ్ళు" పీఠికలో శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు 1947 వ సంవత్సరానికి ముందు తెలంగాణా పరిస్థితులు తెలిసిన వారికి ఈ నవల కేవలం కల్పనాకథకాక యదార్థమని స్పష్టము కాగలదు. ఈ నవల ఇతర భాషలలోకి రాదగినది" అని అన్న మాటలు ఈ "మోదుగుపూలు" నవలకూ వర్తిస్తాయి.

ఇలాటి పెక్కు రచనలతో సాహిత్యాంబర వీధిలో శ్రీ దాశరథి రంగాచార్యులుగారి స్థానం జాజ్వల్యమానం కాగలదని విశ్వసిస్తూ వీరిని అభినందిస్తున్నాను.

విరోధికృత ఆషాఢ ప్రథమదివసే

23 జూన్ 1971<br>మద్రాసు - 5

భాషా సేవకుడు

తిరుమల రామచంద్ర

ప్రియమిత్రులు దాశరథి రంగాచార్యగారికి,

నమస్కారాలు. మిత్రుడు చిరంజీవి అకాల మృతిపట్ల విచలితులై ద్రవించి మీరు రాసిన వ్యాసం చాలామంది పొగడ్తను పొందింది. ఏదో మొక్కుబడిగా కాకుండా, ఆర్ద్రమైన మనస్సునుండి వచ్చిన రచన కావడమే దాని విశేషం.

ఆ మధ్య శ్రీ చంద్ర రాజేశ్వరరావుగారు నాతో మాట్లాడుతున్న సందర్భంలో "రంగాచార్య ఎంత బాగా రాశాడయ్యా నవలలు! గోర్కీలాగ, గోర్కీ రాసినంత బాగా రాశాడు!!" అన్నారు. మీ చిల్లరదేవుళ్ళు, మోదుగుపూలు ఆయన చదివారు. ఈ విషయాన్ని మీకు రాయాలని చాలరోజులుగా అనుకొంటూనే అశ్రద్ధ జరిగింది. మీ "మోదుగుపూలు" నేను నాలుగురోజుల క్రితం చదివి ముగ్ధుణ్ణయాను. చంద్ర రాజేశ్వరరావుగారు ఎందుకంతగా దాన్ని మెచ్చుకున్నదీ అర్థమైంది. మీ నవలలో మీరు చర్చించిన – రాజకీయాల్లో అవలంబించాల్సినది హింసా మార్గమా, అహింసా మార్గమా అన్న (ఈనాడు యువతరాన్ని కుదిపివేస్తున్న సమస్య) తీరు చాలా సబబుగావుంది. సమంజసంగా, Convincingగా కూడా వుంది. ఈ అంశాన్ని మీరు రూపొందించుకోవడంలో మిత్రుడు చిరంజీవి చాలా తోడ్పడి ఉంటారని తలుస్తాను. పోతే, శైలి – జవం, జీవం, వాడి, వేడి కలిగి, అవసరమైనచోట్ల కవితాత్మకంగా, కమనీయంగా, మృదుమధురంగా, మధురస నిష్యందంగా ఉండి అలతి అలతి పదాలతో అనల్పార్థాలను యిముడ్చుకొని, తెలంగాణా జాతీయం, తెలుగు 'నుడి'కారం స్వంతం చేసుకొని, అంగారాన్నీ, సింగారాన్నీ రంగరించుకొని నాగార్జున సాగరం క్రెస్టు గేట్ల నుండి హోరుమంటూ జోరునపడే జలపాతంపై సూర్యరశ్మి పడి ఇంద్రధనుస్సు లేర్పడి సప్తవర్ణాలుగా విశ్లేషణ పొందినట్లుంది.

మా చంద్ర రాజేశ్వరరావుగారు మిమ్మల్ని ఆంధ్ర గోర్కీ అన్నారు. ఇక ఆ స్థాయిని మీ ముందు రచనల్లో నిలుపుకోవలసిన బాధ్యత మీపై పడిందన్న మాట! అందుకు సంసిద్ధులు కండి.

విశాలాంధ్రకు రచనలు పంపుతూ వుండండి.

మీ

నిడమర్తి ఉమారాజేశ్వరరావు

3-11-71

# పత్రికాలోచనాలు

"The name of Crimson flowers, is symbolic of the over-whelming bloods people's revolt in the eastwhile Nijam's Dominions against the indescribable tyranny being perpetera-ded in the name of the Nizam against the forces of demo-cracy. Tales of great heroism are told, with a passion for liberty and truth. The local colouring is genuine.

ACHANTA JANAKIRAM - Indian Express.

"నవల్లోని పాత్రలన్నీ సజీవమైనవి. ఆనాటి సమాజానికి ప్రతీకలు. నవల మొదటిపంక్తి ప్రారంభిస్తే ముగింపుదాకా వదలిపెట్టడానికి మనసొప్పనంత రచనా చాతుర్యం. చదువుతుంటే గోర్కీ రచనలు గుర్తొస్తాయి. చదవడం పూర్తయ్యేక ఆ సంఘటల్ని పాత్రల్ని మరచిపోవడం అసాధ్యం."

విశాలాంధ్ర

"ఉద్యమాల చేవాళ్లు మోదుగుపూలు. పోలీసు చర్యకు పూర్వం తెలంగాణా పరిస్థితులు, ప్రజల బాధలు యధాతధంగా చిత్రించిన నవల. ప్రతి ఒక్కరు చదవాల్సిన నవల."

ఏ.యు. సృజన

శక్తివంతమైన భావాల్ని అందమైన భాషలో పొదిగి, మనసుల్లో హత్తుకునేలా, సహజత్వం లోపించకుండా చెప్పడం రంగాచార్యగారి రచనల్లోగల ప్రత్యేకత. వీరి కలం నుండి వెలువడే ఇంకా ఎన్నో మంచి నవలలు తెలుగు పాఠకులకు విందుచేస్తాయని ఆశిస్తాను."

ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక

మోదుగుపూలు గిరిజనులకు సింబల్. చెట్టునిండా మోదుగులు విరియబూసి నప్పుడు చూస్తే ఒక్క ఆకుకూడా ఉండదు. చెట్టునిండా కీలల్లాగా, జ్వాలల్లాగా కనబడుతుంది. అందుకే అవి పూలు కావు. కీలలు. మంటలు. జ్వాలలు. "మోదుగు పూలు"ది. "ఘాటెక్కిన గంధక ధూమం" ఆ కీలలూ, ధూమమూ జగమంతా వ్యాపించాలి వ్యాపిస్తోంది.

సృజన

# తొలి పలుకు

## పలాశ సుందరి

మన స్వాతంత్ర్య సంగ్రామం ఆంగ్లేయ ప్రభుత్వాన్ని భారతదేశం నుంచి పంపివేయడంకోసం మాత్రం పరిమితం అయింది కాదు. మహాత్ముడు స్వదేశీ నాగరికతను, సంస్కృతిని పోషించుకోవాలన్నారు. విదేశీయాన్ని సాధ్యమైనంతవరకు దూరం ఉంచాలన్నారు. యాంత్రిక నాగరికత విషయంలో మహాత్మునితో అంతగా ఏకీభవించని భారత నవ నిర్మాత జవహర్‌లాల్‌నెహూ్రి టెక్నాలజీ విషయంలో స్వావలంబన అవసరం అన్నారు. తొలి భారత ప్రధానిగా ఆచరించి చూశారు.

తరువాత ఏమైందీ మనం చూస్తూనే ఉన్నాం. 'స్వదేశీ' అనే పదమే వినిపించకుండా పోయింది. చెట్టూచేమా, పాడి, విద్య, భాష సర్వం విదేశీయం అయింది. మనది ఇంకా ఏమన్నా మిగిలిందేమోనని గాలించాల్సి వస్తున్నది. స్వావలంబనం, విదేశీ వ్యాపారుల పాదాలకింద నలిగి నాశనం అయిపోయింది.

ఇంతా ఎందుకు చెప్పాల్సి వచ్చిందంటే మనదేశపు చెట్లపేర్లు సహితం మనకు తెలియకుండా పోయింది. దిగుమతి వృక్షాల్నే పెంచుతున్నాం. మన చెట్లను రూపుమాపుతున్నాం. పలాశం-మోదుగు- భారతీయ వృక్షం. పలాశ ప్రాశస్త్యం వేదాల్లో విస్తృతంగా ఉంది. మోదుగు పుల్లలు యజ్ఞ యాగాదుల్లో వాడాలి. మోదుగు ఆకుతో ఆజ్యం ఆహుతి అర్పించాలి. సంస్కృత, ఆంధ్ర శాసనాల్లో కూడా పలాశకుసుమం-మోదుగు పూల - అనంత రమ్య వర్ణనలున్నాయి. మోదుగులు వసంతంలో పూస్తాయి. వసంతం మార్చి ఏప్రిల్ నెలల్లో వస్తుందని చెప్పాల్సిన విదేశీ నాగరికత మిరుమిట్లలో ఉన్నాం మనం. మోదుగు చెట్లన్నీ పూసినప్పుడు అడవి మండుతున్నట్లుంటుంది. అందుకే ఆంగ్లంలో దీనిని FLAME OF THE FOREST అంటారు. వాళ్ళు భారత భాషనుంచే అనువదించుకున్నారు! మనకు మూలంకాక అనువాదం అర్థం అవుతున్నది. విచిత్రం ఏమంటే గోదావరి – గోడావరి, అనంతపురం, అనంటపురం, హిందు- హిండూ, అయినాయి!

మా చిన్నతనంలో మేము పచ్చిమోదుగాకుల విస్తళ్ళ భోజనం చేసేవాళ్ళం. ఆకుపచ్చని విస్తరి—తెల్లటి అన్నం—పసుపు పచ్చని పప్పు—ఎర్రని ఆవకాయ అది బహువర్ణ చిత్రం! ఘుమ ఘుమలాడే నూకల నేయి—పున్నమి చంద్రుని లాంటి పెరుగు! అది తృప్తినిచ్చే భోజనం!! మోదుగాకులో భోజనం ఆరోగ్యకరం అని శాస్త్రం! అది అమెరికావాడు చెపితేగాని మనకు అర్థంకాని దశలో ఉన్నాం. తల్లిపాలు మంచివని-వేప, తులసి మంచిదని వాళ్లు చెపితేనే కదా మనకు అర్థం అయింది?

చిన్నతనంలో మోళీ ఆడేవాళ్ళం. అడవినుంచి మోదుగుపువ్వు తెచ్చి కుండలో నీళ్ళలో వేసి మరగపెట్టేవాళ్ళం. అది ఎర్రని వసంతం అవుతుంది. దాంతో వెర్రిగా ఆడేవాళ్ళం. అది చర్మానికి హాని చేయదు. మేలు చేస్తుంది. పండగతెల్లారి మేం పిల్లలమంతా మోదుగు పూలలా ఉండేవాళ్ళం!

ఇంతా ఎందుకు చెప్పాల్సివచ్చిందంటే 1970లో నేను "మోదుగుపూలు" నవల రాసినపుడు మోదుగుపూలు ఉన్నాయి. అందరికీ తెలిసింది. పావు శతాబ్దం తరువాత మోదుగు అర్థం కాకుండా పోయింది. మోదుగు మన నాగరికత, సంస్కృతులకు చిహ్నం. మోదుగుపూలు మన సాహిత్యానికి ప్రతీక!!

మనను మనం మరచిపోతున్నామనే భయం పట్టుకుంది నన్ను!!!

మోదుగుపూలు నవల కొన్ని ప్రత్యేక - విశేష - పరిస్థితుల్లో రాయాల్సి వచ్చింది.

భాయ్‌జాన్ నార్ల చిరంజీవి హైదరాబాదు వచ్చినప్పటినుంచి 16-10-1971న గుంటూరులో అస్తమించే వరకు మేమిద్దరం హమ్దమ్‌గానే జీవించాం. హమ్దమ్ అంటే ఒకే ఊపిరి పీల్చేవారం. మేమిద్దరం భాయీ, భాయిగా ఉండగా భాబీజాన్ నాగరత్నమ్మ, వందనలయదు వచ్చిరేని' పంజగుట్ట భాయ్‌జాన్ ఇంట్లో జరిగిన లెక్కకు మించిన పార్టీలు ఓహో! అవి అమృతమయములు!!

"చిల్లరదేవుళ్ళు" నామకరణం చేసిందీ ప్రచురణకు పూర్తిగా సహకరించింది భాయ్‌జాన్ నార్ల చిరంజీవియే. చిల్లరదేవుళ్ళు ప్రగతి, వారపత్రికలో సీరియల్‌గా వస్తున్నపుడు నేను 'మాయ జలతారు'-ఎక్కువభాగం భాయ్‌జాన్ ఇంట్లోనే రచించి పూర్తిచేశాను. ఆర్థికంగా నాకు అంత బాగున్నకాలం కాదది. అది గమనించిన భాయ్ జాన్ 'మాయజలతారు' ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక నవలల పోటీకి పంపారు.

'ప్రగతి' సంపాదకులు, పూజ్యులు, పెద్దలు మద్దుకూరి చంద్రశేఖరరావుగారు "మాయజలతారు" తమకు పంపుతే సీరియల్ వేస్తామని జాబురాశారు. డబ్బుకోసం మద్దుకూరి వారిని నిరుత్సాహపరచడం నాకు తల కొట్టేసినంతపని అయింది. "మాయజలతారు" కన్న ముందు "మోదుగుపూలు" ప్రగతిలో సీరియల్ అయ్యేట్లు రచన ప్రారంభించి ముగించాలని సంకల్పించాను.

ప్రణాళిక అంతకు ముందే ఉంది. ఆచరణకు ఉపక్రమించాను. గిరిజనుల జీవితాలను అధ్యయనం చేయడానికి గార్ల జాగీరులోని అడవులవెంట నిర్విరామంగా తిరిగాను. అప్పుడు భాయ్‌జాన్ నాకు రాసిన లేఖాంశం :-

"రాయి. మనస్సు ఉష్ణజల కాసారం కానీయ్, వ్యధార్త జీవుల ఆక్రందనల కొక రూపం రానీయ్. మూగ జీవుల, మూగ కళ్ళకి, మూగ బాసకి వెలుతురూ ధ్వనినీ కల్పించు. అదేలక్ష్యం. విడిచిన బాణాలు వెనక్కు రానీకు. గుచ్చుకోవలసిన చోట గుచ్చుకోనీ. చండ ప్రచండ వాతూల హతికి-పండుటాకులూ, ఎండుటాకులూ రాలనీ, పోనీ. ప్రతి అధ్యాయం, ప్రతి పుట మానవేతిహాసాన్ని ప్రతిబింబించనీ.

నెత్తురోడ్చే కళ్ళలో, రేపటిపై ఆశ చిగురించనీ! రేపటి కలలు ఎదగనీ, పెరగనీ! ఏ ఇనుప చేతులు వాటిని చిదుమ లేవని రుజువుచేయ్. ప్రణయగాథా వల్లరి పఠిస్తున్న ఈ తరానికి ప్రళయ ఝుంఝానిలం తాకనీ."

అడవుల్లోని అమాయక కోయల - ఎండ, వెన్నెల కార్చిచ్చువంటి ప్రాకృత జీవితాలను అధ్యయనంచేసి, జన్మ జన్మాల బూజు నిజాం, అతని తాబేదార్లకు వ్యతిరేకంగా మేం జరిపిన పోరాటాలను నెమరువేసుకొని - సాధ్యమైనంత వరకు సశాస్త్రీయంగా ఉద్యమాలను ఆకళించుకుని, "మోదుగుపూలు" రచన 7-2-1970 న ప్రారంభించి 18-5-1970న ముగించాను. రాసింది తిరిగిచూడలేదు. శుద్ధప్రతి రాయలేదు. అది చదివి ఖాయ్‌జాన్ గంతులువేశాడు. 'ప్రగతి' వారపత్రికకు పంపాం. "మోదుగుపూలు" 'ప్రగతి'లో 13-11-70 నుంచి 5-3-1971 వరకు సీరియల్‌గా వచ్చింది. 'మాయ జలతారు' 'ఆంధ్రప్రభ'లో 6-1-1971 నుంచి ప్రారంభం అయింది.

మేము 1944 నుంచి 1951 వరకూ గార్ల జాగీరులో ఉన్నాం. మా అన్నయ్య డాక్టర్ దాశరథి కృష్ణమాచార్య, నేను 'ఆంధ్రమహాసభ' ఆధ్వర్యంలో నిజాం వ్యతిరేక పోరాటం జరిపాం. సుమారుగా ఆ పోరాట చిత్రణే "మోదుగుపూలు". ఇది గార్ల పృష్ఠ భూమిగా రచించిన నవల.

"మోదుగుపూలు"లో వచ్చిన పాత్రలు కేవలం కల్పితాలు కావు. ఇంకా జీవించి ఉన్నవాళ్ళు తమను పోల్చుకోగలరు. అయితే చాలమంది కాలగర్భంలో కలిసిపోయారు-ఒకరిద్దరు తప్ప!

"మోదుగుపూలు" లోని ప్రతి సన్నివేశం, సంఘటనా 'గార్ల'లో జరిగిందని చెప్పలేను. ఇది జాగీర్దారీ వ్యతిరేక పోరాటం కాబట్టి ఎక్కడో ఒకచోట జరిగి ఉంటుంది.

'మోదుగుపూలు' అని నామకరణం చేయడానికి కారణాలు :-

1) మోదుగులు పూసినపుడు ఎర్రజండాలవుతాయి!

2) విప్లవం ఎరుపు - మోదుగుపూలు ఎరుపు.

3) మోదుగులు గ్రామాలలో ఉండవు. అడవిలో ఉంటాయి. విప్లవాలు అడవులలో వికసిస్తాయి.

4) మోదుగు పూవు రంగు బట్ట చిరిగినా వదలదు - ఒకసారి విప్లవ పథం పట్టిన వాడు చచ్చినా దాన్ని వదల్లేడు.

5) మోదుగు పూలు విప్లవమంత అందంగా ఉంటాయి.

నాకూ మా అన్నయ్యకూ మోదుగుపూలంటే ప్రాణం.

"పూచిన మోదుగుంబూవుల
పుక్కిటినుండి వసంతరాజు ర
క్తా చమనంబు సేయు సమయంబిది"

"ధుమధుమలాడసాగినవి
తూరుపు దారుల మోదుగుంబూవుల్"
"నిప్పు పువ్వుల మోదుగు కొప్పులోన
అడవి జడ యెల్ల ముడివడి అణగియుండె"

"అగ్నిజ్వాలిక పోలిక
నగ్నముగా నాట్యమాడు నవవాసంతో
ద్విగ్న పలాశప్రసవా
లగ్నజపాలక్త రక్తిరమ కనుపించెన్"

ఇది దాశరథి కవిత.

"మోదుగుపూలు"ను ఆంధ్రులు అభిమానించారు. చంద్ర రాజేశ్వరరావుగారు "రంగాచార్య ఎంత బాగా రాశాడయ్యా నవలలు! గోర్కీలాగ, గోర్కీ రాసినంత బాగా రాశాడు" అన్న ఉత్తరం పుస్తకంలో చేరుస్తున్నాను.

పత్రికలు మంచి సమీక్షలు చేశాయి.

తెలుగు విశ్వవిద్యాలయం నాడు 'మోదుగుపూలు' పరిశోధనకు M. Phil ప్రదానం చేశారు.

విశాలాంధ్ర ప్రచురణాలయం వారు 1971, 1976, 1985లలో 'మోదుగు పూలు' ప్రచురించారు. ప్రస్తుతం నా రచనలను సంపుటాలుగా ప్రచురిస్తున్నారు. బతికి ఉన్న రచయిత రచనలు సంపుటాలుగా రావడం ఇదే ప్రథమం అంటున్నారు ప్రచురణకర్తలు. ఇందులోని భాగంగానే "జనపదం" మూడో సంపుటంగా వెలువరించారు.

విశాలాంధ్ర ప్రచురణాలయానికి నేను సర్వదా కృతజ్ఞుణ్ణి.

పూజ్యులు, విద్వాంసులు, వయోవృద్ధులు తిరుమల రామచంద్రగారు 'మోదుగుపూలు' కు 'సువాసన' అనే తొలిపలుకు సమకూర్చారు. వారికి కృతజ్ఞుణ్ణి.

1994లో నా జన్మదినము, నా ధర్మపత్ని శ్రీమతి కమల జన్మదినోత్సవ సందర్భంగా తిరుమల రామచంద్ర, అనంత లక్ష్మి దంపతులకు సన్మానం చేశాం. "మీరు చేసిన సన్మానం మరి పది సంవత్సరాలు నా ఆయుస్సును పెంచింది" అని రాశారు రామచంద్రగారు.

మోదుగుపూలు నాలుగవ ముద్రణ మీ చేతిలో ఉంది. బాగోగులు నిర్ణయించాల్సింది మీరు.

సికిందరాబాదు. సర్వేభవన్తు సుఖినః మీ

29-5-97 దాశరథి రంగాచార్య

# మొదుగుపూలు

## 1

ఆసఫ్జాహీ వంశానికి ఆదిపురుషుడు ఆసఫ్జాహ్ బహద్దూర్. అతడు గొప్ప సేనాని. రాజనీతిజ్ఞుడు, అందువల్లనే ఔరంగజేబుకు అతి సన్నిహితుడైనాడు. అతడంటే చక్రవర్తికి ఎంతో నమ్మకం. ఆ నమ్మకంతోనే 1713లో ఆసఫ్జాహ్‌ను దక్కనుకు సుబేదారుగా నియమించాడు. నిజాముల్ముల్క్ అనే బిరుదం ఇచ్చాడు. "నిజామ్" అంటే పరిపాలకుడు అని అర్థం. ఆ వంశంవారు నేటికి ఆ పేరుతోనే పిలువబడుతున్నారు.

ఔరంగజేబ్ అనంతరం మొగల్ సామ్రాజ్యం క్షీణదశకు వచ్చింది. అదను కనిపెట్టి సుబేదార్ ఆసఫ్జాహ్ స్వాతంత్ర్యం ప్రకటించాడు. కూలిపోతున్న మొగలు దర్బారు దాన్ని సహించలేకపోయింది. అయితే ఎదిరించే సాహసమూ లేకపోయింది. అప్పటికి 'ఖాందేశ్'ను ముబారక్ ఖాన్ అనే సుబేదార్ పాలిస్తున్నాడు. మొగలు దర్బారు అతనిని ప్రోత్సహించింది. ఆసఫ్జాహ్ మీద దండెత్త వలసిందని పురికొల్పింది. ముబారక్ ఖాన్ దక్కన్ మీద దండెత్తాడు. బిరార్‌లోని 'షకర్ ఖేల్డా' అనే ప్రాంతంలో 1724 లోయుద్ధం జరిగింది. యుద్ధంలో ముబారక్ ఖాన్ ఓడిపోయాడు. హతుడైనాడు.

షకర్ ఖేల్డా విజయం ఆసఫ్జాహ్‌ను సర్వతంత్ర స్వతంత్రుణ్ణి, సార్వభౌముణ్ణి చేసింది. బిరార్‌ను తన రాజ్యంలో కలుపుకున్నాడు ఆసఫ్జాహ్. హైదరాబాదు రాజధానిగా విస్తీర్ణమైన సామ్రాజ్యాన్ని పాలించడం ప్రారంభించాడు. ఆసఫ్జాహ్ వంశీయులు ఏడు తరాలవారు అవిచ్ఛిన్నంగా నైజాం రాజ్యాన్ని పాలించారు.

ఆ వంశంలో చివరివాడు మీర్ ఉస్మానలీఖాన్. అతనికున్న బిరుదులు బోలెడు. హిజ్ ఎగ్జాల్టెడ్ హైనెస్, లెఫ్టినెంట్ జనరల్, సిపహ్‌సాలర్, ఆసఫ్జాహ్ ముజప్ఫరుల్ముల్క్ వాల్ ముమాలిక్, నిజాముల్ముల్క్ నిజముద్దౌలా, నవాబ్ మీర్ ఉస్మానలీ ఖాన్ బహద్దుర్, ఫతేహ్‌జంగ్, జి. సి, ఎస్. ఐ, జి. బి. ఇ. సుల్తానుల్ ఉలూమ్. 1911 నుంచి 1948 వరకు నిరంకుశంగా రాజ్యం చేశాడు. అతడు

పాలించినంత కాలమూ ప్రజలకు కనీసం సమావేశాలు జరుపుకొనే స్వేచ్ఛకూడా లేదు. కనీసపు హక్కులులేని కరకు తురక రాజ్యం అది.

నైజాం రాజ్యపు విస్తీర్ణం 82,000 చదరపు మైళ్ళు-ఇంగ్లండు, స్కాట్లెండ్ కలిపిన వైశాల్యాన్ని మించింది. నామమాత్రపు నైజాం ప్రభుత్వం కూడా రాజ్యమంతటా ఉండేది కాదు. ఈ రాజ్యంలో ప్రభువు వారి స్వంత వ్యయానికి ఉండిన సర్ఫెఖాస్ వైశాల్యం 8,100 చదరపు మైళ్ళు. నిజాం బంధువులకు చెందిన సాయెగాల విస్తీర్ణం 3262 చదరపు మైళ్ళు. రాష్ట్రవ్యాపితంగా ఉండిన 1167 జాగీర్ల వైశాల్యం 11000 చదరపు మైళ్ళు. ఈ 12362 చదరపు మైళ్ళలో ప్రభుత్వం మృగ్యం. నైజాం నవాబును తలదన్నినవారు జాగీర్దార్లు.

జాగీర్లలోని ప్రజలకు నిజాం ప్రభుత్వం క్రింద ఉండిన "ఖాల్సా" ప్రాంతపు ప్రజలకుండిన నామమాత్రపు హక్కులుకూడా లేవు. కనీసం సెటిల్మెంటు ఎరుగరు ఆ ప్రజలు. పన్నులు మాత్రం 209 రకాలకు పైబడి చెల్లించాలి. జాగీర్దారు ఇంట్లో బిడ్డ పుట్టినప్పుడు, చచ్చినపుడు, పెండ్లి అయినపుడు, జాగీర్దారు కారు కొన్నప్పుడు, యాత్ర చేసినపుడు ప్రజలు పన్నులు చెల్లించుకోవాలి.

అందరు జాగీర్దార్లకు పోలీసు న్యాయ విచారణాధికారాలు ఉండేవికావు. ఆది ఉన్న జాగీర్దారు స్వతంత్ర ప్రభువు. అతనికి బాధ్యతలు లేవు. ఉండేది హైద్రాబాదులో. గడిపేది జల్సా జీవితం. అతడు చేయవలసిందల్లా నిజాం నవాబు యిచ్చే ప్రతి షాంపెన్ పెగ్గుకు లక్ష చెల్లించడం.

అలాంటి ఒక జాగీర్దారు జాగీరులో ఒక రైలు స్టేషను......

రెండో ప్రపంచ యుద్ధంవల్ల రైళ్ళు ఆలస్యంగా రావడం మామూలు అయిపోయింది. పని ఉన్నా లేకున్నా బండి సమయానికి స్టేషనుకు రావడం చాలా మందికి అలవాటు. అలా వచ్చేవాళ్ళల్లో అనేక రకాల జనం ఉంటారు. ఒక్కొక్కరు తమరకపు జనంతోకూడి ప్లాట్‌ఫారంమీద కబుర్లు చెప్పుకుంటూ కూర్చుంటారు.

బండి లేటు కావడంతో ప్లాట్‌ఫారం మీద జనం ఎక్కువగా ఉన్నారు. బండి జెర్రిపోతులా వచ్చి ప్లాట్‌ఫారంమీద ఆగింది. జనంలో అడావుడి ఎక్కువైంది. ఎక్కేవారు తక్కువే అయినా బండిని పరిశీలించడానికి వచ్చిన జనం ఇటు చివర నుండి అటు చివరిదాకా సర్వే చేస్తున్నారు.

ఒక వ్యక్తి బండి దిగాడు. అతడు పొడవరి, బలిష్టుడు. కళ్ళు చిన్నవి. ముక్కు కాస్త పెద్దది. వెంట్రుకలు దగ్గరికి కత్తిరించి ఉన్నాయి. ధోవతి దరించి లాల్చి వేసుకున్నాడు. అందరి ధ్యానమూ అతనిమీద కేంద్రీకృతం అయింది. అతని అందాన్ని చూచిగాని అతని దుస్తులు చూచిగాని జనం అతన్ని వింతగా చూడ్డంలేదు. అతని చేతిలో పేపరుండడం - అదీ ఇంగ్లీషు పేపరు కావడం వారందరి ఆశ్చర్యానికి కారణం. జనంలో గుసగుసలు బయలుదేరాయి. అసలు అక్కడ దిగే వాడు కాదని కొందరు, బండి కదిలితే ఎక్కి పోతాడని కొందరు, అయినా పేపరు

చదువుకునేవాడు బండ్లో చదువుకోవచ్చునుగా అని కొందరూ అనుకున్నారు. అతడు ఊళ్ళోకి వస్తే బాగుండునని కొందరు యువకులు ఉత్సాహపడగా, రైలు కదిలితే ఎక్కి వెళ్ళిపోతే పీడా విరగడ అవుతుందనుకున్నారు కొందరు నడివయసు వారు.

మొత్తంమీద అంతా రైలు కదలడాన్ని చూడాలని ఆతురత పడసాగారు. కాని సుఁయ్‌మని ఆవిరి వదులుతూ ఇంజను కదలకుండా నిలుచుంది. డ్రైవరూ ఆయిల్‌మన్ ఇంజన్ నుంచి దిగి సిగరెట్లు కాలుస్తూ నుంచున్నారు. కోల్‌మన్ మండే అగ్గిలోకి బొగ్గు చిమ్ముతున్నాడు.

బండి కదిలేట్టులేదు, ఏదో క్రాసింగ్ ఉన్నట్టుంది.

జనంలో ఆ దిగిన వ్యక్తిని గురించిన ఉత్సుకత ఎక్కువ అవుతూంది. కాని ఎవరికీ అతని దగ్గరికి వెళ్ళి అడిగే ధైర్యం చాలడంలేదు. మొత్తంమీద అందరూ నిర్ణయించుకొన్న దేమంటే బండి కదిలితే ఎక్కి పోతాడని. అందువల్ల ఉత్సాహవంతులకు నిరుత్సాహమూ, నిరుత్సాహవంతులకు ఉత్సాహమూ కలిగాయి.

ఈలోగా ఒక మిలటరీ స్పెషల్ రానే వచ్చింది. దూసుకొని పోనూ పోయింది. ఆగలేదు. స్టేషన్‌లో ఆగదు. అది యుద్ధానికి వెళుతూంది. దిగిన డ్రైవరు సిగరెట్టు పారేసి ఇంజన్‌లోకి ఎక్కాడు. బండి విజిల్ ఇచ్చింది. సాగి పోయింది. జనం గేటువైపు సాగారు. అతడు - ఆ పేపరు మనిషి - సాగాడు. గేటు దగ్గర గుంపుగా కూడిన జనం తప్పుకున్నారు. అతనికి దారి ఇచ్చారు. స్టేషను మాష్టారు టిక్కెట్టు అడిగాడు. అతడు ఇచ్చాడు. ఇద్దరూ ఇంగ్లీషులో మాట్లాడు కున్నారు.

"పేపరు ఊళ్ళోకి తీసికెళ్తారా? ప్రమాదం నెత్తి నెందుకు తెచ్చుకుంటారు? ఇక్కడ పడేసి వెళ్ళండి."

"ఏం ఈ పత్రిక అనుమతింపబడిందే. దీనిమీద నిషేధంలేదే?"

"మీ మేలుకోరి చెబుతున్నాను. ఇది "ఖాల్సా" కాదు. జాగీరు. ఇక్కడ మీ ఖానూన్లు పనికిరావు."

"థాంక్స్. ఫరవాలేదులెండి" అని రెండడుగులు వేసినవాణ్ణి మళ్ళీ పిలిచాడు మాస్టరు.

"మిస్టర్! మీరు కొత్తవారివలె కనిపిస్తున్నారు. పేపరు పడేసి వెళ్ళండి. కావాలంటే ఖరీదు ఇస్తాను. ఇది జాగీరు. జాగీరు పరిస్థితులు మీకు తెలియ నట్లున్నాయి."

జవాబుగా చిరునవ్వు నవ్వాడు. సాగిపోయా డతను.

"కొరివితో తలగోక్కుంటున్నాడు" అని స్టేషను మాస్టారు జనంవైపు చూచాడు.

"అంగ్రేజీ బాగా మాట్లాడిండా?" అడిగా డొక పొట్టి మనిషి.

"బాగానే మాట్లాడిండు. కాని తాసిల్దారు తడాఖా తెల్వనట్లున్నది" అన్నాడు మాస్టరు.

అడిగినవాడు మారు మాట్లాడలేదు. పేపరు మనిషిని అనుసరించాడు.

కొంతదూరం వెళ్ళింతర్వాత కరోడ్గిరి జవాను ఆపాడు. పేపరు మనిషిని.

నైజాం రాజ్యంలోకి వచ్చే సరుకులమీద కస్టమ్స్ విధించే శాఖ కరోడ్గిరి. కరోడ్గిరీ నాకాలు — కస్టమ్స్ చౌకీలు — ప్రతిస్టేషను దగ్గర ఉండేవి. ప్రయాణీకులను పీడించి లంచాలు వసూలుచేయడానికి ఏర్పడిన శాఖ అది. దాని తాలూకు ఇండ్లు ఇప్పటికీ ప్రతిస్టేషను దగ్గరా కనిపిస్తాయి.

"వాహ్ మారాజ్! ఎట్లనో పోతున్నవు? ఎర్కలే కరోడ్గిరి ఉన్నదని. నిలువు" అని అడ్డం నుంచున్నాడు జవాను.

"ఏమున్నది నా దగ్గర?" అడిగాడు అతడు.

"అగ్గో ఏమున్న దంటవు? సందు కుండె అక్బార్ ఉండె. కట్ట కుంటనే పోతవ్ కరోడ్గిరి?"

"హైదరాబాదు నుంచి కదా వస్తున్నది. కరోడ్గిరేంది. ఏమన్న— అంగ్రేజ్ ఇలాకా [1] నుంచి వస్తున్ననా?"

"హైద్రాబాద్ గీద్రాబాద్ జాన్తానై. క్యా మాలూమ్? బొంబాయి కెల్లి వస్తున్నవేమో. సందుకు తెరువు. అక్బార్‌కు కట్టొద్దు కరోడ్గిరి?"

సంభాషణ వింటూ నుంచొన్న జనాన్ని చూచి పెట్టె చేతిలోనుంచి లాక్కొని ఆఫీసులోకి సాగిపోయాడు జవాను. అతడు అనుసరించాడు. జనం వెళ్ళిపోయారు.

వచ్చినవానిని చూచి "బైటో మారాజ్! నీకు ఖానూన్ చెప్పేటంతోణ్ణి కాను. ఇది జాగీర్ మారాజ్ జాగీర్! అక్బార్ ఈడ పడెయ్యి. సందుక పట్కపో. హైదరాబాద్ కెల్లిరా బొంబాయి కెల్లిరా ఎతరాజ్[2] లేదు. ఈడ తాసిల్దారున్నడు. సూశినవా? వాడు సైతాన్ మారాజ్ సైతాన్. అక్బార్ పట్కపోతివా బత్కనీయడు. ఇగ ఖైరియత్[3] ఉండదనుకో. అవునుగని మారాజ్? పట్నం కెల్లి వస్తున్నవుగదా మా జీతాలు సంగతేమన్న తెల్సినాది? ఏమన్న పెంచుత దంటనా హౌజూర్[4]? లడాయి ఎన్నడై పోతదోగని సౌదలన్నీ పిరమైతాండె[5], జీతాలేము పెంచడాయె హుజూర్."

"ఈ పత్రికమీద నిషేధంలేదు. అందరు చదివేదే. జాగీరు అయితే ఎక్కువా? నైజాంలో భాగంకాదా! పత్రిక తీసుకునే పోతే ఏమైతదో చూస్త"

"నా పానం మీది కెందుకు తెస్తవు మారాజ్! అక్బార్ అంటావా సందు కిచ్చెడ్డిలేదు. ఇగనీమర్జీ ఏమి చేస్కుంటవో చేసుకో."

---

1. బ్రిటిష్ ప్రాంతం 2. అభ్యంతరం 3. క్షేమంకాదు 4. నైజాం నవాబు 5. సరుకులు ప్రియమైనవి.

"సందుక ఉంచుకుంటె రశీదియ్యి. పేపరుమాత్రం తీస్కపోయేదే."

"రశీద్ గిశీద్ ఏమ్ లగాయించినవ్ ? ఎన్నడన్న యిచ్చినమా ? సందుక ఇడిచిపో మామూలేసి పంపుతం. శాన ఖానూన్లు మాట్లాడ్తన్నవుగని. సందు కియ్యనంటే ఏమ్ చేస్కుంటవ్ ? అ( ఆ మాటకొస్తె అక్బార్ కూడా ఆడనే యేయించి పంపుత ఏమన్న సర్కా రనుకొన్నావా ? దిల్లికా ?"

"అచ్చా ఉంచుకో. సందుక నువ్వే పంపుతవు. ఎట్లు పంపవో చూస్త. సర్కారంటె సతాయించెటందుకు ఉన్నదనుకున్నవా ?" అని పేపరందుకొని సాగిపోతుంటే పిలిచాడు జవాను.

"ఏమో శాన గరమై తున్నవ్ మారాజ్ ! గరీబోల్లం మే మెట్ల బతకాలె. చా నీల్లకు పైసలు పారేసి సందుక తీస్కపో, మే మేం చేస్కుంటం నీ సందుకు" అని చేయి చాచాడు.

అతడు పావలా జవాను చేతిలో వేశాడు. జవాను వంగి సలామ్‌చేసి "మీ ఖైరియత్ కోసం చెప్పుతున్న. అక్బారీడ పడేసి పోరి" అని మళ్ళీ సలాం చేశాడు జవాను.

అతడు సూట్‌కేసు, పేపరు తీసుకొని కత్తుల బోనునుంచి బయట పడ్డాడు. సాగిపోతున్నాడు. వీధుల్లో జనం అతణ్ణి వింతగా చూడసాగారు. చౌరస్తాల పక్కలకు పడివున్న విరిగిన దేవాలయాల స్తంభాలమీద కూర్చొని ఈ విషయమే మాట్లాడు కుంటున్న తలగుడ్డల పెద్దమనుషులు తమకు తెలియకుండానే లేచి నుంచున్నారు. వింతగా అతనివైపు చూచారు. పద్మవ్యూహం నుంచి గెల్చి బయటపడ్డే అభిమన్యుణ్ణి చూసినట్లు చూచారు.

అతడు సాగిపోతున్నాడు. రాతి స్తంభం కనిపించింది. అది తాడిచెట్టు కంటే ఎత్తైంది. దానిమీద చిన్న గుడిలాంటిది ఉంది. అందులో గరుత్మంతుని విగ్రహం వుంది. ఆ గుడికి వేలాడుతూ గంటలున్నాయి. గాలికి ఊగుతూ సన్నగా మ్రోగు తున్నాయి. అది ఒక కాలంలో మహావైభవం చూచిన గోపాలస్వామి ఆలయపు ధ్వజస్తంభం. ఆలయం ఉండినచోట కోనేరు తప్ప ఏదీ మిగులలేదు. ఆ ఊరి నిండా ఆ దేవాలయం బాపతు స్తంభాలూ విగ్రహాలే పడివుంటాయి. ఆ దేవాలయాన్ని ఔరంగజేబు దండయాత్ర సమయంలో కూల్చాడో, ముసల్మానుల జాగీరు అయిం తరువాత కూల్చారో చెప్పడానికి చారిత్రక ఆధారాలు లేవు.

ఆ గ్రామం ప్రతాపరుద్రుని కాలంలో, వైభవోపేతమైన మహానగరం అని చెపుతారు పెద్దలు. అందుకు నిదర్శనముగా వేయి స్తంభాల గుడికి నమూనాలు అనదగిన అనేక చిన్న చిన్న శిథిల దేవాలయాలు ఆ ఊరి చుట్టుపట్లల్లో ఉన్నాయి. ప్రతాపరుద్రునిచే నిర్మించబడినవి అనబడుతున్న సముద్రాల వంటి మహా తటాకాలు కూడా ఉన్నాయి.

ఆ గ్రామానికి మరొక ఐతిహ్యం కూడా వుంది. పాండవులు వనవాస కాలంలో కొంతకాలం అక్కడ ఉండిరట! ఇప్పటికీ పాండవుల విగ్రహాలు ద్రౌపది సహితంగా ఉన్నా యక్కడ! వానలు పడనప్పుడు గ్రామస్థులు ఆ విగ్రహాలవద్ద పెద్ద ఉత్సవం జరుపుతారు. ఘటాభిషేకం చేస్తారు. అలా చేస్తే వాన పడుతుందని గ్రామస్థుల విశ్వాసం.

ప్రస్తుతం ఆ గ్రామం జాగీరుకు రాజధాని నగరంలాంటిది. అక్కణ్ణుంచే జాగీరు వ్యవహారాలన్నీ నడుస్తుంటాయి. రోడ్ల పేరుతో చలామణీ అవుతూన్న దుమ్ములోంచి సాగిపోతున్నాడతను.

అతడు ఊరిలోంచి సాగిపోతున్నాడు. పెద్ద బజారునుంచి వెళుతున్నాడు. దుకాణాల్లో జనం విరివిగా ఉన్నారు. అమ్మేవారు అమ్మకం మాని అతణ్ణి చూస్తు న్నారు. కొనేవారు కొనుగోలు మాని చూస్తున్నారు. హోటళ్ళలో టీ తాగుతున్న వారు వదిలివచ్చి అరుగులమీద నుంచుని చూస్తున్నారు.

అతడు సాగిపోతున్నాడు. వారంతా తననే చూస్తున్నారని కూడా ఎరగడతను. ఉత్తరం సైతం రాయకుండా వస్తున్నాడు తాను. తాను ఇంట్లో వాళ్ళందరికీ ఆశ్చ ర్యాన్ని కలిగిస్తాడు. పేపరునుగురించి ఎందుకు అంత గ్రంథం నడిచింది....ఇలాం టివే ఇంకేవేవో ఆలోచనలు మెదడులో మసలుతుండగా సాగిపోతున్నాడు.

ఒక బుర్ర మీసాల వ్యక్తి కృతంగా, పెద్దగా దగ్గాడు. అతడు కట్టుకొన్నది దోవతి. వేసుకొన్నది ఖాకీ హాఫ్ షర్టు. తలకు కుచ్చుటోపీ ఉంది. చేతిలో ఒక చేతి కర్ర వుంది. కళ్ళు ఎర్రగా వున్నాయి. అతడు సయ్యద్ జమాల్-పోలీసు అమీను.

గొంతు సరిచేసుకోవడానికా అన్నట్లు మరొకసారి పెద్దగా దగ్గాడు. తాను వస్తున్నానని చెప్పడానికి అతడు యిచ్చే సంకేతం అది. దాని అర్థం అక్కడి వారందరికి తెలుసు. అరుగులమీద నుంచున్న వారు హోటళ్ళలో దూరారు. దుకాణాల్లో వారు వ్యాపారంలో నిమగ్నులైనారు.

మూడవసారి దగ్గాల్సిన అవసరం అతనికి ఎప్పుడూ ఏర్పడలేదు. మూడవ సారి దగ్గినా ప్రయోజనం లేకపోయింది. అతడు సాగిపోతూనే ఉన్నాడు.

"కౌన్ హై? ఠైరో" కేకవేశాడు అమీను.

సాగిపోయేవాడు వెనక్కు తిరిగి చూచాడు. తనను కాదన్నట్లు మళ్ళీ సాగి పోతున్నాడు.

"క్యాఁబే సున్తానై. ఠైరో."

మళ్ళీ వెనక్కు తిరిగి చూచాడు పేపరు మనిషి.

"ఏమ్. మస్తీ ఎక్కిందా? నిల్వమంటే నిల్వకపోతున్నవ్" అని తనవైపు వస్తున్నవాణ్ణి చూస్తూ దిగ్భ్రమచెంది నిలిచిపోయాడతను. అతనికేమీ తోచలేదు. వచ్చేవాడు ఎందుకు అరచాడో అర్థంకాలేదు. తానెందుకు నిలిచాడో కూడా తెలియ లేదతనికి. సయ్యద్ జమాల్ దగ్గరికి వచ్చేశాడు.

"ఏమ్ ఖానూన్ జతా యిస్తున్నావట?" అని చేతిలోని పేపరును లాగాడు.

అతడు పేపరును నొక్కి పట్టాడు. జమాల్ చేతికి రాలేదు. అమీను మండి పోయాడు. లాగి లెంపమీద కొట్టాడు. పేపరు లాక్కున్నాడు. పరపరా చింపేసి బూటుకాలితో తొక్కి "మస్తీ చరేగయా హరామ్ఖో దేకో అబ్ జావ్" అని చరచరా సాగిపోయాడు.

అంతా మెరుపులా జరిగిపోయింది. క్షణంలో జరిగిపోయింది. వింతగా జరిగి పోయింది. అనూహ్యంగా జరిగిపోయింది.

అతనికి కళ్ళు చీకట్లు కమ్మాయి. తూలాడు. మళ్ళీ వెలుగు కనిపించేవరకు చేతిలోని పేపరు ముక్కలు ముక్కలుగా నేలమీద పడివుంది. ముందు మనిషెవడూ లేడు. చిరిగిపడిన పేపరు ముక్కలన్నీ తీసుకున్నాడు. సాగిపోయాడు.

ఊరు చివరి ఇంటి అరుగుమీద కూర్చొని చుట్ట కాల్చుకుంటున్న వీరయ్య గారు అతనిని చూచి గభాల్న లేచి "కారటన్న యెయ్యకుండ వచ్చినవు?" అని యింటివైపు తిరిగి "జానకమ్మా! రఘు వచ్చిండు. బావ వచ్చిండు—పట్నంకెల్లి. కంచు చెంబుల నీళ్ళతే తల్లీ కాళ్ళు కడుక్కుంటడు" అని తిరిగి రఘును చూచి చిన్నబోయాడు. చెంప పొంగి ఉంది. ఏమీ అర్థం కాలేదతనికి.

"ఎందు కిట్లయింది?"

"ఏమైంది?"

"ఎవడు కొట్టిండు" బాణంలా దూసుక వచ్చాయి ప్రశ్నలు వీరయ్యగారి నోటినుంచి.

"మొదలు లోపలికి పాండి" గుమ్మంలో అడుగుపెట్టాడు రఘు.

అనుసరించాడు వీరయ్యగారు.

"బావ వచ్చిండు" అనే మాటవిన్నది జానకి. ఆమెలో సముద్రం పొంగింది. ఆటూ పోటూ వచ్చాయి. ఉబ్బితబ్బిబ్బైంది. అమాంతంగా లేచింది. అద్దం చూచుకొని తల సవరించుకుంది. చీర చూచుకుంది. బాగనిపించలేదు. క్షణంలో చీర మార్చు కుంది. చెంబుతో చల్లనీళ్ళు తీసుకుని బయలుదేరింది.

ఆమెలో సెలయేళ్ళు జలజల పారేయి!

బావ! తన బావ వచ్చాడు. ఎంత కాలానికి వచ్చాడు? ఎలా ఉంటాడో? ఎప్పుడో చిన్నతనంలో చూచింది తాను! బొడ్డు మల్లెపూలు దోసిళ్ళతో తెచ్చి తన నెత్తిన పోసేవాడు!

ఆ అనుభూతే ఆమె ఒడలు జలదరింపజేసింది. చిరు చమటలు పోసినట్లని పించింది. చెంబు బల్లమీద పెట్టి మళ్ళీ అద్దం చూచుకుంది. చెమటలు తుడుచుకుంది. చెంబు తీసుకొని బయలుదేరింది.

---

* శాసనాలు వల్లిస్తున్నావట.

తన బావ! బాగా పెద్దవాడైపోయి ఉంటాడు! పట్నంలో పెద్ద చదువులు చదివి వస్తున్నాడు! తనను గుర్తిస్తాడా! తన బావ! గుర్తించడూ! ఎలా పలకరిస్తాడో? ఏమంటాడో, ఏం తెచ్చాడో తనకోసం?

ఇలాంటి భావాలు ఇంకెన్నో ఆమె మనసులో మసలాయి. ముసిరాయి. ఎంతో ఆవేశంతో, ఎంతో ఉద్వేగంతో, ఎంతో మమతతో, ఎంతో వలపుతో బయట అడుగుపెట్టింది జానకి. పయ్యెదతో ఒడలంతా కప్పుకొని చెంబు మెట్లమీద పెట్టి బావను చూచింది.

బావ! తన బావ స్థాణువులా మొదటి మెట్టుమీద అడుగుపెట్టాడు. ఏదో గంభీరంగా ఉన్నాడు. మౌనంగా ఉన్నాడు. ఏదో ఆలోచనలో ఉన్నాడు, ఎక్కడో ఉన్నాడు.

మనసులో పెరిగిన తోటమీద పిడుగు పడ్డది. పొంగిన బావ ఎడమ చెంప చూచింది. "ఏమయ్యింది?" తనకు తెలియకుండానే పెదవులు పలికాయి.

వస్తున్న ఇద్దరు మనుష్యుల్లో ఎవరూ ఆమె ప్రశ్నను వినలేదు.

రఘు ఇంట్లో అడుగుపెట్టి, పెట్టె చిరిగిన పేపరు ముక్కలు బల్లమీద పెట్టి కుర్చీలో కూలబడ్డాడు.

జానకి కన్నీటితో లోపలికి వెళ్ళి తలుపు చాటున నుంచుంది.

వీరయ్యగారు లోపలికి వచ్చారు. బల్లమీద కూర్చుంటున్నప్పుడు చిరిగిన పేపరు ముక్కలు కనిపించాయి. విషయమంతా అర్థమయింది. "అయితే నువ్వు తెచ్చినావు పత్రిక! జమాల్‌సాబేకాదు కొట్టింది. మంది సొమ్ము తిని మస్తీ ఎక్కింది గాడ్దికొడుక్కు. మొన్నటి దనక జమేదారుగుండె—ఇయ్యాళ అమీనాయె. ఇగ నెత్తి కెక్కక ఏమైతదు లమ్డికొడుకు. నజ్రాన ముట్టంగనే అమీన్ను చేసే నవాబు సాబు. పట్నంల కూర్చునోన్నికి ప్రజల కష్టాలేమి తెలుస్తయి? పత్రిక తెచ్చిండయ్యా, ఎర్క లేక తెచ్చిండు. తేవద్దని చెప్పాలె. బజార్ల పట్కకొడ్తాడు. కారటేస్తె సరిపోక పోయినాది. నువ్వు మాత్రం! ఏం తగలపడ్డదని తెచ్చినవు ఆ పత్రికల?" ఇంకేమేమో అనేస్తున్నారు వీరయ్యగారు.

విషయం తెలుసుకున్న జానకి దుఃఖం పొంగింది. తన బావ! చెంప దెబ్బ తిన్నాడు! దెబ్బ ఆమెకు తగిలినట్లయింది. మంచంలోపడి ఎక్కెక్కి ఏడ్చింది. రఘు కుర్చీలోంచి లేచాడు. కాళ్ళు కడుక్కొని వచ్చి కూర్చున్నాడు.

వీరయ్యగారి కోపం చల్లారలేదు. "నిన్నటిదనక పొగాకుకాడకు, బియ్యానికి తిరిగినోడు ఇయ్యాళ నా అల్లుణ్ణే కొడ్తడులే. సరే చూస్తారేపియ్యాల్టికి నీ కాళ్ళు పట్టుకోవాలె గాడ్దికొడుకు ఏమనుకుంటున్నడో"

"మామయ్యా ఉద్రేకం పనికిరాదు. వ్యక్తిని అని ఏమి ప్రయోజనం వ్యవస్థ అటువంటిది."

ఆ పదాలు కొత్తగా వినిపించాయి వీరయ్యగారికి. వింతగా చూచారు రఘువైపు.

"అవును మావయ్యా! గాంధీజీ దక్షిణాఫ్రికా పోయిండు. అక్కడ రాజ్యం తెల్లదొరలది. నల్లవారందరు కూలీలకింద లెక్క. గాంధీజీ ఫస్టుక్లాసు టిక్కెట్టు తీసుకొని ఫస్టుక్లాసులో ఎక్కిండు. ఆ దేశంలో తెల్లవారు తప్ప నల్లవారు ఆ క్లాసులో ఎక్కకూడదు. ఒక తెల్లవాడు గాంధీజీని చూచిండు. దిగమన్నడు. గాంధీజీ దిగనన్నడు. తెల్లవాడు పోలీసువాణ్ణి పిలిచిండు. పోలీసువాడు గాంధీజీని గుంజి కిందపడేసిండు. అప్పుడు గాంధీజీ 'ఇది జాతి విచక్షణ అనే వ్యాధికి ఒక లక్షణం మాత్రమే. కొట్టినవాణ్ణి కోర్టుకి ఎక్కించి ప్రయోజనం లేదు. ఈ వ్యాధిని నిర్మూలించ టానికి ప్రయత్నించాలె' అనుకున్నాడు. కాబట్టి అమీనును అంటే ఏం ప్రయోజనం?"

రఘు చెప్పిందాంట్లో ఏ కొద్దిగానో అర్థం అయింది వీరయ్యగారికి. అయినా తన అల్లుడు ఏదో గొప్పవిషయం చెప్పాడనుకున్నాడు. దాన్ని అర్థం చేసుకోవ డానికి ప్రయత్నించారే కాని వివరణ అడగలేదు.

దుఃఖాన్ని గుండెలో దాచుకొని చెవులు రిక్కబొడుచుకొని వింటున్న జానకి ఏదో మనసు తేలిక అయినట్లు అనిపించింది. బావ విషయంలో ఏదో చెప్పరాని గౌరవం పొంగింది. తాను తన జీవితంలో పగలు సాధించుకోవడాలు చూచింది కాని దెబ్బతిన్న వానినుంచి ఇలాంటి మాటలు వినలేదు. అదేదో కొత్తగా కనిపించిందామెకు. వింతగా కనిపించింది. ఆమె లేచింది. ముఖం కడుక్కుంది. అలా అన్న బావను చూడాలనిపించింది ఆమెకు. ప్రమిద వెలిగించింది. తీసికెళ్ళి ఇంటిముందరి గూట్లో పెట్టింది. లోపలికి వెళ్ళింది. లాంతరు తెచ్చింది. బల్లపీటమీద పెట్టింది. భారమైన అడుగులు వేసుకుంటూ గుమ్మం దాటింది.

బావ పిలుస్తాడని ఆశించింది.

అతడు పిలువలేదు.

తాసిల్దారునుండి పిలుపు వచ్చింది వీరయ్యగారికి. వారు తలగుడ్డ చుట్టుకొని, కిర్రుచెప్పులు వేసుకొని భాజాకర్రతో బయలుదేరారు. వీరయ్యగారి ముఖానికి బుర్ర మీసాలు ఒక అందం. వాస్తవంగా నిమ్మకాయలు నిలుస్తాయి వాటిమీద. అయినా వారి ముఖం భయంకరంగా ఉండదు. విశాలమైన వారి వదనంలో ఔదార్యం ఉట్టిపడు తుంటుంది. వారు ఆ గ్రామానికి మోతుబరిరైతు. పేదాబిక్కని ఒక కంట చూస్తుంటారు. అందుకే వారంటే అందరికీ ఆదరం. వారు వీధవెంట వెళ్తుంటే దండాలు పెట్టే వారు. ఆదరంగా పక్కకు తప్పుకునే వారు అనేకం. అందరి యోగక్షేమాలు తెలుసుకుంటూగాని వారు సాగరు. అందుకే తాసిల్దారు ఇంటికి చేరేవరకు ఆలస్యం అయింది.

తాసీల్దారు పేరు మహ్మద్ అన్వర్‌బేగ్. అతడంటే ఆ జాగీరు ప్రజలందరికీ హడల్. అతని పేరు వింటే పిట్టలు సైతం నీళ్ళు తాగటం మానేస్తాయి. అతని

ఆకారాన్ని చూస్తే వాస్తవంగానే హడలు పుడుతుంది. నల్లని బొగ్గులాంటి రంగు అతనిది. మహాయంత్రంలా ఉంటాడతను. అతనిది బానంత బొర్ర. అందుకే అతనిని బొర్ర తాసిల్దార్ అంటారు. పేరు ఎవరికీ తెలీదు. మనిషి బాగా పొడవరి. అయితే, బాగా లావుండటాన పొట్టిగా ఉన్నట్లు కనిపిస్తాడు. తల భుజాలకు తగిలినట్లుంటుంది. మెడ కనిపించదు. ముఖం గుండ్రంగా ఉంటుంది. కందలా ఉంటుంది ముక్కు తప్ప కండ్లూ చెవులూ కనిపించవు. తల బట్టతల. ఆలోచన రానప్పుడల్లా అరచేత్తో తల రుద్దుకోవడం అతని అలవాటు. అతడు కట్టుకునేది పెద్ద గళ్ళలుంగీ. వేసు కునేది వదులైన తెల్లని జుబ్బా. కూర్చునేది బల్లపీటమీద. బల్లపీటమీద పరుపు దాని మీద తెల్లని గుడ్డ పరచి ఉంటాయి. ఆనుకోవడానికి తెల్లని బాలీసులుంటాయి.

అతడు మాంత్రికుడని జనపు నమ్మకం. అతనికి ఎదురు చెప్పిన వాడు జీవించలే డనుకుంటారు. అలాంటివాడు తెల్లవారేవరకు రక్తం కక్కుతూ చస్తాడని వదంతులున్నాయి. అతని దగ్గిర వశీకరణ మంత్రం ఉన్నదని జనపు నమ్మకం. అది దండ కడియంలో ఉంటుందనీ, దాన్ని కదుపుతే ఎంతటి వాడైనా లొంగి పోతాడని, అనుకుంటారు జనం. వారు అనుకోవడానికి ఆధారాలూ ఉన్నాయి. పట్నంలో ఉంటాడేకాని పల్లెత్తు మాటనడు జాగీర్దారు. తాసిల్దారు చెప్పిన వాట న్నింటికీ తల ఊపుతాడు. తాసిల్దార్ తన మామకు మందు పెట్టి చంపాడు. బాణామతి చేశాడనుకున్నారు జనం. మామ పర్షియావాడు. నైజాం నవాబుకే మతా చార్యుడు. ఆ చావుతో ఒక కల్లోలం లేచింది. విచారించడానికి అధికారులను పంపింది నైజాం ప్రభుత్వం. వచ్చిన వారంతా అతని ఇంట్లో కుక్కల్లా పడి ఉన్నారేగాని కిక్కురు మనలేదు. అడవికి వేటకు వెళ్ళి వచ్చారు. హైద్రాబాదు రైలెక్కారు.

అతనిది లంకంత ఇల్లు. ఇంటి ముందు సముద్రమంత ముంగిలి. అదే అతని ఆఫీసు. అతడు సర్వతంత్ర స్వతంత్రుడు. ప్రభుత్వ వ్యవహారాలన్నీ, అక్కణ్ణుంచే నడిపిస్తాడు. అతడే ప్రత్యక్ష జాగీర్దారు. అతని సర్వీసు మొత్తంలోనూ ఆఫీసు గడప తొక్కలేదు. అతనికి చదువు రాదు. ఆ విషయం చాలా మందికి తెలీదు. జాగ్రత్తగా చదివించుకునిగాని సంతకాలు పెట్టడు. వ్యవహార దక్షుడని అతనికి పేరు. అందుకు కారణం అతడు గట్టిగా అరవగలడు. ఎదుటివాణ్ణి హడల గొట్టగలడు. అతనిని ఎదిరించే ధైర్యం ఎవరికీ లేదు. అతని జీతం హాలీ[1]. యాభై రూపాయలు! అవి అతని తాంబూలపు ఖర్చులకు సయితం చాలవు.

అతని ముందు అంతా నుంచోవల్సిందే. ఎవడూ కూర్చోవడానికి వీల్లేదు. అయినా వీరయ్యగారికి కుర్చీ తెప్పించి వేయించాడు. వీరయ్యగారు వంగి సలాం చేశారు. జవాబుగా ఒకసారి సలాం చేశాడు. ఒకసారి చిరునవ్వు నవ్వాడు.

---

1. నైజాం నాణెం.

"బైఠీయే వీరయ్య సాబ్."

కూర్చున్నారు. తరువాత మాట్లాళ్ళేదు తాసిల్దార్. మౌనం చూస్తుంటే ఏదో అగ్గికొండ బద్దలు కానున్నట్లున్నది. అరచేత్తో తల రుద్దుకున్నాడు తాసిల్దార్. అంటే ఏదో మునిగిందన్నమాట. వీరయ్యగారి గుండెలో గుబులు ప్రవేశించింది.

"ఏమో పిలిచ్చిరంట"

"మేమ్ పిల్చినామ్? పిలిపించుకుంటున్నరు. మోతబర్ రైతులే ఇట్ల చేస్తే సర్కారెట్ల నడుస్తది?"

"సర్కారుకు ఎన్నడన్న ఎదురు చెప్పినమా? చెప్పినక జాగీర్ల ఉంటమా? చెప్పింది ఎట్ల తెలుస్తది?"

"ఈడికే మంది చేతులుంటలేరు. పోరలు దునక బట్టిరి. ముందాలనే చెప్పిన రేల్గాడి[1] జాగీర్ల నుంచి పోనియ్యొద్దని. నవాబు ఇంటెనా? షికార్‌కు వచ్చెటందుకు పనికొస్తదన్నడు. ఆ రేల్గాడితోనె తెల్విపారుకున్నరు మందంటె..."

"సర్కార్! మా నాయన వచ్చిండు జాగీర్‌కు. అప్పుడంత చిట్టడివే కద! బూములున్నాయండి. ఊరిబయట కొట్టుకొచ్చిన వాసంతోనే ఇల్లు కట్టె మా నాయన. చెట్లు కొట్టి పొలం చేసుకొంటిమి. అడవిలనే పులివాతపడి చచ్చె మా నాయన. ఇన్నాళ్ళ నుంచి ఎప్పుడన్న ఎదురు చెప్పినమా ? మాసూళ్ళు కట్టుంటిమి. మామూళ్ళు కట్టుంటిమి. మళ్ళీ యిప్పుడే మొచ్చిందో ఎళ్ళబెట్టక పోతిరి. యెట్ల తెలుస్తది?"

"అక్బార్ తెచ్చిండట కద!" అసలు విషయం బయటపెట్టాడు తాసిల్దారు.

బయలుదేరేప్పుడు అనుకున్నారు వీరయ్యగారు, పిలిచింది ఇందుకోసమేనని. అయినా ఆ ప్రశ్నకు కాస్త తికమకపడ్డారు. "తెల్వక తెచ్చిండుండి."

"తెల్వక తెచ్చినాడు! యెవ్వడు తెచ్చినోడు?"

నీళ్ళు నమిలారు వీరయ్యగారు. "నా మేనల్లుడు-అక్కకొడుకు"

"అందుకే బతికిపోయిండు. లేకుంటే పీనిగెల బొందలోకి పోయెటోడు. ఎందుకు తెచ్చిండు?"

"పట్నంనుంచి వస్తాండె, తెచ్చిండు. చెప్పినగద తెల్వక వచ్చిందని"

"పట్నం ఎందుకు పాయె అసల్" అడిగాడు, పట్నం పోవడం కూడా నేరమేనన్నట్లు.

"పోలేదుండి. అడనే ఉండి చదువుకునె. చదువు అయిపోయింది. వచ్చిండు"

"చదువుబీ చదివినాడు. అయితే ఖతర్నాక్* ఏం చదివిండు?"

---

1. రైలుబండి.

* ప్రమాదం

"నాకు తెలుస్తాదుండి ఆ చదువులేందో! ఏమో ఖానూన్ చదివిండట. ఏదో అంటరు లెలెబి"

"ఏందేంది? ఖానూన్ చదివినాడు! ఖానూన్! అంగ్రేజొస్తదా?"

"అంత చదివె. రాకుండుంటాది. తెలుస్తాదుండి నా బొంద."

"సర్లె ఎన్నొద్దులుంటడు?"

"యాడికి పోతడు"

"ఏమీ? యాడికి పోడా? ఈడనే ఉంచుకుంటవా? ఖానూన్ చదివినోడు ఖతర్నాక్. మీదికెల్లి అఖ్బార్ చదువుతడు. పామున్నడు పాము. నెత్తికెక్కించు కుంటమా? నైజాన్తా జాగీర్ల ఉండెతందుకు పీల్లేద్"

"అట్లంటె ఎట్ల? అయ్య, అమ్మ చచ్చిరి. అల్లుడి కాడుండి. నాకు కొడుకు లున్నరు గన్కనా. బిడ్డనిచ్చి ఇంట్ల ఉంచుకుంటా, బుద్ధిమంతుడు సర్కార్!"

"ఏందేంది అఖ్బార్ చదివిటోన్కి బిడ్డనిస్తావు? నవాబుసాబ్ ఇజాజత్[1] కావలె లగ్గానికి[2] ఖానూన్‌కా బచ్చా. యహాఁరహనా నహీఁ అచ్ఛా. పీల్లేదు. ఒప్పు కోను భేజ్‌దేవ్!"

"ఖానూన్ చదివితే మాత్రం సర్కార్ కంటె ఎక్కువ తెలుస్తాదుండి! మా రఘు అసువంటోడు కాడు నా జిమ్మేదారీ.[3] నన్ను నమ్మరా?"

"ఏందేంది? పేరు బీ ఎట్లనో ఉన్నది. యల్లయ్య కాదు మల్లయ్య కాడు. కమీనిస్టున్నట్టున్నడు. బఢాదేవ్" గట్టిగా అరచాడు తాసిల్దారు. తరువాత మాట్లాడ లేదు. వీరయ్యగారు మౌనం వహించారు.

"పేరులో ఏమున్నది సర్కార్" నసిగారు వీరయ్యగారు. "నా జిమ్మేదేరి అంటున్న గద. ఇంత జాయిదాదు[4]న్నది పారిపోతనా? వాడేమన్న చేస్తే నా తల తీయించుండి."

"అచ్ఛా! కుక్కన పేనోలె పడుండాలె. న్రఖాల్ గిరఖాల్ చెయొద్దు. అఖ్బార్ గిఖ్బార్ చదువొద్దు. ఖానూన్ జతాయించిండా ఇద్రెడ్డిలేదు. మీ జిమ్మేదారిమీద ఉంచుతున్నం. ఖైర్. నజ్రానా యెంతిస్తవు!"

"నూరు యిచ్చుకుంట"

"నైజాన్తా, తీన్ సౌ. చలో అబ్ నిక్లో[5]. పొద్దాల పైకం పంపాలె. ఇక పొండి"

వీరయ్యగారు ఇంకేదో చెపుదా మనుకుంటుండగానే ఆడదాని కేకలు వినిపించాయి. మరుక్షణంలో ఇద్దరు మనుషులు ఒక అమ్మాయిని లోనికి లాక్కొచ్చి తాసిల్దారు కాళ్ళమీద పడేశారు. ఏడుస్తూ కేకలు వేస్తున్న పిల్ల లేచి గుమ్మంవైపు పరిగెత్తింది. మళ్ళీ ఆ తెచ్చిన ఇద్దరు పట్టుకొని లాక్కొచ్చారు.

---

1. అనుమతి 2. పెండ్లికి 3. బాధ్యత 4. ఆస్తి 5. ఉదయం

పీరయ్యగారు చూడలేకపోయారు. ముఖం తిప్పుకొని బయటికి నడచి పోయారు.

ఆ పిల్ల మల్లి. వడ్డెర పీరయ్య కూతురు. మంచి వయసులో వుంది. మిసమిసలాడే యవ్వనం, రంగు నలుపే. అయినా నీలమణిలా వుంది. తలారి శివయ్యకు ఎన్నడో కన్ను పడ్డది దానిమీద. వడ్డెర గూడెంలో కన్ను కొట్టాడు. మల్లి తలవంచుకొంది. ఆ రాత్రి అయ్యతో చెప్పింది. పీరయ్య మల్లమ్మను తప్పిం చేశాడు. మరో వూరికి పంపాడు. అందమైన ఆడది గూడెంలో ఉండరాదు. అది తాసిల్దారు ఇంటికి చేరాల్సిందే. తన కూతురికి ఆ గతి పట్టరాదనుకున్నాడు పీరయ్య. తల్లి ప్రసవిస్తే చూడ్డానికి వచ్చింది మల్లమ్మ. అదీ చాటుగానే. అయినా కనిపెట్టాడు శివయ్య. ఆ రాత్రి ఇంటిమీద దాడిచేశాడు. తనకు అందకుంటే తాసిల్దారుకు సమర్పించా లనుకున్నాడు. లాక్కొని వచ్చాడు. పారిపోతుంటే పట్టుకున్నాడు.

మల్లమ్మ గింజుకుంటున్నది. వదిలించుకోడానికి శత ప్రయత్నం చేస్తున్నది. గట్టిగా పట్టుకున్నాడు శివడు. "సర్కార్ దీన్ని దాచిపెట్టిండు పీరిగాడు. పట్టుకొస్తాంటె మీదపడి కొడ్తాండు. చుక్క సర్కార్ చుక్క ఇది! సర్కార్ కొలువులుండాలె. గూడెంల వుండి ఏం చేస్తదని తెచ్చిన, బాంచను"

ఇంతలో పీరయ్య ఉరికివచ్చి తాసిల్దార్ కాళ్ళమీద పడ్డాడు. "దొరా! నీ బాంచను. కాల్మొక్త, చర్మం ఒలిచి చెప్పులు కుడ్త. నా బిడ్డ నిడువుండి" అని కన్నీరు కార్చుతూ బ్రతిమిలాడాడు.

"అబె భంచత్ లే. ఏందిబే నఖ్రాల్చేస్తున్నవు. నీ చెప్పులు ఎవనికి కావాలెబె. చల్ బాహర్ మాదర్ చోద్" అని గట్టిగా తన్నాడు డొక్కలో తాసిల్దారు. గజం దూరాన పడి విలవిల లాడాడు పీరయ్య. మల్లమ్మ గుండె వక్కలైంది. తండ్రిమీద పడి రక్షించాలనుకుంది. ఉరికింది. ఇద్దరు రెండు రెక్కలు పట్టుకొని ఉన్నారు. ఆ ఊపుకు కుడిచేయి పుటుక్కుమంది. ఎముక తొలిగింది. "హా" అని ఏడ్చి పడిపోయింది. పీరయ్య లేచాడు. కూతురువైపు సాగాడు. ఇద్దరు మనుషులు అతన్ని లాక్కెళ్ళి బయట పారేశారు. తలుపులు వేశారు.

తాసిల్దారు దివాణంలోకి అనేకమంది అంగనలు అలా వచ్చినవారే. అలాంటి వారిని చాలామందిని 'నికా' కట్టుకున్నా డతను. ఒక వీధి సాంతం అతని పెళ్ళాలే వున్నారు. దానిపేరే తాసిల్దారు వీధిగా మారిపోయింది. వారిని మహమ్మదీయులుగా మార్చి వారి సంతానం పెంచి ఇస్లాంకు సేవ చేస్తున్నాడు అన్వర్‌బేగ్ తాసిల్దార్. సేవ సంగతి ఎలా వున్నా ఆడది అంటే పడిచస్తాడతను.

ఒకసారి ఈ జాగీరు ప్రక్కనున్న మరో పిల్లజాగీర్దారు "ఖాన్ సాహెబ్" ఈ జాగీరునుంచి ఒక అమ్మాయిని ఎత్తుకుపోయాడు. ఆమెమీద పూర్వంనుంచే కన్నువుంది తాసీల్దార్‌కు. దాంతో ఆ "ఖాన్ సాహెబ్"తోనే యుద్ధానికి దిగాడు తాసిల్దార్. గుర్రాలమీద గుండాలతో ఆ వూరిమీద దాడిచేశాడు. ఖాన్‌సాహెబ్

తక్కువవాడా! పతాను రక్తం ప్రవహిస్తూంది అతని నరాల్లో. అతడూ కత్తి పట్టాడు. ఇద్దరూ గుర్రాలమీద ఉండే పోట్లాడుతున్నారు. ఇద్దరిలో ఎవరూ ఓడినట్లు కనిపించలేదు. ఎవరూ గెలిచినట్లు కనిపించలేదు. సంధి జరిగింది. అమ్మాయిని రెండు ముక్కలుచేసి చెరొక ముక్క తీసుకోవాలనుకున్నారు. అంతపనీ చేశారు. ఇద్దరూ గెలిచా మనుకున్నారు.

పాపం అమాయికను, అబలను బలిగొన్నారు! అందుకోసమే యే ఆడదాన్ని పట్టినా కిక్కురుమనరు అక్కడి జనం. మరి వీరయ్య మాత్రం ఏం చేయగలడు? అతనికి బలం లేదు. శక్తి లేదు. అధికారం లేదు. శక్తి ఉన్నంతవరకు ఏడ్చాడు గుమ్మం ముందు పడి, లేచి వెళ్ళిపోయాడు.

* * *

ఆ రాత్రి వీరయ్యగారికి నిద్ర పట్టలేదు. అన్నం తిన్నాననిపించి లేచారు. చుట్ట కాల్చుకున్నంత సేపూ ఏవేవో ఆలోచనలు వచ్చాయి. ఆలోచనలను తరిమివేయా లనుకొన్నారు. మంచంలో మేను వాల్చారు. నిద్రపోవడానికి ప్రయత్నించారు. కాని మల్లి కళ్ళలో ఆడసాగింది. మల్లమ్మ పాపం పసిపిల్ల! ఎలా లాక్కొచ్చా రామెను! తప్పించుకొనడానికి ఎంత గింజుకుంది? ఏమైందో దాని గతి? ఏమౌతుంది? అలాంటి అందరికీ పట్టిన గతే పట్టి ఉంటుంది. కాని అందరినీ తాను చూడలేదు. తాను చూచింది మల్లమ్మనే! పాపం ఆ పిల్ల! ఇప్పటికి పాడైపోయి వుంటుంది. మల్లమ్మతో జానకి కనిపించింది వారికి. గుండెలో అగ్గివాన కురిసింది. అలా కాకూడదు. కాదు. కారాదు. అనుకున్నారే గాని ఏవేవో పిచ్చి పిచ్చి ఊహలు వచ్చాయి. ఆ ఆలోచనను బలవంతంగా పక్కకు నెట్టారు. పత్రికంటే తాసిల్దారుకు అంత భయం ఎందుకు? ఏముంటుంది అందులో? అది చదువుతే తాసిల్దారు ఓడిపోతాడా? ఆరిపోతాడా? ఎందుకంత భయం? అందులో ఏముంటుందో చూడాలనుకున్నారు. లేచారు చిరిగిన పత్రికలన్నీ తెచ్చారు. లాంతరు దగ్గరపెట్టి కూర్చారు. చదవడానికి ప్రయత్నించారు. ఏవో యుద్ధ వార్తలు. ఎక్కడో బాంబులు పడ్డాయి. ఎవరో గెలుస్తున్నారు. ఎవరో ఓడుతున్నారు. ఏమీ అర్థం కాలేదు. ముక్కలు అక్కడే పారేసి పండుకున్నారు. రఘుతో పత్రిక చదవడం మాన్పించాలా? అతను చేస్తున్న దానిలో తప్పుందా? ఏమేమిటో ఇలాంటి ఆలోచనలు మెదడును చీల్చసాగేయి!

జానకి కూడా ఆ రాత్రి నిద్రపోలేదు. ఆమె కళ్ళల్లో బావ చేరాడు. పొంగిన చెంప. చేతిలో పెట్టె, చిరిగిన పత్రిక! బావ తనను పలుకరించలేదు; మరిచిపోయాడా! మారిపోయాడా! తాను చెరుకు తింటున్నది. బావ వచ్చి లాక్కున్నాడు. తాను పెద్దగా ఏడ్చింది. అత్తమ్మ వచ్చి బావను బాదింది. అయినా ఏడవలేదు. అత్తమ్మ వెళ్ళిపోయిం తరువాత తనను బాదాడు. ఈ తడవ తాను అత్తమ్మను పిలువలేదు. ఇద్దరూ

కొట్టుకున్నారు. రక్కుకున్నారు. ఆ బావేనా యీ బావ ! ఎంత మారిపోయాడు. తనకోసం ఏం తెచ్చాడో పట్నం నుంచి ! చీరలు, జాకెట్లు, రిబ్బన్లు, గాజులు.

రంగు రంగుల చీరలు ఆమె మనసులో రెపరెప లాడేయి.

రఘుకు కూడా కునుకు పట్టలేదు. పత్రిక తేవడం నేరంకాదే! ఎంత ఘోరం! ఎంత రాక్షసత్వం. నడివీధిలో ఎంత ధైర్యంగా తనను కొట్టాడు. తనను కొట్టాడు సరే. అసలు మనుషులేనా ఇక్కడ ఉంటున్నది. ఇంత చీకట్లో ఇంత అజ్ఞానంలో ఎలా జీవిస్తున్నారు జనం? ఎలా సహిస్తున్నారు జనం? బ్రిటిషిండియాలో ప్రజలు స్వాతంత్ర్యానికి చేరుకున్నారు. ఖాల్సాలో ప్రజలు పరిభుత్వాన్ని ఎదిరించి పోరాడుతున్నారు. ఈ ప్రజలు ఇంకా మధ్య యుగాల్లోనే నలుగుతున్నారు. ఇందును గురించి ఏం చేయాలి? ఎలా ప్రవర్తించాలి ? ఇంత దౌర్జన్యాన్ని ఎలా సహించాలి?

ఆ ఇంట్లోవున్న మూడు ప్రాణులూ నిద్రపోలేదు. అయినా తెల్లవారింది. వీరయ్యగారికి అమీను నుండి పిలుపు వచ్చింది. ఆ పిలుపు విని చిరచిర లాడేరు వీరయ్యగారు. లోలోన ఖస్సు బుస్సుమని కూడా అన్నారు. కాని వెళ్ళక తప్పదని వారికి తెలుసు-వెళ్ళారు.

అమీను సయ్యద్ జమాల్ వీరయ్యగారిని పిలిచేవాడు కాదు. తాసిల్దారు పిలిపించాడని తెలిసింది. తాను పిలిపించకుంటే తన అధికారానికి ఏదో లోపం అనుకున్నాడు. సిలిపించాడు. అమీన్ అంటే పోలీస్ సబిన్స్పెక్టర్. కాని యీ జాగీరు అమీనుకింద నలుగురే పోలీసు లుంటారు. అతని జీతం ఇరవై అయిదు రూపాయీలు హాలీలు. అయినా తాసిల్దారుకు ఏమాత్రం తక్కువ కారాదని అతని మక్కువ. తాసిల్దారు పిలిస్తే పోతాడు. సలాం చేస్తాడు. నుంచుండే మాట్లాడుతాడు. ఆతడు చెప్పిన పని చేయాలి కాబట్టి చేస్తాడు. అయినా మనసులో ఏదో తహ తహ. తాను పోలీసు అమీను. తాసిల్దారుని తలదన్నాలని అభిలాష. అందుకే వీరయ్యగారిని పిలిచింది.

వీరయ్యగారు పోలీసుస్టేషనుకు చేరేవరకు మంగలి రావుడిమీద నిప్పులు కురుస్తున్నాడు అమీను.

"ఏంబే, బేగంసాబ్‌కు గడ్డ అయిందని ఎరికిలే వచ్చి కట్టు కట్టొద్దుబే మాదర్ చత్"

"వస్తనే ఉంటినికద బాంచను. తాసిల్దారుదొరకు మాలిష్‌చేసి వస్తాన్న. కాల్మొక్త"

"జవాబ్బీ చెప్పుతవ్‌బే హరాంజాదే" అని లేచి కర్ర అందుకొని రావుడి మీద పడ్డాడు అమీను. బలంకొద్ది కొట్టసాగాడు.

"కొట్టకు బాంచను. కాల్మొక్త. తప్పయింది, ఇగనుంచి చేయను. మళ్లచేస్తే పానాలు తీయిరి. బక్కనీయరి కాల్మొక్త. బేగంసాబ్‌కు కట్టు కట్త" అని బ్రతి

మాలుకున్నాడు కాని కదలడు. కఱ్ఱ విరిగేదాకా కొట్టాడు అమీను. ముక్కలైన కఱ్ఱ పారేసి "జావ్ బంచత్ కట్టు కట్టుపో" అని అరచి కుర్చీలో కూలబడ్డాడు.

మంగలి రావఁడు పొది అందుకొని అమీన్ ఇంటివైపు వెళ్ళిపోయాడు. అతను వెళ్ళిపోయిం తర్వాత చూచాడు అమీను వీరయ్యగారిని. చూచి అతడు అనుకోకుండానే సలామ్ చేశాడు. "మంగలోళ్ళకు బీ మస్తీ ఎక్కింది." అని ఉరిమాడు. తన అధికారాన్ని వీరయ్యగారు గమనించాలని అతని ఆతురత.

"ఏమో ? పిలిచినవట" వీరయ్యగారు అడిగారు.

"అఖ్బార్ తెచ్చినోడు మీ అల్లుడట గద. వాడు ఊళ్ళో వుండేటందుకు వీల్లేద్. ఇయ్యాల యెల్లగొట్టండి. లేకుంటే బాగుండద్! జమానా[1] బాగాలేదు, జనం చేతులుంటలేరు" అధికారం వ్యక్తం అయ్యే స్వరంతో అన్నాడు అమీను. అందుకు లోలోన సంతోషించాడు!

వీరయ్యగారికి కోపం పొంగింది. అయినా అణచుకున్నారు. "తాసిల్దార్ సాబ్‌తోని మాట్లాడిన. అంత ఫైసలైంది.[2] నా అల్లుడు నా ఇంటికొచ్చిండు. యాడికి పోతడు? జర తాసిల్దార్ సాబ్‌తోని మాట్లాడు, తప్సీల్గా[3] చెప్పుతడు. నాకు జర పొలంకాడ పనున్నది. పోయొస్త" అని లేచి చరచరా సాగిపోతుంటే మండిపోయాడు అమీను. ఆ కోపం ఎవరిమీద తీర్చుకోవాలా అని అటూ ఇటూ చూస్తే తట్ట నెత్తినేసుకొని పోతున్న ఒక పల్లెవాడు కనిపించాడు.

"కోన్ హైబే? ఎవఁడ్రా పోయెడిది?" అని అరచాడు.

"నన్నా బాంచను" పల్లెవా డడిగాడు.

"ఇంకెవరి ననుకున్నావ్‌బే మాదర్ చత్. రాబే ఇక్కడికి."

పల్లెవాడు వచ్చాడు. చేతులు జోడించి దండం పెట్టాడు.

"ఏమున్నది బే బుట్టల?"

"ఏమ్‌లేదు బాంచెన్" అని వట్టిబుట్ట చూపించాడు.

"అది కాదుబే హరామ్జాదే ఏమితెచ్చినవ్?"

"కోళ్ళు తెచ్చిన బాంచను"

"మళ్ళ అమీన్‌సాబ్ కేదిబే?"

"యాడ మిగిలినయి కాల్మొక్త. ఊరి బయటనే పోలీసాయనొకటి గుంజుకొన్నడు. ఊళ్ళకొచ్చేటాల్కల్లి మస్కూరాయ నొకటి గుంజుకున్నడు. తాసిల్దార్ చౌర బంగ్ల ముంగల జవాను పట్టుకున్నడు. బుట్టకోడి గుంజుకున్నడు. కాల్మొక్త. కాలు కడుపులు పట్టుకొని బుట్ట తెచ్చుకున్న బాంచను. మల్ల తెచ్చినప్పు డిచ్చుకుంట. గులాపొణ్ణి. మూడు కోడి పిల్లలు తెస్తిని మూడు గుంజుకొనిరి ఏం చెయ్య మంటారు. కాల్మొక్త."

---

1. కాలం 2. పరిష్కారమైనది 3. వివరంగా.

"అరె కించత్ అమీనుసా బున్నదని ఎర్కలేద్బే. కుచ్‌నైజాన్తా. కోడిపిల్ల కావాలె. లేకుంటే కొల్లేస్త లం...కొడక. ఏమనుకొన్నావ్ అమీన్ సాబంటే హడ్డీ నరమ్‌కర్తా*" అన్నాడు.

"లేంది యాడనుంచి తెచ్చిద్దును బాంచను. గరీబోల్లం"

"జవాబ్బీ చెప్పుతవ్‌బే" అని చింతబరికె పుచ్చుకొని బాదసాగాడు.

"శేవు. నీ బాంచను, తప్పైంది. మల్లొచ్చినప్పుడు తెచ్చిస్త, బక్కసీయని కాల్మొక్త" అని మొత్తుకున్నాడు అతడు.

ఆదేమి వినలేదు అమీను. చితక్కొట్టి కొట్లోపారేశాడు. తరవాత తలపాగా, కాశీ బుట్టా లాక్కొని వదిలేశాడు.

ఇదేం వింత గాదు! హైదరాబాద్‌లోనే ఇలాంటిది జరిగిందట ఒకసారి.

మహబూ బలీఖాన్ పిల్లవాడుగా ఉన్నప్పుడే రాజయినాడట. దివాన్ అన్ని వ్యవహారాలూ నిర్వహించేవారట! అతని బంధువులను తొమ్మిది మందిని కొత్వాళ్లగా నియమించాడట దివాను. ఒక పల్లెవాడు ఎనిమిది సొరకాయలు తీసుకొని అమ్ముకోడానికి పట్నం వచ్చాట్ట. ఎనిమిదిమంది కొత్వాళ్ళు ఎనిమిది సొరకాయలు లాక్కున్నారు. తొమ్మిదో కొత్వాలుకు మిగలకుంటే ఆ పల్లెవాణ్ణి నానా యాతన పెట్టాడట. పల్లెవాడు వెళ్ళిపోతూ రాజభవనపు గోడలమీద ఇలా రాసిపోయాడట.

"అంధేర్ నగరీ చౌపట్ రాజా
ఆఠ్ హైఁకద్దూ నౌ హైఁకొత్వాల్
నవాబ్ బచ్చా దివాన్ లుచ్చా"

* * *

తల్లి పోయిన్నాటి నుంచీ మూతపడి ఉన్న పడకగదిని తెరిపించింది జానకి. శుభ్రం చేయించింది. అలికించింది. స్వయంగా ముగ్గులు పెట్టింది. ఎత్తైన పందిరి మంచంమీద పరుపు, శుభ్రమైన బట్ట వేసింది. రెండు మూడు కుర్చీలు అమర్చింది. దానిని రఘుకోసరం కేటాయించింది.

తన బావ ఎంతో మారిపోయాడు. చిన్నతనంలో వదరుబోతుగా ఉండేవాడు. ప్రస్తుతం మౌనంగా ఉంటున్నాడు. చిలిపిగా ప్రవర్తించేవాడు. తనను ఎంతో సతాయించేవాడు. తాను ఇసుకతో పిచ్చుకగూళ్ళు కట్టుకుంటే తొక్కేసేవాడు. తాను ఏడుస్తుంటే నవ్వేవాడు. సద్దుల బతకమ్మనాడు తాను కొత్త పరికిణా, జాకెట్టూ వేసుకుంది. బతకమ్మను పేర్చింది. చెరువుకు వెళ్ళే సమయంలో పెద్దవాన వచ్చింది. తాను జోరున పడే వానను చూస్తూ గుమ్మంలో నుంచుంది. ఎక్కడ్నుంచి వచ్చాడో బావ వానలోకి పరిగెత్తాడు. వానపడుతుంటే గంతులు వేయసాగాడు. అలా నుంచుని ముక్కుమీదినుంచి జారే నీటిని నాలుకతో చప్పరించసాగాడు. ఇంతలో తాను

---

* ఎముకలు విరక్కొడ్తా.

కనిపించింది. వానలోకి రమ్మన్నాడు తనను. రానన్నది లాక్కెళ్ళాడు. తాను ఏడ్చింది. నెత్తిమీద రెండు వేశాడు నోరు మూయమని. తానింకా పెద్దగా ఏడ్చింది. తన ఏడుపు విని అత్తమ్మ పరుగెత్తుకొని వచ్చింది. బావను వానలోంచి లాక్కొని వచ్చి బాదింది. అయినా బావ కిక్కురు మనలేదు. కాని ఆ దెబ్బలు తనమీద పడు తున్నట్లనిపించింది తనకు. మూలకు కూర్చొని వెక్కెక్కి ఏడ్చింది. తనను వెక్కి రించాడు బావ, తానూ వెక్కిరించింది. మళ్ళీ పోట్లాట! అలాంటి బావ పెద్దమనిషిగా మారిపోయాడు. గంభీరంగా మారిపోయాడు. ఎప్పుడూఏదో ఆలోచనలోనే ఉంటాడు. ఏమి ఆలోచిస్తుంటాడో తనకు అర్థంకాదు. కాని ఎందుకో అతనిని ఆ ఆలోచనలలో చూస్తుంటే తనకు గుబులు అవుతుంది. ఎప్పుడూ ఏదో ఒకటి చదువుతుంటాడు. చదువుతున్నప్పుడు పుస్తకంలోనే మునిగిపోతాడు. తిండి, నీళ్ళు సహితం కోరడు. అందువలన బావకు ఏకాంత ప్రదేశం కావాలని గ్రహించింది. జానకి వేరే గది సిద్ధం చేసి అందులో ప్రవేశపెట్టింది.

రాత్రి భోజనాల సమయంలో వీరయ్యగారు తాసిల్దారు దగ్గర జరిగిన వృత్తాంతం తెలియపరచాడు.

రఘు చిరునవ్వు నవ్వి భోజనంలో నిమగ్నుడైనాడు.

అది చిరునవ్వేగాని వీరయ్యగారిమీద పిడుగులా పనిచేసింది. ఏమనాలో అర్థం కాలేదు. భోజనంలో నిమగ్నుడైనాడు. "తాసీల్దారు సంగతి నీకు తెల్వదు. ఆయనగాని మనమీద చెయ్యెత్తలేడు. ప్రతిక, ఖానూను ఈ రెండు యిచ్చి పెట్టు. అంత బాగానే ఉంటది."

"ఎందుకట్ల జంకుతడు ఆ రౌండంచె తాసిల్దార్?

"గుడ్లగూబకు చీకట్లంటే యిష్టం. వెలుగంటే భయం" అన్నాడు రఘు. వీరయ్యగారికి ఏమీ అర్థంకాలేదు.

"అయితే ఏం చేద్దమంటవు?"

"వెలుగు తేవాలి. గుడ్లగూబ కండ్లు తెరవలేదు."

అయోమయంలో పడిపోయాడు వీరయ్యగారు. రఘు చెప్పింది అతనికి ఏమీ అర్థంకాలేదు. అర్థం చేసుకోవడానికి ఆలోచనలో మునిగిపోయాడు.

సంభాషణ ఏమీ అర్థంకాక తికమకపడ్డది జానకి. దుఃఖం కూడా వచ్చింది. ఎందుకు తన బావ ఇలా మారిపోతున్నాడని!

ఇద్దరూ లేచారు. చేతులు కడుక్కున్నారు. వీరయ్యగారు ఆలోచిస్తూనే తన గదికి వెళ్ళిపోయారు. రఘు వెళ్తుంటే తువ్వాలు అందించింది జానకి. తువ్వాలు అందుకుంటూ కళ్ళల్లోకి చూచి చిరునవ్వు నవ్వాడు రఘు. ఆ నవ్వు స్నిగ్ధంగా ఉంది జానకి ఎదలో వెన్నెల విరిసింది.

రఘు గదిలోకి వెళ్ళిపోయాడు. జానకి అన్నం ముందు కూర్చుంది. రఘు చిరునవ్వు జానకి పెదవులమీద కనిపించింది. అన్నం తింటూ తనలో తానే నవ్వు

కుంది. ఎందుకు నవ్వుతుందో తనకే అర్థం కాలేదు. బావను అర్థం చేసుకుంటానికి ప్రయత్నించింది. గుడ్లగూబ తనకేమీ అర్థంకాలేదు. ఆమెకు అర్థం అయిందీ ఆనందా న్నిచ్చిందీ చిరునవ్వు. తన బావ ఎప్పటికీ నవ్వుతుండా లనిపించింది. గుడ్లగూబను మరచిపోవాలనుకుంది. రాముని ప్రార్థించింది కూడా—తన బావ గుడ్లగూబను మరచి పోవాలని. భోజనం ముగించి అన్నీ సర్దింది. తన గదిలోకి వెళ్ళడానికి పోతుంటే బావ పిలుపు వినిపించింది. ఆ పిలుపులో ఆవిడకు పూలబాట కనిపించింది. గదిలో అడుగు పెట్టింది.

"రా జానకీ! కూర్చో" అని కుర్చీ చూపించాడు రఘు.

జానకి కూర్చున్నది.

"పట్నం నుంచి నీకోసం ఏమి తెచ్చినో ఎరికేనా?" అడిగాడు.

బావకు తాను గుర్తున్నానని ఆనందపడింది. తన కోసం బావ చీరెలు తెచ్చా డనుకుంది. రిబ్బన్లు తెచ్చాడనుకుంది. సొమ్మును తెచ్చాడనుకుంది. ఏదో విచిత్ర మైంది తెచ్చాడనుకుంది.

"చెప్పంది ఎట్ల తెలుస్తది?"

"అట్లనా?" అని లేచి పెట్టె తెరిచాడు. పుస్తకాలు తెచ్చి జానకి ఒళ్ళో పెట్టాడు.

జానకి వింతగా చూసింది.

"చీరెలు, జాకెట్లు, సొమ్ములు తేలేదని పుస్తకాలు తెచ్చిన్నని ఆశ్చర్యపడు తున్నవు కదు. క్షీయంతే ఖిలభూషణాని సకలం వాగ్భూషణం భూషణం అన్నాడు భర్తృహరి. నగలన్నీ నాశనం అవుతాయి కాని చదువనే నగ నాశనమయ్యేది కాదు. పుస్తకాలు చదువు. లోకం తెలుస్తుంది. వెలుగు కనిపిస్తుంది."

జానకికి ఏమీ అర్థం కాలేదు.

జానకి ఒడిలోంచి ఒక పుస్తకం తీసి "ఇది 'అమ్మ' అనే నవల. మాక్సిమ్ గోర్కీ అనే మహా రచయిత రాసింది. ప్రభుత్వం దీనిమీద నిషేదం విధించింది. ఏం? భయమైతున్నదా? ఫరవాలేదు. చదువు పేదల పాట్లు అర్థం అయితయి" అన్నాడు.

తరువాత 'మాలపల్లి', 'ముత్యాల సరాలు', 'మహా ప్రస్థానం', 'మహాత్ముని ఆత్మకథ' ఇంకా కొన్ని పుస్తకాలను చూపి వాటిని గురించి పరిచయం చేస్తూ, వాటి లోని విషయాలను సంక్షిప్తంగా వివరించాడు. 'మహా ప్రస్థానం' చదివేశాడు.

జానకికి వాస్తవంగా వెలుగు కనిపించింది. పుస్తకాలను చదవాలని నిశ్చ యించుకొంది. పుస్తకాలు చదవడం బావకు యిష్టం కాబట్టి చదవాలనుకుంది. వెంటనే గుడ్లగూబ గుర్తుకు వచ్చింది. ధైర్యంచేసి అడిగేసింది 'గుడ్లగూబ ఏమిటని.'

నవ్వాడు రఘు. "పుస్తకాలు చదువు. నీకే అర్థ మవుతుంది. గుడ్లగూబ ఏమిటి? కాకులేమిటి? అది ఎలా బతుకుతుంది. కాకులను ఎలా చంపుతుంది?

కాకులూ తనకు తెలియనివి కావు. గుడ్లగూబ తనకు తెలియనిది కాదు. ఆ రెంటి మధ్యనున్న సందర్భం ఏమిటో – రహస్యం ఏమిటో తనకు తెలియదు. ఆ అర్థం వచ్చే చూపు చూచింది జానకి. అర్థం చేసుకున్నాడు రఘు. "అవును ఆరాటంగా ఉన్నది కద! అయితే చెప్పత విను" అని ప్రారంభించాడు.

"భారత యుద్ధం ఎరికేనా?"

తెలుసు నన్నట్టు తల ఊపింది జానకి. కథ వినడానికి ఆసక్తి కనబరుస్తూ కూర్చుంది.

ఆ యుద్ధం అయిపోయింది. దుర్యోధనుడు తొడలు విరిగి పడి ఉన్నడు. చావంగా మిగిలిన ముగ్గురు అశ్వత్థామ, కృపాచార్య, కృతవర్మలు వచ్చినరు. తొడలు విరిగిన రారాజును చూచినరు. దుఃఖపడినరు. అశ్వత్థామ పాండవులను నాశనం చేస్తనని శపథం చేసిండు. రారాజు సంతోషపడిండు. ముగ్గురు కలసి బయలుదేరిన్రు. తోవలో సాయంకాలం అయింది. ఒక మర్రిచెట్టుక్రింద పడు కున్నరు. ఇద్దరూ నిద్రపోయిన్రు. కాని అశ్వత్థామ నిద్రపోలేదు. పాండవులను ఎట్ల చంపాలెనా అని ఆలోచిస్తున్నడు. నిద్రరాలే. ఇంతట్లో ఆ చెట్టుమీదికి ఒక గుడ్లగూబ వచ్చింది. మర్రిచెట్టుమీదున్న కాకుల మెడలు కొరకసాగింది. అట్ల అన్ని కాకులను చంపింది. అప్పుడు అశ్వత్థామ ఆలోచించిండు. నిద్రలో ఉన్నయి గాబట్టి గుడ్లగూబ కాకులన్నింటిని చంపింది అనుకొని గుడ్లగూబవలె బయలుదేరిండు అశ్వత్థామ. పాంచాలు అందరిని చంపిండు. తెల్లారినాక అర్జునుడు అశ్వత్థామను పట్టుకొచ్చిండు.

"తెలిసిందా-తాసిల్దారు గుడ్లగూబ; ప్రజల అజ్ఞానం చీకటి. ఈ చీకటి ఉన్నంత సేపే తాసిల్దారు ఆటలు సాగుతాయి. అజ్ఞానం అనే చీకటి పోయి వెలుగువస్తే తాసిల్దారుగుడ్డివాడై పోతడు."

జానకి ఆ కథను గురించి ఇంకేదో అడుగుదా మనుకుంటుండగా తలుపు తట్టిన చప్పుడు అయింది. రఘు లేచి తలుపు తెరిచాడు. "రావచ్చునా నుండి లోపలికి" అన్నాడు ఒక అపరిచిత వ్యక్తి. రఘు జానకి వైపు చూచాడు. జానకి లోనికి వెళ్ళిపోయింది.

వచ్చిన వ్యక్తి బక్కపలచగా ఉన్నాడు. కోలముఖం కొనదేరిన ముక్కు, కళ్ళు చాలా పెద్దవి. వెంట్రుకలు పొడుగే అయినా సంస్కార హీనంగా ఉన్నాయి. బట్టలమీద అట్టే ధ్యాస ఉన్న వ్యక్తి కాదు. హాఫ్‌షర్టు వేసుకున్నాడు. వయసు ఇరవై–ఇరవై ఐదు ప్రాంతం.

గదిలో ప్రవేశించి తనను తానే పరిచయం చేసుకున్నాడు : "నమస్కార మండి. నా పేరు నాగేశం. అందరూ నగేశ్ అంటారు. ఈ జాగీర్లో పత్రిక చదివిటోణ్ణి నే నొక్కణ్ణే. మీ కొరకు పత్రిక తెచ్చిన" అని బొడ్లోంచి పత్రిక తీసి రఘుకు అందించాడు.

పత్రిక అందుకొని "థాంక్స్" అని పత్రిక విప్పి హెడ్‌లైన్సు చదివి పత్రిక మడిచిపెట్టి "నిలబడే ఉన్నరేమి? కూర్చోండి" అని కుర్చీ చూపించి "ఎట్ల తెచ్చిన్రు" అడిగాడు.

"రొండు కోసులున్నది ఖాల్సా. ఆడికి పత్రికలు వస్తయి. రోజూ ఆడికే పోయి చదివి వస్త. ఇయ్యాల మీకోసరం తెచ్చిన. ఇక రోజూ తెచ్చిస్త"

జానకి తన గదిలోకి వెళ్ళి మేనువాల్చిందనేకాని నిద్రపట్టలేదు. నాగేశ్‌ను చూస్తే ఆమెకు ఎందుకో భయం వేసింది. రఘు గదిలో జరిగే సంభాషణ వింటూంది.

"చాటుగనా"

"అవ్. మళ్ళ ఏం చేస్తము? ఆ జమాల్‌గాడు మిమ్ములను కొట్టిండట గద. వాణ్ణి చంపుత పొడిచేస్త. తయారగున్న ఇగొ జంబియా సుత తెచ్చిన'' అని బొడ్లోంచి జంబియా తీసి ఒరలోంచి లాగి రఘుకు చూపించాడు.

దీపం వెలుగుకు తళతళా మెరుస్తూంది జంబియా. అది రఘు గుండెలో మెరిసింది. కళ్ళలో మెరిసింది. మెదడులో మెరిసింది.

"చంపి?" ప్రశ్నించాడు రఘు.

"చంపి బెజవాడ పరారైత. ఒకని పీడ విరగడైతది. చంపుక తింటడు మందిని."

"మీరు చంపుతరు. పరారైతరు. తాసిల్దారు ఇక్కడున్నోళ్ళ ప్రాణాలు తీస్తడు, పగున్నోళ్ళందరిమీద పగ దీర్చుకుంటడు. ఏమి లాభమైతది?"

"అట్లయితే వాణ్ణి చంపుత. నేను చస్త. భగత్‌సింగ్‌నైత. జులుంచేసెటోణ్ణి చంపి చస్త. హాయిగా చస్త ఏమంటరు? అంతకంటే ఏమిచేయమంటరు?" ఆవేశంతో అన్నాడు. ఉద్రేకంలో ఉన్నాడు. వణికి పోతున్నాడు.

రఘు జంబియా తీసుకున్నాడు. ఒరలో పెట్టి దిండు కింద పెట్టాడు. లేచి తలుపు తీసి వచ్చాడు. తానొక సిగరెట్టు తీసుకొని నాగేశ్‌కు ఒకటి అందించాడు. ఇద్దరూ కాల్చుకున్నారు. నాగేశ్ కుర్చీలో కూర్చున్నాడు. రఘు సిగరెట్టు కాలుస్తు గదిలో పచార్లు చేయసాగాడు. నాగేశ్ ఆవేశంలో ఉన్నాడు. ప్రాణాలను సహితం అర్పించడానికి సిద్ధంగా ఉన్నాడు. అతనికి ఎలా చెప్పాలి. సరి అయిన మార్గంలో ఎలా పెట్టాలి? ఆలోచిస్తూ పచార్లు చేస్తున్నాడు. నాగేశ్ రఘును తదేకంగా చూస్తున్నాడు. అడుగులు వేస్తూనే "నాగేశ్‌గారూ !" అన్నాడు.

రఘు చెప్పే దాన్ని వినడానికి సంసిద్ధుడై కూర్చున్నాడు. రఘు అతని ఎదురుగా నుంచోని "నాగేశ్‌గారూ! మీరు చిత్తశుద్ధి గలవారు. అంత పెద్ద త్యాగం చేయటానికి తయారుగున్నరు. కాని ఆవేశంతో ఆలోచన రాదు. కాస్త ఆలోచించి చూడండి. జమాల్ను చంపుతరు. ఇంకొక జమాల్ వస్తడు. కాని, మీరు పోతే మీవంటి చిత్తశుద్ధి గలవాడు ఇంకొకడు వస్తడా? ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం

నుంచి నేతాజీ వరకు ఆవేశం వల్లనే ఉద్యమాలు కూలిపోయినవని. రత్నాలవంటి వీరులను కోల్పోయినది మన దేశం."

నేతాజీ తప్పుచేశాడంటే సహించలేకపోయాడు నాగేశ్. "దొంగలుండి అంగ్రేజోళ్ళు దోచుకుంటాన్రు. నీతులు చెప్పితే పోతారు న్రి? యుద్ధమే చేయాలె. ఒక్కొక్క తెల్లోణ్ణి పట్టుకొని కొరకొర మెడలు కోయాల్నండి" అని ఇంకేవో చెప్పాడు.

నేతాజీ ఫాసిస్టులతో కలవడాన్ని గురించి ఇద్దరూ తీవ్రంగా వాదించుకున్నారు. చివరకు "మాకు నీవు నేతాజీవి, అంగ్రేజోడు తాసిల్దారు. ఎక్కడో జరిగిందాన్ని గురించి మనం ఇంత తీవ్రంగా వాదించుకోవటం బాగుండలేదు. ఇప్పుడు మనం ఈ విషయం ఆలోచించాలే" అన్నాడు రఘు.

"మరి ఏం చేయమంటరో చెప్పండి. చంపమంటె తాసిల్దారునే పొడిచేస్త"

"చంపటం చావడం తప్ప మనకేమి తెల్వదా?" కాస్త ఉద్రేకంగానే అన్నాడు రఘు.

"వాండ్లు చేసెడిదది. వాండ్లకు తెలిసెడిదది. అట్లకాకుంటే మంత్రాలు చదువుడమ" ఉద్రేకంగానే జవాబు చెప్పాడు నాగేశ్.

ఇదంతా వింటున్న జానకికి వీళ్ళిద్దరే పోట్లాడుకునే టట్లనిపించింది. గుండె దడదడ లాడింది. వెళ్ళి తండ్రిని లేపుదా మనుకుంది. ఎవరిని ఎవరు చంపుకుంటారో అర్థం కాలేదు.

"నాగేశ్!" చిరునవ్వు నవ్వుతూ భుజం మీద చేయివేసి శాంతంగా అన్నాడు రఘు. అర్థం చేసుకో, చంపటం చావటం వ్యక్తులకు చెల్లుతుంది. అది జగడాలకు, ద్వేషాలకు, రోషాలకు, కావేషాలకు పరాకాష్ట. రక్తం చూచి రగులుతున్న ద్వేషం ఆరుతుంది. ప్రాణంతో పగ తీరుతుంది. అప్పటినుంచి మరొక పగ మొదలై, ఆ అగ్ని కుటుంబాలను తద్వారా వంశాలను అలుముకొని నాశనం చేసి వదులుతుంది.

"హింస పిరికితనానికి చిహ్నం. పలాయనానికి మరొక రూపం. అది ఉద్యమానికి బొత్తిగా పనికిరాదు."

"ఉద్యమం ఏది ? ఎక్కడ ? ఎవడు? ఏదీ లేదు. ఇది నా వ్యక్తిగతమైన పగ తీర్చుకుంట ; తేండి నా కత్తి నా దోవన నన్ను పోనీయండి. ఈ జీవితంలో మంచిపని చేయదలచిన, చేస్త. చావు అందరికి వస్తుంది. చస్త, తెండి నా కత్తి."

ఉద్రేకంలో ఉన్నాడు నాగేశ్. వణకిపోతున్నాడు. అతణ్ణి శాంతపరచడం ఎలాగో అర్థం కాలేదు. కత్తి తీసి చేతిలో పట్టుకొని "నాగేశ్ ఉద్యమం నిర్మించాలె. మన పోరాటం వ్యవస్థతోగాని వ్యక్తితో కాదు. అజ్ఞానంలో ఉన్న ఈ ప్రజలను వెన్నుతట్టి లేపాలె. వారు తమ హక్కులను తెలుసుకున్నారో ఈ వ్యవస్థ దానంతట అదే తోక ముడుస్తుంది. నీ వంటి వీరుడు, నిస్వార్థపరుడు ఒక్కడుంటే ఉద్యమాన్ని నిర్మించి ఆ అగ్నిలో వీరు శలభాలవలె కాలిపోవటం చూచి ఆనంద

చాష్పం రాల్చగలను. కాక నీవు ఒక్కణ్ణి చంపి బలి అవుతా నంటావా? ఉద్యమాన్ని బలిపెట్టిన వానివి అవుతవు. ఈ వ్యవస్థ ఇట్లనే ఉంటది. ఈ దోపిడి ఆగదు. ఈ ప్రజ ఇట్లనే నశిస్తరు. నువ్వు చంపుతనంటవ ఉద్యమం పుట్టకనే చస్తది. నువ్వు చంపనంటవ ఉద్యమం పుట్టి పెరిగి నువ్వు చంపుతున్న వ్యవస్థను చంపుతది. ఈం ఇదిగో జంబియా! అందుకో. ఒక నిర్ణయానికిరా. నువ్వు చంపడానికి నిర్ణయించు కుంటె, పద, నేను నీ వెంట వస్త. ఇద్దరం బలి అవుదం."

నాగేశ్ తలవంచి మౌనంగా నుంచున్నాడు. రఘు జంబియా కుర్చీమీద పెట్టి సిగరెట్టు వెలిగించి పొగ వూదుతూ మంచంలో కూలబడ్డాడు.

మౌనం వెలిసింది. గదిలో నిశ్శబ్దత ఆవహించింది. పక్కగదిలో ఉన్న కానకికి ఇదంతా వింతగా తోచింది. ఒక నేల చెక్కకోసం, ఒక గేదెకోసరం, ఒక పట్టుదలకోసరం పోట్లాడుకొని ప్రాణాలు తీసుకున్న కథలు తాను కన్నది, విన్నది. కాని ఇదేమిటో ఎవరికోసమో పక్క గదిలో ఉన్న ఇద్దరు పోట్లాడుకుంటున్నారు!

రఘు గదిలో లాంతరు మూడుసార్లు భగ్గుమని ఆరిపోయింది. గదిలో ఉన్న రెండు ప్రాణులూ ఆలోచనలో నిమగ్నమై ఉన్నాయి. ఎవరూ గమనించలేదు. ఆలోచనలనుంచి మొదలు తేరుకున్న వాడు రఘు. చీకటి చూచి అగ్గిపుల్ల గీచి లాంతరు వెలిగించాడు. లాంతరు అందుకొని నాగేశ్‌ను చూచాడు.

నాగేశ్ కుర్చీలో కూర్చున్నాడు. ధారాపాతంగా కన్నీరు కారిపోతూంది. రఘు కరిగిపోయాడు. "నాగేశ్! ఎందుకట్ల ఏడుస్తవు?" అడిగాడు. నాగేశ్ లేచి నుంచున్నాడు, చేతులు జోడించాడు. కన్నీరు టపటప రాలుస్తూనే డగ్గుత్తికతో అన్నాడు.

"భాయ్ జాన్! మీ విశ్వరూపం చూచిన. ప్రాణులమీద ఎంత దయ మీకు! ఉద్యమంమీద ఎంత అభిమానం! మీ దగ్గరికి రాకుంటే రెండు నిండు ప్రాణాలు బలి అయ్యేవి. నేను ఆవేశంలో కొట్టుకపోయిన. నిజమైన మార్గం చూపినవు" అని రఘు చేతులు గట్టిగా పట్టుకొని— "నీవు కృష్ణునివి. నేను అర్జునుణ్ణి, సాగించు కురుక్షేత్ర సంగ్రామం. ఈ నాటికి నాయకుడు దొరికిండు, ఆజ్ఞాపించు. అగ్గిలో దూకుత" అని జంబియాతీసి బయట విసరబోయాడు. రఘు జంబియా తీసుకున్నాడు. "ఉంచుదాం. ఎన్నటికైన పనికిరావచ్చు" అని దాన్ని దిండు క్రింద దాచాడు.

"అన్నా! ఇప్పుడు చెప్పు ఏం చేయమంటవు?" అడిగాడు నాగేశ్.

"తమ్ముడూ! ప్రజలలో విజ్ఞానం వెదజల్లాలె. వారిని మేల్కొల్పాలె. నువ్వు వైతాళికుడవు"

"నన్నేమి చేయమంటావో చెప్పు. నువ్వు అంతోనివి, ఇంతోనివి అనకు"

"చదువు చెప్పాలె పీడితులకు తాడితులకు. వారిలో చైతన్యం కలిగించాలె. వారు మేలుకుంటే చాలు, వారే నాయకులు అవుతారు. మనం వారిని అనుసరించాలె అంతే."

"వడ్డెర గూడెంలో బడి పెట్టిన. రాత్రి బడి. వయోజనులకు చదువు చెప్పుతున్న చాటుంగ."

"చదువంటే అక్షరాలుకాదు అరటి ఆవు కాదు. అసలు అక్షరంలో ఏమీలేదు. ప్రపంచజ్ఞానం కలిగించాలె. నేనుకూడా వడ్డెర గూడానికి వస్త రేపట్నుంచి."

"మీరా! వడ్డెర గూడేనికి వస్తరా!" ఆశ్చర్యంగా అడిగాడు నాగేశ్.

"ఏమి నేను మనిషిని కానా? రేపట్నుంచి నన్నుకూడ పిల్చుకపో."

"సరె. మరి వస్త. శాన రాత్రయింది." అని వెళ్ళిపోయాడు నాగేశ్. అప్పటికి చంద్రుడు వచ్చేశాడు. నాగేశ్ మనసులోలాగే మహినిండా వెన్నెల పరచుకుంది.

రఘు సిగరెట్టు వెలిగించి మంచంమీద మేను వాల్చాడు. అతని మనసు కూడా తేలిగ్గా వుంది. కన్ను మలిగింది.

జానకికి నిద్ర పట్టలేదు. ఆవిడకు వారిద్దరి సంభాషణ ఇంకా వినిపిస్తున్నట్లే వుంది. ఇంకా ఆమె మెదడులో రింగుమంటూనే ఉంది. కొత్తగా ఆమెకు పరిచయం అయినాడు నాగేశ్! బక్కపల్చగా పొట్టిగా వున్న ఆ వ్యక్తి ఎంత ఉద్రేకం కనబర చాడు! అతని పంథా సరియైనది అనిపించింది ఆమెకు. తాసిల్దారును ఒక్కపోటుతో చంపేస్తే పీడ విరగడైపోయేది. రఘు వాదన ఆమె కేమీ నచ్చలేదు. నాగేశ్ ఎండు కలా లొంగిపోయాడు. నాగేశ్ గెలవాల్సింది. బావ తన బావ ఓడిపోవాలనుకుంటుందా? అవును ఓడిపోవాలి. నాగేశ్ జానకి మనసులో చోటు చేసుకున్నాడు.

*  *  *  *

తెల్లవారి తండ్రికి చాయ్ అందిస్తూ అడిగింది.

"నాయ్నా! గుడ్లగూబంటే అర్థం తెలిసినాది?" అని.

"తెలిసిందమ్మా. తెలిసింది. రఘు చెప్పినది అక్షరాలా నిజం, కాని అపదలు కొని తెచ్చుకుంటున్నడు, మన మేం చేస్తం?"

రాత్రి జరిగిన విషయాలూ, నాగేశ్ ఉద్రేకమూ తండ్రికి వివరింతా మనుకుంది. తండ్రి మరికొంత చాయ్ అడుగుతే తేవడానికి లోనికి వెళ్ళిపోయింది.

## 2

తాసిల్దారుకు ఒక వింత కోరిక కలిగింది. అతని ఇల్లు లంకంతది. అయినా అది అందంగా కనిపించలే దతనికి. అందమైన ఒక మహా భవనం నిర్మించాలను కున్నాడు. నాలుగంతస్తుల భవనం నిర్మించాలనుకున్నాడు. సుందర హర్మ్యం నిర్మించుకోవా లనుకున్నాడు. తన తరవాత తనకీర్తి శాశ్వతంగా ఆ భవనంలో నిలిచి ఉండాలనుకున్నాడు. మంచి చేయలేనివాడు మంచి భవనాలు కడ్తాడు. అవన్నా తనను బ్రతికిస్తాయని ఆశిస్తాడు. అందుకే ఆ చుట్టుపట్లలోనే కాదు, హైద్రాబాదులో సైతం లేనటువంటి భవనం నిర్మించాలనుకున్నాడు. నవాబులకు

స్వైతం కన్నుకుట్టాలనుకున్నాడు. ఈ భవనాన్ని చూడడానికి దూర దూరాలనుంచి జనం రావాలనుకున్నాడు. ప్రత్యేకంగా హైదరాబాదునుండి వాస్తు శాస్త్రజ్ఞులను పిలిపించాడు. వారికి విడిది భోజనపు ఖర్చులు షావుకార్లు భరిస్తున్నారు. ప్లాను సిద్ధం అయింది. అందులోనే భవనం ఎంతో అందంగా కనిపించింది. తాసిల్దారు మురిసిపోయాడు. ముస్లిం వాస్తుశాస్త్రం ప్రకారం కమానులు, గుంబంద్‌లూ ఉన్నా, అన్నింటినీ మించి అతనిని ఆకర్షించింది అంగణంలో అమర్చదలచిన హిందూ దేవాలయాల స్తంభాలు. అంగణం చాలా విశాలంగా ఉంది. అచ్చం దేవాలయ స్తంభాల మీదనే నిలిచి ఉన్నది. ఆ ఆలోచన తనకు వచ్చిందే. అందు కెంతో మురిసిపోయాడు. ఈ పేరుమీద దేవాలయాలను కూల్చవచ్చునని సంతోషించాడు. తనకు ఎదురు చెప్పే వాడుండడని అతనికి తెలుసు. అందరినీ పిలిపించాడు తాసిల్దారు. అంగణం జనంతో నిండి ఉంది. సాహుకార్లను మోతుబరి రైతులను మాత్రమే పిలిపించాడు.

కులశేఖరరావుగారికి ప్రత్యేకంగా వివరించి చెపుతున్నాడు తాసిల్దారు. కులశేఖరరావు ఆ జాగీరుకు గిర్దావరు—అంటే రెవెన్యూ ఇనస్పెక్టర్. తాసిల్దారు క్రిందివాడు. అతనికి ఆంతరంగికుడు. తాసిల్దారుకు చదివి వినిపించేది, అతడు వ్రాయమన్నట్లు రాసేది అతడే. అతడు బ్రాహ్మడు. అందుకేఅ తనికి వివరిస్తున్నాడు తాసిల్దార్. అతడు ఒప్పుకుంటే ఇతరులు కాదనడానికి వీలుండదు. కాదనడానికి గిర్దావరుకు గుండెలుండవు. అదీ తాసిల్దారు ఎత్తుగడ.

"చూచినవా నఖ్వా. ఇవి కమానులు. వాటికింద ఉన్నవి దేవళ్ళ ఖంబాలు"

కులశేఖరరావుగారి మనస్సు కలుక్కుమన్నది. దేవాలయాల్లో పూజలులేవు. జీర్ణమై ఉన్నాయి. నిజమే కాని వాటి స్తంభాలు విరకొట్టి తెచ్చి తురకవాని ఇంటికి పెట్టుకోవడం! అనేక దేవాలయాలు అప్పటికే కూలిపోయాయి. గోపాలస్వామి దేవాలయం బాపతు స్తంభాలు, విగ్రహాలు అప్పటికే ఊరినిండా, ఊరి బయటా పడి ఉన్నాయి. వాటిమీద జనం కూర్చుంటారు. ఇంకేవేవో చేస్తున్నారు. ఇప్పుడు దేవాలయాలకు ఈ గతి పట్టింది. అవీ ప్రతాపరుద్ర చక్రవర్తి నిర్మించినవి! ఇలాంటివే ఇంకేవేవో ఆలోచనలు వచ్చాయి. అయినా అణచి పెట్టుకున్నాడు గిర్దావరు.

"పాడుపడ్డ దేవుళ్ళ ఉండి మాత్రం ఏం ఫాయిదా! అందుకనే ఈ ఆలోచన చేషిన, ఏమంటవ్?" అడిగాడు తాసిల్దారు గిర్దావరును.

గిర్దావరుకు ఏం జవాబు చెప్పాలో తోచలేదు. తికమకపడ్డాడు. జనం యావత్తూ అతని వైపే చూడసాగారు. బుడిబిలోపడ్డ ఎలుకలా కొట్టుకోసాగింది అతని మనస్సు. ఒకవైపు ఉద్యోగము, తన జీవితం, అధికారం, ఒకవైపు మతం, తన విశ్వాసం—తన దేవుళ్ళు, ఏం చెయ్యాలి! ఏది వదులుకోవాలి? మతం మైనపు బొమ్మలాంటిది. అది కరుగుతుంది. మళ్ళీ గడ్డ కడుతుంది. ఆ బొమ్మ కాకుంటే మరో బొమ్మ తయారవు

తుంది. ఉద్యోగం ప్రాణం లాంటిది. అది పోతే మళ్ళీ రాదు. కాక ఈ అధికారప్ప అండన తానెన్నో కొంపలు కూల్చాడు. తన కొంప నిలపెట్టుకున్నాడు. అది పోతే తనను నిలువునా నరుకుతారు జనం. కాకులు గద్దలవలె పొడుచుకు తింటారు. తన అధికారం తాసిల్దారు అండన మాత్రమే సాగగలదు. అందుకే అతనికి తాను అండగా నిలవాలి. బాసట కావాలి అనుకున్నాడు. అన్నాడు :–

"సర్కార్! మీరు శాన మంచిగ ఆలోచించిను. దేవుడుంటేనే గుడి. దేవుడు లేనిది గుడికాదు. పాడుకొంప. పాడుకొంపను కూల్చటం తప్పుకాదు సర్కార్! అదికాక మీరు స్తంభాలను బంగళాకు చేరుస్తున్నరు. అందువల్ల హిందూ ముస్లిములు సర్కారుకు రెండు కళ్ళు అన్నట్టు అయితది. ఇందులో ఏతరాజ్[1] ఎవరికి లేదు సర్కార్" అని తలవంచుకున్నాడు.

తాసిల్దారు ఉరిమాడు.

"ఇగో మజహబీ[2] మాటలు మా దగ్గర తేవద్దు. హిందూలు ముసల్మానులు ఒక్కటెట్లయితరు. తాసిల్దార్ ముసల్మాన్, జాగీర్దార్ సాబ్ ముసల్మాన్. మన హుజూర్ ముసల్మాన్. సర్కార్ ముసల్మాన్లది. ప్రజలు హిందూలు. అట్లను ఒప్పుకుంట. ఏమంటవ్?"

ఏ మంటాడు గిర్దావరు? అనాల్సిందే అన్నాడు.

"అంతే సర్కార్ అసల్ సిసల్ మాట చెప్పింద్రు. హం గులాం. ఆప్ సర్కార్. అందుకే మీరు స్తంభాలు పెట్టుకోవచ్చునన్న సర్కార్. మా ఏతరాజ్ ఏంది, ఎంత్ల?"

చాలా గొప్పమాటన్నట్లు జనంవైపు చూచాడు. వారూ అందుకు సంతోషించి నట్లే కనిపించారు.

"సరే. ఖంబాలుఖ్డయించి * తెస్తం. కాదన్నోడు లేడు కద! బంగ్లా కట్టాల్నంటే బన్యాగాండ్ల మద్దతు కావాలె. ఇగ చెప్పుని ఎంతెంతిస్తరో! దోచుక తింటలేరా జనాన్ని?" సాహుకార్లపైన విసురు విసరాడు తాసిల్దారు. తన పని అయిపోయిందని తెలుసుకున్న గిర్దావరు బయటకి వచ్చి సిగరెట్టు కాల్చి గట్టిగా దమ్ములాగి లోలోన తాసిల్దారును తిట్టుకున్నాడు.

సాహుకార్లు ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు. అంతా వెంకయ్యనే చెప్పవలసిందని ప్రోత్సహించారు. వెంకయ్య నీళ్ళు నమిలాడు. వాస్తవంగా తాసిల్దారు లేకుంటే తాను బ్రతకలేడు. అప్పులు పెట్టాలన్నా వసూలు చేసుకోవాలన్నా అతడే నాథుడు. అతణ్ణి కాదంటే బాకీలన్నీ ఎక్కొట్టించవచ్చు. కాదన్తే వాడెవడు? ఆలోచించే అన్నాడు వెంకయ్య.

---

1. అభ్యంతరం 2. మతపు మాటలు.

* స్తంభాలు ఊరు పెరికి

"హుజూర్! బండ్లకయ్యే కర్చేమిటి! వడ్డెరోళ్ళు రాయి ఎట్టికి కొట్టిరి. ఇటిక చేసేటోడు ఎట్టికి చేసె. కోయోండ్లు కల్పకొట్టి తెచ్చిరి. సుతారోండ్లు ఎట్టికి పని చేసిరి. ఇక ఎటుపడి పట్నంకెల్లి వచ్చినోండ్ల కర్చు కోమటోండ్ల నెత్తినేసుకుంటం. కాలం మారింది సర్కార్. బాకీలు వసూలు అయితలేవు. జర బెదిరించాలె." వెంకయ్య తెలివిని సాహుకార్లు మెచ్చుకున్నారు. కాని తాసిల్దారు మరో ఉచ్చు వేశాడు.

"ఎట్టి పోంగ ఎంత కర్చయితే అంత కోమటోండ్లు పెట్టుకోవాలె"

"తప్పుతాదుండి" అన్నారంతా ముక్తాకంఠంగా.

అంతటితో ఆ తతంగం ముగిసింది.

ఇండ్లకు వెళ్ళేటప్పుడు అంతా తిట్టుకున్నారు తాసిల్దారును మనసుల్లో. గిర్దావరును సయితం తిట్టారు కొంత బయటికి. గుళ్ళు కూల్చడంవల్ల ఊరికి ఏమన్నా వస్తుందేమోనని భయపడ్డారు. కాదంటే తాసిల్దారు మంత్రాల భయం. రక్తం కక్కుకు చావల్సిందేనని నమ్మకం.

ఒకసారి జాగీర్దారు వేటకు వస్తానని వార్త పంపాడు. రావడం అంటే ఒక్కడు వస్తాడా? ఒక కుటుంబం వస్తుందా? ఒక రైలుకు రైలు దిగుతుంది. వంట వాళ్ళు, బాజాలవాళ్ళు, మంగళ్ళు, చాకళ్ళు, మిత్రులు, బంధువులు ఊరంతా వారిలో నిండిపోతుండె. ఆ బలగాన్ని మేపాలి. మరి తాసిల్దారు ఎందుకు మేపుతాడు? నవాబ్‌గారి వేటసుంకం వసూలు చేయమన్నాడు అధికారం యిచ్చాడు. గిర్దావరును పంపాడు పల్లెకు, కోయగూడాలకు. వెంట అమీనును యిచ్చి పంపాడు. నలుగురు పోలీసులు లొట్టి తుపాకులతో కదిలారు. సుంకం వసూలు చేశారు బోలెడు. ఇవ్వలేని వారికి బండ లెత్తారు. కట్టుగొయ్యలకు కట్టారు. పశువులు పట్టారు. జనం కన్నీరు కార్చారు. రక్తం ఒడిపారు. సుంకంలో కొంత గిర్దావరు సొంతం. అమీను కాజేసింది కాక తాసిల్దారుకు చేరిందే బోలెడు.

సుంకం సంగతి అలా వుండగా మళ్ళీ వెట్టి. జాగీర్దారు పటాలం దిగకముందే ఏర్పాట్లు జరిగాయి. గౌండ్లు తాటాకు కొట్టారు. కోసులు వాసాలు కొట్టి తెచ్చారు. బండ్లు ఎట్టికి కట్టారు రైతులు. వ్యాపారస్తులు బిర్యానీకి, పలావుకు అయిన సామాగ్రి ఉచితంగా యివ్వాలి. గొల్లవారు గొర్రెలు ఇవ్వాలి. మంగళ్ళు మసాలాలూ నూరాలి. చాకళ్ళు మేనాలు మోయాలి. దేగిచాలు తోమాలి. ఊరంతా వెట్టి చేయాలి—అధికార్లు తప్ప. అధికారులకు అది పండుగ. వారికి విందులు, తాగుడు, ఆటలు, పాటలు అన్నీ పట్నపు తరహాలో.

... రసాలు బాగైనాయి. పందిళ్ళు వేయబడ్డాయి. జాగీర్దారు వారి స్పెషల్ దిగింది. అధికారులు వారికి స్వాగతం పలికారు. దండు దిగింది. దండిగా విందులు జరిగాయి. మంచినీరు కూడా జాగీర్దారువారికి పట్నం నుంచి రావాలి! నైజాం

నవాబు లండన్ వెళితే నీరు హైదరాబాదు నుండి వెళ్ళిందట! ఊరంతా కటాన కదిలింది. గొల్లవారి గొర్రెలు తెగాయి. వ్యాపారస్తుల సామాగ్రి ఉడికింది. పట్నం నుంచి వచ్చిన సారాయి ప్రవహించింది. గానా బజానా ముషాయిరాలతో గ్రామం మారు మ్రోగింది.

జాగీర్దారుగారు వేటకు బయలుదేరారు. తెరలు కట్టిన మేనాల్లో బేగమ్‌లు బయలుదేరారు. బండ్లు, పల్లకీలు, డప్పులు, బాజాలు అడవిలో పట్నం వెలిసింది. కోయలు మంచెలు కట్టారు. జాగీర్దారుగారు పులిని కొడ్తారు. ఆ వేడ్క చూడ్డానికి పట్నంనుండి జనం వచ్చారు—నవాబుగారు తెచ్చారు తమ తమ ప్రతాపం చూప డానికి.

నవాబు బేగం సహితంగా మంచె నెక్కారు. అది బాగా ఎత్తున కట్టబడింది. పులికి అందకుండా కట్టబడింది. కోయలు గుంపులు, గుంపులుగా వర్తులాకారంగా చేరారు. డప్పులు కొట్టి, కొమ్ములు, బూరలు ఊది రొప్పుతున్నారు. పులి గాండ్రు మంటూంది. కోపంతో పంజా కొడ్తూంది. కొట్టినప్పుడల్లా ఒక కోయ ఒరుగు తున్నాడు. అతడు పులిని ఒక్క వ్రేటుకు కొట్టగలడు అయినా కొట్టరాదు. దాన్ని జాగీర్దారు కొట్టాలి.

మంచెమీద వున్న బేగం పరిహాసాలు ఆడారు. నవాబుగారి సూటినే శంకిం చారు. వారు పులిని కొట్టలేరన్నది. నవాబుగారికి రోషం హెచ్చింది. దేన్ని కొట్ట మన్నారో చెప్పమన్నారు. వేలుపెట్టి చూపింది బేగం. అతడొక కోయ యువకుడు, రొప్పుతున్నాడు. గురి పెట్టారు నవాబుగారు. తుపాకి పేలింది. ఆ యువకుని తల లోంచి దూసుకుపోయింది. బేగం నవాబును కౌగిలించుకుంది. అక్కడ చేరిన వారంతా నవాబును మెచ్చుకున్నారు. చప్పట్లు కొట్టారు. కవులు పద్యాలు చెప్పే శారు. రక్తం మడుగులోపడి కొట్టుకుంటున్నవాడు ఏ కవికీ కనిపించలేదు. రొప్పటం సాగుతూనే వుంది. పులి రానే వచ్చింది. మంచెవైపు అమాంతం ఎగిరింది. నవాబు గారి తుపాకి పేలింది. గురి తప్పింది. పులితొడకు తాకింది. పులి క్రోధంతో హొంగింది. కనిపించిన వాణ్ణల్లా కొట్టింది. కోయలు ఈటెలతో పొడిచారు. తుపాకు లతో కొట్టారు. పులి కూలింది.

ఒరిగింది. గుర్రుమంటూ పడిపోయింది. నవాబు వేట ముగిసింది. చెమటలు పట్టాయి వారికి. బట్టలు తడిశాయి. వేరే దుస్తులు వేసుకొని తుపాకితో పులి పక్కన నుంచొని ఫోటోలు తీయించుకున్నారు. పులిని తెచ్చారు. పెద్ద విందులు చేశారు. పత్రికల్లో వారి బొమ్మ వచ్చింది. వారు పట్నం చేరారు.

నవాబుగారు వెళ్ళిపోయేప్పుడు తమకు అయిన ఖర్చంతా తాసిల్దారుకు యిచ్చి వెళ్ళారని వదంతి బయలుదేరింది. అయినా అడిగే ధైర్యం ఎవరికీ కలుగలేదు. గొల్ల మల్లన్నమాత్రం ధైర్యం చేసి తాసిల్దారు దగ్గరకు వెళ్ళాడు. మందలన్నీ అయి పోయినాయనీ, తాను దివాళా తీశాననీ, కొంత కాకుంటే కొంత అయినా యివ్వమనీ

వేడుకున్నాడట; తాసిల్దారు కోపగించలేదట. తెల్లవారివచ్చి తీసికెళ్ళ మన్నాట్ట. ఆ రాత్రి అతడు రక్తం కక్కుకొని చచ్చాడట !

ఆ తరువాత ఎన్నడూ తాసిల్దారు అన్నదానికి అడ్డు చెప్పలేదు. 'ఇవ్వను' అనలేదు. అనలేకపోతున్నారు. ఇప్పుడు మాత్రం ఎలా అనగలరు ?

మరుసటి రోజునుంచి బంగళా నిర్మాణపు ప్రయత్నాలు ప్రారంభమయినాయి గిర్దావరును అన్నింటికీ బాధ్యుణ్ణి చేశాడు తాసిల్దారు. అవసరం అవుతే ఆమీను సహాయం పొందుతున్నాడు. తొలుత కావలసింది రాయి. రాయి కొట్టేవారు వడ్డెర్లు. వడ్డెర్లను పిలిపించాడు గిర్దావరు. పీరయ్యను ముందుంచుకొని వడ్డెర గూడెం కదిలింది. రానివాడు ఒక్క భీముడు. అతడు పీరయ్య కొడుకు. వట్టి సోమరి. పని చేయడు. తాగుడు ముండలు తప్ప వేరే లోకం లేదతనికి. అతన్ని వదులుకున్నాడు పీరయ్య. తన కొడుకు కాదనుకున్నాడు. అసలు గూడెమే వదులుకున్నది భీమన్నను. కొడుకు ఇలా అయినాడు. కూతురును తాసిల్దార్ పట్టుకుపోయాడు. దుఃఖంతో కుమిలిపోతున్నాడు పీరయ్య. అయినా కులంతో కదిలాడు.

వడ్డెర్లు గిర్దావరు ఇంటికి చేరారు. ఇంటిముందు కూలబడ్డారు. ఎంతో సేప టికిగాని గిర్దావరు బయట పడలేదు. రావడం రావడమే అన్నాడు "అరె లంజకొడుకుల్లారా! తాసిల్దారు దొర బంగ్ల కడ్తాండు. రాయి కొట్టిపెట్టాలె. నఖ్రాల్జేస్తిరో నల్లులాలె నలిపేస్త. కుక్కల పేలోలె పడుండ్రని. రాయి కొట్టుండి. పైసడిగిర్రో చింత చెట్టుకు కట్టి తోళ్ళొలిపిస్త. పని రేపటినుండి మొదలు పెట్టాలె. ఏమంటరు? గుడిసె కైదు రూపాయలు. రేపు పొద్దుగూకెటాలెకల్ల నాకు చేరాలె. ఇయ్యనోణ్ణి తాసిల్దార్ దొరముందర పెట్త. రాయి కొట్టనంటున్నడంట. ఇగ పానా లుండ వనుకో. పీనిగల బొందలకు పోతరు. ఏమంటరు?"

"చేస్తం. నీ కాల్మొక్త. తప్పుతాది. బాంచను. ఊళ్ళ ఉంటాన్నం. దున్నుక బతుకుతున్నాం. గులాపోణ్ణి దొరా! నీ బాంచను, తోళ్ళవలిచి చెప్పులు కుత్త. ఎంతియ్యమంటె అంతిస్త, గులాపోణ్ణి. పోరిని పట్కపోయిన్రు" పీరయ్య గొంతు దుఃఖంతో పూడుకుపోయింది. మాట పెకలలేదు. కళ్ళవెంట ధారాపాతంగా నీరు వస్తూంది. "ఒక్కతే బిడ్డ దొరా, దాన్ని పట్క పోయిన్రు. కాల్మొక్త. ఒక్కసాటి చూస్త దొర మల్లిని. నా మల్లిని. ఒక్కసారి చూపించు నీ కడుపున పుడ్త;" అని గిర్దావర్ కాళ్ళమీద పడ్డాడు. కాళ్ళను కన్నీళ్ళతో తడిపాడు. కాళ్ళ మీదనుంచి తల కదపలేదు. కాళ్ళు విడవలేదు.

గిర్దావర్ కులశేఖరరావు మాత్రం కరగలేదు. అతని ఎదలో కదిలే పదార్థం వున్న జాడ ఎక్కడా కనిపించలేదు. అతని ఆలోచన మరోవేపు పరిగెత్తింది. పీరయ్య దగ్గర కొంత కాజేయవచ్చు. ఈ విషయంలో తాసిల్దారు తన మాట వినడని తెలుసు. అయినా వస్తున్నది ఎందుకు వదులుకోవాలి.

"అరే పిరిగా లే. చూద్దం రేపు, నజ్రానా పట్టుకు రా, చెప్పి చూస్తం" అన్నాడు.

ఆశ అంకురించింది పీరయ్యలో. "దొరా మీరు ధర్మదొరలు. ఇయ్యాలనే తెస్త దొరా? రేపటిదా కెందుకు, మల్లి నా మల్లిని చూడాలె దొరా! కావాల్నంటే, నీ బాంచను. పానాలిస్త" అన్నాడు.

"అట్లనే పోరి. రేపటినుంచి రాయికొట్టాలె. లేకుంటే పానాల్తీస్త" అన్నాడు.

"అట్లనే బాంచను. కొడ్తం. కాల్మొక్త" అని అంతా వెళ్ళిపోయారు.

ఆ సాయంకాలమే ఉన్న తృణమో పణమో తాకట్టుపెట్టి నజ్రానా అందించాడు పీరయ్య గిర్దావర్‌కు. గిర్దావర్ గంభీరంగానే ఉన్నాడు. తాసిల్దారుకు చెపుతానన్నాడు. కాని తాసిల్దారుకు అది చాలదన్నాడు. కాళ్ళూ కడుపులూ పట్టుకొని బ్రతిమిలాడాడు పీరయ్య. పుట్టిన పోరడు పోయాడన్నాడు. తన భార్య పీరమ్మ మంచం పట్టిందన్నాడు. వైద్యానికి కూడా డబ్బులేదన్నాడు. ఏదో విధంగా ముట్ట చెపుతానన్నాడు. మల్లిని ఒక్కసారి చూపించమన్నాడు. మల్లి తల్లి బ్రతికిపోతుందన్నాడు. రక్షించవలసిందన్నాడు. తల గడపకు కొట్టుకున్నాడు. రక్తం చూచి గిర్దావరు కరుగుతాడనుకున్నాడు. అంతకు మించి ఏమీ చేయలేకపోయాడు. అయినా గిర్దావరు నుంచి ఒక సాంత్వన వాక్యం రాలేదు.

"మంది తెలివి మీరుపోత్రాను. తాసిల్దార్ బంగ్లకు పోయింది మల్లి వచ్చినాదిరా ? బుద్దులు పుడుతున్నాయి మీకు. ఇది బాగుపడేటందుక్కు రాలేదురా! యాది లేదు గౌండ్ల పుల్లిని దొర తెచ్చుకుంటే దాని మొగుడు గడబిడ చేసేవాణ్ణి "లాల్ ఖాన్"కు కట్టి చావగొట్టి పీన్గెల బొందలెయ్యలె. సర్కారంటే బయం లేకుండా పోతోంది. ఇంత ధైర్యం చేస్తావుర మల్లిని చూస్తనని వస్తావు?"

పీరయ్య బిక్కచచ్చిపోయాడు. ఆశ అంతరించింది. రోషం రావలసింది. క్రోధం పొంగాల్సింది కాని, దుఃఖం వచ్చింది. "దొరా నీ కాల్మొక్త, ఎట్లనన్న చెయ్యి. ఒక్కసారి చూస్త. బంగ్లల్నే ఉంచమను బయటికెల్లి చూసొస్త. ముసల్ది చూస్తది, గులాపోణ్ణి. గుండె పగిలింది దొరా. బ్రతికేటట్లు లేదు. బాంచను." అని ఎదలోని రక్తంతో తడిసి బయట పడిన పలుకులు, దుఃఖపు మాటలు, బాధల బంధాలు వాటితోనే పీరయ్య ఊపిరి బయట పడింది.

"సరే చూస్తంలే మల్లరా" గిర్దావరు అన్నాడు. అవి శూలాలు అయినా వాటిలో ఏదో ఆశను చూచాడు పీరయ్య. అతడు గిర్దావరు కాళ్ళు పట్టుకున్నాడు. "ఎట్లనన్న చూడురి" అని వెళ్ళిపోయాడు.

ఆ తరువాత చాలా సార్లు వచ్చాడు పీరయ్య.

గిర్దావరు కనిపించనే లేదు. కనిపిస్తే కసిరాడే కాని జవాబు చెప్పలేదు.

గిర్దావరుకు తీరుబాటు లేకుండా ఉంది. ఇటుక చేసే వాళ్ళతో, సున్నం కాల్చేవాళ్ళతో, బండ్లవాళ్ళతో, కూలీలతో, తాపీ పనివాళ్ళతో, వెట్టి చేయించడానికి

ఒప్పిస్తున్నాడు. బెదిరిస్తున్నాడు, తన మామూళ్ళ వసూలు చేసుకుంటున్నాడు. అతనికి చాలా ఆనందంగా ఉంది. తాసిల్దారు బంగళా ఎప్పటిలో కాని తన జొక్కాసం నిండుతూంది. వెట్టిచేయని వాళ్ళ దగ్గర ఎక్కువా, చేసేవాళ్ళదగ్గర తక్కువా, మొత్తానికి తన పనే బాగుందనుకున్నాడు. అధికారం అమీనుకంటే తనదే ఎక్కువ నడుస్తూంది. మురిసిపోయాడు మీసం మెలేశాడు.

గిర్దావరు కులశేఖరరావుగారు ఠీవిగా, కొత్తగా చేతికి వచ్చిన కర్రతో తాసిల్దారు ఇంటివైపు బయలుదేరారు. దారిలో చాలామంది వంగి దండాలు పెట్టారు. వారిని చీత్కారంగా చూచాడు గిర్దావరు. తాసిల్దారు బంగళా చేరేవరకు ముగ్గులు పోసిన చోట పునాదులు తవ్వుతున్నారు. దాని పర్యవేక్షణ చేశారు. అక్కడ్నుంచి బయలుదేరితే వడ్డెర్లు బండ్లతో రాయి తెచ్చివేస్తున్నారు. ఏదో నెపంతో వారిని బూతులు తిట్టాడు. ఇంతలో పీరయ్య కనిపించాడు దూరంగా. సగం అయినాడు మనిషి. ఎముకలే మిగిలాయి. ఎక్కడో ఏకోశానో జలి కలిగినట్లయింది. ఇంతలో ఎవడో అప్పులవాడు వెంటపడ్డట్టనిపించింది. వెంటనే తాసిల్దారు దర్వాజా లోకి దూరాడు. తాసిల్దార్ కనిపించాడు, తీరిగ్గా కూర్చున్నాడు. హుక్కా పీలుస్తు న్నాడు. అతన్ని చూసి గిర్దావరు గుండె 'ధడల్లు' మన్నది. తాను ఈ రోజు మంచి దుస్తుల్లో వున్నాడు. చేతిలో కర్రవుంది. ముఖంలో ఏదో ఠీవి ఉంది. తాసిల్దారు వీటిని సహించడు. ఈ విషయం తనకు తెలుసు. అందుకే గుండెదడ పుట్టింది. సవినయంగా మూడుసార్లు సలాం చేశాడు.

"ఆదాబ్ గిర్దావర్ సాబ్! ఏమో శాన జోరుగున్నవు" అని మనిషిని ఎగాదిగా చూశాడు తాసిల్దారు.

"ఏమ్‌లేదు సర్కార్. మంది మాటింటలేదు. అందుకే కర్ర పట్టుకున్న."

"అయితే, సర్కార్ చలాయిస్తున్న వన్నమాట. తాసిల్దారు వైతవా? తాలుక్దారు వైతవా?"

ఆ మాటలకు గిర్దావరుకు చిరుకోపం వచ్చిన మాట నిజమే. మనసులో తురక తాసిల్దారును గురించి మసిలిపోయిన మాటా నిజమే. కాని అదేదీ వ్యక్తపరచనివ్వ కుండా "హుజూర్! మేమేం సర్కార్ చలాయిస్తం? మీ కింద పడుంటెటోడ్లం. సర్కార్! వడ్డెరగాడ్డి కొడుకులు రాయి తెస్తాన్రు. కూలోండ్లు పునాదుల్తవ్వుతాన్రు. ఇటిక చేసెటోండ్లకు చెప్పినపని సురు చేసిన్రు. ఇంతేం హుకుమ్ సర్కార్! మాదేంది హుకుమ్ తామీల్ చేసెటోడ్లం![1]" అన్నాడు గిర్దావరు.

"గిర్దావర్‌సాబ్ కోయగూడాలకు పోవాలెగద! కట్టె కొట్టించొద్దు! బంగ్లకు పట్టె కట్టంత కొట్టాల్నని చెప్పు. దున్నుకుంటలేరా సర్కార్ బూములు. వాండ్లకు కీ జర మస్తెక్కినట్లున్నది. వస్తలేవు మామూళ్ళు. కాబట్టె అమీన్ను తీస్కపో. ఈడ

1. ఆజ్ఞ పాలించేవాళ్ళం

ఏమి చేస్తాండు? దిక్కులు చూస్తాండు. ఏమన్న చోరి ముకద్దములు[1] న్నాయా? ఖతళ్ళు[2] అయితాన్నయా?"

"అట్లనే సర్కార్ అమీన్‌సాబ్‌ను తీస్కపోత. ముందర మస్కూరోణ్ణి పంపుత. ఆ లెన్క పోత...." అని ఏదో చెప్పబోయి ఆగిపోయినట్లు ముఖం పెట్టాడు గిర్దావరు.

గ్రహించాడు తాసిల్దారు. అయినా అడగలేదు. "అచ్చా! అట్లానే పో. నెమలి మాంసం తినక శాన్నాళ్ళయింది. నెమళ్ళ ఏయించి పట్కరా. ఒక మనుబోతును ఎయ్యమను గాడ్డికొడుకులను, జనానా అంత తింటది." అన్నాడు.

"అట్లనే సర్కార్ గాని ఒక్క అరజ్...."

"చెప్పు"

"వడ్డెర పీరిగాడు కుమిలి కుమిలి...."

"మూ బంద్‌కరో, ఇంటి సంగతులు నీ కెందుకు? ఎన్నడనున్నదా? జనాన్లకు వచ్చిన అడది మళ్ళ పోయినాది? ఇంకాడి మల్లి అది ఖదీజా అయింది? మళ్ళ ఆ సంగతి ఎత్తొద్దు. ఇగ నడువ్, వడ్డెరలం...కొడుకులు రాయి సరిగ్గ తెస్తాన్రొ లేదో సూడు"

"అచ్చా సర్కార్" అని సలామ్ చేసి బయటికి వచ్చాడు గిర్దావరు మనసులో మసులుకుంటూ. రాజ్యం తురకలది కాకుంటే తానే తాసిల్దారు కావలసినవాడు అను కున్నాడు. సిగరెట్టు వెలిగించి గట్టిగా ఊదాడు. చింత చెట్టుకింద నుంచున్న తలారి శివడు కనిపించాడు. అతడు గడ్డువ కింద కర్ర పెట్టుకోని ఊగుతున్నాడు.

"అరె భంచత్ ఊగుతున్నా వేందిర? తాగుడు పోయించింద ఎవడన్న ఇంత పొద్దాల?"

కునుకుపాట్లు పడుతున్నవాడు తెప్పరిల్లి లేచి సలామ్ చేసి "తాగుడాడిది. బాంచను. పొయిల పిల్లి లేస్తలేదు. కాల్మొక్త చెప్పండి ఏమీ హుకుమో గులాపోణ్ణి" అతిగాడు తలారి శివడు.

"సర్కార్ కొలువుండి చస్తున్న వేమిర? కోయగూడెం పోయిరావలె. గిర్దావత్ పొర వస్తాండని చెప్పు, సున్వాయి (సెటల్‌మెంట్)కి. ఇంతజాములు జోర్ జోర్‌గ చేయించాలె ఎరికెనా? కోయగాడ్డి కొడుకులు కూడా తెల్వి మీరుతున్రు. ఎప్పుడు పోతవ్?"

"పొయ్యొద్దే నా చేతులున్నాది, బాంచెను. ధొరలు ఎప్పుడు పొమ్మంటే అప్పుడు పోత. కాల్మొక్త. అడది సీక్కాటకున్నది. నాలుగొద్దులయి నెన్క పొమ్మంటె బాగుంటది. గులాపోణ్ణి"

---

1. దొంగతనపు కేసులు 2. హత్యలు.

"అచ్చా అట్లనే చావుగని ఇంతెజాములు జాగ చేయించు. ఇగ మూడు అమీను సాబ్ కూడా వస్తాండని చెప్పు. తుపాకి చూస్తెగని మాటినరు లం... కొడుకులు. దొర బంగ్లకద్దాండు, కట్టె కొట్టాల్నని చెప్పు, ఏమంటున్న ?"

"ఇటున్న బాంచెను. గట్లనె చెప్పుత, పట్కారమ్మంటే గూడెం గూడెమే పీక్కొస్త గులాపోణ్ణి"

"చెప్పినకాడికి చెయ్యర గాడ్దికొడక, గూడెం పీక్కొస్తుడట గూడెం. కట్టెవడుకొడ్తడనుకున్నవో?"

"అట్లనే బాంచను"

"పోర హరాంజాద్ది ఇంకెందుకో నిలబడ్డవు?" ఉరిమాడు గిర్దావరు.

తలారి శివుడు కర్ర అందుకొని పరిగెత్తాడు.

ఆ రాత్రి గిర్దావరు ఇంటికి మళ్ళీ వెళ్ళాడు పీరయ్య. తాసిల్దారు న్జరానా చాలదన్నాడని చెప్పాడు గిర్దావరు.

"ఉన్నయన్ని పలిచిస్తిని బాంచను. ఇంక యాడనుంచి తెస్తును. భూమి సుత కుదువపెట్టి తెచ్చిస్త, కాల్మొక్త. మల్లిని చూపిచ్చుండి" అని మళ్ళీ కాళ్ళు పట్టుకున్నాడు.

"అచ్చా! తే" అన్నాడు గిర్దావరు.

పీరయ్య వెళ్ళిపోయాడు.

* * *

వెంకయ్య ఆ జాగీరుకు పెద్ద సాహుకారు. అతనికీ బొర్ర ఉంది కాని తాసీల్దారంత కాదు. అతడు చొక్కా తొడగడు. నీరుకావి పంచె కట్టుకుంటాడు. అదీ మోకాళ్ళకంటె కాస్త కిందికి మాత్రమే. చొక్కా వేసుకోడు. భుజాన చిన్న పంచె వేసుకుంటాడు. అందరి గింజలూ అతని గరిసె నిండుతాయి. అందరి కుంటలూ అతని గింజలతోనే ఉడుకుతాయి. అతడు తాసిల్దారుకే కాదు నవాబుకు కూడా అప్పులు పెడతాడు. ఇతని చీటికి కరెన్సీ నోటంత విలువ. అతని ఇంటి ముందు ఎప్పుడూ జనం పడిగాపులు కాస్తూనే ఉంటారు. ఎవరికీ లేదనడు ఎవరికీ అడిగినంత ఇవ్వడు.

వెంకయ్య కూతురు రుక్మిణి ఏదో నోము నోచుకుంటూంది. వాద్యం కావాలని మంగలి రావుడిని పిలిపించాడు సాహుకారు. తాసిల్దారు మాలీసు చేయాల్సిన సమయమూ సాహుకారు ఇంట్లో బాజా వాయించాల్సిన సమయమూ ఒకటే అయినాయి. అయినా మాలీసు ముగించి సాహుకారు ఇంటికే వస్తున్నాడు. తోవలో అమీను పట్టుకున్నాడు. తన భార్యకు గడ్డ తగ్గలేదనీ, కట్టు కట్టాలనీ పట్టుకెళ్ళాడు. కట్టు కట్టి వచ్చేవరకు నోము పూర్తి అయింది. సాహుకారు గొంతు చించుకున్నాడు. తనకు ఇవ్వాల్సిన బాకీ కక్కి కదలమన్నాడు. బాకీ ఎక్కడిదో అర్థం కాలేదు రావుడికి.

రావడి తండ్రి లక్ష్మయ్యకు నూరు రూపాయలు అప్పిచ్చాడు వెంకయ్య. లక్ష్మయ్య అడుగలేదు వెంకయ్యే యిచ్చాడు. అందుకు వడ్డీ కింద ఆ యింటికి మంగలిపని, వైద్యము, బాజా వాయించడము ఉచితంగా చేయాలి. అలాగే చేస్తూ వచ్చాడు లక్ష్మయ్య. లక్ష్మయ్య పోయాడు రావడూ చేస్తున్నాడు. రావడు అలస్యంగా వచ్చినందుకు అక్కసు తీర్చుకోడానికి అడ్డం వేసుకున్నాడు సాహుకారు.

"బాకీ యాడిదుండి, కాల్మొక్తా. అయ్య తీసుకునే. అయ్యాళనే తీర్చె. బాంచెను. ఇన్నేండ్లనుంచి ఎట్టి చేస్తిమి, ఇంకేం బాకి గులాపోణ్ణి ఇక పైకమిస్తే పని చేసెడిది. లేకుంటే లేదు కాల్మొక్తా" అని గిరుక్కున తిరిగి వెళ్ళిపోయాడు రావడు.

చెంప చెళ్ళుమన్నట్టయింది సాహుకారుకు. లోకం తల్లకిందులైనట్టు అయింది. తేళ్ళు, జెర్లు పాకినట్టు అయింది. ఏంచేయాలో తోచలేదు. మంగళ్ళు తెగబడ్డారు. వాళ్ళను లొంగతీయాలి. ఎలా? ఏది మార్గం? ఎవరిని పట్టుకోవాలి? ఎలా సాధించాలి? ఈ ఆలోచనలతో నిద్రపట్టలేదు. కాతా పుస్తకాలన్నీ తీశాడు. ఇచ్చిన వందను వేయి చేశాడు. రావడికి భూమి ఉండడమే పొగరుకి కారణం అనుకున్నాడు. ఈ బాకీ క్రింద ఆ భూమి కాజేయా లనుకున్నాడు. అందుకు ఎవరిని ఆశ్రయించాలి? తాసిల్దారు తనకు బాకీ వున్నా, నగదు నజరానా చెల్లించంది ఒప్పుకోడు. గిర్దావరు ఈ మధ్య చాలా హెచ్చిపోయాడు. మిగిలింది అమీను. అతనిని అంతవానివి, ఇంతవానివి అంటే చాలు. తన అధికారం సాగుతున్నట్లు అనిపిస్తేచాలు పొంగిపోతాడు. డబ్బు అట్టే యివ్వాల్సిన అవసరంలేదు. కాతాలో జమకట్టుకుంటే సరిపోతుంది. అది కూడా అడగడేమో బహుశః. కొత్తగా వచ్చిన అధికారం నరాల మీద పుండులాంటిది. ఊరుకోనివ్వదు. ఆలోచన మంచిదే ననుకున్నాడు. అమీనునే ఆశ్రయించాలనుకున్నాడు. అప్పుడుగాని నిద్ర రాలేదు.

తెల్లవారి అమీను దగ్గరికి వెళ్ళాడు వెంకయ్య. వంగి సలాం చేశాడు. అంతకే పొంగిపోయాడు అమీను. మంగళ్ళకు మదం వచ్చిందన్నాడు. వారిని వంగదీయడం తాసిల్దారుకు సైతం చాతకాదనీ, అమీనుకే చాతనౌననీ పొగిడాడు వెంకయ్య. ఆఖరికి భూమి తన పేర రాయించమన్నాడు. డబ్బు ఆశ చూపించాడు.

మంగలి రావడిమీద కారాలు మిరియాలు నూరాడు అమీను. అతణ్ణి పట్టుకొని రావడానికి జవాన్ను పంపించాడు. వచ్చిన మంగలి రావణ్ణి చూచి, పళ్ళు పటపట కొరికాడు అమీను.

"క్యాబే. బాకీ ఎందు కియ్యవ్?" కేక పెట్టాడు అమీను.

"బాకీ యాడ్దిదొరా నీ కాల్మొక్త......." ఇంకా మాట పూర్తికాకుండానే మీద పడ్డాడు అమీను.

"జవాబ్బీ చెప్పుతవ్‌బే. కోమటోని సొమ్ము వున్నాని కొచ్చించనుకున్నవ్? మామీ రాసియ్యి బాకీ కింద" అని బాదసాగాడు.

"నీ కాల్మొక్త చెప్పేడ్డి యినుండి...."

"ఏది బే చెప్పేడ్డి? కుచ్‌నై జాన్తా. కాయిదం రాసియ్యి" అని బాద సాగాడు.

"బాకీ తీసుకోలేదండీ అంటాంటె బాదుత రేముండి? చంపుండి. బీర్కని భూమి వదులుకోను బాంచను, అది పోరల నోటికాడి ముద్ద కాల్మొక్త" అన్నాడు దెబ్బలు తింటూనే.

ఆమీను మండిపోయాడు. తనకు కాబట్టి ఇలా జవాబు చెపుతున్నాడనీ తాసిల్దారుకయితే ఇప్పటికే లొంగిపోయేవాడనీ అనుకున్నాడు. వెంకయ్యకు తన ప్రతిభ చూపించాలనుకున్నాడు. చేతిలో కర్ర మూలకు పారేసి జవాన్లను పిలిచాడు. "యాళ్ళాడ కట్టుండ్రి లం....కొడుకును. తడాఖా చూపిస్త. మస్తీ దిగాలె మంగిలి గాడ్డికొడుకుల్డి" అని కేకవేశాడు.

వెంకయ్య లేచి నుంచున్నాడు. గమనించాడు ఆమీను. "నువ్వుపో సావుకార్ ఏణ్ణి వంగదీసి నీ కాడికి పంపుత" అన్నాడు ఆమీను.

సాహుకారు జారుకున్నాడు.

నలుగురు జవాన్లు కలసి దూలానికి తలక్రిందుగా వేలాడతీశారు రావడిని. చింతబరిగెలు అందుకొని రావడిని బాదసాగాడు ఆమీను. రావడు లబోదిబోమని మొత్తుకుంటున్నాడు. వళ్ళంతా దద్దులు వస్తున్నాయి. పది చింత బరిగెలు విరిచి అలసిపోయి నుంచున్నాడు ఆమీను. వళ్ళు మంటలకు మొత్తుకుంటున్నాడు రావడు.

"ఏం బే బూమి రాసిస్తావా?"

"పోరలేం తింటరు దొరా. నీ బాంచను. ఇడిచి పెట్టుండి నీ కాల్మొక్త" అని ఏడ్చాడు రావడు.

"మస్తీ దిగలేదు. మాదర్‌చత్‌కు మారో హజావ్ కో" అని జవాన్లకు ఆజ్ఞా పించి చెమట తుడుచుకున్నాడు ఆమీను.

నలుగురు జవాన్లు చింతబరికెల్తో బాదుతుంటే మొత్తుకున్నాడు, అరచాడు, కేకలు పెట్టాడు. విన్ననాథుడు లేడు. బాధ భరించరానిదయింది. "రాసిస్తా దొరా రాసిస్తా" అని కేకలు పెట్టాడు.

"దారికొచ్చిండులె....కొడుకు దించుండి." ఆజ్ఞాపించాడు ఆమీను.

జవాన్లు రావడిని దించారు. ఆమీను ఆజ్ఞ మేరకు సాహుకారు ఇంటికి తీసుకెళ్ళారు. సాహుకారు విక్రయపత్రం మీద రావడి అంగుష్టం వేయించుకున్నాడు. సాహుకారు ఇచ్చిన ఈనాములతో జవాన్లు, వళ్ళు మంటలతో రావడు ఇళ్ళకు చేరుకున్నారు.

గత్తం గీకడానికి వచ్చాడు రావఁడు. గీకుతూ జరిగిన కథంతా వినిపించాడు రఘుకు. వంటిమీద ఇంకా వున్న దద్దులు చూసి "ఎర్కలె కడుగుత బాంచను. ఏమనుకోకండి కట్టుకపోయే టంతుండె కోమటోడికి కాల్మొక్త. ఏం చేసుకుంటడుండి గరీబోళ్ళ భూములు గుంజుకొని. గా అమీను సాబేమో వానికే పలికె. వీళ్ళ అమ్మల అక్కల....కడుపు మండుతాంది. గులాపోణ్ణి" అని కంట తడి పెట్టాడు. నేల చెక్క తల్లి సమానం వాళ్ళకు. తల్లి పోయినట్లు విలపించాడు.

రఘు ఆలోచనలో పడ్డాడు. ఎంత దౌర్జన్యం? ఎంత హింస? అధికారము గలవాళ్ళు అమాయకులను ఆటబొమ్మలుగా చేసుకున్నారు. తమ ఇష్టమొచ్చి నప్పుడు వాటితో ఆడుకుంటారు. అవసరం లేనప్పుడు నలక్కొట్టి అవతల పారేస్తారు. అసలు ఇక్కడ ఒక శాసనమంటూ ఉందా? దండనమే శాసనమా? ఇక్కడి ప్రజ ఎంత అమాయకులు! ఇన్ని దెబ్బలు తిన్నాడు. ఉన్న నేలచెక్క పోగొట్టుకున్నాడు రావఁడు. కాని వారిని పల్లెత్తి మాట అనడు. మళ్ళీ చాకిరి చేయడానికి వస్తూనే వున్నాడు. రావఁడు తనను ఒక ప్రశ్న అడిగాడు. దానికి ఏమని సమాధానం చెప్పాలి? అతనికి ఎలా సహాయం చేయాలి.

"అంగుష్టం ఎందుకు పెట్టినవ్?" ఏమీ తోచక అడిగిన ప్రశ్న అది.

"అయ్యో నీ బాంచను. ఎల్లిడుగుత వేముండి. పెట్టుకుంటె ఊళ్ళ బతుకుతా ముండి. దొరలు బతకమంటె బతకాలె, చావమంటే చావలె. ఒకపా లేమైం దనుకున్నారు. చాకలోడు జర ఆలస్యం గొచ్చిండు తాసిల్దారింటికి. "ఏందిర మస్తి ఎక్కిందా" అన్నడట తాసిల్దారు దొర. ఏమొ జవాబు చెప్పిడట బాంచను. ఇక అడుగుతారు కొట్టి చంపిండు కాదుండి గులాపోణ్ణి. చంపి బాయిబొంది లేసిండు. ఏందో మా నసీబిట్లున్నది. కాల్మొక్త. మల్లి ఎవరితోనన్న చెప్పేరు బాంచను. కడుపు మండి ఎల్లకక్కిన"

రఘు గుండె మండింది. రక్తం తుకతుక ఉడికింది. కళ్ళు ఎర్రవారేయి, వళ్ళంతా వడికింది, ఉద్రేకం వచ్చింది. కోపం పొంగింది. అలాంటప్పుడు ఆలోచన ఏమి వస్తది? అది మెదడు మొద్దుబారే దశ.

రఘును చూచి రావఁడు వణికిపోయాడు. అదరిపోయాడు. కాళ్ళ మీద పడ్డాడు. "ఇగ చెప్పను నీ కాల్మొక్త. మీ పాదాల కాడ పడుండె డోండ్లం బాంచను, తప్పైంది గులాపోణ్ణి కడుపు మండింది. ఎల్లకక్కిన. ఇగ ఎన్నడు చెప్పను దొర గులాపోణ్ణి. రచ్చించండి కాపాడండి" అన్నాడు.

రఘు ఆవేశం ఆశ్చర్యంగా మారింది. కనీసం ఒప్పుకోడానికి వీల్లేని దశ. అలాంటప్పుడు తనను నమ్మి చెప్పుకున్నాడు. తాను రావఁడిని ఓదార్చలేకపోయాడు. తనని చూచే అదిరిపడుతున్నాడు రావఁడు. ఏం చేయాలి? ఎలా ఓదార్చాలి?

"కోపం నీమీద కాదు రావఁడూ, కోపం తాసిల్దారుమీద, అమీను మీద, వెంకయ్యమీద, ఈ వ్యవస్థమీద"...

తరువాత అన్నవి రావడికి వినిపించలేదు. అర్థం కాలేదు. ఆ రెండు వాక్యాలే ఆతనికి ఆశ్చర్యం కలిగించాయి. కాళ్ళు వదిలి రావడు రఘును నఖశిఖ పర్యంతం చూచాడు. ఆ చూపులో ఆదరం వుందో, అభిమానం వుందో, గౌరవం వుందో చెప్పడం కష్టం. తాసిల్దారుమీద, అమీనుమీద కోపం తెచ్చుకునే వాడున్నాడా ఈ లోకంలో? అనుకున్నాడు రావడు. తనముందు దేవుడు ప్రత్యక్షం అయినట్లని పించిందతనికి. అతడు వరం కోరుకోమన్నా తాను కోరదలచలేదు. తనకు భూమి అవసరంలేదు. నేల అవసరంలేదు. అమీను మీద పగతీర్చుకోవలసిన పనిలేదు. తన గోడు వినే దేవత యితడు! తన బాధ విని కోపం తెచ్చుకున్న దొర యితడు! చాలు—చాలు—అంతే చాలు తనకు. అలా మనసులో అనుకున్నాడు. చేతులు జోడించాడు. పూడిన గొంతుతో "ధరమ దొరలు" అన్నాడు. అతని హృదయం పొంగింది. ఒక స్తోత్రం చదవాలనుకున్నాడు. కాని ఆ రెండు పదాలే అనగలిగాడు. అంతకంటే రా దతనికి. మిగతాది కళ్ళతో అప్పచెప్పాడు.

రఘు ఉక్కిరి బిక్కిరి అయినాడు. ఆ ప్రేమను, ఆ ఆదరాన్ని, ఆ గౌరవాన్ని, ఆ భక్తిని భరించలేకపోయాడు.

"రావడూ! మామయ్యతో చెప్పి పోయినంత భూమి ఇప్పిస్త చేసుకో" అన్నాడు.

అడక్కుండానే వరం యిచ్చాడు దేవత. అప్పుడు రావడిలో ఏమేమి భావాలు ఉత్పన్నం అయినాయో. అతడా ఎంత తబ్బిబ్బు అయినాడో రాయడం కష్టం. "అట్లనే దొర నీ జాంచను. ధరమ దొరలు. మీ అసుమంటోళ్ళు వుండబట్టే గరీబోళ్ళు ఇంకా బతుకుతాన్రు కాల్మొక్త" అని పొది పట్టుకొని బయటపడ్డాడు రావడు.

మధ్యాహ్నం భోజనాల సమయంలో వీరయ్యగారికి రావడి కథంతా చెప్పాడు. వారికేమి ఆశ్చర్యం కలుగలేదు. అది నిత్యకృత్యమే అక్కడ. కాని రఘు రావడికి చేసిన వాగ్దానాన్ని గురించి విన్నప్పుడు ఆశ్చర్యం కలిగింది.

"నాయ్నా రఘూ! నువ్వు మంచి మంచి మాటలు చెప్పుతున్నవు. మంచిపన్లే చెయ్యాల్నని చూస్తున్నవు. కాని నాకేదో భయం భయం గున్నది. ఈడ సర్కారు చేసేటోండ్లు సైతాన్లు! సైతాన్లు!! వాండ్లమీదికి కయ్యానికి దిగుతున్నవు. ఇది మంచిదికాదు నాయనా! దేవుడిచ్చిండు కట్కపోయేటంత. రెండు బీగాలిస్తే ఏం పోతదిగని. తాసిల్దారే మనుకుంటడో, అమీను సాబే మనుకుంటడోనని భయం గున్నది. వాళ్ళకాడనే బతకాలెగద ఎంతైన? సరే మాటిచ్చినవు గద. తప్పుతాది" అననైతే అన్నారు కాని వీరయ్యగారి గుండె వేగంగా కొట్టుకోసాగింది.

గమనించాడు రఘు. మెల్లగా ప్రారంభించాడు.

"మామయ్యా! భయం మనిషిని నిరసింపచేస్తది. మనం భయపడుతున్నం కాబట్టి వాళ్ళు పెత్తనంచేస్తున్నరు. తాసిల్దారంటే ఇన్ని వేలమంది భయపడుతున్నరు.

కనుకనే వాళ్ళు అందరిని వడికిస్తున్నరు. నలుగురు పోలీసులతో అందరిని అణచి పెడ్తున్నరు. భయం బలహీనతకు గుర్తు. మనం భయాన్ని జయించాలె. అది మనం మొదలు చేయాల్సింది. మనం భయాన్ని వదులుకుంటే ఇన్ని వేలమంది భయం తాసిల్దారులో చేరుతుంది. అన్ని వేలమంది భయం ఒక్కడు భరించలేడు. ఆవురుమని చస్తాడు. మనకు వేరే ఆయుధం అక్కరలేదు. నిర్భయంగా ఉండటమే మన ఆయుధం."

వీరయ్యగారికి రఘు ఉపన్యాసం అంతగా అర్థం కాలేదు. అసలు వారిలో భయం ఉంది! ఒకసారి గుడ్లగూబను గురించీ, చీకట్లను గురించీ ఇలాంటి ఉపన్యాసమే ఇచ్చాడు. ఆలోచిస్తే అది నిజమే ననిపించింది. భయం కూడా అలాంటిదేమో ననుకున్నారు.

పులుసు గిన్నె పట్టుకొని నుంచున్న జానకి 'పావెల్' ఉపన్యసిస్తున్నట్లనిపించింది. కాని ఈ భయం ఎలా పోతుంది? అందుకు మార్గం ఏమిటి? అని అడుగుదా మనుకుంది.

ఆ ప్రశ్న వీరయ్యగారే వేశారు. "అప్పుడేమో చీకటన్నవు. ఇప్పుడేమో భయం అంటున్నవు. మరి చీకటి పోవాల్నా? భయం పోవాల్నా?"

తన మామ తనను అర్థం చేసుకుంటున్నాడని గ్రహించాడు రఘు. ఉత్సాహం హెచ్చింది, ముందు ఇంట గెలవా లనుకున్నాడు. విడమర్చి చెప్ప సాగాడు.

"చీకట్లు, భయం ఈ రెండింటికి పరస్పర సంబంధం ఉన్నది. చీకటిని విడిచి భయంగాని, భయాన్ని విడిచి చీకట్లుగాని ఉండలేవు. చీకటిని పారదోలితే భయం దానంతట అదే పోతుంది. చీకటిలో ఒక తాడును చూస్తము. దాన్ని పామనుకుంటము. భయం కలుగుతుంది. కెవ్వున అరుస్తము. లాంతరు తెచ్చి చూస్తే అది తాడని తేల్తది. అప్పుడు మన భయం దానంతట అదే పోతదా లేదా ?"

వీరయ్యగారు తదేకంగా వింటున్నారు. జవాబేమీ చెప్పలేదు.

"చీకటిలో మనం ఉన్నం కాబట్టి తాసిల్దారును పామనుకుంటున్నం. మనను చీకట్లో ఉంచిండు కాబట్టి పామువలె పెత్తనం చేస్తున్నరు. అజ్ఞానం పోయిందనుకో, విజ్ఞానం అనే వెలుగు వస్తుంది. అప్పుడు తాసిల్దారు వట్టి తాడని తేలిపోతుంది. అప్పుడు భయం ఉండదు. భయం లేనప్పుడు తాసిల్దారు ఉండడు."

అల్లుడు చెప్పిందాన్ని అర్థం చేసుకున్నారు వీరయ్యగారు. తన అల్లునిలో ఇంత విజ్ఞానం ఉందని కనీసం వారు ఊహించలేదు. సాక్షాత్తుగా చూస్తూ మురిసి పోయారు. అయినా వారిని భయం వదల్లేదు. ఆ భయంతోనే లేచి చేయి కడుక్కున్నారు. తువ్వాలుతో చేతులు తుడుచుకుంటూ అడిగారు.

"ఎవ్వరి భయం లేకుంటే సర్కారెట్ల నడుస్తది?"

రఘుకూడా చేయి కడుక్కొని వచ్చి కూర్చున్నాడు. జానకి వడ్డించుకుని కూర్చుంది. శ్రద్ధగా వింటూంది.

"కాలం మారిపోయింది, జనాన్ని గడ-గడ లాడించి పాలించిన రాజులు చక్రవర్తులు పోయిన్రు. ఫ్రాన్సులో ప్రజలు తిరుగుబాటు చేసిన్రు. విప్లవం తెచ్చిన్రు. రాజులను కూలదోసిన్రు. ప్రజలే ఏలుకుంటున్రు. అమెరికాలో స్వాతంత్ర్య యుద్ధం జరిగింది. తెల్లదొరలను తెల్లవారే ఎదిరించిన్రు. ఓడించిన్రు. అక్కడ ప్రజా స్వామ్యం ఏర్పడింది. ఆ రాజ్యం ప్రజలది. ప్రజలనుండి వచ్చింది. ప్రజలకొరకు పని చేస్తున్నది. రష్యాలో జార్ చక్రవర్తులు అతి క్రూరంగా ప్రజలను పీడించిన్రు. అక్కడ రైతులు కూలీలే తిరగబడ్డారు. చక్రవర్తులను కూలదోసిన్రు. పేదలు రాజ్యం ఏర్పరచుకున్రు. ఇప్పుడు అక్కడ పేదలు, ధనికులు లేరు. అంతా సమానమే. స్వంత ఆస్తిలేదు. ఆస్తి ప్రజలది. సంపద ప్రజలది. ప్రభుత్వం ప్రజలది.

"భయపెట్టి ప్రభుత్వం చేయడం అనే సిద్ధాంతం మారిపోయింది. రాజు అంటే రంజింప చేసేవాడు కాని, కాలరాచేవాడు కాదు. ప్రభుత్వం ప్రజలలో విశ్వాసం కలిగించాలె. ప్రజలు ప్రభుత్వాన్ని తమది అనుకునేట్లు చేయాలి. జానకి ఏ భయంతో మిమ్మలను ప్రేమిస్తున్నది? జానకి విషయంలోనూ నాకు ప్రేమాభిమానాలు ఎందుకున్నాయి. వీటికి కారణం భయంకాదు, ప్రేమ, విశ్వాసం కారణాలు. ప్రభుత్వం అటువంటి వాటిని ప్రజల్లో కలిగించుకోవాలి. అది నిజమైన ప్రభుత్వం."

వీరయ్యగారి తల తిరిగిపోయింది. వారు ఏదో అయోమయంలో పడ్డారు. వారికి రఘు చెప్పినవన్నీ స్పష్టంగా అర్థం కాలేదు. కాని వాటిలో ఎక్కడో సత్యం ఉందనే విషయం గోచరించింది. అయినా ఏదో క్షోభ మొదలైంది. రఘు ఏవేవో కొత్త కొత్త విషయాలు చెప్పుతున్నాడు. అతను పురాణాలు చెప్పడంలేదు. జరిగిన వాటిని గురించే చెపుతున్నాడు. వినడానికి బాగున్నాయి. కాని ఆచరణలో అవి సాధ్యములా?

వారికి జానకి విషయం గుర్తువచ్చింది. రఘును అతని వాక్ప్రవాహాన్ని తలచుకున్నారు. అతడు తన కూతురును సుఖపెట్టగలడా? తాను చిక్కుల్లో దూరి జానకిని ఈడ్చుడుకదా ? వీరయ్యగారికి తామె క్రమక్రమంగా ముళ్ళ పొదలోకి అడుగు వేస్తున్నట్లు అనిపించింది. ఇంకేవేవో ఇలాంటి ఆలోచనలే సాగాయి. ఆలోచనలు దూరం చేయడానికి చుట్ట వెలిగించారు. దాంతో అవి మరీ ముసురు కున్నాయి. రఘు అక్కణ్నుంచి లేచిపోయిందుగాని, జానకి భోజనం ముగించింది గాని గమనించలేదు. ఎప్పుడో తెములుకొని చూస్తే ఇద్దరూ కనిపించలేదు. లేచి గది లోకి వెళ్ళి మేను వాల్చారు. కళ్ళు మూసుకున్నారు. నిద్రపోవడానికి ప్రయత్నిం చారు. కాని వారికి ఆలోచనలు వదల్లేదు. వాటికి సంబంధించిన స్పష్టమయిన

రూపమూ కనిపించలేదు. ఎందుకో వారికి జానకిని పిలిచి అడగాలనిపించింది. పిలిచాడు. జానకి వచ్చి నుంచుంది. కాని ఏ మడగాలో అర్థంకాలేదు. కూర్చోమన్నారు. కూర్చుంది. అయినా ఏమి అడగలేదు, అంతా మౌనం.

"పిల్చినావు నాయనా?"

"అవును పిల్చిన!"

"ఏంది?"

"అదే ఆలోచిస్తున్న. బావ ఏందెందో చెప్పుతడు నీ కేమన్న అర్థమవుతున్నదా?"

"అదేంది నాయ్నా. ఎందు కర్థమయితలేదు. బావ చెప్పేడిదంత నిజం. ఆయన వెలుగు నాయ్నా వెలుగు! ఏమన్న తప్పనిపిస్తున్నదా నీకు" అని, నాగేశ్ ఇంకా గట్టిగా వాదిస్తాడనీ, దోపిడీ, పీడిత ప్రజలు శ్రామికుల తిరుగుబాటు అనే పదాలు వాడుతూ వాదిస్తూనే పిడికిళ్ళు బిగించి పైకి ఉరుకుతాడనీ, అతనికి విప్లవం, తిరుగుబాటు తప్ప వేరు తెలియదనే చెప్పుదా మనుకుంది తండ్రితో. కాని ఎందుకో ఆవిడ మనసు వారించింది.

"ఏం నిజమో తల్లీ! నాకంత అయోమయం గున్నది. కొరివితో తలగోక్కుంటున్నామేమో అనిపిస్తుంది. జర నువ్వుకూడ ఆలోచించు తల్లీ" అన్నాడు. ఎంతో అనాలనుకున్నాడు కాని అంతకు మించి అనలేకపోయాడు.

ఆ మాటలు జానకిలో ఉత్సాహాన్ని కలిగించాయి. తండ్రికి బావ చెప్పినట్లూ, బావతో నాగేశ్ వాదించినట్లూ వాదించాలనుకుంది. ఒక వాక్ప్రవాహం ఆమెలో పెల్లుబికింది. అయినా ఆనకట్ట తాకి నిలిచిపోయింది. "అవును నాయ్నా! త్యాగం చేయాలె" అన్నది.

వీరయ్యగారు బిత్తరపోయి కూతురును చూచారు; ఇదొక కొత్తపదం! అంత వరకు విననిది. అదీ తన కూతురు నోటినుంచి ! మొన్నటివరకు గడప దాటని పసిదానినుంచి. ఆ పదం అర్థం కాలేదు వారికి. కళవళ పడ్డాడు. అందును గురించిన వివరాలు అడుగుదామనుకున్నారు. కాని ఎవరిని అడగాలి ! తన కూతురును. పసి కూనను. తనకు తెలియని ఇన్ని విషయాలు తెలుసునా ఈ చిన్నతల్లికి. ఏదో పెద్దతనం అడ్డం వచ్చింది. అడగలేకపోయారు. మనసు ఒప్పలేదు "సర్లెతల్లి నీపని చూసుకో" అన్నారు.

జానకి చిన్నబుచ్చుకుంది. వెళ్ళిపోయింది.

వీరయ్యగారు ఆలోచనలను వదులుకోదలచుకున్నారు. అవి వారిని వదలడంలేదు. ఏదో అయోమయంలో పడిపోయారు. ఏదో చిటచపిలో, చీకటి కోనలో దారీ, తెన్నూ తెలియక సాగిపోతున్నట్లనిపించింది. ఒక నేల చెక్కకోసం, ఒక పశువుకోసం, ఒక పడతికోసం, ఒక పంతం కోసం పోట్లాడుకోవడాలు లాను ఎన్నో చూచాడు. అందుకోసం కాళ్ళూ కడుపులూ పట్టుకోవడాలు, కోర్టులకు

తిరగడాలు తానెరుగును. కాని ఇవేమిటి? రాజులు లేకుండా చేస్తారట ! తిరుగు బాట్లు లేవదీస్తారట! విప్లవం తెస్తారట. ఎవరికోసం ఈ పాట్లన్నీ? ఎందుకూ కష్టాలు కొనితెచ్చుకోవడం ? గుబులుగా మనసులో ప్రవేశించింది. భయంగా మారింది. ఏదో తుపాను రేగపోతున్నట్లూ, అగ్గి కొండ బద్దలు కానున్నట్లూ అనిపించింది. దాన్ని వారించాలనుకున్నారు. అంటే ఎవరిని వారించాలి ? రఘును. ఎలా ? అతడు తనమీద అనిర్వచనీయమైన ప్రభావం వేశాడు. తాసిల్దారు మంత్రాలు తనమీద పని చేయలేదు. కాని రఘు మాటలకు లొంగిపోయాడు తాను ! మాటలకు మంత్రాలను మించిన ప్రభావం ఉందా ? క్షుద్రకుంక. ఎన్ని నేర్చాడు ! అన్నీ వాస్తవాలె. చీకట్లు పోవాలి. వెలుగు రావాలి. వాస్తవంగానే వెలుగు ఎంత అందమైంది. చీకట్లు ఎంత భయంకరం అయినవి. చీకట్లకూ భయానికీ ఏదో దగ్గర సంబంధం ఉంది. అది నిజం. చీకట్లు పోవాలి. వెలుగు రావాలి. నిజమే. జానకి కూడా ఏదో అన్నది. అది తన కింకా అర్థం కాలేదు. ఏమిటీ ఆలోచనలు! ఆలోచనలు ఆలోచనలను పొదుగు తాయా ? తాను రఘును వారించగలడా? వారించలేడు. అతడు వెలుగు తాను చీకటి. అతడు విజ్ఞానం. తాను అజ్ఞానం. అయితే ఏం చేయాలి ? ఏం చేయాలి? ఏం చేయాలి?

ఆలోచనల్లోనే పగలు నిద్ర పట్టింది.

రోజూ వచ్చినట్లే రాత్రికి వచ్చాడు నాగేశ్. బొడ్లోంచి పత్రిక తీసి రఘుకి అందించాడు. రఘు శీర్షికలు చూస్తూండగా జానకి గదిలో ప్రవేశించింది. నాగేశ్‌కు నమస్కరించింది. ఈ మధ్య జానకి కూడా చర్చలో పాల్గొంటోంది.

పత్రిక మడిచిపడేశాడు రఘు. అంతర్జాతీయ, జాతీయ, రాష్ట్రీయ రాజకీయాలను గురించి చర్చించుకున్నారు. రష్యా యుద్ధంలో ప్రవేశించగానే అది ప్రజా యుద్ధంగా మారడాన్ని గురించి వారు ఎన్నోసార్లు చర్చించుకున్నారు. మళ్ళీ వాదించుకున్నారు. విసునూరు దొర దౌర్జన్యాలను గురించీ, ప్రజల పోరాటాలను గురించి మాట్లాడు కున్నారు. ప్రభుత్వంలో సగం స్థానాలు ఇత్తెహాదుల్ ముసల్మీన్‌కు ఇవ్వాలనే నైజాం నవాబు ప్రతిపాదనను గురించి తీవ్రంగా చర్చించుకున్నారు. తరవాత మంగలి రావడి కథంతా చెప్పిన రఘు, పొలం ఇవ్వడానికి వీరయ్యగారు సుమారు అంగీకరించి నట్లేనని చెప్పాడు.

ఆ మాటలు విని నాగేశ్ మండిపోయాడు. అతని రక్తం తుక తుక ఉడి కింది. కోపం పొంగింది. కస్సున తోక తొక్కిన తాచులా లేచాడు.

"బడా భూస్వాములు, పెత్తందార్లు, జమీందార్లు చేతులలో ఉద్యమాలు నలుగుతున్నాయి. నసిస్తున్నయి. మీలో ఫ్యూడల్ వ్యవస్థ జీర్ణించుకొని పోయింది. ఆ వ్యవస్థ మీలో చావలేదు. చావదు. చచ్చిందనుకోవటం నా తప్పు. ఔదార్యం చూపించాలె ననుకుంటరు - ఔదార్యం! ఎంత మంది కిస్తరు పోయిన భూములు? ప్రజలలో వచ్చిన అసంతృప్తి, ద్వేషం అనే అగ్నిని రగల్చాలె. ఆ అగ్నిలో ఈ

వస్థ కాలి బూడిద కావాలె. ఆ బూడిదలోంచి ఒక కొత్త వ్యవస్థ, ఒక నవసమాజం పుట్టాలె. అందులో పేదా, ధనికుడు, పాలకుడు, పాలితుడు ఉండరు. అందరు మనుషులే. అందరు సమానులే. మానవునికి మానవునికి ఉన్న సంబంధమే ఉంటుంది. వారికి ఈర్ష్యాద్వేషాలు ఉండవు. ప్రేమానురాగాలు ప్రభవిస్తయి. అటు వంటి సమాజం నీ నాయకత్వాన వస్తుందనుకున్న, పొరపాటుపడ్డ. ఇక నా దారి నేనే చూచుకుంట. ఆ మంగళ్ళలోనే అగ్గిరేపుత. ఆ మంగలి కత్తితోనే తాసిల్దారు గొంతు తెగాలి" అని నిప్పులు కక్కి దిగ్గున లేచాడు నాగేశ్, వెళ్ళిపోవడానికి ఉద్యుక్తుడు అవుతూ.

రఘు ఉక్కిరి బిక్కిరి అయినాడు. అదిరిపోయాడు. అతనికి ఏమీ తోచ లేదు, తోచిందల్లా నాగేశ్‌ను పోనివ్వరాదనేది. అమాంతంగా లేచి నాగేశ్‌ను పట్టుకున్నాడు. "నాగేశ్ ! నీవు వెళ్ళిపోవద్దు నేను తప్పు చేసినన్నంటున్నవు. చేసిన. రా. కూర్చో. దిద్దుకుందాం" అని నాగేశ్‌ను కూర్చొబెట్టి "నాగేశ్! ఫ్యూడల్ మన స్తత్వం ఇంకా నాలోంచి దూరం కాలేదన్నావు. నిజం కావచ్చు. అయినా తమ్ముడూ! ఇంటి ముందరికి ఆకలిగొన్న ఒకడు వచ్చిండు. ఆకలిగా ఉన్నదని అరిచిండు. అప్పుడు ఏం చేయమంటవు? ఆకలి తీరటానికి గంపెడు గంజి పోయమంటవా? అతని ఆకలికి ఈ వ్యవస్థే కారణం అని ఉపన్యాసం ఇయ్యమంటవా? తమ్ముడూ నాగేశ్! నేను తప్పుచేసిన అంగీకరిస్త. ఇప్పుడు ఏం చేయాలెనో నిర్ణయించు. మనం మనం పోట్లాడుకోవటంవల్ల లాభంలేదు. ఏం చేద్దామో నిర్ణయించు. నువ్వు చేయ మన్నట్లు చేస్త. అగ్గిలో దూకమంటే దూకుత."

మౌనంగా కూర్చున్నాడు నాగేశ్. అందును గురించే ఆలోచించసాగాడు రఘు. నాగేశ్ చెప్పింది అమోఘం అనిపించింది జానకికి. కాని రఘు చెప్పిందాట్లో కూడా నిజం కనిపించింది ఆమెకు. ఒక నిర్ణయానికి రాలేక సతమతం అయింది.

గదిలో మౌనం రాజ్యం చేసింది. అందరి గుండెలూ మాట్లాడుతున్నాయి. గాని పెదవులు పలకడంలేదు.

"అన్నా! నీతో వాదించలేను. ఏం చేద్దామో చెప్పు" అన్నాడు నాగేశ్.

"జరిగిన అన్యాయాన్ని గురించి వారికి చెప్పాలె."

"చెప్పటంలో నాకు విశ్వాసంలేదు. ఏం చేయాల్నో చెప్పు."

అదిరిపడ్డాడు రఘు. తరువాత అందును గురించి సుదీర్ఘం అయిన చర్చ జరిగింది. జానకికి "అమ్మ"లో జరిగిన సమ్మె గుర్తుకు వచ్చింది. మంగళ్ళతో సమ్మె చేయించాలని ప్రతిపాదించింది. ప్రతిపాదన మిగతా ఇద్దరికీ నచ్చింది. కాని దాని సాధ్యాసాధ్యాలను గురించి చాలాసేపు చర్చ జరిగింది. తుదకు మంగళ్ళను ఊళ్ళో ఉంచకుండా పంపించేస్తే తప్ప ఆ పని సాధ్యపడదని నిర్ణయించారు. అందుకు ఏర్పాట్లు చేయడానికీ, వారిని ఒప్పించడానికి బయలుదేరారు రఘు, నాగేశ్.

జానకి మేను వాల్చిందనేగాని నిద్రరాలేదు. ఆమెకు చాలా గర్వంగా ఉంది.

తన ప్రతిపాదన నెగ్గింది. మంగళ్లు ఒప్పుకుంటారా? ఏమో ఇంతలో రఘు నాగేశ్‌ల వాదన గుర్తుకువచ్చింది. చిచ్చు పెట్టినట్లుంది నాగేశ్ ఉపన్యాసం. రఘు, ఓడిపోయాడు! నాగేశ్ గెలిచాడు! కాదు. నాగేశ్ తానూ కలిసి గెలిచారు. నాగేశ్! పట్టి ఎముకల గూడు! పొట్టివాడు! కళ్ళు ఎందుకో ఎప్పుడూ ఎర్రగా ఉంటాయి. ఎంత ఆరాటం ఉంది అతనిలో! ఎంత ఉద్రేకం ఉంది! అతని రూపమే అగ్నిలా ఉంటుంది. అతడు అగ్గి. కాదు పిడుగు!!! ఆలోచనలో మునిగిపోయింది. కొంత సేపటికి నిద్రపట్టింది.

రఘు, నాగేశ్ మంగలి రావుడి ఇంటికి వెళ్ళారు ఆ రాత్రి. వారినిచూచి దేవుడు దిగివచ్చినట్లు ఆదరించాడు. "దొరలు పిలువనంపుతె రాకపోయినానండి. ఎందుకొచ్చిన్రు?" అన్నాడు.

రఘు వివరించి చెప్పాడు. రావుడు చేయవలసిన పనిని గురించి వివరించాడు. మరికొంత వివరించాడు నాగేశ్. మంగళ్ళు లేకుంటే ప్రజలకు, ముఖ్యంగా తాసిల్దారుకు జరిగే ఇబ్బందిని గురించి తెలియపరచాడు. వారి ప్రాధాన్యతను గురించి నొక్కి చెప్పాడు. పోయినభూమి రాబట్టుకోవాలన్నాడు. విజయం సాధించాలన్నాడు. తాసిల్దారుకు తలవంపులు తేవాలన్నాడు.

రావుడికి అన్నీ అర్థం అయినాయి. కాని భయం అలుముకుంది. తాసిల్దారును లొంగదీయడం అనేదాన్ని గురించి ఆలోచించలేకపోయాడు. తన మనుగడకు ఏం ముప్పు వస్తుందో అనుకున్నాడు, ఆ ధోరణిలోనే మాట్లాడాడు. అయినా అన్నను అడిగి చెప్తుతానన్నాడు. అన్నతో ఎలా మాట్లాడాల్సింది, ఏ విధంగా సిద్ధం చేయాల్సింది కూడా చెప్పాడు రఘు. మరుసటి రోజు వస్తామని చెప్పి రఘు, నాగేశ్‌లు బయలుదేరారు. కాని రావుడే రఘు యింటికి వస్తానన్నాడు.

మరుసటిరోజు రావుడు రఘు ఇంటికి వచ్చాడు. జానకిని చూచి ఆశ్చర్యపోయాడు! తాను భుజంమీద ఎత్తుకొని తిరిగిన జానకమ్మ ఎట్లా మాట్లాడుతూంది!! తన తండ్రి తాతల నుంచి అసలు తమను గురించి ఆలోచించేవాడు ఉంటాడనీ, ఉండాలని కనీసం ఊహించలేదు తాను. ఈ ముగ్గురు గదిలో కూర్చుని ఎన్ని విషయాలను గురించి మాట్లాడుతున్నారు! తమను గురించి ఎంత బాధపడుతున్నారు. అసలు వీరు తాసిల్దారును గెలవ గలరా? అనుమానం అతన్ని బాధించింది. అదే ప్రశ్న అడిగేశాడు.

"లొంగుతాడుండి తాసిల్దారు ?"

"రావుడూ! మీ బలం మీకు తెలియదు. హనుమంతునికి కూడా తన బలం తెలియలేదు. జాంబవంతుడు చెపితే తెలుసుకున్నాడు. పోయి లంకకాలబెట్టివచ్చిండు. మంగలోళ్ళు ఊళ్ళో లేరనుకో, మంది ఎంత సతమతమైతరు? మళ్ళ మాన్యాలిచ్చి ఎందుకు తెచ్చి పెట్టుకున్నారనుకున్నవు ఊళ్ళో? ఉన్నప్పుడు ఏది తెల్వదు. మీరట్ల ఊరు దాటిన్రా మొదలు తాసిల్దారు చస్తడు, మీ కాళ్ళు పట్టుకొని తీసికొస్తడు. భూమి గుంజాకునెకద! ఇంక ఏమున్నది మీకాడ? నాలుగు రోజులు బయట ఉండుండి

అంతే. ఇగ చూడుండి ఎంత గడబిడ అయితదో?" రఘు వివరించి చెప్పాడు.

నాగేశ్ అలాంటి మాటలే కాస్త ఉద్రేకంగా చెప్పాడు. జానకి అతను చెప్పిం దాన్నే మరోవిధంగా చెప్పింది.

తమ వద్ద ఉన్న శక్తిని విడమర్చి చెప్పేవరకు రావడికి కొంత బలం వచ్చింది. తనమీద విశ్వాసం ఏర్పడింది. తన అన్నతో చెపుతానన్నాడు. తెల్లవారి తీసుకొని వస్తానన్నాడు.

"ఎవ్వరికి ఎరక కావద్దు" హెచ్చరించాడు నాగేశ్.

"ఎరక కానిస్తనుండి, కాల్మొక్త, పానాలు పోవు. ఊరిడిచి పొయ్యేడిదాక చీమకు తెల్వదనుకోండ్రి, నీ బాంచను" అని వెళ్ళిపోయాడు రావడు.

మరుసటిరోజు రాత్రికి రావడు అన్నను తీసుకొని వచ్చాడు. అన్నకూ అనేక అనుమానాలు కలిగాయి. నలుగురూ కలిసి వాటికి సమాధానాలు చెప్పారు.

ఇలా వారం రోజులు జరిగిం తరవాత మంగళ్ళిద్దరూ ఊరు విడిచి పోవటా నికి సిద్ధం అయినారు. ముందు ఆడవాళ్ళను బళ్ళలో ఏదో నెపంమీద పంపేశారు! ఒకనాటి రాత్రి మంగళ్ళిద్దరూ మాయం అయినారు.

తాసిల్దారు బాగా పొద్దెక్కిం తరవాతగాని లేవడు. అందుకు కారణం అతనికి రాత్రి తొమ్మిదికిగాని సాయంకాలంగాదు. అప్పటిదాకా వ్యవహారాలు సాగిస్తాడు. ఇంట్లో దూరి గంట విశ్రాంతి తీసుకుంటాడు. పది తరువాత అతని తాగుడు ప్రారంభం అవుతుంది. తాగుడంటె తానొక్కడు తాగడు. మగవారితో కలిసి పొత్తిగా తాగడు. అంత పెద్ద జాగీరులోనూ అతనికి అంతరంగికుడు ఒకే ఒకడు. అతడు కులశేఖరరావు—గిర్దావరు. గిర్దావరు తాగడని కాదు. కాని తాసిల్దారు ముందు తాగడు. తాగే ధైర్యంలేదు అతనికి. అయితే తాసిల్దారు పానగోష్ఠి పద తులతో సాగుతుంది. తాసిల్దారు ఇంట్లో ఉన్న విశాలమైన హాలు ఆ సమయానికి అందుకు సిద్ధం చేయబడుతుంది. పెట్రోమాక్సు లైట్లతో వెలిగిపోతుంది. అంగనలు అందంగా అలంకరించుకుని అక్కడికి సిద్ధం అవుతారు. తాసిల్దారు వచ్చి పరుపు మీద పరచిన చలవ చద్దరుమీద కూర్చొని బాలీసుకు ఆనుకుంటాడు. నిప్పువంటి సారాయి అక్కడికి చేరుతుంది. అబ్కారీ కంట్రాక్టర్లకు అందులో నీరు కలిపే ధైర్యం ఉండదు.

తాగుడు ప్రారంభిస్తాడు తాసిల్దారు. తాను స్వయంగా కొందరికి తాగిస్తాడు. ప్రమదలు అతనికి తాగిస్తారు. మత్తెక్కితే గానా బజానా కావాలంటారు. అప్పుడు డోలక్ మ్రోగుతుంది. హార్మోనియం శృతి కలుపుతుంది. గజళ్ళు, కవాలీలు సాగుతుంటాయి. ఆ హాలు సంగీతంతో మారు మ్రోగుతుంది. అతడు అందిన అతివను ఆలింగనం చేసుకుంటాడు. క్షణంలో వదిలేస్తాడు. మరొక అమ్మాయిని ముద్దు పెట్టు కుంటాడు. ఒక దాని కురులు సవరిస్తాడు. ఒక దాని బుగ్గమీద చిటిక వేస్తాడు. ఒకదాని బుగ్గ గిల్లుతాడు. ఒకదాని కళ్ళల్లోకి చూస్తాడు. ఒకదాని పాట ఆపుతాడు.

మరొక దాన్ని పాడమంటాడు. ఒకసారి తానే ఢోలక్ వాయిస్తాడు. ఒకసారి హార్మోనియం అందుకుంటాడు పాట కూడా పాడ్తాడు. అతని గొంతు బాగుండదు. అయినా అందరూ శ్రావ్యంగా ఉందంటారు. వింటారు. ఆ విందు ఎంతసేపు సాగుతుందో చెప్పలేం కాని అక్కడే పడి నిద్రపోతాడు తాసిల్దారు. ఏ తెల్లవారు ఝామునకో నిద్ర పడుతుందతనికి.

అందుకే అతడు పదింటికి కాని లేవడు. లేవగానే కాలకృత్యాలు తీర్చుకొనే వరకు యిద్దరు మంగళ్ళు హాజరుండాలి. పావుశేరు ఆముదం అతనికి వంటికి పట్టించి మర్దన చేయాలి. అతనికి వళ్ళు నొప్పులు అందుకు అది ఔషధం. ఇద్దరు మంగళ్ళు గంటసేపు మర్దన చేసిం తరువాతగాని అతడు మనిషికాడు. తరవాత గంట స్నానం చేస్తాడు. అతడు సబ్బు రుద్దడు సున్నిపిండి, చందనపుపొడి రుద్దుతాడు. అది ప్రత్యేకంగా హైదరాబాదు నుంచి వస్తుందతనికి. తరవాత భోజనం. అతడు భోజన ప్రియుడు. పదిరకాల మాంసాలు, అయిదురకాల ఊరగాయలు, పచ్చళ్ళు, పెరుగు, వెన్న, మీగడ, హల్వాలు అతనికి నిత్యం ఉండాల్సినవి. అతడు భోజనానికి బకాసురుడు. భోజనానంతరం పడకవేస్తాడు. కుంభకర్ణుడు అవుతాడు. నిద్రలేచి ఫలహారం చేసి చాయ్ తాగిగాని అంగణంలోకి రాడు, అప్పటికి మూడు అవుతుంది. అప్పణ్నుంచి అతని వ్యవహారం ప్రారంభం.

ఆ రోజు మామూలుగానే లేచాడు తాసిల్దారు. చేతులు కట్టుకొని నుంచో వాల్సిన మంగళ్ళు కనిపించలేదు. అది అసాధారణం! అతని జీవితంలో అదే మొదటిసారి. అందువల్ల అగ్గి అయిపోయాడు. కేకలు పెట్టాడు. ఇంటి పెంకులు ఎగిరిపోయాయి. ఊర పిచ్చికలు చచ్చిపడ్డాయి. మంగళ్ళను చీలుస్తానన్నాడు. నిలువునా పాతేస్తానన్నాడు. ఆ కేకలు విని గుమికూడిన జనంమీద ఎగిరాడు. మంగళ్ళను కట్టి పట్టుకురమ్మని ఆజ్ఞాపించాడు. జనం పరిగెత్తారు. పిట్టల్లేని గూళ్ళలా ఉన్నాయి ఇండ్లు. ఆ మాటే విన్నవించారు తాసిల్దారుకు. వెంటనే నొప్పులు పట్టుకున్నాయి తాసిల్దారుకు. పడిపోయాడు. అరవసాగాడు. ఏడ్వసాగాడు. నొప్పులు, నొప్పులు, నొప్పులు ప్రాణాలు తీస్తున్నాయి. మంగళ్ళు లేరు ఎలా బ్రతుకుతాను ? అని మొత్తుకుంటున్నాడు. కొంత సేపటికి వగర్పు వచ్చేసింది.

ఆమీను వచ్చాడు. చేతులు కట్టుకొని నుంచున్నాడు. అప్పటికే జరిగిందంతా తెలుసుకున్నాడు తాసిల్దారు. ఆమీనుకు అధికారం లేదన్నాడు. ఉద్యోగం ఊడపీకేస్తానన్నాడు. తాసిల్దారు తనమీదనే తప్పంతా వేస్తున్నాడు. ఏం చేయాలో అర్థం కాలేదు ఆమీనుకు. ఇంతలో గిర్దావరు వచ్చాడు. అతని మీదకూడా ఎగిరాడు. ఆమీన్ను అక్కణ్ణుంచి వెళ్ళిపొమ్మన్నాడు తాసిల్దారు. మంగళ్ళను తీసుకొని రాకుండా తనకు ముఖం చూపించవద్దన్నాడు. వగరుస్తున్నాడు, ఏడుస్తున్నాడు.

ఆమీను బాధ ఆమీనుకు పట్టింది. భార్యకు గత్త అయింది, సలుపుతున్నది. మంగలి లేకుండా యింటికి రావద్దని చివాట్లు పెట్టి పంపింది పెళ్ళాం. ఏం చేయాలో

తోచక గిర్దావరును ఆశ్రయించాడు. గిర్దావరు బాధ గిర్దావరుకు ఉంది. అతని కొడుకు పుట్టు వెంట్రుకలు తీయడానికి ఆ రోజే ముహూర్తం. మంగళ్ళు లేక తికమక పడుతున్నాడతను.

ఊరంతా తాసిల్దారును చూడ్డానికి వచ్చారు. వెంకయ్య రాలేకపోయాడు. అతని కాలు బెణికింది. తోమేవాడు లేడు. బాధకు తోడు తాసిల్దారు దగ్గరకి వెళ్ళకుంటే ఏమనుకుంటాడోనని తహతహలాడాడు.

ఊరంతా ఉడికిపోయింది, మంగళ్ళు—మామూలు మంగళ్ళు ఎంత పని చేశారు! ఊరందరినీ ఏడిపిస్తున్నారు! అందుకు కాదు. ఆ రోజు తాసిల్దారు అధికారానికి మొదటి గండి పడింది. అందుకు జనం సంతోషించాల్సింది ఆశ్చర్యపోయారు.

మంగళ్ళు అచ్చం క్షౌరాలు చేసేవారే కారు. పల్లెలలో వారు వైద్యులు. బెణుకులు సరిచేస్తారు. వ్రణాలకు శస్త్రచికిత్స చేస్తారు. వాద్యాలు వాయించేదీ వాళ్ళే. గ్రామ జీవితంలో వారు ప్రధానాంగం. మంగళ్ళు, చాకళ్ళు, కమ్మర్లు, కుమ్మర్లు గ్రామజీవితానికి అతి ముఖ్యులయిన స్తంభాలు. అందుకే మళ్ళిచ్చి, మాన్యాలిచ్చి వాళ్ళను ఊళ్ళల్లో తెచ్చి ఉంచుకున్నారు గ్రామ నిర్మాతలు. మంగళ్ళలోను, చాకళ్ళలోను ఐక్యత ఎక్కువ. వారు గ్రామంలోని ఇండ్లను పంచుకుంటారు. ఒకరు చేసే ఇంటికి మరొకరు చస్తే వెళ్ళరు. అది వారి కులపుకట్టు. అది అనాదిగా వస్తున్నది. అందుకే మరో ఊరినుంచి మంగళ్ళను పిలిపించాలనే గిర్దావరు ప్రయత్నమూ, అమీను అధికారమూ ఫలించలేదు.

ఆ రోజు గడిచిపోయింది. తాసిల్దారు బయటికి రాలేదు. ప్రభుత్వం స్తంభించిపోయింది. అతనితో పాటు అదీ మూలగ సాగింది. ఇద్దరు మంగళ్ళు ఎంత సంక్షోభం తెచ్చారు! ఊర్లో ఏ ఇద్దరు కలిసినా అదే విషయం మాట్లాడుకోసాగారు. తాసిల్దారు సర్వశక్తిమంతుడు కాదని తేల్చుకున్నారు.

వారం గడిచింది. తాసిల్దారు చిక్కిపోయాడు జీవచ్ఛవం అయిపోయాడు. అప్పగింతలు పెట్టే దశకు వచ్చాడు. మంగళ్ళు వస్తేచాలు. అందుకు ఏ షరతులైనా అంగీకరించడానికి సిద్ధం అయినాడు. అలాంటి ఆదేశమే ఇచ్చాడు అమీనుకు, గిర్దావరుకు.

మంగళ్ళకోసం గాలింపు నిరంతరం సాగుతూనే ఉంది. వారు బస్తీలో బస చేశారని జాడతెలిసింది. గిర్దావరు మనుషుల్ని పంపాడు. రామన్నారు. అమీను జవాన్లను పంపాడు. నిరాకరించారు. తాసిల్దారు అమీను మీద అరచాడు స్వయంగా వెళ్ళి తీసుకురమ్మన్నాడు. అధికారం అడ్డం వచ్చింది అమీనుకు. గిర్దావరును కూడా రమ్మన్నాడు. గత్యంతరంలేదు. వెళ్ళాడు. ఇద్దరు అధికార్లు అమీను, గిర్దావరు—మంగళ్ళ ఇంటికి వెళ్ళారు. తాసిల్దారే స్వయంగా తమను పంపించాడన్నారు. మంగళ్ళు షరతులు పెట్టారు. లాక్కున్న భూమి తమకు ఇవ్వాలి. మాన్యానికి

మంగలి పనికీ సంబంధంలేదు. తాము చేసిన ప్రతిపనికీ డబ్బు చెల్లించాలి. ఆ విషయం తాసిల్దారుకు కూడా వర్తిస్తుంది. షరతు లన్నింటికీ అంగీకరించారు అధికార్లు.

మంగళ్ళు గ్రామానికి వచ్చారు. వారు కనిపించగానే ప్రాణం లేచి వచ్చింది తాసిల్దారుకు! మాలీషు చేయమన్నాడు. ఇద్దరు మంగళ్ళు అతనిమీద పడ్డారు. అర్థశేరు ఆముదం మర్దించారు.

తాసిల్దారు వారికి ఐదు రూపాయలిచ్చాడు.

మంగళ్ళు ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు.

వారి చూపుల్లో విజయగర్వం తొణికిసలాడింది.

మూడు గంటలకు అంగణంలోకి వచ్చాడు తాసిల్దారు.

ప్రభుత్వం మళ్ళీ సాగింది.

"మంగళ్ళు ప్రభుత్వాన్ని స్తంభింపచేశారు." ఈ విషయంలోనే చర్చ సాగింది. ఆ రోజు వీరయ్యగారింట్లో. సమావేశానికి వీరయ్యగారు కూడా వచ్చారు.

## 3

చో ఓ ఓ ఓ ఓ
ఓ ఓ ఓ ఓ ఓ ఓ
ధన్ ధనాధన్ ధనాధన్
ధనాధన్ ధనాధన్ ధన్
ఆఁ........ఆఁ........ఆఁ........
చో చో చో చో
జలారేలా రేల రేల రేలా
జలరేలా రేల రేల
హో జలరేల రేల రేల

డోలు సూరయ్య డోలు వాయిస్తూ పాడుతున్నాడు. కోయగూడెం యావత్తూ కేరింతలు వేస్తూ ఆడుతున్నారు. ఆడా మగా, పిల్లా జల్లా అంతా చేరారు. అందరూ అడుగులువేస్తూ పాడుతున్నారు. అందరూ సూరయ్యతో గొంతులు కలుపుతున్నారు. అడుగులు కలుపుతున్నారు. ఇప్పపూల సారాయి త్రాగుతున్నారు. వారి గుండెల్లో ఆనందం నిండివుంది. వారి మనసులు పొంగి పొరలుతున్నాయి. పాటల రూపంలో పరుగులు తీస్తున్నాయి.

వారు ఆటవికులు నాగరికత ఎరుగనివారు. ఇంకా రాతియుగంలో ఉన్న వారు. రాతియుగం అంటే ఏమిటో తెలియని వారు. వారికి తెలిసింది జీవితం.

జీవితం మాత్రమే. వారి జీవితాలు ప్రాకృతములు ఎండవంటివి. కార్చిచ్చు వంటివి. గ్రీష్మం వంటివి. వసంతం వంటివి. శిశిరం వంటివి. చంద్రుని వంటివి. వెన్నెల వంటివి.

వారి హృదయాల వలెనే చంద్రుడు నిండుగా వున్నాడు. వెన్నెల విరుస్తు న్నాడు. జారుస్తున్నాడు. పరుస్తున్నాడు. వారితో నవ్వుతున్నాడు. కేరింతలు పెడు తున్నాడు.

చుట్టూ కొండలు. కొండలమీద దట్టమైన అడవి. అడవిలో నెమళ్ళు, లేళ్ళు, జింకలు, ఎలుగ్గొడ్లు, చిరుతపులులు, పెద్దపులులు ఉంటాయి. ఆ కొండల మధ్యన ఎత్తు ప్రదేశాన ఉన్న పాతిక పర్ణశాలలు కోయగూడెం.

వెన్నెలలో తాన మాడింది కోయగూడెం. చెట్లూ, గుట్టలూ, వెన్నెల పులుముకుని చెవులు రిక్కబొడిచి పాటలు వింటున్నాయి. కనులు చీల్చుకొని వారి ఆనందాన్ని తిలకిస్తున్నాయి.

"హేయ్ హెయ్ హెయ్ హేయ్
హెయ్ హేయ్, హెయ్ హేయ్"

నిన్నటి తెల్లవారుజామున నెమళ్ళు కూశాయి. కూయడం కూయడం ఒక్కటికాదు—అనేకం కూశాయి. ఒకసారి కూసి ఊరుకోలేదు. కూస్తూ ఉండి పోయాయి. అది కోయదొరలకు వర్షం రానున్నదనే చిహ్నం. వర్షం వారికి ప్రాణం. అందుకే వారి ప్రాణాలు లేచివచ్చాయి. విత్తనాల పండుగ జరుపుకుంటున్నారు. వారికి ఇతర పండుగలులేవు. ఇదే పండుగ. నెమళ్ళ కూతకు ఎదురు చూస్తాడు కోయ. అది కూసిందంటే మేఘాన్ని చూచి మయూరంవలె నృత్యం చేస్తాడు.

బొడ్రాయి వారికి దేవత. దానిచుట్టూ కూడారు జనం. బుట్టల్లో నవధాన్యాలు తెచ్చారు. బొడ్రాతికి మేకలు కోశారు. వాటి రక్తం విత్తులమీద చిలకరించారు. అంతేచాలు. పొలి కలుగుతుంది. అంతటిలోనే పొంగి పోతాడతను.

అతనికి నేలకు కరువులేదు. దానికోసం అతడు పోట్లాడి ఎరుగడు. ఉక్కు జాంటి శరీరం అతనిది. గొడ్డలి భుజాన వేసుకొని అడవిలో దూరాడా అడవి కొట్టాడు పొలం చేసుకుంటాడు. నాగలి పట్టాడా నగాలను సయితం నుసి చేయ గలడు. చెమటోడ్చి పంటలు పండిస్తాడు. పంటల రాసులను చూసి మురిసిపోతాడు. అంతవరకే అతని ఆనందం. సాహుకారు వస్తాడు. పంటలన్నీ తుడుచుకొని పోతాడు, అతనికి ఆధారం తన రెక్కలే. ఆడా మగా అడవిమీద పడ్తారు. కాయ గసరు తెచ్చుకుంటారు దుంపలమీద జీవనం గడుపుతారు.

అతడు తనకోసం పండించడు.

మేఘం తనకోసం వర్షించదు.

"హో ఓ ఓ ఓ ఓ
ఓ ఒ ఓ ఒ ఓ

జల రేల రేల రేల

జల రేలా రేలా రేల"

వారికీ ఒక శాస్త్రం ఉంది—వారికీ ఒక పురాణం ఉంది. దాన్ని చెపుతుంటాడు డోలువాడు. దానినే మననం చేసుకుంటున్నారు ఇప్పుడు వారు. అదే వారికి మంత్రం. అతడే వారి పురోహితుడు.

హేయ్ హెయ్ హెయ్ హేయ్

హెయ్ హేయ్ హెయ్ హెయ్

"ఉస్స్ ఏం దే పొద్కపోతున్నావు. ఎట్లొచ్చిందే చారసట్టం. ఎట్లొచ్చిండే డోలోడు. ఎట్లొచ్చిందే మనకు పదం ? ఇయ్యన్ని చెప్పరాదె సూరన్న." సమ్మయ్య అడిగాడు.

సూరన్న — సక్కసూరన్న ఇప్పసారాయి బాగా తాగాడు. పిడికెడు మీసాలు అతని ముఖానికి నిండుదనాన్ని ఇస్తున్నాయి. కండ్లు ఎర్రగా వున్నాయి. వెన్నెలలో మెరిసిపోతున్నాయి. అయినా అతడు స్పృహ తప్పలేదు. తరతరాలుగా వచ్చిన కథ చెపుతున్నాడు.

"చో ఓ ఓ ఓ ఓ

ఓ ఒ ఓ ఒ ఓ

ధన్ ధనా ధన్ ధనా ధన్

ధనా ధన్ ధనా ధన్ ధన్"

జల ప్రళయమొచ్చింది. కలియుగమంత నీల్లల మునిగిపోయింది. సముద్రం మీదికి కలకోడి వచ్చింది. ఆమె ఆదిశక్తి రూపం, మహాతల్లి అవతారం. కలకోడి గుడ్డు పెట్టింది. అది వెయ్యేళ్ళ తరువాత చితికిపోయింది. ఇంకో గ్రుడ్డు పెట్టింది. అదికూడా వెయ్యేళ్ళ తరువాత చితికి పోయింది. కలకోడి కలికోడి— దుఃఖించింది. మూడవగుడ్డు పెట్టింది. దానిమీద కూర్చొని పొదిగింది. వెయ్యేళ్ళకు అది పగిలింది. పై చిప్ప ఆకాశం అయింది. కిందిది భూమిగా మారింది. గుడ్డు లోంచి పుట్టినవారు కామధేనువు, విష్ణువు, ఈశ్వరుడు. కామధేనువు నాలుగు తోకలు, రెండు తలలు, నాలుగు కొమ్ములతో పుట్టింది.

కలకోడి ఆదిశక్తి అయింది. తనతో భోగించమన్నది. ఈశ్వరుడు తల్లితో భోగించనన్నాడు. ఆదిశక్తి తనకు అమ్మ కాదన్నాడు విష్ణువు. అమ్మమ్మ అన్నాడు. తాను భోగిస్తానన్నాడు. అడిగిన వరం ఇవ్వాలన్నాడు. ఇస్తానన్నది. విష్ణువు భోగించాడు. ఆదిశక్తికి ఆదిరాజు పుట్టాడు.

అతడన్ని లోకాల నేలినాడు

అందుకోసమే మీరు చారసట్టపోరూ

చో చో చో ఓ ఓ ఓ ఓ

జల రేల శేలా రేల

జలా రేల రేలా రేల
హెయ్ హెయ్, హెయ్ హెయ్ హెయ్
హేయ్ హెయ్ హేయ్ హెయ్ హెయ్

అడుగులు ముందుకూ వెనక్కూ వేస్తూ నృత్యం చేస్తున్నారు. కోయ యువకులు, యువతులు చెట్టపట్టాలు పట్టుకొని ఎగురుతున్నారు. వెన్నెలను వెక్కిరిస్తూ కిలకిలా నవ్వుతున్నారు. ఇప్పపూవు సారాయి సేవిస్తున్నారు. తైతక్కలాడుతున్నారు. గుసగుస లాడుతున్నారు. వారి ఆనందం అవధులుదాటింది. అయినా చెలియలి కట్టకుతాకి కెరటం విరిగి పడుతూంది. మరొక తరంగం ఊయల లూగుతూ వస్తూంది. వయ్యారంగా వస్తూంది. విరిగి పడుతూంది. వెదురు గడలలో తుమ్మెదలు రంధ్రాలు చేశాయి. వాటిలోనికి గాలిజోయి వేణుగానం ఆలపిస్తూంది.

జల రేల రేల రేల
రేలరే జల రెలరే

"ఉస్స్! టక్కునాపితివేమే సూరన్న. మల్లి దోలోడెట్లొచ్చెనో చెప్పకపోతివి" అడిగాడు సమ్మయ్య.

ధన్ ధనాధన్ ధనాధన్
ధనాధన్ ధన్ ధనాధన్
ఆదిశక్తి అక్కడనే ఆసువులు బాసింది
ఆదిరాజు ఒక్కడుగా దిగులు పొందినాడు.

ఆదిశక్తి ప్రాణాలు విడిచింది. మల్లపోయి మడుగులో పుట్టింది. కాళింది మడుగులో పుటింది! ఆదిరాజు దిగాలుపడినాడు. ఆదిశక్తి చేప అయిందని గ్రహించినాడు. ఆదిరాజు గాలం తయారుచేశాడు. మద్దిచెట్టును కర్రచేశాడు. వాసుకిని తాడుచేశాడు. ఏదుపంది కొమ్మును సీకుగా పెట్టాడు. మదపు పద్దను-అడవి బర్రెను ఎరగా గుచ్చాడు; ఆదిరాజు సప్తసముద్రాలు తిరిగాడు. ఎక్కడా చేప దొరకలేదు. భూలోకమంతా తిరిగాడు. కాళింది మడుగుకు వచ్చాడు. గాలం వేశాడు. ఒడ్డున కూర్చున్నాడు. చేప పడింది. గాలం తీశాడు. ఆదిశక్తి వచ్చింది. ఇద్దరూ పెళ్ళాడారు.

వారికి నూటొక్కమంది పుత్రులు పుట్టారు. నూటొక్కమంది చన్నుకుడవసాగారు. పాలు అయిపోయాయి. రక్తం కారసాగింది. విసిగిపోయింది ఆదిశక్తి. నూటొక్క మందిని చంపమన్నది. ఆదిరాజు భార్యమాట విన్నాడు. నూటొక్క మందిని తీసుకొని అడవికి బయలుదేరాడు. అవును అడవికి బయలుదేరాడు. తల్లి వారిని చంపమన్నది? అడవిలో వదలమన్నది. తండ్రి వారిని తీసుకొని బయలుదేరాడు. నూటొక్కమంది తండ్రితో వెళ్తున్నారు. వారికి దాహం వేసింది. నాలుకలు ఆరుకుపోతున్నాయి. ఏం చేయాలో తోచలేదు ఆదిరాజుకు. ఒక దసిని చెట్టు కనిపించింది. దసినికాయ కోశాడు. సీళ్ళున్న చోటికి వెళ్ళాడు. అందులో నీరు నింపాడు. అయిదు మానికల నీరుపట్టింది. అందరికీ దాహం తీర్చాడు. వెంట తీసు

కొని బయలుదేరాడు. అప్పటికి పొద్దుకుంగింది. చీకట్లు కమ్మాయి. వారు మర్రి వృక్షం క్రిందికి చేరారు. నూటొక్కమంది నిద్రపోయారు. మర్రికొమ్మకు సీమన్న దశినికాయ కట్టాడు ఆదిరాజు. దానికి నూటొక్క రంధ్రాలు చేశాడు. నూటొక్క రంధ్రాలనుంచి నీరు రాసాగింది. ఆ నీటితో పెదవులు తడుపుకొని నిద్రపోయారు. ఆదిరాజు పిల్లలను వదిలాడు. బయలుదేరాడు. పిల్లలకు ఆకలి అయింది. అంతా లేచి నేలను గోళ్ళతో త్రవ్వారు. ఆ మట్టిని తినేశారు. అక్కడ పెద్ద గుంట అయింది. అదే వానసీటితో నిండి చెరువు అయింది. మన్నుతిని నిద్రపోయారు బాలురు. ఆదిరాజు తిరిగి తిరిగి చిలకల పర్వతం చేరాడు.

పర్వతము నెత్తిండు పట్టుకొని వచ్చిండు.

పడుకున్న పిల్లలా మీద వేసిండు.

ఆదిరాజు పర్వతాన్ని పిల్లలమీద వేశాడు. తండ్రి బిడ్డలను చంపుతున్నాడు. భూదేవి చూచింది. గడగడలాడింది. భూమి బద్దలైంది. పిల్లలను అందులోకి చేర్చింది. పిల్లలు భూమిలోకి వెళ్ళారు. ప్రయాణం సాగించారు. నాగలోకం చేరుకున్నారు. నాగలోకంలో నాగేంద్రుడికి రాచపుండు పుట్టింది. పన్నెండేండ్లనుంచి బాధ పెడుతూంది.

భూలోకంనుంచి కోయలొచ్చిరని విన్నాడు.

వారికి చెట్లామందులు తెలుసనుకున్నాడు.

నాగేంద్రుడు కోయదొరలను పిలిచాడు. నూటొక్కమంది కోయదొరలు వెళ్ళారు. నాగేంద్రుడు తన బాధ వివరించాడు. నయం చేయమని ప్రార్థించాడు. రాజులు నయం చేస్తామన్నారు. తాము కోరింది ఇవ్వాలన్నారు. ఇస్తానన్నాడు నాగేంద్రుడు. బెరంబోయనరాజు బయలుదేరాడు. సిరిబొద్దు చెట్టును తవ్వాడు. వేళ్ళతోసహా తెచ్చాడు. రాచపుండు మీద వేశాడు. గుడ్డ కట్టివేశాడు. సిరిబొద్దుచెట్టు తగిలిందా రాచపుండు పగిలిందా నాగేంద్రుడు నిద్రపోయాడు. పన్నెండేండ్లు నిద్రపోయాడు. లేవగానే కోయలను పిలిపించాడు. ఏం కావాల్నో కోరు కొమ్మన్నాడు. నాగేంద్రుని దగ్గర నాగళ్ళతంబ వాయించే వాడున్నాడు. వాడు మంచిగా వాయిస్తున్నాడు. వాని వాయిద్యం వారెవా! ఏం బాగున్నది!! దొరలు డోలువాణ్ణి ఇవ్వమన్నారు. డోలు పోతే తన బతుకు లేదన్నాడు నాగేంద్రుడు. బ్రతిమిలాడాడు దొరలను. ఇచ్చినమాట కాదనమన్నారు దొరలు. తమకు డోలువాడె కావాలన్నారు. నాగేంద్రుడు చాల దుఃఖించాడు. కన్నీటితోనే డోలువాణ్ణి సాగ నంపాడు.

"నాగేందుర్రిడు వాణ్ణి సాగనంపినాడు
వాడె మీకు డోలువాడైనాడు"

డోలోణ్ణి తీసుకొని దొరలు బైలెళ్ళినారు. వారూ భూలోకానికి వచ్చినారు. వారు నడిచి నడిచి డస్సినారు. దాహంతో తపించసాగారు. అప్పుడు వారికి

రెండుబండల సందునా
రేల చెట్టు కనిపించెను
రేల చెట్టునానుకొనీ
నీరు జలజల పారెను

అప్పుడు వారు సంతోషించారు. నీటిని చూచి గంతులేశారు. పాట పాడారు. అదే కోయల మొదటిపాట.

జలా రేల రేలా రేల
రేలారె జలా రేల
చో ఓ ఓ ఓ ఓ
జలా రేల రేలా రేల

వేగుచుక్క పొడిచింది. డోలు సూరన్న అలశాడు. రేయి సైతం అలసి సొక్కిపోయింది.

హేయ్ హేయ్ హేయ్ హేయ్
హేయ్ హేయ్ హేయ్ హేయ్

చెట్టాపట్టాలు పట్టుకొని అడుగులు ముందుకూ వెనక్కూ వేసూ విడిపోయారు. కిలకిలమంటూ గుడిసెల్లో దూరారు. యువతులు, యువకులు నాగళ్ళు తీసుకొని భూమిని చీల్చడానికి బయలుదేరారు. గింజల బుట్టల్తో యువతులు వారి వెంట వచ్చారు.

కోయలగూడెం నిర్మానుష్యం అయింది. పిట్టలు ఎగిరిపోయాయి. పొద్దు గూకితేగాని తిరిగిరావు. గూళ్ళన్నీ రిక్తబోయాయి. గూడెం రిక్తంగా వుంది. బోసిగావుంది. బోడిగావుంది. గడచిన రాత్రిని వెక్కిరిస్తుంది. నవ్వుతూంది.

రాత్రి చెదిరిపోయింది. చెరిగిపోయింది. సంబరాలు మాయం అయినాయి. అంబరాల్లో కలిసిపోయాయి. అయినా కోయల మనసుల్లో ఆ రాత్రి ఇంకా గిలిగింతలు పెడుతూనేవుంది. ఆలాపనలా పిల్లనగ్రోవి పాడుతూనేవుంది. కలలా కళ్ళల్లో కదలాడుతూనే వుంది. అదీ పోయింది.

ఆ రేయి కలలా కరిగిపోయింది
సెలయేటిలా పారిపోయింది
మంచులా మాయం అయింది
పూల జల్లులా రాలిపోయింది

కోయకు కష్టం లెక్కకాదు. సూర్యుడు అలాకాదు. అలిసిపోయాడు. కొండ చాటుకు చేరాడు. పశ్చిమాన పద్మరాగాలు పొదిగాడు. అడవిలో చీకట్లు గుంపులు గుంపులుగా చేరుకుంటున్నాయి; పిట్టలతోపాటు కోయలు గూళ్ళకు వచ్చారు. కోయ బుడతలు పశువులను మళ్ళించుకొని వస్తున్నారు. పడుచులు అరకలతో తిరిగి వస్తున్నారు. పడతులు గంపలతో తిరిగి వస్తున్నారు. పాడుతూ వస్తున్నారు. ఆడుతూ

వస్తున్నారు. గంతులువేస్తూ వస్తున్నారు. సూర్యునివలె అలసిపోయేవాడుకాదు. కోయ శ్రమలో అందాన్నీ, ఆనందాన్నీ సంతరించుకునే వాడతను. ఆనందంతోనే తిరిగి వచ్చారు. గూడెం ప్రాణం పోసుకుంది. సందడి మొదలయింది. కేకలు అరుపులు కేరింతలు వంటలు కోయగూళ్ళలోంచి పొగ మబ్బులు లేస్తున్నాయి.

గూడెం మొగదలలో గజ్జె ఘల్లుమన్నది. గూడెం గుండె జల్లుమన్నది. అది బల్లేనికికట్టినగంట. దానిధ్వని గూడేనికి తెలుసు. అది పట్టుకున్నవాడు తలారి శివుడు. కావాలనే గూడెముందు ఘల్లు మనిపించాడు శివుడు. గూడెంలో ప్రవేశించాడు. గుడిసెల్లోంచి జనం బయటికి వచ్చి చూడసాగారు. శివుడు సాగిపోతున్నాడు. అతడు అధికారానికి చిహ్నం. కోయ పులితో పోరగలడు. కొండలను నుసిచేయగలడు. కాని అధికారులంటే హడలిపోతాడు. అది వారి బలహీనత, అదే దొరతనపు బలం.

శివుడు బల్లేన్ని గల్లుమనిపిస్తూ సాగిపోతున్నాడు. కోయల గుండెలు పీచు పీచు మంటున్నాయి. ఈ బల్లెం రాబోయే తుపాకికి చిహ్నం. ఎవరు రామన్నారో! ఏం చేయాలో? ఈ భయమే ప్రతి కోయకంట్లో కనిపించింది. మూగగా కళ్ళు మాట్లాడుకున్నాయి. అవి బెదిరిన లేళ్ళ కళ్ళు !

శివుడు నేరుగా సమ్మయ్య ఇంటికి గూటికి చేరాడు. సమ్మయ్య దొరలకు దొర. గూడేనికి అతడంటే గురి. అతని కనుసన్నలమీద నడుస్తుంది గూడెం. అంటే అతని గుడిసె పెద్దదని కాదు. అతడు వంటినిండా బట్ట కట్టుకోడు. అతడూ అందరి లాంటివాడే. అయినా అతడు పెద్ద. అది అనూచానంగా వస్తున్న సాంప్రదాయం.

గుమ్మంలో గజ్జల చప్పుడు విని మంచంలో కూర్చున్న సమ్మయ్య దిగ్గున లేచాడు. శివడు రావటం సమ్మయ్యను పక్కకు నెట్టడం, మంచంలో వాలిపోవడం క్షణంలో జరిగాయి.

సమ్మయ్య బొమ్మలా నుంచున్నాడు పక్కన.

"ఏందె, అట్ల నిలబడ్డవు. చచ్చిపడి వస్తునని ఎరికెలె. జరన్ని నీలన్న పోస్తరలేదా ! నీలుగుడు గానెక్కింది దొరలకు" అన్నాడు మంచంలో పడుకునే శివయ్య.

సమ్మయ్య కదిలాడు. నీళ్ళు తెచ్చి అందించాడు. శివనికి కోపం వచ్చింది. విసిరిపారబోశాడు. "నీలు తాగేటందుకు కోయగూడానికి వస్తామె. ఇన్ని సారానీలో, కల్లు నీలో పొయ్యాలేగాని. దొరలొస్తైగాని తెల్వద తడాఖా, తెచ్చిపెట్టె జరన్ని సారానీలు. కాళ్ళు పీక్కపోతున్నాయి" మొదలు పెట్టింది ఉద్రేకంగానే అయినా చల్లగా ముగించాడు.

సమ్మయ్య ఇంట్లో సారాయి నిండుకుంది. బయటికి ఉరికి పట్టుకొని వచ్చాడు. ఈలోగ్గా అలసట తీర్చుకొని చుట్ట కాల్చుకున్నాడు శివడు. సమ్మయ్య అందించిన సారాయి గటగటా తాగేశాడు.

సమ్మయ్య నేలమీద కూలబడ్డాడు. శివడు మీసాలు మెలేస్తూ మంచం మీద కూర్చున్నాడు. ఒక్కొక్కరూ వచ్చి మంచంచుట్టూ చేరారు.

"ఏమె శివన్న మల్లెవరొస్తాన్రె" అడిగాడు సమ్మయ్య.

"గిర్దావర్ దొరస్తాండు అమీన్ దొరస్తాండు"

కూడినవారి గుండెలు గుబగుబ లాడేయి.

"మొన్ననె వచ్చిరి. ఉన్నయన్ని ఊడ్చక పోయిరి. మల్లెందుకొస్తాన్రె" సమ్మయ్య కొడుకు సింగన్న ప్రశ్న. అది అందరి మనసుల్లో మసలుతున్న ప్రశ్నే కాని అడిగింది సింగన్న. అంతా అతన్ని గుండె జల్లుమన్నట్టు చూచారు. అడగరాని ప్రశ్న అడిగినట్లు చూచారు. అనడమయితే అన్నాడు కాని సింగన్న విచారపడ్డాడు. అందరి చూపులు అతని చూపులను నేలకు దించాయి.

కొరకొర చూచాడు శివడు, "సర్కారు చేస్తాన్రా ఇంకేమన్ననా? పన్ను పత్తయి వస్తరు అడిగెటంద్కు నువ్వెవనివిరా?" అదిరించాడు శివడు.

"ఏందో పోరడుకాదె ఎరికలేకడిగిండు గని దొరలెందుకొస్తాను?" అడిగాడు సమ్మయ్య.

"తాసిల్దార్ దొర బంగ్ల కడ్తాండు కద ఎర్కలే."

"మాకే మెరికనే అడ్వీలుండె టోల్లకు. బంగ్లేమన్న అడ్వీల కడ్తడా?"

"అడవి లెందుకు కడ్తడుగని, ఊళ్ళనే కడ్తాండు. పట్నంలకూడ అసువంటి బంగ్ల ఉండదంట. అనుకుంటారు."

"మల్ల అడ్వీకెందుకొస్తాండె ?"

"కట్టె కొట్టి పెట్టొద్దు కోయోల్లంత. మల్ల బంగ్లెట్ల కడ్తడు?"

"ఉస్సి, వానిల్ల కట్టె తెగుతాదె. గొడ్డలేస్తే జారి పడ్తది కాదే దాని అమ్మ...."

"అయ్యన్ని నాకెందుగ్గని. దొరలున్నరు మీరున్నరు. జర సార నీలు చూడండి. రొండు కోడిపిల్లలు తెప్పించుండి. పొద్దాల లేచి మల్ల బోవాలె. గుడిసెకు రూపాయన్నర కట్టియ్యాలె. పోయినసాలి ఊర్కెనె ఎల్లగొట్టిన్రు. ఇయ్యకపోతిరో నీయమ్మ దొంగ భూములన్ని చూపిస్త నీ యక్క మాసూలెంత పెరుగుతదో చూడండి."

కోయగూడెం అదిరిపోయింది. ఆ రాత్రికి శివనికి విందు చేసింది. రూపాయీలు మూటకట్టి పంపించేసింది.

శివడు ఉత్సాహంగా సాగిపోయాడు.

కోయగూడెం జవ చచ్చిపోయింది.

* * *

సూర్యుడు అడవికి బంగారం పులిమి అస్తమిస్తున్నాడు. గూడానికి తిరిగి వస్తున్నాడు సమ్మయ్య. అతనికి లేళ్ళూ, జింకలూ గుంపులు గుంపులుగా పరుగెత్తడం కనిపించింది. అవి బెదిరి పారిపోతున్నాయి. అందే ఎవరో అటునుంచి

వస్తున్నారని సంకేతం. పులి ఏమైనా దండయాత్ర చేస్తుందా ? అనుకున్నాడు. కాని యిది పులికాలం కాదు. ఈ కాలంలో అది అడవివిడాటి బయటికి రాదు. మనుషులే వస్తుండాలి. ఎవరు ఆ వచ్చేది? ఎందుకోసరం వస్తున్నారు? జింకలమంద పారి పోయిన వైపే చూస్తూ నుంచున్నాడు. మనుషుల అలికిడి వినిపించింది. సర్వేంద్రి యాలనూ చెవులలో కేంద్రీకరించి వింటున్నాడు. మాటలు వినిపించాయి. పాటలు వినిపించాయి. కోలాహలం వినిపించింది. గబగబ చెట్టెక్కి చూచాడు. కోయలగుంపు తన గూడెంవైపు వస్తూంది. బరిశెలు, బల్లాలు, తుపాకులు, కర్రలు పట్టుకొని వచ్చేస్తున్నారు, అర్థం చేసుకున్నాడు. ఆ వచ్చేవాళ్ళు క్రింది గూడెంవాళ్ళు. తమ గూడానికి వస్తున్నారు. బహుశా వేటకు సాగిపోవడానికి వస్తున్నారు. అది కోయల ఆచారం. ఒక గూడెంవాళ్ళు మరొక గూడానికి తరలివస్తారు. వచ్చినప్పుడు వారికి ఆతిథ్యం యివ్వాలి. అంతా కలసి అడవిమీద పడ్తారు. వేట సాగుతుంది. అది వారికి ఒక వేడుక. పండుగ, ఆనందం, ఆహ్లాదం, సంబరం.

సమ్మయ్య చెట్టు దిగాడు. గూడేనికి ఉరికాడు. "ఒహ్హో! కింద గూడెమోండ్లొస్తు న్నారు. రాండి, రాండి" అని కేకలు వేశాడు. కోయ గూడెం యావత్తూ కదిలింది. ఎదురేగింది, వచ్చేవారిని కలుసుకుంది. కౌగిలించుకుంది. ఎగిరింది. గంతులు వేసింది. పదాలూ, పాటలూ పాడుతూ గూడేనికి చేరుకున్నారు. ఇక గూడెం అంతరం అంతరించింది. ఇప్పుడంతా కోయగూడెంవారే. గూడేనికి వచ్చింతరవాత స్వ పర భేదంలేదు. వచ్చినవారిని ఆదరించాలి. ఏర్పాట్లు కొనసాగుతూనే ఉన్నాయి. యువకులు, యువతులు, వృద్ధులు గుంపులు గుంపులుగా చేరి అడవిని గురించీ, అడవిలోని సంపదను గురించీ రాబోయే కాలాన్ని గురించీ నెమళ్ళ కేకలను గురించీ, పులి భయాన్ని గురించీ ముచ్చట్లాడుకుంటున్నారు.

రాత్రి అయింది. ఊరి మధ్యన పెద్ద నెగడు లేచింది. దానిచుట్టూ జనం కూడారు. మాంసం కాలుతూంది. పుల్లలతో మంటల్లోంచి లాక్కొని తింటున్నారు. ఇప్పసారాయి విరివిగా ఉంది. సమృద్ధిగా ఉంది. కల్లు కుండలు వచ్చేశాయి.

తాగుతున్నారు.

తింటున్నారు.

పదాలు పాడుతున్నారు.

ఆటలాడుతున్నారు.

రెండు ఊళ్ళు కలిశాయి. రెండు గుండెలు కలిశాయి. రెండు నదులు కలిశాయి. జీవితం నదిలా సాగిపోతుంటుంది. మరొక నది వచ్చి అందులో కలు స్తుంది. అది సంబరపు వేళ. అది ఆనందపువేళ. అల్లాంటి పండుగ జరుపుకుంటు న్నారు కోయలు.

పడుచులకు అది మహా పర్వం. యువకులకు ఊళ్ళోని యువతులంతా అక్కచెల్లెండ్లె. ఊరంతా ఒకే కుటుంబం. ఒకే పెద్ద నుంచి వచ్చిన తెగ. పక్క

ఊరి యువతులే మరదళ్ళు. ఊరి యువకులకు మరదళ్లు దొరికారు. చెట్టాపట్టాలు పట్టుకొని ఎగురుతున్నారు. వారి గుండెలు గంతులు వేస్తున్నాయి. కోయ యువతి గుండె విప్పి చూపుతుంది. ఆమెకు దాచవలసింది లేదు. ఆమెకు రహస్యాలు లేవు. ఆమె అడవి బిడ్డ. అడవిలో దాచేదే ఉండదు. మగవాడు మొనగాడు. అడవిలోకి దూరాలి అంతే. అన్నీ అతనివే.

కోయగూడేనికి మత్తెక్కింది. గాలికి మత్తెక్కింది. మంట మత్తు మత్తుగా మండుతూంది. వాతావరణానికి మత్తెక్కింది.

మత్తులో పాటలు పాడుతున్నారు. పడుచులు అడపడుచుల మీద సవాళ్ళు విసురుతున్నారు. వారేం తక్కువా? జవాబుల బాణాలు విసురుతున్నారు. అవి మల్లెలవి. మొల్లలలో విరజాజులవి. పూల బాణాల తాకిడికి తల్లడిల్లిన సింగన్న, కింది గూడెం సింగి కళ్ళలోకి చూచాడు. సింగి కళ్ళు వాలిపోయాయి. చూపులు రాలిపోయాయి. గుండెలో గుచ్చుకోవలసినవి నేలలో గుచ్చుకున్నాయి.

కోళ్ళు కూసేదాకా కోలాహలం కొనసాగింది. కుండలు ఖాళీ అయినాయి. మాంసం అయిపోయింది. మత్తు వదిలింది వేగుచుక్క పొడిచింది. గోరుకోళ్ళు కూగాయి, తూరుపు ఎర్రవారుతూంది. మత్తుగా మందానిలం వీస్తూంది.

రెండు గూడాలు వేటకు సిద్ధం అవుతున్నాయి. వేటకంటే గూడెం యావత్తూ కదలాల్సిందే. పల్లా పెద్ద, ముసలి ముతక, చూలాలు చిన్నది భేదంలేదు. అంతా అడవి మీద పడాల్సిందే! కోయకు అడవే స్వర్గం. అరణ్యమే నరకం. అడవిలో పడితే అతనికేదీ తెలియదు. పులి కరుచుకు పోతుందా పోనీ. మిగిలినవాడే కోయ. అతనికి చావు పుటకా రెండూ సమానమే. రెండూ సహజములే. చస్తానని వేట మానుకోలేడు. అది అతని జీవితంలో భాగం. చావులోనూ భాగమే. అడవికి వెరచే కోయ వుండడు. పులికి వెరచే కోయ పుట్టడు. అతడు అడవి మీద పడ్డాడంటే కలచివేస్తాడు; జంతువును వెంటాడి వేటాడ్తాడు. అన్నీ తాను తినడానికి చంపడు. చంపినవాటి నన్నింటినీ పట్టుకపోడు. అది అతని వేడుక. జంతువును చంపాడంటే పొంగిపోతాడు. వీరుడు అవుతాడు. శూరుడు అవుతాడు. తన బలాన్ని చూచు కుంటాడు. బుజాలను చూచుకుంటాడు. బల్లాన్ని చూసుకుంటాడు. తుపాకిని చూచుకుంటాడు. మురిసిపోతాడు. పొంగిపోతాడు.

రెండు గూడాలు వేటకు సాగేయి. బల్లాలు, బరిసెలు, ఒడిశలలు, తుపాకులూ దుడ్డుకర్రలతో బయలుదేరారు. ఉత్సాహంగా బయలుదేరారు. పదాలు పాడుతూ బయలుదేరారు. యువతుల గుంపు సవాళ్లు విసరుతూంది. యువకులు చేతులెత్తి జవాబు చెపుతున్నారు. వారు సద్దిమూటలతో బయలుదేరలేదు. వారి కథి అవసరం లేదు. అడవి తల్లి వారికన్నీ సమకూర్చుస్తుంది. ఎక్కడ ఏ కాయ దొరికినా కడుపు నిండుతుంది. ఎక్కడ ఏ గడ్డి దొరికినా ఆకలి తీరుతుంది.

ఆటవికులు సాగిపోతున్నారు. ఆటవిమపుకు తరలిపోతున్నారు. ఎండ యెక్కువౌతూంది. ఇనుప కమ్మిల్లాంటి శరీరాలకు చెమట పట్టూంది. ఆ చెమటయే వారికి ఆనందం. అందులోనే బంగారం పండిస్తా డతను, సాహుకారు బోషాణం నింపుతుంటాడు.

పొలాలు దాటారు. పల్లపు ప్రదేశం దాటారు. అడవిలోకి దూరారు. అందు లోకి సూర్య కిరణాలు చొరలేవు. చల్లని నీడ. యేట చెట్లు, మద్దులు, టేకులు, చెన్నంగులు, వెలగలు, ఉసిళ్ళు, ఇప్పలు ఒకటేమిటి అక్షరకాల చెట్లు. చెట్లకు అల్లుకున్న తీగలు. సాగిపోతున్నది జనం. జైత్రయాత్ర సాగిస్తున్నది. జనం అమాయకమయిన జంతువులమీద క్రూర మృగాలమీద.

సింగన్న ముందుగా సాగిపోతున్నాడు. అతని చేతిలో తుపాకి ఉంది. అదీ అతని ధైర్యం. అతనిని అనుసరిస్తున్నా రంతా. కొండ ఎక్కుతున్నారు. కొండ కొమ్ము అనుకునేది యెక్కితే అదీ బయలే. క్రింది నుంచి ఎత్తు అనిపించేది ఎక్కాం తరువాత పల్లమే.

అడవి తుప్పలు, బరకలు, చుట్టూ చీకటి, చిత్రమైన చీకటి. భూమి పగిలి నట్లు వున్నాయి గడ్డలు. ఇంకా ఎక్కుతున్నారు. పాటలు పాడుతున్నారు. అడవికి ప్రాణం వచ్చినట్లుంది. పాటలు పాడుతున్నట్లుంది.

సింగన్నకు ఏదో అలికిడి వినిపించింది. చేయి చూపించాడు అంతే, అంతా మౌనం చీమ చిటుక్కు మంటే వినిపించేట్లుంటుంది. అది వేట. వేటలో నియమం. సైగ అందించా అంతా గప్‌చిప్, చుప్‌చాప్, ఒక్క మాట లేదు. ఒక్క పలుకు లేదు. మాటలన్నీ మనసుల్లోనే, సైగలన్నీ కళ్ళల్లోనే.

ఊపిరి బిగబట్టుకొని నుంచుంది జనం. కిక్కురు మనడం లేదు. అంతా నిశ్శబ్దం. క్షణం క్రితం జీవం పోసుకున్న అడవి జవ చచ్చి పడిపోయింది. తుపాకి భుజాన వేసుకొని పోతున్నాడు సింగన్న. గోడలా వాడిగా ఉంది దారి. రాతినేల ప్రతి నిముషం జారిపోతామనే భయం. చెట్లు మోళ్ళు సూదుల్లా ఉన్నాయి. జంతువు జాడ వెతుకుతూ పోతున్నాడు. అతని మాంసకండరాలు బిగుసుకుపోతున్నాయి. మలచి నట్లుంది అతని దేహం. నిగనిగ లాడుతున్నాడు. ఇనుపభీమునిలా ఉన్నాడు. మెరకమీద మాయం అయినాడు.

అతడు పందెంవేసి సాగిపోతున్నాడు. పంతంతో సాగిపోతున్నాడు. తనను కవ్వించిన జంతువుకోసం పోతున్నాడు. వాసన చూచి జంతువు జాడ తెలుసుకోగల డతను. దాన్ని చంపందే బయటపడడు. అది కోయ పట్టుదల. కోయ ప్రతిజ్ఞ.

"ఢాం" తుపాకి పేలింది. అది కిందవున్న వారి గుండెల్లో పేలింది. జనంలో కేకలు, అరుపులు, పరుగులు.

"పడ్డది. ఒహ్హో పడ్డది." ఒకటే కేకలు అంతా ఉరికారు. పడుతూ లేస్తూ పరిగెత్తారు. ఎగుడు దిగుడు రాళ్ళ దారి.

పెద్దకణుజు పడివుంది. తుపాకీ పట్టుకొని నుంచొని ఉన్నాడు సింగన్న, నవ్వుతున్నాడు. అంతా అతన్ని చుట్టేశారు. ఆడా మగా దాని చుట్టూ తిరుగుతూ నృత్యం చేశారు. సింగన్నను ఎత్తుకొని ఎగిరారు. ప్రశ్నల వర్షం కురిపించారు.

"ఉస్స్ ! ఎట్ల చూచినవే ?"

"ఎట్ల కొట్టినవే ?"

ఆటలు, పాటలు అల్లరి. గందరగోళం. అడవి అదరిపోతోంది. నిప్పు మండింది. కణుజు మాంసం కాలింది. అక్కడ వాటాల్లేవు. వాటి కోసం తగాదా లేదు. ఎవరికి దొరికింది వారిది. ఎవరికి కావలసినంత వారికి.

అంతటితో చాలా ? ఇంకా కావాలా ? ఈ విషయంలో చర్చ సాగింది. యువకులంతా ఇంకా కావాలన్నారు. వృద్ధులు అంతటితో చాలన్నారు. జనం రెండు పక్షాలుగా చీలింది. వాదోపవాదాలు జరిగాయి. కలహందాకా వచ్చింది. కొట్టుకునే వరకు వచ్చింది. అదంతా మామూలే వారికి. యువకులు నెగ్గడంతో సద్దుమణిగింది. నిర్ణయం జరిగిన తరువాత అంతా బద్ధులే. కొంతసేపు విశ్రాంతి తీసుకొని వేట సాగించాలనుకున్నారు. గుంపులు గుంపులుగా విడిపోయారు. చెట్లక్రింద రాళ్ళ మీద బండలుమీద మెడలు వాల్చారు.

సింగన్నకు మెళకువ వచ్చేవరకు పొద్దు వాలిపోయింది. లేచి చూస్తే ప్రక్కన ఎవరూలేరు—తుపాకీ తప్ప. లేచి తుపాకి బుజానికి తగిలించుకున్నాడు. అడవి తుప్పల్లోంచి దుబ్బల్లోంచి సాగిపోతున్నాడు. మనిషి అలికిడి విని నెమళ్ళ గుంపు ఎగిరి మెట్టమీద కూర్చుంది. నెమలి తెలివైన పక్షి. అలికిడిని పట్టి తప్పుకుంటుంది. దాన్ని పట్టడం కొట్టడం రెండూ కష్టమే. ఎంతోసేపు పొంచివుండి కొడితేగాని నెమలి పడదు. నెమలి మాంసం కోయకు ఎంతో ఇష్టం. నెమలిని వేతామనుకున్నాడు. క్రింది గూడెం వాళ్ళకు నెమలి మాంసం పెట్టాలనుకున్నాడు. పొద్దు చూచాడు, అట్టేలేదు. అయినా ప్రయత్నిద్దా మనుకున్నాడు. పొదలచాటు నుంచి సాగాడు. పొంచి కూర్చున్నాడు. తుపాకి ఢామ్మనటం నెమళ్ళు లేచిపోవడం ఒకేసారి జరిగాయి. గురితప్పిపోయింది.

ఆ దెబ్బకు మెళకువ వచ్చింది బండమీద పడుకొని నిద్రపోయిన సింగికి. లేచి అటూ ఇటూ చూచింది. ఎవరూలేరు. లేచి నుంచుంది. కేకలేదా మనుకుంది. ఇంతలో అడుగుల చప్పుడు వినిపించింది. ఆలకించింది. ధ్యానంగా విన్నది, అవును. అది మనిషి అడుగుల చప్పుడే. అటువైపే చూస్తూ నుంచుంది.

గురితప్పిపోయింది. దాంతో క్షోభ చెందాడు సింగన్న. తరుముతున్న జంతువు దగాచేసి పారిపోయినట్లనిపించింది. ఒక్కడూ పలకరాతిమీద చతికిలపడ్డాడు. అడవి జంతువులా కూర్చుని నిట్టూర్చాడు. అడుగుల అలికిడి వినిపించింది. చుట్టూ కలయ చూచాడు. తాను కూర్చున్న రాతిమీద పులి పెంటికలు కనిపించాయి! ఉదయం

ఇక్కడ కూర్చుని ఉండాలనుకున్నాడు. లేచాడు, కాలితో పులిపెంట్రికలను చిదిమే శాడు. సాగిపోయాడు.

కింద ఎక్కడో పల్లంనుంచి వేటగాళ్ళ కేకలు వినిపిస్తున్నాయి. బహుశః అది తొప్పవేట. జనం తనను వదలి వెళ్ళిపోయారు. ఎంత మొద్దు నిద్రపోయాడు తాను. సాగిపోతున్నాడు. అతడు అటూ ఇటూ చూచాడు. రాతిమీద నుంచుని భయం భయంగా చూస్తున్న అమ్మాయి కనిపించింది. ఇంకాస్త ముందుకు సాగాడు.

సింగి.

ఒంటరిగా !

తనకోసమే నుంచుందా అనుకున్నాడు. గబగబా అడుగులు ముందుకు వేశాడు.

సింగి, సింగన్నను చూసింది.

ఎవరూ లేరు.

తాను ఒక్కతే.

ముందు సింగన్న.

పచ్చని అడవి.

అతడు మగాడు!

తాను ఆడది !

తుళ్ళి పడ్డది.

"మా జట్టోల్లను చూసిన్రా !"

నవ్వాడు సింగన్న, "ఉస్సే పిట్ట ఒక్కతైనాది?"

"ఉన్నవుగద నువ్వు!" నవ్వింది. పెదవులు కరచుకుంది.

సింగన్న అడుగు ముందుకు వేశాడు.

సింగి గుండె గుబగుబ లాడింది. వెనక్కు తగ్గింది. అలా వెళ్ళి ఒక చెట్టును ఆనుకొని నుంచుంది. ఏదో గొణుగుతూంది. బొటన వేలుతో నేల రాస్తుంది. కళ్ళతో మాట్లాడుతూంది.

సింగన్న అలా చూస్తూ నుంచున్నాడు. తన ఎమట పరువం పొంగుతూంది. పాడుతూంది. నవ్వుతూంది.

ఒక కాలు చెట్టుబోదెకు అనించింది సింగి.

అతనిలో జలపాతం వెలిసింది.

"ఉస్సే ఏమట్ల చూస్తవు?" అడిగింది సింగి. రాత్రి నవ్వింది. చూపులు నేల కర్పించింది. ఇప్పుడేమో ఎందుకు చూస్తున్నావని అడుగుతూంది.

"అడివిని చూస్తున్న."

"అట్లనా"

మళ్ళీ నిశ్శబ్దం.

చెట్టుబోదెను ఆనుకొని సింగి.

ఎదురుగా సింగడు.

ఇద్దరి గుండెలూ గుబ గుబ లాడుతున్నాయి. ఇద్దరూ ఏదో మాట్లాడాలను కుంటున్నారు. ఇద్దరి చూపులూ ఒకే విషయాన్ని వ్యక్తం చేస్తున్నాయి.

"పోదమా ?" అడిగాడు సింగడు.

"నీతోనా ?"

"రావా ?"

"తెచ్చుకుంటే."

అవును సింగిని తాను తెచ్చుకోవాలి. ఎలా వస్తుంది తెచ్చుకోందే. అప్పుడు గాని అతనికి నియమాలు అర్థంకాలేదు. కోయపడుచు అందరితోని సరసమాడు తూంది. కాని సాన్నిహిత్యం భర్తకే.

ఆ విషయమే ఎరుక పరచింది సింగి. అవును అతని ఎదకు ఆకలిగా ఉంది. ముందు మెత్తని శరీరం. అందమైంది. యవ్వనంలో ఉన్నది. ఎవ్వరేం చేయగలరు? తనను ఎవరు అడ్డగలరు? అతడూ కొన్ని నియమాలకు బద్ధుడే! తన ఎద ఆకలి తీరదు. ఆ విషయం తెలుసు. కంటి ఆకలి తీర్చుకో దలచుకున్నాడు.

చూస్తూ నుంచున్నాడు.

అతడు ఆమెను చూస్తున్నాడు.

ఆమె అతనిని చూస్తున్నది.

ఇద్దరూ తన్మయులై ఉన్నారు.

ఇద్దరూ ఏదో ఆనందంలో మునిగి ఉన్నారు.

సూర్యునికి ఏం తెలుసు పాపం వారి ముగ్ధ ప్రేమ? అతడు క్రుంగిపోయాడు. చీకట్లు వ్యాపిస్తున్నాయి; వారు మాత్రం గమనించలేదు.

పులి గాండ్రుమంది.

అదిరిపడ్డది సింగి.

వచ్చి సింగన్న చేయి పట్టుకుంది గట్టిగా.

ఎవరూ మాట్లాడలేదు. అడవి జంతువు పసిపట్టునట్లు ముక్కు పుటాలద రించి వాసన చూశారు. పులి వస్తున్న జాడ కనిపించింది.

"వస్తున్నది పులి" మెల్లగా చెవిలో చెప్పినట్లు చెప్పాడు. గబగబా చెట్టెక్కిం చాడు సింగిని. తాను కూడా గబగబా ఎక్కాడు.

పులి గాండ్రుమన్నది.

మేఘం ఉరిమింది.

వర్షం మొదలైంది.

పులి చెట్టు మొదటికి దూకింది. ఒక్క గంతు వేసింది. పడిపోయింది. చెట్టును గోళ్ళతో గీరింది. గాండ్రు గాండ్రుమంటూ చెట్టుచుట్టూ తిరుగసాగింది.

చిమ్మన చీకటి.

జోరున వర్షం.

దట్టపు అడవి.

చెట్టుకింద పులి.

పులి కదలదు. వారు దిగరు. చలి వణుకు, రెండు మండే గుండెలు.

రేయి గడిచింది. వాన వెలిసింది. అడవి తడిసింది. పులి నిలిచింది. జంట బెదిరింది.

పులి కదిలేట్లులేదు. సింగన్న దగ్గర తుపాకి ఉన్నది. కాని ఒక దెబ్బకే మందుంది. కదలడం లేదంటె అలా పడుకొని ఉన్నా ఆ ఒక్క దెబ్బతో కొట్టేవాడే. పులీ తెలివికలదే. అది చెట్టును చూచింది. చెట్టుమీద మనుషులను చూచింది. వారి దగ్గర తుపాకిని చూచింది. దానికీ ప్రాణభయమే. మనిషికీ ప్రాణభయమే. ఇద్దరికీ పంతమే. అది పంతాల పోరాటం.

పులి మనిషిని కొట్టాలనుకుంటుంది, మనిషి పులిని కొట్టాలనుకుంటున్నాడు. అది పోరాటమే. కాని ఎవరికీ అదును చిక్కటం లేదు. ఎవరికీ గురి దొరకటం లేదు. ఆకలి చెట్టుపైదా ఉంది. చెట్టుకిందా ఉంది. కాని పట్టుదల, అది ఆకలినీ తెలియనీయదు.

పాపం సూర్యుడు చూడలేక పోయాడు. క్రుంగిపోయాడు. మళ్ళీ చీకట్లు. పులి చుట్టూ తిరిగింది. చెట్టు ముందట పడుకుంది. నిద్రపోయింది. గుర్రుపెట్టింది. చీకట్లు, కన్ను పొడుచుకున్నా ఏమీ కనిపించడంలేదు. ఎలా పులిని కొట్టడం? ధ్వనినిపట్టి కొడ్దామనుకున్నాడు. గురికూడా పెట్టాడు. కాని కొట్టలేదు. ఆ ఒక్క దెబ్బపోతే! తాము పులినోట పడాల్సిందే. వేరే ఎట్టి గత్యంతరం లేదు.

సింగి మౌనంగా ఉంది.

వెర్రిగా అడవిని చూస్తూంది.

సింగన్న సింగిని చూచాడు.

"గుబులు గున్నాదే."

"నువ్వున్నవుగద"

అది జవాబు మాత్రమే. సింగి గుండెలో భయం గూడు కట్టుకొంది. అది కనిపిస్తూనే ఉంది. తాను సింగిని రక్షించాలి. ఏం చెయ్యాలి?

కాళరాత్రి, కీచురాళ్ళ ధ్వని, గుడ్లగూబల అరుపులు, ఎక్కడ ఏముందో? ఏ పాము చెట్టు నెక్కుతుందో? నిరంతరమైన అప్రమత్తత.

రేయి ఎంతకాలం ఉండగలదు? చీకట్లు ఎంతకాలం దగా చేయగలవు ? ఎవడు ఉషస్సును అడ్డగలిగాడు? ఆపగలిగాడు?

చీకట్లు చీలిపోయాయి, ఉషస్సు మొలిచింది. సూర్యుడు తాడుపట్టుకుని పాకాడు. ఆ విషయాలు గమనించలేదు పులి. గురక మానలేదు. నిద్ర లేవ లేదు.

తుపాకి "ఢాం" అన్నది.

పులి గొంతులోకి దూసుకుపోయింది.

గాండ్రుమని చెట్టంత ఎత్తు ఎగిరి పడిపోయింది పులి.

ఆ కేకకు అడవిలోని జంతువులు కకావికలైపోయాయి.

పులి అరచింది. తన్నుకున్నది. తుదకు మెడ వాలిపోయింది. పులి శవం రక్తంలో తేలింది.

సింగి సింగన్నను చూచింది. ఆ చూపులో గౌరవం ఉంది. ఆదరం ఉంది. వలపు ఉంది. ప్రేమ ఉంది. అసలు గుండెల వలయాలున్నాయి.

సింగన్న ఉక్కిరి బిక్కిరి అయినాడు. అగ్గిలో ఆజ్యం పడింది. భగ్గున మండింది. అయినా అణచుకున్నాడు. తాను చెట్టు దిగాడు. తుపాకి అందుకున్నాడు. సింగిని దింపాడు. ఇద్దరూ పులిని చూచారు. నిన్న అంటే బెదిరిపోయారు. ఇవ్వాళ కాలితో తన్నారు ! ! !

చిత్తడి నేలలో ఇద్దరూ సాగిపోయారు. కింది గూడెందాకా సింగిని సాగనంపి సగం గుండెతో ఇంటితోవ పట్టాడు సింగన్న.

* * *

పాపిటలాంటి అడవిబాట. అది ఎప్పుడూ సద్దుమణిగి ఉంటుంది. కాని ఇప్పుడు ఆ బాటమీద డప్పులు మ్రోగుతున్నాయి. కొమ్ములు పొడుతున్నాయి. అధికారులు ఆ బాటమీద సాగుతున్నారు. అందుకు ఆ సంరంభం. ముందు డప్పులవాళ్ళూ, కొమ్ములవాళ్ళూ సాగుతున్నారు. వారి వెనుక బరిశెలుగల తలార్లు వారి వెనుక రెండు గుర్రాలు—ఒకదాని మీద గిర్దావరు, రెండవదానిమీద అమీను. గుర్రాల వెనుక పెట్టెలు, పక్క చుట్టలు నెత్తిన పెట్టుకొని వస్తున్నారు. మనుషులు గుర్రాలకంటే ముందు పరిగెత్తాలి. ముందరివారు అంతవేగంతోనూ పరిగెత్తాలి వెనుకవాళ్ళు. చింతబరికలు తగులుతుంటాయి గుర్రాలకు.

అడవిలోంచి అధికారులు సాగిపోతున్నారు. అధికారులు, వారిని చూసి అడవి హడలుతుందా? హడలదని అధికారులకు తెలుసు. అందుకే తమ ముందు బలిపశువులను నడిపిస్తున్నారు. వచ్చిన పులి ముందు డప్పుల వాళ్ళను బలిగొం టుంది. తరవాత బరిశెలవాళ్ళు. అంతలో అధికారులు సర్దుకుంటారు. అందుకే వాళ్ళకి గుర్రాలు మిగతా వారికి కాలినడక.

మనిషికి భయం అయినప్పుడు చప్పుడు చేస్తాడు. ఆ చప్పుళ్ళే డప్పులు, కొమ్ములు. అవి అధికారుల భయానికి చిహ్నం. అది వారి ఆడంబరం! అందరినీ

హడలగొట్టేవారు, అడవిలో హడలి చస్తున్నారు. అవును జంతువులమీదా చెట్లమీదా వారి అధికారమేం?

అది దండయాత్ర అసహాయకులైన కోయలమీదికి? ఇక్కడ భయంతోచస్తూ, అక్కడ భయపెట్టడానికి సాగుతూంది యాత్ర!

సూర్యుడు పడమట పొదల్లోకి దూరాడు. ఆకాశంలో మబ్బులు మందలు మందలుగా మేతకు బయలుదేరాయి. డప్పుల మోతకు ఉరుములు శృతికలిపాయి. వాన రానున్నది. మెరుపులు మెరిశాయి. గుర్రాలకు చింతబరికెలు బాగా తగిలాయి. నడిచేవాళ్ళ సత్తువ చచ్చిపోతూంది. డప్పులమోత తగ్గుతూంది. చిటపట చినుకులు మొదలై జడివానగా మారింది. జోరున వాన. అధికారులు చెట్లకిందికి చేరారు. వారిచుట్టూ వలయాకారంగా జనం. అధికారులు వానమీద మండిపడ్డారు. అయినా అది వినలేదు. పడుతూనే ఉంది. పిల్లకాలువలు జలజలా పారుతున్నాయి. గిరావరు గుండెల్లో ఉరుములు! అమీను కళ్ళల్లో మెరుపులు! అయినా అడవిలో అధికారులకు బసలేదు. కోయగూడెం చేరాల్సిందే.

కోయగూడెం చేరేవరకు బాగా రాత్రి అయింది. చీకట్లు చినుకులు డప్పులు మెత్తబడ్డాయి. మోతలేదు. కొమ్ములవారు వణుకుతున్నారు. అందరినీ వడకించే అధికారులు చలికి వణుకుతున్నారు. సందడి లేకనే గూడెంలో ప్రవేశించారు. గూడెం నిద్రపోతూంది. గుడిసెలమీద వాన పొగలు లేస్తున్నాయి. అధికారుల కోసం అంబరాలు అందుకుంటూంది. గుర్రాలతోనే గుడిసెల్లో దూరారు.

అమీను గుర్రం తడికను చీల్చుకుని సమ్మయ్య గూటిలోకి దూరింది. దంపతులు మంట కాగుతున్నారు. బిత్తరపోయి నుంచున్నారు. గుర్రం గూటినిండా కలయతిరిగింది. కుండలు బద్దలయినాయి. సారాయి ప్రవహించింది. అమీను గుర్రంమీంచి దూకాడు. చింతబరికెతో సమ్మయ్యను బాదాడు. "అప్పర్లు[1] వస్తున్న రని ఎరికెలే ఇంతజాము[2] లెందుకు చెయ్యలే హరాంజాదే. మస్తీ[3] ఎక్కింది" అని బాదసాగాడు. సమ్మయ్య కిక్కురుమనలేదు. కాని దెబ్బలు తప్పుకోవడానికి గుడిసె బయటకు వచ్చేశాడు. వాన. అధికారి గుడిసెదాటి రాలేదు. కాని సారాయి తెప్పించు, కోళ్లు తెప్పించు అని కేకలు పెడుతున్నాడు.

సమ్మయ్య భార్య అంతకుముందే బయటపడింది. వానలో తడుస్తూంది. నిండు చూలాలు! ఆమెను చూస్తూ నుంచున్నాడు సమ్మయ్య. తన నిస్సహాయతకు తానే దుఃఖపడుతున్నాడు. మెరుపు మెరిసింది. ఆ వెలుగుకు అమీనుకు కనిపించాడు సమ్మయ్య.

"నిక్లో, జల్దీలావ్, బంధూక్ సె ఉడాదేవుంగా" అని కేకలుపెట్టాడు.

---

1. ఆఫీసర్లు 2. ఏర్పాట్లు 3. పొగరు.

సమ్మయ్య కేకలు విన్నాడు. అడుగులువేసి బయటపడ్డాడు. గూడెం సొంతం వానలో తడుస్తూంది. ఆడా, మగా, పిల్లా జల్లా అంతా నానుతున్నారు. ఆ తప్పంతా తనదే ననుకున్నాడు. వేట మురిపెంలో ఏర్పాట్లు మరచా ననుకున్నాడు. అందుకు అనుభవించాల్సిందే ననుకున్నాడు.

అధికారులు వారి మందీ మార్బలం అన్ని గుడిసెలూ ఆక్రమించుకున్నారు. ఏ ఇద్దరూ ఒక గుడిసెలో ఉండలేదు. వారికి కులాలు, మతాలు అడ్డువచ్చాయి. గుర్రాలకు ప్రత్యేకం గుడిసెలు. అవీ వణుకుతున్నాయి మరి!

సమ్మయ్య భార్య వానలో సాగిపోతూంది. ఆమె చెట్టు నీడ చూచుకుం టూంది. సమ్మయ్య మనసు క్రుంగింది. అయినా ఆమెను అనుసరించలేకపోయాడు. అతడు ఏర్పాట్లు చేయాలి. ఇంటింటికీ వెళ్ళి సారాయి సంపాదించాడు. కోళ్ళను సమకూర్చాడు, గుడిసెల్లో వంటలు సాగుతున్నాయి. సారాయి అధికారులకు వేడి నిస్తూంది. కోయలు వానలోనే అటూ ఇటూ తిరుగుతున్నారు. ఆడవారు చెట్లక్రిందకు చేరారు.

చిమ్మని చీకటి ఉరుములు, మెరుపులు వాన. సమ్మయ్య భార్యకు నొప్పులు వచ్చాయి. వడకు, నొప్పులు, ప్రసవవేదన! ఒక ప్రాణిని చీల్చుకొని మరొక ప్రాణి బయట పడాలి. ఆమె కేకలు వేయలేదు. అరవలేదు. మౌనంగానే భరించింది ఆ తల్లి! మరొక కోయబిడ్డ నేలమీద పడింది. కేరుమన్నది. పదునైన రాయి చూచింది. తల్లి! బొడ్డుకోసింది. బిడ్డను చేతుల్లోకి తీసుకుంది. వానదేవునికి చూపింది. అతడు కరుణించాడు. మెరిశాడు. తల్లి బిడ్డను చూచుకుంది. మురిసిపోయింది. వానదేవుడే స్నానం చేయించాడు. గజ గజ వణుకుతున్న తల్లి బిడ్డను రొమ్ములో దాచుకుంది. అక్కడి వేడితో వెచ్చదనం కల్పించాలని ఆ పిచ్చి తల్లి ఆశ!

తన బాధ ఎరగదు తల్లి బిడ్డ సుఖంగా...ఉండాలి. అంతే. అందులోనే ఆనందం ఉంది.

తెల్లవారికి వాన తగ్గింది, అయినా చినుకులు రాలుతూనే వున్నాయి. గొడ్డళ్ళు భుజాన వేసుకొని అడవిలో దూరారు. వెదురు బొంగులు, వాసాలు, ఆకు నరికి తెచ్చారు, గుడిసెలు తయారుచేశారు. అధికారులు కొత్తగుడిసెల్లోకి మారారు. పందేళ్ళు, నెమళ్ళు, కోళ్ళు, గొర్రెలు వచ్చాయి, తెగాయి, ఉడికాయి, అధికారులకు జల్సాలు సాగేయి. తాగి తందనాలాడారు. ఆ రోజు వారికి తెలియకుండానే గడిచి పోయింది, చిత్తుగా తాగారు, మత్తుతో గడిచి పోయింది రోజు.

సమ్మయ్య దంపతుల ఆరాటానికి అంతులేదు. ఒక బిడ్డ వచ్చాడు. ఒకడు అడవిలో పోయాడు. సింగన్న ఏమైనట్లు! అతనికి అడివి కొట్టిన పిండి. పులిని పిల్లిలా చెవులు పట్టి ఆడించగలడు. అయినా అడవిని నమ్మరాదు. అది ఎంత వాణ్ణయినా మోసం చేస్తుంది. అది ఎందర్ని మింగిందో. ఇక ఎందర్ని మింగు

తుందో? తమ సింగన్ననూ మింగిందా? అనే వారి ఆరాటం, వారి ఆవేదన. అది ఎంతో ఎలా కొలవగలం?

మళ్ళీ తెల్లవారింది. అధికార్లు గూడాన్ని పిలిపించారు. వారు మంచాలమీద కూర్చున్నారు. కళ్ళు ఎఱ్రగా వున్నాయి. కోయ దొరలంతా మంచాలకు దూరంగా గొంతుక్కూర్చున్నారు. సమ్మయ్య అందరిముందున్నాడు. నుంచున్నాడు. దుఃఖం మూర్తీభవించినట్లున్నాడు. కన్నీరు దుముకుతుందా అన్నట్లున్నాడు.

"ఏంబే! దొరలొస్తురని ఎరికలె. మస్కూర్ను పంపించినా మస్తి ఎక్కిందిలే. హడ్డీనరమ్ చేస్త. ఏమనుకున్నరో అమీనంటె!"

"వేటకు పోయినం దొర మరిచినం........"

మాట పూర్తి కాకుండానే పైన పడ్డాడు అమీను. కఱ్ఱతో బాదసాగాడు. సమ్మయ్య దెబ్బలు తప్పుకోడానికి ప్రయత్నమైనా చేయడం లేదు. కాని చేయి అడ్డం పెడ్తున్నాడు. అక్కడ చేరినవాళ్ళు అమీనును బ్రతిమలాడుతున్నారు. కాని అడ్డు కోవడంలేదు. గిర్దావరు తమాషా చూస్తున్నాడు. డబ్బు ఎక్కువ రాలుతుందని సంతోషపడుతున్నాడు.

గూడెంలో అడుగు పెడ్తున్న సింగన్నకు ఆ దృశ్యం కనిపించింది. భరించ లేకపోయాడు. పరిగెత్తాడు. అమీనుచేతిలో కఱ్ఱ లాగి పారేశాడు. నుంచున్నాడు. జనం బిత్తరపోయింది. అమీను తెల్లపోయాడు. అతని కాళ్ళుచేతులు వణకుతున్నాయి. సింగన్న యమునిలా కనిపించాడు. క్షణం చిత్తరువై నుంచున్నాడు. గిర్దావరు గూట్లోకి దూరాడు. అంతలో తాను అమీనును అనే విషయం గుర్తుకు వచ్చింది. పక్కన పడివున్న కఱ్ఱను అందుకున్నాడు. సింగన్నమీద పడ్డాడు. అప్పటికి సింగన్న తనను అర్థంచేసుకున్నాడు. కిక్కురు మనకుండా దెబ్బలు తిన్నాడు. అమీను బాత్తున్నాడు. సింగన్న కదలడు. అమీను కాళ్ళమీద పడ్డాడు కుర్రాడు. తెలియదన్నాడు. క్షమించాల్సిందని ఏడ్చాడు.

గిర్దావరు బయటికి వచ్చాడు. అమీను ప్రార్థనలకు లొంగలేదు. కాని అలసి పోయాడు. కఱ్ఱ పారేసి తడుస్తూ మంచంలో కూలబడ్డాడు. అమీను పిపుచరిచాడు గిర్దావరు. "విరిచి కట్టుండి లం....కొడుకును" ఆజ్ఞాపించాడు అమీను.

తలారులు సింగన్నను విరిచికట్టారు. అతని గుండె మండుతూంది. అయినా మౌనంగా ఉన్నాడు. తలవంచుకున్నాడు.

"పచాస్ (యాభై) రూపే జుర్మానా" అమీను ఆజ్ఞ.

సమ్మయ్య వదికిపోయాడు. కోయగూడెం అదిరిపోయింది. యాభైరూపాయలు ఏం చేయాలి? కాళ్ళా కడుపులు పట్టుకున్నారు. పాతికకు ఒప్పించడానికి చూచారు. గిర్దావరు పడనీయలేదు.

సింగన్న కట్టుకొయ్యకే ఉన్నాడు. పిట్టలు వచ్చాయి. మాంసాలు ఉడికాయి. అధికారుల గుడిసెల్లో సంబరాలు సాగేయి. సింగన్న తల్లి సమ్మయ్య భార్య బుడు తుణ్ణి బుజానవేసుకొని కట్టుకొయ్య దగ్గర చతికిలపడి వలవలా ఏడ్చింది.

సాయంకాలానికి మళ్ళీ చినుకులు మొదలైనాయి చీకట్లతోపాటు వాన పెరిగింది. కట్టుగొయ్యకు సింగన్న అతని ముందు తల్లి-తండ్రి వానలో తడుస్తున్నారు. పచ్చిబాలెంత వద్దంటే వినదు. రాత్రి సాంతం నానింది. కొడుకును విడిచిపోదు. పోయాడనుకున్నవాడు దొరికాడు. ఎలా వదిలిపోతుంది పాపం తల్లి?

ముగ్గురూ తడుస్తున్నారు. అయినా వానదేవుడు దయతలచలేదు.

తెల్లవారింది వానతగ్గింది. ఇక గిర్దావరు ప్రభుత్వం సాగింది. కోయలంద రిని పిలిపించాడు. భూములు కొలవాలన్నాడు గిర్దావరు. కాలం మారిందన్నాడు. అర కకు పది ఇక చెల్లదన్నాడు. సువ్వాయి (సెటిల్‌మెంట్) జరుగుతుందన్నాడు. బీగం (మొగల్ చక్రవర్తుల కొలత) లెక్కన మాసూళ్ళు కట్టాలన్నాడు. పొలాలు వాళ్ళ వాళ్ళ పేర్లమీద రాయించుకోవాలన్నాడు. తనకు దబ్బు ముట్టచెప్పకుంటే మరొకరికి అమ్ముతానన్నాడు.

కోయలకు వింతగా తోచింది. భూమి కొలవటం ఏమిటి? అది ఒకని పేర ఎలా ఉంటుంది? భూమి దున్నుకొన్నవానిది కావాలిగాని! అయినా అన్నింటికీ ఒప్పుకొన్నారు. కోయకు ప్రాణం నేల. అతడు దాన్ని వదులుకోలేడు. అది వారి జీవిత భాగస్వామిని, ఆలిని మించింది. అన్నింటినీ మించింది. అందుకే అన్నింటికీ చొప్పుకున్నారు, నిలువుదోపిడి యిచ్చారు.

సింగన్న కట్టుగొయ్యకే ఉన్నాడు. అతనికి తిండిలేదు. నీళ్ళు లేవు. అయినా అన్నీ విన్నాడతను. ఇందులో ఏదో అన్యాయం ఉందనిపించిందతనికి. ఎందుకో మనసు సల సల కాగింది. తండ్రిని చూచాడు. మళ్ళీ తలవంచుకున్నాడు.

అమీను తనభాగం వొప్పించుకున్నాడు. తలార్లు, దప్పులవాళ్ళు గుర్రాల వాళ్ళు అంతా వొప్పించుకున్నారు మామూళ్ళు.

మళ్ళీ అధికార్ల జల్సాలు సాగేయి. తాగుడు, తైతక్కలు. ఆ రాత్రి అమీ నుకు మరొక ఆకలైంది. ఆడది కావాలనిపించింది. కట్టుగొయ్య దగ్గర చాలామంది పడుచులున్నారు. అతనికి స్పృహలేదు. తూలుతున్నాడు. బయటికి అడుగువేయ బోయాడు. గ్రహించాడు గిర్దావరు. హడలిపోయాడు. కోయ దేన్నైనా సహిస్తాడు. దాన్ని సహించడు. కోయ కోపగించాడా ప్రాణాలతో కాదు పీనుగులు కూడా అడవి దాటవు. తన ప్రాణం దక్కాలంటే అమీన్ను వెనక్కు లాగాలి. లాగాడు. అమీను కాళ్ళూ, కడుపులూ పట్టుకొని బతిమిలాడాడు. వారించాడు. మాన్పించాడు. ఇక అక్కడ ఉండరాదనుకున్నాడు. తెల్లవారి ప్రయాణానికి సిద్ధం కావాలనుకున్నాడు. అమీను రానన్నాడు. ఇద్దరూ కీచులాడుకున్నారు. అమీను రాకున్నా తాను వెళ్ళి పోతానన్నాడు గిర్దావరు. అమీను లొంగక తప్పలేదు.

తెల్లవారింది. సింగన్న కట్టుగొయ్యకే ఉన్నాడు. అధికారుల గుర్రాలు తయారైనాయి. డప్పులు మ్రోగాయి. కొమ్ములు మోగాయి. సింగన్నను విప్పారు. నడుముకు పగ్గం కట్టారు. అమీను గుర్రానికి కట్టారు. సింగన్న నీరసించిపోయాడు. ఈగుతూ అనుసరించాడు.

సింగన్న తల్లి గుండె చెరువైంది హోరుమని ఏడ్చింది. సమ్మయ్య అమీను కాళ్ళు కడుపులు పట్టుకొని బ్రతిమిలాడాడు. గిర్దావరును ప్రార్థించాడు. ఇద్దరూ వినలేదు. జుల్మానా చెల్లించి విడిపించు కొమ్మన్నారు. కోయ ఆడి తప్పడు. ఆ విషయం తెలుసు వారికి. అయినా సింగన్నకు గుణపాఠం నేర్పాలనుకున్నారు.

స్వస్థానం చేరుకున్నాయి గుర్రాలు. సింగన్నను చింతచెట్టుకు కట్టించాడు అమీను అక్కడ తీరని కసి ఇక్కడ తీర్చుకున్నాడు. "తిరగబడ్తవులే మాదర్‌చత్" అని దవడ మించి లాగి కొట్టాడు. సింగన్న రక్తం ఉమిసాడు. బాదవలసిందని జవాన్లకు ఆజ్ఞాపించి వెళ్ళిపోయాడు.

సమ్మయ్య సాహుకారు దగ్గరికి వెళ్ళాడు. అతడు బేరం సాగించాడు. డబ్బు లేదన్నాడు. వచ్చే పంట వ్రాసి ఇవ్వమన్నాడు. గూడెంలో వచ్చేపంట సాంతం రాసి ఇచ్చాడు సమ్మయ్య. అప్పుడు అమీనుకూ గిర్దావరుకూ చీట్లు వ్రాసి ఇచ్చాడు. చీటి తెచ్చి అమీనుకు ఇచ్చాడు సమ్మయ్య. కొడుకును చూచి అతని గుండె పగిలింది. వంటినిండా దద్దులు, నోట్లోంచి రక్తం కారుతూంది. తలవాలిపోయింది.

"ఇగ ఇడ్వండి" అన్నాడు పూడిపోయిన గొంతుతో.

"చోడ్‌దేవ్ మాదర్‌చత్‌కో" అమీను ఆజ్ఞ.

సింగన్నను వదిలారు. అక్కడ క్షణం ఉండదల్చుకోలే దతను.

అడుగు ముందుకు వేశాడు. తండ్రి అతనిని అనుసరించాడు.

గూడెం చేరుకునే వరకు సింగన్న తల్లి కడవ నెత్తిన పెట్టుకొని గూడెంలోకి పోతూంది. ఆమె వెంట కొందరు ఆడపిల్లలున్నారు. మడుగులో కోడిగ్రుడ్లు, పసుపు, కుంకుమ, పౌరక పుల్లలు విడిచిపోతూంది. అది బాలెంతరాలు చేయవలసిన పని. ఆ తరవాత ఆమె "కుండల్లకు పోతుంది" అంటే పనులు ప్రారంభిస్తుంది.

తల్లితోపాటే గడపలో అడుగుపెట్టాడు. సింగన్న. కడవ దించి నేలమీద ముడుచుకుంది తల్లి. తల్లి వంటిమీద చేయివేసి చూశాడు సింగన్న.

మండిపోతుంది.

పేలాలు వేగినట్లున్నాయి!

## 4

పీరీల కొట్టంముందు కట్టిన మంచెమీద తాషామార్పా మ్రోగింది. పిల్లలంతా కూడారు. తలలెత్తి వింటున్నారు. కొట్టంలో పీరీలను నిలబెట్టే రోజది. మెల్లమెల్లగా

జనం కూడుకుంటున్నారు. ఇక్కడ మతంతో ప్రమేయంలేదు. హిందువులు, మహ్మదీయులు అంతా కూడారు. హసన్ సోదరులు యాజిద్ దౌర్జన్యానికి బలియైనారు. వారు బలియైంది మొహరం నెలలో. అది మహ్మదీయులకు ముఖ్యంగా షియాలకు పవిత్ర మాసం.

తాషామార్ఫా మ్రోగుతూంది. అషూర్ ఖానా లోపల బయటా జనసమ్మర్థం ఎక్కువగావుంది. ముల్లా వచ్చాడు. అతడు కట్టుకున్నది దోవతి, వేసుకున్నది కమీజు. నెత్తిన కుచ్చుటోపీ వుంది. అతడు పెట్టెలో నుంచి పీరీలను తీసేముందు చేత్తో వెనక గోచి లాగేశాడు. తాషామార్ఫా జోరుగా మోగింది. పీరీలను పీటమీద నిలబెట్టాడు. బట్టలు కట్టాడు. వాటి పక్కన నెమిలి ఈకల కట్టలు పెట్టాడు. ఊదు (సాంబ్రాణి) పొగ వేశాడు. ఏవేవో మంత్రాలు వేశాడు. మళ్ళీ గోచి పెట్టుకున్నాడు. కొట్టం దిగి క్రిందికి వచ్చాడు. కొట్టంముందు గిరిగీశాడు. గునపాలు పట్టుకొని నుంచున్న జనం అతని గిరిని అనుసరించి తవ్వారు. మట్టి తోడేశారు. అందులో కట్టెలు వేశారు. ఒకడు నిప్పు తెచ్చాడు. అందులో వేశాడు. నిప్పు రాజుకొని కట్టెలు అంటుకున్నాయి. మంటలు లేచాయి. జనంలో ఆనందం చెలరేగింది. చెట్ల పట్టాలు పట్టుకొని అగ్నిగుండం చుట్టూ చేరారు. అడుగులువేస్తూ చప్పట్లు కొడ్తూ చుట్టూ వలయాకారంగా తిరుగుతూ "హసన్ హుసేన్ లిద్దరూ అన్నదమ్ములంటా" అనే పదంలో వారి కథంతా చెప్పుకుంటున్నారు.

హజ్రత్ మహమ్మద్ గతించారు. వారి స్థానంలో ఖలీఫా ఎవరు కావాలని తగాదా జరిగింది. మహమ్మద్ అల్లుడు 'అలీ' ఖలీఫా కావాలన్నారు కొందరు. వారు షియాలు. ఖలీఫాను ఎన్నుకోవాలన్న వారు సున్నీలు. సున్నీలు నెగ్గారు. అబూబకర్ ఖలీఫా అయినాడు. అతని తరువాత ఉమర్, ఉస్మాన్ ఖలీఫాలైనారు. వారు ఖురాన్ ఆదేశాలకు అనుగుణంగా రాజ్యం చేయలేదని మళ్ళీ మహమ్మద్ అల్లుడు అలీని ఖలీఫా చేశారు. అది సహించలేని అబూసూఫియాని అలీని హత్య చేయించి తానే ఖలీఫా అయినాడు. అలీ కొడుకులు హసన్, హుసేన్ రాజ్యానికి రావాలనుకున్న ప్రజలు సూఫియానిని బలపరచలేదు. తనను బలపర్చవలసిందని అతడు హుసేన్ సోదరులను నిర్బంధం చేశాడు. అందుకు అంగీకరించనందున విషంపెట్టి చంపించాడు. సూఫియాని తరువాత మావియా అతని తరువాత యాజిద్ ఖలీఫా అయినాడు. అతని క్రౌర్యాన్ని ప్రజలు సహించలేక పోయారు. హసన్ తనను బలపర్చకుండే తనకు రాజ్యం దక్కదనుకున్నాడు. అతనిమీద వత్తిడి తెచ్చాడు. హత్యా ప్రయత్నంకూడా చేశాడు. అది గ్రహించిన హసన్ మదీనా నుంచి మక్కాకు పారిపోయాడు. అక్కడకూడ తనకు క్షేమం లేదని తెలిసి తనకు ఆశ్రయం ఇవ్వాల్సిందని కోరుతూ 'కుఫా'కు మనిషిని పంపాడు. పోయిన మనిషి తలతీసి పుర్ద్వారానికి వ్రేలాడతీశారు. ఆ విషయం తెలిసి ఎంతో దుఃఖించాడు హసన్. ప్రాణరక్షణకుగాను 72 మంది బృందంతో 'ఇరాక్'కు బయలుదేరాడు. కర్బలావద్ద

యాజిద్ సైన్యం అతన్ని చుట్టేసింది. అడుగు ముందుకు వేయనీయలేదు. దగ్గరే ఉన్న ఫరాత్ నదినుండి నీరు సహితం తెచ్చుకోనివ్వలేదు. ఎడారి, మండే ఎండ, వడ గాల్పులు, నీటిచుక్క లేదు. ఒక్కొక్కరు చనిపోసాగారు. తనను ఖలీఫాగా అంగీకరించాల్సిందని యాజిద్ కబురంపుతున్నాడు. హసన్ అందుకు అంగీకరించ లేదు. ఆరునెలల బిడ్డ సహితంగా అంతా చనిపోయారు. అప్పుడు హసన్ కత్తి పట్టుకొని రణరంగంలో దూకాడు. యాజిద్ సైన్యాలు అతణ్ణి చీల్చి చెండాడాయి.

హసన్ ప్రాణాలు వదిలాడు. కాని ఆదర్శాలు వదల్లేదు. అందుకే గావాలు అన్ని మతాలవారూ పీరీలపండుగ జరుపుకుంటారు ఈ ప్రాంతంలో.

తాసిల్దారు షియా వర్గీయుడు. అతడూ మొహరం పాటిస్తాడు. ఆ పది రోజులు అతనికి శోకదినాలు. నల్లని బట్టలు కట్టుకుంటాడు. అవి శలవు రోజులు. ఖురాను వింటూ, దానధర్మాలు చేస్తూ పుణ్యం సంపాదించుకుంటాడు. శోకగీతాల ఆలాపన ప్రతిరోజూ జరుగుతుంటుంది. అందుకుగాను మనుషులను హైదరాబాదు నుంచి ప్రత్యేకంగా పిలిపిస్తాడు. తాసిల్దారు యింటిముందు బెంచీలమీద లక్క పూసిన కుండల్లో పానకం పెట్టివుంది. అది షర్బతు. దాన్ని ఎవరైనా ఎంతైనా త్రాగవచ్చు. అతడు పేదలకు రొట్టెలు, ఇతర తినుబండారాలు, బట్టలు దానం చేస్తుంటాడు. చేసిన పాపాలు కడుక్కోవలసిన రోజులవి. పరలోకానికిగాను పుణ్యం సంపా దించుకోవలసిన రోజులవి.

కోయలు కొట్టిన కలప బండ్లమీద వస్తున్నది. గుట్టలుగా పడుతున్నది. జనం రంపాలతో కోస్తున్నారు. అది చూచాడు తాసిల్దారు. ఈ పర్వదినాలలోనే గుడి కూల్చి పుణ్యం ఆర్జించుకోవాలని సంకల్పించుకున్నాడు. అతని ఆజ్ఞకు అడ్డంటూ లేదు. కాని ఎందుకో కాస్త ఆలోచించాడు. ఆలోచిస్తూనే వున్నాడు. పిడుగులాంటి వార్త తెచ్చాడొకడు.

"ఖదీజా (మల్లమ్మ) కండ్లపడ్తలేదు." అని విన్నవించాడు. ఆ వార్త విన్న తాసిల్దారు ఒళ్ళుమండిపోయింది. వచ్చినవాణ్ణి లాగి కొట్టాడు "ఎటుకుండి లంజ యాడికి పోతది? దొరక్కుంటే నీ పానాల్తీస్త" అని కేకపెట్టి బల్లపీటమీద కూల బడ్డాడు. అతనికి భూమి తనచుట్టూ తిరుగుతున్నట్లనిపించింది. తాను తల్ల క్రిందులై నట్లనిపించింది. తన అధికారం అస్తమించుతున్న ట్లనిపించింది. తన బంగళాలో అడుగు పెట్టిన ఆడది పోతే గోరీలగడ్డకే. కాని బయట అడుగు పెట్టడానికి వీల్లేదు. అలాగే జరిగిందింత కాలమూ. మల్లమ్మ పారిపోయింది. ఆ ఆలోచనే అతడు భరించ లేక పోయాడు. గుండెకు రంపపుకోత ఎక్కువైంది. వళ్ళు చమటలు పట్టింది. ఆ మాట నమ్మలేక పోయాడు.

"అవ్" కేక పెట్టాడు.

బంగళా బద్ధలైంది.

జనం చుట్టూ చేరింది.

"నిజంగా పోయిందా ?" ప్రశ్న కాదు.

పిడుగుపాటు !

అంతా మౌనంగా తలలు వంచుకున్నారు.

"బోలో" గర్జన.

"అవ్ సర్కార్ ! పోయింది" ప్రాణం లేనట్లు చెప్పిన జవాబు.

"కహాఁగయీ, కైసేగయీ ?" అగ్నిపర్వతం బద్దలైంది; ఆ మంటతో దీపాలు వెలిగాయి. తాసిల్దారు ఉగ్రుడై లేచాడు. చేతికి అందిన వాణ్ణల్లా బాదాడు. తనుస్తూ బల్లమీద కూర్చొని "అమీన్‌కో బులావ్" అన్నాడు.

జనం పరుగెత్తారు.

పీరీల గొట్టంలో అగ్గి మండుతూంది.

జనం పదాలు పాడుతున్నారు.

అగ్నిగుండం చుట్టూ తిరుగుతున్నారు.

అమీను వచ్చాడు. అగ్నిగుండంలా ఉన్నాడు తాసిల్దారు. హడలిపోయాడు అమీను.

"ఏమింతజామ్ చేస్తున్నావ్ ? ఆడదాన్ని పట్టుకోలేక పోయినావ్ పీరిగాకో పకడ్‌లావ్[1] పీటో[2] మాదర్ చత్‌కో" ఆజ్ఞాపించాడు తాసిల్దారు.

అమీను సైతం మండిపోయాడు—కాని లోలోన రావుడిని కొట్టినందుకు బాధ్యతంతా తనమీద వేశాడు. ఇప్పుడేమో పీరణ్ణి కొట్టమంటున్నాడు ! కొట్టడం కొట్టడం చావకొట్టాలి. తాసిల్దారు తప్పు తాసిల్దారు నెత్తినే కొట్టాలి. తనను చూస్తే హడలిపోవాలి గూడెం అనుకొని బయలుదేరాడు. పోలీసు స్టేషనునుంచి జవాన్లను తుపాకుల సహితంగా తీసికొని బయలుదేరాడు. వడ్డెరగూడెం మీద పడ్డాడు. కనిపించిన వాణ్ణల్లా కొట్టాడు. మల్లి జాడ అడిగాడు జాడ అడగడం కాదు బాదడం ప్రధానం. పీరయ్య గుడిసెలో దూరాడు.

పీరయ్య భార్య పీరమ్మ చిక్కి శల్యం అయిపోయింది. భీముడు తన పెద్దకొడుకు చేతిలో లేకుండా పోయాడు. పుట్టిన కొత్తబిడ్డ గిట్టాడు. తాసిల్దారు పట్టుకొని పోయిన మల్లమ్మ మాయం అయింది. ఆ మాటవిని విరుచుకుపడ్డదా తల్లి. స్పృహలేదు. పలవరిస్తూంది. పీరయ్య కన్నీరు కారుస్తూ మంచం పక్కన కూర్చున్నాడు.

గుడిసెలోకి దూరిన అమీను, "భంచత్ మల్లినేడ దాచినవ్‌బే" అని లేపి లాగి తన్నాడు. పీరయ్య బంతిలా బయటపడ్డాడు. పడడం పడడం రాతి మీద పడ్డాడు. నొసలు చిట్లింది. పండ్లు విరిగాయి. అతడు లేవడానికి ప్రయత్నిస్తుండగానే జవాన్లు వచ్చి చెరోరెక్క పట్టి లేపి లాక్కుపోయారు. దారి పొడుగునా రక్తం

1. పట్టుకురా 2. బాదు.

కారుతూనే వుంది. అయినా బాదుతూనే ఉన్నాడు. అమీను పోలీస్టేషనుకు తెచ్చారు పీరయ్యను. పీరయ్యను గుంజకు కట్టేసి తాసిల్దారుమీద కసి అతనిమీద తీర్చు కుంటున్నాడు అమీను. మల్లి జాడ చెప్పమంటున్నాడు అమీను. తనకు తెలియ దంటు న్నాడు పీరయ్య. బాదేస్తున్నాడు. కర్రలు విరుగుతున్నాయి. శరీరం రక్తసిక్తం అయిపోయింది. ఇంక మాట్లాడే స్థితిలో లేడు పీరయ్య. ఆ దశలో లాక్కుపో యాడు తాసిల్దారు దగ్గరికి.

పీరయ్య స్థితి దయనీయంగా ఉంది. వంటినిండా రక్తం. నోట్లో రక్తం. కాళ్ళు వేళ్లాడ పడుతున్నాయి. అలాంటి వాణ్ణి తాసిల్దారు ముందు నుంచో పెట్టారు. అతని కాళ్ళు నిలవడంలేదు. కళ్ళు చీకట్లు కమ్ముతున్నాయి. లోకం కనిపించడం లేదు.

"యాడ దాచినవ్‌బే మల్లిని" తాసిల్దారు గర్జన.

ఆ ధ్వనికి ఈ లోకంలోకి వచ్చాడు పీరయ్య. చేతులు జోడించాడు. తనకు తెలియదన్నట్లు చూచాడు. మాట రావడంలేదు.

"బోల్ నహీఁతో మార్‌డాలూఁగా" తాసిల్దారు కేకవేసి లేచాడు.

పీరయ్య మూత్రం వదిలాడు.

"భంచత్ నఖ్రాల్ చేస్తవ్‌బే" అని కర్ర అందుకొని ఉరికాడు తాసిల్దారు. అతనిని చూసి జవాన్లు పక్కకు జరిగారు. పీరయ్య థడేల్‌మని నేలమీద పడ్డాడు. తాసిల్దారికి శివం వచ్చింది. కర్రతో విపరీతంగా బాదేశాడు పీరయ్యను. అతడు కనీసం మూలుగలేదు. దూది మూటమీద బాదినట్లు బాదాడు. కాలితో తన్ని "లాల్ ఖాన్ * కు" కట్టెయండి. గాడ్దికొడుకు పీనిగల బొందలకి పోవాలే" అని దూరం జరిగాడు.

అతని కాలికి రక్తం అంటింది. మనుషులను పిలిచి కడిగించు కున్నాడు.

జవాన్లు పీరయ్యను ఈడ్చుకపోయారు. గొలుసులతో కట్టుకొయ్యకు కట్టేశాడు.

పీరయ్యకు స్పృహలేదు.

తెల్లవారింది. ఆ నల్లబై రోజులు తాసిల్దారుకు భోగాలు త్యాజ్యం. అందుకే అతడు త్వరగాలేచాడు. కాలకృత్యాలు తీర్చుకున్నాడు. ముల్లాకోసరం ఎదిరిచూస్తూ కూర్చున్నాడు. ముల్లా వచ్చాడు. తాసిల్దారు లేచి నుంచున్నాడు. సలాంచేశాడు. ముసల్మానులు కూడారు. ముల్లా ఖురాను చదివాడు. హజ్రత్ అలీని అభూ సూఫియానీ హత్య చేయించిన ఉదంతాన్ని గురించి ఉపన్యసించాడు.

అబూబకర్ తరువాత ఉమర్, అతని తరువాత ఉస్మాన్ అలీపాలైనారు. వారు ఖురాన్ ఆదేశాలను పాటించనందున ప్రజలు మహమ్మద్ అల్లుడు అలీని

---

* రక్తస్తంభం.

అలీఫాచేశారు. అబూసూఫీయాని అనేవానికి రాజ్యకాంక్ష కలిగింది. ఆతడు అలీని అంతం చేయదల్చుకున్నాడు. అబ్దుర్రహమాన్ అనే వానికి విషం పూసిన కత్తి ఇచ్చి హత్య చేయమన్నాడు. అబ్దుర్రహమాన్ మసీదుకు వెళ్ళాడు. నమాజు చేసేప్పుడు హజరత్ అలీ వెనుక నుంచున్నాడు. నమాజు చేయడానికి వంగినప్పుడు అలీని పొడిచేశాడు. అలీ అక్కడే చనిపోయాడు.

13 వందల సంవత్సరాల క్రితం అమరులైన హసన్ సోదరులను తలచు కొని శోకగీతాలు పాడారు – కృతకంగా ఏడ్చారు. గుండెలు బాదుకున్నారు. తరువాత దాన ధర్మాలు జరిగాయి.

తెల్లవారింది. పీరయ్య కట్టుగొయ్యకే వున్నాడు. శరీరం రక్తముతో నిండి వుంది. పెదవులు పగిలి రక్తం పక్కులు కట్టింది. ముఖం కమిలిపోయింది. కండ్లు వాచాయి. మూర్తి భయంకరంగా వుంది. రాత్రి సాంతం పీరయ్యకు స్పృహ లేదు. వెన్నెల అతని గాయాలను మాన్పిందో - కాలమే మందుగా పనిచేసిందో తెల్లవారి స్పృహ వచ్చింది కళ్లు తెరిచాడు. తూర్పును చూచాడు. ఉదయిస్తున్న సూర్యుడు కనిపించాడు. ఎర్రగా, గుండ్రంగా ఎగబాకుతున్నాడు. ఎదిగే సూర్యుడు అందంగా కనిపించాడు. ఆశ మొలిపించాడు. అలా క్షణం చూశాడు సూర్యుణ్ణి. తనను చూచుకున్నాడు. తన శరీరం తనకే భయం కలిగిస్తూంది. అసహ్యం కలిగి స్తూంది. ఏమైంది ? ఎందుకిలా అయినాడు తాను ? తాను చేసిన పాపం ఏమిటి ? తర్కించుకున్నాడు. తర్జన భర్జనలు సాగేయి. పళ్ళు పట పట లాడించాడు. అసలు తాను జీవిస్తాడా ? బతికి బట్టకడుతాడా ? పీనుగులబొంద గుర్తుకు వచ్చింది. తాను చచ్చిపోతాడేమో ! తననూ ఆ బొందలో పారేస్తారేమో ! ఏమో ! మరి !

చావు, మృత్యువు, యముడు, ఒక్కసారి పదాలే మనిషిని భయపెట్టాయి. భయపడ్డాడు పీరయ్య. గుండె గుబగుబ లాడింది. చీకట్లు గుంపులు గుంపులుగా తనవైపు రాసాగేయి. ఏదో ఆవేదన. ఏదో ఆందోళన. ఏదో ఆవేశం. బిగ్గరగా కేక పెట్టాలనుకున్నాడు. లోకానికి ఏదో చెప్పాలనుకున్నాడు. గొంతు చించుకోవాలను కున్నాడు. లోకాన్ని దద్దరిల్ల చేయాలనుకున్నాడు. డొక్కలోంచి పెకలిన ధ్వని గొంతులో ఇగిరిపోయింది.

చుట్టూ చూశాడు, సూర్యుడు బాగా పైకి వచ్చేశాడు. అంతక్రితం ఆనందం కలిగించినవాడు మంటపెట్టసాగేడు. వళ్ళు మండిపోతూంది. గొంతు ఆరిపోతూంది. నాలుక పిడచ కడ్తూంది. దాహం, దప్పి, దూప, దాహానికే ప్రాణాలు ఎగిరిపోయే ట్లున్నాయి! తనముందే బెంచీలున్నాయి. వాటిమీద లక్కపూసిన కుండలున్నాయి. వాటిలో పానకం వుంది. కొబ్బరి గరిటెల్తో పానకం తీసి గ్లాసుల్లో పోసుకొని తాగు తున్నారు. జనం పిల్లలు గుంపులు గుంపులుగా కూడుతున్నారు. పానకం తన ముందేవుంది. ఎంతో దూరంకాదు. తాను వెళ్తే వెళ్ళాలి. కదిలాడు. గొలుసులు గలగలా మన్నాయి. కట్టివేస్తే మనిషి కదల్లేడు. అది ఎంత దగ్గర్నుంచేనేం? అర్థం

చేసుకున్నాడు. నాలుకతో పెదవులు తడుపుకొందా మనుకున్నాడు తడుపుకున్నాడు. పక్కులు ఊడాయి. రక్తం నాలుకకు అంటింది. తుపుక్కున ఊశాడు.

చర చరా సూర్యుడు ఎక్కుతున్నాడు. తనముందే పకీర్లకు రొట్టెలూ మిఠాయిలూ పంచుతున్నారు. అతనికి ఆకలీ, దాహం రెండూ మొదలైనవి. డొక్క మండసాగింది. ఎద మండసాగింది. మిగిలిన రక్తం ఆవిరైంది. కళ్ళు నిప్పులు కురిశాయి. కొంతసేపటికి చల్లారాయి.

ఇల్లు-తన యిల్లు గుర్తుకు వచ్చింది పీరయ్యకు. పీరమ్మ కళ్ళల్లో మసలింది. ఆమెకు క్షయ. రోగంతోనే బిడ్డను కన్నది. బిడ్డ పోయింది ఎముకల గూడు! కుక్కిమంచంలో పడివుంది. మల్లమ్మ ఏమయింది? మల్లి తన నీలమణి. ఎక్కడ పోయిందో? అసలు బ్రతికి వుందా? మల్లి తనకూతురు బ్రతకాలి. తాను బ్రతకాలి. భీముడు—తన కొడుకు? ఎలా బాగుపడ్తాడు. అమాంతంగా ఏదో దృశ్యం గోచరించింది. భీముడు సమ్మెట అందుకున్నాడు. ఒక దెబ్బ ఒకటే దెబ్బ. నీల్గాడు తాసిల్దారు. రక్తం మడుగు. అందులో పడివుంది మాంసం ముద్ద. చెదిరిపోయింది దృశ్యం. నవ్వుదా మనుకున్నాడు. నవ్వలేకపోయాడు. ఏవో చీకట్లు ముసిరాయి. కంటికి ఏమీ కనిపించ లేదు. అంతే.

మొహరం ఆరవరోజు. హసన్‌కు నీటిచుక్క అందకుండా చేయడానికి లక్ష సైన్యాన్ని పంపాడు యాజీద్. హసన్ వెంట ఆరు నెలల పాప ఉన్నాడు. అది ఎడారి. మండే ఎండ తల్లిపాలు సహితం ఎండిపోయాయి. బిడ్డ తల్లడిల్లుతున్నాడు. భరించలేక పోయాడు హసన్. బిడ్డను భుజాన వేసుకొని సైన్యకుడ్యాన్ని చీలుస్తూ ఫరాత్ నదివైపు పయనం అయినాడు. బాణంతో పసిపాప తల ఎగరకొట్టాడు ఒక సైనికుడు. వెనక్కు తిరిగాడు హసన్. మొండాన్ని భార్యకు అందించాడు. ఆమె గొల్లుమన్నది.

ఆరోజు షియాలకు అతి పవిత్ర దినం. ఆరోజు కన్నుల్లో ప్రాణాలున్న పీరమ్మను తీసుకొని తాసిల్దార్ ఇంటికి వచ్చారు వడ్డెర్లు. పీరమ్మను తాసిల్దార్ కాళ్ళ మీద పడేశారు. పీరయ్యను తీసికెళ్ళడానికి అనుమతించాల్సిందని ప్రార్థించారు. తాసిల్దార్ వళ్ళు మండింది అంతమంది రావడం తనను ప్రార్థించడం! అదీ కట్టు గొయ్యనున్న వాణ్ణి తీసుకుపోతామని. కట్టుగొయ్యకు పోయినవాడు కాటికి పోవాల్సిందే. వడ్డెర్ల ధైర్యం చూచి వళ్ళు మండింది తాసిల్దార్‌కు. అయినా కోపం దిగమింగాడు. అతడు దుఃఖంతో కుమలాల్సిన రోజది! పీరయ్యను చూచాడు. ఎక్కడా ప్రాణం ఉన్నజాడ కనిపించలేదు. చచ్చాడేమో! అదీ మొహర్రం ఆరవ రోజున. తన యింటి ముందు చావు. తనకు రావలసిన పుణ్యం లాక్కుపోతున్నట్లని పించింది.

"బేజాన్" గట్టిగా అరచాడు.

ఆ కేకకు ముందు వడ్డెర్ల గుండెలు అదిరాయి. తరవాత అర్థమైంది తీసికెళ్ళమన్నాడని. గొలుసులు విప్పారు. పీరయ్యను మంచంమీద వేసి తీసి కెళ్ళారు.

పీరల కొట్టం ముందు తాషామార్పా మ్రోగుతూంది.

అగ్నిగుండంలో నిప్పు మండుతూంది.

వెన్నెల విరిసింది.

జనం పాటలు పాడుతున్నారు. ఆటలు ఆడుతున్నారు.

ఆ రాత్రి రఘూ, నాగేశ్, రావుడు వడ్డెర్ల గూడెంలోనే గడిపారు. జానకి కూడా వచ్చింది. రావుడు కట్లు కట్టాడు. వైద్యుణ్ణి పిలిపించారు. చికిత్సలు జరుగుతున్నాయి. పీరయ్యను, పీరమ్మను చూచి జానకి గుండె పగిలింది. మూర్తీభవించిన దుఃఖంలా మంచం ప్రక్కన కూర్చుంది పీరమ్మ. ఏడుస్తూ కూర్చుంది. దగ్గుతూ రక్తం ఉమ్ముస్తున్నది.

జానకి పీరయ్యకు పరిచర్యలు చేసింది. కన్నతండ్రికి చేసినట్లు చేసింది.

అప్పుడు వచ్చాడు భీముడు-పీరయ్య కొడుకు. భీముడు భీముడే. ఆరడుగుల మనిషి. నల్లగా బొగ్గులా ఉంటాడు- ఇనుప మనిషి. అతని బుర్రమీసాలు, గిరజాలు, విశాలమైన నొసలు భయంకరంగా ఉంటాడు. తాగుడు, ముండలు అతనికి వేరే పనిలేదు. అతనంటే అందరికీ హడల్. అతన్ని అడ్డగలవారు ఆ గూడెంలో కాదు, ఆ ఊళ్ళోనే లేరు. అలాంటివాడు వచ్చాడు. అతన్ని చూచి నిజంగానే దడుచుకుంది జానకి. లేచి నుంచుంది. భీముడు మంచంముందు నుంచున్నాడు. తండ్రిని చూచాడు. తల్లినీ చూచాడు. కళ్ళల్లో నీరు నిండింది. టపటపా రాలింది. "అయ్యా" అని తండ్రిమీద బడి బావురు మన్నాడు. పీరమ్మ కొడుకు మీద పడి ఏడ్చింది. ఒకరి మీద ఒకరు పడి యేడ్చారు. అక్కడున్న వారంతా కంట తడి పెట్టారు.

జానకి చాటుకి పోయి ఎక్కెక్కి ఏడ్చింది.

భీముణ్ణి ఓదార్చాడు రఘు.

ఆ రాత్రి ఒక్కడూ పీరలకొట్టానికి వెళ్ళలేదు. పీరయ్య వేదనను తమ గుండెల్లో నింపుకున్నారు. వారిమీద జరుగుతున్న అక్రమాలనూ, దౌర్జన్యాలనూ, అత్యాచారాలను గురించే రఘు విడమర్చి చెప్పాడు. భీమునికి ఏదో కొత్తలోకం కనిపించింది. కొత్తమనుషులు కనిపించారు. అతడు రోజూ చూస్తున్నవే. అయినా వాటిలో ఏవో కొత్త అర్థాలు గోచరించాయి అతనికి. వారికి, కొత్త వెలుగులు కనిపించాయి. కొత్త ఆశలు చిగిర్చాయి.

రోజులు గడుస్తున్నాయి. రఘు నాగేశ్ జానకి అక్కడే గడుపుతున్నారు. భీమునిలో వింత మార్పు వస్తూంది. అతని అవతారమే మారిపోయింది. ఆందోళన గూడు కట్టుకుంది. ఆవేదన వ్యక్తం అవుతూంది. ఆవేశం కనిపిస్తూంది.

ఆ రోజు తెల్లవారుతుండగా స్పృహ వచ్చింది పీరయ్యకు. "మల్లీ" అని పిలిచాడు. ఆమె కనిపించలేదు. పీరమ్మ మంచంలో ఉంది. ఆమెను తీసుకొని వచ్చారు. పీరమ్మను చూచాడు పీరయ్య. కన్నీరు నిండింది. కనుకొలుకుల్లోంచి జారి చెవుల్లో చేరింది. అందరికి గుండెలు చెరువులైనాయి. పీరయ్య బ్రతుకుతాడు అనుకున్నాయి అన్ని మనసులూ. పీరయ్య తనచుట్టూ ఉన్న వారిని చూచాడు. జానకి, రఘు, నాగేశ్! రఘు, జానకి, నాగేశ్! తన మంచం దగ్గర! ఎంత గొప్ప మార్పు! ఎంత మంచి మార్పు. భీముడు-తనకొడుకు మంచం పక్కన. ఎంత దుఃఖం నిండి వుంది అతనిలో, ఎంత మారిపోయాడు! పీరమ్మను చూచాడు. శల్యంలా ఉంది. ఎందరు వచ్చారు! ఎవరి దగ్గరికి వచ్చారీ పెద్దలు? దొరలు, దాతలు. తాను ధన్యుణ్ణి అయినా ననుకున్నాడు. అతని గుండెలో కృతజ్ఞత నిండింది. వ్యక్తపరచాలనుకున్నాడు. మాట పెకల్లేదు. చేతులు జోడించాడు. కళ్ళలో నీళ్ళు నిలిచాయి.

"మీరు దేవలు" అన్నాడు అంతే. ఇంక మాట్లాడలేక పోయాడు.

అందరి కళ్ళూ చెమ్మగిల్లాయి. జానకి టపటపా కన్నీరు రాల్చింది. ముఖం చాటుచేసుకొని కళ్ళు తుడుచుకుంది.

"కాదు మనుషులం" అని రఘు పీరయ్య రెండు చేతులూ పట్టుకున్నాడు. మంచం పట్టెమీద కూర్చొని పీరయ్యకు ఎంతో ధైర్యం చెప్పాడు.

"పీరయ్యకూ జై" అన్న మాటలు దూరంగా పలుకుతున్నట్లు వినిపించాయి మళ్ళీ స్పృహ తప్పుతున్న పీరయ్యకి.

మూడోనాడు సాయంకాలం వీరయ్యగారు కూడా పీరయ్య ఇంటికి వచ్చారు! పీరయ్య, పీరమ్మా ఇద్దరూ మృత్యుశయ్య మీదనే ఉన్నారు. జానకి పీరమ్మ దగ్గర, వీరయ్యగారు పీరయ్య దగ్గరా కూర్చున్నారు. కొంతసేపు ఉండి రఘు సహితంగా అంతా వచ్చేశారు.

నాగేశ్ మాత్రం అక్కడే వుండిపోయాడు.

రఘు మంచంలో పడి వున్నాడనేకాని నిద్రరావడంలేదు. ఆలోచనలు అనేకం వస్తున్నాయి. ఒక్కటీ చివరంటా సాగడంలేదు. పొర్లుతున్నాడు. అక్కడ జానకి దశ అలాగే వుంది. పేరుకు ఏదో పుస్తకం చూస్తూంది.

అర్ధరాత్రి దాటింది. తలుపుకొట్టిన చప్పుడు అయింది. రఘు లేచాడు. తలుపుతీశాడు, నాగేశ్! రొప్పుతున్నాడు. "పీరయ్య పీరమ్మ చచ్చిన్రు" అని చెప్పి లోపలికి వచ్చేశాడు.

రఘుమీద పిడుగు పడ్డది. కుప్ప కూలిపోయాడు.

జానకి కన్నీరు రాల్చింది. ఎక్కి ఎక్కి ఏడ్వసాగింది.

"తే నా కత్తి. మండిపోతున్నరు వడ్డెరోండ్లు. పీనిగెలు లేవకముందే తేల్చుకుంట, ఈ రాత్రి యుద్ధం జరగాలి. తెల్లారేటోర్కి మనం గెలవాలె. తాసిల్దార్ చావాలె. రక్తం కాల్వలు కట్టాలె. నా గుండె మండుతున్నది. ఆగలేను.

చ స్త. ఈ ఘోరం చూడలేను. తాసిల్దారును కూడా వాండ్లతోనే బొంద పెట్టాలె. తే, నా కత్తి నా కియ్యి. నీతులు చెప్పకు. అయ్యె నేను వినను"

నాగేశ్ కళ్ళు చింతనిప్పు కురుస్తున్నాయి. వణకి పోతున్నాడు. రక్తం తుకతుక ఉడుకుతూంది.

రఘుకు ఏమీ తోచలేదు. అతని మెదడు మొద్దుబారింది. ఆలోచించ లేక పోతున్నాడు. నాగేశ్ భయంకరంగా ఉన్నాడు. చంపి చావడానికి కృత నిశ్చయుడై వచ్చినట్టున్నాడు. ఏం చేయాలో అర్థం కాలేదు. ఏమీ తోచలేదు. తల పట్టుకొని కూర్చున్నాడు

"ఇయ్యి నా కత్తి నా కియ్యి, నువ్వు మంచంలో పండుకో, మంచిగ నిద్రపో. మీరు కామందులు. మీకేమి తెలుస్తది గరీబోని బాధ? చదువుకొన్నోళ్ళంత ఇంతే. అసలు చదువులొద్దు. మూర్ఖుల్లోంచే విప్లవం రావాలె. ఇస్తవా లేదా నా కత్తి? మీకేం చాతకాదు. వట్టి ముం...."మాట మింగేశాడు నాగేశ్.

రఘు బిత్తరపోయాడు. కుర్చీలోంచి లేచాడు. నాగేశ్ భుజంమీద చేయివేసి, చిరునవ్వు నవ్వి ఏదో చెప్పబోయాడు.

రఘు చేతిని లాగేశాడు నాగేశ్. "నాకు నీతులు, చీకట్లూ, గుడ్లగూబలు వద్దు. కత్తి కావాలె కత్తి, నెత్తురు కండ్లజూడాలె."

రఘు చకితుడైనాడు అతనిలోనూ ఉద్రేకం పొంగింది. కాని అణచు కున్నాడు. "నాగేశ్! ఉద్రేకంలో ఉరుకులు పెట్టటం, రెచ్చకొట్టటం అందరికి చాతనైతుంది. నాయకుడైనవాడు వాటిని అణచుకోవాలె. ప్రజలను సరియైన త్రోవలో పెట్టాలె. నువ్వు నాయకుడివి. ఉద్రేకం తగ్గించుకొని ఆలోచించు. పీరయ్య చచ్చిండు. అందువల్ల నీకెంత ఉద్రేకం కలిగిందో నాకంత బాధ కలిగింది. కర్తవ్యాన్ని గురించి ఆలోచించాలె. ఉడుకు రక్తంలో పొర్లుతే ఫాయిదా లేదు."

"కుచ్ నై జాన్తా. వడ్డెర్లంత తయారు గున్నరు. తేలిపోవాలె తెల్లారేవరకు. లావో మేరీ ఛురీ"

"నువ్వు సిద్ధంగ ఉన్నవు కాబట్టి అందరూ సిద్ధంగున్నరనుకోవటం పొరపాటు. ఒక్క వడ్డెర్లు ఏం చేయగలరు? ఆ వుద్వేగం అందరిలో రావాలె. తేవాలె."

"అంతకాలం నిలువలేను. తే నా కత్తి చంపుత చస్త. ఇస్తవా లేదా" అని రఘు మీదకు ఉరికాడు.

తల విరియబోసుకొని, కళ్ళతో నిప్పులు కక్కుతూ చేత కత్తి పట్టుకుని చండికలా దూకింది జానకి. నాగేశ్‌ను లాగేసింది. కత్తి అతని చేతి కిచ్చింది. పైట తీసి అతని ముందు నిలచి ఉరిమింది

"ఊఁ కానియ్. పొడువు, చంపు నీకు కావలసింది నెత్తురు. నెత్తురు చూస్త. ఎంత మొనగాడివో పుచ్చు. ఈ గుండెలో కుచ్చు. నీ విప్లవం ఈ ఇంటినించే

మొదలు కానియ్యి. నన్ను చంపు. రఘును చంపు. మా రక్తంలో విప్లవం సాగనియ్యి. నీకు చంపటం కావాలె నన్నే చంపు ఊఁ"

నాగేశ్ మీద చలిపిడుగు కూలింది. చెమటలు పట్టాయి. అంత దగ్గరగా ఆడదాన్ని అతడు ఎన్నడూ చూడలేదు. అది తొలిసారి.

ఏదో వెర్రెత్తినట్లయింది. రఘు కనిపించాడు. తన ఉద్రేకాలన్నీ ఇంతేనా అనుకున్నాడు. చతికిల పడ్డాడు. చెమటలు పట్టాయి.

అప్పుడు గానీ అర్థంకాలేదు జానకికి. తాను ఏం చేసిందీ, చేస్తున్నదీను. సిగ్గు ముంచుకొని వచ్చింది. పైట బుజాలనిండా కప్పుకొని తుర్రుమన్నది. మంచం మీద పడిపోయింది. ఆమెలో సముద్రాలు పొంగాయి.

రఘు ఏదో ఆలోచిస్తున్నాడు. ఏం చెయ్యాలి? అదీ అతని ఆలోచన. ఏమీ తోచడంలేదు.

నాగేశ్ తలవంచుకొని కూర్చున్నాడు. కన్నీరు ధారలు కడ్తూంది.

గదిలో భయంకరం అయిన మౌనం రాజ్యం చేసింది.

రఘు అగ్గిపుల్ల గీశాడు. అది ఖర్మంటే నాగేశ్ ఈ లోకంలోకి వచ్చాడు.

"అన్నా! నిజంగ నేను గొడ్డును. ఉద్రేకంలో మనిషిని కాను. నీ మీదకే వచ్చిన, క్షమించు. జానకమ్మ మంచి పాఠం చెప్పింది. ఇక చెప్పు ఏం చెయ్యమంటవో? వడ్డెరోండ్లు మసిలిపోతున్నరు."

"తమ్ముడూ నాగేశ్! ఇన్ని శతాబ్దాల తరువాత ఒక ప్రాణిని గురించి తపించేవారు ఈ రోజు వెలసినారు. ఇది తప్పా? ఈ ఆవేదన అందరిలో వస్తే నువ్వనుకున్న విప్లవం దానంతట అదే వస్తుంది. ఏం చెయ్యాలె? ఇదే నేను ఆలోచిస్తున్న."

"బాగా ఆలోచించు, మంచి నిర్ణయానికిరా"

"అందుకోసమే ఇంత తపన. తమ్ముడూ కాస్త ఓపిక పట్టు"

మళ్ళీ మౌనం వెలిసింది. కాని అందులో భయంలేదు. ఆవేదన ఉంది. తపన ఉంది. తపస్సు జరుగుతున్నది!

అమాంతంగా ఆలోచన వచ్చేసింది రఘుకు. నాగేశ్ భుజాలు పట్టుకొని వూపుతూ అన్నాడు-

"నాగేశ్! ఈ రోజు గుడ్‌ఫ్రైడే. క్రీస్తు శిలువ కెక్కినరోజు. అమరుడైన రోజు"

నాగేశ్ వెర్రిగా చూశాడు. అతనికేమీ అర్థం కాలేదు.

"జానికిని పిలువు చెప్పుత"

నాగేశ్ అడుగుల్లో ముడుగుల బరువు చేరింది మనస్సు మూల్గింది. సిగ్గుతో చచ్చిపోయాడు. లేవలేక పోయాడు. తలవంచుకున్నాడు.

రఘుకు ఏమీ అర్థం కాలేదు. ఒక్క గంతులో జానకి గదిలోకి దూకి అమెను లాక్కొచ్చాడు. జానకీ నాగేశ్ బెరుకుగా చూచుకొన్నారు. అది గమనించనే లేదు రఘు. అందుకున్నాడు.

"జీసెస్ క్రైస్ట్ పేదలకోసం పేదల్లో పుట్టిండు బలి అయ్యిండు. అతడు శిలువ కెక్కింది యీ రోజే. శిలువ క్రైస్తవులకు పవిత్ర చిహ్నం. దాన్ని చూచి అతడు పడిన యాతనలు గుర్తుకు తెచ్చుకుంటరు. పీరయ్య మనకు జీసస్, కట్టు గొయ్య మనకు శిలువ !"

"వహ్వా! మంచి ఆలోచన. అయితే ఏం చేద్దమంటవ్."

"పీరయ్య సమాధి నిర్మించాలె. దానిమీద కట్టుగొయ్య పతాలె. దాన్ని చూచి ప్రజలు తమ బాధ్యతలు గుర్తించాలె. అది దౌర్జన్యానికి చిహ్నం కావాలె. రాక్షసత్వానికి సమాధి కావాలె, ఏమంటరు"

"ఇన్కిలాబ్ జిందాబాద్" అన్నాడు నాగేశ్ పిడికిలి బిగించి.

"చలో వడ్డెర గూడెంకో" అన్నాడు రఘు జానకి వైపు చూచి.

ముగ్గురూ వడ్డెరగూడెం చేరారు. కాస్త వెనకా ముందు వీరయ్యగారు అందు కున్నారు. పిల్లా మేకా అంతా పీరయ్య ఇంటిముందే చేరారు. అందరి గుండెల్లో శోకం గూడుకట్టుకుంది· అందరి కళ్ళల్లో దుఃఖం నిండుకుంది. వడ్డెరగూడెం శోక మూర్తి అయింది· దుఃఖానలం భీముణ్ణి కాల్చసాగింది. అతని ఏడ్పుకు అంతులేదు. శవాలను పట్టుకొని 'హో' అని ఏడుస్తున్నాడు, అతడు రెక్కలు తెగినవాడైనాడు. దిక్కులేనివాడైనాడు. ఆ ఏడ్పు సహించలేక పోయింది జానకి. వీరయ్యగారు భీముణ్ణి ఓదార్చారు. వేదాంతం చెప్పారు. అది పనికివచ్చేది ఇక్కడే. భీముణ్ణి దూరం తీసికెళ్ళారు. రఘు, నాగేశ్ ఏర్పాట్లలో మునిగిపోయారు. శవాలకు స్నానాలు చేయించారు. పూలమాలలు వేశారు. శవయాత్ర సాగింది. శోకయాత్ర సాగింది. మూకయాత్ర సాగింది. ఆ రోజు ఒక్కడూ పీరీల కొట్టంవైపు తొక్కలేదు. ఇక్కడే ఉన్నాయి వారి పీరీలు-పీరయ్య, పీరమ్మ ఇద్దరినీ పూడ్చారు. రెండు సమాధులు లేచాయి, రెండింటిమీదా కట్టుగొయ్యలు వెలిశాయి.

"పీరయ్యకీ" నాగేశ్ నినాదం

"జై" అన్నారు జనం.

"పీరయ్యా" రఘు నినాదం

"అమర్ హై" నాగేశ్ జవాబు

అదే ప్రజల ప్రతి నినాదం.

రఘు అక్కడే చిన్న ఉపన్యాసమిచ్చాడు. అతడు కాస్త ఉద్రేకంగానే మాట్లాడాడు. దాన్ని అందరి గుండెల్లో ప్రవేశపెట్టాడు. దాన్ని వేదనగా మార్చాడు. తరవాత కర్తవ్యాన్ని గురించిన ప్రశ్న అందరి మనసుల్లో మెదిలింది.

భీముడు ఇంటికి వచ్చి కుప్పకూలి పోయాడు. ఇప్పుడు భీముడు పీరయ్య కొడుకు కాదు-గూడెం కొడుకు. గూడెమే అతని బాధ్యత వహించింది.

* * *

ఆది ముహర్రం పదవరోజు. హసన్ అసువులు బాసిన రోజు. తాసిల్దారు ఇంటిముందు దానధర్మాలు జోరుగా జరుగుతున్నాయి. అడ్డెకు వచ్చిన జనం రొమ్ములు బాదుకొని ఏడుస్తున్నారు. - ఆడా మగా అంతా నల్లని దుస్తులవాళ్లే! కొందరి రొమ్ములు చిట్లి రక్తం కారుతూంది. ఎంత ఎక్కువ ఏడిస్తే అంత పుణ్యం. ఎంత ఎక్కువ మందిని ఏడిపిస్తే అంత పుణ్యం.

సాయంకాలం అయింది. చీకట్లు కమ్ముకున్నాయి. పీరీల కొట్టం నుంచి పీరీలు లేచాయి. బాజాలు మ్రోగాయి. పీరీలను పట్టుకొని జనం బయలుదేరారు. "అస్సోయ్‌దూలా" అని కేకలు పెడ్తూ ఎగురుతున్నారు. సాంబ్రాణి పొగతో ఊరంతా నిండిపోయింది. ఊరేగింపు సాగుతున్నది. జనం తొక్కుకుంటున్నారు. తోసు కుంటున్నారు. కొందరికి శివాలు వస్తున్నాయి. వారికి ఊదు పొగ వేస్తున్నారు. నెమలి ఈకల కట్టలతో కొడ్తున్నారు. పీరీలకు బెల్లం చదివిస్తున్నారు జనం. ఆ బెల్లానికై కొట్టుకుంటున్నారు పిల్లలు. పూలదండలు వేస్తున్నారు పీరీలకు.

వీధులనిండా దుకాణాలు, బత్తీసాలు, చిలకలు, మిఠాయిలు విరివిగా అమ్ము తున్నారు. దుకాణాల నిండా జనం కిటకిట లాడుతున్నారు. ఊరేగింపు అక్కడికి చేరింది. జనం ఊరేగింపును అనుసరించింది. ఊరేగింపు సాగుతూంది. జనం సాగుతూంది. పీరీలు ఎగురుతున్నాయి. అర్ధరాత్రికి ఏటి దగ్గరికి చేరుకున్నాయి. అక్కడ దింపారు పీరీలను. కట్టలు కుట్టుకున్నారు. భుజాలమీద వేసుకున్నారు. "అల్విదా" పాడుకుంటూ ఇండ్లముఖం పట్టారు.

తిరిగి వచ్చేటప్పుడు జనం ముచ్చటించుకున్నది పీరయ్య చావును గురించే. అతడు పీరే అయినాడు. అతనికీ పండుగ చేయాలి అనుకున్నారు జనం.

తెల్లవారి గోపాలస్వామి కోనేట్లో మల్లమ్మ శవం తేలింది! భీముడు పరి గెత్తాడు. గూడెం అనుసరించింది. భీముడు కోనేట్లో దూకాడు. చెల్లెలు శవాన్ని తీసుకొని పైకెక్కాడు శవాన్ని భుజాన వేసుకొని సాగిపోతున్నాడు. గూడెం అనుస రించింది. గూడేనికి చేర్చాడు. పడుకోబెట్టాడు. చూస్తూ కూర్చున్నాడు. అతని గుండెలో ఎన్ని అగ్గి కొండలు బద్దలవుతున్నాయో! కన్నీరు ఇగిరిపోయింది అడి. రాలేదు. పరిగెత్తి వచ్చారు రఘు, జానకి, నాగేశ్, వీరయ్య, రావుడు. ఎవరు మాత్రం ఏం చేయగలరు? అందరూ కలిసి తలిదండ్రుల సమాధుల పక్కనే కూతురును పూడ్చారు.

భీముణ్ణి తమ ఇంటికి తీసికెళ్ళారు వీరయ్యగారు.

జరిగిందేమంటే మల్లమ్మను పట్టుకొచ్చారా ? ఆమె చేయి విరిచారా? తీసికెళ్ళి ఒక గదిలో పారేశారు. అది అంతఃపురం. అక్కడికి మగ పురుగు పోరాదు. అడ.

వాళ్ళే కట్టుకట్టారు. చేయి అతుక్కోవడం మాట అలా ఉండగా జ్వరం ముంచుకొని వచ్చింది. వంటిమీద పేలాలు వేగాయి. ఏవో మందులు మాకులు యిచ్చారు. గుణం కనిపించలేదు. మూసిన కన్ను తెరవలేదు. మగతలో తల్లినీ, తండ్రినీ, అన్ననూ పలవరించింది. ఆడవారి గుండెలు కరిగాయి. కాని అక్కడ కరుణలేదు, కనికరం లేదు. అసలు మనిషిలేడు. అది లంక. చుట్టూ వున్నవారు రక్కసులు!

మల్లమ్మ మూలిగింది. పలవరించింది. ఏడ్చింది. మొత్తుకున్నది. అన్నం ముట్టలేదు. మందు తాకలేదు. చిక్కింది. శల్యం అయింది. చివరకు ఎలాగో జ్వరం జారింది. కొద్దిగా కోలుకున్నది. చేయిమాత్రం అతుక్కోలేదు.

ఆ రాత్రి తెలిసింది తాసిల్దారుకు. చేతితో అతనికి పనిలేదు. మనిషి కోలుకున్నది అంతేచాలు. కామం అతనిలో మండింది. అది నాల్కలు చాచింది. విషం పోసింది. బుసలు కొట్టాడు. మంగమ్మను తయారు చేయమన్నాడు మల్లమ్మ విసిరికొట్టింది. హూంకరించింది. మనిషిని దగ్గరికి రానివ్వలేదు. తయారు కాలేదు. దాంతో మరీ మండిపోయాడు తాసిల్దారు. యముడై బయలుదేరాడు. కీచకుడై గదికి చేరాడు. మల్లమ్మలో ప్రాణం లేదు. పౌరకపుల్ల అయింది. లేచి నుంచుంది. పెనుగాలికి ఎండుటాకులా వణికిపోయింది. ఉద్రేకం హెచ్చింది తాసిల్దారుకు. ఆమెను పట్టుకున్నాడు. లాగాడు ఆమె గిచ్చింది. అతడు కొట్టాడు. ఆమె కొరికింది. అతడు బాదాడు. పూచికపుల్ల పడిపోయింది. రాక్షసుడు ఆమెమీద పడ్డాడు. ఆమె విలవిలలాడింది. కాళ్ళుచేతులు కొట్టుకున్నది. అరచింది. అయినా ఎవడు రాలేదు. బలవంతంగా చెరిచాడు. తాసిల్దారు అన్వర్‌బేగ్. పంటిగాట్లు మండుతుండగా గది విడిచి వెళ్ళిపోయాడు తలుపులు వేయకుండానే.

మల్లమ్మ తనను చూచుకుంది. తలిదండ్రులను తలచుకుంది. అన్నను గుర్తుకు తెచ్చుకుంది. కుమిలి కుమిలి ఏడ్చింది. తనకు రక్షకులెవరు? తన మానం ఎవరు కాపాడారు? తాను బ్రతికి ఏం చేస్తుంది. ఈ జీవితం ఎందుకు? బ్రతికి తాను ఏం చేయాలి? బ్రతికి లాభంలేదు. చావడంలోనే సుఖం ఉంది అనుకుంది. చాటుగా బంగళాదాటింది. కోనేరు చూచుకుంది. అందులో తనను దాచుకుంది.

ఎందరి మల్లమ్మలను దాచిందో ఆ కోనేరు!

ఎందరి దాస్య విముక్తి చేసిందో ఆ కోనేరు!

భీముని ఇంట్లో — ఇప్పుడది భీముని ఇల్లు — మూడు చావులు. మిగిలింది తానొక్కడె. అతడు మనిషిగా మారాడు. పరిస్థితులను అర్థం చేసుకున్నాడు. చదువు ప్రారంభించాడు. ఇప్పుడతనికి చాల అర్థమవుతున్నాయి వెట్టికి రాయి ఎందుకు కొట్టాలి? ఇదే మాట తనవాళ్ళందర్ని అడిగాడు. ఎవడూ సమాధానం చెప్పలేదు. అతడే సమాధానం చెప్పాడు. కొట్టరాదు. కొట్టగూడదు. కూలి ఇస్తే పని లేకుంటే బంద్.

వడ్డెర్లను కూడచేశాడు. వారిని బయలుదేరజేశాడు. సుత్తె భుజాన పెట్టుకొని బయల్దేరాడు. అందరూ అతనిని అనుసరించారు. ఒక ఊరేగింపు సాగింది. సుత్తెలు భుజాలమీద పెట్టుకున్న వడ్డెర్లు సాగిపోతున్నారు. మౌనంగా సాగిపోతున్నారు. వీధుల వెంట సాగిపోతున్నారు. అది వింతగా తోచింది జనానికి. అనుసరించారు.

ముందు భీముడు,

అతని వెనుక వడ్డెర్లు,

వారి వెనుక జనం.

తాసిల్దారు ఇంటికి చేరారు. వడ్డెర్లను వారి సుత్తెలను వారివెనక వచ్చిన, వస్తున్న జనాన్నీ చూశాడు. తాసిల్దారు జంకాడు. నోటితో అరచాడు. "ఎందు కొచ్చిన్రు" అని.

"ఎట్టికి రాయికొట్టే వెళ్ళతలేదు. దొరా! పోరలు ఉపాసా ఉంట్రు. వంట్ల బలం లేకుండ అయితాంది. కూలి ఇప్పించండి." భీముడు అడిగాడు.

తాసిల్దారు తల గిర్రున తిరిగింది. అధికారం అస్తమిస్తున్నట్లనిపించింది.

"ఎవరు నేర్పి పంపిన్రురా లం....కొడకల్లార" కేక పెట్టాడు

ఆ కేకకు ఎవరు ఉలికిపడలేదు. "కడుపు నేర్పింది దొరా! ఆకలి నేర్పింది! అది అన్ని నేర్పుతది. వద్దంటరా ఊరువిడిచి పోతం-రెక్కలు చల్లగుంటే గంజి నీలు కరువైతాయి?" గంభీరంగా జవాబు చెప్పాడు భీముడు.

అర్థంకాలేదు తాసిల్దారుకు. వడ్డెర్లకు ఇంత ధైర్యమా? కూలి అడగటానికి వస్తారా? అమీన్ను పిలిపించి అందరినీ తుపాకులతో కాల్చుతామనుకున్నాడు. అందు వల్ల అమీను నెత్తికెక్కుతాడు. ఇంతలో రావుడు గుర్తుకొచ్చాడు. తాను కడుతున్న బంగళా గుర్తుకొచ్చింది. ఎంత చిన్న మనుష్యులు ఎంత పెద్దపనులు ఆపగలరు? వీళ్ళను వెళ్ళనీయరాదు. కూలి ఈయరాదు. తనపని సాగాలి. ఎలా? తలమీద చేయి రాచుకున్నాడు. ఏమీ తోచలేదు. అమాంతంగా ఆలోచన తట్టింది. వ్యాపారస్థులను పిలిపించాడు. వారంతా వెంకయ్యతో వచ్చారు. జరుగుతున్న వింత చూడ్డానికి జనం చాలా కూడింది. అమీనుకు తెలిసి మౌనం దాల్చాడు. వడ్డెర్లు తాసిల్దారుకు బుద్ధి చెప్పాలని లోలోన కోరుకున్నాడు.

వడ్డెర్లకు కూళ్ళు ఇవ్వాల్సిందని వ్యాపారస్థులను ఆదేశించాడు తాసిల్దారు. తాము ఇదివరకే పట్నంనుంచి వచ్చిన వాళ్ళ జీతభత్యాలూ, భోజనాలూ భరిస్తున్నా మనీ, బేరాలు తగ్గాయనీ, పెట్టిన అప్పులు రావడం లేదనీ, అదనపు భారం భరించ లేమనీ విన్నవించుకున్నారు వ్యాపారులు.

వ్యాపారులు తనకు ఎదురు చెప్పడం! తన ఫర్మానును ధిక్కరించడం! మండిపోయాడు తాసిల్దారు. వడ్డెర్లమీద కోపం, కోమట్లమీద తీర్చుకున్నాడు. అర చాడు. చీవాట్లు పెట్టాడు. వ్యాపారులు బదులు పలుకలేదు. తలలు వంచుకొని విన్నారు. కాని మళ్ళీ పాతపాటే పాడార్లు.

తాసిల్దారు మండిపోయాడు. అధికార ధిక్కారాన్ని సహించలేకపోయాడు. అందుకు కారణాలనుగురించి ఆలోచించసాగాడు. మంగళ్ళ ఊరు విడిచిపోవడం, పేరిగాణ్ణి కట్టుగొయ్య మీదినుంచి తీసికెళ్ళడం, ఇప్పుడిలా వడ్డెర్లు, కోమట్లు ఎదురు తిరగడం—వీటన్నింటికీ ఒక దానితో ఒకటి సంబంధం కల్పించుకున్నాడు. పత్రిక తెచ్చిన రఘు మెదడులో మెదలాడు. మొనగాడు. వాడే వీటన్నిటికీ కారణం అనుకున్నాడు. కాని ఏం చెయ్యాలి? అతడు వీరయ్యగారికి అల్లుడు. వారికి జాగీర్దారుతో నేరుగా సంబంధాలున్నాయి. అంతేకాక రఘు ఖానూను చదువుకున్నవాడట. అంగ్రేజు మాట్లాడ్తాడట! అతణ్ణి తాను కొట్టలేడు. కసితీర్చుకోలేడు. ఇందరిముందు అవమానించా లనుకున్నాడు. రఘును పిలిపించాడు.

రఘు వచ్చాడు. తాసిల్దారు చూచాడు. అతని ముఖంలో గాంభీర్యం ఉంది. సౌమత్య ఉంది. సౌశీల్యం ఉంది. అతణ్ణి చూచి నీళ్ళు నమిలాడు తాసిల్దారు. రఘు సలాం చేస్తే ప్రతి నమస్కారం చేశాడు. ఎందుకో క్షణం నిర్వీణ్ణు డయిపోయాడు.

రఘు నుంచున్నాడు. తాసిల్దారు కూర్చున్నాడు. అది సహించలేకపోయాడు భీముడు. కుర్చీ తెచ్చి వేసి కూర్చోమన్నాడు.

రఘు కూర్చున్నాడు.

తాసిల్దారు గట్టిగా కేక పెట్టాడు.

చెట్లమీద కాకులు ఎగిరి కావు కావుమని అరవసాగేయి.

జనం గుండెలు దద్దరిల్లాయి.

తాసిల్దారుకు చమటలు పట్టాయి.

రఘు గ్రహించాడు. అతనికంటే బిగ్గరగా అరచాడు.

బంగళా ప్రతిధ్వనించింది.

తాసిల్దారు గుండె బీటలు వారింది.

ప్రజల గుండెల్లో మేఘాలు గర్జించాయి.

"చూడు తెల్లారేటాలక్కల్లా నెత్తురు కక్కుకొని చస్తవు" అని దండ కడియం కదిలించాడు తాసిల్దారు. ఆ కడియంలో ఏవో మాయలూ, మంత్రాలూ ఉంటాయనీ, అది కదులుతే ఎదురు చెప్పినవాడు తెల్లవారేవరకు చస్తాడనీ, ప్రజల విశ్వాసం.

ఆ మాటకు వడ్డెర్లు అదిరిపడ్డారు. తమకు కూలి లేకున్నా రఘును రక్షించుకోవా లనుకున్నారు. వెట్టికే బండలు కొడ్తామనీ, ఉపవాసాలు లెక్క చేయమని విన్నవించుకుందా మనుకున్నారు. కాని—

ఆ మాటలు విని ఉగ్రుడై లేచాడు రఘు.

"మంత్రాలు నీకే వస్తాయనుకోకు. నీ ముందే రక్తం పిండుతా చూడు" అని "హాంఫట్ హ్రాం హ్రీం హ్రీం క్లీ" అని ఏదో మంత్రం చదివినట్లు చేసి చేయి మూసి తెరిచాడు. చేతిలోకి నిమ్మకాయ వచ్చేసింది.

తాసిల్దారు బిత్తరపోయాడు. అతని ప్రాణాలు పైపైనే ఎగిరాయి.

ప్రజలు ఆశ్చర్యంగా చూచారు.

"ఈ నిమ్మకాయల నీ నెత్తురంత వున్నది కట్టిపెట్టిన. ఇదిగో పిండుత సూడు. నీ రక్తం దిగిపోతది. తెల్లారేదాకా ఎందుకు?" అని నిమ్మకాయ పిండాడు. అందులోని రక్తంబొట్లు రాలసాగాయి. తాసిల్దారు నీరసించసాగాడు. అతని వంట్లో రక్తం కారిపోతున్నట్లనిపించింది. "ఆగు" అరచాడు. అది ఆర్తనాదం. "పిండకు" అని లేచి వచ్చాడు. అంత భారీ మనిషి రఘు చేయిపట్టుకొన్నాడు బ్రతిమాలు తున్నట్లు.

"అచ్చా–జర హుషారుగుండు" అని నిమ్మకాయ జేబులో వేసుకొని వెళ్ళి పోయాడు రఘు.

తనుస్తూ బల్లమీద పడిపోయిన తాసిల్దారు వడ్డెర్లను తెల్లవారి రమ్మన్నాడు. కోమట్లను పంపించేశాడు. హుక్కా గబ గబా పీల్చసాగాడు.

అగ్గిలా పాకింది ఆ వార్త.

తెల్లవారి వడ్డెర్లు కూళ్ళు గెలుచుకున్నారు.

# 5

అడవుల అందాలూ ఆకాశపు టంచులూ ఎవరు చూచాడు! వర్ణించాడు! ఋతువుతోపాటు రూపం మార్చుకుంటుంది. పొద్దుతోపాటు పోలిక తీర్చుకుంటుంది. పచ్చని ఆకులతో నిండివున్నా, పండుటాకులు రాలి ఉన్నా అందమే అడవికి. పులి గాండ్రుమన్నా, నెమళ్ళు కేకలు పెట్టినా, గువ్వలు తప్పలు కొట్టినా సోయగమే. అడవి రూపవతి. అందాలరాశి. ఏ రూపంలో ఉన్నా అందమే. ఎప్పుడూ కిల కిల లాడుతుంటుంది.

అడవి అందాలరాశి మాత్రమే కాదు ఔషధుల తుప్ప. అక్కడ అమృతం ఉంటుంది. సంజీవని ఉంటుంది. అవి మనిషిని బ్రతికిస్తాయి. గాయాలను మాన్పు తాయి. అక్కడ విషమూ ఉంటుంది. హాలాహలం ఉంటుంది. చావూ ఉంటుంది. ఓషధులన్నీ కోయ దొరలకు తెలుసనలేం. కాని చాలా తెలుసు వారికి. వారిలో ప్రతి వాడూ వైద్యుడే. అందరికీ ఏదో ఒక మూలిక తెలుసు. ఎవడూ దాన్ని దాచడు. బోలెడు సలహాలూ, బోలెడు మందులు.

అన్ని మందులున్నా, అందరు వైద్యులున్నా సమ్మయ్య భార్యకు జ్వరం తగ్గలేదు. రావడం జ్వరం చలితో వచ్చింది. చలి వచ్చినప్పుడల్లా ఎండలో కూర్చు న్నది. అందరు చెప్పిన ఆకులు తిన్నది. చలి తగ్గింది. కాని జ్వరం వదల్లేదు. బలం పీల్చేసింది. ఎముకల గూడులా తయారైంది. ఇప్పుడు జ్వరం బయటికి రావడంలేదు. కాని లోలోన కృంగతీస్తూంది. రక్తం పీల్చేస్తూంది.

కోయగూడెం వాళ్ళు క్రింది గూడానికి వెళ్ళాలనుకున్నారు. ప్రతిపాదన వచ్చింది సింగన్న నుంచి. సింగి సింగన్న కళ్ళల్లో కాపురం పెట్టింది. ఎడదలో ఇల్లు కట్టుకుంది. అతనికి ఏదో బాధ కలిగిస్తూంది. ఆరాటం కలిగిస్తూంది. అందుకే ఈ ప్రయాణం. మాట ప్రయాణం వేటకు.

కోయగూడెం కదిలింది. కిలకిల లాడుతూ కదిలింది. పక్షుల గుంపులా ఎగిరింది. సాగింది. పరిహాసాలు, పాటలు, చక్కలిగింతలు గంతులు, నవ్వులు ఈసడింపులు, కథలు, వయసు పయనిస్తూంది. ఆనందం ప్రవహిస్తూంది. వయ్యారం ఉరుకుతూంది.

అడవిలో కాలిబాట, పల్లెపదంలా వంకరటింకర్లుగా సాగుతూంది. మనిషి జీవితంలాంటి మిట్ట పల్లాలు, దుబ్బులు, లతలు, రాళ్ళు, పక్షుల గుంపులు, కలకలా రావాలు, లేళ్ళ గుంపుల గంతులు, కుందేళ్ళ ఉరుకులు ఈ పక్కన అడవి, ఆ పక్కనా అడవి, ముందు అడవి, వెనుక అడవి, సాగిపోతున్నాది కోయగూడెం. గూడానికంటే ముందే సింగన్న గుండె క్రింది గూడెంలో వాలింది.

సాయంకాలానికి కోయగూడెం క్రిందిగూడానికి చేరింది. క్రిందిగూడెం గుండెలు విచ్చి స్వాగతం పలికింది. వెన్నెల విరిసింది. విందులు సాగాయి. ఇప్ప సారాయి, కాల్చిన మాంసం, ఆటలు, పాటలు, కేరింతలు, సింగికి సైగ చేశాడు సింగన్న. ఆమె గుండె విచ్చుకుంది. నెమళ్ళు పురి విప్పి నాట్యం చేశాయి. ఆమె సింగన్నను అనుసరించింది.

సింగి, సింగన్న—రతీమన్మథులు గూడెం దాటారు. దూరంగా వెళ్ళారు. ఒక బండమీద కూర్చున్నారు. మాటలు ముచ్చట్లు. ఏముందో వాటిలో మాధుర్యం! ఏముందో వాటిలో ఆకర్షణ ? ఎంతసేపో, ఏమిటో ఆ మాటలు సింగన్న సింగి ఒళ్ళో పడుకున్నాడు. ఆమె అతనిని చూస్తూ ఉండిపోయింది. సింగన్న చుక్కల్ని చూస్తున్నాడు. అవి వారితో పాటు మేలికతో ఉన్నాయి. అవీ వీరినే చూస్తున్నాయి. సింగి సింగన్న తొడమీద తల పెట్టింది. అతడు ఆమె వెంట్రుకలు సవరించాడు. అందులో ఏదో అనుభూతి వుంది. ఆనందం ఉంది.

క్షణంలో తెల్లవారింది. జంటగా గూడెం చేరారు. గూడెం వేటకు సిద్ధం అవుతూ వుంది. గుంపులు విడిపోయాయి. ఆయుధ పాణులై బయలుదేరారు కోయలు. యాత్ర సాగింది అడవికి. దట్టపు అడవికి. యువతులు బాణాలు విసురుతున్నారు పాటల రూపంలో. పూలబాణాలు. యువకులేం తక్కువా! వారూ విసురుతున్నారు. అవీ పూలే. కాని వాడిగా ఉన్నాయి.

వేట సాగింది. అడవి అదిరింది. కలకలం లేచింది. ఉత్సాహం పొంగింది. ఆవేశం హెచ్చింది. ఉరుకులు సాగాయి. తుపాకులు పేలాయి. బల్లాలు కదిలాయి. బాణాలు రాలాయి. జంతువులు కూలాయి. జనం కూడారు. వర్తులం తీర్చారు.

విందు ఆరగించారు. కిలకిలలు, పకపకలు, పరిహాసాలు. గుండెలు గంతులు వేస్తున్నాయి. మనసుల్లో జలపాతాలు రాలుతున్నాయి.

ఇక విశ్రాంతి. చెట్టుక్రింద ఒకడు, చేమక్రింద ఒకడు, పొదచాటున ఒకడు, ఎదచాటున ఒకతె పడుకున్నారు. అందం నిద్రపోయింది. ఆనందం ఒళ్ళు మరచింది. సింగి, సింగడు వారి మనసుల్లో యేవో ఆవేపన ఉంది. ఏదో ఆరాటం ఉంది. ఏదో సంభ్రమం వుంది. ఏవో సంబరం ఉంది. ఈ రోజు, ఈ రాత్రి అదే వారిది. ఆ తరువాత జంట విడిపోతుంది. ఒకటి కోయగూడెంలో, ఒకటి కింద గూడెంలో, వారికి నిద్ర రాలేదు. కునుకు పట్టలేదు. అదిగో ఆ మద్దిచెట్టుకింద, రాతిమీద. సెలయేటి పక్కన కూర్చున్నారు.

వారి హృదయాలు అంతులేని సాగరాలు.

వారి ముచ్చట్లుఅంతులేని ఆకాశాలు.

దగ్గరికి వచ్చి ఒడిలోనికి ఒదిగి అడిగింది సింగి. "ఎప్పుడు తెచ్చుకుంటవు?" అంతే. ఆమె కనుచూపు వాలింది. సిగ్గుతో కుంగింది.

సింగన్నలో సాగరాలు పొంగాయి. పొదివి దగ్గరికి తీసుకున్నాడు. "అమ్మ నవ్వుతున్నది. బాగైతే తెచ్చుకుంట" అన్నాడు. పూలరాసులు కురిపించాడు.

అవి గులకరాళ్ళు అయినాయి సింగికి. బెదురు కళ్ళతో సింగన్నను చూసింది. "ఎప్పుడైతది?"

"అయితదిలే." కళ్ళు మూశాడు సింగన్న. అతని చేతిలో ఏదో విచ్చుతుంది. అది కళ్ళలోనుంచి గుండెలోకి పోయి గిలిగింతలు పెట్టింది. ఆమె కిలకిలా నవ్వింది. అతడూ నవ్వాడు.

రెండు నవ్వులు కలిశాయి.

రెండు నదులు కలిశాయి.

కోయలు లేచారు. కోలాహలం రేగింది. మళ్ళీ వేట సాగించదలచలేదు. ఆటలాడదలచారు. ఏమి ఆట? ఆటల నిర్ణయం లేదక్కడ. అన్నీ ఆటలే. అసలు వారి జీవితమే ఆట, వేట. ఎదురుగా ఒక కుంట కనిపించింది. నీరు కొద్దిగా వుంది. చేపలు నిండుగా ఉన్నాయి. చేపలు పట్టాలి. తినటానికి కాదు ఆటకు. గుంపులు గుంటలో దూకాయి. గుంటనంతా తొక్కాయి. కలచివేశాయి. నీరంతా బురద అయింది. చేపలు నిలవలేకపోయాయి. అవి పైకి వస్తుంటే కర్రలతో బాదడం, పట్టుకోవడం, ఇద్దరూ ఒకే చేపను పట్టారు. గుంజులాట, పోట్లాట, నీరు చిమ్ముకోవటాలు, తగాదా తెగింది చేపను ఒకడు లాక్కున్నాడు. విసరి బయటికి కొట్టాడు. అదొక వింత, అదొక వినోదం అంతే!

సింగీ, సింగన్న కలిసి పట్టారు చేపలు.

ఒకరి చేతులు ఒకరు పట్టుకున్నారు. ఒకే చేపను ఇద్దరు పట్టుకున్నారు. లాక్కున్నారు. సమాధానపడ్డారు. నీరు చిమ్ముకున్నారు. ముఖం నిండా బురద,

వంటినిండా బురద, ఇద్దరూ అలాగే అయినారు. ఒకరిని చూచి ఒకరు నవ్వుకున్నారు. బురదలో కాళ్ళు రాచుకుంటూ బయటపడ్డారు.

సూర్యుడు అస్తమిస్తున్నాడు. కోయలు గూడానికి తరలారు. గూడెంలో రాత్రి సంబరాలు. మళ్ళీ ఆటలు, మళ్ళీ పాటలు, గూడెమే పాడింది, గూడెమే ఆడింది.

సింగీ సింగన్న చుక్కలకింద బండమీద ఏవో గాథలు ఏవో అగాథాలు తోడుకున్నారు. గుండెలలోకి ఎత్తుకున్నారు. పాపం అమాయకురాలు. అడవి బిడ్డలు ప్రేమపదం తెలియనివారు. ప్రేమించుకున్నారు.

వెన్నెల కరిగింది. జారింది. దాగింది. చీకట్లు కమ్ముకున్నాయి. బయటి చీకటి ప్రేమికుల గుండెల్లో చేరింది. గుండెలు గుబగుబ లాడేయి. రాతిమీదినుంచి లేచారు, సాగారు. గూడెం చేరారు. నెగళ్ళు మండుతున్నాయి. మాంసం కాలుతూంది. సారాయి ప్రవహిస్తూంది. ఆటలు, పాటలు, కేకలు, కేరింతలు.

తూరుపు సింధూరం సింగారించుకుంది. ఎర్రవారి తెల్లవారింది. ఆటలు పాటలు ఆగిపోయాయి. కోయగూడెంవారు ప్రయాణం అవుతున్నారు. కొందరు శలవు తీసుకుంటున్నారు. కొందరు వీడ్కోలు చెపుతున్నారు. రెండు గూడాలవారు గూడెం దాటారు. కింది గూడెంవారు నిలిచిపోయారు. కోయగూడెం సాగిపో తూంది.

కిందిగూడెం గూడెంలో దూరింది. సింగి మాత్రం అక్కడే నిలిచింది. సింగన్న భుజానికి తుపాకి తగిలించుకొని సాగిపోతున్నాడు. మనసు కాదు, మనిషి సాగిపో తున్నాడు. వెనకనుంచి ఏదో లాగుతూంది. కళ్ళెం పట్టుకుని లాగుతూంది. వెనక్కు తిరిగాడు! సింగి అక్కడే నిలిచి ఉంది. అతని కాళ్ళకు బంధాలు వేసింది. అతడు చూచాడు. ఆమె చూచింది. ఇద్దరి కండ్లూ చెమ్మగిల్లాయి! బలవంతంగా వెనక్కు తిరిగాడు. పది అడుగులు వేశాడు. సింగి ఉరికింది. ఒక బండ ఎక్కింది. చూడ సాగింది. సింగన్నకు మరి అడుగు ముందుకు పడలేదు. వెనకకు తిరిగి చూచాడు. బండమీద సింగి కన్నీరు జల జలా రాలుస్తూంది. గుండె ముందుకు ఉరికింది. తాను అక్కడే నిలిచాడు. ఎంతసేపు నిలిచాడో! అతని కళ్ళుకాదు—గుండె ఏడ్చింది. మగవాడు ధైర్యం చేశాడు. వెనక్కు తిరిగాడు. సాగిపోయాడు.

సింగి చూపందినంతసేపు జూసింది.

నిట్టూర్చింది.

కళ్ళు తుడుచుకుంది.

గూడెంలోకి ఉరికింది.

ఇల్లుచేరి తల్లిని చూస్తే సింగన్న గుండె చీలమండల్లోకి దిగింది. ఇంటి ముందు ఎముకల గూడులా కూర్చొనివుంది. మనిషిలో ఎక్కడా రక్తం వున్న జాడలేదు. పాలిపోయింది. అడుగుల చప్పుడు విని అటు చూచింది. కొడుకు తన

కొడుకు. జీవం సొంతం కళ్ళలో కేంద్రీకరించి కొడుకును చూచింది. ఆ చూపుతోనే గుండె పగిలింది సింగన్నకు. చూపు నిర్జీవంగా ఉంది. కళ్ళలో ఏదో నిరాశ గూడుకట్టుకుంది. ఆ చూపుతో సింగన్న కళ్ళు చెమ్మగిల్లాయి. ఏమిటి ? ఏమైంది తల్లికి ? ఒక్కరోజులోనే ఇంతగా మారిపోయిందేం ? ఏమి అవుతుంది? ఏమి కానున్నది? అతనికి ఏమీ తోచలేదు. పాపం అమృతం నింపుకొని వచ్చాడు ! అంతా హాలాహలంగా మారింది.

"అవ్వా !" ఒకటే మాట తల్లి ఒడిలో వాలిపోయాడు. తల్లి తల నిమిరింది. కొడుకు కళ్ళల్లోకి చూచింది. ఇద్దరి కళ్ళూ చెమ్మగిల్లాయి. అలా కొంత చూసింది. కళ్ళు తుడుచుకుంది. "ఎందుకుర గట్ల గుండె పగిల్తివి ? ఏమైందిరా నీకు?" అని కృతకం అయిన చిరునవ్వు నవ్వింది. తనకున్న బాధంతా దాచుకోవాలనుకుంది. కొడుకు బాధపడరాదనుకుంది.

"పాన మెట్లున్నదె?"

"బాగున్నది గద" మళ్ళీ ఒక నవ్వు నవ్వింది. ఆ నవ్వు భయంకరంగా వుంది.

కుందేళ్ళు భుజాన వేసుకొని సమ్మయ్య వచ్చేశాడు. తల్లీ కొడుకులను చూచాడు. కుందేళ్ళు కింద పడేసి.

"ఉస్స్! ఏందో టుక్కున్న వస్తివి. అవ్వకాడి కొచ్చి అట్లైయిన వేందిర?" అడిగాడు.

పాప ఇంట్లో ఏడ్చాడు. తల్లి సింగన్నను పక్కకు నెట్టి లేచి నుంచుంది. ఎముకలు గలగల మన్నాయి. గుడిసెలోనికి వెళ్ళిపోయింది.

తండ్రీ కొడుకులు ఒకరిని ఒకరు చూసుకున్నారు.

పాప ఏడుస్తున్నాడు. తల్లి చన్ను కుడిపింది. అందులో రక్తమే లేదు. పాలెలా వస్తాయి ? పాప ఏడుపు మానలేదు. సమ్మయ్య గూడెంలోకి వెళ్ళాడు. ఒక అమ్మను తెచ్చాడు. ఆమె పాపకు పాలిచ్చింది. పాప పడుకున్నాడు.

సమ్మయ్య భార్య అలాగే లేచింది. కుందేళ్ళు వండింది. పెట్టింది. తండ్రి కొడుకులు తింటుంటే తన్మయురాలై చూచింది. వారి డొక్కలు నిండగా తన గుండె నింపుకుంది. వళ్ళంతా నొప్పులు. ఏదో అయోమయంగా ఉంది. ఏదో బాధ. బాధ ఎలాంటిదో చెప్పరావడంలేదు, పోయి పడుకుంది. తండ్రీ కొడుకులు తలలు పట్టుకొని బయట కూర్చున్నారు. పొరుగింటి అమ్మ వచ్చి కళ్ళలో పసరు పోసింది. మరొక తల్లి ఒకవేరు నమలమంది. ఇంకొక అవ్వ వేరు పొగవేసింది. ఏదేదో వైద్యం సాగుతూంది. ఒక్కొక్కళే వచ్చిపోతున్నారు. ఒక్కొక్కరూ ఒక్కొక్క మందు వేసి పోతున్నారు.

పచ్చి బాలెంత. వానలో తడవడమే ఇందుకు కారణం అన్నాడు సింగన్న, అంగీకరించలేదు సమ్మయ్య. తానూ అలాగే వానలో పుట్టానని తన తల్లి చెప్పిందు

న్నాడు. గూడెం వేటకు వెళ్ళింది. సమ్మయ్య తల్లీ వెళ్ళింది. అక్కడే ఆమెకు నొప్పులు వచ్చాయి. ఒక పొదచాటున ప్రసవించిందట. రాతితో బొడ్డు తరిగి బయటికి వచ్చిందట. ఇంతలో పెద్దవాన. అది రెండు రోజులు విడువలేదట! ఆ వానలో అడవిలోనే ఉండిపోయారట రెండు రోజులు. బిడ్డతో సహా గూడేనికి వచ్చింది. మూడవనాడు కుంటకుపోయింది. ఆమె చనిపోయేవరకూ జ్వరున చీదలేదు.

ఏమిటో అర్థం కాలేదు సింగన్నకు. ఆమీనుమీద కోపం వచ్చింది. అయినా తనేం చేయగలడు ? మింగాడు. కొంతసేపు ఎద మండింది చల్లారిపోయింది.

సమ్మయ్య భార్య-సింగన్న తల్లి-కొద్దిగా కోలుకుంది. కళ్ళలో కాస్త ఎర్రని రేకలు వచ్చాయి. తండ్రి కొడుకులు సంతోషించారు. గండం గడిచింది అనుకున్నాడు. కాని ఎంతో కాలం అలా ఉండలేదు. మళ్ళీ జ్వరం వచ్చింది. మంచం పట్టింది. ఈ తడవ మంచంలోంచి లేవనేలేదు. మందులేవీ పనిచేయలేదు. ఏ రాత్రో ఆమె ప్రాణాలు లేచిపోయాయి.

తెల్లవారి చూచారు తండ్రీ కొడుకులు. బావురుమన్నారు. గూడెం సాంతం చేరింది. ఏడ్చింది. అడవి సైతం ఆకు రాల్చింది. ఏడ్చింది. అడవీ గూడెమూ బోసిపోయాయి. అందరి ముఖాలూ వెలవెల బోయాయి. అందరి కళ్ళూ చెరువులైనాయి. సమ్మయ్య భార్యను—కాదు ఆమె భౌతిక కాయాన్ని ఊరిబయటకు తీసికెళ్ళారు. కట్టెల్లో పెట్టారు. నిప్పంటించారు. కాడు సింగన్న గుండెల్లో మండింది. తల్లిని బూడిదచేసి వంటరిగా గూడానికి వచ్చాడు. సమ్మయ్య భార్యను అగ్నికి అప్పగించి వచ్చేశాడు.

మూడవనాడు కాటిమీద కుండెడు అన్నం బోర్లించి వచ్చారు. అంతే అంతటితో బంధం తెగిపోయింది. వారికి ఆత్మ, పరమాత్మలు లేవు. పునర్జన్మ సిద్ధాంతం తెలియదు. పుట్టినవాడు చస్తాడు. అంతే వారికి తెలిసింది. చచ్చినవాడు ఏమౌతాడో వారికి అనవసరం. బ్రతుకు చెట్టుకు కాసే కాయలాంటిదని వారి విశ్వాసం. కాయ కాస్తుంది. పండి రాలిపోతుంది. కొన్ని పండకుండానే రాల్తాయి. కొన్ని పసిగాయలుగానే రాలిపోతాయి. అది వారి జీవితం. అదీ వారి వేదాంతం.

గూడెం సింగన్న తల్లిని మరచింది. కాని సింగన్నకు మరుపు రాలేదు. ఆమె ఒకనాడు కలలో వచ్చింది. తనను మరచారన్నది. దూరింది. తిట్టింది. తల్లిని ఏం కావాలని అడిగాడు సింగన్న. చాలా కావాలంది. ఆవులు కావాలంది. గొర్రెలు కావాలంది. కోళ్ళు, మేకలు కావాలంది. కల్లు, సారాయి కావాలంది. సింగన్న బేరం సాగించాడు. అన్నీ సాధ్యపడవన్నాడు. ఒక ఒప్పందానికి వచ్చారు ఇద్దరూ. ఒక ఆవు, రెండు గొర్రెలు, కల్లు, సారాయి, వగైరా వగైరా అన్నీ కలలోనే జరిగాయి. అయినా వాగ్దానం చేశాడు. చెల్లించాల్సిందే తప్పదు.

సింగన్న, సమ్మయ్య సాధించారన్నీ, సంపాదించారు. దినం నిశ్చయం అయింది. దినం జరుగుతూంది. గూడెం యావత్తు కూడింది. ఊరిబయటకు చేరింది.

ఒడ్డె వచ్చాడు. ఒడ్డె అంటె వారి పురోహితుడు. డోలువాడొచ్చాడు. ఊరు బయట ఒక చెట్టు. చెట్టుకు ఒక కొమ్మ. కొమ్మకు ఒక గురిగి, గురిగిలో ఒక ఇనుపముక్క. అది వారికి దేవత. ఆ ఇనుపముక్క ఎప్పుడొచ్చిందో వారికి తెలియదు. గురుగులు మాత్రం ఎప్పటికప్పుడు మారుతుంటాయి.

ఒడ్డె చెట్టెక్కాడు. కొమ్మకు చేరాడు. గురిగిని తీసుకొని దిగాడు. గురిగిని పగలకొట్టాడు. ఇనుపముక్క తీశాడు. పసుపు కుంకుమతో పూజచేశాడు- సూర్యుడు క్రుంగాడు. ఆవు తెగింది. గొర్రెలు తెగాయి. ఆ రక్తంతో పడమర ఎర్రబారింది. ఇంతలో నల్లవారింది. నెగళ్ళు వెలిగాయి. మాంసం కాలింది. ఆవుతోక వెనుక తొడలు వేరుంచారు. కాలిన మాంసం, సారాయి, కల్లు శివకుమారుని శివం, ఒడ్డెవాని పదాలు, డోలు సూరయ్య డోలు. తాగుడు. తాగుడు. తాగుడు. సమ్మయ్య భార్యను మరచాడు. సింగన్న తల్లిని మరచాడు. అంతా ఎగురుతున్నారు. అంతా ఆడుతున్నారు, పాడుతున్నారు.

డోలు సూరయ్య డోలు. మ్రోగుతూంది. అతడు కథ చెపుతున్నాడు. ఎప్పుడూ చెప్పేకథే, కోయ దొరల కథే. అయినా కొత్తదనం కనిపిస్తూంది. అప్పటికీ ప్రశ్నలేస్తుంటారు! ఆ కథ తెల్లవార్లూ సాగాలి.

చో ఓ ఒ ఓ ఒ ఓ
రెండు బండల సందునా
రేల చెట్టు కన్పించెను
రేల చెట్టు నానుకొనీ
నీరు జల జల పారెను
అప్పుడు పాటల మొదటి పదం పుట్టింది.

జలా రేల రేలా రేల
రేలా రే జలా రేల

ఒక ఎదురులంక. అందులో ఒక తెలగది. దానికి కడుపైంది. చేసినవాడు ఎవడో తెలియదు. పసువు దక్కించుకోవా అనుకుంది. అడవిలో కన్నది మగ బిడ్డను. వదిలేసింది, వెళ్ళిపోయింది. బిడ్డ పెద్దవాడైనాడు. పదహారేండ్ల వాడైనాడు. కొబ్బరి బొండాంకు కట్టె ఇరికించాడు. గుర్రపు వెంట్రుకలు కట్టాడు. ఒక బాణం బాంటిది తయారుచేశాడు. దానికీ గుర్రపు వెంట్రుక కట్టాడు. వాద్యం అయింది. కిన్నెర అయింది. వాయించసాగాడు. అతడు కిన్నెరుడైనాడు. అతడు చెట్టెక్కాడు. వాద్యం వాయిస్తున్నాడు. దాహం తీర్చుకున్న రాజకుమారులు, కోయదొరలు — వాద్యం విన్నారు. అది బాగనిపించింది వారికి. వాణ్ణి తమ వెంట రమ్మన్నారు! వారు దొరలు. రాజులు. తప్పుతుందా! కిన్నెరుడు వారి వెంట సాగాడు. వాద్యాలు మ్రోగుతున్నాయి. దొరలు సాగుతున్నారు. వాద్యాలు దొరికాయి. వాద్యగాండ్లు

దొరికారు. కాని దేవుడేడి? దేవతలేరీ? దేవునికోసం వెదుకుతూ బయలుదేరారు దొరలు. ఎన్నో దేశాలు తిరిగారు. గోదావరికి ఆవల-శబరికి ఈవల-రొట్టగొట్టి దేశం చేరారు. అక్కడ వారికి ఒక పెద్ద పుట్ట కనిపించింది. దాని ప్రక్కన ఎండ్రకాయ కనిపించింది. అది వారిని చూచింది. పుట్టలోనికి దూరింది. అదే దేవుడనుకున్నారు వారు. దాన్ని పట్టాలనుకున్నారు. గోదావరినుంచి నీరు తెస్తున్నారు. పుట్టమీద పోస్తున్నారు. మూడు వారాలు పోశారు. అందులోంచి కాకేటి పూజర (పూజారి) పుట్టాడు. అతని వంటినిండా లింగాలు. అతణ్ణే దేవు డనుకున్నారు. అతనికి మొక్కారు. వాద్యాలతో పాడారు. అతనిని కీర్తించారు. తాను దేవుణ్ణి కాదన్నాడు కాకేటి పూజర. తాను పూజర నన్నాడు. అతడు వారికి ఒడ్డె అయినాడు. అతణ్ణి తీసుకొని బయలుదేరారు. గుర్రాలమీద సాగారు. వాయువేగ, మనోవేగాలతో ఉరికారు. సముద్రపు ఒడ్డుకు చేరారు. సముద్రం దాటాలి. ఏం చేయాలి? అంతా విచారంగా కూర్చున్నారు. వారిని ఒక తాబేలు చూచింది. అది చాల పెద్దది. వారి దగ్గరికి వచ్చింది. ఎందుకు విచారపడుతున్నారని అడిగింది. చెప్పారు. తాను దాటిస్తానన్నది. ఒక్కొక్కరినే గుర్రాల సహితంగా దాటించింది.

సనపగానిరాజు చిన్నవాడు. వాడు దాటాడు. తాబేటిని రోకలితో కొట్టి చంపాడు. అందుకు అన్నలకూ, అతనికి తగాదా వచ్చింది. చిన్నవాడు గెలిచాడు. తాబేలును కాల్పించి, అందరితో తినిపించాడు.

ఆ దేశంలో పారిగ తొడిమకు గుమ్మడికాయ కనిపించింది. అది వారికి విచిత్రం అనిపించింది. అందులో దేవతలు ఉన్నారనుకున్నారు. దాన్ని పగలగొట్టాలనుకున్నారు. ఎంత కొట్టినా పగల్లేదు. విల్లు నమ్ములందుకున్నారు. దాన్ని బాణాలతో కొట్టారు. పెద్ద ధ్వనితో అది మూడు చక్కలు అయింది. అందులోంచి ముగ్గురు దేవతలు వెళ్ళారు. వారిని చూచి ఆనందించారు రాజులు. పాటలు పాడారు. వాద్యగాండ్లు వాద్యాలు వాయించారు. ఎగురుతూ, ఆడుతూ, పాడుతూ, దేవతలను తీసుకొని వాళ్ళ రాజ్యానికి వెళ్ళారు.

చో ఓ ఓ ఓ ఐ
అ॥ పండాని రాజు ఓ బండిమీద
ఖండాని రాజు ఓ మేన మీద
అ॥ వారు ఆచారమంతులె కాదా?
    నీమాము నామాము వారిది
అ॥ నామాటలు నీమాలు వారిని
    గంటాము గాలామె బిరుదం
చో నూటొరి బమ్మామె దైవం
    ఉండాన తిరుచిన్న నామం

జలా రేల రేలా రేల
రేలా రే రేల రేల

ఇంకా చాలా కథలు చెప్పొదతను. ఒక చిన్నది కడసరి రాజును వలచింది. వలపించుకుంది. పెండ్లి నిశ్చయం అయింది. మాలవాడు తెల్లచీర నేశాడు. దాని నిండా బొమ్మలున్నాయి. అది ఆమెకు నచ్చింది. చీర నేసినవాణ్ణి పెండ్లాడ్తానన్నది. రాజు కాదనలేక పోయాడు. చిన్నది మాలవాణ్ణే పెండ్లాడింది!

సరే. తెల్లవారింది. కుండలు బోర్లపడ్డాయి. మాంసం వడిసింది. అడవినుంచి కోయలు గూడానికి చేరారు. సమ్మయ్య యిల్లు చక్కగా అలికాడు. తమవెంట తెచ్చిన అవుతోక—వెనక తొడల సహితంగా —చూరుకు వ్రేలాడ తీశారు. అంతా చుట్టూ చేరారు, తోకను అడిగారు – నువ్వు దేవత వైనావా అని. తోక కదిలింది అవునన్నట్లు. ఇంకేం? సమ్మయ్య భార్య దేవత అయింది. అంతా సంబరపడ్డారు. తోక విప్పారు. తొడలు వండారు. అంతా తిన్నారు.

అయిపోయింది. ఇక సమ్మయ్య భార్యతో సంబంధం తెగిపోయింది. ఆమె దేవత. వీరు మనుషులు, ఆమె దిగిరాదు. తమతో కలవదు. ఇక ఆమె ఎవరికీ తల్లికాదు. ఎవరికీ భార్యకాదు. అందరికీ దేవత! అవును. ఆవుతోక ఊగింది! ఆమె దేవత అయింది. అలాగే ఉండిపోతుంది.

ఒకనాటి మధ్యాహ్నం గూడెంలో గజ్జెలు గల్లుమన్నాయి. గూడెం గుండె జల్లుమన్నది. గుడిసెల్లో ఉన్నవారంతా గుమ్మాల్లోకి వచ్చి చూచారు. తలారి శివడు బల్లెం గజ్జె గల్లు మనిపించుకుంటూ గూడెంలో ప్రవేశించాడు. అందరి ప్రాణాలూ గడగడ లాడేయి. మళ్ళీ ఏదో మూడింది. మళ్ళీ ఎవడో వస్తున్నాడు. వచ్చేవాడికి ఏం కావాలో? అడవి ఆకులు రాల్చేసింది. ఎవడన్నా వేటకు వస్తున్నాడేమో! అదీ వారికే కష్టం. డప్పులతోనూ, కొమ్ములతోనూ పులిని రొప్పాలి. దాన్ని "దొర" ముందుకు తెచ్చి పెట్టాలి. అప్పుడు ఆయన తుపాకి వేస్తాడు. చచ్చిన పులి పక్కన నుంచొని ఫోటో తీయించుకుంటాడు. ఇంకెన్నెన్నో ఊహలు వచ్చాయి తలారి శివణ్ణి చూచి.

శివడు సమ్మయ్య ఇంటికి చేరాడు. సమ్మయ్య మంచంలో కూర్చొని ఆకు చుట్ట చుట్టుకుంటున్నాడు. శివడు యమునిలా కనిపించాడు. అయినా పిలిచి కూర్చో బెట్టాడు. పొగాకుకాడ అందించాడు. ఇంట్లోంచి నిప్పు తెచ్చాడు. వ్యవహారం ఏమిటని అడిగాడు.

శివడు చాలా ఏకరవు పెట్టాడు. తాసిల్దార్ బంగళా కడ్తున్నాడు. బంగళా అంటే అటువంటి ఇటువంటిది కాదు. పట్నంలో జాగీర్దారు బంగళాను తలతన్నింది. పట్నంనుంచి పనివాళ్ళు వచ్చారు—పని చాల ఆడావుడిగా నడుస్తూంది. వందలమంది పనిచేస్తున్నారు. చూచి తీరాలి, సంబరం చూడ్డానికే వస్తున్నారు జనం!

అతడు చెపుతుంటే నోళ్ళు తెరచి వింటున్నారు జనం. శివడికి ఉషారు ఎక్కువైంది. మరీ మరీ చెప్పసాగాడు. అతడు చెప్పిందంతా వింతగా విన్నారు. పాము నాగస్వరాన్ని చూచి తల ఊపినట్లు ఊపారు. అసలు విషయానికి వచ్చాడు శివడు. గుడి బద్దలుకొట్టాలి. దాని స్తంభాలు తాసిల్దారు ఇంటికి చేరవేయాలి. ఊళ్ళో వున్న హరిజనులు పనికిరారన్నాడు గిర్దావరు. వారు తాకుతే దేవాలయం అపవిత్రం అవుతుందన్నాడు. కాబట్టి కోయగూడాలు తరలిపోవాలి. ఆ స్తంభాల్ను తాసిల్దారు భవనానికి చేర్చాలి. ఆ పనిమీద వచ్చాడు శివ డిప్పుడు.

"ఏమె శివన్న గుడెందుకు కూల కొడ్తాండె దొర" అడిగాడు సింగన్న.

"అగ్గొ గదంత నాకేమి ఎరకైతది? దొర తల్చుకున్నడంటే గుడేంది గుట్టల్నె కూలగొడ్తడు. సరెగాని ఎప్పుడెల్తరు?"

"ఏమొ ఎల్లెల్లుతమే కూనలను (పిల్లలను) పెట్టలను (ఆడవారిని) ఇడిచి రావాలెగదనె"

"ఎళ్ళాలె, ఎళ్ళాకుంటె తుపాకితో కాల్చి చంపుత నన్నడు దొర."

కోయదొరలు ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు. గుండెలు గుబగుబ లాడేయి. మనసుల్లో ఏవేవో మసిలాయి. కాని మాట ఒక్కరినోటా వెళ్ళ లేదు.

"ఎన్ని రోజులు పడ్తదంటావ్" సింగన్న ప్రశ్న.

"ఎల్లెరికైతది? గుడి కూలాలె. తంబాలు చేరాలె. బంగ్లకు ఎక్కాలె. నా కింత సాన పనున్నది. కింది గూడెం పోవాలె. కోయ గూడాలన్నిటికి పోవాలె. మందిని తోల్కరావాలె. తయారుంతండి తోల్కపోత" తలారి శివడు ఇక ప్రశ్నలు వేయవద్దన్నట్లుగా చెప్పాడు.

ఆ రాత్రి కోయగూడెంలో గడిపాడు శివడు. అతనికి అతిధి సత్కారం జరిగింది. తెల్లవారి వెళ్ళిపోయాడు మిగతా కోయగూడాల జనాన్ని తీసుకొని రావడానికి.

కోయగూడెపు జనం ప్రయాణానికి సిద్ధం అవుతూంది. అడవినుంచి కాయ గసరు తెచ్చుకున్నారు. గింజలు కట్టుకున్నారు. మూటా ముల్లె సర్దుకున్నారు. ప్రయాణానికి సిద్ధమైనారు. సమ్మయ్యను గూడెం రక్షణకు ఉంచడానికి నిర్ణయం అయింది.

కోయలు గుంపులు గుంపులుగా కోయగూడెం చేరారు. కిందిగూడెం వారూ వచ్చారు. కాని సింగి రాలేదు. సింగన్న ఖిన్నుడైనాడు. సింగిని గురించి ఒక్కొక్క రిని అడిగి తెలుసుకున్నాడు. ఆ రాత్రి కోయగూడెం కిటకిట లాడింది. ఎక్కడ చూచిన జనమే. ఎక్కడ చూసినా మనుషులే. అది మానవసాగరం. ఆ రాత్రి సంబరాలు సాగేయి. అంబరాలు అందుకున్నారు. సింగన్న సంబరాల్లో చేరలేదు. వంటరిగా బండిమీద కూర్చున్నాడు. చుక్కలను చూస్తూ ఉండిపోయాడు. అతనిలో

ఏవేవో జ్ఞాపకాలు తరంగాలు పొంగాయి. ఒంటరిగా గడిపాడు ఆ రాత్రి. దాన్ని జనం పట్టించుకోలేదు.

కోడి కూసింది. జనమంతా ప్రయాణానికి సిద్ధం అయినారు. తలలమీద మూటలతో బయలుదేరాయి. కోయల గుంపులు. గూడెం దాటాయి గుంపులు. బారులైనాయి. అది అడవిబాట. కాలిబాట. ఒక్కొక్కడే నడవాలి. ఒకని వెనుక ఒకడు. వందలు, వేలు బారులుగా సాగుతున్నారు. చీమలబారు సాగుతూంది. మాటలు, ముచ్చట్లు మంచీ చెడ్డా, అడుగులు పడుతున్నాయి. బాట సాగుతూంది. మానవ కుద్యం నడుస్తూంది. గూడెం దూరం అవుతూంది. గమ్యం దగ్గర పడుతూంది.

సాయంకాలం అయింది. సూర్యుడు అస్తమించాడు. పిట్టలు గూళ్లకు చేరుకుంటున్నాయి. కోయలు గూళ్ళు వదిలి గమ్యం చేరారు. ఊరిబయట గుడి. గుడికి దూరంగా చింతతోపు. అందులో విడిశారు గుంపులు. గూడాల్ను బట్టి విడిపోయాయి. నెగళ్ళు వెలిగాయి. ఇక్కడ కర్రలు లేవు. ఇది అడవికాదు. ఆ పుల్లా ఈ పుల్లా ఏరుకొచ్చుకోవాలి. నీటిని బాసిన చేపల్లా తల్లడిల్లారు. అడవిని చూసిన కోయదొరలు. ఇది బయలు ప్రాంతం. కనుచూపు మేరలో చెట్టు కనిపించదు. అంతా మట్టి. నల్లని, ఎర్రని మట్టి. అక్కడక్కడా రాళ్ళు చెట్టులేదు. వెచ్చదనం లేదు. స్వేచ్ఛలేదు ఏదీ దొరకదు. అన్నీ కొనాలి. అడవి అతని జీవితంతో పెనవేసుకుంది. అది లేదిక్కడ. అతని ప్రాణాలు విలవిల్లాడాయి. బలం వచ్చింది. ఉత్సాహం లేదు. కాని ఏం చేయగలడు ?

గుడి అంటే నిజంగా పాడుపడ్డదేంకాదు. వాస్తవానికి అది ఏ మాత్రం శిదిలం కాలేదు. ఒక్క స్తంభం కూలలేదు. ఇసుమంత సున్నం రాలలేదు. ఏమంటె పూజ పునస్కారాలూ లేవు అంతే. ఇది శక్తి దేవాలయం. విగ్రహం చెక్కు చెదర కుండా ఉంది. ఒక చేయి మాత్రం విరిగిపోయింది. ఆ దేవాలయాన్ని చూస్తే హనుమకొండలోని వేయి స్తంభాలగుడి గుర్తుకు వస్తుంది. సరిగ్గా అదే నమూనా. కాని అంత పెద్దది కాదు. బహుశాః ఇది నిర్మించిం తర్వాత అది కట్టి ఉంటారు. కాకతీయుల కాలంలోనే ఇదీ కట్టబడి ఉండాలి. వందల సంవత్సరాలు గడచినా అది చెక్కు చెదరలేదు. దాని కప్పు బద్దలు కొట్టడానికి వందలమంది ఎక్కారు. వందల సమ్మెటలు కప్పుమీద పడుతున్నాయి. గునపాలు మ్రోగుతున్నాయి. జనం చెమటలు కక్కుతున్నారు. అయినా ఊహుఁ అది పగులలేదు. అయినా ఆగలేదు జనం. ఊపిరి పీల్చుకో నివ్వలేదు గిర్దావరు కులశేఖరరావుగారు. సమ్మెటలు వందలు పడుతున్నాయి. వేల దెబ్బలు. అయినా ఒక్కరోజులో కదల్లేదు. ఒకరోజు, రెండురోజులు, మూడురోజులు, నాలుగవనాడు కప్పుమీద సున్నంపొర బద్దలైంది. సమ్మెటల దెబ్బలు, గునపాల పోట్లు గుడి ఒకభాగపు సున్నపు పొరను తీసివేశాయి. చమటను కక్కే జనం చింతచెట్ల క్రిందికి చేరారు.

ఆ రాత్రేకాదు, కోయలు వచ్చిన్నాటినుంచి ప్రతి రాత్రీ వస్తున్నాడు నాగేశ్ కోయదొరల వద్దకు. తొలినాడు వారు అతణ్ణి నమ్మలేదు. మూడవనాటికల్లా వారికి విశ్వాసం కుదిరింది. అతడు చెప్పేది విన్నారు. అతణ్ణి తన వాడుగా భావించారు. ఆ రాత్రికి రావఁడు భీముడు కూడా వచ్చారు. వారు కోయల్లో కోయలై పోయారు. వారికి కావలసిన సహాయాలన్నీ చేశారు. కోయలు తరతరాలుగా చూస్తున్నవీ, అనుభవిస్తున్నవే అయినా వీరు చెప్పే మాటల్లో ఏదో కొత్తదనం కనిపించింది. వారు చెప్పేదాంట్లో వాస్తవికత ఉందని మొట్టమొదట గ్రహించిన వాడు సింగన్న. సింగన్న తన తల్లి చావుకూ, పీరయ్యచావుకూ ఏదో సంబంధం ఉందనుకున్నాడు. పీరయ్యను తలుచుకుంటున్నట్లు తన తల్లిని ఎందుకు తలుచుకోరో అర్థంకాలేదు. వడ్డెర్లను ఆదర్శంగా తీసుకొని గుడి కూలగొట్టమని ఎక్కొట్టాలనుకున్నాడు. తన వారికి అనేక విధాల బోధించాడు. అతని బోధనలు అర్థం అవుతూనే ఉన్నాయి. కావడం ఏమిటి ? ప్రత్యక్షంగా చూస్తుంటే ! అయినా తాసిల్దారును ధిక్కరించే ధైర్యం చాలమందికి కలుగలేదు. మళ్ళీ అంతా గుడిమీదకు ఎక్కారు. గునపాలతో కప్పుమీద రాళ్ళను తొలగించసాగేరు. రాళ్ళు ఒక్కొక్కటే పెద్ద ధ్వని చేసి కూలుతున్నాయి. పదాలు, పాటలు, మొత్తం రాళ్ళు కూలేయి. కూలేరాళ్ళను చూసి ఆనందంతో ఉప్పొంగుతున్నారు జనం. గుడి కూలిందని కాదు. విముక్తి దినాలు దగ్గిర పడుతున్నాయని! అయినా అది వారి శ్రమ ఫలం! కూలడం అయితేనేం, కట్టడం అయితేనేం! వారు చేయాల్సిందే! వేల సంవత్సరాలుగా నిర్మించింది వారే. నేటినుంచి కూలబోయేదీ, రేపు కూల్చబోయేదీ వారే ! వారే శ్రామికులు ! !

ఆ రాత్రికి రఘు వచ్చాడు. అతడు చెప్పింది ముందు వారికి అర్థంకాలేదు. క్రమక్రమంగా అర్థం కాసాగింది. సింగన్న తికమక పడ్డాడు. ఎవరు చెప్పింది నిజం? ఏది మార్గం ? అతనిలో ఆవేదన బయలుదేరింది. ఆలోచన రేగింది. రఘు ఇంటికి రాకపోకలు సాగించాడు. జానకితో పరిచయం ఏర్పడింది. వారు పుస్తకాలను గురించి చర్చించుకుంటుంటే శ్రద్ధగా విన్నాడు. వాటిలో ఏవేవో గొప్ప గొప్ప విషయాలుంటాయని గ్రహించాడు. తాను చదువలేక పోయినందుకు విచారపడ్డాడు. అయినా అతనికి ఏదో వెలుగు కనిపించింది. ఆ వెలుగు అందరికీ చూపాలనుకున్నాడు. ఏదో చేయాలనే తహతహ బయల్దేరింది.

పైకప్పు కూలింది. రాళ్ళు విరిగిపడ్డాయి. అయినా స్తంభాలు నిశ్చలంగా నిలిచేవున్నాయి. వాటిని కూల్చాలి. అవి చెక్కు చెదరరాదు. పగ్గాలుకట్టి వందల మంది లాగారు. పగ్గాలు తెగాయి కాని స్తంభం కదలలేదు. గొలుసులు కట్టారు. వందలు వేలమంది లాగారు. శిల్పసంపద కూలింది. ఒరిగింది. నేల కరిచింది. ఒకటి, రెండు, మూడు, అనేకం. ఆ కూలడాన్ని చూడాలనుకున్నాడు తాసిల్దారు. బండి కట్టుకొని వచ్చాడు. స్తంభాలు కూలుతుంటే అతని ఆనందానికి అంతులేదు. అవును, ఆ స్తంభాలే అతని భవనానికి అలంకారాలు.

కావలసినన్ని స్తంభాలు కూలాయి. వాటిని ఊళ్ళోకి చేర్చాలి. ఊళ్ళో బండ్లన్నీ వచ్చాయి. స్తంభాన్ని ఎత్తడమే కష్టం. ఎత్తి బండిమీదవేస్తే బండ్లు కూలాయి. విరిగాయి. ఎన్నిబండ్లు కూలాయో, ఎన్ని విరిగాయో, కొంతదూరం మోసుకొని పోయిన బండ్లు కూలడమేగాక ఎడ్లు చచ్చాయి. స్తంభాల కిందపడి ఒతికారు కొందరు. అప్పుడు ఆలోచన వచ్చింది తాసిల్దారుకు. చిన్న చక్రాల బండ్లు చేయించాడు. వాటికి స్తంభాలను ఎత్తారు. ఆ బండ్లకు అనేక జతల ఎడ్లను కట్టారు. స్తంభాలు ఊళ్ళోకి చేరాయి. ఇక కోయదొరలు వెళ్ళిపోవచ్చు. కాని వాటిని ఎక్కించి పొమ్మన్నాడు తాసిల్దారు. తాసిల్దారు భవనానికి రెండు స్తంభాలు నిలిచాయి. నల్లని రాతి స్తంభాలు. అద్దంవలె తళతళ మెరిసే స్తంభాలు. ఆ అందం, ఆ చందం ఉబ్బిపోయాడు తాసిల్దారు. ఆనాడు అందరికీ అన్నదానాలు చేయించాడు. తరిద్దామని పాపం! గుడిస్తంభాలు తేవడం తప్పని ఎక్కడో ఒకమూల బాధిస్తూనే వుంది. రాత్రికి రక్తం వాంతి చేసుకున్నాడు. ఒకటి, రెండు, మూడుసార్లు. డీలాపడిపోయాడు. స్తంభాల వల్లనే తనకీ బాధ వచ్చిందనుకొన్నాడు. స్తంభాలు పీకి వేయవలసిందని ఆజ్ఞాపించాడు. ఇండ్లకు ప్రయాణం అవుతున్న కోయలు ఆగిపోయారు. స్తంభాలు కదిలాయి. సాగేయి. తురకవానికి తగినశాస్తి అయిందనుకున్నారు కులశేఖరరావుగారు.

కోయలు విముక్తులయినారు, తమ గూడాలకు బయలుదేరారు. ఆ రాత్రి రఘు సహితంగా అంతా కోయలతోనే గడిపారు. కోయలు వారిని తమ గూడాలకు రావలసిందని ఆహ్వానించారు. బాగా రాత్రి వుండగానే బయలు దేరారు కోయలు. కొంతదూరం వారితో వెళ్ళి తిరిగి వచ్చారు నాగేశ్ మున్నగువారు.

దారిపొడుగునా కోయలు నాగేశ్ చెప్పిందాన్ని గురించీ, రఘు చెప్పిందాన్ని గురించీ చర్చించుకున్నారు. "దౌర్జన్యం" "దోపిడీ" "అధికారం" "పీడితులు" ఇలాంటి పదాలు వారికి వచ్చేశాయి, అర్థంకాసాగేయి.

కోయగూడెం చూచి వారికి ప్రాణాలు లేచివచ్చాయి. అంతా అడవి మీద పడ్డారు. నాటి వేటలో ఏనాడు లేనంత ఆనందం అనుభవించారు, వారు. ఆ రాత్రి అందరూ కోయల గూడెంలోనే ఉండిపోయారు. సంబరాలు, విందులు, ఆటలు, పాటలు.

తెల్లవారి కిందిగూడెం వారితో బయలు దేరాడు సింగన్న.

# 6

**1918లో** ఉర్దూ బోధనా భాషగా ఉస్మానియా విశ్వవిద్యాలయం స్థాపించబడింది. అంతకుముందు నిజాం రాష్ట్రం మొత్తానికి ఒకే ఒక కాలేజీ-నిజాం కాలేజీ ఉండేది. అది మద్రాసు విశ్వవిద్యాలయానికి అనుబంధ కళాశాల.

చదువంటే బెదురు నిజాం నవాబుకు. అందువలన కనీసం గుమస్తాలుగా తయారుచేసే చదువుకు సహితం అవకాశం కలిగించలేదు. అందుకుతోడు బహద్దుర్ యార్ జంగ్ స్థాపించిన ఇత్తెహాదుల్ ముసల్మీన్, రాజ్యం ముసల్మానుల దనే నినాదం లేవదీసింది. అయినా కనీసం రాజ్యంలోని ముసల్మానులకు ఉద్యోగాలు దొరకలేదు. యు.పి., పంజాబు ప్రాంతాలనుంచి వచ్చినవారే ప్రధానమైన ఉద్యోగాల్లో నియమించబడే వారు.

1935 ప్రాంతంలో నైజామ్ సబ్జక్ట్సు లీగ్ అనే ఒక సంస్థను స్థాపించి ముల్కీలు–దేశీయులు–మాత్రమే ప్రభుత్వోద్యోగాల్లో నియమింపబడాలనే ఉద్యమం కొనసాగింది. తత్ఫలితంగా ప్రభుత్వం ముల్కీ నిబంధనలను ఏర్పాటు చేసింది.

ఖాజా అసదుల్లాబేగ్ అన్సారీ పంజాబ్ యూనివర్సిటీలో న్యాయశాస్త్ర పట్టా పొంది ఉద్యోగంకోసం వెతుక్కుంటూ హైదరాబాదు వచ్చాడు. కాని ముల్కీ నిబంధనల వలన అతనికి నిరాశ ఎదురైంది. అతడు ఉద్యోగాన్వేషణలో జాగీర్దారును ఆశ్రయించాడు. నజరానా సమర్పించుకున్నాడు. అతనిని మున్సిఫ్ మేజిస్ట్రేటుగా నెలకు నూరు రూపాయీల జీతంమీద నియమించినట్లు ఉత్తరువు జారీ చేశాడు జాగీర్దారు. న్యాయశాఖను, పరిపాలనా శాఖనుండి విడదీసిన గౌరవం నిజాం నవాబుకే దక్కాలి. అందువలన తాసిల్దారు ఉన్నప్పటికీ జాగీరుకు మేజిస్ట్రేటు అవసరం అయ్యాడు. తన జాగీరులో తాసిల్దారే కాక మేజిస్ట్రేటు కూడా ఉన్నాడనే ఘనత దక్కించుకోవడం జాగీర్దారు ప్రథమ ఉద్దేశం. అంతకుమించి ఏమీలేదు.

మేజిస్ట్రేటును కలుసుకోవలసిందని ప్రోత్సహించారు నాగేశ్ రఘును. అందువలన ప్రయోజనం ఉంటుందని భావించలేదు రఘు. అయినా అంగీకరించాడు. ఇద్దరూ అన్సారీ వద్దకు వెళ్ళారు. అన్సారీ పొడవైనవాడు. కాని పంజాబీలకు ఉండే శరీర సౌష్టవం లే దతనికి. బక్కపల్చగా ఉంటాడు. చెంపలు లొట్టలు. ముక్కు బాగా పొడవు. కొనదేరి ఉంటుంది. కంటికి అద్దాలు వచ్చే వయసు కాకున్నా కళ్ళద్దాలు వచ్చేశాయి. సిగరెట్లు విపరీతంగా కాలుస్తాడు. చాయ్ ఎన్నిసార్లు తాగుతాడో లెక్కలేదు.

నాగేశ్, రఘు చేసిన సలాములు అందుకున్నాడు. వారికి స్వాగతము పలికి, కుర్చీలు చూపించాడు. అవసరం లేదన్నా వినకుండా చాయ్ తెప్పించాడు. పరిచయాదులు, క్షేమసమాచారాలు ముగిసిం తరువాత చర్చ ప్రారంభం అయింది. చర్చ సొంతం ప్రధానంగా ఇంగ్లీషులోనూ, కొంత ఉర్దూలోనూ జరిగింది. చర్చలో పాల్గొన్నవారు రఘు, అన్సారీలే. నాగేశ్ శ్రద్ధగా వింటూ కూర్చున్నాడు.

ప్రపంచ యుద్ధాన్ని గురించీ, 1942 ఉద్యమాన్ని గురించి, కమ్యూనిస్టుల పాత్రను గురించీ, జిన్నా పాకిస్తాన్ వాదాన్ని గురించీ వివరంగా చర్చించుకున్నారు.

మహమ్మదలీ జిన్నాను గట్టిగా ఖండించాడు అన్సారీ. జిన్నా బ్రిటిష్‌వాళ్ళ ఏజంటన్నాడు. ముసల్మానులు తమ సంక్షేమాన్ని తెలుసుకోలేక పోతున్నారన్నాడు. మతం ఆర్థిక సమస్యలను పరిష్కరించ లేదన్నాడు. ముసల్మానులూ భారతీయులేననీ, భారతదేశాన్ని చీల్చడంవలన ప్రమాదమేగాని ప్రయోజనం లేదని చెబుతూ ఇక్బాల్ గేయం "సారే జహాఁసె అచ్ఛా" చదివి వినిపించాడు.

రఘు ఆశ్చర్యపోయాడు. నిజాం రాష్ట్రంలో అదీ జాగీరులో ఇలాంటి వారుండడం ఆతనికి ఆశ్చర్యం కలిగించింది.

తరువాత చర్చ పుస్తకాలమీద సాగింది. ప్రేమ్‌చంద్ 'గోదాన్'ను ఎంతో మెచ్చుకున్నారు అన్సారీ. అతడు భారతదేశపు గోర్కీ అన్నాడు రఘు. కొంతసేపు 'మదర్'ను గురించి చర్చ సాగింది.

చర్చ మంగళ్ళ సమ్మెనుంచి జాగీరులోకి పత్రికలు రానివ్వకుండా ఉండడం మీదికి వచ్చింది. భయం భయంగానే తాసిల్దారును గురించి ప్రస్తావించాడు రఘు.

"వాడు రాక్షసుడు, హిట్లరును మించినవాడు. పేరుకు నేను మేజిస్ట్రేటును గాని ఇంతవరకు పోలీసులు ఒక్కకేసు నా దగ్గర ప్రవేశ పెట్టలేదు. ఈ జాగీరు పరిస్థితి భయంకరంగా ఉంది. నేను ఏమి చేయలేకున్నాను. వాడికి జాగీర్దారు అండవుంది" అన్నాడు అన్సారీ.

"పత్రిక తేవడం, రఘుకు అవమానం జరగడం తమకు తెలుసు ననుకుంటా" ప్రారంభించాడు నాగేశ్.

అన్సారీ సిగరెట్ ముట్టించి గట్టిగా పొగ వదిలి వినడానికి ఉద్యుక్తుడై కుర్చీలో చేరగిలపడి 'విన్నాను' అన్నాడు.

"తరువాత పత్రికలు చందా కట్టాం. అది బ్రిటిషిండియాకు పోవాలి. కాబట్టి ఆమోదించనన్నాడు పోస్టుమాష్టరు. ఖాల్సా ప్రాంతానికి వెళ్ళమని ఆర్డరు చేశాం. అయినా పత్రిక రాలేదు. తదుపరి తెలిసిందేమంటే పత్రిక వస్తున్నదనీ తాసిల్దారు ఆజ్ఞప్రకారం దాన్ని ప్రతిరోజూ తగలపెట్టడం జరుగుతూందనీ, శాసన రీత్యా మాకు పత్రిక చదివేహక్కు ఉండగా ఇలా చేస్తున్నాడు తాసిల్దారు దీనికేమైనా మందుందంటారా ?"

దీర్ఘంగా ఆలోచించాడు అన్సారీ. పత్రిక మీకు అందించవలసిందని పోస్టు మాష్టరుతో చెప్పగలను. అతడు ఎంతవరకు అమలుపరుస్తాడో చెప్పలేను. అయినా చెప్పి చూస్తాను" అన్నాడు.

"పత్రికకోసం ఇన్ని సిఫార్సులూ, ఇంత దేబిరింపూ ఘోరం" ఉద్రేకంగా అన్నాడు రఘు. "నేను బహిరంగంగా పత్రికలు తెచ్చి ఊళ్ళో పంచాలని నిర్ణయించా. ఏం జరుగుతుందో చూస్తా. కాకుంటే నాలుగు దెబ్బలు కొడ్తారు. జైలుకు పంపుతారు. అంతకంటే ఏం చేయగలరు. ఈ ఘోరాన్ని ధిక్కరిస్తాను."

ఇద్దరూ ఆశ్చర్యంగా చూచారు రఘును. రఘు కళ్ళల్లో రక్తం చిమ్మింది. పెదవులు వణికాయి. చెప్పవలసింది అయిపోవడంతో సిగరెట్టు కాల్చాడు.

ముగ్గురూ దేనిగురించో ఆలోచిస్తున్నారు. గది నిశ్శబ్దంగా ఉంది. గడియారం మాత్రం టిక్కు టిక్కు మని సాగుతూనే ఉంది. వారి మనసుల్లో ఏముందో ఊహించడం కష్టం. కాని ఉప్పెన రేగుతూందని వారి గాంభీర్యం చెపుతూంది.

"రఘు చెప్పింది నాకు నచ్చింది. తాసిల్దారేం తల తీస్తాడా" మౌనాన్ని భంగపరిచాడు నాగేశ్.

"మంచిదే. సత్యాగ్రహం ఎప్పుడు సాగేది చెప్పండి. నేనూ స్టేషనుకు వస్తా" అన్నాడు అన్సారీ.

"థాంక్స్. వస్తా" అని లేచి శలవు తీసుకొని వెళ్ళిపోయారు రఘు, నాగేశ్.

వారిని సాగనంపి చూపందినంతదూరం వారినిచూచి లోపలికి వెళ్ళిపోయాడు, మేజిస్ట్రేటు అన్సారీ.

ఆ రాత్రి సమావేశానికి మంగలి రావఁడు, వీరయ్యగారూ వచ్చారు. రఘు ప్రతిపాదనను గురించి తీవ్రంగా చర్చ జరిగింది. వీరయ్యగారు ముందు కాస్త జంకారు. కాని నాగేశ్ వాగ్దాటే కాక జానకి పట్టుదల వారిని లొంగదీసింది.

"ఉన్న భూములన్నీ అమ్మిపెడ్త ఎట్ల గిరఫ్తార్ (అరెస్టు) చేస్తరో చూస్త హైకోర్టుదాకా పురస్త" అన్నారు వీరయ్యగారు.

ఆయన ధ్వనిలో పట్టుదల విని అంతా ఆశ్చర్యపోయారు.

"నీ బాంచను గట్లమరి మీరు నిలబడుండి మల్లసూదిరి? మోఁడాలద్దమేస్తం సాగుతాంటె సాగిస్తాను, వీండ్ల అమ్మల....కాల్మొక్త నాకు సుత చదువు నేర్పరి. పత్రిక చదువుత. వొదిల పత్రిక పెట్కపోయి, తాసిల్దారు ముంగల్నె చదువుత కాల్మొక్త" అన్నాడు రావఁడు.

"చెప్పిందంత బాగానే చెప్పినవుగని ఆ బాంచను కాల్మొక్త మరువవులే. చదువు నేను చెప్త. ఇయ్యాల్టినుంచే మొదలుపెట్టు. ఈడ చదువుకొని మల్ల మీ వోండ్లకు చెప్పాలె" అన్నది జానకి.

"చదువు రానోండ్లకు పత్రికేం పనికొస్తది? హరిజనవాడలో బడి పెట్టాలె" నాగేశ్ ప్రతిపాదన.

"పలకలు, పుస్తకాలు నేనిస్తా" వీరయ్యగారి ఔదార్యం.

"చదువు నేను చెప్పుత" రఘు స్థిర సంకల్పం.

"ఆతదాన్ని నన్నేం చెయ్యమంటరు?" జానకి నిరాశ.

"ఆదిశక్తివి ఊరికెందు కుంటవు? ఆడవాళ్ళకు పత్రిక చదివి చెప్పు" బావ గారి హాస్యం.

పత్రిక తెచ్చేరోజు నిర్ణయించబడింది. మెల్ల మెల్లగా ఊరంతా పత్రిక తేవడాన్ని ప్రచారం చేయాలని తీర్మానించబడింది.

జానకి చాలా రాత్రిదాకా నిద్రపోలేదు. క్రమంగా నాగేశ్ ఉద్రేకం మీద ఆమెకు మోజు తగ్గసాగింది. నాగేశ్ ఆమె మనసులోంచి క్రమం క్రమంగా మాయం కాసాగేడు. పూచికిపుల్లలాంటి మంట నాగేశ్‌ది. అమాంతంగా వెలుగుతుంది, ఇట్టే ఆరిపోతుంది. ఎంత ఆవేశపడ్తాడతను ? ఇతరులను ఎంతలో ఆవేశంలో ముంచు తాడు? తానేమయ్యేదీ ఎదుటి వాడు ఏమయ్యేది గమనించడు. అతని ఆవేశాన్ని అరికట్టలేకపోతే ఎన్ని ఘోరాలు చేసేవాడో. అసలు అతను ఎక్కడ ఉండేవాడో?

బావ తనబావ ఎంత గంభీరంగా ఉంటాడు! అతన్ని పిరికివాడనుకుంది తాను. పిచ్చిది? ఎంత చక్కగా వాదిస్తాడు! ఎంతటి వాణ్ణయినా ఓడించగలడు. ఎంత ప్రతిభ ఉంది తన బావలో ? మనిషి అంటే ఎంత మమత ఉంది, అతనిలో! మనసున్నవాడు! మంచివాడు! కాని తానిస్తారు? వాడు రాక్షసుడు దేగవంటివాడు- మంచితనం వానిముందు సాగుతుందా? బావ' తనబావ పత్రికలు తెస్తాడు వీరుడుగా తెస్తాడు. నిజమే ఒక్క పత్రిక పొరపాటున తెచ్చినందుకే కొట్టాడే అమీను! ఎన్ని దెబ్బలు కొడ్తారో తన బావను. ఛీ ఏమిటి అంత ఉద్రేకంగా మాట్టాడింది. తాను ఆడది కాదూ!

ఆమెలో స్త్రీత్వం పొంగింది. ప్రేమ పెల్లుబికింది. ఆ వెల్లువకు పట్టుదల అడుగంటింది. గుండె నిండింది. ఎందుకో తన బావ తనకు దక్కడంలేదనిపించింది. దుఃఖం గుండెలో నిండింది. ఏడుపే వచ్చేసింది. ఏడ్చింది తలగడ తడిసింది. కన్నీటితోనే లేచింది. బావ గదికి పోయింది. రఘు నిద్రపోతున్నాడు! అతనికి ఈ బాధలు లేవా? పసిపిల్లవానిలా నిద్రపోతున్నాడే! మంచంమీద కూర్చుంది. మెల్లగా 'బావా' అని పిలిచింది.

రఘు లేచాడు జానకిని చూచాడు. ఆమె శోకమూర్తిలా ఉంది "జానకీ! ఏడుస్తున్నావా ? ఏమైంది?" అని ఉలిక్కిపడి లేచి కూర్చున్నాడు.

"బావా పత్రికలు తేవద్దు" అవి మాటలు కావు దుఃఖపు మూటలు!

"పిచ్చిపిల్లా" ఓదార్చసాగాడు రఘు. భుజంమీద తలవాల్చి వింటూంది జానకి. "ఇంత పిరికి అయితే ఎట్లా?" వెంట్రుకలు సవరిస్తూ చెపుతున్నాడు. ఆ స్పర్శలో ఏదో ఆనందం ఉంది. ఆ మాటలో సుఖం ఉంది. ఆ మాటలు వెచ్చ వెచ్చగా ఉన్నాయి. "నువ్వు కస్తూర్బా, సరోజనీ నాయుడు, విజయలక్ష్మి, అరుణ, వీరివలే తయారు కావాలె. కాని ఇట్ల ఏడ్చుకుంట కూర్చుంటారు? భయాన్ని కాస్త దూరం పంపించు. ఏమీ ఉండదు."

"జానకీ! కుటుంబం మేలుకోసం స్వంత క్షేమాన్ని వదులుకోవాలి. గ్రామం కోసం కుటుంబ క్షేమాన్ని, రాష్ట్ర శ్రేయస్సు కోసం గ్రామ శ్రేయస్సునూ, దేశ శ్రేయస్సుకోసం రాష్ట్ర శ్రేయస్సునూ వదులుకోవాలి. మానవత శ్రేయస్సు కోసం దేశాన్ని సహితం వదులుకోవచ్చు. నువ్వు నన్ను వదులుకోవాలె తప్పదు."

చివరి వాక్యం కఠినంగా ఉంది. కాని ఏదో పట్టుదల ఉంది. కొద్దిగా పుంజుకుంటున్న జానకి ధైర్యంలో మళ్ళీ గండిపడింది.

"జానకీ! నా ఒక్కనికి రాబోయే దుఃఖాన్ని గురించి దుఃఖిస్తున్నావు" ముఖాన్ని తన రెండు చేతులలోనూ తన ముఖానికి ఎదురుగా తెచ్చి చెప్పుతున్నాడు. "ఎందుకు నన్ను ప్రేమిస్తున్నవనే గద" జానకి బుగ్గలు జేవురించాయి. కనులలో సిగ్గుల దొంతరలు దొర్లాయి. "ఒక్కని ప్రేమలోనే ఇంత దుఃఖం, ఇంత ఆనందం ఉన్నదికద! దేశాన్నంత ప్రేమించు. ఎంత ఆనందం కలుగుతున్నదో చూడు" కళ్ళు పెద్దవిచేసి చూసింది జానకి. ''అంత ఆనందానికి ఈ కొద్ది త్యాగం గొప్పా ? ఏమంటావు."

జానకి ఏమీ అనలేదు. అతని వక్షంలో తలదాచుకుంది.

"పత్రిక వస్తూంది" ఈ వార్త మెల్లమెల్లగా ఇంటింటికీ పాకింది. ఏదో భయంకరమైన వస్తువు వస్తున్నట్లు బెదిరిపోయారు కొందరు. ఏదో వెలుగు వస్తూందనీ ఊళ్ళోకి ఉషస్సు ప్రవేశిస్తుందనీ ఆనందించారు కొందరు.

ఈ వార్త తాసిల్దారు చెవిన పడింది. కోపం వచ్చి ఉగ్రుడు కావలసిన వాని గుండెలో గుబులు చేరింది. గుండె గుబ గుబలాడింది. అది అతని జీవితంలో మొదటిసారి. ఆ భయంలో అతనికి ఏమీ అర్థం కాలేదు. ఏం చేయాలో తోచలేదు. అసలు పత్రిక ఏమిటో అతనికి తెలియదు. అదేదో పాములాంటి దనిపించిందతనికి. అది పడగవిప్పి తన ఇంట్లోకి దూరుతున్నట్లనిపించింది. ఏం చేయాలి? ఎందుకిలా తాను నీరసించి పోతున్నాడు? తలగోక్కున్నాడు. ఎంతో ఆలోచించాడు. ఏమీ తోచ లేదు, గిర్దావరునూ, అమీన్ను పిలిపించాడు.

"బొక్క లిరగ్గొట్టి కొట్ల ఏస్తే సరిప్పోతది.'' అమీను తన కసినంతా వెళ్ళగక్కాడు.

గిర్దావరు వైపు చూచాడు తాసిల్దారు. అతడు మాట్లాడలేదు. మౌనంగా ఉన్నాడు. తాసిల్దారుకు చిర్రుమన్నది. "ఏమో బెల్లంకొట్టిన రాయోలె నిలపడ్డవు? ఉలకవు, పలకవు'' అని అరచాడు.

"ఏం చెప్పను సర్కార్, ఎనక్కుపోతే నుయ్యి ముందు పోతే గొయ్యి అన్నట్లున్నది."

''ఏందో ముసుగుల మాట్లాడ్తవు. సాప్‌సీదగ చెప్పు. అసల్ కైఫియత్ ఏందో.''

''మున్సఫ్ సాబ్ మద్దతున్నదట! మనం ఏమనే టట్లున్నది!"

ఆ మాట విని తాసిల్దారు భయం మరికొంత పెరిగింది, "అయితే ఏం చేద్దామంటవు?"

"మాఫ్‌కర్నా సర్కార్ నాకేం తోస్తలేదు".

ఆసలు అంతమొందించేద్దామన్నాడు అమీను. రాత్రికి రాత్రి సఫాచేసి శవాన్ని కూడా తప్పిస్తానన్నాడు. ఊళ్ళో సాక్ష్యం రావడానికి ఎవనికి గుండె లున్నాయి? మున్సిఫ్ ఏం చేస్తాడో చూద్దాం.

అది తాసిల్దారుకు అంతగా నచ్చలేదు. భూకామందు అల్లుణ్ణి చంపుతే ఖూనీకేసు అవుతుంది. ఖాల్సా పోలీసు దిగుతే తన అధికారం అంతం అవుతుంది.

"సాబ్ సంగపోండ్ల బలమున్నదట. సర్కార్ భీ సంగపోండ్లకు మద్దత్ చేస్తున్నదట" అని గిర్దావర్ విజ్ఞత.

తాసిల్దారు మరికొంత హడలిపోయాడు. అసలు పత్రికంటే ఏమిటి, అందులో ఏముంటుంది? అని అడిగాడు తాసిల్దారు. తమకు తెలియదంటే తమకు తెలియ దన్నారు ఇద్దరూ.

తెల్లవారి పత్రిక తెప్పించుకొని చదివించుకున్నాడు. అతనికేమీ అర్థం కాలేదు, కాని యెక్కడో జరిగే యుద్ధాన్ని గురించిన విషయాలున్నట్లు అనిపించింది. అది చదువుతే ప్రమాదమేమి? అని తనలో తానే ప్రశ్నించుకున్నాడు.

"శివుణ్ణి పంపమంటారా ? ఏక్ హూర్ మెం సఫా" అడిగాడు అమీను.

ఏదో ఆలోచిస్తున్నట్లు నటించాడు తాసిల్దారు. "దేఖేంగే" అని జవాబు చెప్పాడు.

అమీనుకు తాసిల్దారు మీదనే కోపం వచ్చింది. కాని దిగమింగాడు. సలామ్ చేసి గిర్దావర్, తానూ వెళ్ళిపోయారు.

శుభదినమూ, అశుభదినమూ రానేవచ్చాయి. ఊరంతా కుత కుత ఉడికి పోయింది. ఏ దుకాణంలో విన్నా, ఏ హోటల్లో విన్నా. ఏ చౌరాస్తాలో విన్నా, ఏ ఇంట్లో విన్నా ఒకటే వార్త "పత్రిక వస్తూంది." ఊళ్ళోకి ఏదో వింత వస్తువు ప్రవేశిస్తున్నట్లు, దాన్ని చూడాలన్నట్లు గ్రామం యావత్తూ స్టేషనుకు చేరింది- తాసిల్దారు తప్ప రాబోయే పత్రికను గురించీ, తెచ్చే వ్యక్తిని గురించి అనేక రకాల వ్యాఖ్యానాలు జరుగుతున్నాయి. కొందరు వీరయ్యగారి చుట్టూ చేరి ప్రశ్నల వర్షం కురిపిస్తున్నారు. జానకి ఒంటరిగా ఒక పక్కకు కూర్చుంది. ఆమె చేతిలో పూలదండలున్నాయి. ఆడపిల్ల అలా రావడం బాగనిపించలేదు చాలామందికి. పూలదండ వేస్తుందేమో ఇంతమందిలో! కాలం మారిపోయింది. ఘోరకలి వచ్చింది అని పెదవి విరచారు కొందరు—కాదు చాలామంది.

మున్సిఫ్ స్టేషనుకు వచ్చాడు. అతణ్ణి చూచి అమీను లోలోపల మండుతూనే సలామ్ కొట్టాడు. ప్రతినమస్కారంచేసి సాగిపోయాడు. నాగేశ్ కనిపించి నమస్క రించాడు. చిరునవ్వు నవ్వి సాగిపోయాడు. వెయిటింగ్ రూంలో కూర్చున్నాడు.

మున్సిఫ్ రావడాన్ని గురించీ అనేక గుసగుసలు లేచాయి. కొందరు పెద్ద మనుషులు వెయిటింగ్ రూంలోకి వెళ్ళారు. అతనితో పిచ్చాపాటీ మాట్లాడుతూ మధ్య

మధ్య పత్రికను గురించి ముచ్చటించారు. అతనూ ఏవేవో సమాధానాలు చెప్పాడు. పత్రిక చదవటం మహాపాపం కాదని వెల్లడించాడు.

సెకెండ్ బెల్లుకొట్టారు. పోలీసులంతా అటెన్షన్‌లో నుంచున్నారు. అమీను వారికి ఏవేవో సంజ్ఞలు చేస్తున్నట్లు అందరికీ కనిపించేట్లు నటించాడు.

అంతా ఊపిరి బిగపట్టుకొని ప్లాటుఫారంమీద నుంచున్నారు. జనం కిట కిటలాడిపోతున్నారు. ఏదో అవతారం కోసం ఎదురు చూస్తున్నట్లు ప్లాటుఫారం సాంతం మౌనంగా వుంది. ఉచ్ఛ్వాస నిశ్వాసలు సైతం బిగపట్టి రైలు రాకకు ఎదురుచూస్తున్నారు.

రైలు పెద్దగా విజిల్ యిచ్చి ఝుక్ ఝుక్ మంటూ సాగిపోయి కిర్రుమని మొత్తుకుంటూ ఆగిపోయింది. వేలకండ్లు ఒకే వ్యక్తికోసం వెదికాయి. రఘు పత్రికతో కనిపించాడు. జనం యావత్తూ ఆ పెట్టెదగ్గరికే చేరింది. కష్టంగా జనాన్ని నెట్టి తోవ కల్పించారు వీరయ్యగారు జానకికోసం. జానకి గుండె గంతులు వేస్తూంది. సుమారు పరిగెత్తింది. రఘు మెడలో దండ వేసింది.

"రఘుగారికి" ఎవరన్నరో తెలియదు కాని "జై" అనే నినాదంతో దిక్కులు పిక్కటిల్లాయి.

రఘు ఆనందంలో ఉక్కిరి బిక్కిరి అయినాడు. అవును, అతడు విజయం సాధించాడు! నిన్నటివరకూ కుక్కిన పేనువతే పడి ఉన్న జనం నేడు గొంతులు చించుకొని నినాదాలు చేస్తున్నారు! ఎక్కడ చూచినా ఆవేశం జనం రూపంలో ఆవిర్భవించింది.

వీరయ్యగారు అల్లునికి పూలదండ వేశారు.

"రఘుగారికి" ఈతడవ జానకి కేక.

"జై" అనే నినాదం మరింత ఆవేశంతో వెలువడింది.

అమీను గుండెలో తుపాకులు పేలాయి. నుంచున్న పోలీసులకు చెమటలు పట్టాయి.

రైలు కేక వేసింది.

అదిరిపడ్డాడు అమీను. రైలు సాగిపోయింది. తనమీదినుంచే పోతున్నట్లు అనిపించింది అతనికి. యంత్రవత్తుగా నుంచున్నాడతను. ప్రతిమలా నిలిచాడు. ఏం చెయ్యాలో అతనికి తోచలేదు. వణుకు పుట్టింది.

మున్సిఫ్ మేజిస్ట్రేట్ రఘును కలుసుకున్నాడు. కరచాలనంచేసి కంగ్రాచ్యు లేషన్స్ చెప్పాడు.

ముందు రఘు వెనుక జనం సాగారు. స్టేషను మాస్టరుకు పేపరు ఇచ్చి చిరునవ్వు నవ్వాడు రఘు. స్టేషను మాస్టరు ఆదరంగా పేపరు అందుకున్నాడు. అభినందనలు తెలిపాడు.

రఘు స్టేషను దాటాడు. అమీను కనిపించాడు. అతనికి పేపరు అందించాడు. అమీను బిత్తర బిత్తరగా చూచాడు. ఏం చేయాలో తోచలేదు. పేపరు అందుకున్నాడు. మున్సిఫ్ కనిపించడంతో ఠక్‌మని సలాం కొట్టాడు.

జనం అర్థంచేసుకున్నది వేరు.

"జై" అన్నారు.

అమీను గుండెల్లో రైళ్ళు పరిగెత్తాయి.

రఘు ముందుకు సాగాడు.

కరోడ్గిరీ జవాను కనిపించాడు.

"సలామ్‌సాబ్" అన్నాడు.

రఘు పేపరు అందించాడు.

పేపరు అందుకుంటూ మళ్ళీ సలామ్‌చేసి "జర మా సంగతి యాది మరువకుండి" అన్నాడు.

మున్సిఫ్ రఘువద్ద శలవు తీసుకొని వెళ్ళిపోయాడు.

వీరయ్యగారి ఇంటినిండా జనం కూడారు. ఏవేవో ప్రశ్నలడుగుతున్నారు. అన్నిటికీ ఓపిగ్గా సమాధానాలు చెపుతున్నారు రఘు, నాగేశ్‌లు. వీరయ్యగారి ఆనందానికి అంతులేదు. జానకి బిందెలకొద్దీ చాయ్ తయారుచేసి అందరికీ అందిస్తూంది.

ప్రతి దుకాణంలో, ప్రతి హోటల్లో, ప్రతి చదువు వచ్చిన వారి ఇంట్లో పేపరు వెలిసింది. పత్రికలోని విషయాలు వారికి ఏమీ అర్థంకాలేదు. కాని ఏ ఇద్దరు కలిసినా ఆనాటి చర్చ పత్రికను గురించీ, దానిని తెచ్చిన రఘును గురించే.

రఘు విషయంలో జనానికి ఒకవిధమైన ఆదరం ఏర్పడుతూంది. ఆత్మీయత ఏర్పడింది. రఘు బజారుకు వచ్చినా, హోటల్లో కూర్చున్నా, చౌక్‌లో కనిపించినా జనం చుట్టూచేరి ఏదో ఒకటి అడుగుతుండేవారు. అందరికీ ఓపిగ్గా సమాధానం చెప్పేవాడతను. అందరినీ సమాధానపరిచేవాడు.

ప్రతిరోజూ నాగేశ్ పత్రిక తెచ్చి అందరికీ అందజేస్తున్నాడు. కొన్ని రోజులు ఉచితంగానే ఇచ్చాడు. తరవాత చాలమంది చందాదారులుగా చేరారు. అప్పుడప్పుడూ పుస్తకాలు తెచ్చి ఇస్తుండేవాడు. క్రమక్రమంగా చదవటం అలవాటైంది జనానికి. పుస్తకాలుకూడా కొనసాగారు.

తాసిల్దారు కూడ పత్రిక తెప్పించుకొని చదివించుకోసాగాడు. ఏవేవో కొత్త విషయాలు తెలుస్తున్న ట్లనిపిస్తూంది.

రావుడు పొదిలో పత్రిక పెట్టుకొని తాసిల్దారు దగ్గరికి వెళ్తున్నాడు.

ఊళ్ళో గ్రంథాలయం స్థాపించాలని సంకల్పించాడు రఘు. ఆ విషయంలో అనేక మందితో చర్చలు సాగిస్తున్నారు రఘు, నాగేశ్‌లు. గ్రంథాలయ స్థాపనను గురించిన వాతావరణం కల్పించసాగారు.

భూతం అని భయపడిన పత్రిక గ్రామానికి భువన మోహినిగా మారింది..

*    *    *

తాసిల్దారు ఏకైక పుత్రుడు రషీద్. మంచి అందగాడు. స్ఫురద్రూపి. కోల ముఖం. కొనదేరిన ముక్కు, ఏపిల్ పండురంగు, అచ్చం ఇరానీ రూపం. అతని తల్లి మంచి అందగత్తె. ఇరాన్ నుంచి బ్రతకడానికి వచ్చిన వాని కూతురు. అతనికి ఉద్యోగపు ఆశ చూపి, ఆ పిల్లను కట్టుకున్నాడు తాసిల్దార్. తరవాత ఉద్యోగం అడుగుతే మామగారికి విషం పెట్టి చంపాడు తాసిల్దార్ అని గిట్టనివాళ్ళు చెప్పుకుంటారు. ఆమె అందాన్ని అనేక రకాలుగా వర్ణిస్తారు జనం. కాని చూచినవారు ఎవరూ లేరు. తల్లి అందాన్ని పుణికి పుచ్చుకున్నాడు రషీద్. కాని గుణాలు తండ్రివి వచ్చాయి.

రషీదును బాగా చదివించా లనుకున్నాడు తండ్రి. హైదరాబాదులో ఉంచాడు చదువుకు. అతనికి చదువు అంటలేదు. దురభ్యాసాలు చాలా వచ్చాయి. తాగుడుకు అంతులేదు. సారాయి మంచినీళ్ళ ప్రాయం. వ్యభిచారంలో దక్షత సంపాదించాడు. గోడలు దూకి హైదరాబాదులో తన్నులు తిండే ఇంటికి తెచ్చుకున్నాడు కొడుకును తండ్రి. కాని ఇంట్లో కూడా అతన్ని పట్టలేకపోయాడు. తండ్రిని తలతన్నాడు. తండ్రి 'నికా' కట్టుకున్న దాన్నే తగులుకున్నాడు. రాత్రింబవళ్ళు తాగడం, అమ్మాయిలతో చదరంగం, పచ్చీసు ఆడడం అతని జీవితం. అతని కంటపడ్డ అందకత్తె ఆ రాత్రి అతనిది కావల్సిందే. ఒకసారి తాసిల్దార్ గట్టిగా మందలించాడు. కొడుకు తుపాకీ తండ్రి రొమ్మున పెట్టి కాలుస్తా నన్నాడు. ఆనాటినుంచీ తండ్రి అతణ్ణి గురించి పట్టించుకోవడం మానేశాడు. పూర్వం అవుతే బజారుకు వెళ్ళాడంటే ఊరు చాటించేవారు. ఆడవాళ్ళు ఎక్కడివాళ్ళు అక్కడ నక్కేవారు. ఈ మధ్య ఆ ఆచారం అడుగంటింది. రషీద్‌కూడా ఎక్కువగా బజారుకు వెళ్ళడంలేదు.

అమాంతంగా బజారు బైల్దేరా లనిపించింది రషీద్‌కు. అతణ్ణి అడ్డేవారెవరు? బయలుదేరాడు. ఎర్రని కండ్లు, పొడువైన గిరజాలు, వదులు పైజమా, భుజాలమీద అల్లికపు పనిచేసిన లాల్చీలో బయలుదేరాడు. వెంట అతని ఆంతరంగిక బృందం బయలుదేరింది. ఒకడు హుక్కా పట్టుకొని సాగాడు. ఒకడు పాన్‌దాన్‌తో నడచాడు. ఒకడు మధుపాత్ర చషకంతో వెంబడించాడు. అతడు ఏది కావాలంటే అది అందించాలి పరిచారకులు. అతడు ఒకసారి హుక్కా పీలుస్తాడు. ఒకసారి పాన్ తింటాడు. నడుస్తూనే సారాయి తాగుతాడు.

రషీద్ బృందం సాగుతూంది. ఆ విషయం తెలియని వెంకయ్య కూతురు గుడికి వెళ్తూంది. ఆమె తలమీంచి స్నానం చేసింది. జుట్టు వదులుగా ముడివేసుకుంది. చేతుల్లో ప్రమిదలు, పలహారం ఉన్న పళ్ళెం పట్టుకుంది. సాగిపోతూంది. ఏ ధ్యాసమీద ఉందో తెలియదు. ఎదుటి వాణ్ణి సహితం గమనించలేదు!

రషీద్ ఆమెను చూచాడు. చేయిపట్టుకొని లాగాడు. పళ్ళెం ధన్‌మని కింద పడిపోయింది. పైకి చూసింది. రషీద్! ముచ్చెమటలు పోశాయి. గడగడ వడకింది. గట్టిగా కేక పెట్టాలనుకుంది. కాని ధ్వని పెకల్లేదు. తుదకు సర్వశక్తులూ కూడ దీసుకొని కేక పెట్టింది.

గ్రంథాలయానికి చందాలు వసూలు చేయడానికి తిరుగుతున్న నాగేశ్ కేక విన్నాడు. పరిగెత్తాడు. చూచాడు. అతని రక్తంలో మంటలు లేచాయి. దోవన వెళ్ళే వాని చేతి కర్ర లాక్కున్నాడు. కర్ర ఎత్తి లాగి రషీద్ చేతిమీద వేశాడు. రషీద్ రుక్మిణి చేయివదలడం ఆమె ఒక్కసారి నాగేశ్‌ను తన చూపులతో కొలవడం, పరిగెత్తడం అన్నీ రెప్పపాటులో జరిగాయి. రషీద్ ముందు దెబ్బతగిలిన చేతినీ, తదుపరి నాగేశ్‌నూ చూచాడు. రక్తం కక్కుతున్నాయి నాగేశ్ కళ్ళు. వణికిపోతు న్నాడు ఊపిరి వేగంగా పీలుస్తున్నాడు. చేతిలో దుడ్డుకర్ర ఉంది. వెనక్కి చూచాడు. పరిచారకులు హుక్కా, పాన్‌దాన్ వగైరా పారేసి పరుగు లంకించుకున్నారు. రషీద్ నాగేశ్‌ను చూచాడు — చేతిలో కర్ర చూచాడు. "అమ్మో కర్ర!" ఒక చిరునవ్వు నవ్వాడు. వెనక్కి తిరిగి సాగిపోయాడు. కర్ర అక్కడే పారేసి నాగేశ్ తన పనిమీద సాగిపోయాడు.

రుక్మిణి రొప్పుతూ ఇల్లు చేరింది భోరున ఏడ్చేసింది. ఇంట్లో తండ్రిలేడు. తల్లి కలవరపాటుతో పరిగెత్తుకొని వచ్చింది. తల్లిని చూచింది రుక్మిణి. ఏడ్పు పొంగింది. తల్లిమీద పడి పెద్దగా ఏడ్చేసింది. తల్లికి ఏమీ అర్థం కాలేదు. కొంత ఊరడిల్లి కథ సాంతం చెప్పింది. కూతురు మానం కాపాడిన వాడెవడు? తన సంసారాన్ని రక్షించిన దేవుడెవడు? ఈ లంకలో రాముడెవడు? రషీద్‌ను ఎదిరించి నిలిచిన ధీరుడెవడు? అతని పాదాలంటి పూజించాలని, అతనిని ఆదరించాలని, గౌరవించాలని, రుణం తీర్చుకోవాలని తహతహ లాడింది తల్లి. కాని అతని రూపాన్ని తప్ప ఊరుగాని, పేరుగాని తెలియపరచలేక పోయింది కూతురు. లిప్తలో నాగేశ్ రూపాన్ని ఎదలో నింపుకుంది రుక్మిణి. ఎన్నో రకాల వర్ణించి చెప్పింది. మళ్ళీ అతణ్ణి చూడాలని తహతహ లాడింది.

వెంకయ్య వచ్చి జరిగింది తెలుసుకున్నాడు. కూలుతున్న కొంపను నిలిపాడు రామలింగేశ్వరుడు అనుకున్నాడు. తైలాభిషేకం చేయిస్తా ననుకున్నాడు. చేయిం చాడు కూడా.

గ్రామంలో గ్రంథాలయం స్థాపించాలనే ప్రతిపాదన రఘు నుంచి వచ్చింది. వీరయ్యగారు దానికి అవసరం ఐన డబ్బంతా ఇస్తామన్నారు. కాని రఘు ఒప్పుకో లేదు. ప్రజలనుండి డబ్బు వసూలు చేస్తేనేగాని వారికి ఆసక్తి ఉండదని అతని వాదన. అంతేకాక ఈ పేరుతో ప్రజలతో సంబంధం ఏర్పరచుకోవచ్చు నన్నాడు. అతని వాదనలు ఎవరూ కాదనలేదు. గత కొలది రోజులుగా చందాలు పోగు చేస్తున్నారు. ముందు విముఖత చూపినా ప్రజలు ఇప్పుడు ముందుకు వస్తూనేఉన్నారు.

ఆరోజు జానకి, రఘు, నాగేశ్ బయలుదేరారు చందాలకు. వెళ్ళిన చోటనల్లా వారికి ప్రోత్సాహం లభిస్తూనే ఉంది. కొందరు సంశయాలు వ్యక్తపరుస్తున్నారు. వాటిని దూరం చేయడంలో ఆనందం కలుగుతూంది వారికి. వచ్చిన పెద్ద మార్గం మంచే సంశయాలే కాని భయం ఎవరూ వ్యక్త పరచలేదు. అందరూ దాన్ని ఒక సత్కార్యంగానే స్వీకరిస్తున్నారు.

ముగ్గురూ వెంకయ్య ఇంటికి వెళ్ళారు జానకి ఇంట్లోకి వెళ్ళిపోయింది. ఆడవాళ్ళకు నచ్చచెప్పడం ఆమె వంతు. ఇక్కడ ఆమెకు ఎక్కువ కష్టం కలుగలేదు. రుక్మిణిని రక్షించినవాడు నాగేశ్ అని చెప్పింది. అంతే. ఆ మాటలు తల్లీ కూతుళ్ళ మీద ఎంతో ప్రభావాన్ని వేశాయి. రుక్మిణి పరిగెత్తింది. తలుపు చాటున ఉండి నాగేశ్‌ను చూసింది. ఆమె హృదయం గగుర్పొడిచింది. అతడే తనను రక్షించినవాడు! ధీరుడు! రాముడు! అలా అతణ్ణి చూస్తూ ఉండడంలో ఏదో ఆనందం కలిగింది. ఆమెకు అదేదో కొత్త అనుభూతి!

తనను చూస్తూన్న రుక్మిణిని చూశాడు నాగేశ్. ఆ చూపులు అతని ఎదను గుచ్చుకున్నాయి. ఏదో పూలజల్లు కురిసినట్లయింది. ఒళ్ళు జలదరించింది.

అతడు ఆమెను చూచాడు.

చూపులు కలిశాయి.

ఆమె చూపులు వాలేయి. సిగ్గు ముంచుకొని వచ్చింది. చెంపలు జేవురించాయి. అక్కణ్ణుంచి పరిగెత్తింది. తల్లితో చెప్పింది. "ఆయనే" అని. ఆ మాటలోని సిగ్గును, అనుభూతిని గమనించలేదు తల్లి. ఆమెకు తెలిసిందల్లా అతడే ఇతడు. తలుపు చాటునచేరి భర్తను పిలిచింది. ఏమేమో చెప్పింది. ఎంత అడిగితే అంత యివ్వమంది.

వెంకయ్య బయటికి వచ్చాడు. నాగేశ్‌ను ఒకసారి నఖశిఖ పర్యంతం చూచాడు. చాయ్ తాగిపొమ్మన్నాడు. వారడిగినదానికి రెండింతలు యిచ్చాడు. ఇంకా సాధ్యమైనంత సహాయం చేస్తానన్నాడు. "చూడండి జర తాసిల్దారుకు ఎరిక కానియ్యకుండి. పొద్దున లేస్తే వాళ్ళతోనే పని బత్తది" అన్నాడు.

నాగేశ్, రఘు ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. ఇంతలో గాజుల చప్పుడైంది. రుక్మిణి చాయ్ తెచ్చి తలుపు చాటున నుంచుంది. నాగేశ్ ఆ అవకాశాన్ని వదులుకోలేదు. తలుపునే చూడసాగాడు, వెంకయ్య చాయ్ తెచ్చి అందించాడు. నాగేశ్‌కు చాయ్ చాల రుచిగా అనిపించింది. అవును అమృతం చేతిలో ఉంటుంది. రుచికి మనసుతో సంబంధం.

వెంకయ్య దగ్గర సెలవు తీసుకొని బయలుదేరా తీద్దరు. జానకి వచ్చి వారిని కలుసుకుంది. ఆమె నాగేశ్‌ను ఉడికించింది. రుక్మిణి అన్నవీ అననివీ చిలవలు పలవలుచేసి చెప్పింది. నాగేశ్ అదోలా అయిపోయాడు. ఏదో కొత్తప్రాణం వచ్చినట్లయింది.

ఏదో ఒక పని కల్పించుకొని నాగేశ్ వెంకయ్య ఇంటికి తరచూ వెళ్తున్నాడు. అప్పుడప్పుడు రుక్మిణి కనిపిస్తూనే ఉంది. చూపుల మాటలతో సంతృప్తి కలగడంలే దతనికి. అవకాశం చిక్కించుకొని మాట్లాడాలని అతని ఉబలాటం. ఆ మాటల్లో ఏదో అమృతం ఒలుకుతుందని అతని అభిప్రాయం. కాని అతనికి అనేక పనులు. ఒక్క గ్రంథాలయమేనా అతనికి ? రాత్రి పాఠశాలలు, పత్రికలు చదివి వినిపించ డాలు, పైగా సింగన్నతో సంబంధం, ఒకటి రెండుసార్లు కోయగూడెం కూడా వెళ్ళివచ్చాడు.

గ్రంథాలయానికి చందాలు బాగానే వసూలైనాయి. పెద్దబజారులో ఇల్లుకూడా అద్దెకు తీసుకున్నారు. హైదరాబాదునుంచీ, బెజవాడనుంచీ పుస్తకాలు కూడా వచ్చాయి. కాని నైజాంలో గ్రంథాలయం అంటే వట్టి చదువుకునే చోటుమాత్రం కాదు. అది రాజకీయ కేంద్రం. అక్కణ్ణుంచే ఉద్యమాలన్నీ పుట్టాయి. గ్రంథాలయం అంటే బెదురు నైజాం నవాబుకు. అందుకే కఠినమైన శాసనాలు చేశాడు. కొన్ని గ్రంథాలయాలను జప్తుచేసి సీళ్ళు వేయడం, కార్యకర్తలను నానాయాతనలు పెట్టడం అనేకచోట్ల జరిగాయి.

అయినా గ్రంథాలయం స్థాపించదలచాడు రఘు. ప్రారంభోత్సవం ఘనంగా చేయాలనీ ఒక బహిరంగ సభ ఏర్పాటు చేయాలనీ సంకల్పించాడు. నైజాంలో వాక్సభా స్వాతంత్ర్యాలు మృగ్యం. ప్రజల నోళ్ళు కొట్టివేయడానికి గస్తీ నిషాన్ 53 వెలువడింది. ఆ గస్తీ (సర్క్యులర్) ప్రకారం సభ జరుపుకోవాలంటే అవ్వల్ తాలూక్దారు (కలెక్టరు) నుండి అనుమతి తీసుకోవాలి. ఇందు విషయంలో కలెక్టరు పోలీసుశాఖ సలహాలను తప్పనిసరిగా పాటించాలి. అందును గురించి అనేక నియమాలు. బయటవారు సభలో పాల్గొనరాదు. రాజకీయములైన ఉపన్యాసాలు చేయరాదు. ఉపన్యాసం రాజకీయమైనది ఔనా, కాదా అనే విషయంలో తుదినిర్ణయం ప్రభుత్వపుది. రాజకీయమైన ఉపన్యాసానికి ఒక నెల జెయిలు శిక్ష. 200 రూపా యీల జరిమానా విధించబడుతుంది.

నల్లగొండలో ఒక గ్రంథాలయ వార్షికోత్సవానికి అనుమతి యివ్వవలసిందని తాలూక్దారుకు దరఖాస్తు పెట్టుకున్నారు నిర్వాహకులు. తాసిల్దారుకు అధికారం ఉన్నప్పటికీ న్యాయస్థానాధికారి అనుమతి పొందవలసిందన్నాడు. అతడు పోలీసు వారి అభిప్రాయం కోరాడు. ఉపన్యాసాలు రాజకీయ పరిణామం పొందే అవకాశం వుందని రాశారు. నాజిమ్ ఏదీ తేల్చి చెప్పక బాబెహుకుమత్ (ప్రభుత్వం) శలవు పొందమన్నాడు. నిర్వాహకులు బాబెహుకూమత్‌కు అర్జీ పెట్టుకోగా వారు త్రోసి వేశారు.

రఘుకు ఇన్ని ఇబ్బందులు కలుగలేదు. ఈ జాగీరుకు సంబంధించినంత వరకు మున్సిఫ్ అవ్వల్ తాలూక్దారుగా వ్యవహరించేవాడు. దరఖాస్తు పెట్టుకోగానే

అనుమతి యిచ్చేశాడు. అందువల్ల తాసిల్దారుకు మున్సిఫ్‌కూ నిప్పులో ఉప్పు వేసినట్లయింది.

సభ ఏ రోజు జరిగేదీ నిర్ణయం అయింది. కరపత్రాలు జాగీరు మొత్తం లోనూ పంచిపెట్టారు. ప్రజలకు సభ అనే పదం వింతగా కనిపించింది. అదేమిటో చూడాలనే ఉబలాటం కలిగింది. ఏ పల్లెలో చూచినా, యే బస్తీలో చూచినా, యే వ్యక్తిని చూచినా సభను గురించే చర్చ సాగింది.

సభ ఊరిబయట యేర్పాటు చేయబడింది. సభాస్థలంలో పెద్ద పెద్ద పందిళ్ళు వేయబడినాయి. పచ్చని తోరణాలతో వేదిక అలంకరించబడింది. స్త్రీలకు, పురుషులకు ప్రత్యేకంగా స్థలం ఏర్పాటు చేయబడింది. స్వచ్ఛంద సేవకులు సకల యేర్పాట్లు చేస్తున్నారు. హైదరాబాదునుండి నాయకులు వచ్చేశారు. వారు విడిచిన చోట జనం తండోప తండాలుగా కూడింది. వారిని ప్రశ్నలడగడం, వారి సమాధానాలు వినడం, వాళ్ళల్లో వారు చర్చించుకుంటుంటే ఆలకించడం వింతగానూ వేడుకగానూ ఉంది జనానికి.

ఊళ్ళకు ఊళ్లు తరలివస్తున్నాయి. గుర్రాలమీద, బండ్లమీద, కాలినడకన సద్దులమూటలు నెత్తిన పెట్టుకొని సాగారు పల్లీయులు. కోయ గూడేలు కూడా కొన్ని కదిలాయి. సింగన్న గూడెం మాత్రం మొత్తంగా కదలి వచ్చింది.

ఆ జనం, ఆ ఉత్సాహం తాసిల్దారు కంట్లో నిప్పులు పోశాయి. అమీను, తాసిల్దారు, గిర్దావరు మంతనాలు సాగించారు. గుండాలకు తాగుడు పోయించి వార్లు కాయించారు. అక్కడికి చేరుకునే ప్రతిబాటమీదా ప్రజలకూ గుండాలకూ ఘర్షణ జరిగింది. రఘు, నాగేశ్, రామడు, భీముడు పరుగులుపెట్టారు. దెబ్బలు తగిలినవారికి కట్లు కట్టారు. కొందరు గుండా తలలు పగిలాయి. ప్రజలు మాత్రం బయలుదేరినవాడు ఒక్కడూ వెనక్కు పోలేదు.

సభకు రావలసిందని జానకి రుక్మిణిని కోరింది. తల్లి ముందు వారించింది. కాని జానకి వెళ్ళుతూంది. కాబట్టి అంగీకరించింది. వారిద్దరూ సభాస్థలికి చేరుకునే వరకు అది జనంతో నిండిపోయింది. జనం జనం జనం! ఎక్కడ చూచినా జనం, అది జన సాగరం. జానకీ, రుక్మిణీ వేదికమీదికి చేరారు. రుక్మిణికి అది పెద్ద గౌరవంగా కనిపించింది. కొంత గర్వం కూడా తలెత్తింది. ఆమె కనులు నాగేశ్ కోసం వెదికాయి. అతడు ఎక్కడో హడావుడిలో ఉన్నాడు. తుదకు కనిపించాడు. వలంటీర్లకు ఏవేవో ఆదేశాలిస్తున్నాడు. ఆమె గుండె నిండింది. ఆమెకు పెన్నిధి దొరికింది.

సభ ప్రారంభం అయ్యే సమయానికి రఘు, నాగేశ్ వేదిక మీదికి వచ్చేశారు. నాగేశ్ రుక్మిణిని చూచాడు. అతనికి గిలిగింతలు పెట్టినట్లయింది. చిరునవ్వు నవ్వాడు. ఆమె పెదవులు చిరునవ్వులు చిందాయి. చిరునవ్వుల వెన్నెలలు కురిశాయి

మల్లెలు రాలేయి. క్షణంలో మనసు మళ్ళించుకున్నాడు నాగేశ్. కార్యక్రమంలో నిమగ్నుడైనాడు. రుక్మిణి చిన్నబోయింది.

సభకు వీరయ్యగారు అధ్యక్షత వహించారు. పుస్తకాలు తనమీద ఎలాంటి ప్రభావం వేశాయో వివరించి అవి తమ కండ్లు తెరిపించాయని చెప్పారు. ఈ మహాసభ జరపడానికి కారణభూతులలో రఘు తనకు అల్లుడైనందుకు గర్విస్తున్నా నని చెపుతూ, నాగేశ్ తనకు కొడుకువంటి వాడన్నారు.

సభ కరతాళ ధ్వనులతో మారుమ్రోగింది. సకల జనులూ వీరయ్యగారిని మెచ్చుకున్నారు.

తరవాత ఒక్కరొక్కరే నాయకులంతా ఉపన్యాసాలు ఇచ్చారు. కొందరు ఉద్రేకంగా ఉపన్యసించారు. కొందరు తాపీగా మాట్లాడినా ప్రజల సమస్యలను గురించే మాట్లాడారు. ఉపన్యాసకులు తమ సమస్యలను గురించే చెపుతుండడాన ప్రజలు చాలా శ్రద్ధగా విన్నారు.

ఉపన్యాసాలు జరుగుతుండగానే వేదికమీద రాళ్ళు పడ్డాయి. ఒక పెట్రో మాక్సు బ్రద్దలైంది. చుట్టూ ఈలలు మోగాయి. జనం మీద కూడా రాళ్ళు పడ్డాయి. కొంత కలవరం బయలుదేరింది. కాని, అది ఎంతోసేపు ఉండలేదు. నిర్వాహకులు అందును గురించి ముందే జాగ్రత్తపడ్డారు. దుండగులు బెదిరి పారిపోయారు. అధికా రుల గుండెల్లో రైళ్ళు పరిగెత్తాయి.

సభా కార్యక్రమం మళ్ళీ మామూలుగా సాగింది. ఉపన్యాసాల తరువాత బుర్రకథ ప్రారంభం అయింది. అదీ ప్రజల సమస్యకు సంబంధించిందే. నిశితంగా దుయ్యబట్టారు అధికారులను. అది ఎంతో ఆనందాన్ని కలిగించింది ప్రజలకు. మొదటిసారిగా అధికారులనూ, ప్రభుత్వాన్ని విమర్శించడం విన్నారు వారు. అదీ బహిరంగంగా. అంతమంది జనంలో ఇన్ని ఉపన్యాసాలు చేయలేనిపని ఒక్క బుర్ర కథ చేసింది. అది వారి మనసుల్లో నిలిచింది.

సభ ముగిసింది. జనంలో ఒక ఉత్సాహం, ఒక ఉద్రేకం, ఒక ఉత్తేజం కలిగిం చాయి. వారు నినాదాలు చేశారు. తాసిల్దారును తిట్టారు. గిర్దావరును దుయ్యబట్టారు. అమీన్ను అణగదొక్కాలన్నారు. వారంతా మనుషులేననీ, సామాన్యులేననీ, తమ అజ్ఞానం వల్లనే తమ భయం వల్లనే వాళ్ళ అధికారం సాగుతూందనీ గ్రహించారు జనం. గుంపు గుంపులుగా ఇందును గురించే మాట్లాడుకుంటూ ఊళ్ళకు తరలారు.

సభాస్థలం ఖాళీ అయింది. వలంటీర్లు గడలు పీకుతున్నారు. చాపలు చుట్టు న్నారు. వేదికకూడా ఖాళీ అయింది. మిగిలింది రుక్మిణీ, నాగేశ్‌లు. సభ జరుగు తున్నంతసేపూ ఏకాంతం కావాలని, ఏదో మాట్లాడుకోవాలని పరితపించాయి పరు వపు గుండెలు. అతడేమనుకున్నాడో ఆవిడకు తెలియదు. ఆవిడ ఏమనుకుంటుందో అతనికి తెలియదు. అయినా ఇద్దరి ఆవేదనా ఒకటే. ఇద్దరి ఆరాటం ఒకటే. ఇద్దరి

ఉబలాటం ఒకటే. ఒకటి ఒకటే. రెండు ఒకటి కావాలి. ద్వైతం అద్వైతం కావాలి. అందులో ఏదో ఆనందం ఉంది. ఏదో ఆహ్లాదం ఉంది. ఏదో అనుభూతి ఉంది.

అంతసేపటినుంచీ నిరీక్షించిన సమయం వచ్చింది. ఇద్దరు, ఇద్దరే ఏకాంతం- ఒకరిముందు ఒకరు. ప్రశాంతత. పక్కనెవరూలేరు. ఇద్దరి హృదయాలు గుబగుబ లాడాయి. గంతులువేశాయి. మల్లెలు మొలిచాయి. గులాబీలు విరిశాయి. అన్నీ గుండెల్లోనే. రెండు ముగ్ధ హృదయాలు, రెండు మూగ గుండెలు.

ఒకరి సరసన ఒకరు. వారికి చూపుల భాష తెలుసు. వాటి బాసలు తెలుసు. పెదవి అంతకుముందు కదలలేదు. దాన్ని కదిలించాలనే తుపాను గుండెల్లో రేగు తూంది. నాగేశ్‌కు విప్లవం తెలుసు, రక్తం తెలుసు, చంపడం తెలుసు, చావడం తెలుసు. కాని? ఈ అనుభూతి కొత్తది—రుక్మిణికి వ్రతాలు తెలుసు, పూజలు తెలుసు, నోములు తెలుసు. ఈ అనుభూతి కొత్తది.

కాలం జారిపోతూంది. క్షణాలు నిముషాలుగా మారిపోతున్నాయి. జారిపోతు న్నాయి. ఇద్దరి గుండెలకు రెక్కలొచ్చాయి. రెపరెపలాడేయి. ఎగరాలి. పోవాలి. అంబరాల్లోకి, జంటగా, జతగా, వారి ఊహల్లో వెన్నెలల పందిళ్ళు వెలిశాయి. చుక్కల సోపానాలు కనిపించాయి. ఆ పందిళ్ళకు పోవాలి! ఆ మెట్లు ఎక్కాలి!

నాగేశ్ పెదవి కదిలింది. "రుక్మిణీ?" అంతే వలపు వాక పారింది.

రుక్మిణి గుండె దడదడలాడింది. కనులెత్తి చూచింది. ఇంతలో సిగ్గు. కను రెప్పలు బరువైనాయి. వాలిపోయినాయి. వ్రేళ్ళతో నేలమీద బొమ్మలు గీసింది.

"రుక్మిణీ నువ్వెంత మంచిదానివి?" ఏదో అనాలని అనేశాడు.

"ఎందుకు?" వరాలు రాలేయి. అతనికి కావలసింది అదే. ఆమె మాట్లాడాలి తాను మాట్లాడాలి. వారి మాటలు కలుసుకోవాలి. వాటిలోంచి అమృతం పుట్టాలి. దోసిళ్ళతో త్రాగాలి.

"ఏమో ! తెలియదు కాని నువ్వు మంచిదానివి. ఇట్లనే ఉండిపోరాదు."

"ఎట్ల ?" ఆమె కనులెత్తి చూచింది. అంత దగ్గరగా వారి చూపులు కలిశాయి.

మల్లెలు రాలేయి.

వసంతం విరిసింది.

"దినాం గుడికిపోత"

"సాయంకాలమా ?"

"అవు"

"అయితే రోజూ కలుసుకుందమా?"

సరే నన్నట్లు తల ఊపింది.

ఇంతలో జానకి వచ్చింది. రుక్మిణిని పిలిచింది. ఉలిక్కిపడ్డదామె. ఊపిరి ఆడలేదు. తడబాటుతో లేచినుంచుంది. నాగేశ్ కూడా లేచాడు. ఆమె అతనిని

చూచింది. కళ్ళు చెమ్మగిల్లాయి. ఏమనాలో అర్థంకాలేదు. అడుగు ముందుకు వేసింది. సాగిపోయింది. చూస్తూ ఉండిపోయాడు నాగేశ్.

ఆ రాత్రి వీరయ్యగారింట్లో భోజనాలు. భోజనాల సందర్భంలో అనేక చర్చలు జరిగాయి. అనేక తీర్మానాలు జరిగాయి. భోజనాలైనా ఎవరూ పడుకోలేదు. వచ్చిన నాయకులతో చర్చ. జానకి ఉద్రేకంగా చర్చలో పాల్గొన్నది. వీరయ్యగారు అనేక కొత్త విషయాలు తెలుసుకున్నారు. రఘు మామూలుగానే ఉన్నాడు. నాగేశ్ అంతగా పట్టించుకోలేదు.

ఆ రాత్రి పాపం రుక్మిణి నిద్రపోలేదు.

తాసిల్దారు మాత్రం నిద్రపోయాడా? తెల్లవార్లూ కూర్చున్నారు ముగ్గురూ— తాసిల్దారు, అమీను, గిర్దావరు. సాహుకారి వెంకయ్య తలనొప్పని ఎగ్గొట్టాడు. కాకుంటే నలుగురు కావలసింది. వారు ఆ రాత్రి తాగలేదు గానాబజానా లేదు. ఏదో రాబోయే తుపానును ఆపటానికి ప్రణాళికలు వేస్తున్నారు. వారికి జనసమూహాలను చూచీ, ఉపన్యాసాలు వినీ గంగ వెర్రులెత్తాయి. నిన్నటి దాకా తమ ఆజ్ఞ లేకుండా చీమ చిటుక్కు మనలేదు. జాగీరుమొత్తాన్ని గడగడలాడించారు. ఇవ్వాళ వారి హృదయాల్లో గుబులు చేరింది. భయం ప్రవేశించింది. ఏం చెయ్యాలి? ఎవరిని చంపించాలి? ఎవరిని కొట్టించాలి? ఎలా హడలు కొట్టాలి? ప్రతివారి ప్రణాళికకూ ఏదో అడ్డువస్తూనే ఉంది. మున్సిఫ్ జాగీర్దార్, శాసనం ప్రభుత్వం ఇవన్నీ ఇన్నాళ్ళనుంచి ఏమైనాయి? ఇవ్వాళ అమాంతంగా ఎలా ఊడిపడ్డాయి? ఎవరు దీనికి కారణం! రఘు, నాగేశ్ !

ఇద్దరూ వాళ్ళ పాలిట యములైనారు.
వారిని వదిలించుకోవాలి.
యముణ్ణి ఎవడు చంపాడు ?

హత్య :
ఖూన్ :
మర్డర్ :

భాషలు వేరైనా వార్త ఒక్కటే. ఇంకా పూర్తిగా తెల్లవారకుండానే వార్త ఊరంతా వ్యాపించింది. అగ్గిలా ఇంటింటికీ పాకింది. నిద్రలో ఉన్నవారు సహితం ఉలిక్కిపడి లేచారు.

హత్య జరిగిపోయింది. ఎవరినోట విన్నా అదే వార్త. ఆడా, మగా, పిల్లలు అందరూ అందును గురించే ముచ్చటించుకున్నారు. గుంపులు గుంపులుగా చేరి అతని మంచితనాన్ని గురించి చెప్పుకుంటున్నారు. హత్య ఎవరు చేశారనే దాన్ని గురించి నానా రకాల వ్యాఖ్యానిస్తున్నారు. హత్యయొక్క కర్తృ కార్య, కారణాల్ని గురించి తలా ఒకరీతిగా చెప్పుకుంటున్నారు.

ఊరంతా తుకతుకా ఉడికిపోయింది. ఎవరి ముఖాన చూచినా విషాద చ్ఛాయలే. ఆ కాలంలో ఈ ప్రాంతంలో హత్యలు చాలా అరుదు. అధికారులు హత మారుస్తే హత్యకాదు. హత్యదాకా ఎందుకు-దొంగతనాలు కూడా అరుదే. ఎక్కడ దొంగతనం జరిగినా ఊరందర్నీ హడలకొట్టేవారు పోలీసులు. ఇక హత్య జరిగితే చెప్పాలా ? ఈ పిడుగు ఎవరిమీద పడుతుందోనని హడలిపోతున్నారు జనం.

హత్య జరిగినచోటికి జనయాత్ర సాగింది. స్థలం జనంతో కిట కిటలాడి పోయింది. కాని ఒక్క పోలీసువాడూ రాలేదు. ఘోరంగా హత్య చేశారు. కత్తితో అనేకచోట్ల పొడిచారు. వంటినిండా గాయాలే. మెడ సగం తెగిపోయింది. రక్తంలో పడివుంది శవం – మంచం ప్రక్కన. పాపం వంటరిగాడు. ఎంతో దూరంనుంచి వచ్చాడు. మంచివాడు. ఇక్కడ చచ్చాడు.

ఖాజా అసదుల్లాబేగ్ అన్సారీ మున్సిఫ్ మేజిస్ట్రేట్ హత్య గావించబడినాడు. శత్రు పక్షంలో చేరిన తనవారిని ముందు తుడిచిపెట్టాలి. అందుకే అధ్యాయం ఇలా ప్రారంభం అయింది. ఇది రాబోయే పరిణామాలకు సంకేతం అనుకున్నారు ప్రజలు. పొంగిన ఉద్రేకంలో ఒక్కసారిగా కుండెడు నీళ్ళు పడ్డాయి. గుండెలు మళ్ళీ గుబులు, గుబులు మనసాగేయి.

రఘు మాత్రం చలించలేదు. అతనికి బాధ కలిగింది. కాని భయం కల్గలేదు. నాగేశ్‌లో ఉద్రేకం పొంగింది. ఇద్దరూ పరుగెత్తారు. జనాన్ని తోసుకుంటూ లోనికి వెళ్ళారు. భయంకరం అయిన శవాన్ని చూచి అక్కడే నిలిచిపోయారు. రఘు బాగా చూచాడు. అడుగుల గుర్తులు స్పష్టంగా కనిపిస్తున్నాయి. కత్తి అక్కడే పడివుంది. హంతకుడు చేతులు తుడుచుకున్న జేబురుమాలు కూడా నేలమీద ఉంది. ఒక్క పోలీసువాడు లేడు! వెంటనే కర్తవ్యాన్ని నిర్ణయించుకున్నాడు. జనాన్ని హత్యా స్థలంలో అడుగు పెట్టనీయకుండా చూడమని నాగేశ్‌ను ఆదేశించాడు. స్టేషన్‌కు పరిగెత్తాడు. జిల్లా పోలీసు మొహతమీమ్ (సూపరింటెండెంట్)కు టెలిగ్రాం ఇచ్చాడు.

పోలీసు మొహతమీమ్ రైలు దిగాడు. తాసిల్దారుకు ఆ వార్త అందింది. ముచ్చెమటలు పోశాయి. అంత భారీ మనిషి హడలిపోయాడు. గుండెలు దడదడ లాడేయి. మనిషి గడగడలాడేడు. నెత్తి నాలుగుసార్లు రాచుకున్నా కర్తవ్యం గోచరించలేదు. భయం అతణ్ణి కృంగదీయసాగింది.

స్టేషన్‌లోనే పోలీసు అధికారిని కలుసుకున్నాడు రఘు. వివరాలన్నీ తెలియజేశాడు. ఒక్క పోలీసువాడూ అటు రాకపోవడంవల్ల ఇందులో పోలీసు హస్తం వుందని అనుమానంగా వుందన్నాడు. పోలీసు అధికారిని హత్యా స్థలానికి తీసుకెళ్ళాడు. అధికారికి కూడా ఆ శవాన్ని చూచి వళ్ళు జల్లుమంది ! తరవాత వళ్ళు మండింది. చంపబడినవాడు ముసల్మాను! అందులో మున్సిఫ్!

హంతకుణ్ని పట్టుకోవాలనే పట్టుదల కలిగింది. ఈ కేసులో అతనికి ప్రమోషన్ వచ్చినా రావచ్చు. ఒక ముస్లిం ఖూనీ చేయబడినాడు! బహుశః చంపిన వాడు హిందువై ఉండాలి. కాని రఘు, నాగేశ్‌ల ఆతురత, ఒక్క పోలీసు గాని, ముసల్మానుగాని అక్కడ లేకపోవడం అతనికి ఆశ్చర్యం కలిగించాయి. పైగా ఒక్క జాగీరు అధికారి తనకు స్వాగతం చెప్పడానికి రాలేదు. ఏదో అవమానం జరిగినట్టు అయింది. దాంతో పట్టుదల మరీ హెచ్చింది.

రఘు, నాగేశ్, వీరయ్యగారు, భీముడు, రావుడు పంచులైనారు. పంచనామా జరిగింది, శవాన్ని పోస్టుమార్టమ్ కోసం బస్తీకి పంపించారు. రిపోర్టు వగైరా కొందరు పోలీసులతో జిల్లా కార్యాలయానికి పంపించి మరికొంత విచారణ జరపడానికిగాను అక్కడే ఉండిపోయాడు మొహతమీమ్. ఎవరిని అరెస్టు చేయాలో అతనికి అర్థం కాలేదు, అరెస్టులు చేయకుండా పోవటం అతని హోదాకు తక్కువ. ఏం చెయ్యాలో తోచక వాలు కుర్చీలో కూర్చొని సుదీర్ఘంగా ఆలోచిస్తున్న మొహత మీమ్‌కు గిర్దావరు వ గి మూడుసార్లు సలాం చేశాడు.

"కౌన్ హై !" అడిగాడు మొహతమీమ్.

"గిర్దావర్ను సర్కార్"!"

"గిర్దావర్కు ఈడేం పని ? అమీన్ యాడ చచ్చిండు?"

నసిగాడు గిర్దావరు, దౌర[1] మీద పోయిండు సర్కార్. నే నున్న గద ఇంతజాములు[2] చేసేటందుకు. తాసిల్దార్ సర్కార్. దావతిచ్చిండు.[3] నన్ను తోలిండు. తశ్రీఫ్ లానా సర్కార్" [4] అన్నాడు.

"ఇప్పు డెరికైనాది తాసిల్దారుకు ! హమ్ నహీఁ ఆయేఁగే. పోయి చెప్పు తాసిల్దారుతో. మేమేం జాగీరు నౌకర్లమా ?" హూంకరించాడు మొహతమీమ్.

గడగడ లాడాడు గిర్దావరు. "సర్కార్‌కు కోపం వస్తే మేమెట్ల బతుకుతం? తాసిల్దార్ బొత్తర శాన పెద్దది. నడువలేడుండి. నన్ను పంపిండు. కచ్చడంకూడ తెచ్చిన. నడిపిస్తాముండి సర్కార్ను! గులామ్ హూఁ సర్కార్. జరూర్ చల్నా !"

"అచ్చా ఈ ఖూనీ ఎవరు చేసిన్రు ? ముసల్మాన్ మున్సిఫ్ ఖూనీ అయితే ఇండ్లల్ల కూకుంటర్ ? తేలుస్త తడఖా నీ చెయ్యి ఉన్నట్లున్నదిండ్ల"

"బేఖుసూర్ హూఁ సర్కార్,[5] నాదేం లేదిండ్ల చంపింది" అని అటూ ఇటూ చూచి "రఘు" అని చెవులో చెప్పి "తాసిల్దార్‌సాబ్ తప్సీల్గ చెప్పుత నన్నడు. చలో సర్కార్" అని బ్రతిమలాడాడు.

రఘు పేరు విని తల తిరిగిపోయింది మొహతమీమ్‌కు. ఫస్టు ఇన్ఫర్మేషన్ రిపోర్టు ఇచ్చింది అతను. పంచుల్లో అతడొకడు. పాక రఘు విషయంలో ఒక సదభి

---

1. పర్యటన 2. ఏర్పాట్లు 3. విందుకు పిలిచాడు 4. దయచేయాలి ప్రభూ 5. నిరపరాధిని ప్రభూ 6. వివరంగా

ప్రాయం ఏర్పడ్డదతనికి. అతడా ఖూనీ చేసింది? స్థానికాధికారుల సహాయం లేకుండా కేసును నడిపించడం కష్టం అనుకున్నాడు. కచ్చతంలో తాసిల్దారు ఇంటికి చేరారు.

గజ్జల చప్పుడు విన్నాడు తాసిల్దారు. బల్లపీటమీంచి లేచాడు. మొహత మీమ్‌కు ఎదురేగాడు. చేయినేలకానించి మూడుసార్లు సలామ్ చేశాడు. చేయి అందించి బండి మీదినుంచి దింపాడు. కాలుకు మట్టి అంటకుండా పరచబడిన గుడ్డ మీద మొహతమీమ్‌కు దారి చూపిస్తూ తీసికెళ్ళాడు. విశాలమైన హాలులో పరుపుమీద కూర్చో బెట్టాడు. ఇంతలో పైజామా కమీజు తొడిగి సెల్వార్ వేసుకున్న అమ్మాయి గ్లాసులో నీళ్ళు అందించింది. మరొక అమ్మాయి హుక్కా తెచ్చి అందించింది. ఇంకొక అమ్మాయి మధుపాత్ర తెచ్చి పెట్టేసింది. తాసిల్దారు చేసిన సంజ్ఞ మేరకు చషకంలో అమృతం నింపి అందించింది. సలామ్ చేసి స్వీకరించవలసిందని వేడుకున్నాడు తాసిల్దారు. అధికారి తాసిల్దారు వైభవం చూసి ఆశ్చర్యపడ్డాడు. అతని వినయానికి తబ్బిబ్బైనాడు. అమ్మాయిల అందంలో మునిగిపోయాడు. తనను మరచాడు. అధికారాన్ని మరచాడు. కర్తవ్యాన్ని మర చాడు. ఆనందంలో మున్కలు వేశాడు.

సాయంకాలం అయిందీ, చీకటి పడిందీ తెలియలేదు వారికి. దీపాలు వెలి గాయి. లైట్లు వచ్చాయి. రకరకాల భోజనాలు, రకరకాల సారాయి రంగులు మార్చుకుంటున్న రమణులు. అదేదో స్వర్గంలా వుంది. వారికి నందనంలా వుంది. నాగలోకంలా వుంది.

డోలక్ మోగింది. కాళ్ళ గజ్జెలు ఘల్లుమన్నాయి. అందానికి అవయవాలు వచ్చి ఆడసాగాయి. ఖవాలీలు, గజళ్ళు, ఆటలు, పాటలు అంతా మత్తుగా వుంది. అంతా మస్తుగా వుంది. వాతావరణం నిషాతో నిండిపోయింది. అధికారి తన్మయత్వంలో ఉన్నాడు. అమీను వచ్చాడు. అధికారి కాళ్ళమీద పడ్డాడు. తనతోపాటు ఒక అందగత్తెను అతనిమీదపడేశాడు. అభయం ఇవ్వందే కాళ్ళమీదినుంచి లేవనన్నాడు. అధికారి ఆలోచించే దశలోలేడు. అమ్మాయి మెత్తని దేహం అతనికి తగులుతూ వుంది. అభయం ఇచ్చాడు.

తానే మున్సిఫ్‌ను ఖూనీ చేశానని చెప్పాడు. మున్సిఫ్‌మీద అనేక చాడీలు చెప్పాడు. అతణ్ణి కాఫిర్ అన్నాడు. ఎప్పుడూ హిందువులకే సాయం చేసేవా డన్నాడు. తమను వట్టి ముండలకింద జమ కట్టాడన్నాడు. అతని వల్ల ప్రజలు రెచ్చిపోయారనీ వేరే గత్యంతరం లేకపోయిందనీ చెప్పి నోట్లకట్ట అతని జేబులో పెట్టాడు. హాలులోంచి అంతా నిర్గమించారు – వయ్యారిని అక్కడ వదిలి.

తెల్లవారి ఊరిని హడలకొట్టేశాడు అమీను. కనిపించిన వాణ్ణల్లా పట్టాడు. కొట్టాడు. ఇండ్లలో దుండగులను దూర్పించాడు. దోపిడీలు చేయించాడు. కొందరిని చెట్టుకొయ్యలకు కట్టి కొట్టాడు. కొందరిమీద బండలెత్తాడు. డబ్బు, దబ్బు బోలెడు

డబ్బు వసూలు చేశాడు. ఆ రాత్రి పిందులో అధికారికి మరికొంత అందించాడు. అప్పుడు తాసిల్దారు ప్రారంభించాడు.

"హుజూర్ రఘును గిరఫ్తార్[1] చేసి తీస్కపోవాలె"

అధికారికి ఏమీ అర్థం కానట్లు చూచాడు.

"ఇంకింత ఇస్త. వాడు బద్మాష్ ఉన్నడు. వాణ్ణి జేల్ల నూకించాలె. ఎవ్వరికి ఎరికె కాకుండా పట్టుకుపోవాలె ఈ రాత్రి గాడి[2]కి. ఇదో" అని మరొక నోట్లకట్ట అందించాడు.

"నహీఁ హోసక్తా. ఇంకెవర్నన్న పట్టించు పట్కపోత. వాడు మంచోడు."

"అమ్మో! హుజూర్ వాడు మంచోడా? మంత్రాల మారోడు. చూసేటందుక అట్లనే ఉంటాడు. సైతాన్ సర్కార్! వాడు సైతాన్ హుజూర్ ఏది కావల్నంటే అదే ఇస్త. పరువు కాపాడాలే సర్కార్" అని కాళ్ళమీద పడ్డాడు. కాదనలేక పోయాడు అధికారి. అతడు తాసిల్దారుకు బానిస అయిపోయాడు. అంతకంటే ఏం చేయగలడు?

అర్థరాత్రి చీకట్లో ఇద్దరు పోలీసులు వీరయ్యగారి ఇంటికి వెళ్ళారు. వారి భుజాలకు తుపాకులున్నాయి. ఇంటిని కాపలా కాస్తున్న భీముడు వారిని చూచాడు. అతని గుండె జల్లుమన్నది. కర్రపట్టుకు లేచి వారికి అడ్డం నుంచు న్నాడు.

"మొదలు నన్ను చంపండి, ఆ మెన్క ఇంట్లో అడుగు పెట్టండి" అన్నాడు.

"మేమ్ చంపెటందుక రాలేదు."

"మా మొహతమీమ్ సాబ్ రఘుసాబ్‌ను పిలుచుకు రమ్మన్నడు. వచ్చినం"

"నన్ను తీస్కపోండి, కాల్మొక్త, నన్ను చంపుండి. చీరుండి! ఆ అయ్య దేవుడు, అయ్యన్నేమనద్దు"

"కౌన్ హై బే తూ ?" అని ఒక జమాను భీముణ్ణి నెట్టాడు. భీముడు కర్ర ఎత్తాడు. రఘు తలుపు తీసుకొని పరుగెత్తుకొని వచ్చి భీముని చేతిలోని కర్ర పట్టుకున్నాడు. "వారు డ్యూటీ చేయడానికి వచ్చినరు! వారి నేమి అనవద్దు" అని వచ్చినవారిని అడిగాడు. వారు చెప్పారు. అప్పటికి వీరయ్యగారు, జానకీ వచ్చేశారు.

"వస్త. భీమన్నా జాగత్త" అని చెప్పి పోలీసులను అనుసరించాడు రఘు.

ఇలాంటి అవాంతరం ఎన్నటో ఒకనాడు వస్తుందనీ, అందుకోసం సిద్ధంగా ఉండాలనీ అనేకసార్లు బోధించాడు రఘు మామకు, మరదలకూ. వారు కూడా కొంతవరకు అందుకు సిద్ధం అయినమాట నిజమే. అయినా ఆ పిడుగుపాటును సహించలేకపోయింది జానకి. ఇద్దరు పోలీసుల నడుమ పోతున్న బావను చూచింది.

1. అరెస్టు 2. రైలుకు.

కన్నీరు బలబలా రాలింది. అటు చూస్తే బావ దూరం అయినాడు. పక్కకు చూస్తే తండ్రి కనిపించాడు. తండ్రిమీద పడి "భోరు" మంది. వీరయ్యగారు ఆమెను ఓదార్చడానికి తల నిమిరాడు. కాని అతని కన్నీటిబొట్లు ఆమె తలమీద రాలాయి.

భీమన్న తల బాదుకున్నాడు.

కుప్పగా కూలిపోయాడు.

రఘును నేరుగా స్టేషనుకు తీసికెళ్ళారు. రైలు వచ్చేదాకా వెయిటింగ్ రూములో ఉంచి రైలెక్కించారు. రైల్లో చేతులకు బేడీలు వేశారు. అయినా పోలీసులు చాలా మంచిగా ప్రవర్తించారు. రఘుసైతం స్నేహంగా ప్రవర్తించాడు. పోలీసులతో కలిసి చాయ్ త్రాగారు. సిగరెట్లు కాల్చుకున్నారు. రఘును ఎందుకు తీసుకెళ్తున్నదీ పోలీసులకు అర్థం కాలేదు. రఘు ఆ విషయం వారిని అడగనూలేదు. అతడు విషయం గ్రహించాడు అయినా వ్యక్తపరచలేదు. చాలా మామూలుగా సాదాగా, సరదాగా ఉన్నాడు. అతణ్ణి చూచి పోలీసులకే ఆశ్చర్యం అయింది. బోనుకు పోయే పులి యిలాగే ఉంటుందేమో అనుకున్నారు.

తెల్లవారుతుండగా బండి జిల్లా కేంద్రానికి చేరింది. రఘును మొహతమీమ్ యింటికి తీసుకు వెళ్ళారు. అతన్ని గదిలో పారేసి బయటి నుంచి తాళం వేసి వెళ్ళిపోయారు పోలీసులు. మొహతమీమ్ మత్తు ఇంకా దిగలేదు. అతడు పడక గదిలో పడిపోయాడు. రఘు నేల మీద పడి నిద్రపోయాడు.

బాగా పొద్దెక్కిం తర్వాత లేచాడు మొహతమీమ్. లేవగానే అతని కన్పించింది దినపత్రిక. మడత విప్పి చూచాడు. ప్రధాన శీర్షిక చూచి గుండె పగిలింది. ఆది మున్సిఫ్ హత్యను గురించిన వార్త. "జాగీరులో ముస్లిం మున్సిఫ్ హత్య సమాచారం అందించినవాడు హిందువు-రఘు" అనే శీర్షిక క్రింద హత్యకు సంబంధించిన వివరాలు విచారణకు సంబంధించిన వార్త వివరంగా వుంది. రఘును పత్రిక బాగా ప్రశంసించింది.

ఆ వార్త చూచి గంగవెర్రులెత్తాయి అధికారికి. ఏంచెయ్యాలో అతనికి అర్థం కాలేదు. హత్య జరిగిన చోటు నుంచి ఎవరినీ అరెస్టుచేసి తేలేదు. తెచ్చిన వాణ్ణి గురించి పత్రికలు ఇలా వ్రాస్తున్నాయి. ఉర్దూ పత్రికలు కూడా అలా రాయడం అతనికి బాగనిపించలేదు. తరువాత తాసిల్దారు గుర్తుకు వచ్చాడు. అతనిమీద కారాలు మిరియాలు నూరాడు. కాని అది గత జల సేతుబంధనం, ఇప్పుడేం చేయాలి? రఘును విడుదల చేయడానికి వీల్లేదు. అయితే ఏం చేయాలి? ఎంతో ఆలోచించాడు. అమాంతంగా అతనికి తట్టిన ఆలోచన- రఘును కమ్యూనిస్టు కింద జమకట్టాలి. అతనితో నేరం ఒప్పించాలి. అంతకుమించి తనకు గత్యంతరంలేదు. తెచ్చిన నోట్ల కట్టలన్నీ పెట్టెల్లో సర్దాడు. ముఖం కడుక్కొని నాస్తా చేశాడు. చాయ్ తాగి డ్రాయింగ్ రూములోకి వెళ్ళి రఘును పిలిపించాడు.

రఘు వచ్చాడు. అతణ్ణి చూడగానే అధికారికి కోపం వచ్చేబదులు సానుభూతి కలిగింది. కాని దాన్ని అమాంతంగా దిగమింగి ఉగ్రుడైనాడు. కుర్చీలో కూర్చో బోతున్న రఘుమీద మండిపడాడు.

"బైఠ్తాహై సాలా. ఖడేరహ్ ఖాతిల్ కహీంకా!" * అని కేకపెట్టాడు.

రఘు నుంచున్నాడు. అతనికి రెప్పపాటు కళ్ళు చీకట్లు కమ్మాయి.

"కమీనిష్టువ్‌రే పంచర్, ఖూన్ కేసికవ్‌రే" గొంతు చించుకున్నాడు.

రఘు మొదటి ప్రశ్నకు సమాధానం చెప్పలేదు. "ఖూనీ చేసింది నేనుకాదు, అమీను. రుజువు పరచగలను" బెణక్కుండా తొణక్కుండా సమాధానం చెప్పాడు.

"ఏమన్నావ్? అమీను ఖూన్ చేసినాడ్? ఖూనీ చేస్తివి అమీను మీద పెడ్తవ్? హరామ్జాదే" అని లేచి లాగి చెంపమీద పెట్టాడు.

దెబ్బ బాగానే తగిలింది. అయినా చలించలేదు రఘు. "నిజం కొంతమందికి చేదుగా కనిపిస్తుంది. అయినా నిజం నిజమే. అనేక సాక్ష్యాలున్నాయి. నిరూపించ మంటే నిరూపించగలను" అన్నాడు.

ఉగ్రుడైపోయాడు అధికారి. పక్కనే ఉన్న కర్ర తీసుకొని ఒళ్ళు ఎరక్కుండా బాదాడు. చేతులు నొప్పులు పెట్టే కర్ర మూలకు విసిరి వగరుస్తూ కుర్చీలో కూలబడి "నఖ్రాలు చేయకు. ఒప్పుకో ఖూన్ చేసానని. బతికిపోతవ్. లేకుంటే లాష్ ** ఇట్లనే బొందలోకి పోతది. మళ్ళా జాగేదు ముఖం చూడవ్" అని, పోలీసు వాళ్ళని పిలిచి 'రేహాప్ తఫ్తీష్ (ఇంటరాగేషన్-విచారణ) కరో" అని కేక వేశాడు.

పోలీసులు అతణ్ణి లాక్కెళ్ళి గదిలో పారేశారు. నైజాంలో పోలీసులు కరడు కట్టినవారు, రాక్షస భటులు. వారికి ఏకోశానా పిసరంత మనస్సు ఉంటుందని ఎవరికీ నమ్మకంలేదు. ప్రజలను హడలకొట్టడంలో, నేరం చేయనివారితో సైతం నేరం ఒప్పించడంలో వారిని మించినవారు లోకంలో ఎక్కడా ఉండరు. అప్పట్నుంచి ఆ రాత్రంతా హింసించారు రఘును.

లాఠీలతో మోకాళ్ళమీదా, మోచేతులమీదా కొట్టారు. గంటల తరబడి కొట్టారు. నానా బాధలు పెట్టారు. కాని ఒప్పుకోలేదు రఘు.

జనప నులక తెప్పించారు. కాళ్ళనుండి భుజాలవరకు గట్టిగా చుట్టారు. తల మీదనుంచి కుండలతో నీళ్ళు పోయించారు. నీళ్ళు పడుతూంటే నులక బిగుసు కుంటూంది. ఒళ్ళంతా నలిగిపోతూంది. హూనం అవుతూంది. మూలిగాడు. కాని ఒప్పుకోలేదు రఘు.

---

* కూర్చుంటావా దుర్మార్గుడా! నుంచో హంతకుడా!

** పీనుగు

జనపనార తలకు కట్టి, రెండు చివరలు కలిసే చోట పుల్లలు పెట్టి తిప్పారు. నార తలను ఒగుస్తూంది. నరాలు బాధపెడ్తున్నాయి. డీలాపడిపోయాడు కాని ఒప్పు కోలేదు రఘు.

రాక్షసుడనుకున్నారు రఘును పోలీసులు. నేరాన్ని ఒప్పించడానికి యిన్ని మార్గాలు అవలంబించాల్సిన పని ఎవరి విషయంలోనూ పడలేదు. పోలీసులు విసిగి పోయారు. అధికారికి నివేదించారు. అతడు వారిమీద కస్సుబుస్సు మన్నాడు. వారిని పంపి కొత్తవారిని పిలిపించాడు.

కొత్తవారు కొత్తబలంతో కొత్త ఉత్సాహంతో రఘు మీద పడ్డారు. మంచం తెప్పించి దానికోళ్ళు రఘు అరచేతులమీద పెట్టారు. మంచంమీద ఎక్కి ఎగిరారు, భరించరాని బాధపడ్డాడు రఘు. సుమారు స్పృహ తప్పి పడిపోయాడు కాని ఒప్పుకో లేదు.

గోళ్ళల్లో సూదులు గుచ్చారు. రక్తం ప్రవహించసాగింది. మూలిగాడు రఘు అరచాడు, కేకలు పెట్టాడు, స్పృహ తప్పింది. పడిపోయాడు. తరవాత ఏం చేసినా అతనికి తెలియలేదు. పోలీసుల గుండె పగిలింది. సూపరింటెండెంటు దగ్గరికి పరిగె త్తారు. విన్నవించారు. అతని ప్రాణాలు పైపైనే లేచిపోయాయి. పరిగెత్తిచూచాడు. అతనికి ఏమీ అర్థం కాలేదు. డాక్టరును పిలిపించాడు.

అలా గడిచిందా రాత్రి - కాళరాత్రి.

అక్కడ జాగీరులోనూ అల్లకల్లోలంగా వుంది. రఘు అరెస్టు వార్త తెల్లవారక ముందే ఊరంతా ప్రాకింది. జనం ఉద్రిక్తులైనారు. గుంపులు గుంపులుగా స్టేషన్‌కు వెళ్ళారు కాని అప్పటికే బండి వెళ్ళిపోయింది. తెల్లవారితే నాగేశ్ గ్రామ ముఖ్యుల సమావేశం ఏర్పాట్లు చేశాడు. సమావేశంలో నాగేశ్ చాలా ఉద్రేకంగా మాట్లాడాడు. ఈ అన్యాయాన్ని సహించరాదన్నాడు. దౌర్జన్యాన్ని దౌర్జన్యంతో హింసతో ఎది రించాలన్నాడు. భీముడు ఏడ్చాడు. రావడు రఘు వచ్చేదాక తాసిల్దార్ యింటికి వెళ్ళనన్నాడు. పనిపాటల వాళ్ళంతా అదే ప్రతిజ్ఞ చేశారు. వీరయ్యగారు ప్రశాం తంగా మాట్లాడినా పదునుగా మాట్లాడారు. జానకి సహితం మాట్లాడింది. ఆమె మాటల్లో ఆవేదన కనిపించింది. అన్యాయాన్ని ఎదిరించాలి. కాని, అన్యాయంతో కాదంది. నిప్పును నిప్పుతో చల్లార్చ లేమంది. అందుకు నీళ్ళు కావాలంది.

గ్రామంలో హర్తాళ్ జరపాలనే నిశ్చయం జరిగింది. ఒక్కడూ దుకాణం తెరవలేదు. ఊరు పాడుపడ్డట్టయింది. అసలే భయం భయంగా ఉన్నాడు తాసిల్దార్. ఆనాడు మాలిష్ లేదు. కేకలు వేయడం, మొత్తుకోవడం సాగించాడు. గిర్దావన్ను, అమీన్ను తిట్టిపోశాడు. ఇంట్లో వాళ్ళందరి మీద అరచాడు. అతనికి విరేచనాలు పట్టుకున్నాయి. అది రఘు మంత్రాల ప్రభావం అని వణికిపోయాడు. అసలు విషయం తెలియపరుస్తానన్నాడు. అమీనుమీద రంకెలు వేశాడు. అమీను కాళ్ళు కడుపులు పట్టుకొని బ్రతిమలాడాడు. తన భార్యా బిడ్డల్ని చూడమన్నాడు. వేడుకున్నాడు.

గిర్దావరు లోలోపల సంతోషించాడు. తురకలు తన్నుకుంటున్నారు. మంచిదే ననుకున్నాడు. తన మాట విననందుకు తగిన శాస్తి జరిగిందనుకున్నాడు. అయినా మొసలి కన్నీళ్ళు కార్చాడు.

ఆనాటి పత్రిక రావడంతో ఊళ్ళో ఉద్రేకం పెరిగింది. అంతా తాము చూచిందే అయినా పత్రికలో వార్త వారికి కొత్త అనుభూతిని యిచ్చింది. వేలమందికి తమ విషయం తెలిసిందనిపించింది. దేశం తమవెంట ఉందనిపించింది.

వడ్డెరగూడెం ఊరేగింపు తీసింది. భీముడు జండా పట్టుకొని ముందు నడుసున్నాడు. జానకి, నాగేశ్ అతని వెనుక ఉన్నారు. నాగేశ్ నినాదాలిస్తున్నాడు. హరిజనవాడ ఊరేగింపులో చేరింది. ఒక్కొక్కరూ ఊరంతా ఊరేగింపులో చేరింది.

జనార్ణవం

జనసాగరం

సాగిపోతూంది.

పొంగిపోతూంది.

"తాసిల్దారు దౌర్జన్యం"

"నశించాలె!"

"రఘు గారినీ"

"విడుదల చేయాలె!"

గొంతు చించుకొని నినాదాలిస్తున్నారు, దిక్కులు ప్రతిధ్వనిస్తున్నాయి. తాసిల్దార్ అంటే వణికి చచ్చే జనానికి ఎంత ధైర్యం వచ్చేసింది! ఎంత ఉద్రేకం వచ్చింది! ఈ దాడి అతని యింటిమీదికే!

నినాదాలు తాసిల్దార్ గుండెల్లో తూట్లు పడేశాయి. అసలే వళ్ళు నొప్పులు. అందుపై విరేచనాలు, ఇప్పుడు పిడుగు విరుచుకుపడింది. తలుపులన్నీ వేయించాడు. లోపలి గదిలో కూర్చున్నాడు. చమటలు పడుతున్నాయి. వణకిపోతున్నాడు. అమీను ప్రాణాలు లేచిపోయాయి. గిర్దావరు మూత్రం చేసుకున్నాడు, పంచె పైకి దోపుకొని దొడ్లోకి ఉరికాడు.

జనం తాసిల్దార్ ఇంటిముందుకు వచ్చేసింది. నినాదాలు, కేకలు, అరుపులు, తిట్లు, సాపెనలు, బూతులు.

"తాసిల్దార్ బయటకిరా"

"తాసిల్దార్ బతకవురా ?"

జనంలో ఉద్రేకం ఎక్కువ అవుతూంది. ఉగ్రూత లూగుతున్నారు. నాగేశ్‌కు శివం ఎత్తింది, సమ్మెటల్తో తలుపులు బద్దలు కొట్టమన్నాడు. వడ్డెర్లు సమ్మెటల్తో ముందు కురికారు. తాసిల్దార్ తల బద్దలు కొడ్తామన్నారు.

పరిస్థితి విషమిస్తూందని గ్రహించింది జానకి. పైట నడుముకు చుట్టుకొని పరిగెత్తింది. దర్వాజాకు అడ్డంగా నుంచుంది. "ముందు నా తల పగలాలె. తరవాత

తలుపు? మనం మనుషులమా? రాక్షసులమా? చావటం, చంపటం, ఎంతమందిని చంపుతారు? ప్రాణానికి విలువ తెలియనివారు ప్రజా ఉద్యమాలు నడిపిస్తారట! ఆగండి అడుగు ముందుకు వేస్తే ముందు నన్ను చంపండి."

చండికలా ఉంది జానకి. కళ్ళు రక్తం కక్కుతున్నాయి. ముఖం నిప్పులు ఉమ్ముతూంది. రెండు చేతులు చాచి దర్వాజాకు అడ్డంగా నిలిచింది. నఖశిఖ పర్యంతం వణికిపోతూంది.

జనం వెనక్కు తగ్గారు. చిత్తరువుల్లా నుంచుండిపోయారు. కనీసం ఊపిరి పీల్చుకోకుండా విన్నారు ఆమె మాటలు. ముగిస్తే శ్వాస వదిలారు. అంతా నిశ్శబ్దం. సూది చిటుక్కుమంటే వినవచ్చేట్లుంది.

కొన్ని లిప్తలు అలా గడిచాయి.

"తాసిల్దార్ రావాలె" వెనుకనుంచి ఎవరో అరచారు. ఇద్దరు ముగ్గురు అతన్ని అనుసరించారు. వెనుకనుంచి ఎవరో రాయి విసిరారు. అది జానకి నొసట తగిలి రక్తపు మరకతో రాలిపోయింది. నొసట రక్తం టపటపా రాలింది. అయినా ఆమె చాచిన చేతులు దించలేదు. శిలా ప్రతిమలా అలాగే నుంచుంది. చలించలేదు.

నాగేశ్ అమాంతంగా ఆమె ముందుకు ఉరికి నుంచున్నాడు. భీముడు సమ్మెటతో జనంలోకి ఉరికాడు. భీముణ్ణి పట్టుకున్నాడు రావుడు.

నాగేశ్‌ను పక్కకునెట్టి జానకి కేక పెట్టింది. "రక్తం చూసినరు. చాలు. ఇది నాకు తగిలిన గాయం కాదు. రఘుకు తగిలింది. అతని క్షేమం కోరితే అందరూ ప్రశాంతంగా వెళ్ళిపోండి"

"అవును వెళ్ళిపోండి" అన్నాడు నాగేశ్ తలవంచుకొని.

"వెళ్ళిపోండి" అని కేకవేశాడు భీముడు.

"ఊఁ. పోండి" అన్నాడు రావుడు.

జనం మంచులా కరిగిపోయింది.

పైపంచె చించి జానకికి కట్టుకట్టాడు భీముడు.

మేడమీదనుంచి ఇదంతా చూస్తున్న రుక్మిణి నిట్టూర్చి మేడమెట్లు దిగింది.

వీరయ్యగారు ఆ ఉదయం జిల్లా కేంద్రానికి వెళ్ళారు. రఘు ఉండవలసిన స్థలాలన్నీ గాలించారు. ఎక్కడా కనిపించలేదు. వారి గుండె దడదడలాడింది. మొహతమీమ్ ఇంటికి వెళ్ళారు. మొహతమీమ్ వారిని ఇంట్లోకే రానివ్వలేదు. మిగతా ప్రయత్నాలన్నీ విఫలం కావడంతో నాయకుల దగ్గరికి పరిగెత్తారు. ఆ వార్త విని నాయకులు చకితులైనారు. ఎంత ఘోరం! అసలు ఏం చేశారో రఘును! వారిలో ఆతురత, సంచలనం భయలుదేరింది. జిల్లా కేంద్రం మొత్తం కదిలింది.

కలకలం చెలరేగింది. ఈ దెబ్బతో ఏదో ఒకటి సాధించాలనుకున్నారు నాయకులు. ప్రభుత్వాన్ని హడలగొట్టా లనుకున్నారు.

ముసల్మానులలోవున్న చీలికలను కప్పిపుచ్చడానికి హిందువులను బలి ఇస్తున్నారన్నది ఒక పక్షం. ఇది చాలా అన్యాయమనీ దీన్నిగురించి ప్రభుత్వం గట్టి చర్య తీసుకోవాలని తీర్మానించింది ఒక పక్షం. జాగీర్దార్ల దౌర్జన్యాలూ, అక్రమాలూ మితిమీరి పోతున్నాయనీ, జాగీర్లు వశపరచుకోవాలనీ ప్రభుత్వానికి విన్నవించింది ఒక పక్షం. మొత్తం మీద ఒక దుమారం లేచింది. టెలిగ్రాములు, అర్జీలు అందాయి ప్రభుత్వానికి.

హైదరాబాదులో కూడా సంచలనం బయలుదేరింది. రాజకీయ పక్షాలన్నీ కదిలాయి. విషయం బాబెహుకుమత్ దాకా పోయింది. ఈ చిన్న విషయం చిలికి చిలికి గాలివాన అవుతుందని భయపడ్డది మంత్రిమండలి. జాగీర్దారును మందలించింది. గుర్రప్పందాలకు బొంబాయి వెళుతున్న జాగీర్దారు తాసిల్దారును గట్టిగా మందలిస్తూ ఒక ఉత్తరం రాసి వెళ్ళిపోయాడు.

బాబెహుకూమత్ (మంత్రి మండలి) సదర్‌నాజిమ్ పోలిస్ (ఐ.జి.పి.)కు విచారణ జరుపాల్సిందని ఉత్తరువు జారీచేస్తూ జాగీరు అధికార్లో అనవసరమ్ ఐన జోక్యం వరకూ పోకుండా విచారణ జరపాలని ఆదేశించారు. సదర్‌నాజిమ్ జిల్లా కేంద్రంలో దిగేవరకు మొహతమీమ్ ప్రాణాలు పైపైనే పోయాయి. నాజిమ్ మొహతమీమ్‌ను పిలిపించాడు. అనేక ప్రశ్నలు వేశాడు. నానా చివాట్లు పెట్టాడు. తల వంచుకొని అన్నీ విన్నాడు. వచ్చేశాడు. జిల్లా న్యాయాధికారి రఘును కోర్టులో ప్రవేశ పెట్టవలసిందని ఉత్తరువు జారీచేశాడు.

ఉత్తరువు చూశాడు మొహతమీమ్. నాజిమ్ చీవాట్లు తలచుకున్నాడు. పత్రికలలో వార్తలు జ్ఞాపకం వచ్చేయి. తల గిరగిరా తిరిగిపోయింది. కండ్లు చీకట్లు కమ్మాయి. కాళ్ళకింద భూమి జారిపోతున్నట్లనిపించింది. రఘు గుర్తుకు వచ్చాడు. సౌమ్యమూర్తి! ఎంత మంచివాడు. ఎంత హింసించాడు తాను! తన కోసం! తాసిల్దారు కోసం! డబ్బుకోసం. క్షణిక సౌఖ్యంకోసం. అతనిమీద లేనిపోని ఆరోపణలు వేశాడు! ఎన్ని బాధలు పెట్టాడు! ఎంత పాపం చేశాడు తాను! అల్లా తనను శిక్షించకపోడు. శిక్షించాల్సిందే దాన్ని తప్పుకోడానికి వీల్లేదు. ఒక దేవ దూతను బాధపెట్టాడు తాను. తనకు ముక్తిలేదు, ఏం చేయాలి? ఆలోచన! ఆవేదన! బాధ! దుఃఖం! అమాంతంగా వచ్చిన ఆలోచన! రఘును క్షమాభిక్ష కోరాలి. అతడు తనను క్షమించాలి. అంతే తనకు కావలసింది. ఈ అధికారం, ఈ దర్పం, ఈ గౌరవం ఏవీ అక్కరలేదు తనకు. వెంటనే ఆస్పత్రికి పరిగెత్తాడు.

ఆస్పత్రిలో మంచంమీదపడి ఉన్నాడు రఘు. బాగా నీరసించి పోయాడు. వంటినిండా దెబ్బల గుర్తులు, వళ్ళంతా కమిలిపోయింది. గోళ్ళలోంచి కారిన

రక్తం పేరుకుపోయింది. అప్పుడే స్పృహ వచ్చింది అతనికి. అయినా ముఖంలో స్థైర్యం ఉంది. సౌమ్యత ఉంది. అతన్ని చూచి అధికారి హృదయం ద్రవించింది, మంచంప్రక్కన కూర్చున్నాడు. తన తప్పులన్నీ ఒప్పుకున్నాడు. తాసిల్దారు మాట విని గడ్డి తిన్నానన్నాడు. తనను క్షమించవలసిందని వేడుకున్నాడు. తల్లిని చిన్నపిల్లవాడు బ్రతిమిలాడుతున్నట్లు బ్రతిమాలుకున్నాడు.

అతని గొంతు జీరపోయింది.

రఘు హృదయం పులకరించింది.

అతడు చిరునవ్వు నవ్వాడు.

అది అనేక బాకుల రూపంలో అధికారి గుండెను చీల్చింది. రఘు తన మీద ప్రతీకారం తీసుకుంటా డనుకున్నాడు. తనను నాశనంచేసి విజయగర్వంతో నవ్వుతా డనుకున్నాడు. అలా జరగలేదు. ఆ చిరునవ్వులోని ప్రసన్నత అతన్ని కాల్చివేసింది.

"రఘు మహరాజ్! ఆప్ ఇన్సాన్ నహీ పరిష్తెహో! మీరు మానవులుకారు, దేవతలు! నా జిందగీలో ఇటువంటి మనిషిని చూడలేదు. అల్లా దయ ఉన్నది. నువ్వు బాగైనవు. నేను సైతాన్ను మారాజ్ సైతాన్ను. ముఝే మాఫ్ నహీం కర్నా. నన్ను క్షమించవద్దు, రఘూ, క్షమించవద్దు. సజా*దో రఘూ సజాదో, కోర్టులో ఉన్నది ఉన్నట్లు చెప్పు. చేసింది అనుభవిస్త. చెప్పు రఘూ! చెప్పు."

అధికారి పోలీసు అధికారి. భారీ మనిషి, డ్రెస్సులో ఉన్నాడు. కళ్ళవెంట దారాపాతంగా కన్నీరు ప్రవహిస్తూంది. రఘు గుండె ద్రవించింది. కళ్ళు చెమ్మగిల్లాయి. రాక్షసునిలో ఒక మనిషి ఉంటాడు అనుకున్నాడు.

జనం వస్తున్న అలికిడి వినిపిస్తే జేబురుమాలుతో కళ్ళు తుడుచుకొని రఘు కాళ్ళకు చేతులానించి వెళ్ళిపోయాడు అధికారి.

రఘు ఒడలు పులకించింది.

వచ్చింది వీరయ్యగారు ఒక్కరేకాదు, రాజకీయ రంగం సాంతం కదలి వచ్చింది. రఘును చూచి వీరయ్యగారి గుండె చెరువైంది. దుఃఖం గొంతుదాకా వచ్చింది. ముఖం మళ్ళించుకొని దూరంగా వెళ్ళిపోయారు. రఘు గ్రహించాడు కళ్ళు తుడుచుకున్నాడు.

వచ్చిన నాయకులు రఘూను పరామర్శించారు. సానుభూతి వ్యక్తపరచారు. సానుతాపం వెల్లడించారు. అనేక సలహాలిచ్చారు, అదను దొరికింది అణచివేయాలన్నారు. పోలీసువారి దుర్మార్గాన్ని బట్టబయలు చేయాలన్నారు. అన్నివిధాలా సహాయం చేస్తామన్నారు.

---

* శిక్షించు.

రఘు మౌనం వహించాడు.

పెదవి కదలించలేదు.

ఇంతలో పోలీసు సదర్ నాజిమ్ వచ్చాడు. నైజాంలో నాజిమ్ రావడం మామూలు కాదు. అందులోనూ ఆస్పత్రికి ! నాయకులంతా మంచం చుట్టూ చేరారు. నాజిమ్ మంచం పక్కన కూర్చున్నాడు. అతడు ఎన్నో ప్రశ్నలడిగాడు. అన్నింటికి తనకు తెలియదనే సమాధానం చెప్పాడు రఘు. నాయకుల గుండెలు మండాయి. నాజిమ్‌కు ఆశ్చర్యం కలిగింది. కాస్త గట్టిగా అడిగాడు.

వ్యక్తి మీద నాకు ద్వేషం లేదు. వ్యవస్థ అతణ్ణి దుష్టుణ్ణి చేస్తున్నది. పరిస్థితుల ప్రభావంవల్ల అలాంటి వ్యవస్థలోని ఒక భాగం నన్ను హింసించింది. వ్యక్తిగా అతడు పశ్చాత్తాపపడ్డాడు. శాసనం పశ్చాత్తాపాన్ని ఎరుగదు. మనిషిగా నేను దాన్ని గుర్తించకుండా ఉండలేను. ఇంతకు మించి నేనేమీ చెప్పదలచలేదు." అని ఉర్దూలో చెప్పాడు రఘు.

రఘులోని క్షమాశక్తి, అతని ధ్వనిలోని నిశ్చలత్వం నాజిమ్ హృదయాన్ని స్పందింపజేశాయి. "రఘు సాబ్ ఆప్ ఆద్మీ నహీఫరిశ్తే హో" అని సలామ్ చేసి వెళ్ళిపోయాడు.

రఘు నిర్ణయం ఎవరికీ నచ్చలేదు, జానకికి తప్ప. అక్కడ చేరిన నాయకులకు ముందు దిగ్భ్రాంతి కలిగింది. తరువాత మండిపోయింది. రఘును తలా ఒక రీతిగా అన్నారు. కొందరు చీవాట్లు పెట్టారు. కొందరు తిట్టారు. కొందరు బెదరించారు. వీరయ్యగారు బాధపడ్డారు. నాగేశ్ ఒక మూలన నుంచోని కుమిలిపోయాడు.

నిమిషంలో ఈ వార్త జనంలో పాకింది. వారికి ఏమీ అర్థంకాలేదు. కాని రఘు విషయంలో అపారం అయిన గౌరవం ఏర్పడింది. ఆస్పత్రికి ఒక జాతర సాగింది. అక్కడ జనం వత్తిడి పెరిగింది. రఘుకు విశ్రాంతి లేకుండా అయింది. పూలదండలు, పండ్లరాసులు సర్దలేక సతమతం అవుతూంది జానకి.

మన దేశంలో మనిషి ఇట్టే దేవుడై పోతాడు !

పత్రికలు రఘు పటాల సహితంగా వార్తలు ప్రకటించాయి. ఉన్నవీ లేనివీ రాశాయి. రఘు ప్రభావాన్ని పెంచేశాయి. జాగీరు జనం అవిచూచి పొంగి పోయారు. రఘు తమ పాలిట రాముడనుకున్నారు. జానకిని సీత క్రింద జమ కట్టారు. జాగీరు సాంతం కదిలింది. జిల్లా కేంద్రానికి తరలింది. ఆస్పత్రిలోనే బసచేసింది.

వారంరోజులకుగాని రఘు మనిషి కాలేదు. జాగీరుకు బయలుదేరాడు. స్టేషనులో జనం కిటకిటలాడింది. రఘుకు వీడ్కోలు చెప్పడానికి కూడింది. రఘు రైలు పెట్టెలో కూర్చున్నాడు. మొహతమీమ్ పరుగెత్తుకొని వచ్చాడు. రఘును వెతుక్కుంటూ పెట్టెదగ్గరికి చేరాడు. అతడు మామూలు దుస్తుల్లో ఉన్నాడు. రఘుకు నమస్కరించాడు. తాను పదవికి రాజీనామా చేశానని చెప్పాడు. రఘు

ముఖం అమాంతంగా వెలిగింది. మాజీ మొహతమీమ్ చేయి అందుకున్నాడు. చేయి కలిపి ఊపుతుండగా రైలు కదిలింది. చేతులు విడిపోయాయి.

మాజీ మొహతమీమ్ సజలనయనాలతో కనిపించినంతసేపూ బండిని చూశాడు.

బండి జాగీపు స్టేషనుకు చేరింది. ప్లాటుఫారం జనంతో నిండిపోయింది. ఇసుక వేస్తే రాలకుండా ఉంది. బండి ఆగడంతో జయ జయ ధ్వానాలు లేచాయి. వాటితో దిక్కులు పిక్కటిల్లాయి. తాసిల్దారు గుండెలో చిల్లులు పడ్డాయి.

భీముడు రఘూను భుజాలమీద ఎత్తుకున్నాడు. వీరంగం వేస్తూ ఆటలాడాడు. హరిజనులు డప్పులు మ్రోగించారు. ఊరేగింపు సాగింది. స్టేషన్ మాస్టర్ రఘును అభినందించాడు. కిరోడ్గిరీ జవాను సలామ్ చేశాడు. వీధులగుండా సాగింది ఊరేగింపు. కొందరు రఘుకు పూలదండలు వేశారు. కొందరు హారతులిచ్చారు. కొందరు ముఖాన కుంకుమ దిద్దారు. అంతా అతనిని ఆశీర్వదించారు. అందరి ఆశీస్సులూ అందుకున్నాడతను.

ఊరేగింపు పిరద్యూగారింటికి చేరింది.

ఊరేగింపులు తీయడం ఈ రాజ్యంలో నిషేధం. అయినా దాన్ని అడ్డుకునే ధైర్యం ఎవరికీ లేకపోయింది.

సయ్యద్ జమాల్ అమీను కుటుంబ సహితంగా పలాయనం చిత్తగించాడని ప్రజలు రఘుకు తెలియజేశారు. ఒక పీడ విరగడైపోయినందుకు సంతోషించారు జనం.

ఆ సాయంకాలం గుడికి వెళ్ళాడు నాగేశ్. మున్సిఫ్ హత్య జరిగిన్నాటి నుంచీ అక్కడికి వెళ్ళలేదతను. మసక చీకట్లో రుక్మిణిని కలుసుకున్నాడు. రుక్మిణి ప్రసాదం పెట్టింది. గళాల్ని నోట్లో వేసుకుని చాలా బాగుందన్నాడు.

"కండ్ల కద్దుకొమ్మంటే అద్దుకోవులే" అన్నది రుక్మిణి.

"నిన్ను అద్దుకొమ్మంటే అద్దుకుంట."

"చీ. పో ఎప్పుడు కొంటెమాటలే" అని విదిలించింది.

ఇద్దరూ మంటపంలో కూర్చున్నారు. పక్కన పళ్ళెంలో ప్రమిద మండుతూంది.

"ఎందుకు మనను చూసి ఇట్ల మండుతది" అని చేతితో దాన్ని ఆర్పేశాడు నాగేశ్.

రుక్మిణి దూరంగా జరిగి "ప్రసాదం యాడిదో ఎరికేనా ?" అని అడిగింది.

"యాడిదైతే నా కెందుకు ? నువ్వు పెట్టినవని తిన్న."

"అట్లకాదు రఘు వచ్చిండని కొబ్బరికాయ కొట్టిన."

కళ్ళు పెద్దవి చేసుకొని జవాబుకోసం నాగేశ్‌ను చూడసాగింది. ఆశించిన ఉత్సాహం కనిపించలేదు నాగేశ్‌లో.

"నేను పొయ్యొస్తే ఇట్లనే కొడ్తావా !"

రుక్మిణి గుండెల్లో పిడుగుల వాన కురిసింది. "నువ్వెందుకు పోతవ్ ?"

"రుక్మిణీ ! నువ్వు పిచ్చిదానివి. గఘు కాబట్టి పోయిమళ్ళీ వచ్చిందు. నేను పోవటమే మళ్ళ రావటం ఉండదు. అప్పుడు నువ్వు...."

నోరు మూసేసింది రుక్మిణి. "అట్లనకు" గొంతు జీరపోయింది. "నేను సావిత్రిని నువ్వు యాడికి పోయినా తీసుకొస్త".

నాగేశ్ ఆశ్చర్యపోయాడు. ఆవిడ దగ్గరికి జరిగాడు. ఆవిడ దూరం జరిగింది. అతడు ఇంకా జరిగాడు. ఆవిడ లేచి నుంచుంది. అతడు నుంచున్నాడు.

ఒకరి ఎదురుగా ఒకరు.

క్షణం గడిచింది.

"రుక్మిణి, నేనూ పోతాను. అందుకు సిద్ధంగా ఉండు" అన్నాడు.

ఆవిడ కన్నీరు రాల్చింది.

గిరక్కున వెనుకకు తిరిగి వెళ్ళిపోయింది.

చూస్తూ ఉండిపోయాడతను ఒక్క క్షణం.

పక్కకు చూస్తే పళ్ళెం కనిపించింది.

"రుక్మిణీ !" అతడు పిలిచాడు.

ఆమె వెనక్కు తిరిగి చూసింది.

కళ్ళలో ఇంకా నీరుంది.

అతడు ముందుకు నడిచి పళ్ళెం అందించాడు.

ఆమె అందుకుంది.

వెళ్ళిపోయింది.

**అ**డవిలో అందాలు పూశాయి. అది పూలు తురుముకుంది. అలంకరించుకుంది. సింగారించుకుంది. పూలతో మండించి. పూలతో నిండింది. ప్రతి చెట్టు, ప్రతి పుట్ట, ప్రతి గుట్ట పూసింది. పూతతో అడవి పూలగోడగా తోచింది. చెట్లు, ఒకటా రెండా ! వందలు, వేలు, లక్షలు, పూశాయి. దాచుకుంటాయా చెట్లు ? రాల్చసాగాయి. దారంలేని దండలు కట్టసాగాయి. రాలిన పూలు రంగవల్లులైనాయి. రాళ్ళమీద బండలమీదా ముగ్గులు తీర్చాయి.

గాలి, మెల్లని గాలి, కమ్మనిగాలి ఊపుతూంది చెట్లను, ఊయల లూగుతున్నాయి చెట్లు. ఆడుతున్నాయి చెట్లు. పూలచెట్లు తలలు ఊపుతున్నాయి తలిరుబోళ్ళను మించుతున్నాయి సోయగాలు ఒలికిస్తున్నాయి. నృత్యం చేస్తున్నాయి. నాట్యం చేస్తున్నాయి. గండు తుమ్మెదలు గుంపులుగా పాడుతున్నాయి. వెదుళ్ళకు

రంధ్రాలు చేస్తున్నాయి. వేణువులుగా మారుస్తున్నాయి. పిల్లగాలి వాటిలోకి దూరుతుంది. వేణుగానం ఆలపిస్తుంది. కోకిలమ్మలు ఊరుకోగలవా ? అవీ పాడుతున్నాయి. కుహూ కుహూ అని రాగాలు ఆలపిస్తున్నాయి.

అడవి అందాలు చిమ్ముతూంది. విందులు కుడుపుతూంది. కోయదొరల, దొరసానుల గుండెల్లో కోట్ల వసంతాలు మొలిచాయి. వారికిప్పుడు పనిలేదు. వసంతపు సంతలను పోచుకోవడమే పని. ఇప్పచెట్లు విరగపూసాయి. రాలిన పూల రాసులు గంపలకు ఎత్తడం, తేవడం, సారాయి కాచడం, అదేపని. ఇప్ప సారాయి తాగపనిలేదు. ఇప్పచెట్లు కిందవుంటే చాలు మత్తు వచ్చేస్తుంది. కోయలది ఆ ఉన్మత్త జగత్తు. ఇక వారి జీవితమే మత్తు.

ఆ మత్తులో సింగి గుర్తుకు వచ్చింది సంగన్నకు. అడవిలో నిప్పు లుమిసే మోదుగు చెట్టుకింద, బండమీద, కొలని ప్రక్క కూర్చున్నాడు. సింగి కావాలనుకున్నాడు. కిందిగూడెం పోదామనుకున్నాడు. కిందిగూడెం పోతాడు. సింగి కనిపిస్తుంది. తనను చూస్తుంది. కిలకిలా నవ్వుతుంది. తనతో తిరుగుతుంది. చుక్కలను చూపుతుంది. లెక్క పెట్టమంటుంది. తనను మండిస్తుంది. తరవాత....? తరవాత అంతా శూన్యం. ఆ శూన్యాన్ని సింగితో నింపాలనుకున్నాడు. సింగిని తెచ్చుకోవాలనుకున్నాడు. నిశ్చయించుకున్నాడు. ఈ వసంతం వట్టిపోరాదనుకున్నాడు. బయలుదేరాడు గూడేనికి. చేరుకున్నాడు గూడెం. అయ్యతో చెప్పాడు. సింగిని తెచ్చుకుంటానన్నాడు. సమ్మయ్య కేమీ ఆశ్చర్యం కలుగలేదు. కలగాల్సిన పనీలేదు. పరువం వచ్చింది. పడుచువాడు పడుచుదాన్ని తెచ్చుకుంటా నంటున్నాడు. అది సాధారణం. అతిసాధారణం. మగపిట్ట ఆడపిట్టను వెతుక్కుంటూపోయింది. చూచింది. వలచింది. తెచ్చుకుంటానంటూంది. వింత ఏం ? కోయ దొరలూ పక్షులే. వారికి మతాల్లేవు. కులాల్లేవు. గోత్రాలులేవు. కలవాడు లేడు. లేనివాడు లేడు. అంతా మనుషులే. అంతా దొరలే. అంతా కోయలే. ఏ పడుచునైనా లాక్కురావచ్చు. ఏ పడుచువాడైనా అక్కడ నిర్బంధంలేదు. బంధంలేదు. అడ్డులేదు. గోడలు లేనేలేవు. కాని బలం కావాలి. పిల్లని గెలిచి తెచ్చుకోవాలి. అందును గురించే ఆలోచించాడు సమ్మయ్య. కిందిగూడెంమీద విరుచుకు పడాలి. గెలవాలి. సింగిని తేవాలి. ఓడితే సింగి దక్కదు. ఓడరాదు. సింగిని తేవాలి. సింగన్నకు కట్టాలి. కోడలు రావాలి. ఆడది రావాలె ఇంటికి, ఎన్నాళ్ళు పెరుగుతాడు బుడుతడు ఆయమ్మ దగ్గర, కోడలే పెంచుతుంది. కొంప బాగుచేస్తుంది. ఇలాంటివే మరెన్నో ఆలోచనలు వచ్చాయి. కాని చిన్నవాడు. చిన్నయ్య మనసులో మెదిలాడు. చుట్ట చుట్టుకున్నాడు. కాల్చుకున్నాడు. లేచాడు. చిన్నయ్య పెరుగుతున్న ఇంటికి వెళ్ళాడు. పాకుతూ వచ్చాడు చిన్నయ్య. మీద పడ్డాడు. ఎత్తుకున్నాడు. ముద్దులు కురిపించాడు. ఆయమ్మకు చెప్పాడు – కొడుకు కోడలును తెచ్చుకుంటానన్నాడని. ఆయమ్మ మురిసిపోయింది. వచ్చేది సింగన్నకు పెళ్ళామే కాదు గూడేనికి కోడలు !

ఆ మాట ఆ నోటా ఈ నోటా గూడెమంతా పాకింది. ఆ రాత్రి గూడెం సొంతం సమ్మయ్య ఇంట్లో చేరింది. సింగిని గురించి చర్చ సాగింది. సింగన్నను గురించి మాటలు సాగేయి. ఆమోదం తెలిపారంతా. చెట్లు తలలూపాయి. చుక్కలు మిలమిలా మెరిశాయి. ఇంకేం! ఆనందం! ఇక ఆనందం చిందులు తొక్కాలి. సమ్మయ్య గూడేనికి విందు చేయాలి. చేయాలి చేయకుంటే ఎలా? రేపు గూడె మంతా అతనితో కదలాలి. కింద గూడేన్ని గెలవాలి. సమ్మయ్య ఇంట్లోంచి సారాయి వచ్చింది. కోళ్ళు తెగాయి. వెదురు ఓయ్యం ఉడికాయి.

"సింగేమో సింగన్నకు నచ్చింది,

ఊరికో కోడలమ్మ వస్తుంది"

పాటలు, పకపకలు, వికవికలు, ఎన్నో, ఎందరో, ఏమో? ఏమో? అదొక పర్వం. అదొక పండుగ. అదొక ఉత్సవం. మనసులు నిండేయి. మనుషులు పొంగారు. అడుగులుపడ్డాయి. అడుగులు కలిశాయి. ఆటలు సాగేయి. జంటగా ఎగిరారు. ఒంటరిగా ఎగిరారు. మూకగా ఎగిరారు. మూగగా ఎగిరారు. వారిని చూచింది. అగ్గి కళ్ళల్లో నిప్పులు పోసుకుంది. భగ భగా మండింది. వెలుగులు చీకట్లు. చీకట్లు వెలుగులు. వేసటలేని ఆట. బాసట లేని పాట. చూచీ చూచీ కళ్ళు మూసుకున్నాయి చుక్కలు. చూడాలని ఆరాటపడి వచ్చాడు సూర్యుడు. పాపం చూడలేకపోయాడు. ఆట నిలిచింది. పాట నిలిచింది. మూక చెదిరింది. గూళ్ళకు చేరింది. కాని రాగాలు ఇంకా వినిపిస్తూనే ఉన్నాయి మత్తులో. మనసులో ఆటలు ఇంకా సాగుతూనే ఉన్నాయి.

గూడెం మత్తులో ఉంది.

జనం నిద్రలో ఉంది.

అంతా చుప్ చాప్, నిశ్శబ్దం. ఎక్కడా అలికిడి లేదు, ఎక్కడా కదలికలేదు. గాలి సవ్వడి తప్ప శబ్దంలేదు. గువ్వల అరుపులు తప్ప మాటలేదు.

ఎంతసేపా నిద్ర? ఎంతసేపా మత్తు? అడవి బిడ్డ ఆదమరచి నిద్రపోడు. అనుక్షణం అప్రమత్తుడుగానే ఉంటాడు. అది అడవి, ఏక్షణం, ఏమికానుందో! ఏది రానుందో! ఏమి ఎరుక? ఎవరికెరుక? కర్తవ్యం మరువడు కోయ. తెలుసు తాను ఎప్పుడు లేవాలో. అందుకే లేచింది గూడెం. కలకలం లేచింది. అందరూ కదిలారు. బల్లేలూ బరిశెలు కర్రలు తుపాకులతో కదిలింది గూడెం దండయాత్రకు — కాదు కాదు — ప్రేమయాత్రకు.

కోయల కాళ్ళకు రెక్కలు వచ్చాయి. వారు కింది గూడెపు అడవిలో వాలారు. చెట్లు చాటున, పొదల చాటున నక్కారు. అంతా గప్ చుప్. ఎక్కడా సవ్వడిలేదు. ఒక్క మాటలేదు. ఒక్క పలుకులేదు. పొంచిపట్టాలి పిట్టను. అది వారికి తెలుసు. అందుకే నిశ్శబ్దం. సమ్మయ్య కర్ర అక్కడే వేసి కదిలాడు. పిల్లను తేవడానికి పోతున్నాడు. సాయుధుడుగా పోరాదు. నిరాయుధుడుగానే వెళ్ళాలి. సమ్మయ్య పిల్లి

అడుగులు వేస్తూ దూరాడు గూడెంలో. తరువాత ఒక గుడిసెలో దూరాడు. అది ఒక ముసలవ్వ గుడిసె-గూడు. సమ్మయ్యను చూచి చకితురాలైంది ఆమె. ఆమె కడువృద్ధు. వెంట్రుకలు వెండి దారాలు. ముఖాన ముసలితనంతో వచ్చిన ముడుతలు. ఎక్కడో లోతున ఉన్న కళ్ళు "ఏమొ వచ్చినవు ?" అడిగిందామె.

"పెట్ట కోసం"

"ఏ పెట్ట ?"

"సింగి"

"సింగన్న కోసమా ?"

"ఆవు"

ఆమె కళ్ళు వెలిగాయి. ముడతలు పడిన ముఖంలో సైతం ఆనందం కనిపించింది. ఎన్ని జ్ఞాపకాలు ముసలాయో ఆమె మనసులో? ఎందరికి దాంపత్యాలు కూర్చిందో? ఎందరెలా వచ్చారో? ఎందరికి అప్పగించిందో పిల్లలను. ఇది మరొక అవకాశం. మంచిపని, మనసులను కూర్చేపని, అందుకే ఆమెకు ఆనందం, అందుకే ఆమె కళ్ళు వెలిగాయి.

"చూచుకున్నారా?"

"చూచుకున్నరు"

"వస్తదా? పట్టుక రావల్నా!"

"వస్తది"

"మంది బాగ వచ్చిన్రా."

"వచ్చినరు"

"సరైతే" అని చేయివాచింది.

సమ్మయ్య సంతోషించాడు. సగం పని ముగిసింది. పిల్లను అడవి వైపు లేవడమే కష్టం. తరువాత పని అంతా సుళువే. అందుకు అంగీకరించింది ముసలవ్వ. మొలలోంచి రూపాయి తీసి ముసలవ్వ చేతిలో వేశాడు. అది ఊరబొట్టు ముసలవ్వ నవ్వింది. లేచింది. జాగ్రత్తగా ఉండమని చెప్పి కదిలింది.

ముసలవ్వ గూడెంలోకి, సమ్మయ్య అడవిలోకి వెళ్ళిపోయారు. ముసలవ్వ సింగిని వెదకుతూ బయలుదేరింది, ఒక గుడిసెలో పట్టుకుంది. పిలిచింది. చెప్పింది. "సింగన్న వచ్చిండు వస్తవా?" -సింగి గుండె దడదడ లాడింది. గుబ గుబ లాడింది. ఒక కాలు ముందుకు లాగుతుంటే ఒక కాలు వెనక్కు లాగింది. ఒకవైపు తన సింగన్న - రెండవ వైపు తలిదండ్రులు. ఒక్కసారి తనబాల్యం, తాను తిరిగిన ప్రదేశాలూ, ఎక్కిన చెట్లు, ఆడుకున్న అమ్మాయిలు మనసులో మసలారు. క్షణంలో అంతా-మాయం అయినారు. సింగన్న ఆమె గుండెలో నిండిపోయాడు. అచే పడింది అడుగు. అనుసరించింది ముసలవ్వను.

అడుగు తడబడింది.

అయినా వేగంగా సాగింది.

సింగిని చూచాడు ఒక కోయ గూడెపు కోయ. "పెట్ట వచ్చింది" అని కేక పెట్టాడు. అదే కేక అందరి నోళ్ళల్లోంచి వెళ్ళింది.

"పెట్ట వచ్చింది."

"ఒహోయ్ ఒహో"

"ఒహోయ్ ఒహో"

క్షణంలో కేకలు కేరింతలు. నక్కిన జనం అంతా బయట పడ్డారు. అరుపులు పెడబొబ్బలు, కలవరం, కల్లోలం. దాడి సాగింది. ఎవరి మీదికి? సింగి మీదికి. బెదిరిన లేడిలా పరిగెత్తింది. పరిగెత్తానని కాదు. అదొక లాంఛనం. ఆమె పరిగెత్తాలి. వెంబడించాడు సింగన్న. ఇక్కడ అరపులు, కేకలు, పెడబొబ్బలు. అడవి అదిరిపోతూంది.

ముందు సింగి.

వెనుక సింగన్న.

సింగన్న సింగిని పట్టుకున్నాడు. భుజంమీద వేసుకున్నాడు.

"ఒహోయ్ ఒహోయ్, హోయ్ హోయ్"

"ఒహోయ్ ఒహోయ్ హోయ్, హోయ్."

ఆ పదాలమధ్య, ఆ అరుపులమధ్య, సింగిని తీసుకొని అడవిలో దూరాడు. ఆమెను హరించాడు. గుండె ఎన్నడో దోచుకున్నాడు. ఇప్పుడు ఆమెను దోచుకున్నాడు.

ముసలవ్వ బోసినోటితో కిలకిలా నవ్వింది. గబగబా గూడెంలో దూరింది.

కోయగూడెం వారి కేకలు విన్నాడు కింది గూడెంవారు.

"ఒహ్హోహ్ ఓహ్. పెట్టపాయె. పాయె" అని ఉరికాడు ఒకడు కర్రతో. ఆ కేక ప్రతిధ్వనించింది. అందరి నోట వినిపించింది. కర్రలు బరిశెలు చేతబూని ఒకరివెంట ఒకడు – ఒకడు – ఇద్దరు, ముగ్గురు, పది, ఇరవై, గూడెం సాంతం ఉరికింది.

"ఏది పెట్ట యాడబోయె" అని కేకలు వేస్తూ కోయగూడెం వారి మీద విరుచుకు పడింది.

"పెట్ట యాడనే. పుంజెక్కపాయె" అని అరుస్తారు కోయగూడెం కోయలు.

కర్రలు కలిశాయి.

బరిశెలు లేచాయి.

బల్లాలు మెరిశాయి.

టక టక మని కొట్టుకున్నారు. నిన్నటిదాకా మిత్రులు. క్షణంలో శత్రువులై పోయారు. పోరుసాగింది. యుద్ధం సాగింది. సమరం సాగింది. జబ్బలు చరచారు.

దెబ్బలు కొట్టుకున్నారు. అంతా నటన. అంతా ఆట. అనాదిగా వస్తూందీ ఆచారం. అందుకోసం పాటించారు. ఎందుకు యుద్ధం. పిల్లాపాయె, పిల్లవాడూ పాయె. పిల్లవాడు వచ్చాడు. పిల్లను తన్నుకుపోయాడు. కావలసిందే జరిగింది. ఎవనికి ఎవతె పెళ్ళామో ఎక్కడో రాసిపెట్టి వుంది అంతే, ఆ మాటలతో రాజీ కుదిరింది. జగడం తెగింది. సమరం ముగిసింది. ఎక్కడి దొంగలక్కడ గప్‌చుప్ సాంబార్ బుడ్డి. ఎక్కడివారు అక్కడికి చేరారు.

క్రింది గూడెంలో ప్రశాంతత ఏర్పడింది.

సింగి వెళ్ళిపోయింది. ఏ నాటికైనా వెళ్ళిపోవాల్సిందే. అయినా క్రింది గూడెం చిన్నబోయింది. బోసిగా ఉంది. శూన్యంగా ఉంది. కోయగూడెం శూన్యాన్ని నింపుకుంది. పొంగిపోయింది. పగలబడి నవ్వింది. అవును వధువు వచ్చింది ఆ గూడేనికి. ఆనందపడితేనేం! ఆటలాడితేనేం?

సింగి గూడేనికి వచ్చింది. కోతలుగా వచ్చింది. సమ్మయ్య ఇంటికి వచ్చింది. అక్కడ ఆడదిక్కులేదు. అయితేనేం గూడెపు ఆడజనమంతా సమ్మయ్య ఇంటికి చేరారు. సింగికి తలంటి పోశారు. అలంకరణ చేశారు. సింగన్నకు అప్పగించారు, తప్పుకున్నారు.

ఎదిరి చూసింది ఆ రేయికోసమే సింగన్న. అది ఆలశ్యంగా వచ్చింది. దూరం నుంచి వచ్చింది. భారంగా వచ్చింది. అయినా వచ్చింది. అంతేచాలు అతనికి. అది తన గూడు. రేయి, ప్రశాంతత, ఏకాంతం. తాను, తన ముందు సింగి. ఇంకేం కావాలతనికి? అదే పదివేలు.

సింగి, తన సింగి మెరిసిపోతూంది. ఆ కండ్లు, అవి బుసలు కొడుతున్నాయి. తాను కాచేశాడు. సింగి తనలో ఉంది. ఒడిలో ఉంది. ఎదలో ఉంది. బాహు బంధంలో ఉంది. స్వర్గాలు దిగివచ్చాయి. నందనవనాలు వెలిశాయి. సాంతం వసంతం అక్కడే చేరింది.

రేయి గడచిపోతూంది. జారిపోతూంది. అతడు రేయిని బంధించాలనుకున్నాడు. సూర్యుని శిక్షించాలనుకున్నాడు. ఆ రేయి. తనరేయి అలాగే వుండాలనుకున్నాడు. అమాయకుడు! తమస్సును ఎవడు నిలిపాడు ? ఉషస్సును ఎవడు ఆపాడు?

తూర్పున మోదుగులు పూశాయి.

రాత్రి నిన్నటిరాత్రి అయింది. ఉదయం ఉరికి వచ్చింది. జంటగా జంటగా బయలుదేరారు సింగి సింగన్న అడవికి. అందంలోనికి ఆనందంలోనికి. ఒక చెట్టు కింద కూర్చున్నారు. ముచ్చట్లాడారు. ఒక చెట్టు కింద మేను వాల్చారు. ఒక చెట్టు కాయలు తిన్నారు. ఒక గుంటలో నీరు త్రాగారు. తాము కూర్చుండిన బండలు చూచారు. ఎక్కిన చెట్టును చూశారు. ఆడిన ముచ్చట్లు తలచుకున్నారు. వెమరు వేసుకున్నారు.

పగలుమాత్రం ఎంత సేపు! పచ్చిహూన పగడాలు పరచుకున్నాయి. జంట జతగా గూడెం చేరింది. సింగి వండింది. సింగన్న తిన్నాడు. రాత్రి గొంగళి పరచింది. అదిమాత్రం ఎంత సేపు? అది లేచిపోయింది. తెల్లవారింది. సూర్యుడు పాకుడు బండను పట్టుకుని పాకుతున్నాడు. కింద గూడెం గూడెం కోయగూడెం మీద విరుచుకుపడింది. ఈ తడవ యుద్ధానికి కాదు. సంప్రదింపులకు తెచ్చుకోడానికి సమరం. తీసికెళ్ళడానికి సంప్రదింపులు. రెండు గూడాలు కూడాయి. కూర్చున్నాయి. సమ్మయ్య ఇచ్చిన పొగాకుతో చుట్టలు చుట్టుకున్నారు. ధుమ ధుమ లాడుతూ కాల్చుకున్నారు. భుగ భుగ పొగలు వదిలారు. కలిసింది మాటలకే. అయినా కయ్యానికి దిగారు.

"ఏమో వచ్చినేమే" అడిగాడు సమ్మయ్య.

"ఏందే కత ఎరికెలేనట్లడుగుతవ్? పిల్లను పట్టుకొస్తివి. రాకుంట తప్పు తాదె. తోలుతీస్కపోత." సింగి తండ్రి బీరయ్య జవాబు.

"అగ్గొ ఎట్లంటవేమె. తెచ్చుకున్నోడు తోల్తాడే? యాజ్ఞన్నా ఉన్నదె. ఉన్న. కట్లబెట్టరాదె" కోయగూడెం వాడన్నాడు.

"ఏమున్నదని కట్లబెడ్తడే! పోరె బుక్కెడు తినాలెకాదె. గూట్లేమి లేదాయె. ఎట్ల కట్లబెడ్తడె" బీరయ్య తరపున కిందిగూడెం పలికింది.

సమ్మయ్య వక్క మండింది. "ఏందె కూస్తున్నవు? ఉన్నదేం కట్కపోతావె. నా కొడుకు కూటికి పేదైతే కులానికి పేదైతాడే? వాడికేమి కాలు కుంటను కుంటవ! కన్ను గుడ్డను కుంటవ? తుపాకి పట్టిండంటే పెద్దపులినేస్తడే పెద్దపులిని? తెచ్చుకున్నెన్క తోలెడ్డిలేదు. ఏం చేస్తవో చేసుకో"

ఈ మాటమీద ఉభయపక్షాలవారూ వాదించుకున్నారు. తిట్టుకున్నారు. కొట్టుకున్నారు. నానా రభస జరిగింది. వచ్చిన సింగిని లాక్కుపోయేదాకా వచ్చింది. పెద్దమనుషులూ—ఉభయపక్షాలవారూ— శాంతింపజేశారు. మాటలుసాగేయి. బేరాలు సాగేయి. జులా ఖర్చును గురించి ఒక నిర్ణయానికి వచ్చారు.

(ఈ 'జులా ఖర్చే'మిటో అర్థంకాలేదు. బాగా ఆలోచించిన మీదట ఇది బహుశః ఉర్దూ 'ఝూలా ఖర్చ్' అయ్యుంటుం దనుకుంటాను. ఝులా అంటే ఊయల. ఇంత కాలం పెంచినందుకు పిల్ల తల్లిదండ్రులకు ఇచ్చే ఖర్చై ఉండాలి అనుకున్నాను) ఒక మేకపోతు కొన్ని గింజలు ఇవ్వాలని తీర్మానించబడింది. అందుకు సంచకరిగా కొత్త గుడ్డలో మూడు రూపాయలు, పసుపు కొమ్ములు, కుంకుమ కట్టి అందించాడు సమ్మయ్య బీరయ్యకు.

బీరయ్య అందుకున్నాడు. కూతురును వెంటబెట్టుకున్నాడు. గూడెం వారి సహితంగా కిందిగూడెం చేరాడు.

కోయగూడెం రిత్తపోయింది. సింగన్న మనసు చిన్నబోయింది. వసంతం పూర్వంలాగే వుంది. కాని అతనికి కాస్తంత ఆనందం లేదు. తెచ్చుకోవాలనే మురిపం

ముగిసింది. కట్టుకోవాలనే ఆపుర్దా కనిపించింది. ఏర్పాట్లల్లో మునిగిపోయాడు. సాహూకారు దగ్గరికి వెళ్ళాడు. అప్పుడే నాగేశ్‌నూ, రఘూను కలుసుకున్నాడు. లగ్గానికి రావలసిందని పిలిచాడు. రాబోయే పంట తాకట్టు పెట్టిన డబ్బుతో కోయ గూడెం చేరాడు.

అప్పుడే సింగి పెళ్ళి వారం దాటింది. అది అంగారం అయిందతనికి అను కున్నట్లు మేకపోతును, గింజలూ పంపాడు కిందిగూడెం. తాము వచ్చేరోజు నిర్ణయం చేసి చెప్పి పంపాడుకూడా.

నిర్ణీత దినం రానేవచ్చింది. నాగేశ్ కూడా వచ్చాడు. రఘు రాలేక పోయినం దుకు విచారం వ్యక్తపరచాడు. అతని ఆరోగ్యం ఇంకా పూర్తిగా కోలుకోలేదు. కోయగూడెం కదిలింది. కిందిగూడెపు బాట పట్టింది సాగింది. చేరింది. అక్కడ వాళ్ళకు పసుపురాచి పెళ్ళికొడుకును చేశారు సింగన్నను. సింగిని పెళ్ళికూతురుని చేశారు. ఆ జంటను చూచి ఆనందించాడు నాగేశ్. అతనికి ఏవేవో జ్ఞాపకాలు వచ్చాయి.

ఆ నాడు విందులు సాగేయి. సారాయి కల్లు, మాంసం, జనం తమను తాము మరచారు, ఆడారు, ఎగిరారు, పాడారు, అరచారు, కేకలు పెట్టారు, పోట్లాడుకున్నారు, కలుసుకున్నారు, రాజీపడ్డారు.

అలా రెండు రోజులు గడిచాయి. రెండు గూడాలూ కలిసి కోయగూడెం వచ్చాయి. అక్కడ పెళ్ళి పెళ్ళంటే బాపడు రాడు. మంత్రాలు చదువడు. తలం బ్రాలు పోసుకోరు. తూమెడు గింజలు కుప్పలుపోశారు. దానిమీద వధూవరులను కూర్చోబెట్టారు. సమ్మయ్య వధువు తల్లికి చీర పెట్టాడు. పిల్ల మేనమామకు, తండ్రికి కండువాలు పెట్టాడు. బీరయ్య పెండ్లికొడుక్కి బట్టలు పెట్టాడు.

డోలువాడు డోలు వాయించాడు. వీరంగం వేశాడు. సింగన్న సింగికి మంగళసూత్రం కట్టాడు. వారు భార్యాభర్తలు అయిపోయారు. ఆనందంలో అంతా పప్పన్నం తిన్నారు. అంతే మాంసంలేదు. తాగుడు లేదు. తందనాలు లేవు.

కిందిగూడెంవారు వెళ్ళిపోయారు. కోయగూడెం పండుగ తరువాత పల్లె అయింది. తరవాత మామూలుగూడెం అయింది. మళ్ళీ మామూలే అడవులకు పోవడం కాయగసర్లు తెచ్చుకోవడం. సింగన్నకు చేతినిండా పనిదొరికింది. నాగేశ్ అక్కడే ఉండిపోయాడు కొన్నాళ్ళు. అక్కడి వాళ్ళకు ఏదేదో బోధించాడు. పొలాలు దున్నుకునేవాళ్ళవేననీ, శిస్తులు కట్టాల్సిన అవసరంలేదనీ, ప్రభుత్వం కోయలను దోచుకుంటూందనీ, భూములుకూడా లాక్కోవడానికి చూస్తుందనీ చెప్పాడు. నాగేశ్ చెప్పిన మాటలను కోయదొరలకు అర్థం అయ్యేటట్లు చెప్పేవాడు సింగన్న. వారు ఎన్నో కోయగూడాలు తిరిగారు. ఎక్కడో తినేవారు. ఎక్కడో పడుకునేవారు. అందులో ఏదో ఆనందం కనిపించింది సింగన్నకు. అతనిలో

ఉత్సాహం ఉరకలు వేసింది. పట్టుదల పెరిగింది. చదువు నేర్చుకున్నాడు. వీరుడైపోయాడు.

నాగేశ్ తుపాకి పేల్చడం నేర్చుకున్నాడు. సింగన్న దగ్గర బాగా గురిచూచి కొట్టడం వచ్చేసిందతనికి. అడవుల్లో వేటకూడా చేశాడు.

నెమలినే కొట్టాడు.

# 8

మృగశిరలో నాలుగు చినుకులు పడ్డాయి. ఇంట్లో గింజలు మంట్లో పోసుకుని కూర్చున్నాడు రైతు. అతడు అందరికీ అన్నం పెట్టాడు. అన్నదాత-మనుషులకే కాదు, పశుపక్ష్యాదులకు—దేవతలగ్గూడా. అయినా అందరు మింత్రలే అతనికి—కింద సర్కారు పైన వానదేవుడు. వ్యవసాయం జూదంలాంటిది. వస్తుంద్హా బాగానే వస్తుంది. పోతుందా ఉన్నది ఊడ్చుకు పోతుంది. రెండవదశ వచ్చింది. ఇక్కడి రైతుకు— ఆ సంవత్సరం వానదేవుడు కరుణించలేదు. చెరువులతోపాటు రైతుల గుండెలు బీటలు వారేయి.

ఆకాశంలో మబ్బులు బాగానే వస్తున్నాయి. మేఘాడంబరం అధికంగావే ఉంది. రైతులు ఆ మబ్బులను చూస్తున్నారు. గుంపులు గుంపులుగా బయటికి వచ్చి ప్రార్థిస్తున్నారు. అయినా కరుణించడంలేదు వానదేవుడు. ఒక్క చినుకు పడడంలేదు. పెనుగాలి వీస్తూంది. మబ్బులు విడిపోతున్నాయి.

శ్రావణంకూడా వచ్చింది. అదీ గడిచిపోతున్నది. చినుకులేదు. పంటలకుకాదు తాగేందుకు నీరు లేనిదశ వచ్చింది. బావులు ఎండిపోతున్నాయి. ఎండలు వైశాఖాన్ని మించాయి. విపరీతంగా గాలులు వీస్తున్నాయి. ఎక్కడ చూసినా సుడిగాలులు. దుమ్ముకు సుళ్ళు చుట్టి ఆకాశానికి తీసుకుపోతున్నాయి.

పంట పండినంత కాలం బ్లాక్ మార్కెట్లు అనే పదం ఎవరికీ తెలియదు. బజారు సాంతం నల్లబడిపోయింది. ఎక్కడా గింజలేదు. ఉన్నా రైతులకు కూలీలకూ అందుబాటులో లేదు. మొత్తం దేశంలో ఒక భీతావహం వ్యాపించింది. అందరి కళ్ళల్లో ఆకలి బుసలు కొట్టసాగింది. ఆకలి, ఆకలి, దాహం, దాహం ఎక్కడా గింజ లేదు, ఎక్కడా నీరు లేదు.

రఘు, నాగేశ్ నల్లబజారువాళ్ళమీద దాడి సాగించారు. చౌకదుకాణాల ద్వార వచ్చిన గింజలు సాహుకార్లు కాజేయకుండా చూశారు. గింజలు కోసం చీట్లు జారీ చేయించారు. భీముడు, రావణుడు నల్లబజార్ల వాళ్ళ పాలిట యములైనారు. వాళ్ళు దుకాణాలకు కాపలా కాయడం సాగించారు. కొంత గుడ్డిలో మెల్లగా ఉన్నమాట నిజమే. కాని డబ్బేది కొనుక్కోవడానికి?

గిర్దావరుకు అవకాశం దొరికింది. అంతా నాస్తికులు అవుతున్నారు కాబట్టి వానలు పడలేదన్నాడు. తాతల నాటినుంచి లేని పత్రిక ఊళ్ళోకివస్తే వానలెలా పడ్తాయి? అని అడిగాడు. మాల మాదుగులు ఇండ్లలోకి వస్తున్నారు. కలి పెరిగింది. ఈ ప్రచారం ముమ్మరంగా సాగించాడు. రఘు, నాగేశ్ లే ఇందుకు కారణం అన్నాడు. సాహుకార్లు అతనికి వంతపాడేరు. దేవునికి కోపం వచ్చింది. అతణ్ణి ప్రసన్నుణ్ణి చేయాలన్నాడు.

వానదేవుణ్ణి ప్రసన్నుణ్ణి చేసుకునే ప్రయత్నాలు సాగేయి. పిల్లలు తడిబట్టలతో బయలుదేరారు. కర్రకు ఒక కప్పను కట్టి ఇంటింటికీ తిరిగారు. "కప్పతల్లి నీళ్ళాడే, కడవనిండా నీళ్ళాయె, పాముతల్లి నీళ్ళాడె పటువనిండ నీళ్ళాయె" అని పదం పాడుతూ తిరిగారు. ఏ ఇంటికి వెళ్తే ఆ ఇంట్లో కప్పమీద కడివెడు నీళ్ళుపోశారు. వీరయ్యగారి ఇంటికి వచ్చారు వారికి ఇలాంటివాటిమీద విశ్వాసం చచ్చిపోయి చాలా కాలం అయింది. జానకి కడివెడు నీళ్ళు పోయలేదు. కాని కడివెడు గింజలు తెచ్చి పెట్టింది. కప్పను తెచ్చిన కుర్రాళ్ళు గింజలు తీసుకొని గంతులేస్తూ ఉరికారు.

బోనాలు పట్టాలన్నాడు బైండ్లవాడు. జాతర సాగింది. ఊళ్ళో పండుగ జరిగింది. వీరయ్యగారు ఇంటికి తప్ప అన్ని ఇండ్లకూ వేప మండలు కనిపించాయి. తాసిల్దారు కూడా తన ఇంటికి వేపమండలు చెక్కాడు. డబ్బులు, జముకులు, కొమ్ములు బోనాలు సాగేయి. తెల్లగా తోమిన బిందెల్లో నీళ్ళు తీసుకొని ఆడవారు సాగేరు. ఊరంతా కదిలింది. ముత్తాలమ్మ గుడిదగ్గర మేకలను బలిపెట్టారు. కలు పారబోశారు.

వీరయ్య గారింట్లో ఈ మూర్ఖత్వాన్ని గురించి చర్చలు సాగేయి.

వీరయ్యగారింట బోనం రానందుకు ప్రజలలో నానా విధాల వ్యాఖ్యలు జరిగాయి. తాసిల్దారు, గిర్దావరు ఆ అగ్గిలో ఆజ్యంపోశారు.

మేమూ మీతోటివారమే అన్నారు ముసల్మానులు. షెర్వానీలు తొడుక్కొని గుంపులు గుంపులుగా చెరువుకు చేరారు. తాసిల్దారు సహితం బండ్లో అక్కడికి చేరారు. ఊరంతా కదిలింది. వరుసలుగా నుంచొని ముసల్మానులు నమాజు చేశారు. వంగలేకున్నా తాసిల్దారు వంగాడు. వర్షం ప్రసాదించవలసిందని అల్లాను ప్రార్థించారు. వీరి ప్రార్థన జరుగుతుండగనే ఆకాశంలో మబ్బులు కమ్ముకున్నాయి. గిర్దావరు గుండెలో ఉరుములు ఉరిమాయి. నమాజుకు వాన పడితే తన దేవతలు తక్కువ అయిపోతారు. వాన పడరాదని మనసులో ప్రార్థించాడు ముక్కోటి దేవతలను.

వచ్చిన మేఘాలు తేలిపోయాయి. పోతూ, పోతూ నాలుగు చినుకులు రాల్చి పోయాయి. తాసిల్దారు ముఖం చాటంత అయింది. గిర్దావరు ముఖం సూది అంత అయింది. అక్కడికి వీరయ్యగారు రాలేదు. రఘు రాలేదు నాగేశ్ రాలేదు. ఆదే

ప్రధాన చర్చనీయాంశం — అయింది అక్కడ చేశారు దాన్ని. వారు రాకపోవడం భీమునికి, రావడికి కూడా కష్టమే అనిపించింది.

ఆ రాత్రి జరిగిన సమావేశంలో రావడు, భీముడు ఏకంగా అడిగారు ఆ విషయం

"నాకు నమ్మకం లేదు. ఆకాశంలో దేవుడు ఉండడు. ఉండటానికి వీల్లేదు." ఖచ్చితంగా చెప్పేశాడు నాగేశ్. ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు రావడు-భీముడు.

"అట్లకాదు. దేవుడు ఉన్నడటనే అనుకుందాం. అతడు మనకు తండ్రివంటి వాడు కదా ! తండ్రి తన సంతానాన్ని కష్టాలపాలు చేస్తాడా? మనం ఏదైనా ఇస్తే వాన పడేస్తడు, లేకుంటే పడెయ్యడా?" అని, వర్షానికి కారణం ఏమిటి? అది ఎలా పడుతుందీ వివరించాడు రఘు .

"పొట్ట మాడి చచ్చెటోనికింత గంజి పోస్తరా, చందలు వసూలుచేస్తరా! రేపు నా గరిశలు కుమ్మరిస్త, పేద బిక్కి అందరికీ కొలిచేస్త. అందరితో నేను చస్త" వీరయ్యగారి గుండె దూసుకొనివచ్చాయి ఆ మాటలు.

అంతా చకితులై చూచారు. "నాయ్నా అసలు దేవునివి నువ్వు. అన్నం పెట్టేవాడే దేవుడు" అని ఆనంద బాష్పాలు రాల్చింది జానకి. వీరయ్యగారు అక్కడ్నించి లేచిపోయారు. గింజలు ఎలా పంచాలి? ఎవరికి పంచాలి అనే విషయంపై చర్చలు జరిగాయి. పట్టికలు తయారుచేసే బాధ్యత రావడు, భీముడు తీసుకున్నారు.

విరాటపర్వం చెప్పించి పాండవులకు పాయసం పోస్తే తప్పక వర్షం వస్తుందన్నాడు గిర్దావరు. అదొక సాకు ఆర్జనకు. వ్యాపారస్తులకు తప్పలేదు. రైతుల దగ్గర సైతం వసూలు చేశారు. ఇవ్వడం ఏడ్చుకొంటూనే అయినా ఎక్కడో ఆశ మిణుకు మిణుకు మంటూనే ఉంది. ఇవ్వడం అంతా ఇచ్చారు. చేతులు నెత్తిన పెట్టుకొని కూర్చున్నారు.

అయ్యవారిని పట్నంనుంచి పిలిపించారు—బాగా పురాణం చెపుతాడని. వెంట పెద్ద పెద్ద పుస్తకాలు తెచ్చారు అయ్యవారు. వారి చేతులకు సింహమ్మూతి కడియాలున్నాయి. చెవులకు మకరకుండలాలున్నాయి. వారు బాగా హరికథలు కూడా చెప్పగలరు. పురాణం తరువాత కొన్ని హరికథలు చెప్పుకొని డబ్బు మూట కట్టుకొని పోదామనుకొని వచ్చారు. వచ్చి గిర్దావరు ఇంట్లో విడిశారు. తాసిల్దారు దర్శనం చేసుకున్నారు. తమ ప్రభావాన్ని గురించి చెప్పారు. తాసిల్దారుకు అదేమీ బుర్రకు ఎక్కలేదు. కాని నాస్తికుల వల్లనే వర్షం పడడం లేదనే విషయం అయ్యవారి బుర్రకు ఎక్కించాడు తాసిల్దారు. హరికథలు కుదిరించి పెడ్తానని వాగ్దానం చేశాడు.

అయ్యవారు వచ్చారంటే గ్రామపెద్దలంతా గిర్దావరు ఇంటికి వచ్చారు.

"వానపడ్తాదుండి?" అందరూ అయ్యవారిని అదే ప్రశ్న అడిగారు. అయ్యవారు అందుకు జవాబుగా ఉపన్యాసమే ఇచ్చేశారు.

"నాయనలారా! అధర్మం పెరిగిన దేశంలో వానలు పడవు. జనులు కరువు కాటకాలతో చత్తురు. పూర్వం దండుడు అను రాజు వింధ్య శైవలారణ్య ప్రాంతమును పాలించినాడు. అతనికి గురువు శుక్రుడు. వసంతకాలమున ఒక నాటి మధ్యాహ్నమున, దండుడు శుక్రుని ఆశ్రమమునకు వెళ్ళినాడు. అక్కడ శుక్రుడు లేడు. కాని అతని పెద్దకూతురు అరజ ఉన్నది. ఆమె వయసులో ఉన్నది. ఆమెను చూచి దండునకు మదన వికారము కలిగినది. తనతో రమించవలసిందని అరజను రాజు కోరినాడు. ఆమె తండ్రి అనుమతి లేనిది అంగీకరించనన్నది. రాజు నిలువలేకపోయినాడు. బలవంతంగా ఆమెను చెరచినాడు. వెళ్ళిపోయినాడు. శుక్రుడు ఆశ్రమమునకు వచ్చి చూచినాడు. అరజ దుమ్ములో పడి ఎక్కెక్కి ఏడ్చు చున్నది. శుక్రుడు దివ్యదృష్టివలన అంతయు గ్రహించినాడు. "దండుని రాజ్యం ఉన్నంతమేరకు దుమ్ము వర్షముగా కురియుగాక. ఈ ప్రాంతము వానలు కురియ కుండుగాక!" అని వెళ్ళిపోయినాడు. నాటినుండి అక్కడ ఒక్క చినుకు పడలేదు. అట్లే మన గ్రామమున అధర్మమునకు తలపడినవారు, నాస్తికులు చేరినారు. అందుకే వాన పడుటలేదు.

ఆ కథ ఎందుకు చెప్పారో ఎవరికి వర్తిస్తుందో అర్థం కాలేదు జనానికి. మళ్ళీ అడిగారు "ఇంతకు వాన పడ్తదంటారా ?"

"నాయనలారా! ధర్మరాజు ధర్మమూర్తి. అతడు మత్స్యదేశమున అజ్ఞాత వాసము గడిపినప్పుడు ఆ దేశము సుభిక్షముగా ఉండెను. దానిని ఎరిగియే పాండవులు విరటుని పట్టణమందున్నారని 'దుర్యోధనుడు' తెలుసుకున్నాడు. కాబట్టి ఆ కథ విన్నచో తప్పక వర్షము పడును. గిర్దావరు, తాసిల్దారు ధర్మాత్ములు. వారు చెప్పినట్లు వినుడు. నాస్తికులను నమ్మరాదు. వారిని గ్రామమున ఉండనీయరాదు." అని ముగించి భోజనానికి లేచారు అయ్యవారు. తలా ఒక రీతిగా అనుకుంటూ వెళ్ళిపోయారు పెద్ద మనుషులు.

అయ్యవారు నిర్ణయించిన ముహూర్తానికి గ్రామం యావత్తూ చెరువులోనికి చేరింది. వంటలు అక్కడే సాగాయి. భోజనాలు అక్కడే అందరికీ. అయ్యవారు పురాణం ప్రారంభించారు. వర్షం వస్తుంది. కాబట్టి వంటలు త్వరగా ముగించవలసిందని మధ్య మధ్య చెపుతున్నారు. పురాణం పూర్తి ఆయింది. వానచినుకు లేకపోగా మబ్బుతునక రాలేదు. ఆకాశంలోకి విస్తళ్ళువేసి వస్తుండగా ఏనుగు తొండమంత ధారతో వర్షం పడుతుందనీ, విస్తళ్ళు కొట్టుకు పోతాయనీ, త్వరగా భోజనాలు ముగించమని చెప్పారు అయ్యవారు. జనం భోజనాలు ముగించారు. విస్తళ్ళు పారేశారు. మబ్బుముక్క రాలేదు ఆకాశంలోకి. ఒక్క చినుకు పడలేదు.. జనం అయ్యవారికోసం వెతికారు కనిపించలేదు.

ఆ రాత్రి పుస్తకాలుకూడా వదిలి రైలు ఎక్కారు అయ్యవారు గప్‌చిప్‌గా.

వీరయ్యగారు ధాన్యం పంచుతారనే వార్త ఊరంతా పాకిపోయింది. వెంకయ్య గుండెల్లో రాళ్ళు కురిశాయి. తాసిల్దారుకూ గిర్దావరుకూ చీమలు కుట్టాయి. వ్యాపారస్తులకు చెమటలు పట్టాయి. మంచిపేరు సంపాదించుకోవడానికి చేస్తున్నాడని కొందరు, తీరా పంచినప్పుడు చూతాం లెమ్మని కొందరూ, జనం తంతారని ఈ ఎత్తు ఎత్తాడని కొందరూ ప్రచారం సాగించారు. నాస్తికులు ఇచ్చే వడ్లు తీసుకుంటే ఇక అసలే వానలు పడవని గిర్దావరు ప్రచారం చేశాడు. అవన్నీ చెవినపడినా లెక్కచేయ లేదు వీరయ్యగారు.

పట్టికలు తయారైనాయి. గంపలతో ఆడా మగా హరిజనులాదిగా అంతా వీరయ్యగారి ఇంటివైపు పయనం సాగించారు. వీరయ్యగారి ముంగిలి జనంతో నిండి పోయింది. జనం తోసుకుంటున్నారు. మాకు ముందంటే మాకు ముందని నెట్టు కుంటున్నారు. భీముడు, రావుడు, రఘు , నాగేశ్, జానకి వారిని పంక్తులుగా నుంచో పెడ్తున్నారు. వీరయ్యగారు గరిశ దగ్గర నుంచోని మూతతీయించాడు. ఆకాశంలో మబ్బులు కమ్ముకున్నాయి. పాలేళ్ళు కొలుస్తున్నారు. పట్టిక ప్రకారం గంపల్లో పోస్తు న్నారు. ఉరుములు ఉరిమాయి, మెరుపులు మెరిశాయి. కారుమబ్బులు ఆకాశంలో కమ్ముకున్నాయి. చిరుచీకట్లు కమ్మాయి, అయినా పాలేళ్ళు ధాన్యం కొలుస్తూనే ఉన్నారు. ధాన్యపు గంపలతో జనం ఆనందంగా ఇళ్ళకు చేరుకుంటూనే ఉన్నారు.

చిటపట చినుకులు మొదలైనాయి.

ఉరుములు మెరుపులు.

జోరున వాన మొదలైంది.

వాన, వాన, వాన.

ఎవరి నోటవిన్నా అదే పదం హోరున వాన పడుతున్నా ఒకడు కదల్లేదు. వాన సగం పంట రైతుకు పూర్తిప్రాణం. వాననీరు నెత్తులమీద పారుతుంటే వీరయ్యగారి ముంగిట్లో జనం గంతులు వేయసాగారు. ఈలలు కొట్టారు. పాటలు పాడారు. ఇళ్ళకు వస్తున్న లేగ దూడలు గంతులు వేశాయి.

హోరున వాన.

ఆటలు, పాటలు.

ఆనందం

వీరయ్యగారి గుండె నిండిపోయింది. వానలో నుంచోని చేతుల్తో వాననీరు పడ్తూంది జానకి. నాగేశ్ జనంతోపాటు గంతులు వేస్తున్నాడు. ముక్కుమీదినుంచి జారే నీరు చప్పరిస్తున్నాడు.

రఘు ఆలోచిస్తున్నాడు. "నిజమైన ఆవేదనకు ప్రకృతిసైతం పులకిస్తుంది. వర్షిస్తుంది" అనుకున్నాడు. పరిగెత్తి వీరయ్యగారి పాదాలంటాడు. "మీరు నిజమైన మనుషులు" అన్నాడు.

"దొర ధర్మరాజు" అన్నారు జనం.

"అందుకే వాన పడ్డది" అన్నాడు ఒకడు.

వర్షం బాగానే కురిసింది. భూమి తడిసి సువాసన చిమ్మింది. వీధులవెంట కాలువలు పారేయి. కుర్రకుంకలు వాటిలో చేపలుకూడా పట్టారు. భూమి పులకరించింది. గడ్డి మొలచింది. నేలంతా పచ్చబారి పోయింది. చెరువుల్లోకి కొంతనీరు వచ్చింది. పశువులు బ్రతుకుతాయి అనుకున్నారు జనులు.

ఆ వాన తరువాత కన్నీటి వాన తప్ప వానలేదు. వరిపొలాల్లో జొన్న, దోస వేశారు. అదీ అంతంతమాత్రంగానే ఉంది. ఎర్రబారి పోతూంది. పశుగ్రాసంగా పనికివస్తుందేగాని పండేజాడ ఎక్కడా కనిపించడంలేదు. వీరయ్యగారు చెరువు కట్టమీది నుంచి పొలాలు చూచారు. కనుచూపు మేరలో వున్న పొలాలన్నీ వారివే. అంతటా జొన్న గిడసబారిపోయింది. ఒక్క జొన్న కర్ర సైతం ఏపుగా కనిపించ లేదు. అది చూచి వారి కళ్ళల్లో నీరు తిరిగింది. కనీసం జొన్న పండకుంటే కూలి నాలి జనం ఏంకావాలి? ఎలా బ్రతుకుతారు జనం? ఎందుకు వచ్చిందీ కరువు?

ఎవడు దీనికి కారకుడు ? ఏమిటి దీని ఉపాయం? ఈ ఆలోచనతోనే వస్తున్నారు. తోవలో ఈతచెట్లు కొడుతున్నవారు కనిపించారు. నుంచుని చూచారు.

"ఈతచెట్లు ఎందుకు కొడతర్రా" అడిగారు.

"ఏం చేయమంటవు దొర? ఈతగుజ్జన్న తిని బతుకుదామని" అన్నాడు ఒకడు.

మారుమాటాడకుండా వచ్చేస్తున్నారు వీరయ్యగారు. చింతచెట్టు క్రింద కల్లు కుండలు పెట్టుకొని కూర్చున్న గౌండ్లవాడు దండంపెట్టాడు.

"కుండలేమొ నిండుగున్నాయి. బేపారం జరుగుతలేదా?"

"బేపారంలేక ఎన్నాళ్ళయే నీ కాల్మొక్త. కూటికి లేదాయె కల్లెవడు తాగుత డుండి? మాడిచస్తాన్న మనుకోరి బాంచను కోమటోండ్లు గింజపుట్టనిస్త లేర్రని" అన్నాడు గౌండ్లతను. అతని చూపులు ఏదో సహాయాన్ని అర్థిస్తున్నాయి. నిస్సహాయుడై బైల్దేరారు వీరయ్యగారు. వారుమాత్రం ఏంచేయగలరు? ప్రకృతి భీష్మించినపుడు పరమాత్ముడు కూడా ఏంచేయలేడు.

ఆ రాత్రి ఎంతోసేపు చర్చించుకున్నారు మనిషికి వచ్చిన ఈ ఆపదను గురించి. పరిష్కారం ఏమీ కనిపించలేదు. వ్యాపారస్తులు సహకరిస్తే అందరికీ ఇన్ని గంజి నీళ్ళైనా పోయవచ్చు ననుకున్నారు. తెల్లవారి వీరయ్యగారు స్వయంగా వెంకయ్య దగ్గరికి వెళ్ళి అర్థించారు. మొసలి కన్నీరు కార్చాడు వెంకయ్య. తనదగ్గర ఒక్క గింజలేదన్నాడు. తాను ఇవ్వనని కచ్చితంగా చెప్పేశాడు. నిరాశ చెంది ఇంటికి తిరిగి వచ్చారు.

ఆకలి. ఆకలి. ఆకలి. ఆకలిమంటలు. కనిపించని మంటలు, డొక్కలు కాల్చే మంటలు, రగిల్చే మంటలు. ఎక్కడ చూచినా ఆకలి. హాహాకారాలు. పసిపాపలు

పండు వృద్ధుల కళ్ళల్లో మంటలు, డొక్కల్లో మంటలు, గుండెల్లో జ్వాలలు. ఆర్తనాదాలను అడిగినవాడులేడు. ఆకలి చావుల లెక్కలులేవు. తాసిల్దారు ఇంట్లో విందులకు తరుగులేదు. వెంకయ్య ఇంట్లో పాతవి—సన్నబియ్యం ఉడుకుతూనే ఉన్నాయి. పేదవాని డొక్క మాడుతూనే ఉంది. మృత్యుదేవతకు సయితం ఆకలి ఎక్కువైంది.

ఆకలికి అన్నింటినీ అమ్ముకుంటున్నారు జనం. పేదరైతుల నేల చెక్కలు వెంకయ్య భూముల్లో కలిసిపోతున్నాయి. ఇండ్లకు ఇండ్లే వెంకయ్య ఇంటికి చేరుతున్నాయి. ఊళ్ళోవున్న వెండి బంగారం వెంకయ్య భోషాణం నిండింది. జనం అతనికి ఏళ్ళతరబడి తాకట్టుబడి పాలేళ్ళుగా మారిపోతున్నారు. అంతా బీభత్సంగా ఉంది. అందరూ వెంకయ్యనే ఆశ్రయిస్తున్నారు. వెంకయ్య తాసిల్దారునూ, గిర్దావరునూ సంతోషపెడుతున్నాడు. అతడు వారిని ఆశ్రయించాడు. అదొక అవినాభావబంధం. అది లేక అతడు బ్రతకలేడు.

ఒకనాటి అర్ధరాత్రి అమాంతంగా మేల్కొన్నారు—ఆర్తులు, అంధులు, ఆకలిగొన్న జనం. వార్త తెచ్చింది భీముడు. మొదట కదిలింది వడ్డెర్లు. వారిని అనుసరించారు మాల, మాదిగ, డొక్కల, చాకలి, మంగలి, కూటికిలేనివానికి కులం ఏమిటి? ఆకలి. అది అందరికీ ఒకటే. ఆ ఆకలితోనే విరుచుకుపడ్డారు జనం. గింజ నిండిన వాగెనులు తరలిపోతున్నాయి. అన్నీ వెంకయ్యవే. అతనికి ప్రాణాలతో కాదు డబ్బుతో పని. అతడు మృత్యువుతో సైతం బేరం చేయగలడు! చిత్రగుప్తునికి సైతం లంచం పెట్టగలడు!

జనం వాగెనులమీద విరుచుకుపడ్డారు. బద్దలుకొట్టారు. గింజ. గింజ. గింజ. వారి ప్రాణాలు లేచి వచ్చాయి. లేని బలం వచ్చింది. చేతనైనన్ని గింజలు తీసుకొనిపోతున్నారు. ఎవడు తీసుకెళ్తున్నాడు? ఎక్కడికి? ఎంత ? ఏమో ఎవనికి తెలుసు? బలం ఉన్నవాడు బలం లేనివాణ్ణి తొక్కేస్తున్నాడు. ఎంత బలం ఉంటే అంత గింజ! ఎక్కడ చూచినా గింజ! ఇండ్లలో, వాకిళ్ళలో, వీధుల్లో, స్టేషను పెద్ద కళ్ళంగా మారింది. మాస్టరు తలుపులు మూసుకొని కూర్చున్నాడు. తలుపుల అద్దాల్లోంచి పోలీసులకోసం ఎదురు చూస్తున్నాడు.

తాసిల్దారు పోలీసులందరినీ తన ఇంటికి కాపలా పెట్టుకున్నాడు. అమీను లేడు. అతని ఆజ్ఞ పాటించాలి వారు. ఆ కల్లోలంతో వెంకయ్య గుండెలో తుపాను రేగింది. మూక తన ఇంటిమీద పడుతుందేమోనని బెదిరిపోయాడు. తాసిల్దారు ఇంటికి పరిగెత్తాడు. తాసిల్దారూ వణకిపోతున్నాడు. అయినా అది అగపడనివ్వకుండా హుక్కా పీలుస్తున్నాడు తాసిల్దారు. కాళ్ళమీద పడ్డాడు వెంకయ్య రక్షించవలసిందని వేడుకున్నాడు. పోలీసులను తుపాకులతో పంపించవలసిందన్నాడు. తాసిల్దారు వల్లకాదన్నాడు. వికటంగా నవ్వాడు. వెళ్ళగొట్టాడు. వెంకయ్య అరచేతుల్లో ప్రాణాలు పెట్టుకొని ఇంట్లో కూర్చున్నాడు. తలుపులన్నీ గట్టిగా బిగించుకున్నాడు. అందరి ప్రాణాలూ బిక్కు బిక్కు మంటున్నాయి. జనం వస్తూంది. తన

ఇంటివైపే ఆ కేకలు, బొబ్బలు. అదిగో దగ్గరికి వచ్చింది పడనే పడింది ఇంటి మీద.

"కొట్టండి" భీముని ఆదేశం. "చంపండి" రావడి ఆదేశం. గునపాలు, సమ్మెటలు తలుపులమీద పడినాయి. తలుపులు బద్దలైనాయి. ఒకటి రెండు మూడు పర్యాజాలు, "ఏడి వెంకయ్య. ఇదే వెంకయ్య ఉన్న గది" తలుపు బద్దలైంది. జనం ఉరికారు లోపలికి. మూలకు నక్కి కూర్చున్నాడు వెంకయ్య. "దొంగ దొరికిండు" భీముని కేకతోపాటే గునపం లేవడం, రుక్మిణి కెవ్వున కేకపెట్టి తండ్రిమీద పడి రక్షించపోవడం, నాగేశ్ ఆగమని కేకపెట్టడం, అప్పటికే గునపం రుక్మిణి తలకు తాకడం లిప్తలో జరిగిపోయాయి. రక్తం వరద కట్టసాగింది. రఘు వచ్చి భీముణ్ణి పట్టుకొని గునపం లాగి పారేశాడు. నాగేశ్ రుక్మిణి తల తొడమీద పెట్టుకుని నీళ్ళు తెమ్మని అరుస్తున్నాడు. వెంకయ్య మూలన చతికిలపడి కళ్ళెలాగో పెట్టి తనుస్తున్నాడు. జానకి నీళ్ళు తెచ్చింది. కడిగింది. నాగేశ్ చొక్కా చించి కట్టు కట్టసాగాడు. వైద్యుడు వచ్చాడు. మందువేశాడు. అయినా రక్తం కారుతూనే ఉంది. అక్కడ వెంకయ్య గరిశెలు ఖాళీ అవుతూనే వున్నాయి. నిముషాల్లో గరిశెలు ఖాళీ అయినాయి. వెంకయ్యగారి ఇల్లు ఖాళీ అయింది. జనమూ ఖాళీ అయినారు.

రక్తం పూర్తిగా కట్టలేదు.

వెంకయ్య దంపతులు ఏడ్పు మానలేదు.

నాగేశ్ కన్నీరు నిలువలేదు.

రాత్రి ఆగలేదు.

తెల్లవారిందనేగాని వెలుగు చూడలేదు రఘు, తలుపులు బంధించుకొని గదిలో పడుకున్నాడు. ఏదో మదనపడుతున్నాడు. ఎన్ని సిగరెట్లు కాల్చాడో తెలియదు. ఎంతకూ అర్థం కావడంలేదు. పుస్తకాలు అతనికి ఏమీ చెప్పలేక పోయాయి. ఏదో ఆదుర్దా, ఆందోళన, ఆరాటం. జానకి తలుపు తట్టింది. తెరచాడు. టీ గ్లాసుతో గదిలో అడుగు పెట్టిన జానకి రఘును చూచి చకితురాలైంది. కొన్ని గంటలలో ఎంత మార్పు వచ్చింది! కళ్ళు పీక్కుపోయాయి. వాటిల్లో ఏదో ఆందోళన గూడు కట్టుకుంది. జుట్టంతా చిందరవందరైంది. ఎంతోసేపు జుట్టు పీక్కున్నాడని కనిపిస్తూంది.

"ఏంది. ఇట్లైయినవు?" ఆశ్చర్యం వ్యక్తపరచింది జానకి.

"జానకీ!" గొంతు నిండివుంది, "మనిషి దౌర్జన్యానికి లొంగుతాడా?" అవి మాటలు కావు, వేదనా శకలాలు.

జానకి అర్థం చేసుకుంది. చాయ్ గ్లాసు అందించింది. కుర్చీమీద కూర్చుంటూ "రఘు! దౌర్జన్యానిది తాత్కాలిక విజయం" అని "ఇది నేను చెప్పుతున్నది కాదు నువ్వు చెప్పేదే" అన్నది.

"నా విశ్వాసంమీద నాకే నమ్మకం తగ్గిపోతూంది జానకి" మాటల్లో ఆత్రుత లేదు. శుష్కంగా ఉన్నాయి. శిధిలం అవుతున్న విశ్వాసానికి ప్రతీకలుగా ఉన్నాయి.

జానకి అదిరిపడింది. అనేక రకాల వాదించింది, ఏవేవో ఉద్యమాలను గురించి చెప్పింది, అవి విఫలం కావడానికి కారణాలు వివరించింది. ఆమె విజ్ఞానాన్ని చూస్తే రఘుకే ఆశ్చర్యం కలిగించింది. ఆమె ఉపన్యాసంతో అతడు ఉక్కిరి బిక్కిరి ఆయినాడు.

అక్కడ నాగేశ్ పరిస్థితి అలాగే ఉంది. అతడు ఇంట్లో కూర్చొని ఎంతోసేపు ఏడ్చాడు. తన బలహీనతను తలచుకున్నాడు. దోపిడిని గురించీ, దోచుకొనే వాళ్ళను గురించీ ఎన్ని పెద్ద పెద్ద ఉపన్యాసాలిచ్చాడు తాను, తనవరకు వస్తే యింతేనా? ఒక్క రుక్మిణికోసం తన విశ్వాసాలనే వదులుకున్నాడా? ఎందుకీ బలహీనత? ఎందుకు వచ్చింది? ఎలా పోతూంది? సతమతం అయినాడు. మెదడును చీల్చుకొని ఆలోచించాడు. రుక్మిణి అతని మనసులో మసలింది. సాధారణంగా కలగాల్సిన అనుభూతి కలుగలేదు. కోపంవచ్చి మండిపోయాడు. రుక్మిణి రాక్షసి అనుకున్నాడు. ఆమె చనిపోతే బాగుండు ననుకున్నాడు. ఆ తరువాత ఎందుకో అలా కాగూడ దనిపించింది. ఆమె బ్రతకాలి. బాగుపడాలి. తాను ఆమె నీడను సయితం చూడ రాదు. అంతే. అదే మందు ఇంకేవేవో ఆలోచనలు వచ్చాయి. రఘు దగ్గరికి వెళ్దా మనుకున్నాడు. ఎందుకో సిగ్గనిపించింది. ఇంట్లోనే ఉండిపోయాడు. ఇల్లే అతని లోకమయింది. పుస్తకాలే ఆతని ప్రపంచం అయినాయి.

ఆ రాత్రి వడ్డెరగూడెం తగలబడ్డది-కాదు-తగలపెట్టారు.

ప్రజల ఉద్రేకం ఎల్లకాలం నిలవదు, ఎంతోకాలం ఉండదు. కలిసినప్పుడు పులులు, విడిపోతే చీమలు. అందుకే పోలీసుల్ని ఊరిమీద వదిలాడు తాసిల్దారు. ఊరిలోని, అతడు అనుకున్న అలగా జనాన్ని హడలకొట్టా లనుకున్నాడు. అతనికి ఒక వింత ఆలోచన వచ్చింది. రషీద్‌ను మళ్ళీ ఊరిమీద వదిలిపెట్టాలనుకున్నాడు. ఎంచేతంటే ఆమీను పారిపోవడంతో పోలీసులు ఏ పనీ చేయడానికి జంకుతున్నారు. జంకు తాసిల్దారుకూ ఉంది. కాని దాన్ని దాచిపెట్టాడు. మళ్ళీ ఆలోచించాడు. తన కొడుకు తనకే ముప్పు తెస్తాడేమో అనుకున్నాడు. రషీద్ బృందపు నాయకుడు మస్తాన్ను వదిలేశాడు. మస్తాన్ బక్కగా పొడుగ్గా రివటలా ఉంటాడు. కాని పచ్చి నెత్తురు తాగే రకం. బోనులోంచి బయట పడ్డాడు. పైగా పోలీసు అండ లభించింది. విచ్చలవిడిగా తిరిగాడు. స్వేచ్ఛగా సంచరించాడు. ఇళ్ళల్లోకి దూరాడు. మనుష లను చావచితక కొట్టాడు. ఆడవారిని లాగాడు. కొంపలు తగలపెట్టాడు. దోచుకొని పోయిన సాహుకారు సామానంతా వెంకయ్య ఇంటికి చేరింది. సాహుకారు మస్తాను వీపు చరిచాడు, తాగినంత తాగమన్నాడు. సారాయి దుకాణానికి చీటీ ఇచ్చాడు. మస్తాన్ ముఠా సారాయి దుకాణం మీద పడ్డది. ఎంత తాగారో తెలియదు. తాగి నంత తాగారు. పారబోశారు. ఒకనిమీద ఒకరు ఊసుకున్నారు. తిట్టుకున్నారు.

కొట్టుకున్నారు. బాదుకున్నారు. బయటపడ్డారు. వీధిలో ఒకడు చనిపోయాడు. మరొకడు వాని రెండు కాళ్ళుపట్టి లాక్కొనిపోతున్నాడు. ఒకడు కేకలు పెడ్తున్నాడు "అల్లహో అక్బర్'' అని పదిమంది వాణ్ణి అనుసరించారు. పడిపోయిన వాడు లేచాడు. మస్తాన్‌కు హరిజనవాడ జ్ఞాపకం వచ్చింది. మరొకసారి దానిమీద పడాలనుకున్నారు. మరి సాహుకారి రుణం తీర్చుకోవద్దూ! పోలీసులకు తుపాకులున్నాయి. డ్రెస్సుకూడా ఉంది కాని మట్టికొట్టుకుంది. మస్తాన్‌కు తల్వార్ ఉంది. అతని పైజామా చిరిగిపోయింది. మిగతా చేతుల్లో దుడ్డుకర్ర లున్నాయి. వీధుల వెంట సాగారు వీరులు! వారిని చూచారు. దుకాణాలు కట్టివేశారు. హోటళ్ళు మూసివేశారు. మూయనున్న కిళ్ళీ కొట్టుమీద పడ్డారు. సోడాలు తాగారు. కిళ్ళీలు తిన్నారు. డబ్బు అడుగుతే వికటంగా నవ్వారు. సోడాబుడ్లు బద్దలు కొట్టారు. కిళ్ళీ కొట్టువాడు పారిపోయాడు. వాణ్ణి చూచి కేకలు పెట్టారు. వెర్రిగా నవ్వారు! విజయోత్సాహంతో హరిజనవాడమీద పడ్డారు.

హరిజనవాడలో జొన్నలు తొక్కుకుంటున్నారు కొందరు పడుచులు, యువతులు. వాటిమీద పడ్డది మస్తాను కన్ను. వారిమీద విరుచుకు పడ్డారు. కేకలు ఏడ్పులు, పెడబొబ్బలు, నవ్వులు, కేరింతలు. ఆడవాళ్ళు అగ్గయినారు. రోకళ్ళతో ఎదిరించారు. మగవాళ్ళు దుడ్డు కర్రలతో ఎదిరించారు. ఆకలితో నీరసించి వున్నారు వీరు. తాగుడుతో నీరసించి ఉన్నారు వారు. తొడుక్కున్న అధికారపు పొరను బద్దలు కొట్టారు వీరు. దాంతో అంతా సమానమైనారు. హోరా హోరి పోరు సాగింది. సమరం సాగింది. ఒక్కొక్కడూ పారిపోయాడు. హరిజనులు గెలిచారు. ఆకలి గెలిచింది. అధికారం పూడింది. ఓడింది. పారిపోయింది.

వంటినిండా గాయాలతో మస్తాన్ తాసిల్దార్ ఇంటికి చేరుకున్నాడు. తాసిల్దారు అతన్ని చూచాడు. తుపుక్కున నేలమీద ఊశాడు. "మగవాడివి అనుకున్నాను. గాజులు తొడిగించుకొని వచ్చావు. పో ఇక్కణ్ణుంచి ? పో నీ ముఖం చూపించకు" అనే మాటలు ఉర్దూలో అన్నాడు.

మస్తాన్ రక్తం సలసల కాగింది. కాని గాయాలు మందసాగాయి. తల వంచుకుని వెళ్ళిపోయాడు—సలాం సైతం చేయకుండా.

తాసిల్దార్ గుండె దడ దడ లాడింది.

అయినా కళ్ళెర్రచేసి అరచాడు.

* * *

కన్నీటికి ఏం తెలుసు కలవారి బాధలు! పాపం జాగీర్దారుకూ కథలున్నాయి. గాథలున్నాయి. బాధలున్నాయి. అయినా అతడు పెదవి కదపడానికి వీల్లేదు. అతడు చెప్పాడు. చెప్పరాదు. చెప్పినా వినేవాడుండడు. అదొక రాచరికం. అదొక ఠీవి. అందుకోసం ఖర్చుకు వెనుదీయరాదు. అక్కడ డబ్బుకు విలువలేదు. వేయి పైసలతో సమానం. చెప్పులు తొడిగించే దాసి రావాలి. సలామ్ చేయాలి. చెప్పులు తొడిగించాలి. అందాకా

వారు మంచం దిగరు. బెంగాల్లో ఒక నవాబుకు చెప్పులు తొడిగించే దాసీది రాలేదు. ఇంగ్లీషువారు కోటను ముట్టడించారు. కాబట్టి ఆమె పారిపోయింది. చెప్పులు లేక నవాబుగారు ఎలా పారిపోతారు? ఇంగ్లీషువాళ్ళకు పట్టుపడ్డారు. బట్టలు తొడిగించే వారు రావాలి. దర్బారుకు తీసికెళ్ళేవారు రావాలి. అదీ వారి రాజసం. ఆ రాజసమే వారిని రాళ్ళను చేసింది. వారికి బయట ప్రపంచము తెలియదు. ప్రజలతో సంబంధం లేదు. ప్రభుత్వం సాగాలి. అంతే వారికి కావలసింది.

జాగీర్దార్ సాహెబ్ హైద్రాబాదు నుండి మకాం బొంబాయికి మార్చాడు. అక్కడ గుర్రాలు తన్నాయి. నష్టం....నష్టం...నష్టం, అది వారికొక లెక్కకాదు. పేకాటలో ధోకా జరిగింది. దాన్ని వారు పట్టించుకోలేదు.

డబ్బు ఎక్కడ్నుంచి వస్తుంది? ఎంత వస్తుంది. అది వారికి అనవసరం. కావాలి. అంతే. అప్పులైనాయి. ఇచ్చేవా రిస్తున్నారు వారు పారవేస్తున్నారు. అలాంటి సమయంలో అమీను పారిపోయాడని తెలిసింది నవాబుగారికి. డబ్బు వృధా చేయదలచలేదు. తాసిల్దారునే ఆ పని చూడమన్నారు. చచ్చిపోయిన మున్సిఫ్ స్థానంలో మరొకని నియమించమని సర్కారు వారు కోరారు. దాన్ని అంతగా పట్టించు కోలేదు వారు. అసలు అంత తీరికకూడాలేదు. అసలు వారు స్పృహలో ఉండేది ఎప్పుడనీ!

నవాబుగారికి డబ్బుకు కటకట అవుతూంది. శిస్తులు ఎందుకు వసూలు కావడంలేదో అర్థంకాలేదు. పంటకు వర్షంతోనూ, శిస్తుకు పంటతోనూ సంబంధం ఉంటుందని వారికేం తెలుసు. వెంటనే శిస్తులు వసూలు చేసి పంపించమని ఉత్తరవు జారీ చేశారు. చేయకుంటే తల తీయిస్తా మన్నంత కఠినంగా ఉన్నాయి ఉత్తరువులు.

ఈ లోగా మరొక విచిత్రం జరిగింది. సాటి నవాబు కుక్కల పెళ్ళి చేశాడు. తాను పెంచిన ఆడకుక్కను మరో నవాబు పెంచిన మగ కుక్కకు ఇచ్చాడు. పెళ్ళికి నైజాం నవాబు సహితంగా అందరినీ పిలిచాడు. అయిదు లక్షలు ఖర్చు చేశాడు. కుక్క వరుడు స్పెషల్ ట్రైన్‌లో వచ్చాడు. ఎంతో ఆడంబరంగా చేశాడు నవాబు కుక్క పెళ్ళి. నలుగురు నవాబులు కలిసినప్పుడల్లా ఆ ముచ్చటే చెప్పు కుంటున్నారు. అది మన జాగీర్దారుకు బాగనిపించలేదు. తనకంటే చిన్న నవాబుకు అంత గౌరవం కలగడం ఓర్చుకోలేక పోయాడు. తానూ కుక్కల పెళ్ళి చేస్తానని ప్రకటించేశాడు. శిస్తుకు సమానంగా కుక్కల సుంకం వసూలు చేయించ వలసిందని ఫర్మానా జారీ చేశాడు.

అమీనుగా సహితం అధికారం చలాయిస్తున్న తాసీల్దారుకు ఏనుగును మించిన బలం వచ్చింది. స్వయం రాజా స్వయం మంత్రి. ఇక తనను అడిగే వారు లేరు. మున్సిఫ్‌ను చంపించి మంచిపని చేశాననుకున్నాడు. తన చాకచక్యానికి తానే మురిసి పోయాడు. ఒక్క దెబ్బకు రెండు పిట్టలు - మున్సిఫ్ వచ్చాడు, అమీను పారిపో యాడు. ఇప్పుడు తాను షహిన్షా. జాగీరు చిన్నదైతేనేం? దానికే చక్రవర్తి తాను.

కరువు రావడం మంచిదే ననుకున్నాడు. మళ్ళీ ఒక్క దెబ్బకు రెండు పిట్టలు! వెంకయ్య గర్వం అణగింది. వీరయ్యగారిని లొంగదీయవచ్చు. జాగీర్దారు బొంబాయి వెళ్ళిపోయాడు. ఇక తనను అడిగే వాడెవడు? ప్రజలను పీడలకొట్టాలి? రకాలేకాదు, కుక్కల సుంకం వసూలు చేయాలి. అందులో తన మామూళ్ళు ఉంటాయిగా! ఇంటిముందున్న కట్టుకొయ్యలను చూచాడు. అవి ఈ మధ్య రిక్తంగా ఉన్నాయి. మరికొన్ని కట్టుకొయ్యల్ను పాతించాడు. బండలను చూచాడు. అవి అరిగిపోయినట్లు అనిపించింది. కొత్తవి తెప్పించాడు. మీసం లేకున్నా మెలేసినంత పని చేశాడు. ఆ రాత్రి కాస్త ఎక్కువ తాగాడు. గానా బజానా జోరున జరిగింది. ఖవాలీలతోనూ, డోలక్ తోనూ బంగళాయే కాదు ఊరంతా మారుమ్రోగింది.

తెల్లవారి దప్పు చాటించాడు. ఆ ఊళ్ళోనేకాదు, జాగీరు మొత్తంలోనూ దప్పులు ప్రజల గుండెలలో మ్రోగాయి. కరువు–ఆకలి అంతరించాయి. సిస్తులు, కుక్కల సుంకం. ఎవరి పెదవి కదలినా ఆదేమాట. ఎక్కడ ఇద్దరు కలిసినా అదే పదం. అది రామనామం అయిపోయింది. స్టేషనులో, హోటళ్ళలో, గ్రంథాలయంలో, చౌరస్తాలలో, ఊళ్ళల్లో అదే వార్త. అదే చర్చ, ఏం చెయ్యాలి? ఎక్కణ్ణించి తేవాలి? ఎలా చెల్లించాలి? పైగా కుక్కల సుంకం! కాదనడానికి వీల్లేదు. కరువైనా బరువైనా, అవి ఎన్నడూ ఆగలేదు. కరువులు చాలా వచ్చాయి. అయినా ఇలాంటివి కడ్తానే ఉన్నారు. కట్టని సంవత్సరం అంటూ వారికి గుర్తులేదు. ఇప్పుడూ ఎగవేయాలని ఆలోచనలేదు. ఎలా చెల్లించడం అనేదే చర్చ! చెల్లించడం వారి విధి. చెల్లించాల్సిందే! తప్పుకోవాలని ఎవడూ చూడలేదు. అప్పు పుట్టాలంతే.

రోజులు గడుస్తున్నాయి. కలవరం పెరుగుతూంది. వసూళ్ళరోజు రానేవచ్చింది. ఊరిమీద పోలీసులు పడనే పడ్డారు. రైతులను లాక్కొపోతున్నారు. కట్టుగొయ్యలకు కట్తున్నారు. వంగ పెట్టి బండలు ఎత్తుతున్నారు. తాసిల్దారు ఇల్లూ ముంగిలీ యమలోకంలా తయారైంది. దెబ్బలు, తిట్లు, ఏడ్పులు పెడబొబ్బలు' మళ్ళీ తాసిల్దారు ఇంటికి పూర్వపుకళ వచ్చింది. ఒళ్ళు చిట్లి రక్తం కారుతున్నా జనం కట్టుకొయ్యలకు కట్టబడి తలలు వంచుకున్నారు. ఎండలో వీపుమీద మండే బండగల జనం, చెమటలు కక్కుతున్నారు. ఇంకా జనం వస్తూనే ఉన్నారు. ఇంకా శిక్షలు పడుతూనే ఉన్నాయి.

వెంకయ్య ఇల్లు జనంతో కిక్కిరిసిపోయింది. అంతా అప్పులు అడిగేవాళ్ళే. అతని ఆస్తి హనుమంతుని తోకలా పెరుగుతూంది. గిర్దావరు ఇల్లు రోజూ జనంతో నిండి ఉంటూంది. శిక్షలు తగ్గించినందుకు నజరానాలూ. అందును గురించి బేరాలు.

వీరయ్యగారి ఇంటికి సైతం అనేక గ్రామాల నుంచి జనం వచ్చేవారు. అక్కడ ఏవేవో చర్చలు జరుగుతున్నాయి. సమావేశాలూ జరుగుతున్నాయి. చివరకు శిస్తులు కట్టాల్సిన అవసరం లేదన్నాడు రఘు, నాగేశ్ బలపర్చాడు. ఆకలితో

చచ్చేవానిదగ్గర శిస్తులు అడగడం అన్యాయం అన్నది జానకి. జనం కుక్కల్లా చస్తుంటే కుక్కల పెళ్ళి చేస్తాడట నవాబు, వెక్కిరించాడు భీముడు. జనాన్ని చంపుతున్నారు. అందు కేం చేయాలి? ప్రశ్నించాడు రావుడు.

"విప్లవం వర్ధిల్లాలె" పిడికిలి బిగించి, గొంతు చించుకొని కేకవేశాడు నాగేశ్. అతని కళ్ళు ఎర్రబడ్డాయి. రక్తం కక్కుతున్నాయి. వళ్ళు వణుకుతూంది.

వచ్చిన జనానికి ఏమీ అర్థంకాలేదు. ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు. ఏవో గుసగుసలు బయలుదేరాయి. జనం గుంపులుగా విడిపోయారు. చర్చలు సాగాయి. ఏదో మార్గం కనిపెట్టాలి. జనం తాసిల్దారు ఇంటి ముందు చస్తున్నారు. వెంకయ్య ఇంట్లో గుల్ల అవుతున్నారు. వారి శిస్తులు ఎవరు కట్టాలి? అదీ తెండింతలు! తమ శిస్తులు. అసలు వీరయ్యగారు ఏమనుకుంటున్నారు ? ఆయన్నే అడగాలనుకున్నారు. అంతా ముక్తకంఠంగా అడిగేశారు.

"నేను శిస్తు కట్టను. ఇది అన్యాయం...." అనేశారు వీరయ్యగారు. అంతా వారి ముఖం చూచారు. కళ్ళలో దృఢనిశ్చయం కనిపించింది. గంభీరంగా ఉన్నారు వారు. నిశ్చలంగా ఉన్నారు. అది వారి ప్రతిన! ప్రతిజ్ఞ!!

ఆ మాట ప్రజలతోపాటు శిస్తులు వసూలు చేయడానికి వచ్చిన మస్తాను బృందమూ విన్నది. తుపాకులతో పోలీసులు, దుడ్డుకర్రలతో దుర్మార్గులు, తలారులు గుమ్మందాటి లోనికి వచ్చేశారు.

"తాసిల్దారు శిస్తు కట్టమన్నడు" మస్తాన్ అధికార స్వరం.

"నేను కట్టను" వీరయ్యగారి దృఢనిశ్చయం.

జనాన్ని చూచి జంకాడు మస్తాన్. అయినా అన్నాడు "గొడ్లను పట్కపోతం".

"పట్కపోరి" వీరయ్యగారు అనుమతించారు. అంతా తెల్లబోయి చూచారు.

"ఎట్ల పట్టుకపోతారో చూస్త. ఇయ్యాళ తేలిపోవాలె" అని గొడ్లకొట్టానికి ఎదురుగా నుంచున్నాడు నాగేశ్.

జనం అంతా అతనిని అనుసరించారు, జనకుడ్యం నిర్మించారు.

''ఈణ్ణించి కదిలెడిదిలేదు. మేము చావాలె గొడ్లుపోవాలె" అన్నాడు భీముడు- కాదు-అరచాడు భీముడు.

మస్తాన్ గుండె గుబ గుబలాడింది. అయినా ముందుకు అడుగు వేశాడు. నాగేశ్‌ను లాగాడు. నాగేశ్ లాగి లెంపకాయ కొట్టాడు. తల గిర్రున తిరిగింది మస్తాన్‌కు. తూలి పడబోయి నిలదొక్కుకున్నాడు. జనంలో ఉద్రేకం పెరిగింది. పోలీసులమీద పడ్డారు.

పరిస్థితి విషమిస్తూంది, చేయిజారిపోతూంది. పరిగెత్తారు రఘు, జానకి

ప్రజలను శాంతింపచేయడానికి. వినేట్టులేరు. రఘును నెట్టేశారు. జానకి పడిపో యింది.

వీరయ్యగారు పరుగెత్తారు. గర్జించారు. "ఇది నా సొంత సంగతి. ఇందుల మీ జోకర్‌లేదు. జరుగుండి అడ్డం. పట్కాపోనియ్యండి గొడ్లను" గర్జనతోపాటే రుద్రుడలై గుంపులో దూకాడు. జానకిని లేవదీసి పోలీసులను విడిపించారు.

జనం పక్కకు జరిగి రాతిబొమ్మల్లా నుంచున్నారు. విచిత్రం జరిగింది. మాయ జరిగింది. గారడి జరిగింది. ఒక్కడు కదల్లేదు. ఒక్కడు మసల్లేదు. చిత్రకారుడు గీసిన చిత్రంలా నుంచున్నారు. నాటకంలోని సన్నివేశంలా నుంచు న్నారు. కనీసం ఊపిరి పీలుస్తున్న జాడ కనిపించలేదు.

పోలీసులు కొట్టంలోకి దూరారు. పశువులను విప్పారు. ఒక్కొక్కదాన్నే లాక్కొనిపోతున్నారు. అంత జనం మధ్యనుంచి తీసికెళ్తున్నారు. వీరయ్యగారు గంభీరంగా నుంచున్నాడు. దుఃఖాన్ని గుండెలో దాచుకున్నాడు. అది ముఖంలో కనిపిస్తూనేవుంది. సావిత్రిని లాక్కోపోతున్నారు. తన భార్య పేరు పెట్టి పెంచు కున్న ఆవు అది. మోర ఎత్తి వీరయ్యగారిని చూచింది. అంబా అని అరిచింది. వారిముందు క్షణం నుంచుంది. దాన్ని లాక్కుపోయారు. వీరయ్యగారి కళ్ళనుంచి టపటపా కన్నీరు రాలింది. జనం యావత్తూ విలవిల్లాడారు. అమాంతంగా ఒక గాలితెర వచ్చింది. దుమ్మును గిరగిరా సుడితిప్పి ఆవు వెనుక వెళ్ళిపోయింది.

ఆఖరి పశువు గంగమ్మ. అది లేగదూడ. తన చేతితో పచ్చిక మేపి పెంచింది జానకి. అది సావిత్రి బిడ్డ. గజ్జ గల్లు గల్లు మంటూండగా లాక్కో పోతున్నాడు మస్తాన్. అది ఒక్క గంతు వేసింది. జానకి కాళ్ళదగ్గర వాలిపో యింది. జానకి గుండెల్లో సముద్రం పొంగింది. గంగమ్మను కావలించుకొని హోరుమని ఏడ్చేసింది. దాన్ని విడువలేదు. ఒళ్ళు నిమిరింది. తల ముద్దాడింది. గంగ మ్మను వదలనన్నది. వీరయ్యగారు ప్రతిమలా నుంచున్నారు. కళ్ళల్లో నీళ్ళు నిండివున్నాయి. కదల్లేదు. రఘు వచ్చి దూడను విడిపించాడు. రఘు భుజంమీద వాలిపోయింది జానకి. పెద్దగా ఏడ్చింది. కన్నీరు జల జల రాల్చింది. ఇంక రాయడం కష్టం. గంగమ్మ వెళ్ళిపోయింది. దాని గజ్జెల చప్పుడు ఇంకా వినిపి స్తూనే ఉంది. అందరి గుండెలలో గల గలలాడింది. ఎందరి గుండెలు అగ్నిపర్వతా లైనాయో, ఎందరి గుండెలు మహాసముద్రాలైనాయో ఎలా చెప్పడం ?

సూర్యుడు మాత్రం సిగ్గుపడి క్రుంగిపోయాడు.

ఆ రాత్రి జరిగిన సమావేశంలో వీరయ్యగారు పెదవి కదపలేదు. నాగేశ్ చాలా తీవ్రంగా మాట్లాడాడు. ప్రజలను రెచ్చగొట్టే బదులు వారిలోని ఉద్రేకాన్ని అణచివేయడం జరుగుతూందన్నాడు. తాసిల్దారు ఆడిన ఆటకల్లా తాళం వేయడా నికి ఇంత అట్టహాసం ఎందుకు? అని అడిగాడు. జనమంతా కంటికి ఏకధారగా

ఏడుస్తున్నప్పుడు తామూ ఏడ్చిందానికంటె సన్యాసం పుచ్చుకోవడం మంచిదన్నాడు. ఇది భూస్వాములకున్న లక్షణమే అన్నాడు.

"నాగేశ్! మామయ్యమీద ఆరోపణ చెయ్యకు. ఒక హత్య జరిగి ఎంత గడ గడ జరిగిందో చూచినవు. జనాన్ని బాధ పెట్టిందానికంటే తానే బాధపడటం మంచిదనుకున్నారు. వారిని తప్పు పట్టటం మంచిదికాదు. ముందు మనం ఏమి చేయాలె అనే విషయం ఆలోచించాలె" అన్నాడు రఘు .

"తిరుగుబాటు. అంతకుమించిన మందులేదు. ఊరంతా తాసిల్దారు ఇంటి మీద పడాలె ... గొడ్లను విడిపించుకోవాలె, తాసిల్దారును ఖతం చేయాలె, అంతే"

"తెల్లవారి పోలీసుబలం దిగుతుంది. గొడ్లను మళ్ళ పట్టుకుంటది. ఊరంత తగలపెడ్తది. అప్పుడేం చేస్తం?"

"ఏం చేస్తమా? పోలీసుల్ను ఖతం చేస్తం."

"అది అంత తేలిక కాదు నాగేశ్! సరే నాకొక ఆలోచన వచ్చింది. జాగీర్దారుమీద కేసు పెడ్దాం ... కరువు వచ్చినపుడు రకాలు వసూలు చేయరాదని. ఏమంటావ్ ?"

ఆ ఆలోచన నాగేశ్‌కు తట్టలేదు. ఆలోచించాడు. అన్నాడు "నాకు కోర్టుల మీద విశ్వాసం లేదు. న్యాయం కలుగుతుందని నమ్మకం లేదు. అయినా ప్రయత్నించు."

కోర్టుకు పోవాలనే విషయం నిర్ణయం అయింది. వీరయ్యగారి పేర దావా వేయాలి. వకీలు రఘు.

సమావేశం నుంచి తిరిగివస్తున్నారు నాగేశ్, భీముడు. గస్తీ తిరుగుతున్న ఇద్దరు పోలీసులు కనిపించారు. ఇద్దరూ చీకట్లోకి నక్కారు. పోలీసులు వారిని దాటి వెళ్ళిపోయారు మాట్లాడుకుంటూ. కాని వారికి ఏదో అలికిడి వినిపించింది. అక్కడే నిలిచి బీడీలు కాల్చుకున్నారు అగ్గిపుల్ల వెలుగుకు ఏవో రూపాలు కనిపించాయి. అనుమానం కలిగింది. కరువుకు దొంగలు ఎక్కువైనారు. దొంగలే అనుకున్నారు. పట్టాలనుకున్నారు. తుపాకులు బుజాలకు ఉన్నదీ లేనిదీ చూచుకున్నారు. రెండడుగులు ముందుకు వేశారు. మళ్ళీ అడుగు వేయకుండానే "కౌన్ హై" అడిగారు ఇద్దరూ. మళ్ళీ ఏదో అలికిడి వినిపించింది. నాగేశ్, భీముడు కూర్చున్నారు. ఆ అలికిడికి జంకారు పోలీసులు. అయినా ముందుకు అడుగువేసి అగ్గిపుల్ల గీశారు. ఆ వెలుగుకు రెండు ఆకారాలు కనిపించాయి. "ఎవరు ?" అని ఇంకా దగ్గరికి వచ్చారు. అప్పుడు గుర్తించారు "ఓహో లీడర్లా" అని మరీ దగ్గరికి వచ్చారు.

కూర్చున్నవారు లేవలేదు.

ఇద్దరూ ఇద్దరు పోలీసుల కాళ్ళమీద పడ్డారు. క్షమించమంటూ కాళ్ళు గట్టిగా పట్టుకున్నారు. పోలీసులు కదలలేకుండా అయిపోయారు. 'లేవండి—లేవండి.

ఏమీ అనం' అంటూనే వున్నారు. ఇద్దరూ ఇద్దరు పోలీసుల కాళ్ళు పట్టుకొని లాగడమూ పోలీసులు కింద పడిపోవడమూ వారి రొమ్ములమీద కూర్చొని గొంతులు పిసకడమూ క్షణంలో జరిగిపోయాయి. ఇద్దరు పోలీసుల ప్రాణాలు ఆకాశంతో కలిసిపోయాయి. ఇద్దరి దగ్గరినుంచీ తుపాకులూ, తూటాలు తీసుకున్నారు. ఇద్దరూ తుపాకుల్లో తూటాలు దూర్చి రెండు కళేబరాల గుండెల్లో కాల్చారు. తుపాకులు తగిలించుకొని పారిపోయారు.

తుపాకులు పేలిన ధ్వనికి చుట్టుపట్ల వాళ్ళు లేచారు. చూస్తే పోలీసులు రక్తపు మడుగులో పడివున్నారు. హడలిపోయి కేకలు పెట్టారు. క్షణంలో ఊరంతా ఏకం అయింది. అంతా అక్కడ కూడింది. రెండు పోలీసు శవాలు రక్తంలో తేలు తున్నాయి. అందరూ సంతోషించారు. అందరూ హడలిపోయారు. వీరయ్యగారూ రఘు జానకికూడా వచ్చారు. వారి హృదయాలు పరితపించాయి.

తెల్లవారింది. తాసిల్దారు గుండె గుబగుబ లాడింది. పోలీసుల శవాలను పూడ్పించాడు. పోలీసుల చావుకంటే పోయిన తుపాకులను గురించి ఆయనకు బెంగ పట్టుకుంది. తీసుకొని పోయిందెవరో అతనికే కాదు ఊరందరికీ తెలిసిపోయింది. కాని ఏం చేయాలో అర్థంకాలేదు. ఒకసారి ఊరంతటినీ హడలుకొట్టా లనుకున్నాడు. హడలుకొట్టాడు. పోయిన రెండు తుపాకుల ఖరీదు వూరిమీద వసూలు చేశాడు. తన ఇంటికి రోజూ పోలీసు కాపలా ఏర్పాటు చేసుకున్నాడు. ఇప్పుడు మస్తాన్ కూడా పోలీసు అయిపోయాడు. అతనికీ తుపాకి వచ్చేసింది.

రఘు హైదరాబాదు వెళ్ళాడు జాగీర్దారుమీద కేసు వేశాడు.

"అదాలతుల్ ఆల్యాలో జాగీర్దారుమీద కేసు" అదే ఒక వింత వార్త అయి రాజ్యమంతటా వ్యాపించింది.

రఘు వాదన వినడానికి వచ్చిన జనంతో హైకోర్టు కిట కిట లాడింది. న్యాయాన్ని గురించీ, ప్రభువుల ధర్మాన్ని గురించీ అనర్గళంగా వాదిస్తున్నాడు రఘు.

గోరంతలను కొండంతలుచేసి ప్రకటించాయి పత్రికలు. బొంబాయి నుంచి రావలసి వచ్చింది జాగీర్దారు. కోర్టుకు హాజరుకాకుండా తప్పుకున్నాడు. కాని క్రుంగిపోయాడు నవాబు. "బద్‌హో మగర్ బద్నాం నహో" ఇది ఉర్దూ సామెత. చెడ్డవాడు కావచ్చు కాని చెడుపేరు రావద్దు. ఇప్పుడు బద్నాం అయినాడు జాగీర్దారు అతనికి తోటి నవాబులలో తల వంపులైంది. అందుకుతోడుగా కోర్టువారు "స్టే" ఉత్తరువు ఇచ్చారు. దాంతో జాగీర్దారు గుండెలు పగిలాయి.

నవాబు రఘు ఉన్న హోటలుకు వెళ్ళాడు. నవాబును చూచి ఉలికి పడ్డాడు రఘు లేచినుంచుని సలామ్ చేశాడు. ఆసనం చూపించాడు.

"మేము కూర్చోవడానికి రాలేదు. ఒక్కమాట మాకు విన్నవించుకుంటె మాఫ్‌చేసే వాళ్ళంకదా! మేం ప్రభువులం. మీరు మాకు బిడ్డలు. రకాలు మాఫ్

చేస్తున్నాం. కుక్కల పెండ్లి విరమించుకొన్నాం. దావ వాపసు తీసుకో. ఇది మా ఆజ్ఞ. ఇదిగో మా ఉత్తరువు" అని చేతి కందించాడు.

శిలా ప్రతిమలా నుంచున్నాడు రఘు. అతనికి ఏమీ తోచలేదు. నవాబు చెప్పిందంతా విన్నట్లూ లేదు. యంత్రవత్తుగా కాగితం అందుకున్నాడు. నవాబు అతని ప్రత్యుత్తరానికి నిరీక్షించనూలేదు. వెళ్ళిపోయాడు.

రఘు మంచంలో పడిపోయాడు. అతనికి లోకం యావత్తూ గిర గిరా తిరుగుతున్నట్లనిపించింది. "మనిషి మంచివాడా ? పరిస్థితులకు లొంగాడా ?" అదీ అతనికి అర్థంకానిది. మెదడు చీల్చుకొని ఆలోచించాడు. పరిపరి విధాల ఆలోచించాడు. ఎంతో ఆలోచించాడు. ఏమేమో ఆలోచించాడు. మలచాల్సింది పరిస్థితులనా ? మనిషినా ? ఏమేమో ఆలోచించాడు. ఆలోచనల బరువుకు మెదడు అలిసిపోయింది నిద్రపోయాడు.

ఇది ఎవరికి విజయం ?

ఊరు నిట్టూర్పు విడిచింది. వారి ఆకలి తగ్గలేదు. కాని తమతమ పశువులు ఇండ్లకు వచ్చాయి. అంతే చాలు రైతుకు. పశువులు అతనికి ప్రాణం. తాను ఉప వాసాలూ, ఉప్పిళ్ళు ఉంటాడు. కాని పశువుముందు మేతలేకున్నా అదీ నేల నాక డాన్ని చూచినా అతని ప్రాణం నిలువునా లేచి పోతుంది.

సావిత్రి ఇంటికి వచ్చింది.

గంగమ్మ జానకి వడిలోనికి చెంగున దూకింది.

అంబరాలు అందుకున్నారు వారు.

ఊరు వూపిరి సల్పుకుంది. నిజమే, కాని తాసిల్దారు తబ్బిబ్బైనాడు. గిర్దావరు విలవిలలాడాడు. కరువు వారి ఇళ్ళల్లోకూడా కాలు పెట్తుందేమోనని భయపడ సాగారు. విందులు బందైనాయి. విలాసాలు ఆగిపోయాయి. జంగళాకు నగిషీ పని నిలిచిపోయింది. వెంకయ్యకూడా భీష్మించుకున్నాడు. అధికారం అంతంత మాత్రం అయింది. తుపాకుల మనుషులు అక్కడా ఇక్కడా కనిపిస్తున్నారని వదంతులు వ్యాపించసాగేయి. ఇద్దరు అధికారులూ సమావేశాలు జరిపారు. ఒక్కొక్కసారి వెంకయ్యనుకూడా పిలచారు. తుదకు ఒక నిర్ణయానికి వచ్చారు. కోయల దగ్గర శిస్తులు వసూలు చేయాలి. వారికేం తెలుస్తాయి ఈ విషయాలన్నీ ? వారు ఉట్టి ఆటవికులు. వారిమీద పెత్తనం సాగించాలి. డబ్బు గుంజాలి. వెంకయ్య సహాయం చేస్తానన్నాడు. గిర్దావరు కోయగూడేలకు ప్రయాణం కావాలి. జంకాడు గిర్దావరు. పోలీసును ఇస్తానన్నాడు తాసిలారు. అయినా ఇద్దరిని మించి ఇవ్వనన్నాడు. గిర్దావరు వెళ్ళనంటే బెదిరించాడు. వసూలు చేసిందాంట్లో భాగం ఇస్తానని ఆశ చూపాడు. శిస్తు జాగీర్దారుకు పంపాల్సిన అవసరంలేదు. రెండే భాగాలు ! ఆశ పడ్డాడు గిర్దావరు. అంగీకరించాడు. గుర్రాలు, డప్పులవాళ్ళు, పోలీసులు, తలార్లు సాగింది గిర్దావరు రథం. అడవులు, కొండలు, కోనలు దాటారు. కోయగూడెం కని

పిస్తూంది. అది కోయలోకానికి ముఖద్వారం లాంటిది. రెండు కొండలు కలుసుకోక ఒక ద్వారాన్ని ఏర్పరచాయి. ఆ ద్వారం దాటాలి. అక్కడికి గిర్దావరు బ్యంచం. అక్కడ విడిసింది. తలారును పంపించాడు గిర్దావరు. అది రాజలాంచనం. అమాంతంగా వెళ్ళరాదు. కోయలు అన్ని ఏర్పాట్లూ చేయాలి. అప్పుడుగాని ఈ ప్రభువులు అంపు అడుగిడరు.

తలారి శివడు గజ్జ గల్లు మనిపించుకుంటూ గూడెంలో అడుగుపెట్టాడు. గూడెంలో జనం అంతా గుడిసెల ముందుకు వచ్చి అసహ్యంగా చూచారు. తలారి, సమ్మయ్య ఇంటికి చేరాడు. సింగన్న మంచంలో కూర్చొని కూని రాగాలు తీస్తూ ఏదో చదువుతుంటున్నాడు. గజ్జల చప్పుడు విని తలెత్తి చూచాడు. మళ్ళీ చదువు సాగించాడు. తలారి శివడు వచ్చి ఉరిమాడు. గిర్దావరు వస్తున్నాడని చెప్పాడు.

"ఉస్ వస్తే ఏమంటావ్ ?"

ఆశ్చర్యపడ్డాడు తలారి. తాను వస్తేనే అడుగులకు మడుగులొత్తే జనం తనను కనీసం కూర్చోమనలేదు సరిగదా ఇలాంటి జవాబు ఇస్తున్నాడు.

"ఏమో న్ఖరాల్చేస్తున్నవు. గిర్దావరుసాబ్ వస్తాండు. ఇంతెజాములు చెయ్యాలె. లేకుంటే తోళ్ళొలుస్తడు."

పుస్తకం మూసి అన్నాడు సింగన్న.

"గిర్దావరొస్తంటే ఇంతెజాములు చేస్కొమ్మను. కోయదొర లెందుకు చేస్తరు ? జీతం తింటలేడా ?"

అప్పటికి గూడెమంతా అక్కడికి కూడింది. సింగన్న చెప్పిన మాటలు విన్నారు. సంతోషించారు.

మండిపోయాడు తలారి. "దొరలొస్తాను. అండ్లనే అడుగు. పోలీసోల్లు గూడొస్తాను. పానాల్తీస్తరు. మస్తీ ఎక్కింది మీకు" అని చరచరా సాగిపోయాడు తలారి.

వాణ్ణి చూచి అంతా గొల్లున నవ్వారు.

తలారి గుండె గుబ గుబ లాడింది.

అతడు పరిగెత్తాడు కాని గజ్జ గల్లు మనలేదు.

తనుస్తూనే రహస్యంగా విన్నవించాడు గిర్దావరుకు. గిర్దావరుకు చెమటలు పట్టాయి. గుండె దడదడలాడింది, లోకం తల్లక్రిందులు అవుతున్నట్లనిపించింది. పేలవతె పడి ఉండే జనం పులులు అయినారు. పులిని చూచి పలాయనం చిత్తగించడమా ? ఎదిరించడమా ? తేల్చుకోలేక పోయాడు. తికమక పడ్డాడు. తోచడంలేదు. తల తిరుగుతూంది. అది అడవి. కోయలకు కోట. కోటలో చిక్కుకున్నాడు తాను. "బ్రతికి యుండిన శుభములు బడయవచ్చు. మాధవా ! మన రథమ్ము మరల నిమ్ము" అన్న అర్జునుని మాటలు గుర్తుకు వచ్చాయి. తాను అర్జునుని కంటే గొప్పవాడా ! పలాయన మంత్రమే పరమ మంత్ర మనుకున్నాడు. తనకు జ్వరం

వచ్చిందన్నాడు. తిరిగిపోతానన్నాడు. గుఱ్ఱం ఎక్కుతూ మస్తాన్ వీపు చరిచాడు. ధైర్యం చూపాలన్నాడు. పేప నిలబెట్టుకోవాలన్నాడు. సలాములు అందుకున్నాడు. రెండు మడమలతోనూ డొక్కలలో తన్నాడు గుఱ్ఱాన్ని. అది శరవేగంగా సాగి పోయింది. అడవి దాటేదాకా ఆగలేదు. అప్పుడు నురుగులు కక్కింది. గిర్దావరు ఊపిరి పీల్చుకున్నాడు. పక్కనే పల్లెవుంది. పల్లెమీద నమ్మకం కలుగలేదతనికి. గుఱ్ఱాన్ని నడిపించుకొని రావలసిందని శివుడికి అప్పగించాడు. కాలికి బుద్ధిచెప్పాడు. అర్ధరాత్రి ఇంటికి చేరుకున్నాక బొందిలోకి ప్రాణాలు వచ్చాయి.

నిజంగానే జ్వరం వచ్చేసింది.

వళ్ళు సలసల కాగిపోయింది.

గిర్దావరు వీపు చరచడంలో వీరుడై పోయాడు మస్తాను. తాను అమీను అయిపోయాననుకున్నాడు. తాసిల్దారు అధికారం తనకే వచ్చేసిందనుకున్నాడు. నౌకరీగాడు చేత్తో తుపాకి ఎత్తి, "చలో" అన్నాడు. ఈ తడవ అయినా తాసిల్దారు మెప్పు పొందా లనుకున్నాడు. అడుగు వేశాడు ముందుకు. అందరినీ అనుసరించ మన్నాడు. అనుసరించాయి గొర్రెలు. అవి ఆకలితో ఉన్నాయి! అడవులకంటే ఆనందంగా బయలుదేరారు. కోయదొరలు ఉప్పసారాయి పోస్తారనుకున్నారు. రక రకాల మాంసాలు లభిస్తాయనుకున్నారు. ఉల్లాసంతో బయలుదేరారు. నోళ్ళలో నీరు వూరుతుండగా, నాలుకలతో పెదవులు తడుపుతున్నారు. నాగలోకానికి వెళ్తున్నా మనుకున్నారు. పాపం వాళ్ళకేం తెలుసు ఏం జరిగిందో!

కోయగూడెంలో ప్రవేశించారు మస్తాన్ సహితంగా మనుషులు. కుక్కలు మొరిగాయి. వూరు బోసిగావుంది. ఒక్క మనిషిలేడు. బిక్కు బిక్కు మంటూంది గూడెం. మస్తాన్ గుండెలో గుబులు పుట్టింది. అది భయంకరం అయిన మౌనం. ఎవని నోటా మాట రాలేదు. ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు. అందరి గుండెల్లోనూ రాళ్ళు కురిశాయి. మౌనం భరించలేకపోయాడు మస్తాన్. పెద్దగా కేక పెట్టాడు. ఎందుకు పెట్టాడో అతనికే తెలియదు. కొండగుహలు ఆ కేక మళ్ళీ వేశాయి. తన కేక తనకు కొంత ధైర్యం తెచ్చింది. కొండకేక దాన్ని చంపింది. అతడు చిరాకు పడ్డాడు. అందరిమీదా ఎగిరాడు. కేకలు పెట్టమన్నాడు. అంతా అరచారు. దాంతో వారికి ఎంతో ధైర్యం వచ్చింది. గుడిసెల్లో దూరారు. కుండలు బద్దలకొట్టారు. మంచాలు విరక్కొట్టారు. తడకలు పీకారు. వారికి ఏదో ఆవేశం వచ్చింది. కోయలను రావలసిందని కేకలు పెట్టారు. రాకుంటే గూడెం తగలపెడ్తా మన్నారు. ఒక్క కోయ రాలేదు. వారి కేకలే తిరిగి వచ్చాయి. రెచ్చిపోయాడు. దొరికిందల్లా తెచ్చి గూడెం మధ్యన వేశాడు. నిప్పంటించాడు. చిటపటమని మంట లంటుకున్నాయి. పెద్దగా మంట సాగింది. నాల్కలు చాచుకొని మండింది. అది తనగెలుపు అనుకున్నాడు మస్తాన్. తనకు ఇక్కడ ఎదురు లేదనుకున్నాడు. ఊరంతటికీ నిప్పంటించాడు. ఆ మంటలు చూచి అతనికి వెర్రి ఆవేశం వచ్చింది.

కేకలు పెట్టాడు. అందరినీ అరవమన్నాడు. తాను ఎగిరాడు. అందరినీ ఎగిరించాడు. అందరూ ఎగిరారు. అంతా తాగివున్నారు. ఆది గూడెంలో దొరికిన సారాయి. తప్పెటాగారు. తందనాలాడారు.

సూర్యుడు కుంగుతుంటే వారి గుండెలు కుంగాయి. అంతా బాగానే వుంది. కాని ఆకలి, డొక్కలు మండుతున్నాయి. దానికితోడు భయం. చీకటి కానున్నది. అడవి. తెలియని దారులు. ఎలా ఇల్లు చేరడం? కోయలు, వాడు పగపడ్తే? ప్రాణాలతో ఇల్లు చేరగలరా? మత్తు చచ్చిపోయింది. మనసు గుబగుబలాడింది. నీరసం పెరిగింది. నిరుత్సాహం గుండెల్లో చేరింది. ప్రాణభయం! అంతకుమించిన భయం ఏది? చుట్టూ చూచాడు మస్తాన్. అంతా శ్మశానంలా వుంది. దూరంగా అడవి గువ్వలు అరుస్తున్నాయి. చీకటి పడితే అరచే గుడ్లగూబలు అతని గుండెల్లో అరచాయి. ఆమాంతంగా కాలిబాట కనిపించింది. అది ఆతనికి బ్రతుకుబాట అయింది.

"దొడో" అన్నాడు మస్తాన్.

తుపాకి చేతపట్టుకొని పరిగెత్తాడు.

అందరూ ఆతనిని అనుసరించారు.

రెండు పక్కలా అడవి.

ఇరుకైన కాలిబాట.

ప్రాణాలు అరచేతుల్లో ఉన్నాయి.

పరిగెత్తుతున్నారా జనం.

పరిగెత్తుతున్నారు జనం.

ఎక్కడికి?

ఎంతదూరం?

## 9

వానలు బాగా పడడం మూలాన బాగానే పండేయి. ఏ ఇంట్లో చూచినా ధాన్యం. ఎక్కడ చూచినా గడ్డి, వీధులనిండా గడ్డిపరకలే — వడ్లగింజలే. ఉసూరు మంటూ ఉండిన ఊరు ఊపిరి పోసుకుంది. కలకల లాడింది. నవ్వించింది. మళ్ళీ కోలాటాలు, కోయిలల రాగాలు మొదలైనాయి. జనుల ముఖాలమీద ఉత్సాహం కనిపించింది. బ్రతకగలమనే ధైర్యం కనిపించింది. కాని చాలా మంది రైతులు, కూలీలుగా మారారు. సాహుకారుకు కుదువ పడ్డారు. వారు తమ భూములనే దున్నుకున్నారు. కాని సాహుకారు పక్షాన ఆతనికి కొలుగింజలు చెల్లించారు. తమ భూముల లోనే తాము కూలీలుగా మారారు!

మంగలి రావఁడుకూడా కూలీ అయినాడు. పంట పొలంలో ధాన్యం ఉంతగా బండి కట్టించుకొని బస్తాలతో దిగాడు వెంకయ్య. ధాన్యరాశిని చూచి మురిసి పోయిన రావఁడు, వెంకయ్య బ్రొరను చూచి కుంగిపోయాడు. ఇంతలో ఉద్రేకం పొంగింది. ఇది తన భూమి. తాము తరతరాలుగా దున్నుకుంటున్నారు. దాన్ని కాజేయడానికి వెంకయ్య ప్రయత్నించాడు. తాను సాధించాడు. ఇప్పుడు ఇది వెంకయ్యది అయిపోయింది. తాను కూలీగా మారాడు ! కౌలుదారుగా మారాడు ! వెంకయ్య యజమానిలా వచ్చి కళ్ళంముందు కూర్చున్నాడు ! అతనికి గింజలు చెల్లించాలి. ఇందులో ఏదో అన్యాయం ఉందనిపించింది అతనికి. తన కష్టపు పంట వెంకయ్యకు ఎందు కివ్వాలి ? ఇవ్వడానికి వీల్లేదు. ఏం జరుగుతుందో చూతాం.

"ఏమో వచ్చినవు ?" అడిగాడు రావఁడు వెంకయ్యను.

"అట్లడుగుతవు ? కౌలువు కౌలు గింజలు"

"నా జమీనుకు నేనే కౌలు కొలుస్తనా?"

"ఆదేంది ? నీ జమీ నెట్లయితది? కాయితం రాసిస్తివిగద!"

"ఇగొ...సావుకారూ! కాయితం గీయితం నాకెరికలే. గింజలు అప్పు పెట్టినవు. అవ్వి కొలిపిస్త. తీస్కపో. కౌలు గివులు అంటావా నేనిచ్చెడ్డి లేదు. నువ్వు తీస్కనెడ్డిలేదు. ఇన్నవా?"

సాహుకారు ప్రాణాలు పైపైనే పోయినయి. రామ్మా తలా బాదుకుంటూ పెద్దగా ఏడ్వసాగించాడు. "నన్ను ముంచిండిరో నేను మునిగిన్నురో" అని రాగం ఆలాపించసాగాడు. "రావఁడూ నే నీడనే చస్త. ఉపాసాలు ఉప్పిస్కంట. నా పీనుగ మీదినించి గింజలు తీస్కపోవాలెరో" అని శోకం పెట్టాడు. శోకం విని చుట్టుపక్క కుప్పల జనం చేరారు! తలా ఒక నీతి చెప్పారు. ఏమి చెప్పినా రావఁడు గింజలు ఇవ్వనన్నాడు. సాహుకారు తీసుకోకుండా కదలనన్నాడు.

రావఁడు బండ్లో గింజలు నింపాడు.

సాహుకారు బండి ముందు పడుకున్నాడు.

నలుగురు రైతులు సాహుకారుని పట్టుకుని లేవదీశారు. గట్టిగా పట్టుకున్నారు. గిలగిల తన్నుకున్నాడు సాహుకారు. గజ్జెలు గలగల లాడిస్తూ ఎడ్లు సాగిపోయాయి. సాహుకారు తల బాదుకుంటూ సాగిపోయాడు. తాసిల్దార్ కాళ్ళమీద పడ్డాడు. నజ్రానా సమర్పించుకున్నాడు. మస్తాన్ను అప్పగించాడు తాసిల్దారు. మస్తాను బృందానికి సారాయి కొట్టుకు చీటీ ఇచ్చాడు వెంకయ్య. మస్తాన్ బృందం ఆ రాత్రి రావఁడి ఇంటిమీద పడింది. రావఁడూ అందుకు సిద్ధంగానే ఉన్నాడు. ఎదిరించాడు. కాని దెబ్బలు తిన్నాడు. తలమీద బలమైన గాయం తగిలింది. పడిపోయాడు. నెత్తురు దోగిన గింజలు సాహుకారు ఇంటికి చేరాయి. పొలం తనదని నిరూపించుకున్నాడు. అయినా ఆ రాత్రి సాహుకారుకు నిద్రపట్టలేదు. ఏదో అపాయం నెత్తిమీద పడనున్న దని శంకించింది అతని హృదయం. ఏం చెయ్యాలో అర్థం కాలేదు.

తెల్లవారింది. లేచి ముంగిల్లోకి వస్తే చీటీ కనిపించింది. "రావడి గింజలు వాపసు ఇచ్చెయ్యి. ఎవరి గింజలు వారికి ఇయ్యి. వసూళ్ళు నిలుపు చెయ్యి. అన్నీ ఇవ్వాళ సాయంకాలం వరకు జరగాలె. లేకుంటే నీ ఇంట దర్వాజకే నీ మొండెం వేళ్ళాడ్తది."

చీటీ చదువుకొని కూలబడ్డాడు వెంకయ్య. ముచ్చెమటలు పోశాయి. కళ్ళు చీకట్లు కమ్మాయి. తల పట్టుకొని కూర్చున్నాడు. మసక మసకగా ముందు చీటీ కనిపిస్తూంది అది ఎవరు రాశారో తెలియదు. ఎక్కడనుంచి వచ్చినదో తెలియదు. నిజమో కాదో తెలియదు. నిజంగా తనను చంపుతారేమో? ఏమో? తుపాకుల మనుషులు తిరుగుతున్నారు. అది నిజమే అయితే తావచ్చు. ఎవడు తెచ్చుకుంటాడు నెత్తికి. బతికి ఉంటే బలుసాకు తినవచ్చు. ఎప్పుడూ అలాగే ఉంటుందా కాలం? వాళ్ళు పట్టుపడరా! అప్పుడు పగసాధిద్దా మనుకున్నాడు. చీటీ విషయం ఎవరికి చెప్పరాదనుకున్నాడు. సాయంకాలం వరకు అందరి గింజలూ కొలిచేశాడు. ఊరు ముక్కుమీద వేలు వేసుకుంది. అసలు విషయం ఎవరికీ తెలియదు. తన ఔదార్యం ప్రకటించాడు వెంకయ్య. బాపడు తనకు గ్రహాలు బాగా లేవన్నాడని చెప్పాడు. ధాన్య దానం అందుకు శాంతి అన్నాడనీ చెప్పేడు.

అయినా ఎవడూ నమ్మలేదు.

అందరికంటే ఎక్కువ తాసిల్దారు ఆశ్చర్యపడ్డాడు. ఎంత అడిగినా చెప్పలేదు వెంకయ్య. దొంగకు తేలు కుట్టింది! ఏమని చెప్పుకుంటాడు? లోపల్లోపల క్రుంగిపోసాగాడు. రోజు రోజుకూ పాలిపోతున్న రుక్మిణికి సైతం చెప్పలేదు. భార్య గుచ్చి గుచ్చి అడిగింది. చెప్పలేదు. ఏదో విచారం అతనిని కుంగదీయ సాగింది. వైద్యునికి అది అంతుపట్టలేదు. మంచంలో పడే దశకు వచ్చాడు. రఘూ, జానకీ కూడా వచ్చి చూచి పోయారు. ఒకటి రెండుసార్లు అతని ఔదార్యాన్ని మెచ్చుకున్నారు. ఆ మెప్పుకోలు గుండెలో సూదులై గుచ్చుకుంది వెంకయ్యకు.

కూతురు వ్యాధి తనకు అంతుపట్టడం లేదు. తన వ్యథ వైద్యునికి అర్థం కావడంలేదు. మందులు మాత్రం మింగిస్తున్నాడు.

ఊరు ఉడుకుతుండగా ఒకనాటి ఉదయం రఘుకోసం ఒక కోయ దొర వచ్చాడు. నమస్కరించాడు. నమస్కారం అందుకొని ఆశ్చర్యపడ్డాడు రఘు. కోయ దొరలు నమస్తే, అనడం! ఎంత మార్పువచ్చింది. అతనే రఘు అని తెలుసుకున్న కోయదొర చీటీ అందించాడు. అందుకుని చదువుకున్నాడు రఘు.

"రఘు గారికి"

నమస్కారములు.

మీతో ముఖ్య విషయాలు మాట్లాడాలె. దయచేసి చీటీ తెచ్చిన మనిషి వెంట రాండి. ఎవరికీ తెలియ నీయవద్దు. చీటీ కాల్చివేయండి.

మీ
నాగేశ్.

ఎంతకాలానికి నాగేశ్‌నుంచి వార్త! అతని హృదయం ఆర్ద్రీతం అయింది. వచ్చినవాడు ఎవడు? ఎక్కడికి వెళ్ళాలి? వెళ్ళడంలో క్షేమం ఉందా? ఇవేవీ ఆలో చించలేదు. చొక్కా వేసుకున్నాడు. చెప్పులు తొడుక్కున్నాడు. చీటీ జేబులో వేసు కొని బయలుదేరాడు. అతను గుమ్మందాటాడు. జానకి గుమ్మంలోకి వచ్చింది. ఎక్కడికి వెళ్తున్నది, ఆమెకు ఏదో ఆతురత కలిగింది. ఆందోళన కలిగింపి. అడుగుదామనుకొంది. అంతలోనే దాటిపోయాడు రఘు. అంతవరకు తనకు చెప్ప కుండా ఏ పని చేయలేడు రఘు. ఏమిటీ మార్పు! ఆమెకు ఏమీ అర్థం కాలేదు. తండ్రి దగ్గరికి వెళ్ళి చెప్పింది. వారు గంభీరంగా ఊరుకున్నారు. "వస్తాడులే" అని మాత్రం అన్నాడు.

ముందు కోయదొర, వెనక రఘు సాగిపోతున్నారు. ఊరు దాటారు. పొలాలు దాటారు. పొలిమేర దాటారు. ముందుకు సాగిపోతున్నారు. ఊళ్ళు వెనక్కు పోతున్నాయి. కొండలు, బండలు నడిచిపోతున్నారు చిత్త ఎండ నెత్తి మాడ్చేస్తూంది. మనిషి అలసిపోయాడు' మనసు అలసిపోయింది. అయినా బాట అలయలేదు. సాగుతూనే ఉంది—చీమల బారులా ఎక్కడికి? ఎంత దూరం? ఏ వూరు? ఎన్ని ప్రశ్న అడిగినా కోయదొర నుంచి జవాబు రాలేదు. మాటలేదు, ముచ్చటలేదు. మౌనంగా సాగడం కష్టం. మాటల్లో బాట గడుస్తుంది. ఆటలా సాగిపోతుంది నడక. ఒంటరి తనం, మౌనం వీటితో బాట పొడవు అవుతుంది. అలా అని కాదు. అసలే పొడవుగా వుంది దారి. పైగా మౌనం. పైన ఎండ అందుకు అలశాడు రఘు. అయినా సాగుతున్నాడు. బాట పడిసింది. ముగిసింది. ఆగింది.

దాని గమ్యం మరొక చోటికి. కోయదొర బాట దిగాడు. రఘు అనుస రించాడు. బాటలేదు. కంప, ముళ్ళు, ముళ్ళచెట్లు దుబ్బులు, పొదలు పదునైన రాళ్ళు. ఏది ఎక్కడ వుందో తెలియదు. ఎక్కడ పురుగుందో ఎక్కడ పాముందో? కర్రతో బాటచేస్తూ సాగుతున్నాడు దొర. "అగ్రతస్తే గమిష్యామి మృద్నన్ పాషాణ కంటకాన్" అన్నాడు లక్ష్మణుడు ఆ పని చేస్తున్నాడు దొర. అనుసరిస్తు న్నాడు రఘు. అడవి చిక్కని అడవి చల్లగా ఉంది. చీకటిగా ఉంది. ధైర్యంగా సాగుతున్నాడు దొర. ధైర్యం చచ్చి నడుస్తున్నాడు రఘు. బాటలేదు. మాటలేదు. ఎంతదూరం నడవాలి? దొర. జవాబు చెప్పడు. అంతే నడుస్తున్నాడు. అడవి దాటింది, బయలు వచ్చింది.

"వచ్చేది దెవరు? నిలువురి" కేక వినిపించింది. చూచాడు. ఒక గుండుమీద ఒక కోయ గజ్జల్లోకి బట్టవుంది. తుపాకి గురిపెట్టాడు. "ముందరికి రావద్దు చస్తరు" మళ్ళీ కేక. వాతావరణం వింతగా ఉంది. మనిషి కాదు. పిట్ట పీచుమనటంలేదు. గుండె బులుక్కు బులుక్కు మన్నది. రఘు ను పిలిచింది నాగేశేనా? అని అనుమానం కలిగింది. దాంతో మరీ బిక్కు బిక్కు మన్నాడు. దోస్త్ బందూక్ దింపు" ముందున్న దొర కేక పెట్టాడు. యాంత్రికంగా తుపాకి దింపాడు. బొమ్మలా

నుంచున్నాడు. బండమీది కోయ ముందు నడుస్తున్న దొర దారితీశారు. బండ దాటారు. చాటున ఉన్నాడు నాగేశ్. ప్రాణం లేచి వచ్చింది రఘుకు.

"నాగేశ్!" కేక పెట్టాడు.

"అన్నా?" కేక పెట్టి పరుగెత్తుకొనివచ్చి కౌగిలించు కొన్నాడు నాగేశ్. "ఎంత కాలానికి కలిసినవు నాగేశ్!" అని గట్టిగా రొమ్ముకు హత్తుకున్నాడు రఘు .

"అన్నా! నిన్ను మళ్ళ చూచిన చాలు. రుక్మిణి ఎట్లున్నది?" ఆ ప్రశ్న అతడు అడగదలుచుకున్నది కాదు అయినా వచ్చేసింది. అయినవారి ముందు మనసు దాగదు.

బాగానే ఉందని జవాబు చెప్పాడు రఘు . ఆమెను గురించి అడుగుదామనుకున్నాడు నాగేశ్. కాని అడగలేకపోయాడు. అక్కడ ఓ పదిమంది కోయదొరలున్నారు. అందరి బట్టలు గజ్జల్లోకే. అందరి చెంపలూ లొట్టలే. అందరి కళ్ళూ పీక్కుపోయాయి. ఆరు తుపాకులు బండలకు ఆనించి ఉన్నాయి. వారిలో సింగన్న రఘును గుర్తించాడు. నమస్కరించాడు. భీముడు తలవంచి దండం పెట్టాడు. రావడి తలకు పట్టు ఉంది. మిగతా వారిని రఘుకు పరిచయం చేశాడు నాగేశ్. రఘును తనకు అన్నగా, గురువుగా, తనను మనిషిని చేసినవానినిగా పరిచయం చేశాడు. అందరూ వరుసగా నుంచున్నారు. వందనం చేశారు. అంతా వింతగా కనిపించింది రఘుకు. ఈ వ్యవస్థకు కారణం అయిన నాగేశ్ విషయంలో గౌరవం ఏర్పడింది.

ఇద్దరూ ఏవేవో మాట్లాడుకున్నారు. స్నానాలు చేశారు. రఘు కోసరం ప్రత్యేకం అయిన భోజనం తయారైంది. రఘు నిరాకరించాడు. కోయల భోజనమే చేశాడు. పడుకొని ఇద్దరూ చర్చ సాగించారు

ఆయుధంతో అందరినీ లొంగదీయవచ్చు నన్నాడు నాగేశ్. తాము పోలీసు వారిని చంపి ఆయుధాలు తేవడం, పోలీసులు కోయగూడెం తగలపెట్టడం, వెంకయ్యకు ఉత్తరం రాయడం, తాను కోయ దొరలను కూర్చుకోవడం, వారిని సమరానికి సమాయత్త పరచడం వగైరాలన్నీ ఎంతో వివరంగా చెప్పాడు.

వెంకయ్య లొంగడానికి గల కారణం అప్పుడుగాని అతనికి అర్థం కాలేదు. బలప్రయోగానికి మించిన మందు లేదా? అని ఆలోచించాడు. తాను నాగేశ్‌కు ఒక మార్గం చూపాడు. ఇప్పుడు నాగేశ్ తనకు ఒక మార్గం చూపుతున్నాడు! ఎవరిది, సరియైన మార్గం? ద్వివిధలో పడ్డాడు రఘు.

"ఆయుధం అందరినీ లొంగదీస్తుందని నాకు నమ్మకంలేదు. అది నిజం అవుతే నైజాం నవాబు గెలవాలి? ప్రజలు గెలవటానికి వీల్లేదు. ఆరు తుపాకులతో పదిమంది జనంతో వ్యవస్థను మార్చగలుగుతే ఉద్యమాలు, విప్లవాలు అవసరంలేవు మనిద్దరి ధ్యేయం ఒక్కటే మార్గాలు వేరు. వాదన ద్వారా నా మార్గాన్ని గురించి నీకు నచ్చచెప్పాను. నన్ను నమ్మించడానికి నీవు పనిచేసి చూపినావు. అయినా నా హృదయం నీ వైపు మొగ్గటంలేదు. నా విశ్వాసం సడలినపుడు నీ విశ్వాసంమీద

నమ్మకం ఏర్పడ్డప్పుడు నీ దగ్గరికి వచ్చి వాలుత. అప్పటి వరకూ నా శుభాకాంక్షలు నీ వెంట ఉంటయి. ఒక్క విషయం చెప్పదలచిన. మనిషిని మించిన మతంగాని, వాదంగాని లోకంలో ఎక్కడాలేదు. అనివార్యం అయినపుడే హింసకు దిగు" ఉపన్యసించాడు రఘు .

"ఒప్పుకుంటాను. మీతో వాదించలేను. నాగేశ్ ఈ ఉద్యమానికి బలి అవుతే రఘు నాయకత్వం వహించాలె. ఇదే నా కోరిక. అందుకోసమే మీకు శ్రమ ఇచ్చిన. మీరు వాగ్దానం చెయ్యాలె. నాకు తెలిసింది చెప్పుత. ఒక్క రాక్షసుణ్ణి చంపటంవల్ల లక్షలమంది మనుషులు బాగుపడితే వాణ్ణి చంపడం తప్పా?" అడిగాడు నాగేశ్.

రఘు హృదయం ఉప్పొంగింది. ఎంత పెద్ద త్యాగానికి సిద్ధం అయినాడు నాగేశ్. ఎంత దృఢమైన విశ్వాసం అతనిది! అతని గుండె చెరువైంది. కళ్ళు చెమ్మగిల్లాయి. నాగేశ్! నా తమ్ముడూ! నువ్వు చాలా గొప్పవానివి! ఎంత పెద్ద బలిదానానికి సిద్ధం అయినావు. నా నమ్మకాలు ఎట్లావున్నా నీ ఉద్యమానికి నా ఆశీస్సులు. నీ కోర్కె నెరవేరుస్తాను మరో లోకం అనేది ఉంటే అక్కడ అందువు గాని అన్నా! మాట నిలబెట్టుకున్నావు, అని" అంటూ నాగేశ్‌ను కౌగలించుకున్నాడు.

కన్నీరు జలజల రాలింది.

తరవాత వాళ్ళు చాలా విషయాలు మాట్లాడుకున్నారు. యుద్ధాన్ని గురించీ, ప్రజల విజయాన్ని గురించీ అజాద్ హింద్ ఫౌజును గురించీ భారత స్వాతంత్ర్యాన్ని గురించీ, నైజాం నవాబు ఎత్తుగడల గురించీ, అతనికి వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటాల గురించీ చర్చించుకున్నారు. ఇంకా ఎన్నో విషయాలను గురించి చర్చించు కున్నారు. వారికి ఆకలి కాలేదు. నిద్రరాలేదు. రాత్రి గడచింది. తెల్లవారింది.

రఘు అందరివద్దా శలవు పుచ్చుకున్నాడు.

ఇంటికి వచ్చాడనే కాని అతనిలో ఒక వింత మార్పు వచ్చేసింది. ఎక్కడికి వెళ్ళవన్పించింది తప్పడు. మాట్లాడడు. భోజనం ముందు కూర్చొని తిన్నాననిపించు కుంటాడు. గడ్డం సైతం గీయడు. ఏదో చదువుతుంటాడు. ఏదో ఆలోచిస్తుంటాడు. గది కదలడు. పెదవి కదపడు. అతనిలో అగ్నిపర్వతాలు బద్దలు అవుతున్నాయి. ఈ విషయం జానకి గ్రహించింది. అనేకసార్లు వాదనకు దిగింది. చిరునవ్వు నవ్వి ఊరుకుంటాడు. జానకి గుండె దడ్కుమన్నది, ఈ నిశ్శబ్దత, ఈ మౌనం రానున్న ఏ మార్పుకు సంకేతం? ఈ విషయం ఆమె ఆలోచించ సాగింది. ఏమీ అంతుపట్ట లేదు. కొన్నాళ్ళు వీరయ్యగారితో ఇందును గురించి ఆలోచించింది. ఇప్పుడు అదీ మానుకుంది. ఇంట్లో ఉన్న మూడు ప్రాణులూ గంభీరంగానే ఉన్నాయి. మౌనం గానే ఉన్నాయి. ఒకరి మనసు ఒకరు గ్రహించలేకుండా ఉన్నారు. అంతా ఆలో చిస్తున్నారు. ఎవరి దారి వారిది.

ఈ మధ్య గది ఎపలి గ్రంథాలయంలో మార్చుంటున్నాడు రఘు. అది తన బిడ్డ. తానుకని పెంచాడు. మూడు పూలు ఆరు కాయలుగా ఉంది దాని స్థితి. అందులో

కూర్చుంటే అతనికి ఏదో మనశ్శాంతి కలిగింది. గ్రంథాలయానికి జనం బాగా వస్తు న్నారు. పత్రికలు, పుస్తకాలు చదువుతున్నారు. చర్చించుకుంటున్నారు. ఈ మధ్య పొరుగూళ్ళవారూ, దూర దూరం నుంచికూడా వస్తున్నారు. అందుకు కారణం లేక పోలేదు. పంటలు బాగా పండడంతో భూములకు బాగా గిరాకీ వచ్చింది, అయినా చుట్టుపట్లకంటె ఇక్కడ భూములు కారుచౌకగా ఉంటున్నాయి. అదికాక వెంకయ్య భూమిని డబ్బుగా మార్చుకో చూస్తున్నాడు. మార్చుకుంటున్నాడు. అటు జాగీర్దారుకు అప్పులు ఎక్కువ కావడంతో అడవులు అమ్మవలసిందని ఉత్తరువులు అందాయి తాసిల్దారుకు. అందుకే పొరుగూళ్ళ నుంచి జనం యెక్కువగా వస్తున్నారు.

ఆ పనిమీదనే వచ్చారు రంగారెడ్డిగారు. ఆయన దేశ్‌ముఖ్. అంతులేనంత భూమి ఉన్నవాడు. అప్రతిహతంగా అధికారం చలాయిస్తున్నవాడు. ప్రజలు మేల్కొనడంతో అధికారానికి కొంత అంతరాయం కలుగుతూంది. భూములు దక్కేట్టు లేవు. జాగీరు భూములు కొని ఇక్కడ అధికారం స్థిరపరచుకోవాలని వచ్చాడు. రావడం రావడం వారి కచ్చడం తాసిల్దారు ఇంటిముందు ఆగింది. తాసి ల్దారు అతన్ని బాగానే గౌరవించాడు. అందుకు తగిన నజ్రానా చెల్లించుకున్నారు రెడ్డిగారు. గిర్దావరును, వెంకయ్యను పిలిపించాడు. తాసిల్దారు భూముల అమ్మకానికి గురించిన చర్చ సాగింది.

"కోయోళ్ళ భూములన్నీ నా పగ్గరనే కుదువ ఉన్నాయి. కావాల్నంటే అన్నీ అమ్మత" వెంకయ్య అన్నాడు.

"నాకు భూములు అక్కరలేదు. జంగల్ కావాలె జంగల్. అడివి కొట్టించి పొలాలు చేస్త" రెడ్డిగారన్నారు.

"అడ్వులు కొంటరు. కొట్టెటోడు ఎవడు? కోయముండ కొడుకులకు జమీను లుండటాన మదమెక్కింది. కూలిచేస్తారు? భూములు కొనుండి. ఇంకేం చేస్తరు లం... కొడుకులు చచ్చుకుంట కూలిచేస్తరు. కూలోడు లేక పని జరుగుతాదుండి?" గిర్దావరు ఉవాచ. అతని తెలివికి మిగతా ముగ్గురూ ఆశ్చర్యపోయారు. అతని ప్రతిపాదనను అంతా ఆమోదించారు. అందు ననుసరించే వ్యవహారం జరిగింది. బేరాలు జరిగాయి. అతిచవగ్గా భూములను అమ్మేశాడు వెంకయ్య. అమ్మకేం చేస్తాడు? ఈ సంవత్సరం బాకీలకింద దమ్మిడీ రాలేదు. ఒక గింజ ఇంట్లో చేరలేదు. వస్తుం దనే విశ్వాసమూలేదు. ప్రతి సంవత్సరం గింజంతా ఊడ్చి తెచ్చుకునేవాడు. గింజ రాకుంటె గుండె పగిలాడు. వచ్చిందే చాలు ననుకున్నాడు. అయినా చాలా వచ్చింది! కాగితాలూ పత్రాలూ జరిగిపోయాయి. కోయదొరల భూములన్నీ రంగారెడ్డివి అయిపోయాయి. ఒక్క కలంపోటుతో కోయలు బికార్లు అయినారు. కూలీలుగా మారిపోయారు. కూటికి అలమటించే స్థితి వచ్చింది.

డబ్బు చేతిలో పడిందాకా ఇచ్చకాలాడారు ముగ్గురూ. తరువాత రెడ్డిగారికి మొండిచేయి చూపారు. కబ్జా ఇప్పించడానికి రమ్మంటే ఎవరూ అడివిలోకి

రామన్నారు. రెడ్డిగారు మండిపోయారు పాపం! దోసిళ్ళకొద్ది రూపాయలు పోస్తే ఒక్కడూ రానంటాడా ? వారిని తిట్టాడు. ద్రోహులన్నాడు. పొలిమేర దాటినందుకు పిల్లి అయిపోయానన్నాడు. తన ఊరు అవుతే అందరినీ కాల్చేసే వాణ్ణన్నాడు. ఇప్పటికీ మునిగిపోయిందేమి లేదన్నాడు. ఒక్కొక్క కోయవాణ్ణి తుపాకితో కాల్చి భూములు ఆక్రమించుకుంటా నన్నాడు. అది విని సంతోషించాడు తాసిల్దారు. తన పోలీసుల్ని సహాయం ఇస్తానన్నాడు. తానుమాత్రం రానన్నాడు గిర్దావరు.

“నీ కాల్మొక్త అట్లను, పాతిక వరకైతే కప్పు పెడ్త” అన్నాడు వెంకయ్య.

“మాస్త అడ్డొసంత తగుల పెట్టిస్త లం....కొడుకులు ఏం చేస్తరో చూస్త’ అని పళ్ళకొరికి మీసం మెలేశాడు రెడ్డిగారు–కాగితాలమీద కోయదొరలకు దొర అయినాడు.

ఆ రాత్రి తాసిల్దారు ఇంట్లో గొప్ప విందు జరిగింది. మంది మార్బలంతో తిరిగిరావడానికి తెల్లవారి రెడ్డిగారు వెళ్ళిపోయారు.

దండుతో దిగాడు దొర–రంగారెడ్డి. మందీ మార్బలంతో వచ్చాడు. మహా యోధులను తెచ్చాడు. వారిలో కొమ్ములు తిరిగిన జోదులున్నారు. మీసాలు మెలివేసే వీరులున్నారు. ఇనుములాంటి శరీరంగల వాళ్ళున్నారు. యజమానికోసం ప్రాణా లర్పించగలవా రున్నారు. అతడు తుపాకులు తెచ్చాడు. తూటాలు తెచ్చాడు. కత్తులు కటార్లు తెచ్చాడు. వారికి నాయకత్వం వహించాడు మస్తాన్. మస్తాన్ వెంట కొందరు పోలీసులూ కదిలారు.

దండు కదిలింది. దండు వెంట బండ్లు కదిలాయి. బియ్యపు సంచులు కది లాయి. మసాలాలు కదిలాయి. గొర్రెలు, మేకలు నడిచాయి. డప్పులవాళ్ళు కదిలారు. కొమ్ములవారు కదిలారు. ఒక సేన కదిలింది. కొండ కోనకు సాగింది. అందరినీ సాగనంపి, అందరికీ ధైర్యంచెప్పి సారా పీపాలు అప్పగించి ఆగిపోయాడు రెడ్డి. సాగిపోయింది బిడారు.

సాగుతూంది సేన. ఊళ్లు దాటింది. పొలాలుదాటింది. చేలు దాటింది. కంచెలు దాటింది. అడవిలో ప్రవేశించింది. డప్పులు, కొమ్ములు మ్రోగాయి. పాపిట లాంటి బాటవెంట సాగారు. ఎక్కడా ప్రతిఘటన లేదు. ఉంటుందని ఆశించనూలేదు వారు. కోయ రాజ్యపు ముఖద్వారం చేరారు. అదీ దాటారు. కోయగూడెం చేరారు. ఏముం దక్కడ! ఒక్క మనిషిలేడు. ఒక్క గుడిసెలేదు. ఎవరిమీదికీ దండయాత్ర? వచ్చినవారికే అర్థంకాలేదు. విడిసింది దండు. వంటలు సాగేయి. సంబరాలు ఆరంభం అయినాయి. అదే రంగారెడ్డిగారి బంగళా నిర్మించవలసిన చోటు. అక్కణ్ణుంచే ప్రభుత్వం చేస్తాడతను. కోయల భూములన్నీ అతనివి. కోయలంతా అతని కూలీలు. బంగళాకు ముగ్గుపోశారు లాంఛనంగా. త్వరలో అక్కడ రాజా వారి కోట వెలుస్తుంది. బాటలు వెడల్పు అవుతాయి. బండ్లువస్తాయి. అడవి పోతుంది. అంతా బయలు అవుతుంది. నాగరికత వెలుస్తుంది.

ఆ రాత్రి తాగుతూ తందనాలూ సాగేయి. పెట్రోమాక్సు లైట్లు వెలిగాయి. భోజనాలయినాయి. పాటలు సాగేయి. అంతా మత్తులో ఉన్నారు. మత్తుగా తాగారు. అయినా పహరా ఇస్తున్నారు కొందరు. కావళ్ళు కాస్తున్నారు కొందరు. మస్తాన్ మాత్రం మనుషుల్లో లేడు.

అర్ధరాత్రి ఎక్కణ్ణుంచో ఒక తుపాకి పేలింది. తూటా పెట్రోమాక్సులోంచి దూసుకుపోయింది. అది ఆరిపోయింది. అందరి మత్తూ వదిలిపోయింది. గుండెలు దబగుబ లాడేయి. వళ్ళు గజగజ లాడింది. మరో పక్కనుంచి మరో తుపాకి పేలింది. అది రెండవ పెట్రోమాక్సును కొట్టేసింది. ఆర్పేసింది. అంధకారంలో అరుపులు మొదలైనాయి. హాహాకారాలు మొదలైనాయి. ఎవడు ఎవణ్ణి పట్టుకున్నాడో తెలియదు. ఎవడు ఏం చేస్తున్నాడో తెలియదు. "బందూఖ్ చలావ్" మస్తాన్ కేకతో అడవి ప్రతిధ్వనించింది. ఎవనికి అందిన తుపాకి వాడు అందుకొన్నాడు. తూటాలు దూరుస్తున్నారు. కాలుస్తున్నారు. టప టప టప టప పేలుతున్నాయి తూటాలు. ఎందుకు కాలుస్తున్నారు? ఎటు కాలుస్తున్నారు? ఎవరికి గురి పెడ్తున్నారు? ఎవరికీ తెలియదు. కొంతసేపు కాల్చి యెవడికి వాడు ఊరుకున్నాడు. భయం మాత్రం అందరి గుండెల్లో గూడు కట్టుకుంది. ఎవడు కాల్చాడు ? గుండు యెటునుంచి వచ్చింది? వాళ్ళెందరున్నారు? తాము గెలవగలమా ? ఈ అడవిలోనే నాశనం అవుతామా? యెందుకు వచ్చాం ? అని ఆలోచించసాగారు. కొందరు రెడ్డిగారిని మనసులో తిట్టారు. కొందరు బహిరంగంగానే తిట్టారు. పారిపోదామనుకున్నారు కొందరు. కాని ఈ అడవిలో ఏ బాట యెటు పోతుందో ? ఏ పాము కరుస్తుందో? ఏ పులి మింగుతుందో?

ఇంతలో పులి గాండ్రుమంది. అది విని ప్రాణాలు లేచిపోయాయి అందరికీ. అంతా దగ్గరికి చేరారు. భయం మనిషిని దగ్గరకు తెస్తుంది. ఒకరిమీద ఒకరు చేతులు వేసుకున్నారు. రెప్పవాల్చకుండా అన్ని దిక్కులకూ చూడసాగారు.

"ధన్" మని తుపాకి పేలింది. సుయ్‌మని తూటా వారి తలలమీంచే పోయింది. ఇటునుంచి తుపాకులు పేలాయి. ఎన్ని ? ఎవడు కాలుస్తున్నాడు? ఎందుకు కాలుస్తున్నాడు? తెలియదు. అటునుండి తుపాకులు పేలుతున్నదీ లేనిది యెవడూ గమనించలేదు. మస్తాన్ జనం మధ్యలో నక్కాడు. తల దాచుకొని కూర్చున్నాడు.

ధన్ ధన్ ధన్ తుపాకులు పేలుతున్నాయి. దీపావళి టపాసుల్లా పేలుతున్నాయి. ఆపే ధైర్యం యెవరికీ లేదు. అయినా ఆపారు. చాలామంది దగ్గర మందుగుండు అయిపోయింది. దాంతో మరీ భయం ఎక్కువ అయింది. పక్కవాడే అందుకు కారణం అని తిట్టసాగారు. అంతా ఉమ్మడిగా మస్తాన్ను తిట్టసాగారు. తెలిసి తమకు యెందుకు చెప్పలేదన్నారు. అంతా అతని మీద పడటానికి సిద్ధం అయినారు. మస్తాన్‌కూ ఉద్రేకం వచ్చింది కాని అణచుకున్నాడు.

మళ్ళీ అడవిలోంచి తుపాకులు పేలాయి. ఈ తడవ ఒకటి కాదు రెండు కాదు చాలా పేలాయి. అవి ఈ దండు గుండెల్లో పేలాయి. ఇటునుంచీ తుపాకులు పేలాయి. మళ్ళీ బాణాసంచా కాలింది. తెల్లవారడంతో మందుగుండు పూర్తిగా అయిపోయింది. తెచ్చిన సామగ్రి సాంతం అక్కడ వదిలి ఎవడికి వాడు కాలికి బుద్ధిచెప్పసాగాడు. తుదకు అంతా కలిశారు. సాగిపోతున్నారు.

దండు చిట్టడవిలోంచి సాగిపోతూంది. కాలిబాట వెంట చీమల బారు పాకుతూంది. అందరి ప్రాణాలూ బిక్కు బిక్కు మంటున్నాయి. డప్పులవాడు కొట్టడం లేదు. కొమ్ములవాడు ఊదడంలేదు. తూటాల్లేని తుపాకులతో సాగుతున్నారు సగం చచ్చిన జనం. అమాంతంగా అడవిలోంచి తుపాకులు పేలాయి. అన్ని పక్కలనుంచీ పేలాయి. ఎన్నో పేలాయి. అంతా పరిగెత్తసాగారు. ఎటూ దారిలేదు. ఒకే బాట. ఒకని మీదినుంచి ఒకడు పరిగెత్తుతున్నాడు.

"మీతంటే మాకు పగలేదు. తుపాకులు విడిచిపోండి. ప్రాణాలు దక్కవు" అనే కేక అడవిలోంచి వినిపించింది. ఎవనికి వాడు తుపాకులు వదలి పారిపోసాగారు. మస్తాన్ మాత్రం తుపాకితోనే ఉరకసాగాడు. ఒక తుపాకి గుండు వెనుకనుంచి వచ్చింది. అతని తొడలోకి దూసుకొనిపోయింది.

"యా అల్లా" అని పడిపోయాడు. రక్తం సొద సొద కారింది. రక్తంలో మునిగిపోయాడు.

అది చూసి అంతా పరిగెత్తారు.

వెనక్కి చూడకుండా ఉరికారు.

అడవి దాటిం తరవాతనే ఊపిరి పీల్చుకున్నారు.

పీరుల్లా వెళ్ళినవారు పకీర్లయి ముందు నుంచుంటే మండిపడ్డాడు రెడ్డి. మసిలిపోయాడు. ధుమ ధుమ లాడారు రెడ్డిగారు. అవాయి సువ్వలా ఆకాశానికి ఎగిరాడు. తిట్టాడు. గొంతు చించుకున్నాడు. కేకలు పెట్టాడు. తనకు ద్రోహం చేశారన్నాడు. తాసిల్దార్ మీద కూడా యెగిరాడు. పిలటరీని తెస్తానన్నాడు. కొమ్మకో కోయవాణ్ణి ఉరి తీయించకుంటే తాను రెడ్డిని కానన్నాడు- ఆ కోపంతోనే వెళ్ళిపోయాడు రెడ్డి– బృందం సంయుక్తంగా.

ఊళ్ళో గత్తర తగలకుంటె రెడ్డిగారు అన్నంత పనీ చేసేవాడే. ఎద్దులాంటి తలారి శివడు ఎగిరిపడి చచ్చాడు. ఏమీలేదు రెండు విరేచనాలైనాయి. నాలుగు వాంతులైనాయి. తెల్లవారేవరకు చచ్చాడు. కలరా వ్యాపించింది. ఒకనినుండి ఇంకొకనికి. ఒక్కరోజు అయిదుగురిని మింగింది. దానికి మందుంటుందనే విషయం తెలియదు జనానికి. ముత్యాలమ్మకు ఆగ్రహం వచ్చింది. మింగుతూంది అందరినీ! ఇంకెందరిని మింగుతుందో? ఆ శక్తికి బలులు యివ్వాలి. ఆమెను శాంతపరచాలి! ఏం చేయాలి? ఇందు గురించి చర్చలు జరుగుతున్నాయి. ఊరి క్షేమం విచారించ

పలసిన గ్రామదేవతలు ఇద్దరే. తాసిల్దార్, గిర్దావరు. వారి ఇండ్లలో చర్చలు సాగాయి.

చర్చలతో కలరా ఆగలేదు. ఒకరి తరువాత ఒకరు పిట్టల్లా చస్తూనే వున్నారు. రఘు, జానకి నడుంకట్టి బయలుదేరారు. కలరాకు కారణం అపరిశుభ్రంగా వుండడం అని ప్రచారం సాగించారు. హరిజనవాడకు, ఇతర చోట్లకు స్వయంగా వెళ్ళి పరిసరాలు శుభ్రం చేయిస్తున్నారు. కలరా సోకిన వారి ఇండ్లకుపోయి చికిత్సలు చేయడమే కాక, కలరా నిరోధక ఇంజక్షన్లు కూడా ఇస్తున్నారు. వారు అందరికీ తలల్లో నాలుకల్లా మసులుతున్నారు. ఇందుకు దేవత కారణం కాదని మనుషులే కారణమనీ చెపుతున్నారు. వారికి నిద్ర ఆహారాలు లేవు. రాత్రింబవళ్ళు ఈ పనిలోనే ఉంటున్నారు. వీరయ్యగారు కూడా వారివెంట తిరుగుతున్నారు.

రఘు, జానకీ అందరి అభిమానం చూరగొంటున్నారు. అది భరించలేక పోయాడు తాసిల్దార్. గిర్దావరుతో మంతనాలు సాగించాడు. రఘు ప్రవర్తనే కలరాకు కారణం అని ప్రచారం సాగించాడు. అసలు గ్రంథాలయమే ఇందుకు కారణం అన్నారు. ఒకడికి కలలో వచ్చి ముత్యాలమ్మ ఆ విషయం చెప్పిందనీ ప్రచారం సాగింది. ప్రచారం విన్నా వారు చేసిందేమీలేదు. చేయదలచుకునూ లేదు. ఈ ప్రచారం అందరి గుండెల్లో విష బీజాలు నాటింది.

ఊరంతా విక్కచచ్చిపోయింది. తెల్లవారేవరకు చావు వార్తలు. పొద్దుగూకే వరకు చావు. ఉదయం చూచినవాడు సాయంకాలం కనిపిస్తాడో లేదో! అన్ని ఇండ్లకు వేపమండలు పెట్టుకున్నారు. ముడుపులు కడ్తున్నారు. ఊరిపేరు మీదకూడా పోచమ్మ ముడుపు కట్టారు. అయినా ఆగటంలేదు. జనం పిట్టల్లా చస్తున్నారు. శవాలను చాపల్లో చుట్టి పూడ్చేస్తున్నారు? కాల్చడానికి వీల్లేదు. కనీసం మోసేవాడు రాడు. పొరుగూళ్ళ జనం బందైనారు. ఈ ఊరివారిని ఇంకో ఊరికి రానివ్వడం లేదు.

మస్తాన్ పోవడంతో రషీదుకు నాయకత్వం అప్పగించాడు తహశీల్దారు. ఆ సమయం వచ్చేసిందనుకున్నాడు. అతడు లేకుంటే బ్రతకలేననుకున్నాడు. గ్రంథాలయం తగల పెట్టాల్సిందని ఆదేశించాడు. అది రషీదుకు పండుగ. అగ్రహోదగ్రుడైనాడు. ఆవేశంతో పొంగాడు. వీరముసిల్మానుడైనాడు. "అల్లాహో అక్బర్" అంటూ కదిలాడు. అతని బృందం కదిలింది. వీధులవెంట బయలు దేరాడు. తుపాకులు కాల్చారు. గ్రంథాలయంమీదపడ్డారు. ఆ గొడవ చూచి అందులో ఉన్నవాళ్ళు పారిపోయారు. విరుచుకుపడింది బృందం గ్రంథాలయం మీద. కుర్చీలు, బెంచీలు విరక్కొట్టారు. పుస్తకాలు, పత్రికలు చించివేశారు. కిర్సనాయిలు పోసి మంట పెట్టారు. పుస్తకాలు, పర్నీచరు, ఇల్లు అంటుకున్నాయి. కామ దహనంలా మంటలు లేస్తున్నాయి. రఘుకు తెలిసింది. ఆ మంటలు అతని గుండెలో రగిలాయి. పరిగెత్తుతున్నాడు గ్రంథాలయం వైపు. జనం అతణ్ణి పట్టు

కొన్నారు. ప్రాణహాని జరుగుతుందన్నారు. పోవద్దన్నారు – కాదు పోనివ్వలే దతనిని. గ్రంథాలయం జూదిప అయి పాలింది. ఇంట్లో కుప్పలా కూలిపోయాడు రఘు. జానకి పెద్దగా ఏడ్చేసింది. వీరయ్యగారు కుమిలిపోయారు. కన్నీరు కార్చారు.

ఆ రాత్రి తాసిల్దారు ఇంట్లో విందులు జరిగాయి. తందనాలు సాగేయి. గిర్దావరు సంతోషానికి అంతులేదు. రఘు వీపు చరిచారిద్దరూ. హుకుమ్ అవుతే ఊరంతా తగుల పెడ్తానన్నాడు. అదిరిపడ్డా రిద్దరూ. అంతపనీ చేయగలవాడే అతడు. సమయం రాలేదని ఆతనిని వారించారు. వీరయ్య ఇల్లు తగుల పెడ్తే చాలునన్నారు. ప్రస్తుతానికి పులిమీద లేవాకు రఘు. ఇప్పుడే కాదని పట్టుకున్నా రిద్దరూ.

ఊరు మసిలిపోతూంది. ఊపిరి సలపటంలేదు. గ్రంథాలయం తగలబడి నందుకు కాదు, కలరా తగ్గనందుకు. రఘు దగ్గర ఇంజక్షన్లు ఎవడూ తీసుకోవటం లేదు. వారి ఛాయ ఎవరూ సోకనీయటం లేదు. జనపు విశ్వాసం వేరేవైపు మళ్ళింది. మళ్ళించారు. ఊరి పెద్దలు వెంకయ్య సహితంగా గిర్దావరు ఇంట్లో కూడారు. ఊళ్ళో వైద్యులు మాంత్రికులు ఏమీ చేయలేక పోయారు. కాబట్టి గట్టి మాంత్రికుణ్ణి పిలిపించాలని నిర్ణయించారు. చందాలు వసూలు చేయాలన్నారు. చేశారు. మాంత్రి కుణ్ణి పిలిపించారు. అతడు వచ్చాడు. తన మహిమను చూపించాడు. అందరూ చూస్తుండగానే భూమి పగిలింది. పైకి ఎగిరిన నిమ్మకాయ అలాగే నిలిచింది. జనానికి నమ్మకం కుదిరింది. ముత్యాలమ్మను కట్టేయమన్నారు. కట్నం ఒప్పు కున్నారు.

ఆదివారంనాటి అర్ధరాత్రి మాంత్రికుడు బొడ్రాయి దగ్గర చేరాడు. గట్టిగా మంత్రాలు చదివాడు. నేలనిండా పసుపు కుంకుమ పరచాడు. నిమ్మకాయలు నరికాడు. కొరికాడు. కోడిని తెప్పించాడు. పళ్ళతో మెడ కొరికాడు. బండారి వేశానన్నాడు. బర్రెలు కోస్తానన్నాడు. గొర్రెల్ను బలి యిస్తానన్నాడు, గోలగోల చేశాడు. ఊతంగా తాగాడు. బొడ్రాయి ముందే వెల్లకిలా పడిపోయాడు. తల్లి పూనిందనుకున్నారు జనం. కట్టడి జరిగి పోయిందనుకున్నారు. ఇక ముత్యాలమ్మ మింగదనుకున్నారు.

తెల్లవారి వీరయ్యగారికి కలరా తగిలింది. ఉదయం కడుపునొప్పి అన్నప్పుడే అనుమానం కలిగింది జానకికి. రఘుకు ఏదో భయం భయంగా ఉంది. అయినా యిద్దరూ కలిసి ధైర్యం చెప్పారు. వాము లాంటివి ఏవో తినిపించారు. మధ్యాహ్నాని కల్లా రెండుసార్లు దొడ్డికి వెళ్ళివచ్చాడు. బావా మరదళ్ళు ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు. మూడవసారి వెళ్ళి వచ్చి బళ్ళున కుండెడు వాంతి చేసుకున్నాడు వీరయ్యగారు. దాంతో ఇద్దరి గుండెలూ పగిలాయి. అయినా ధైర్యం చెప్పారు వీరయ్యగారికి. ఆ తరువాత మంచంకొంచి లేవలేదు. అన్నీ అక్కడే అయినాయి.

చెట్టంత మనిషి ఇట్టే కూలిపోయాడు. రఘూ, జానకి ఇద్దరి గుండెలూ కూలి పోయాయి. ఊరి వైద్యులు రామన్నారు. దగ్గరలో చుట్టుపట్లలో డాక్టర్లులేరు. తనకు తెలిసిన మందులన్నీ వాడాడు రఘు. అర్ధరాత్రికల్లా కాస్త గుణం కనిపించింది. అయినా అతి నీరసంగా ఉన్నారు వీరయ్యగారు. నీరసంతగ్గి నిమిషాల్లో పోతుంది. అసలు జబ్బు తగ్గినందుకు సంతోషించారు ముగ్గురూ. ఇక బ్రతికి బట్టకడతా డనుకున్నారు ఇద్దరూ.—ఆ రాత్రి సాంతం ఎవరికీ నిద్దర్లులేవు – తెల్లవారుజామున తిరగబెట్టింది రోగం. ఇక విరోచనాలూ, వాంతులూ కట్టలేదు. వీరయ్యగారికి నమ్మకం చచ్చిపోయింది. ఇక తాను బ్రతకనని తెల్సుకున్నారు. అప్పగింతలు ప్రారంభించారు. కళ్ళల్లో నీరు తిరిగింది జానకికి. రఘు గుండె చెరువైంది. కన్నీటితోనే అప్పగింతలు పెట్టారు. వీరయ్యగారు జానకి చేయి రఘు చేతిలో పెట్టి "తల్లిలేని పిల్ల, తండ్రిలేని పిల్ల అవుతున్నది. దాన్ని నీ చేతిలో పెట్టుతున్న, అన్నీ నువ్వేగానే చూచుకోవాలె" అని కన్నీరు కార్చారు వీరయ్యగారు. "నాయనా!" అని తండ్రి మీద పడి హోరుమని ఏడ్చింది జానకి. మంచపు పట్టెకు తలకొట్టుకొని ఏడ్చాడు రఘు.

పక్షి ఎగిరిపోయింది.

ఎవరేడుస్తే తిరిగివచ్చింది.

ఒక్కడు గడపతొక్కి చూడలేదు. ఇంట్లో శవం. ఒకరిమీదపడి ఒకరు ఏడుస్తున్నారు. ఎంతసేపు ఏడ్వగలరు! కర్తవ్యాన్ని గురించి విచారణ ప్రారంభం అయింది. క్రమంగా కొందరు హరిజనులూ, వడ్డెర్లూ ఇంటిముందు కూడారు. ఇంటిముందు నిప్పు రాజబెట్టారు. కులంవాడు ఒక్కడు రాలేదు. పీనుగు లేవటం ఎలా? వచ్చినవారే బంధువులనుకున్నారు రఘు, జానకి. పాడె లేచింది. రెండు కొమ్ములు రఘు, జానకి పట్టుకున్నారు. ఒక కొమ్ము వడ్డెర, ఒక కొమ్ము హరిజనుడు పట్టుకున్నారు. దహనం చేయడానికే నిశ్చయించింది జానకి. ఊరి పెద్దలు వద్దన్నారు. వ్యతిరేకించారు. లెక్కచేయలేదు రఘు. శవయాత్ర సాగింది. వందలు వేల జనం శవం వెంటసాగింది. అడక్కుండానే కొందరు డప్పులు కొట్టారు. కొందరు కొమ్ములు ఊదారు. పెళ్ళి ఊరేగింపులా సాగిపోయింది శవయాత్ర. వీరయ్యగారి పొలంలో చింతచెట్టుకింద వారెప్పుడూ చుట్టచుట్టుకొని కాల్చుతూ కూర్చునేచోట దహనం జరిగింది. మనిషిని కాల్చి మరలి వచ్చారు జనం. ఇంట్లో రఘూ, జానకి అడుగుపెట్టే ఇల్లు అవురుమంటూంది. వారు బావురుమన్నారు. హరిజనులతో ఆ యిల్లు పవిత్రం అయింది. వారు వీరిని ఓదార్చారు. ఆ రోజు అది హరిజనవాడ అయింది.

శవ యాత్రలోని జనాన్ని చూచి కన్నుకుట్టింది-గిర్దావరుకు. గత్తర తగిలి పోయినవానివెంట అంతజనమా? సహించలేక పోయాడు. కాలు కాలిన పిల్లిలా పరిగెత్తాడు తాసిల్దారు. దగ్గరికి కాళ్ళమీద పడ్డాడు. కొంప మునిగిందన్నాడు. ఇక

తమ ఆయుధం ప్రయోగించాల్సిందే నన్నాడు. తాసిల్దారు రషీదును పిలిపించాడు ఆదేశాలతోపాటు సారాయి అందించాడు. ఆ రాత్రి తెగతాగారు. అర్ధరాత్రికి దాడికి బయలుదేరాడు రషీదు. అతని ముఠా అనుసరించింది. దివిటీలు పట్టుకొని రఘు ఇల్లు తగలబెట్టడానికి బయలుదేరారు. వెళ్ళేవారు మౌనంగా వెళ్ళారా! కేకలు పెడుతూ సాగారు. రఘు యింటిమీద పడ్డారు. వాళ్ళమీద రాళ్ళవర్షం కురిసింది. రషీదు నొసటికి ఒకరాయి తగిలింది. కల్లోలం విని కర్రపట్టుకొని తలుపుతీశాడు రఘు. జానకి వారిస్తున్నా చేయిపట్టుకొని లాగుతున్నా ఆగలేదు. దుఃఖంతో కాలి పోతున్నాడు. కోపం మండిపోయింది. రుద్రుడై బయటపడ్డాడు. ఆ రాత్రి చీకట్లో ఎక్కణ్ణుంచో ఒక తుపాకి పేలింది. కల్లోలం చెలరేగింది. దుండగులు కాలికొద్దీ పారిపోయారు.

తరవాత ఇల్లంతా గలగలలాడింది. ఊరంతా అక్కడే చేరింది. ఆ గొడవ లోనే ఒక గడ్డం మనిషి రఘును, జానకిని గదిలోకి తీసికెళ్ళాడు. అతడు నాగేశ్ అని గ్రహించిన ఇద్దరి గుండెలూ ముందు దడదడ లాడాయి. తరువాత ఆశ్చర్యం అయింది. ఆ తరువాత దుఃఖం ముంచుకొని వచ్చింది. ఏడ్చేశారు. నాగేశ్ వారిని ఓదార్చాడు. నిప్పులు కురిశాడు రఘు. తాసిల్దారునూ, గిర్దావరునూ అంత మొందించాలన్నాడు. తాను ముందుంటానన్నాడు. నాగేశ్ శాంతపరచాడు. ఇంకా సమయం రాలేదన్నాడు. జానకి చకిత అయి చూస్తూ ఉండిపోయింది.

నాగేశ్ మందిలో కలసి మాయం అయినాడు. తరువాత అతనికి వచ్చిన ఉద్రేకాన్ని తలచుకున్నాడు రఘు. పెద్దగా ఏడ్చేశాడు. జానకి అతనిని ఓదార్చాల్సి వచ్చింది!

వీరయ్యగారు పోతే నాస్తికుడు చచ్చాడని వ్యాఖ్యానించిన గిర్దావరుకు, తనదాకా వస్తేకాని తెలిసిరాలేదు. అతని కూతురు పదహారేళ్ళది. కలరా తగిలి గంటల్లో కన్ను మూసింది. మాంత్రికుని మీద మండిపడ్డాడు. ముందు గత్తరను ఎక్కించి డబ్బు కాజేసి మళ్ళీ నిమ్మళం చేస్తారని జనుల నమ్మకం. ఈ మాంత్రి కుడూ అలాగే చేశాడనుకున్నారు వారు. పట్టుకున్నారు. చావగొట్టించాడు గిర్దావరు. పటకారుతో పళ్ళు లాగించి కొనవూపిరితో వెళ్ళగొట్టించాడు—ఉన్న డబ్బు లాక్కొని. గత్తర ఎక్కువైంది. రోజు రోజుకూ చావులు ఎక్కువ అవుతున్నాయి. తనకు తాకు తుందేమోనని భయపడ్డాడు గిర్దావరు. తాసిల్దారు అతనిని గడప తొక్కనీయలేదు. అదిరిపోయిన గిర్దావరు మహామాంత్రికుణ్ణి పిలిపించాడు—పేరు రాజారాం. బుర్ర మీసాలు, దట్టమైన కనుబొమలు, నొసట పెద్ద కుంకుమ బొట్టు. పుష్టి అయిన దేహం. భయంకరంగా ఉంటాడు. కళ్ళు ఎప్పుడూ ఎర్రగా ఉంటాయి. శక్తిని కదిలించగలడు. పలికించగలడు—అని అతనికి పేరుంది. రావడం రావడమే బైండ్ల వాణ్ణి పిలిపించి శక్తిని వానిమీద పూనకం చేయించాడు. ఒక దున్నపోతు. బద్దెగొర్రె, బలిగొర్రెలు, బలికోళ్ళు ఇంకేమేమో కావాలన్నది శక్తి. బలిస్తామని మొక్కారు

ప్రజలు. తరవాత ముత్తాలమ్మ గుడికి కదిలాడు రాజారాం. వేపకొమ్మలు పట్టుకొని అట్టహాసంగా చేరాడు గుడికి. జనం గుంపులుగా అనుసరించారతణ్ణి. శక్తి ముందు అట్టహాసం చేశాడు. కేకలు వేశాడు. గంతులు పెట్టాడు. "కదులు—పోతను" అని అరచాడు. శక్తిగా భావించబడుతున్న రాయి వణికింది. కాస్త కదిలింది. జనానికి విశ్వాసం ఏర్పడింది. రాజారాంను మహామాంత్రికుని క్రింద జమకట్టేసింది జనం.

రాజారాం గురువారంనాడు బండారి వేశాడు బొడ్రాయి దగ్గర. అర్థరాత్రి, పూర్వపు మాంత్రికుని కంటే ఎక్కువ అట్టహాసం చేశాడు. తాగడం కూడా ఎక్కువే తాగాడు. తెల్లవారి సాయంకాలం దాకా లేవలేదు.

రోజురోజుకూ చావులు తగ్గడం ఎండలు పెరగడం జరుగుతూంది. కలరా చావులు బొత్తిగా తగ్గిపోయాయి. ముసలి, ముదివగ్గూ తప్ప చావడంలేదు. రాజారాం మంత్రాలు పారేయనుకున్నారు జనం. అతనికి బ్రహ్మరథం పట్టినంత పని చేశారు. కొలుపులు చేయాలన్నాడు రాజారాం. అమావాస్య అర్థరాత్రి అందుకు నిర్ణయించ బడింది.

అమావాస్య సాయంకాలం బొడ్రాయి దగ్గర కొలుపు సాగింది. బైండ్లవాని జముకు మోగింది. మాల, మాదుగులు, ఊరి జనం, పెద్దలు కూడారు. బైండ్లవాడు కథ సాగించాడు.

శంకరునికి పార్వతికి పుట్టిన బిడ్డలు మైసమ్మ, యల్లమ్మ, పోశ్శ ముండ మోసిన పొలియాలికన్య ముత్తాలమ్మ. ముత్తాలమ్మ అందరికంటె శక్తికలది. తనమాట వినకుంటే తండ్రికే స్ఫోటకం పోయించింది! తరవాత తగ్గించింది. ఆ నలుగురికీ తోడబుట్టినవాడు పోతరాజు. శంకరుని చమటలోంచి పుట్టిన చిన్నశక్తులూ ఉన్నాయి. అవి గుండెలమ్మ, గురుకులమ్మ, దగ్గులమ్మ, దంతెలమ్మ, మహాలక్షుమమ్మ, మెడిరుపు లమ్మ, మోతులమ్మ, జిలకరమ్మ, కల్లుగంటలమ్మ, ఎర్రమారి, నల్లమారి, నూకా లమ్మ, ఆటలమ్మ, సన్నజలాలమ్మ, ఇంకో అమ్మ, ఇంకో తల్లి. పాట మొదలు పెట్టాడు.

యల్లమ్మ నీకెవరు ఎదురైనవారు
ఎదురైనవారు
అగ్గిదేవుడు ఎదురు గుగ్గిలామెదురు
అరవయారు దర్శనాల అమ్మవా రెదురు
డెబ్బదారు దర్శనాల దేవతలు ఎదురు
చక్కాజవిడి కట్టెలెదురు చేదేప లెదురు
కంచు జవిడిక లెదురు కలివేప లెదురు
యల్లమ్మ నిన్నెవరు ఎగ్గించినారు?
చల్లన్ని చూపుల తల్లి వెల్లమ్మ.

నిండు పందిట్లోన నిలుచుండినాము
తల్లికీ దండమని తల వంచినాము
పుట్టాపుట్టల ఎట్లు ఓ పుట్టలెల్లు
నీ పుట్ట చుట్టన్ని పూల బాణాలు
గద్దేగద్దెల యెల్లు ఓ గద్దెలెల్లు
నీ గద్దె చుట్టన్ని గావుపిల్లులు
పుట్టాపుట్టల ఎల్లు ఓ పుట్టలెల్లు
యల్లమ్మ నీకెవరు ఎదురైనవారు ?

అతడు కథలు చెప్పాడు. గాథలు చెప్పాడు. రోగాలు చెప్పాడు. నొప్పులు చెప్పాడు. మందులు చెప్పాడు. మహా మంత్రాలు చెప్పాడు. ఎన్ని చెప్పాడో ? ఏమేమి చెప్పాడో? అది అతనికీ తెలియదు. వినేవారికీ తెలియదు. అయినా అతడు చెప్పాడు అర్థరాత్రిదాకా జనం విన్నారు.

అర్థరాత్రి దాటింది. మరో జాము గడిచింది. తెల్లవారడానికి ఒక్క జామే మిగిలింది. అప్పుడు డప్పులు మోగాయి. తప్పెటలు మోగాయి. కొమ్ములు ఊదారు. ఈ గొడవలో దున్నను తెచ్చారు. రాజారాం దాని మెడకు వేప మండలు వేశాడు. నొసట కుంకుమ దిద్దాడు. బలికి సిద్ధం చేశాడు.

బొడ్రాయి ముందు అన్నం రాశి పోయించాడు. పెద్దమాదిగ గంత్ర గొడ్డలి అందుకున్నాడు. చిప్పనిండా సారాయిపోసి అతనికి అందించారు. అతడు గట గట త్రాగాడు. గొడ్డలి–గంత్రగొడ్డలి– అందుకున్నాడు. వీరంగం వేశాడు. డప్పుతాళానికి అడుగువేస్తూ సాగాడు. అతనికి శక్తి ఆవహించాలి. వీరుడు కావాలి. ఒక్కవేటుకు దున్న తెగాలి. లేకుంటే మళ్ళీ ప్రమాదం. దున్నపోతు దగ్గరికి వెళ్ళాడు. దున్నకు మొక్కాడు. బొడ్రాయికి మొక్కాడు. జైశ్శరభ, శరభ, శరభ, దున్నపోతు తలమీద గంత్రగొడ్డలి పడ్డది. ఒక్కవ్రేటుకు తలతెగింది. దాని రక్తం అన్నంలో కలిసింది. తరువాత కలిపారు. రక్తపుకూడు తయారైంది. దున్నపోతు తల ఒక చేటలో పెట్టారు. ఒక మాదిగవాని తలకు ఎత్తారు. కొత్తపంచె జోలె చేశారు. దానిలో రక్తాన్నం యెత్తారు. బైండ్లవానికి ఆడవేషం వేశారు. శక్తి వేషం వేశారు. అతడు చీర కట్టాడు. రవిక తొడిగాడు. శక్తి అయిపోయాడు. నోట్లో దొబ్బ పెట్టుకున్నాడు. భయంకరంగా తయారైనాడు. నెత్తుటికూటి జోలె అతని భుజానికి తగిలించారు. డప్పులవాళ్ళు, తప్పెటలవాళ్ళు, కొమ్ములవాళ్ళు ముందు సాగారు. వారి వెనక నిమ్మకాయలు కోసిపారవేస్తూ రాజారాం బయలు దేరాడు. అతని వెను కకు బైండ్లవాడు అరుస్తూ, కేకలువేస్తూ, రక్తపుకూడు చల్లుతూ బయలుదేరాడు. అతని వెనుక జనం. అలా ఊరంతా తిరిగారు. మధ్య మధ్య ఎవరికో ఒకనికి శివం వచ్చేది. ఊగేవాడు. రాజారాం అతని తలమీద నిమ్మకాయ పరిచేవాడు.

మంత్రాలు చదివేవాడు. తిరిగి బొడ్రాయి దగ్గరికి వచ్చేశారు....ఊరినంతా రక్తపు కూటితో నింపి.

ఇంతలో తెల్లవారింది. వడ్లవాడు కొర్లబండి తెచ్చాడు. శక్తి వేషంలో వున్న పైండ్లవాణ్ణి దానిమీద కూర్చోపెట్టాడు. కొందరు ఆ బండిని లాగారు. జనం బండిని అనుసరించారు. డప్పుల మోతలు, వీరంగపు ఆటలమధ్య....

"అహాహో

ఇహహో

మళ్ళరాకు"

అని అరుస్తూ వూరిబైటదాకా సాగనంపారు. అక్కడ బండిని ముక్కలు ముక్కలుగా నరికి పైండ్లవాణ్ని వదిలేసి జనం వూళ్ళోకి వచ్చేశారు.

శక్తిని పారదోలామని సంతోషించారు.

అంతటితో రాజారాం పని తీరి పోయింది. అతడు వెళ్ళిపోవచ్చు. కాని గిర్దావరుకు అతనితో పని తీరలేదు. రాజారాం మకాం వేసింది గిర్దావరు ఇంట్లోనే. అతడు అర్ధరాత్రి ఎక్కడికో వెళ్ళేవాడు. తెల్లవారు జామునగాని వచ్చేవాడుకాడు. ఆ విషయం ఎవరూ గమనించరాదనో, గమనించలేరనో అతని ఉద్దేశం తెలియదు గాని గిర్దావరు కనిపెట్టేశాడు. ఒకనాడు అతణ్ణి మద్యంతో సంతృప్తుణ్ణి చేసి అడిగాడు. కొండలమ్మ గుడిదగ్గర నిధి నిక్షేపాలున్నాయని చెప్పాడు. అపారమయిన దన మందన్నాడు. నైజాం నవాబును సైతం కొనివేయవచ్చన్నాడు. కావాలంటే రాత్రికి చూపించగలనన్నాడు. గిర్దావరు ఆశలు రెక్కలు తొడుక్కున్నాయి. ఆకాశానికి ఎగిరాయి. తాను తాసిల్దారును తల దన్నాలనుకున్నాడు. తనను చూసి జాగీర్దారుకు సైతం కన్ను కుట్టాలనుకున్నాడు. మకాం హైదరాబాదుకు మార్చాలనుకున్నాడు. మహారాజు అయిపోవాలనుకొని రాజారాం కాళ్ళమీద పడ్డాడు. తాసిల్దారుకు ఈ రహస్యం తెలియనీయ రాదని వేడుకున్నాడు. సగం డబ్బు అతనికే ఇస్తానన్నాడు. అతనిని తనకు పురోహితునిగా నియమిస్తానన్నాడు. ఒప్పుకున్నాడు రాజారాం. అర్ధరాత్రి ఇంట్లోవాళ్ళకి కూడా తెలియకుండా బయలుదేరారు. ఇద్దరూ ఒకచోట కూర్చున్నారు. అంజనం వేశాడు రాజారాం గిర్దావరుకు. అడిగాడు "కనబడుతున్నదా ?"

"లేదు. కండ్లబడ్తలేదు."

"బాగా చూడు."

"ఊఁ. ఊఁ." అని నసిగాడు.

"అంత బంగారం లంకెబిందెలు కనబడ్తలేదా ?"

"ఆఁ. ఆఁ. కనబడ్డది. అబ్బ ఎంత బంగారం! ఎంత బంగారం యెట్లొస్తది?"

కళ్ళు మిరుమిట్లు గొలిపినట్లు చేశాడు. ఆశ విచ్చిపోయిన్నది మనిషిలో. అడిగాడు.

"నన్నెందు కడుగుతవ్ ? ఆ లక్ష్మినే అడుగు. ఆ శక్తినే అడుగు, పలికిస్త" అని ఏవేవో మంత్రాలు చదివాడు.

"ఏమంటున్నది ?"

"ఇనబడ్తలేదు."

"ఇనబడ్తలేదులే" అని "హీం హీం" అన్నాడు. 'నరబలి' 'నరబలి' అనటంలే అని అడిగాడు.

గిర్దావరు గడ గడ లాడాడు. అతని గుండె దడ దడ లాడింది. "కనబడ్తున్నది. అవు. అడుగుతున్నది. నరబలి కావాల్నంటున్నది." అంజనం రాలిపోయింది. "నరబలి యాణ్ణించి వస్తది ?" అని అడిగాడు.

"ఇంత నిధి పూరికెనె వస్తాది ? ఒక్కడు, ఒక్కడు, ఒక్కడే. రాజువయిపోతవు. ఏమంటవ్ ?"

"సరె స్వామి."

"పూర్ణాంగుడు, బ్రహ్మచారి, యవ్వనవంతుడు కావాలె. ఒక్కడు ఒకే ఒక్కడు. రాజువు అయిపోతవు" అదోలా చూచాడు రాజారాం. సూదులు గుచ్చుకునేటట్లు చూచాడు.

"తెస్తస్వామీ బలి సమర్పిస్త" అన్నాడు గిర్దావరు. ముహూర్తం నిశ్చయించాడు రాజారాం. ఇద్దరూ ఇంటికి వచ్చారు. ముహూర్తం కోసం ఎదిరి చూడసాగారు. ఆ ధనాన్ని గురించీ, దాని వినియోగాన్ని గురించీ ముచ్చటించుకోసాగారు.

గిర్దావరు తాసిల్దారు గడప తొక్కలేదు.

రాజారాం ఎవరికీ కనిపించలేదు.

ఎన్నాళ్ళు ఆగుతూంది. ముహూర్తం రానే వచ్చింది. అయినా ఆలస్యంగానే వచ్చినట్లనిపించింది వారికి. అనుకున్నావాడూ దొరికాడు ఆ రోజే. కట్టెపుల్లల మోపు నెత్తిన పెట్టుకొని అమ్మడానికి వచ్చిన కోయ యువకుణ్ణి చూచారు ఇద్దరూ. రాజారాం ఆమోదించినట్లు తల ఊపాడు. గిర్దావరు కులశేఖరరావుగారు పిలిచాడు. కట్టెల మోపుకు అడిగినంత ఇవ్వడమే కాక అన్నం పెట్టించాడు గిర్దావరు. ఆ పనీ ఈ పనీ చెప్పి డబ్బిచ్చాడు. సాయంకాలందాకా వుంచాడు. కోయదొర మురిసిపోయాడు. ఇంటికిపోవాలని ఉబలాట పడ్డాడు. ఆ రాత్రి వానితో పని వుందనీ ఇంకా డబ్బిస్తానని చెప్పాడు. ఆశ. ఉండిపోయాడు. రాత్రికి పిండి వంటలతో చక్కగా భోజనం పెట్టారు. కడుపునిండా తిని నిద్రపోయినవాణ్ణి అర్ధరాత్రి లేపాడు రాజారాం. ఏదో ఒక మూట యిచ్చి తనవెంట నడవమన్నాడు. డబ్బు అందించాడు. రాజారాంను అనుసరించాడు యువకుడు. గంద్రగొడ్డలి బట్టలో కట్టి పట్టుకొని వెనుక నడిచాడు కులశేఖరరావు. ముగ్గురూ గుడిదగ్గరికి చేరారు.

గబ్బిలాలు యెగిరాయి.

గుడ్లగూబ కూసింది.

గుండెలు పీచు పీచు మన్నాయి.

యువకుణ్ణి ఒక గుంతలోకి చూడమన్నాడు. అతడు వంగాడు. ఇద్దరూ అతనిమీద పడ్డారు. అణచి పట్టుకున్నారు. నోట్లో గుడ్డలు కూరారు. కాళ్ళు చేతులు కట్టివేశారు. కదలకుండా చేశారు. పూజా సాగించాడు రాజారాం. మంత్రాలు పఠించాడు. వేపకొమ్మల దండ యువకుని మెడలో వేశారు. బొట్టు పెట్టారు. బలికి సిద్ధం చేశారు.

గ్రహించాడు యువకుడు.

నోరురాదు. కాళ్ళు చేతులు కట్టివున్నాయి.

మనసులో యెన్ని అగ్గికొండలు బద్దలైనాయో!

ఎన్ని కోర్కెలు క్రుంగి క్రుశించి నశించాయో!!

గండ్రగొడ్డలికి పూజ చేసి కులశేఖరరావుకు అందించాడు రాజారాం. వణకి పోయాడు గిర్దావరు. గొడ్డలి పట్టుకున్నాడనే కాని జారిపోతూంది. నోరు ఆరుకు పోయింది. చెమటలు పట్టాయి. గ్రహించాడు రాజారాం.

"ఊం ముహూర్తం మించిపోతున్నది ఒక్కదెబ్బ. ఒకే దెబ్బ. భూమి పగులుతది. ధనరాసులు బయట పడ్తయి. వెయ్యి" అన్నాడు.

వేశాడు గిర్దావరు.

తల మొండెంనుండి తెగింది.

రక్తం చిమ్మింది. రాజారాం ముఖాన కొట్టుకుంది.

మొండెం కాళ్ళు చేతులు కొట్టుకుంది. చల్లబడింది.

రాజారాం కళ్ళు చీకట్లు కమ్మాయి. లోకం అంతా గిరగిరా తిరిగింది. రక్తంలో పడిపోయాడు. అంతే మరి కదలలేదు.

రెండు శవాలను చూచాడు గిర్దావరు. గుండె గుబగుబ లాడింది. భయం ప్రాణాలను తోడేస్తూంది. వెనక్కు తిరిగి పరుగు లంకించుకున్నాడు. ఇంట్లోపడి గది తలుపు గడియవేసుకొని మంచంలోపడి రొప్పసాగాడు.

అతనికి ఏదీ కనిపించడం లేదు. కనిపించేదల్లా రక్తం, రక్తం, రక్తం అంతా రక్తమే. తాను రక్తం. ఇల్లు రక్తం. ఊరు రక్తం, లోకం రక్తం!!

ఉషారాణి రక్తం పులుముకొని ఉదయించింది. ఊళ్ళో ముందు గుసగుసలు సాగాయి. తరువాత బాహాటంగానే చర్చలు సాగాయి. కొండలమ్మ గుడికి జాతర సాగింది. కోయలోకం ఉడికిపోయింది. దాడి జరపడానికి తొందరపడ సాగింది.

తాసీల్దారు గిర్దావరును పిలిపించాడు. గిర్దావరు గది వదిలి రావడంలేదు. వెర్రికేకలు పెడుతున్నాడు. ఏడుస్తున్నాడు.

గిర్దావరుకు పిచ్చెత్తింది. పదిరోజుల తరువాత పిచ్చివాడు కూడా కనిపించ లేదు. ఉడాయించాడు పెళ్ళాం పిల్లలతో.

అందును గురించే చర్చించుకుంటున్నారు రఘు, జానకి. దొడ్లో వాలు కుర్చీల్లో కూర్చున్నారు. పౌర్ణమి వెన్నెల, మల్లెపందిరి పక్కన, రెండు పరువపు గుండెలు–ఎదలు, అయినా వారు వలపు మాటలు మాట్లాడుకోవడం లేదు. ప్రేమ ఒలకబోయటంలేదు.

"గిర్దావరును అని ఏం లాభం? వ్యవస్థ అటువంటిది. డబ్బుతో అన్నీ సాధించ వచ్చుననే వ్యవస్థ ఇది. ఆ ఆశ మనిషితో ఏ పనినైనా చేయిస్తుంది. డబ్బుకుకాదు, మనిషికి విలువవుండే వ్యవస్థ కావాలె" అని ఏదో ఆలోచించి మళ్ళీ అన్నాడు రఘు. "నా విశ్వాసాలు సడలుతున్నాయి. ఇంత హింసను చూస్తూ ఊరుకోవటమా? హింసతో జవాబు చెప్పటమా?" అన్నాడు. మళ్ళీ ఆలోచనలలో మునిగిపోయాడు.

జానకి గుండె ఝల్లుమంది. చాలా కాలంనుంచి రఘులో ఏదో తపన చూస్తూంది. మాట్లాడడు. ఎంత చర్చించినా ప్రయోజనం ఉండడం లేదు. ఇవ్వాళ బయటపెట్టాడు. ఏం చేయాలో? ఎలా ఒప్పించాలో అర్థంకాలేదు జానకికి. ఆమె కూడా ఆలోచనలో మునిగిపోయింది.

"రఘూ!" అమాంతంగా పిలిచింది. ఈ లోకంలోకి వచ్చి ఆమెవైపు చూచాడు.

"రఘూ! ఆస్తి అన్ని అనర్థాలకూ కారణం అనుకున్నప్పుడు నాకు ఇంత ఆస్తి ఎందుకు? భూములన్నీ పేదలకు పంచిపెడ్త. ఏమంటవు?" అడిగింది.

రఘు గుండె ద్రవించింది. కళ్ళు చెమ్మగిల్లాయి. లేచి జానకి చేతులు పట్టు కున్నాడు. "జానకీ! నువ్వు దేవతవు. రాతి రొమ్ముతో గుండె చేర్చగలవు. మంచి పనికి ఆలస్యం ఎందుకు? కానివ్వు. నిన్ను చూచి అయినా పదిమంది నేర్చుకుంటా రేమో? సమాజం మారుతుందేమో చూతాం" అని కుర్చీలో కూర్చున్నాడు.

"ఇదంతా నీ చలవే. నువ్వే నన్ను మనిషిని చేసినావు. మా నాయన నన్ను నీ చేతుల్లో పెట్టిండు" అని రఘును చూచింది. ఆ చూపులు అర్థవంతంగా ఉన్నాయి.

"స్వతంత్ర భారతంలో తప్ప మన పెళ్ళికాదు జానకీ. అంతవరకు వేచి ఉండాల్సిందే" అన్నాడు.

జానకి మారు పలకలేదు.

భూములు పుచ్చుకునే వారంతా జానకిని ఊరేగిస్తామన్నారు. ఆమె అంగీక రించలేదు. పొలంలో వీరయ్యగారి సమాధిదగ్గర – సాధారణ సమావేశం జరిగింది. తన పొలాలన్నీ పేదలకు పంచిపెట్టింది జానకి. పేదలకు పెన్నిధి అయింది జానకి. పేదల ప్రాణాల్లో ప్రాణం అయింది జానకి.

ఆ సంవత్సరం తోకచుక్క పొడిచింది. పట్టపగలే కనిపించింది. ఏదో అవాంతరం రానున్నదని శంకించారు ప్రజలు. భయపడ్డారు జనులు.

అది రాజుకు ప్రమాదం సూచిస్తుందన్నారు పెద్దలు.

# 10

భారతదేశాన్ని చీల్చడాన రక్తం ప్రవహించింది అది చీల్చినచోట. చీల్చక ముందే రక్తం చిమ్మింది హైద్రాబాద్ రాజ్యంలో, నిజాం నవాబు లేనిమీసం మెలేశాడు. మతపిశాచిని రెచ్చగొట్టాడు. ప్రాక్టీసులేని వకీలు ఖాసిం రజ్వీని నాయకుణ్ణి చేశాడు. మహామారిని వ్యాపింపజేసి తాను స్వతంత్ర ప్రభువు కాదలచుకున్నాడు. ప్రతి ముసల్మానూ ప్రభువన్నాడు. ప్రతి ముసల్మానేతరుడు గులాం అన్నాడు. భారతదేశపు రొమ్ముమీద కుంపటి రగిల్చాడు· దక్షిణాన ఒక పాకిస్తాన్ ఏర్పాటు చేయాలనుకున్నాడు. దానికి తాను చక్రవర్తిని కావాలనుకున్నాడు. మహమ్మదలీ జిన్నాతో మంతనాలు జరిపాడు. తన కొంపకు తానే చిచ్చు పెట్టుకున్నాడు.

ఉత్తర దేశంనుంచి వచ్చిన వేల లక్షలమంది ముసల్మానులు నిజాం రాజ్యపు మూలమూలలకు వ్యాపించారు. వారికేకాక స్థానిక ముసల్మానులకూ ఆయుధాలందాయి. రజాకార్ల పేర ఒక సేన ప్రతి బస్తీలోనూ వెలసింది. జాగీరు ముసల్మానుది కావడాన ఇక్కడికి దిగారు కాందిశీకులు. బలవంతంగా ఇండ్లు ఆక్రమించుకున్నారు. ఉన్నవాళ్ళను వెళ్ళగొట్టారు. ప్రాణాలను అరచేత పట్టుకొని యూనియన్ ప్రాంతాలకు కాందిశీకులుగా వెళ్ళారు ఇక్కడివారు కొందరు.

ఇక్కడి రజాకార్లకు నాయకుడు సాలార్ అయినాడు. తూటాల పటకా భుజానికి తగిలించుకొని తుపాకీ పట్టుకొని బయలుదేరాడంటే గర్వనిర్భేద్యం ఆతని ంట కత్తులు, కటార్లు పట్టుకున్న సేన, ఆ సేనకు నియమం లేదు. నిబంధనల్లేవు. చట్టం లేదు. శాసనంలేదు; అరాచకం వ్యాపింపజేయటమే వారి పని, జనాన్ని హడలగొట్టడం వారి కర్తవ్యం. దోపిడీలు జరపడం వారి వృత్తి.

రషీద్ ముఠా ముందు పల్లెమీద పడ్డది. ఊళ్ళకు ఊళ్ళు తగలబెట్టారు. భర్తలముందు భార్యలను అన్నలముందు చెల్లెళ్ళను తండ్రుల ముందు కూతుళ్ళను చెరచేరు. బ్రతికి ఉన్న వారినే తగులబెట్టారు. మంగళసూత్రాలు తవ్వలతో కొల్చారు.

వారి ఆటలు ఎంతోకాలం స్వేచ్ఛగా సాగలేదు. పల్లెలు మేల్కొన్నాయి. ప్రతిఘటనలు సాగించాయి. ప్రజలు ఆయుధాలు ధరించారు. ఆడవాళ్ళే రజాకార్ల కళ్ళలో కారపునీళ్ళు కొట్టారు. రైతులు వడిసెలతో ఎదిరించసాగారు. కొందరి ప్రాణాలు తీశారు. కొందరి కాళ్ళు చేతులు విరగకొట్టారు. దాంతో పల్లెలు వదిలి బస్తీలమీద పడ్డారు రజాకార్లు.

ఇక్కడ వారి కోపాగ్నికి మొదట గురి అయినది గిర్దావర్ ఇల్లు. "అల్లాహో అక్బర్" అని కేకలువేస్తూ ఇంటిమీద పడ్డారు. తాళాలు బద్దలు కొట్టారు. చేతికి అందిందల్లా తీసికెళ్ళారు. ఇల్లంతా చిందరవందర చేశారు. తలుపులు బద్దలు

కొట్టారు. మంచాలు విరక్కొట్టారు. మొత్తం ఒకచోటవేసి కిర్సనాయిలు పోసి మంట పెట్టారు. మండుతుంటే గావుకేకలు పెట్టి అరవసాగారు. ఇంతలో వారికి పశువుల కొట్టం కనిపించింది. దానిమీద కిర్సనాయిలుపోసి నిప్పంటించారు. నోరులేని జంతువులు కాలి "అంబా" అని అరచి చస్తుంటే రంకెలు వేసి గంతులు వేయసాగారు. ఓ గుడిసెలోనుంచి ఒక పడుచుపిల్లను తెచ్చి పదిమంది చెరచి ఆ మంటల్లో పారేశారు. అప్పుడు వారి ఆనందానికి అంతులేదు. వారి వికటాట్టహాసానికి హద్దులేదు.

ఆ రాత్రి హైద్రాబాదునుంచి దిగాడు రఘు. రాగానే పెట్టె అందుకొని గదిలోకి వెళ్ళి తెరిచింది జానకి. ఏమైనా పుస్తకాలు తెచ్చాడేమో చూడాలని ఆవిడ ఆతురత. పెట్టెతెరుస్తే పిస్తోలు కనిపించింది. ఆమె ప్రాణాలు పైపైనే లేచిపోయాయి. తెరచిన పెట్టెముందు ప్రాణంలేని ప్రతిమలా కూర్చుండిపోయింది. కాళ్ళుకడుక్కొని వచ్చి గదిలో అడుగుపెడ్తున్న రఘు ఆ సన్నివేశం చూచి "పెట్టె తెరిచావా" అరిచాడు. ఆ అరుపులో అధికారం ఉంది. అంతకుముందు ఎరుగని కరుకుదనం ఉంది. భయపడిన లేడిలా చూచింది జానకి. కళ్ళు చెమ్మగిల్లాయి. లేచి నుంచుంది. పయ్యెద కొంగుతో కళ్ళు అద్దుకొని పక్కకు జరిగింది.

"పుస్తకాలు తెచ్చినావని...." తరవాత మాటరాలేదు. గొంతు పూడుకొని పోయింది. మూర్తీభవించిన శోకంలా నుంచుంది.

రఘు చూచాడు. గ్రహించాడు. సుతిమెత్తని మనసు జానకిది. నొప్పించాననుకున్నాడు. జానకి దగ్గరకు వెళ్ళాడు. కన్నీరు తుడిచాడు. "క్షమించు జానకీ! కసుకుగా అరిచిన, నీ మనస్సు నొప్పించిన, ఆతురతలో అధికారం ఉన్నట్లు మాట్లాడిన. ఏమనుకోకు జానకి! నన్ను క్షమించు" అని బ్రతిమిలాడాడు.

"పెట్టెలో ఏమున్నది?" అడిగింది జానకి.

"తుపాకి రఘు జవాబు."

"ఎందుకు?"

"ఎదిరించేందుకు?"

"ఎవరిని?"

"వ్యవస్థను"

"నీ విశ్వాసాలు నీవు బోధించిన...."

"ఆగు జానకి ఆగు, ఇక మాట్లాడకు. నా విశ్వాసాలు, నమ్మకాలు ఈ హింసాగ్నికి కాలి కూలిపోయాయి. స్త్రీలకు మానభంగాలు జరుగుతుంటే, గృహదహనాలు జరుగుతుంటే, పసికూనలు బలి అవుతుంటే చూడలేను జానకి. చూడలేను. మానవత మంటకలుస్తున్నది, మాడిపోతున్నది. చేతులు ముడుచుకొని కూర్చోలేను. జానకీ కూర్చోలేను. ఎదిరిస్తాను. తుపాకి పట్టుకొని విజృంభిస్తాను. గెలుస్తానా మానవ రాజ్యం చూస్తాను. పోతానా నా కర్తవ్యం నిర్వహించానని సంతృప్తితో చస్తాను. నా

విశ్వాసంవల్ల ప్రయోజనం లేదు జానకి. నువ్వూ నా వెంట రా, గెలిచినా ఇద్దరం, చచ్చినా ఇద్దరం. ఏమంటవు?" అగ్గి కురిపించాడు.

మౌనంగా తలవంచుకొని నుంచుంది జానకి. ఎంత సంక్షోభం చెలరేగిందో ఆ చిన్న గుండెలో? ఎంతోసేపు అలాగే నుంచుంది. ఒక్కొక్కప్పుడు మౌనంగా భయంకరంగా ఉంటుంది. ఇద్దరూ మౌనంగా ఉన్నారు. ఏం మాట్లాడాలో ఎవరికీ అర్థంకాలేదు. రఘు చెప్పాల్సింది చెప్పేశాడు. జానకి ఎలా చెప్పాలో ఆలోచిస్తూంది.

"రఘూ!" మౌనం తెగింది. మాట మెత్తగా ఉంది. ఆశగా చూశాడు రఘు. చెవులు నిక్కబొడుచుకొని విన్నాడు.

"రఘూ ! నాకు ఒకడే భర్త. ఒకే విశ్వాసం. ఈ రెండింటిలో దేన్నీ మార్చలేను. దారులు వేరైనప్పుడు ఏం చేస్తాం? మనుషులు ఒకటైవుంటే ఏనాటికైనా కలుసుకుంటాం. నేను రాలేను. క్షమించు."

రఘు మనసు కుడితిలోపడ్డ ఎలుకలా కొట్టుకుంది. తుదకు అన్నాడు, "అంతేనంటావా?"

జానకినుండి జవాబు రాలేదు.

ఆమె మౌనం వహించింది.

"అయితే వస్తా" అని పిస్తోలు అందుకుని బయలుదేరాడు.

జానకి వాకిలిదాకా అనుసరించింది. నిలిచిపోయింది.

రఘు చీకట్లో కలిసిపోతున్నాడు. పోయినాడు. జానకి టప టపా కన్నీరు రాల్చింది.

రఘు వెనక్కి తిరిగి చూశాడు. జానకి కనిపించింది, క్షణం నుంచున్నాడు. గిరుక్కున వెనక్కి తిరిగి ప్రయాణం సాగించాడు.

జానకి మంచంలోపడి ఎక్కెక్కి ఏడ్చింది. ఆమె గుండెలో సముద్రాలు పొంగాయి. ఆమెమీద మిన్ను విరిగిపడ్డది. అసలు ఆమె బాటే కన్నీటిబాట, కన్నీటి పాట. ఆమె దుఃఖానికి అంతేది? అవధులేవి? మళ్ళీ తనకు రఘు కనిపిస్తాడా? అదే, వేఆదన కృంగదీసింది.

జానకి మనసులో మసులుతున్న రఘు , రుషిగా అడవుల్లో గాలిస్తున్నాడు. రాత్రి సాంతం నడిచి ఉదయానికల్లా అడవిచేరాడు. కాని అతని కేమీ అంతుపట్ట లేదు. దారిలేదు. డొంకలేదు. అన్నీ చెట్లే. పుట్టలే. పొదలే. దుబ్బులే. అడవితో బాటే మిటి ? కాళ్ళకే కళ్ళుండాలి. రఘుకు కొత్త. ఎటు పోవాలో తెలీదు ఏమీ తోచదు. దారిలేదు. అయినా నడుస్తున్నాడు. దారిలేదు. తెన్నులేదు. సాగుతున్నాడు. అలసి ఉన్నాడు. కాలు సాగదు. ఆగదు. దూరంనుంచి ఎవడో చూచాడు. కోయదొర ఉరికి వచ్చాడు. రఘును పట్టాడు. తెల్లబట్టలవాడు, బిత్తర చూపులవాడు సర్కారు మనిషనుకున్నాడు. నడిపించుకొని తీసికెళ్ళాడు. దారి అతనికి బాగా కొట్టినపిండి అర గడియలో చేరుకున్నారు గుహారం. నాగేశ్ దూరంనుంచే చూచాడు. అన్నా'

అని వచ్చి కౌగిలించుకొన్నాడు. వారు ఎక్కడెక్కడ విషయాలో మాట్లాడుకున్నారు. నావికుల తిరుగుబాటు, స్వాతంత్ర్యం రావడం, సంస్థానాలను గురించి బ్రిటిషువారు పన్నిన కుట్ర, సర్దార్ పటేల్ చాకచక్యం, నైజాం నవాబు మొండితనం, ప్రజల తిరుగుబాటు, ఇలాంటివి ఇంకా ఎన్నో విషయాలు ఎంతోసేపు మాట్లాడుకున్నారు. ఏవేవో వ్యాఖ్యానాలు! రఘు చెప్పిన విషయాలు అక్కడివారికి ఉత్తేజాన్ని కలిగించాయి. ఉద్రేకం తెచ్చాయి. అంతా తుపాకులు ఎత్తి నినాదం చేశారు ముక్తకంఠంగా!

"విప్లవం వర్థిల్లాలె"

అడవి మారుపలికింది.

అదే విప్లవం వర్థిల్లాలంది.

రఘుకు అక్కడ ఒక కొత్తలోకం కనిపించింది. జాగీర్దారు రాజ్యం అంతరించింది. ప్రజలే రాజ్యం చేస్తున్నారు. ఆజ్ఞలు లేవు. ఆదేశాలు లేవు. దౌర్జన్యం లేదు. కట్టుగొయ్యలు లేవు. ఎత్తుబండలు లేవు. అంతా ప్రజలే, అది ప్రజల రాజ్యం. ఒకనికి ఆస్తిలేదు. అంతా ప్రజలదే. వ్యక్తి సంఘంకోసం, సంఘం వ్యక్తికోసం. ఈ రాజ్యం చవిచూచాక ప్రజలు, ఇకదాన్ని వదులుకోలేరు అనుకున్నాడు రఘు. ప్రాణాలర్పించి అయినా నిలుపుకుంటారు. విముక్తం కాని బస్తీని విముక్తం చేస్తారు అనుకున్నాడు.

రఘును నాయకుణ్ణి చేశాడు నాగేశ్. రఘు అందుకు అంగీకరించలేదు. నాగేశ్ నాయకత్వంలో పనిచేస్తానన్నాడు రఘు. నాగేశ్ లొంగక తప్పలేదు. అయినా రఘు సలహాలేనిది ఏ పని చేయడంలేదు నాగేశ్.

వారు జంటగా పల్లెలకు తిరిగారు. పల్లీయులలో వచ్చిన నవ చైతన్యానికి ముగ్ధుడైనాడు రఘు. రజాకార్లువస్తే పూర్వం ఊరు వదలి పారిపోయేవారు. హింసాకాండ అయిపోయిం తరవాత తిరిగి వచ్చేవారు. ఇప్పుడలా కాదు ! మంచెలు కట్టుకొని ఊరికి కాపలా కాస్తున్నారు. వారు వచ్చినట్టు అలికిడి తెలుస్తే ఊరంతా ఏకంగా ఎదిరిస్తూంది. హడలకొట్టి పంపివేస్తూంది.

ప్రజలు పంచాయితీలు ఏర్పరచుకున్నారు. భూములు, పశువులు, ఇళ్ళు పంచుకున్నారు. ప్రతిగుడిసెలో గేదెలు, ఎడ్లు కనిపించాయి. ప్రతి ఒకడూ పాటలు పాడుతున్నాడు. అవి క్రాంతి గీతాలు ? ఏ కవులూ వ్రాసి పెట్టినవి కావవి. ప్రజల ఎదల్లోంచి పుట్టినవి. పెదవిమీద కదులుతున్నాయి.

ఇవన్నీ రఘుమీద ఎంతో ప్రభావాన్ని వేశాయి. పోరాటాల్లో సిద్ధాంతాలతో కాదు ప్రజలతో పని అని నిర్ణయించుకున్నాడు. ప్రజలు తన కళ్ళు తెరిపించారనుకున్నాడు.

బస్తీమీద దాడికి ప్రజలను సమాయత్తపరచడానికి ఈ పర్యటన అంతా సిద్ధంగా ఉన్నారు. తేదీ సైతం నిర్ణయం అయింది. ఎవరు ఎటునుంచి ఎలా చేరుకోవాలనే వ్యూహం రచించబడుతున్నది.

వారు ఒక పల్లెలో ఉండగా వార్తాహరుడు వార్త తెచ్చాడు. రుక్మిణి తనిపోయింది. ఆంతవీరుడు నాగేశ్ కుప్పకూలిపోయాడు. కన్నీరు జలజలా రాల్చాడు. పాపం అతని పెన్నిధిపోయింది. కట్టుకున్న మేడలు కూలాయి. రఘు అతనిని ఓదార్చాడు. అప్పుడతనికి జానకి మనసులో మసలింది. హృదయం ఏదో అశుభం శంకించింది.

జరిగిందేమంటే ఎంతమంది వెళ్ళిపోయినా వెంకయ్య ఊరు వదల్లేదు. తాసిల్దారు తనవాడనే ధైర్యం అతనికి. అంతేకాక ఎంతని పట్టుకు పోగలడు! గొడ్డు గోదా, గింజ గిరుజ ఏం కాను ? రజాకార్లకు విరాళాలిచ్చాడు. వారు అడిగిందల్లా ఇచ్చాడు. రషీద్‌కు లేదని ఎన్నడూ అనలేదు. కాని గిర్దావరు ఇంటిని తగల పెట్టడంతో గుబులు పట్టుకుంది. ఇక లాభం లేదనుకున్నాడు. తానూ పారిపోవా ల్సిందేనని నిర్ణయించాడు. భార్యనూ, కూతురునూ వెళ్ళమన్నాడు. వారు అతను తానిదే వెళ్ళమన్నారు. తామూ ఇక్కడే చస్తామన్నారు. అప్పుడుగాని ప్రయాణం కాలేదతను.

ప్రయాణం అంటే మాటలా ? బట్టబయలుగా వెళ్ళడానికి వీల్లేదు. పారిపోతు న్నారని తెలిస్తే బ్రతకనియ్యరు. ఆ స్టేషనులో రైలెక్కడానికి వీల్లేదు. దొంగతనంగా ప్రయాణం సాగించాలి. ఆనాటి తెల్లవారుజామున బండి తెప్పించాడు దొడ్లోకి. అవసరమైన సామాను వేయించాడు. భార్యను కూతురును దానితో ఎక్కించాడు. చూచుకుంటే డబ్బుమూట కనిపించలేదు. తేవడానికి ఇంట్లో ప్రవేశించాడు.

"అల్లాహో అక్బర్" అనే కేకలు వినిపించాయి. రషీద్ కనిపించాడు. అమాంతంగా వెనక్కు తిరిగాడు. రషీద్ చేతిలోని తుపాకి పేలింది. గుండు వెంకయ్య వీపులోంచి ఎదలోకి దూరి దూసుకుపోయింది. వెంకయ్య కేక పెట్టి పడిపోవడమూ బండ్లో కూర్చున్న ఆడవారు గొల్లుమనడమూ, రషీద్ వికటాట్ట హాసమూ ఒకే లిప్తతో జరిగాయి.

బండివాడు ఎద్దులను అదిలించాడు, బండి కదిలింది. గ్రహించాడు రషీద్. ఉరికించాడు మనుషుల్ని. బండివాణ్ణి కాల్చేశారు. ఇద్దరు ఆడవాళ్ళనూ పట్టుకున్నారు. రషీద్ రుక్మిణిని బట్టబయట చెరచాడు. రుక్మిణి తల్లి అక్కడే కన్నుమూసింది. రుక్మిణి తనను తాను చూచుకుంది. తనకు తానే అసహ్యంగా తోచింది. మెల్లగా లేచింది. ఒక్కొక్క అడుగు మెల్లగా పడుతూంటే ఆమె విషయంలో ఆమెకే రోత పుట్టింది. బావిదాకా వెళ్ళింది. గోడమీద కూర్చుంది. నాగేశ్ కళ్ళల్లో మసిలాడు? అసహ్యకరమైన తన శరీరాన్ని చూచుకుంది. నాగేశ్.... తాను, నాగేశ్—తాను, తాను—నాగేశ్, అలా ఎన్నిసార్లో ఆమె మేధస్సులో తిరిగాయి! తుదకు తాను తగననుకుంది బావిలో దూకింది.

ఇంతే. ఇక రుక్మిణి మనకు లేదు.

ఇక సహించరాదని నిర్ణయించాడు రఘు. అది అతని అభిప్రాయమే కాదు, అందరి అభిప్రాయం. వారు నడవలేదు, ఉరికారు. ఆయుధాలు ఆయత్తపరచారు. ఉన్నవరకు తుపాకులు, తరవాత కర్రలు, గునపాలు, పలుగులు, రాళ్ళు అన్నింటినీ మించి మండే గుండెలు! ప్రజలు, ప్రజలు, ప్రజలు, ఒక్కరా ఇద్దరా! వందలు వేలు!! రాత్రి కటికచీకటి! కాగడాలు. ఒక్క వైపునుంచా! అన్ని వైపులనుంచి! ఎవడిక్కడ నాయకుడు? ఒక్కడా? అందరూ! ఎవడిక్కడి నేత! ఒక్కడా? అందరూ. ప్రభంజనం వలె కదిలారు. కదంతొక్కుతూ, పదంపాడుతూ, హృదంత రాళం గర్జిస్తూ సాగుతున్నారు.

జన ప్రవాహం కదిలింది
జన సాగరం కదిలింది.
సాగుతూంది జనయాత్ర, అనంతయాత్ర.
"దారిపొడుగునా గుండె నెత్తురులు
తర్పణచేస్తూ పదండి ముందుకు
బాటలు నడిచి
పేటలు గడిచీ
కోటలన్నింటిని దాటండి
నదీనదాలూ
అడవులు, కొండలు
ఎడారులా మనకడ్డంకి?
పదండి ముందుకు
పదండి త్రోసుక
పోదాం పోదాం పైపైకి!
ఎముకలు కుళ్ళిన
వయస్సు మళ్ళిన
సోమరులారా చావండి!
నెత్తురు మండే
శక్తులు నిండే
సైనికులారా. రారండి?
హరోం హరోం హర!
హర! హర! హర! హర!
హరోం హరా" అని కదలండి!

ఈ పదానికి అర్థంలేదు. కదిలినవానికి కదలండని చెప్పాల్సిన అవసరంలేదు. అయినా రఘు చెప్తున్నాడు. అంతా పాడుతున్నారు. సాగుతూంది జనం. ఇక ఆగ్రహం లక్ష్యం చేరేదాకా నిలువదు.

ఆ రాత్రే జరగరాని ఘోరం జరిగిపోయింది. జానకి అంటే హడలిపోయే రషీదుకు ధైర్యం వచ్చింది. అతని ఆటలకు అడ్డులేదు. అడ్డినవాడు లేడు. అందుకే అతడు బయలుదేరాడు. ముఠాతో కదలాడు. పట్టపగలు వెళ్ళే ధైర్యంలేదు వానికి. ఆమె మనుషుల హృదయాలకు పట్టపురాణి. చంపుకు తినేస్తారు జనం. ఎముక సైతం మిగులనీయరు. తెలుసు ఆ విషయం వానికి. అందుకే రాత్రి దొంగచాటుగా బయలుదేరాడు. నినాదాలులేవు. అరపులు లేవు. కేకలు లేవు. చల్లగా జానకి ఇంటికి చేరుకున్నాడు. తలుపులు దబదబా బాదాడు. ఇల్లు ఊరి చివరనుంది. ఎవడూ వినడని వారి ధైర్యం.

ఆ రాత్రి జానకి ఒక్కతే ఉంది. పని మనిషి ప్రసవించింది. రాలేక పోయింది. నిద్రమేల్కొన్నది. విన్నది. తలుపులు బాదుతున్నారు. బద్దలు కొట్టేట్టు న్నారు. ఏం చేయాలి? పారిపోదామనుకుంది. అడుగులు కూడా వేసింది. అక్కడా ఎవడైనా ఉంటే? ఏమిటి చేయడం? ఆలోచించే సమయంలేదు. ఆలోచనరాదు. కొట్టు మిట్టాడింది. తలుపు బద్దలు అవుతూంది. అమాంతంగా ఒక ఆలోచన స్ఫురించింది. కత్తి నాగేశ్ కత్తి! పెట్టె తెరిచింది. బట్టలన్నీ లాగేసింది. అడుగున వుంది, కత్తి, తీసింది. వర లాగేసింది. దాన్ని ముద్దు పెట్టుకుంది. బయట తలుపు విరుగుతూంది. లోపల జానకి, చండిక అయింది. కళ్ళు నిప్పులు కక్కుతున్నాయి. ఒడలు వడకు తూంది. అంతకుమించిన కర్తవ్యం లేదనుకుంది. కత్తి పట్టుకొని ఉరికింది. గుమ్మం దగ్గరికి వచ్చేవరకు తలుపు విరిగింది.

రషీద్ చొచ్చుకొని వచ్చాడు.

రషీద్ రొమ్ములో కత్తి గుచ్చింది జానకి.

"యా అల్లా" అని పడిపోయాడు.

ఎదుటివాడు తుపాకి పేల్చాడు. అది జానకి రొమ్ములోంచి దూసుకుపోయింది. జానకి రక్తపు మడుగులో పడిపోయింది.

తుపాకి దెబ్బ విని ఊరు మేల్కొంది.

పారిపోయే దుండగులు కొంపకు నిప్పంటించి పోయారు.

'జానకమ్మ కొంప తగలపెట్టారు.' ఈ వార్త అగ్గిలా పాకింది, ఊరంతా కటాన కదిలింది. ఎవని చేతికి అందింది వాడు పట్టుకొని ఉరికాడు. దుండగులను ఉరికిందారు. కాలికి బుద్ధిచెప్పారు రజాకార్లు. ప్రజలు వెంబడించారు. ఎదురుగా ఒక జన ప్రవాహం. కత్తులు, బరిసెలు, ఈటెలు, కాగడాలు రజాకార్ల కాళ్ళు చచ్చు పడ్డాయి. వెనుక జనం, ముందు జనం, ఎక్కడికి పోవడం? తుపాకులు ఎత్తారు. వీరు ఎత్తకముందే అక్కడినుంచి తుపాకులు పేలాయి, వెనుకనుంచి జనం వారి మీద పడ్డారు. ఎలుకలు బోనులో పడ్డాయి, అంతా పట్టుపడ్డారు. వారిని చావ కొడ్తున్నారు జనం. ముందునుంచి వస్తున్నది జనం. రఘు కేక, నాగేశ్ అరుపులు,

సింగన్న గాండ్రింపులు, భీముని నినాదాలు, రావడి ఆవేశాలు. అటు జనం తమ వాళ్ళే ననుకున్నారు.

"ఇన్క్విలాబ్ జిందాబాద్" ఇటునుంచి.

"విప్లవం వర్ధిల్లాలె" అటునుంచి.

అటు జనం ఇటు జనం కలిసింది. రెండు జలపాతాలు కలిశాయి. రెండు కార్చిచ్చులు కలిశాయి. రెండు ప్రళయాలు కలిశాయి. ఇప్పుడు ఒకే జనం, ఒకే ప్రభంజనం, ఒకే ఝంఝామారుతం సాగింది తాసిల్దారు ఇంటివైపు. ఇంటిని చుట్టుముట్టారు. గునపాలు, పలుగులు, సమ్మెటలు, సుత్తెలు పడుతున్నాయి తలుపులమీద. తలుపులు బద్దలవుతున్నాయి. వ్యవస్థ బద్దలవుతూంది గోడలు కూలుతున్నాయి. ఒక విధానము కూలుతూంది. తాసిల్దారు లోపల గడగడలాడుతున్నాడు. ప్రభుత్వం గడగడలాడుతూంది. ప్రజలు కేకలు, కేరింతలు, తిట్లు తాసిల్దారు సగం చచ్చిపోయాడు. తాను పారిపోనందుకు విచారించాడు. కొందరు రజాకార్లు చివరి రైలులో హైదరాబాదు వెళ్ళిపోయారు. తాసిల్దారుకోసం ఆగలేదు బండి. అతడు వెళ్ళలేకపోయాడు.

తలుపులు బద్దలవుతున్నాయి.

తాసిల్దారు గుండెలో గునపాలు పడుతున్నాయి.

తలుపులన్నీ బద్దలైనాయి.

జనప్రవాహం చొచ్చుకొనిపోయింది.

తాసిలారు నక్కి ఉన్నాడు.

సింగన్న గుండెకు గురిపెట్టాడు.

"ఆగు" కేక వినిపించింది. సింగన్న చేయి నిలిచింది. "వీడు నా చేతిలో చావాలె" మస్తాన్ కేకపెట్టి ముందుకు దూసుకొని వచ్చాడు.

"మస్తాన్!" తాసిల్దారు నోటి నుండి ఆశ్చర్యార్థకం వెలువడింది.

"మస్తాన్!"

"మస్తాన్!"

"మస్తాన్!"

జనమంతా ఆశ్చర్యపడ్డారు. వింతగా చూచారు. విడ్డూరంగా చూచారు.

"అవు మస్తాన్నే. ఆశ్చర్యంగున్నది, గదా! బుక్కెడు బువ్వ కోసం నీ గులామునైన. మనుషులను చంపమన్నవు – చంపిన, దోచమన్నవు దోచిన. ఆడదాన్ని పట్టమన్నవు–పట్టిన. ఇప్పుడు తెలిసింది నాకు. మంచికొంపలు కూల్చి నీ కొంప నిలబెట్టుకున్నావు. నిన్ను నేనే చంపుత. ముక్కలు ముక్కలు చేస్త. కాకులకు గద్దలకు ఏస్త" పిడుగులు కురిశాడు మస్తాన్.

"వీడు నా సుత్తెతో చావాలె, నా చెల్లెలను చెరిచిండు. మా అయ్యను చంపిండు, మా అమ్మను చంపిండు. మస్తానన్నా జరుగు" భీముని ప్రార్థన.

నాగేశ్ ముందుకు వచ్చి ముగ్గురినీ వారించాడు. "మీకెవరికీ వీడిని చంపే అధికారం లేదు. ఆ అధికారం ప్రజలకే ఉంది. వారు విచారిస్తారు. జరగండి" అని నాగేశ్ అడ్డునుంచున్నాడు.

"చంపండి"

"కొట్టండి" జనంలోంచి కేకలు.

"చీల్చండి"

తాసిల్దారు గుడ్లప్పచెప్పి చూస్తున్నాడు.

తాసిల్దారు భార్య సుందరి – సుకుమారి అసూర్యంపశ్య. తాకుతే మాసి పోయేట్లుంది. జనంలోనించి తోసుకునివచ్చి భర్త ముందు నుంచుంది.

ఆమెను చూచి అంతా ఆశ్చర్యంలో మునిగారు. ఎంత అందం! ఎంత సౌశీల్యం! ఆమె స్వర్గంనుంచి దిగివచ్చిందా? నక్షత్రం రాలి పడిందా! అన్నట్లు చూచారు.

ఆమె నాగేశ్ కాళ్ళమీద పడ్డది. పతిభిక్ష పెట్టమని వేడుకుంది.

"తల్లీ! వీణ్ని శిక్షించటంగాని నా చేతిలో లేదమ్మా. ఇది ప్రజల న్యాయ స్థానం. వీరిలో ఒక్కడైనా నీ భర్తను వదలమంటే వదులుతం" నాగేశ్ అన్నాడు.

"వదలద్దు"

"నా అక్కను చెరిచిండు"

"నా పెండ్లాన్ని తెచ్చిండు"

"నా భూమి గుంజుకున్నడు"

"నా బిడ్డను గుంజిండు"

"చంపాలె."

"ముక్కలు ముక్కలు చెయ్యాలె"

"మేం చేస్తం మీరు జరుగుండి"

బేగం కళ్ళు నీళ్ళతో నిండాయి. ఆమె భర్తను చూసింది.

"బేగం! నన్ను ఒక్కడూ క్షమించడు. ఇన్ని సంసారాలు కూలడానికీ, ఇన్ని ప్రాణాలు పోవడానికి కారకుణ్ణి నేను. అధికారానికి కళ్ళుండవు. సంపదకు మనసుండదు. ఆ రెండూ అబ్బాయి నాకు. నేను రాక్షసుణ్ణి అయినాను. అధికారం ఎల్లకాలం ఉందనుకున్నాను. ప్రజాశక్తి ముందు ఏ అధికారమూ ఏ ప్రభుత్వమూ నిలువలేవు. ఇది ఇవ్వాళ తెలిసింది నాకు. నన్ను శిక్షించనీ, నువ్వు జరుగు బేగం" తాసిల్దారు ఉర్దూలో అన్నాడు.

"సైతాన్ ఖురాన్ చదువుతున్నది" అని వికటంగా నవ్వి "ముక్కలుగా నర్కాలె, మాఫ్ నహీఁకరేఁగే" అని కత్తి ఎత్తాడు మస్తాన్.

సుత్తి లేచింది.

గునపం లేచింది.

శూలం లేచింది.

కర్ర లేచింది.

వేగం తాసిల్దారును చుట్టేసుకుంది.

రఘు బయటికి వచ్చాడు.

సాగిపోతున్నాడు. ఒంటరిగా-ఒక్కడు !

ఎడారిలోంచి. వడగాడ్పులోంచి, నిశ్శబ్దంలోంచి, నీరసంలోంచి, విరామయంలోంచి!

సాగిపోతున్నాడు.

ఒక్కడు ఒంటరిగా.

స్టేషనులో రైలు కూసింది. మిలటరీ స్పెషల్ ఆగింది, సిక్కు మిలటరీ దిగింది. వారి ముందున్నవారు కులశేఖరరావు, రంగారెడ్డి ఇద్దరువారులై దిగారు.

సాగిపోతున్నాడు రఘు.

మార్గం సుదీర్ఘం.

భూమి గుండ్రం.

(సమాప్తం)

# ఏ మతమూ నేర్పదు వైరం

మతాలు ఈనాటివి కావు. మనిషిని మానవుణ్ణి చేయడానికే మతాలు పుట్టాయి. అన్ని సామాజిక వ్యవస్థలూ అందుకే అవతరించాయి.

సమాజంలో స్వప్రయోజనపరులు ఆయా వ్యవస్థలకు చీడ పురుగుల్లాంటి వారు. వారు ఆ వ్యవస్థల్లోని మూల సూత్రాలైన మంచిని, మానవతను మాయంచేసి, దాని రూపాన్ని మార్చి తమకు అనుకూలంగా మలచుకుంటారు. జనం ఈ నీరస, నిస్తేజ వ్యవస్థనే నమ్మేట్లు చేయగల మొనగాళ్ళు వారు.

విచిత్రం ఏమంటే జనం వాళ్ళనే నమ్ముతారు! జనం తమను ముంచేవారినే విశ్వసించేట్లున్నారు!! ఇది చరిత్ర చాటిచెపుతున్న సత్యం !!

మతం ఎంతో పాతది. మనం చూస్తున్న రాజకీయ పార్టీలకూ అదే గతి పట్టింది. మూల సూత్రాలు మాయమై నక్క వినయాలకు నిలయాలైనాయి.

స్వప్రయోజనపరుల కబంధహస్తాల్లో ఇరుక్కున్నాక ఏ మతమూ, ఏ సంస్థ, ఏ పార్టీ తన స్వరూపాన్ని నిలుపుకోలేదు. ఈ కబంధులు ప్రజల్ను తమ ప్రయోజనాల కోసం చీల్చి, వారిలో ద్వేషం పెట్టి, వారు కొట్టుకు చస్తుంటే వికటాట్టహాసం చేస్తారు!

స్వప్రయోజనపరుల మీదకు ప్రమాదం విరుచుకుపడితే అంతా ఏకం అవుతారు. ప్రజల్ను ఏకం చేస్తారు. గట్టెక్కితే మళ్ళీ పాత కథే!

మంచి, మానవత, ప్రేమ, అభిమానంలాంటివి ఈ పరిస్థితుల్లో విలవిల్లాడుతున్నాయి. మానవత వికసించాలంటే మనం ఆ దుష్టశక్తులనుండి బయటపడాలని చెప్పడానికే "మానవత" - "మా-నవత" రచించాను.

మానవత మలి ముద్రణను విశాలాంధ్ర ప్రచురణాలయంవారు వెలువరిస్తున్నారు. వారికి కృతజ్ఞతలు.

సికిందరాబాదు,
28-5-97.

దాశరథి రంగాచార్య

# మానవత

ప్రళయం వచ్చేటట్లుంది - జల ప్రళయం! ఆకాశం కారుమబ్బుల్తో నిండి వుంది. మబ్బులు మదవతుల్లా కదుల్తున్నాయి. ఒకటే ఉరుములు! భూమిని వణికిస్తున్నాయి! క్షణక్షణానికి మెరుపులు, మబ్బులు వికటాట్టహాసం చేస్తున్నట్టుంది. జల్లుతో మొదలై వానగా మారింది. ఆకాశంనుంచి భూమిపై పడుతున్న ధారలు ఆకాశానికి, నేలకు ముడిపెట్టినట్లున్నాయి. నిరంతరం ధారలు, ఎడతెరిపి లేని వాన పట్టపగలే చీకట్లు కమ్ముకుంటున్నాయి.

వాన! ఏనోట విన్నా వాన, వారం రోజులుగా కురుస్తూంది, ఊరు జలమయం అయింది. ఊరికి ప్రాణం ఉన్న జాడ కనిపించడం లేదు. ఒక్క జీవీ బయటికి రావడం లేదు. మనుషులు ఇళ్ళనుంచి, పశువులు కొట్టాల్నుంచి కదలడం లేదు.

ఏరు నిండి పొంగులు వారుతూ పారుతూంది. గట్లను తెంపేటట్లుంది. ఏటి వరద గంట గంటకూ పెరుగుతూంది. హోరు ఎక్కువయింది. ఏరు మరికొంత పొంగితే ఊళ్ళోకి వస్తుంది. ఇహ ఊరుండదు. ఆ విషయం అందరికీ తెలుసు. అయినా ఎవరూ కదలడం లేదు. వాన ఎవరినీ కదలనివ్వడం లేదు. ఏరు ఎవరినీ ఉండనిచ్చేలా లేదు.

ముకుందంగారి స్థితి అయోమయంగా ఉంది. కాలు కాలిన పిల్లిలా బయటికి, లోపలకు తిరుగుతున్నారు. వాన తగ్గే సూచన లేదు. ఇంటిముందు పారే వరద కనిపిస్తూంది. ఏరు ఎప్పుడు కట్టలు తెంచుకుంటుందో తెలియదు. ఆయనకు చప్పున ఏదో స్ఫురించింది. దేవుని గదిలోకి ఉరికాడు. చీకటిగా ఉంది.

అంధకారంలో ఏం కనిపిస్తుంది? దేవుడూ కనిపించడు.

'జానకీ', ముకుందంగారు పిలిచారు. అది ఆర్తనాదంలా ఉంది. "జానకీ! అగ్గిపెట్టె తేమ్మా!"

జానకి పిడికిట అగ్గిపెట్టెతో ఉరకలేక వచ్చింది. ఆ అగ్గిపెట్టెలోనే వెలుగంతా దాగినట్లుంది. పిడికిలి తెరిస్తే వెలుగు పారిపోతుందేమోనని ఆమె భయం! దేవుని గది ముందుకు వచ్చింది. గుమ్మం ముందు నుంచుంది. అగ్గిపుల్ల గీసింది.

వెలుగులో వారిద్దరికీ సీతారామ లక్ష్మణుల విగ్రహాలు కనిపించాయి! అవి

మసక మసగ్గా ఉన్నాయి. అగ్గిపుల్ల కాలిపోయింది. ఆరిపోయింది. మళ్ళీ చీకటి. అంధకారం. మనిషికీ మనిషికీ మధ్య చీకట్ల తెరలు.

"అమ్మా, జానకీ! ప్రమిద ముట్టించమ్మా! ఈ ప్రళయం నుంచి రక్షించమని రాముణ్ణి ప్రార్థింతాం" ముకుందంగారి ధ్వని బరువుగా ఉంది. రానున్న ప్రళయపు భారం వారి మీద కనిపిస్తూంది.

జానకి అగ్గిపుల్ల గీసి ప్రమిద వెలిగించింది. ముకుందంగారు చేతులు జోడించి ప్రార్థించారు.

"రామా! జగద్రక్షకా! నువ్వు జగద్రక్షకుడవు స్వామీ! భక్షకుడవు కావు. ఎందుకలా చిరునవ్వు నవ్వుతావు! ప్రళయం వస్తున్నది చూడ్డంలేదా? ఏరు పొంగు తున్నది. ఊరిని మింగేట్లున్నది. నీ బాణంతో సముద్రుణ్ని వణికించావు. అది నీ పని అనా?....చూడు, జనం చేతుల్లో ప్రాణాలు పెట్టుకుని ఉన్నారు. వారం నుంచి బయటకు అడుగిడలేదు. ఎందుకు నాయనా నీకీ ఆగ్రహం? నీ బిడ్డలపైనా కోపం? శాంతించు, ప్రజలను రక్షించు."

ఏరు హోరు వినిపిస్తూంది, వాన చప్పుడు వినిపిస్తూంది.

"అమ్మా! జానకీ! నువ్వు ప్రార్థించమ్మా! సీతమ్మను వేడుకోమ్మా! ఆమె దయామయి. తనను వేధించిన రక్కసులను సయితం మన్నించిన క్షమామూర్తి."

జానకి కీర్తన అందుకుంది.

## 2

ఫాదర్ జాన్‌కు స్థిమితం లేదు. ఇటునుంచి అటు, అటునుంచి ఇటు చిరాగ్గా పచారు చేస్తున్నాడు. ఆయనకు ఎటూ తోచడంలేదు. గబ గబా వచ్చి గుమ్మంలో నుంచున్నాడు. వానను చూస్తున్నాడు; నది హోరు వింటున్నాడు. రెండు అరచేతులూ రాసుకుంటున్నాడు. వెనక్కు వెళ్ళిపోతున్నాడు; మళ్ళీ ముందుకు వస్తున్నాడు. ఆతని ముఖంలో ఈ ప్రళయం మానవాళిని ముంచేస్తుం దేమోననే భయం కనిపిస్తూంది.

"ప్రభూ! ఈ లోకాన్ని మింగేస్తావా? ఎందుకీ వాన? ఏమిటీ వరద? అమాయకుల్ని రక్షించవా?" అనుకోకుండా వచ్చిన మాటలివి!

ఏదో ఆలోచన స్ఫురించినట్లయింది.

"మైసన్ పాల్! బాబూ! పాల్" పిలిచాడు.

జవాబు లేదు. బిగ్గరగా పిలిచాడు.

పాల్ బయటికి వచ్చాడు. చేతిలో పుస్తకం ఉంది. అధ్యయనం చేస్తున్నట్టు న్నాడు. ముఖంలో అలసట ఉంది.

"ఎస్ ఫాదర్?"

"చూచావా వాన?"

పాల్ వానను చూచాడు. హోరు విన్నాడు. "ఇంకా తగ్గలేదా వాన?" ఆశ్చర్యంగా అడిగాడు.

"ఎక్కడ తగ్గేట్లుంది! లోకాన్ని ముంచేట్లు ంది. దేవుని బిడ్డల్ని కాపాడాలి."

"ఫాదర్! ఎలా ఇంత వాన? ఏం చేద్దాం?"

"ప్రేయర్-ప్రార్థన-ప్రభువును ప్రార్థించాలి. ఆయన బిడ్డల్ని రక్షించుకోవల సిందని వేడుకోవాలి. వస్తావా చర్చికి? ఒంటరిగా పోలేకున్నాను."

"పదండి ఫాదర్" అని పుస్తకం లోనపెట్టి గొడుగు, టార్చి తీసుకొని బయల్దేరాడు. వానలో చర్చికి చేరారు.

"ప్రభూ! పాపులను రక్షించుటకు వచ్చిన దేవదూతా! రక్షించు, నీ బిడ్డలు తల్లడిల్లుతున్నారు. ఈ ప్రళయం వారిని మింగేట్లుంది. నీ బిడ్డలు నిన్ను నమ్మకు న్నారు. ఏరు పొంగితే ఊరు మునుగుతుంది. వరదను అడ్డు, వానను ఆపు. ఏసు ప్రభూ! నీవే మాకు రక్ష. నీ బిడ్డల్ని కాపాడు. రక్షించు, కాపాడు. రక్షించు."

# 3

వాన తగ్గింది. ఎంత వారం తరువాత కనిపించింది. జనానికి విముక్తి లభించినట్లయింది.

వీధులంతా బురద బురద. చల్లటి చలిగాలి. సాధారణంగా ఈ వాతావరణంలో జనం బయటికి రారు.

వారం తరవాత ఎండ వచ్చింది. జనం బురదను లెక్క చేయడం లేదు. చలి గాలికి వెరవటం లేదు. కర్ఫ్యూ తరవాతలా జనం బయట పడ్డారు. తుపాకీ దెబ్బకు కాకుల్లా ఎగిరి వచ్చేసారు. వీధుల నిండా జనం. ఏనోట విన్నా వరద మాటలే; వాన మాటలే. పశువులు కొట్టాల్లోంచి బయట పడ్డాయి. జైల్లో నుంచి విముక్తి లభించి నట్లుంది వాటికి. స్వేచ్ఛ విలువ బానిసత్వం తరువాత గాని తెలియదు. వెలుగు ప్రభావం చీకటి తరవాత గాని తెలియదు. కష్టాల తరవాతగాని సుఖం తెలీదు.

జనం ఏటివైపు బయల్దేరారు. హోరు పెట్టిన ఏరుని చూడ్డానికి బయల్దేరారు. ముకుందంగారు కండవా వేసుకున్నారు. వంకె కర్ర అందుకున్నారు. వాకిటి తలుపు వేశారు. జానకిని జాగ్రత్తగా ఉండమని చెప్పారు. ఆయనా ఏరు దగ్గరికి చేరారు.

ఏరు నంగనాచిలా ఉంది. అతి వినయంగా పారుతూంది. ఎన్నడూ పొంగ నట్లు సాగుతూంది.

ముకుందంగారు ఏటిని చూచారు.—ఆశ్చర్యపడ్డారు. నిన్న పొంగింది- పొర్లింది – మిడిసిపడ్డది. ఊరినే మింగుతానన్నది. ఇవాళ కుంగింది. వంగింది. అణగి పోయింది. ఆ రాముడు లేకుంటే—తాను ప్రార్థించకుంటే ఈ ఏరు ఊరిని

మింగేదే! ఇది రాముని ప్రభావం. అతడు సముద్రమున్నే గడగడ లాడించాడు, ఈ ఏరు ఒక లెక్కా! తన ప్రార్థన—తన వినతి—తన విన్నపం - పనిచేశాయి; ప్రభావం చూపాయి. తాను ప్రార్థించకుండే ఈ ఊరు ఉండేది కాదు. ఇప్పటికే ఊరు జల మయం అయి ఉండేది. తనలో శక్తి ఉంది. తన ప్రార్థనలో బలం వుంది.

ఫాదర్ జాన్ చకితుడైనారు. నిన్నటి ఏరేనా ఇది! నిన్న పొంగింది. పొర్లింది. అందరినీ గడగడ లాడించింది. ఊరిప్రాణం తోకకు తెచ్చింది. ఏసు ప్రభువు ప్రభువులకు ప్రభువు. దేవదూత. అతని మాట వినక తప్పుతుందా? ఈ ఏరు అతనికి ఒక లెక్కా?

ఏసుప్రభువు గ్రామాన్ని కాపాడాడు. అతని బిడ్డలను రక్షించుకున్నాడు. ప్రభువుకు ఈ మొర ఎలా వినిపించింది? తన ప్రార్థన మన్నించాడు. తనను కాపాడాడు. జనాన్ని కాపాడాడు. అవును. తన ప్రార్థనలో బలం ఉంది—శక్తి ఉంది. తాను ప్రార్థించకుండే ఊరు మునిగిపోయేదే. తాను గ్రామాన్ని రక్షించాడు. తానే రక్షించాడా గ్రామాన్ని! అవును తానే ..తానే....తానే!

ఫాదర్ జాన్ నిటారుగా నుంచున్నారు. తల ఎత్తారు, పైకి చూచారు. ఆకాశం కనిపించింది. ముందుకు చూచారు. ఏరు కనిపించింది. పక్కకు చూచారు. ఊడల మర్రి కనిపించింది. తడిసిన మర్రి మొదలు, మర్రి ఊడల్లో చిక్కిన గడ్డిగాదం కనిపించాయి.

ఫాదర్ జాన్ చిరునవ్వు నవ్వుకున్నారు.

వరద తగ్గడానికి తానే కారణం అనుకున్నారు.

ఠీవిగా నడక సాగించారు—తీరాన.

ఫాదర్ జాన్‌కు అటునుంచి వస్తున్న ముకుందం కనిపించారు-దూరంగా-లీలగా. ఫాదర్ జాన్‌కు నమ్మకం కలగడంలేదు వస్తున్నది ముకుందంగారని. అందుకు కారణం ఉంది—ముకుందంగారు ఊళ్ళో ఉండక చాలా కాలం అయింది.

ముకుందంగారిది కలవారి కుటుంబమే. తండ్రీ తాతలు అంతో ఇంతో సంపాదించి పెట్టిపోయారు. ముకుందంగారు కాస్త విలాసపురుషుడైనాడు. భార్య వెంకాయమ్మగారు పరమ సాధ్వి. ముకుందంగారికి నాటకాల పిచ్చి. అందులోనే వారికి చంద్రమతితో పరిచయం అయింది. చంద్రమతి వగలాడి. ముకుందంగారిని కీలుబొమ్మను చేసింది. ఆడించింది. ఆమె ఒకనాడు అలిగింది. ముకుందం గుండె పగిలింది. తనకు నగలు కావాలంది. "ఉస్ ఇంతేనా?" అని బయల్దేరాడు ముకుందం. ఇంటికి చేరాడు. వెంకాయమ్మగారు కడుపుతో ఉంది. ఆవిడకు నిండు నెలలు. ముకుందం ఆవిడను నగలు అడిగాడు. అప్పటికి మిగిలినవి అవే. ఆమె ఇవ్వనన్నది, ఏడ్చింది, మొత్తుకుంది. ఇచ్చకాలాడాడు. ఆమె ఇవ్వనన్నది. అర్ధరాత్రి నగలు దొంగిలించి బయటపడ్డాడు ముకుందం. కొన్నాళ్ళకు పాపం – ఆమె ప్ర

దిక్కూ లేకుండా ప్రసవించింది, జానకిని కన్నది. బిడ్డను చూచుకొని బ్రతుక సాగింది. కాలం కత్తుల చక్రంలా కదిలిపోతూంది. ఒకనాడు ఇంటి ముందు బండి నిలిచింది. వెంకాయమ్మ గుమ్మంలోకి వచ్చి నిలుచుంది. బండ్లోంచి ముకుందం దిగాడు. ఆ వెనక చేయి అందించి చంద్రమతిని దించాడు. వెంకాయమ్మ గుండె పురి కట్టుకుంది. జానకిని పట్టుకొని భోరున ఏడ్చింది. ముకుందం భార్యను చీవాట్లు పెట్టాడు. కొట్టాడు. ఆ తరవాత ముకుందం, చంద్రమతి గదిలో దూరి గొళ్ళెం వేసుకొన్నారు. వెంకాయమ్మ గుండెకు గునపం గుచ్చుకొన్నట్టయింది. అంతే! తుదకి బావిలోకి మనుషుల్ని దింపి వెంకాయమ్మ శవాన్ని ముకుందంగారు బయటికి తీయించాల్సివచ్చింది. జానకి తల్లి శవంమీద పడి భోరుమంది. ముకుందంగారు మౌనంగానే భార్య చితికి నిప్పంటించారు. ఇంటికి తిరిగివచ్చి చూస్తే చంద్రమతి లేదు, నగలు లేవు, బట్టలు లేవు, డబ్బు లేదు. ఈ హడావిడిలో ఇల్లు దోచుకుని వెళ్ళిపోయింది. ఊళ్ళో ముకుందంగారిని దయదలచినవా డొక్కడూ లేడు.

భార్య దినవారాలు అయ్యాక, జానకిని తీసుకొని ఊరువిడిచి వెళ్ళి పోయారు. బుద్ధి తెచ్చుకొని ఆ తరువాత బడిపంతులు ఉద్యోగంతో చేరారనీ, యిదివరకెన్నడూలేనిది దైవభక్తి అధికమయిందనీ విన్నాడు. కొన్నాళ్ళ తరవాత రిటైర్ అయ్యారు. అప్పటికి జానకి పెరిగి పెద్దదయింది. ముకుందరావుగారు తిరిగి స్వంత ఊరిమీద గాలి మళ్ళి కూతురితో తిరిగి వచ్చేశారు.

ఫాదర్ జాన్ చూసింది ముకుందరావుగారినే. అయినా నమ్మకం కలక్క పోవడానికి కారణం అది. ముకుందంగారు చేరువ అయినాడు.

"హో! ముకుందంగారా? హోహో! ఎప్పుడూ రావడం? చుక్క ఊడిపడ్డట్టు వచ్చారేం?" చేతులూపుతూ కేక వేశాడు ఫాదర్.

ముకుందంగారు ఫాదర్‌ను పోల్చుకోలేకపోయారు. కొన్ని లిప్తలు. నిర్విణ్ణులై నారు. చూస్తూ నుంచున్నారు. పోల్చుకున్నారు.

"ఎవరు ఫాదర్ జాన్! అఁ గుర్తించలేదు. ఈ మధ్యనే వచ్చాను. ఇహ ఇక్కడే ఉంటాను."

"అలాగా! బస్తీ వదిలేశారన్నమాట, బావుందా ఇక్కడ?"

"ఇది మా ఊరు—ఎలా ఉన్నా బావుంటుంది, మీరెలా ఉన్నారు?"

ఇద్దరూ నుంచునే ఉన్నారు. దూరదూరంగా ఉన్నారు.

"బావున్నాం. ఏసు ప్రభువు దయవల్ల బావున్నాం. మీ అమ్మాయి ... పేరు గుర్తులేదు... చాలా చురుకైంది. ఎలా ఉంది?"

"రాముని దయవల్ల బావుంది. బి. ఏ. చదువుతూ మానేసింది. అయినా ఆడ వాళ్ళకి చదువెందుకు?"

"మీ నమ్మకం మీది. కాని ఆడవాళ్ళు చదువుకోవడం మంచిది. కనీసం సంతానాన్ని తీర్చిదిద్దగలరు."

"మా జానకి చురుకైందే—ఎంతైనా ఆడపిల్ల-ఒకఅయ్య చేతిలో పెట్టాల్సింది-చాలుననుకున్నా—బి.ఏ. వరకు చదివింది. ఈ చదువులు ఆడవాళ్ళను పాడుచేస్తున్నాయి. నుంచోలేను. ఆ రాతిమీద కూర్చుందాం."

"పదండి"

ఇద్దరూ చెరో రాతిమీద కూర్చున్నారు. దూర దూరంగా కూర్చున్నారు. ఎదురు బదురుగా కూర్చున్నారు.

"ప్రళయం వచ్చిందనుకోండి" -ఫాదర్.

"ప్రళయమే మరి. కాస్తయితే ఊరు మునిగేదే"

"మా ఏసుప్రభువును ప్రార్థించాం. ప్రళయం నిల్చిపోయింది. వరద ఆగిపోయింది."

"తప్పు-కానేకాదు—అదె మీలో ఉన్న తెలివి..." లేచి నుంచున్నారు ముకుందంగారు - "ప్రచారం మీకు పాతనవును. వరదను ఆపింది మా రాముడు. ప్రళయాన్ని అడ్డింది మా రాముడు, ప్రళయాన్ని ఆపింది నేను. కావాలంటే మా జానకిని అడగండి" చేతులు ఊపుతూ గట్టిగా అతిచారు.

''కాదు. ఏమాత్రం కాదు, అలా అనడానికి వీలేలేదు. శిలువలోంచి బయల్దేరిపోయాడు ఏసుక్రీస్తు – నా ముందే – నేను కళ్ళారా చూశాను. ఆయన చర్చిలోంచి బయటికి రాగానే వాన తగ్గిపోయింది. ఏటి వగ్గరికి వెళ్ళారు. ఏటిని చూచారు. అంతే వరద తగ్గిపోయింది."

"మా రామునికి ఏటిదాకా వెళ్ళాల్సిన ఖర్మ పట్టలేదు. అతడు సర్వాంతర్యామి. పరాత్పరుడు, అలా చేయి చూపాడు. అంతే! అన్నీ తగ్గిపోయాయి. నాముందే అంతర్థానుడైనాడు. ఏసట—ఏసు! ఏసు ప్రళయాన్ని ఆపగలడా? కాకుంటే రొట్టెముక్క ఇవ్వగలడు."

''ఏమన్నావ్? మళ్ళీ అను."

"మీ ఏసు రొట్టెముక్క ఇవ్వగలడు."

"ఏమన్నావ్?'' అని అడుగు ముందుకు వేశాడు ఫాదర్. "మీ రాముడు రొట్టెముక్క కూడా ఇవ్వలేడు."

"మా రామున్ని అంటావా?" అని కర్ర ఎత్తారు ముకుందంగారు.

"ఎంత పొగరు? మా ఏసు నంటావా?" అని కర్ర ఎత్తారు ఫాదర్.

"ఈ కర్ర రామబాణం!"

"ఈ కర్ర శిలువ!"

రామబాణం, శిలువ రెండూ కర్రలే! రెండు కర్రలు లేచాయి; రెండు కర్రలూ తాకాయి.

"నువ్వు మూర్ఖుడివి. నీకేమీ చేతకాదు."

"నువ్వు పెద్ద మూర్ఖుడివి. అసమర్థుడివి."

ఇద్దరూ కర్రలు పారేశారు. చేతులు కలుపుకునే దశకు వచ్చారు. పాల్ అటు వచ్చాడు. చూచాడు. ఉరికి వచ్చాడు.

"ఏమిటి ఫాదర్ ఇది?"

పాల్‌ను ఇద్దరూ చూచారు. ఇద్దరూ నిశ్చేష్టులైనారు. నుంచున్నారు.

"చూశావా, పీడి రాముడు గొప్పవాడట!''

"ఏసు గొప్పవాడా....ఎవడు ఏసు?"

"మళ్ళీ ఏసు మాట ఎత్తావంటే....''

"మా రాముణ్ణి ఏమన్నా...."

"ఏమిటి పాదర్, ఏమిటీ-తగాదా? ఏమిటండీ, ఎందుకీ పోట్లాట?"

"వరద తగ్గించింది మా రాముడు కాదంటాడయ్యా, మీ ఫాదర్! ప్రార్థన చేసింది నేను. కళ్ళారా చూచాను రాముడు బాణం విడవడం, కాదంటాడు...."

"చెప్పు, బుద్ధి చెప్పు. మనం చూళ్ళేదూ శిలువలోంచి ఏసు రావడం!"

పాల్‌కు ఏమీ అర్థంకాలేదు. అతనికి కనిపించింది శిలువ మాత్రమే!

"సరే, తగ్గాల్సింది వరద. అది తగ్గింది. వాన పోయింది. మనుషులు, పక్షులు, పశువులు హాయిగా ఉన్నారు. వారికి కావలసింది వాన తగ్గడం. వరద గుంజడం. ఎలా గుంజింది అని పోట్లాడుకోవడం కాదు. పూలు పూస్తాయి, గాలి వీస్తుంది. సెలయేరు పారుతుంది. వీటిని చూసి అంతా ఆనందిస్తారు. ఇవి ఎక్కడ్నుంచి వచ్చాయి అని పోట్లాడుకునే వారుండరు. మనకు కావలసింది ఫలితం. అది జరిగింది. అందరూ హాయిగా ఉన్నారు. మనమూ అలాగే ఉందాం. రండి ఫాదర్ వెళ్దాం." పాల్ ఫాదర్‌ను తీసుకుని సాగిపోయాడు. ఫాదర్ వెనక్కు తిరిగి ముకుందంగారిని చూస్తూ వెళ్ళి పోయాడు. ముకుందంగారు కిందపడ్డ కర్ర అందుకున్నారు. అక్కడే ఫాదర్ జాన్ కర్ర కనిపించింది. దాన్ని తాకలేదు. వెనక్కు తిరిగి సాగిపోయారు.

ముకుందంగారు సాగిపోతున్నారు. తోవలో కుక్కలు కాట్లాడుకుంటున్నాయి. ఒకదాన్ని ఒకటి కరుస్తున్నది. ఒకటి కిందపడేస్తున్నది. కొరుకుతున్నది, అరుస్తున్నది. కిందపడ్డది లేచింది, ఉరుకుతున్నది. రెండోది వెంటపడ్డది. మళ్ళీ కొట్లాట. ఈ తడవ వెంబడించిన కుక్క పడిపోయింది. పైనున్న కుక్క కరుస్తున్నది, కొరుకుతున్నది, అరుస్తున్నది.

'ఎందుకు పోట్లాడుకుంటాయి కుక్కలు' అనుకున్నారు ముకుందంగారు. వెంటనే 'వెధవ కుక్కలు' అనే మాట నోట వచ్చింది. చేతి కర్రతో కుక్కలవైపు నడిచారు. అదిలించారు, భయపెట్టారు. కర్రను చూచాయి కుక్కలు. చెరోవైపు ఉరికాయి. తోక ముడుచుకొని,అలా కొంతదూరం పోయి రెండూ నిలిచాయి. వెనక్కు తిరిగి చూచాయి. ఒకదానికి ఒకటి కనిపించింది—దూరంగా. రెండూ తమ తమ స్థానాల్లో నుంచున్నాయి. చెవులు రిక్కపొడిచాయి. గుర్రుమంటున్నాయి. ముకుందం

గారు చూచారు. ఒక కుక్కను అదిలించారు. అది ఉరికింది. వెనక్కు చూచారు ఫాదర్ జాన్ కిందపడిన కర్ర అందుకున్నారు. వెళ్ళిపోతున్నారు.

'మూర్ఖుడు!' అనుకోకుండా ముకుందంగారి నోటివెంట వచ్చింది. కర్ర ఊపుతూ కదిలిపోయారు ముకుందంగారు.

# 4

ఏరు నిర్మలంగా పారుతోంది. ఏట్లో బండలున్నాయి. అవి బట్టలు ఉతికేవి. వరదలో మునిగిపోయాయి. ఇప్పుడు బయటపడ్డాయి.

రమాదాసి ఏట్లోకి దిగింది. ఆమె నెత్తిన బట్టల మూట ఉంది. ఆమె చేతిలో కుండ ఉంది. ఒక బండ దగ్గరకి వచ్చింది. ఆ బండమీద ఏసుదాసు వున్నాడు. అతడు బట్టలు ఉతుకుతున్నాడు. రమాదాసి ఏసుదాసును చూచింది. మండి పడింది.

"ఈ బండ నాది. నువ్వెట్ల ఉతుకుతున్నవ్?" అంది కోపంగా.

ఏసుదాసు తలపైకెత్తి చూచాడు. రమాదాసి – చేతిలో కుండ, నెత్తిన మూట...వయ్యారంగా నుంచుంది. అతను మాట్లాళ్ళేదు. చూస్తున్నాడు.

"ఏందట్ల చూస్తవ్? దయ్యమనుకున్నవా?"

"దయ్యాన్ని చూస్తరా? కళ్ళు మూసుకుంటరు, పారిపోతరు. బాగున్నవని చూస్తున్న"

"బాగున్నవ్‌లే. అందుకనే చూస్తున్నలే, మొగంజూడు ఎట్లున్నదో! జరుగు అట్నుంచి. ఈ బండ నాది. బట్టలుతుక్కోవాలె"

"అట్లనా! ఈ బండ నువ్వేసినవా? నీ అయ్యేసిండా? నీ తాతేసిండా?" దాసు బట్టలుతక సాగాడు.

దాసి తగ్గున మండింది.

మూట పడేసి కుండ కింద పెట్టింది. పయట నడుముకు బిగించి చండికలా ముందుకు దూకింది.

"నీకు నా సంగతి ఎరక లేనట్లున్నది. నా బండమీద దేవుడొచ్చి ఉతికినా ఊరుకోను. జరుగు ఇంకో బండకుపో!"

దాసు ఎదటికి వచ్చి నుంచుంది దాసి. కళ్ళు చింత నిప్పుల్లా వున్నాయి. ఆవేశంతో ముక్కుపుటాలు ఎగిరి పడుతున్నాయి. గుండెల్ను కదులుతున్నాయి. మన్మథుని మీదికి కయ్యానికి కాలుదువ్వినట్లుంది. ఏసుదాసు ఆమె అందాన్ని తన్మయత్వంతో తిలకిస్తున్నాడు.

రమాదాసి అరిచింది. "కదుల్తవా? లేదా?"

ఏసుదాసు ఈ లోకంలోకి వచ్చాడు. "కదలను....ఏం చేస్తవ్?" అన్నాడు, స్థిరంగా నుంచున్నాడు.

ఇద్దరూ ఎదురుబదురుగా నుంచున్నారు.

శ్వాసలు కలిసేంత దగ్గరలో ఉన్నారు.

"ఏం చేస్తనా? చూడు" రమాదాసి అమాంతం అతన్ని వెనక్కి నెట్టింది. ఏసుదాసు బెండులా పడిపోయాడు. నీళ్ళల్లో పడిపోయాడు.

రమాదాసి పకపకా నవ్వుతూంది. ఆమె ముఖం వికసించింది. విజయగర్వం తాండవిస్తూంది.

ఏసుదాసు మునిగిపోలేదు-నీరు లోతుగా లేదు. నిలదొక్కుకుని నీళ్ళలో కూర్చు న్నాడు. రమాదాసిని చూస్తున్నాడు—ఆమె ముఖం వికసించింది.వెన్నెల విరిసినట్లుంది.

"ఏందట్ల చూస్తవ్? చాలయిందా? బట్టలు తీస్కపో" అని బండమీదున్న బట్టలు ఇసుకలో గిరాటేసింది. బండమీద కూచుంది. మూట విప్పింది. నీళ్ళలో తడుపుతూంది.

ఏసుదాసు ఓడిపోయాడు. కయ్యానికి దిగదల్చలేదు. ఏటిలోంచి లేచి వచ్చాడు, బట్టలు అందుకున్నాడు. మరో బండమీదికి వెళ్ళిపోయాడు.

ఏరు గలగల పారుతూంది. అదీ గలగల నవ్వినట్లుంది.

రమాదాసి బట్టలు ఉతికింది. పిండింది. బుజానవేసుకుంది. కుండలో నీరు నింపుకుంది. నెత్తికి ఎత్తేవారు కావాలి. అటుచూచింది. ఏసుదాసు కనిపించాడు. బట్టలు పిండుతున్నాడు.

"ఏయ్..." పిలిచింది—"ఆడపిల్ల కష్టపడ్తున్నటి. కనపట్టంలే, కడవెత్తు"

ఏసుదాసు వొచ్చి కడవ ఎత్తాడు.

కడవ ఎత్తుకున్న రమాదాసి సాగిపోతూంది. ఆమె నడకలో వయ్యారం కనిపించింది ఏసుదాసుకు.

ఏసుదాసు చూస్తున్నాడు - రమాదాసి నడకను. రమాదాసి సాగిపోయింది. ఆమె పోయిన దిక్కును చూస్తూ వుండిపోయాడు దాసు.

## 5

శనివారం, తెలతెల వారుతూంది. పిట్టల కిచకిచలు వినిపిస్తున్నాయి. చల్లని గాలి వీస్తూంది. తూరుపు ఎర్రవారింది. ముకుందంగారు లేచారు. జానకిని లేపారు. రేడియోలో 'సుప్రభాతం' వస్తూంది. గుడి గోపురానికి లౌడ్‌స్పీకరుంది. అదీ సుప్రభాతం వినిపిస్తూంది. ముకుందంగారు గొంతు కలిపారు. జానకివి పాడుతు న్నారు. ఇంట్లో 'సుప్రభాతం' ప్రతిధ్వనిస్తూంది. వాతావరణంలో సుప్రభాతం నిండింది.

ముకుందంగారు కాలకృత్యాలు తీర్చుకున్నారు. జానకి ఇల్లు కడిగింది. దేవుని గది శుభ్రం చేసింది. తలమీంచి స్నానం చేసింది. ముకుందంగారు స్నానం ముగించుకున్నారు. దేవుని గదిలోకి వచ్చారు. ప్రమిదలు వెలుగుతున్నాయి. విగ్ర హాలు వెలుగుతున్నాయి. ముకుందంగారు విగ్రహాల ముందు కూర్చున్నారు. జానకి కోసం చూడసాగారు. పూల బుట్టతో జానకి వచ్చింది. తండ్రి పక్కనే కూర్చుంది. ముకుందంగారు పూజ సాగించారు. జానకి పూలు వేస్తున్నది. కర్పూరం వెలిగిం చారు ముకుందంగారు. జానకి మంగళ హారతి పాడింది. జానకి గొంతు బావుంటుంది. ముకుందంగారికి చాలా ఇష్టం. మరోపాట పాడమన్నారు. పాడింది. కొబ్బరికాయలు కొట్టారు. ప్రసాదం సిద్ధం చేసింది జానకి! ముకుందంగారు జానకికి తీర్థం ఇచ్చారు. ఆమె కళ్ళకు అద్దుకుని పుచ్చుకుంది. ముకుందంగారూ తీర్థప్రసాదాలు తీసుకు న్నారు. జానకిని ప్రసాదం పంచి పెట్టమన్నారు. జానకి ప్రసాదపు పళ్ళెంతో బయల్దే రింది. చేతికర్ర అందుకొని ముకుందంగారు బయలుదేరారు! వారి ముఖాన బొట్టుంది. మెడలో మాల ఉంది. చేతిలో కర్ర ఉంది. గుమ్మంలో జానకి పక్కన నుంచున్నారు.

జానకి చేతిలో పళ్ళెం చూచారు పిల్లలు. పళ్ళెంలో ప్రసాదం ఉందని గ్రహించారు. జానకి ముందు మూగారు. చేతులు చాస్తున్నారు. గొడవ చేస్తున్నారు. జానకి ఒకరికొకరికే ప్రసాదాలు అందిస్తూంది. ఆనందంగా చూస్తున్నారు ముకుందం గారు.

రెండు చిన్న చేతులు ప్రసాదం అడిగాయి.

ముకుందంగారు చూచారు; భగ్గుమన్నారు. కర్ర అడ్డం పెట్టారు. జానకి బిత్తరపోయింది. తండ్రిని చూచింది.

"వాడు కిరస్తానీ...వాడికి ప్రసాదం ఇవ్వద్దు"

జానకి చిత్రంగా చూచింది తండ్రిని. తండ్రి ముఖంలో అసహనం, క్రౌర్యం కనిపించాయి.

జానకి అటు చూచింది. పసివాడు. మొలకు గుడ్డ కూడా లేదు. ముఖం అమాయకంగా ఉంది. దోసిలిపట్టి ప్రసాదం అడుగుతున్నాడు. అలాగే నుంచొని ఉన్నాడు.

"నాన్నా! పసివాడు చూడు, చేతులు చాచాడు" అని ప్రసాదం పెట్టబోయింది.

ముకుందంగారు కర్రతో కుర్రాణ్ణి నెట్టేశారు.

ప్రసాదం నేలమీద పడిపోయింది- కొబ్బరి ముక్కలు – పంచదార!

కుర్రాడు వెనక్కు జరిగాడు. కర్ర వీపుమీద పడింది. కుర్రాడు మళ్ళో పడిపోయాడు. అతని మెడలో వేలాడుతున్న శిలువ ప్రసాదంమీద పడింది.

ముకుందంగారు జానకిని లోనికి నెట్టారు. 'పద పద...లోనికి పద' జానకిని అదిలించి వాకిలి తలుపేశారు.

కుర్రాడు లేచి కూర్చున్నాడు. ఆశగా కొబ్బరి ముక్కలు ఏరి చేతులో పట్టుకున్నాడు. నోట్లో వేసుకోబోతున్నాడు. 'ఆగు. పారేయ్' అనే కేక వినిపించింది.

కుర్రాడు తలెత్తి చూచాడు.

ఫాదర్ జాన్ కనిపించారు. చేతిలో కర్ర ఉంది. కుర్రాడు లేచి నుంచున్నాడు. కొబ్బరిముక్కలు వదలలేదు.

'నిన్నే! పారేయ్. ఇలారా!' కుర్రాడు వణికిపోయాడు.

ఫాదర్‌ను చూచాడు.

ఫాదర్ మండిపడుతున్నారు. 'వదులు, వదుల్తావా లేదా?' ఫాదర్ కర్ర ఎత్తాడు. కుర్రాడి దగ్గరకి వస్తున్నారు.

కుర్రాడు చేతిలో చూచుకున్నాడు. కొబ్బరిముక్క లున్నాయి.

పిడికిలి బిగుసుకుంది.

అమాంతం పరుగు లంకించుకున్నాడు. దూరంగా ఫాదర్ గాలిలో కర్ర ఊపుతూ ఏవో కేకలు పెడుతున్నాడు. ఫాదర్ తనని అందుకోలేదని ఆ కుర్రాడికి తెలుసు. కొబ్బరిముక్కలను నోట్లో వేసుకున్నాడు.

జానకి విసురుగా లోనికి వెళ్ళింది. పళ్ళెం విసురుగా పడేసింది.

పడిపోయిన కుర్రాడు, ప్రసాదం ఆమెకు ఇంకా కనిపిస్తూనే ఉన్నాయి. ఆమె చుర చుర లాడింది. ముకుందంగారు చూస్తూ నుంచున్నాడు.

"నాన్నా! మీరు పొరపాటు చేశారు, పాపం పనివాడు ప్రసాదం అడిగాడు. వాణ్ని కొట్టారు. నెట్టారు."

"తల్లీ! నీకు తెలీదమ్మా—ఇంకా చిన్నపిల్లవు. ఈ కిరస్తానీలు పరమ దుర్మార్గులు. నీచులు" వాలుకుర్చీలో కూలబడ్డారు ముకుందంగారు.

"పసిపిల్లలు భగవంతునితో సమానం నాన్నా! వాళ్ళకు మతం అంటకట్టడం ఎందుకు! పాపం ప్రసాదం కోసం వచ్చాడు కుర్రాడు. వాణ్ని మీరు కొట్టారు."

"మనది ఆర్యావర్తం. తల్లీ-ఇది పుణ్యభూమి. వేదం అవతరించిన దేశం. ఉపనిషత్తులు వెలసిన చోటు. పురాణాలు పుట్టిన నేల. చాతుర్వర్ణ వ్యవస్థ విలసిల్లిన ప్రదేశం. ఆ వ్యవస్థే విలసిల్లినన్నాళ్ళూ పాడిపంటలు పొంగిపొర్లాయి. మ్లేచ్ఛులు మన దేశానికి వచ్చారు. మన దేశానికి చ్యుతి ఏర్పడింది. మన ధర్మం పతనం అయింది. ఈ కిరస్తాన్లు వచ్చారు. వర్ణ సంకరం చేశారు. వారికి తెలుసు మన ధర్మం అగ్గిలాంటిదని—దాని దరి చేరలేమని. అందుకే వర్ణ సంకరం ప్రారంభించారు. తెల్లవాడు పోయినా వారు వేసిన వల పోలేదు. అందులో చిక్కుకుని ఉన్నాం మనమంతా. విన్నావా అమ్మా! కిరస్తాన్లకు చాలా దూరంగా ఉండాలి. వారి నాశనమే మన కళ్యాణం."

'నాన్నా!' జానకి అరిచి, అంతలోనే తమాయించుకుని సరళ స్వరంలో "మనది ఆర్యావర్తం-నిజమే నాన్నా! అనార్యుల్ని అంతం చేయడానికి మారణ హోమం జరిగింది ఇక్కడే నాన్నా! ఇది పుణ్యభూమి నాన్నా-పుణ్యభూమి. నిండు సభలో ద్రౌపది వలువలు విప్పిన భూమి. సీతను అవమానించి అడవులకు పంపిన భూమి. అన్నదమ్ముల పోట్లాటలకు పద్దెనిమిది అక్షౌహిణులను బలిచేసిన భూమి. రక్తం ప్రవహింపచేసిన భూమి. నాన్నా నాలుగు వర్ణాలన్నారు. బావుంది, పంచములు ఎలా వచ్చారు? సరే నాలుగు వర్ణాల వ్యవస్థ ఎన్నడో ఉందన్నారు. పరుశురాముడు రాజ్యంకోసం రక్తపు ఏరులు పారించాడు. అతడు బ్రాహ్మడు. అతనికి రాజ్యంతో నిమిత్తమేమి? విశ్వామిత్రుడు క్షత్రియుడు. బ్రహ్మర్షి ఎందుకయినాడు! అరుంధతి ఎవరు? విదురుడెవరు? నాన్నా, గతం మంచిదనుకోవడం మన భ్రమ. చరిత్రలో ఎన్నడూ భారతభూమి ఇంత ఐక్యంగానూ, ఇంత విశాలంగానూ లేదు."

"జానకీ, చాలించు నీ మెట్ట వేదాంతం. ఇదంతా కిరస్తానీ చదువుల ప్రభావం. నిన్ను ఇంగ్లీషు చదివించడం నా తప్పు. నా ధర్మాన్ని వేలెత్తి చూపేవాణ్ని నేను సహించను." కాస్త ఉద్రేకంగానే అన్నారు ముకుందంగారు.

"నాన్నా! కిరస్తాన్లు మనుషులు కారా?"

"కారు, రాక్షసులు, దయ్యాలు, భూతాలు, వాదించకు. నడువ్ నా ముందు నుంచి" పెద్ద కేక పెట్టారు ముకుందంగారు.

జానకి హడలిపోయింది. తండ్రిని చూచింది.

ముకుందంగారికి చెమటలు పట్టాయి. వణికిపోతున్నారు.

'నాన్నా!' అని కేక పెట్టింది జానకి. తండ్రిమీద పడి, 'నాన్నా' అంది గోముగా. ముకుందంగారు జానకి తల నిమిరారు.

"ఏం లేదు తల్లీ? కాస్త ఉద్రేకపడ్డాను అంతే"

"నాన్నా! మీరు ఉద్రేకపడ్డారు" జానకి తండ్రి కాళ్ళదగ్గర కూలబడ్డది. "మీరు ఉద్రేకపడ్డారు నాన్నా!" ఆమె గొంతు సగం పూడిపోయింది. మాటల్లో కన్నీటి తడి ఉంది.

"పడను తల్లీ ....ఉద్రేకపడను. ఇది ఉద్రేకపడే వయసు కాదు.... తెలియ లేదమ్మా! తెలుసుకోలేక పోయాను. ఉద్రేక పడను. ఇహపడను" ముకుందంగారు కూతురు తలమీద ముఖం పెట్టారు.

ముకుందంగారు దేవుని గదిలో కూర్చున్నారు-వంటరిగా. వారి ఎదుట విగ్రహాలున్నాయి. విగ్రహాల ముందు సెమ్మెలున్నాయి. వాటిల్లో వత్తులున్నాయి-మూనె లేదు.

ముకుందం గారి మనసేమీ బావుండలేదు. ఇంట్లో ఏమీలేవు. అన్నీ నిండు కున్నాయి. వాస్తవంగా పూజకు ఉపక్రమించే ఉత్సాహం లేదు. ఏదో మనశ్శాంతి లభిస్తుందని ప్రారంభించారు. సెమ్మెట్లో నూనె లేదు. అది చూచి వారికి బాధ మరింత పెరిగింది. దారిద్ర్యం కఠినం అయింది. మృత్యువే కాస్త దయాళువేమో అనిపించింది.

ముకుందంగారు భాగవతం అందుకున్నారు. వ్యాసపీఠం మీద ఉంచి తెరిచారు. గజేంద్ర మోక్షం వచ్చింది. అదంటే వారికి చాలా ఇష్టం. గొంతెత్తి పద్యం చదివారు.

"కలడందురు దీనుల యెడ
కలడందురు పరమయోగి గణముల పాలన్
కలడందురు రన్ని దిశలను
కలడు కలండనెడి వాడు కలడో లేడో!"

జానకి వచ్చి గుమ్మం ముందు నుంచుంది. తండ్రి చదువుతున్న పద్యం విన్నది. తండ్రి గొంతు విదారకంగా ఉంది. పద్యం కంబె ధ్వని ఆమెను కదిలించింది. కళ్ళు చెమ్మగిల్లాయి.

పద్యం పూర్తయింది.

జానకి కళ్ళు తుడుచుకుంది.

జానకి లోన ప్రవేశించింది. ఆమె చేతిలో సంచి ఉంది. అది ఖాళీగా ఉంది. దాన్ని తండ్రికి చూపదల్చ లేదామె. చాటున పెట్టుకుంది. గదిలో కూర్చుంది. విగ్రహాలను చూచింది! చేతులు జోడించింది. కళ్ళు మూసుకుంది.

ముకుందంగారు జానకిని చూస్తున్నారు.

జానకి కళ్ళకు షావుకారు కనిపిస్తున్నాడు.

విగ్రహాలు ఎవరికీ కనిపించటం లేదు.

ఇద్దరికీ తిండి గింజలే కనిపిస్తున్నాయి.

ముకుందంగారు కాస్త తేరుకున్నారు. జానకి కళ్ళు తెరిచింది. ఆమె ముకుందంగారిని చూడనట్లు నటించింది. ముకుందంగారు అలవాటు చొప్పున హారతి పళ్ళెం అందుకున్నారు.

పళ్ళెంలో కర్పూరం లేదు.

ముకుందంగారి మనసు కలుక్కుమంది.

పళ్ళెం చేతి నుంచి జారింది–వదల్లేదు ముకుందంగారు. కర్పూరం లేకుండా హారతి ఇచ్చారు.

జానకికి తీర్థం ఇచ్చారు. ఆమె తీర్థాన్ని కళ్ళ కద్దుకుంది. అంతకు ముందే కళ్ళలో నీరుంది. జానకి బయటికి వచ్చింది.

ముకుందంగారు తీర్థం తీసుకున్నారు. పై పంచతో కళ్ళు తుడుచుకున్నారు. గదినుంచి బయటికి వచ్చారు. వారు గ్రహించారు జానకి వట్టి చేతుల్తో వచ్చిందని. అయినా ఉండపట్టలేక పోయారు. అడిగారు —

"అయితే అప్పివ్వనన్నాడు కదూ?"

జానకి తండ్రిని చూచింది. వారి ముఖంలో విచారం కాదు, విషాదం కనిపించింది.

"కాదు నాన్నా కూర్చో. బాధపడకు." తండ్రిని వాలు కుర్చీలో కూర్చోపెట్టింది జానకి. తాను కుర్చీ వెనక నుంచుంది. తండ్రి బట్టతల నిమురుతూ అడిగింది.

"నాన్నా! వాడున్నాడా?"

మాటలు కన్నీటి మూటల్లా వున్నాయి. ప్రశ్న సూదిలా ఉంది. సూటిగా గుండెల్లో గుచ్చుకుంది. తరతరాలుగా వస్తున్న విశ్వాసానికి తూట్లు పొడుస్తున్నట్లుంది.

ముకుందంగారు చలించారు. తలెత్తి జానకిని చూచారు. ఆమె చప్పున కొంగుతో కళ్ళు తుడుచుకుంది. కళ్ళలోని ఎరుపును తుడుచుకోలేకపోయింది. ముకుందంగారు చూడలేకపోయారు. విలవిల్లాడిపోయారు. తల దించుకున్నారు.

"ఏడుస్తున్నావా అమ్మా! ఏడవకు."

"నాన్నా వాడున్నాడా?" మళ్ళీ అడిగింది జానకి.

ఈ తడవ తలెత్తి జానకిని చూడలేదు — కాని జవాబు చెప్పారు.

"ఎవడమ్మా! భగవానుడా? ఉన్నాడమ్మా ఉన్నాడు."

"ఎక్కడున్నాడు నాన్నా? ఉన్నాడు వున్నాడంటావు. అది నీ పిచ్చి మాత్రమే! కలడందురు దీనుల యెడ అని చదివావే-మనం దీనులం కాదా? మనకంటే దీనులున్నారా? రోజూ కీర్తిస్తున్నావు. వాణ్నే నమ్ముకున్నావు. ఆ ఏనుగుకంటే తీసిపోయామా. రాడేం? రక్షించడేం"

"వస్తాడమ్మా-వస్తాడు. రక్షిస్తాడమ్మా-రక్షిస్తాడు"

"ఎప్పుడు నాన్నా? ప్రాణాలు పోయినాకనా? ఎన్నాళ్ళు భరించాలి బాధలు-యాతనలు?"

"ఇది తెలుగు దేశం తల్లీ!-నేను తెలుగు మాష్టర్ని. ఇంతేనమ్మా తెలుగు పంతుళ్ళ గతి! రిటైరైనాక బతకగూడదమ్మా....బతకగూడదు తల్లీ!! బతికిన వాళ్ళ గతి ఇంతే! చితి ఒక్కసారే కాల్చేస్తుందమ్మా! చింత బతికి వున్నన్నాళ్ళూ కాలుస్తుంటుందమ్మా"

వాకిట తలుపు తట్టిన చప్పుడయింది. ముకుందంగారు అదిరిపడ్డారు. "అమ్మా! మళ్ళీ ఎవరో అప్పులవాళ్ళు వచ్చినట్లున్నారు. నేను లోపలికి వెళతా. లేనని చెప్పమ్మా. ఆదరువు లేదు. అప్పులవాళ్ళతో ప్రాణాలు పోయేట్లున్నాయి". ముకుందం

గారు లేచి ఇంటిలోకి వెళ్ళిపోతున్నారు. మళ్ళీ మళ్ళీ తలుపు తట్టిన చప్పుడు, తలుపు తట్టినట్టు కాదు—గుండెను నెట్టినట్లుంది.

"పోస్టుమాన్ పోస్టుమాన్, తలుపు తియ్యండి"

ఆ మాటలు విన్నారు తండ్రీ కూతుళ్ళు. ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు "అప్పులవాడు నోటీసు ఇచ్చాడేమో?" అన్నారు ముకుందంగారు. జానకి మాట్లాడలేదు. మెల్లగా అడుగులువేస్తూ వెళ్ళింది. తలుపు తీసింది. ముకుందంగారు వాకిలివైపు చూస్తూ నుంచున్నారు. పోస్టువాడు రిజిస్టర్ లెటర్ ఇచ్చాడు. సంతకం చేయించుకున్నాడు. వెళ్ళిపోయాడు. అది జానకి పేర వచ్చిన ఉత్తరం. కవరు చించింది, కాగితం తీసింది, ఎగిరి గంతేసింది.

"నాన్నా అపాయింట్‌మెంట్ ఆర్డర్, నాకు ఉద్యోగం దొరికింది" ఒక్క గంతులో తండ్రి దగ్గర వాలింది. కాగితం అందించింది.

ముకుందంగారు కాగితం చదువుతుంటే వారి ముఖం మీద ఆనందం, ఉత్సాహం, భయం, అవమానం ఒకదాని తరువాత ఒకటి తెరల్లా దిగుతున్నాయి. పడుతున్నాయి. కాగితం జానకి చేతికిచ్చి కుర్చీలో కూలబడ్డారు ముకుందంగారు.

"అమ్మా! ఆడపిల్లవు, నువ్వు ఉద్యోగం చేస్తావా? కూతురు సంపాదన తిని కులకాలా నేను?" తలమీద చేయి వేసుకున్నారు.

"నాన్నా! ఎందుకిలా కుంగిపోతావు! కొడుకునయినా, కూతురునయినా నేనేగా నీకు. కొడుకు ఉద్యోగంచేస్తే కాదంటావా? పరిస్థితులు చూస్తున్నావుగా, ఉద్యోగం రావడమే అదృష్టం"

"ఏమోనమ్మా! రాముడిలా రాసిపెట్టాడు. నీ సంపాదన తినమన్నాడు; ఏం చేస్తాం. తప్పదు. బడిపంతులు కూతురు బడిపంతులమ్మ అవుతూంది. అదీ ఉన్న ఊళ్ళో కాదు. పొరుగూరికి ఎలా పంపనమ్మా?"

"నాన్నా? నీ పిచ్చిగాని - పొరుగూరంటే ఎంత దూరం! ఉదయం వెళ్ళి సాయంకాలం వస్తాను. అర్ధగంట కాలి నడక అంతకంటే దూరం లేదు. కాలాన్ని బట్టి నడుచుకోవాలి నాన్నా! కాదంటే ఎలా?" గారాబంగా తండ్రి భుజాలు పట్టుకుంది కూతురు.

# 7

జానకి ఉద్యోగంలో చేరే రోజు. తలమీంచి స్నానం చేసింది. ఉన్నంతలో కాస్త మంచి చీర కట్టుకుంది. అది ఆమెకు అద్దినట్లుగావుంది. సహజంగా అందగత్తె జానకి. అందం అంతా ఆమె కురుల్లో వుంది. కన్నుల్లో వుంది. కళ్ళల్లో సోయగం వుంది కాస్త ఎరుపు, ఆ కళ్ళతో ముఖం కళకళ లాడుతుంది. అంతే ఆమె అందం.

జానకి వున్నంతలో అలంకరించుకుంది. కళ్ళకు కాటుక దిద్దటం మాత్రం

మరువలేదు. అలంకరించుకున్న జానకి దేవుని గదిలోకి వెళ్ళింది. దణ్ణం పెట్టింది. కళ్ళు మూసుకుంది. ఏవేవో కోరుకుంది. బయటికి వచ్చింది. తండ్రి పాదాలంటి నమస్కరించింది. ముకుందంగారి నోట మాట పెగల్లేదు. మనసులోనే దీవించారు.

"వెళ్ళొస్తా నాన్నా" అని బయలుదేరింది-ఆర్డరు పట్టుకొని, పైట సర్దుకొని.

"నేనూ వస్తానమ్మా" అని కర్ర అందుకొని బయల్దేరారు ముకుందంగారు.

''ఎందుకు నాన్నా మీకు శ్రమ? వెళ్ళొస్తాగా?"

"వస్తానమ్మా! వస్తాను. పెళ్లిచేసి అత్తవారింటికి పంపాల్సిన కూతురును ఉద్యోగానికి పంపుతున్నాను. వస్తానమ్మా. దిగబెట్టి వస్తాను."

ఇద్దరూ స్కూలుకు చేరుకున్నారు. హెడ్ మిస్ట్రెస్ గదికి వెళ్ళారు. కూతురును ఆమెకు అప్పగించారు.

''ముకుందంగారూ! బాధపడకండి. ఆడపిల్లల్ని ఇంకా అబలలు అనుకోకండి. వాళ్ళు బలం పుంజుకుంటున్నారు. జానకి సౌగసైన పిల్ల. పెళ్లి విషయం దిగులు పడకండి, ఎవడో వచ్చి అలా ఎగరేసుకు పోతాడు." అంది హెడ్ మిస్ట్రెస్ పరిచయాలయ్యాక, ముకుందరావుగారు బాధపడుతూ వుంటే.

ఆయన శలవు తీసుకుని వెళ్ళిపోయారు. జానకి వెళ్ళిపోతున్న తండ్రిని చూస్తున్నది.

"ఏమిటలా చూస్తున్నావు?" శకుంతల మాటలు విని లోకంలోకి వచ్చింది. జానకి.

"ఇలా చూసిన వాళ్ళను చాలామందిని చూశాను. ఒక అబ్బాయి దొరికాడంటే చాలు-అటే, అయ్యసంగతి ఎత్తనే ఎత్తరు. ఆ మోజులోనే పడిపోతారు"

జానకికి ఏమీ అర్థం కాలేదు. రెప్పవాల్చలేదు. శకుంతలను తేరిపారచూచింది.

శకుంతల నడివయసు మనిషి, ముదిరిపోతున్న వయసు అగపడకుండా అలంకరించుకుంది. నెరిసిన వెంట్రుకలు కనిపించకుండా జాగ్రత్తపడింది. అయినా అక్కడక్కడా మేమున్నామని తలెత్తిచూస్తూనే వున్నాయి వెండి వెంట్రుకలు. ఆమె కళ్ళలో తీరని ఆశలు కనిపిస్తుంటాయి. అవి బుసలు కొట్టవు, కాని గూళ్ళు కట్టుకుని కాపురం వుంటాయి. ఆమెకు ఆడపిల్లలంటే ఇష్టం. అందమైన వాళ్ళంటే కసు. ఆమెకు చదువు అంతగారాదు, సంస్కారపు జాడ తెలియదు. పెత్తనం అంటే ఆమెకు ప్రాణం. దబాయించగలదు, ఆమె మాట నెగ్గించుకోగలదు. తెలివైంది. అందుకే ఆమెకా ఉద్యోగం వచ్చింది!

"నీ కెవరైనా పెద్దలు తెలుసా?" శకుంతల అడిగింది.

"ఊహుఁ, తెలియదు." జానకి తలెత్తి జవాబిచ్చింది.

"ఛైర్మన్ గారూ?"

"తెలియదు."

"మరి ఉద్యోగం ఎలా వచ్చింది?"

"ఇంటర్వ్యూకు పిలిచారు, వెళ్ళాను, ఏవో ప్రశ్నలడిగారు, చెప్పాను, ఆర్డరు వచ్చింది."

"నమ్మను, ఆయన సరసుడు" అంది నవ్వుతూ.

ఆ నవ్వు వికటంగా, కటువుగా, కర్కశంగా వుంది.

జానకి తల దిమ్మెక్కింది. అక్కణ్ణుంచి చప్పున వెళ్ళిపోవాలనిపించింది. ముళ్ళలో వున్నట్లుందామెకు.

శకుంతల గంట మోగించింది. చప్రాసీ వచ్చి నిలిచింది.

"ఈమెను ఒకటో తరగతికి తీసికెళ్ళు."

చప్రాసీ వెంట నడిచింది జానకి. తరగతిలో ఎవరూ లేరు. పిల్లలు నానా రభస చేస్తున్నారు. జానకిని చూచారు, ఆమె టీచరని గుర్తించారు. కాసేపు నిశ్శబ్దంగా వున్నారు.

జానకి కుర్చీలో కూలబడ్డది. ఆమెకు శకుంతల మాటలే గుర్తుకు వస్తున్నాయి.

సాయంత్రం తనకోసం తిరిగి తండ్రి వచ్చాడు. ఆయనతో నడుస్తూ శకుంతల ధోరణి తండ్రితో చెప్పాలనుకుంది. ఆలోచించింది. తాను చెపుతుంది. తండ్రి ఉద్యోగం వద్దంటాడు. అప్పులవాళ్ళు; బియ్యంలేని ఇల్లు, చెప్పరాదనుకుంది.

# 8

క్లాసు గది బల్లమీద గ్లోబు వుంది. జానకి పాఠం చెబుతూంది.

"ఇది భూగోళం. భూమి గుండ్రంగా వుంది—నారింజ పండులా. భూమి గుండ్రంగా తిరుగుతూంది. ఇదిగో ఇలా - బొంగరంలా" అని గ్లోబును తిప్పి చూపింది.

పిల్లలు ఆసక్తిగా వింటున్నారు.

"ఈ భూగోళంలో అనేక దేశాలున్నాయి. అన్ని దేశాల్లోనూ మనుషులుంటారు, మానవులుంటారు, బాలురుంటారు. కొన్ని దేశాల పిల్లలు నల్లగా ఉంటారు, కొన్ని దేశాలవారు తెల్లగా వుంటారు. ఇది చర్మపు రంగు మాత్రమే! అందరికీ మనలాగే గుండె వుంటుంది, అందరికీ మనలాగే రక్తం వుంటుంది. అందరికీ మనలాగే ఆకలి అవుతుంది—దాహం అవుతుంది. అందరూ ఆహారం తీసుకుంటారు, అందరూ నీళ్ళు తాగుతారు. అన్ని దేశాల బాలలూ ఆడుకుంటారు. ప్రపంచం మొత్తంలో మనుషులున్నారు. మనుషులంతా ఒకటే, మానవులంతా ఒకటే-బాలురంతా ఒకటే. బాలికలంతా ఒకటే."

ఛైర్మన్, హెడ్ మిస్ట్రెస్ వచ్చారు, వాకిట నిలిచారు. జానకి పాఠం చెప్పడంలో మునిగిపోయింది, వారిని చూడలేదు.

భారతంలో అర్జునికి పక్షి తప్ప మరేమీ కనిపించలేదు.

జానకికి పిల్లలు తప్ప మరేమీ కనిపించలేదు.

శకుంతలకు తల కొట్టేసినట్లుంది, ఛైర్మన్ వస్తే బయట నిలబెడుతుందా జానకి? ఆమె చిరచిర లాడింది, రుసరుస లాడింది. ఆమెకు పాఠం వినిపించడం లేదు, పిల్లలు కనిపించడంలేదు, జానకి కనిపిస్తూంది. తలబిరుసుదనం అనిపిస్తూంది. అడుగు ముందుకు వేసింది. జానకికి చెబుదామనుకుంది, ఆమెను బెదిరింతా మనుకుంది. ఛైర్మన్ వారించాడు.

ఛైర్మన్ జానకిని చూచాడు, బాగనిపించింది. పాఠం విన్నారు, చాల బాగనిపించింది, ఆయనకు చప్పున ఏదో స్ఫురించింది. మానవులంతా ఒకటే, ఎంత బావుందా మాట, మాట పాటలా వుంది, మాటలో ఏదో అనుభూతి వుంది, అనుబంధం వుంది, ఈ బంధాలు ఎందుకు తెగుతాయి? యుద్ధాలు ఎందుకు వస్తాయి? రక్తపాతం ఎందుకు జరుగుతుంది. వీటికి సమాధానాలు వస్తాయేమోనని వినసాగారు, గుమ్మానికి పక్కగాచేరి వినసాగారు, జానకి కంటపడకుండా వినసాగారు.

ప్రపంచం అంటే ప్రజలు.

ప్రపంచం అంటే బాలలు.

"ప్రపంచం అంటే ఏమిటి?" అని అడిగింది జానకి.

"ప్రపంచ మంటే ప్రజలు-ప్రపంచం అంటే బాలలు" పిల్లలు ముక్తకంఠంతో అన్నారు.

అదేదో నినాదం అనిపించింది ఛైర్మన్‌కు.

అదేదో ఆనందంలా ధ్వనించింది.

"మనమంతా ఒక్కటే! బాలలందరూ ఒక్కటే; అయినా మనలో కొన్ని మతాలున్నాయి, అవన్నీ అసలు మన మంచికే పుట్టాయి. బుద్ధుడు, జీసస్, మహమ్మద్ అంతా ఒకటే చెప్పారు. మనిషిని ప్రేమించమన్నారు, మంచిని పెంచుకోమన్నారు, మనమంతా ఒక్కటే, మానవులంతా ఒక్కటే. మనం కాట్లాడుకోవద్దు, కొట్లాడుకోవద్దు, మనం ఏం చేయరాదూ?"

"కాట్లాడుకోవద్దు. కొట్లాడుకోవద్దు" బాలలు కోరస్‌గా చెప్పారు.

ఛైర్మన్‌కు అది సంగీతంగా వినిపించింది. అనన్యమైన అనుభూతి కలిగింది, ఆలోచన వచ్చింది. అవును, అందరూ ప్రేమించమన్నారు. మనం ద్వేషించుకుంటున్నాం, ఎందుకు?

మనలో చాల కులాలున్నాయి. ఒకడు హెచ్చువాడు, ఒకడు తచ్చువాడు అంటున్నారు, అది నిజం కాదు. ఒకే తీరుగా గాలిపీలుస్తున్నాం, ఒకే నీరు తాగుతున్నాం, ఒకే ఆహారం తింటున్నాం, మరి మనకెందుకు భేదాలు? ఈ భేదాలు పెద్దలకు. మనమంతా ఒక్కటే! మానవులంతా ఒక్కటే!"

"మనమంతా ఒక్కటే
మానవులంతా ఒక్కటే!" పిల్లలంతా ఏకంగా అన్నారు.

ఛైర్మన్‌కు మనఃకవాటాలు తెరుచుకున్న ట్లనిపించింది. ఏదో వెలుగు-చల్లని గాలి అందులో ప్రవేశించి నట్లనిపించింది. అందరూ ఒకే నీరు తాగుతున్నారు, ఈ కులాలెందుకు? కుట్ర లెందుకు?

"అంతా ఒక్కటే"

"మానవులంతా ఒక్కటే" గునిశాడు ఛైర్మన్.

అది వినలేదు శకుంతల. ఆమె ధుమ ధుమ లాడుతూంది.

క్లాసులో—

"టీచర్! శారద నన్నంటుకోదు, దూరంగా వుంటుంది, కసిరికొడ్తుంది" మేరీ లేచి నుంచొని అడిగింది.

జానకి శారద దగ్గరకి వెళ్ళింది. తల నిమిరింది. "ఎందుకమ్మా శారదా! అలా చేస్తావు? తప్పుకదూ? అంతా ఒకచోట చదువుకుంటున్నారు, ఏముంది ఆ అమ్మాయి దగ్గర? ఎందుకంటుకోవు?"

శారద తల వంచుకుంది. "ఇగోనే టీచర్ మా అమ్మ చెప్పింది – వీళ్ళను అంటుకోవద్దని."

"మీ అమ్మ గాలి పీల్చదా?" నలుగురు పిల్లలడిగారు.

"మీ అమ్మ నీరు తాగదా?" మరికొందరు అడిగారు.

"శారద! తప్పమ్మా! అలా చేయగూడదు. ఇక్కడ మనమంతా ఒకటి. ఇక్కడ ఎవరూ ఎక్కువ లేదు. ఎవరూ తక్కువ కాదు."

"ఎవరూ చెప్పలేదు టీచర్ ఇంతవరకూ. ఇగోనే మేరీ అంటే నాకు చాలా ఇష్టం."

"రామ్మా మేరీ, శారద దగ్గరకిలా."

మేరీ, శారద కౌగలించుకున్నారు.

జానకి ఆనందం పట్టలేకపోయింది. కళ్ళు చెమ్మగిల్లాయి, చేతులు వాటంతట అవే చప్పట్లు కొట్టాయి.

పిల్లలంతా చప్పట్లు కొట్టారు.

ఛైర్మన్ కళ్ళల్లో ఆనందబాష్పాలు నిలిచాయి.

"ఏమిటా చప్పట్లు? స్కూలనుకున్నారా? గారడి ఆటనుకున్నారా?" శకుంతల రుసరుస లాడింది. ముందుకు లంఘించ బోయింది.

"నీకు తెలిసేదంతేలే" చేయి పట్టుకుని వెనక్కులాగాడు.

శకుంతలకు అర్థమైంది మరొసారి –

"ఛీ, ఏమిటి స్కూల్లో! నలుగురు చూడరూ?"

ఛైర్మన్ శకుంతల గదివైపు అడుగు లేస్తున్నాడు-శకుంతల అనుసరిస్తూంది. అతనికి క్లాసులోంచి మాటలు వినిపిస్తున్నాయి.

"నీ దగ్గర మిఠాయి పెట్టవూ?" మేరీ అడుగుతుంది.

మిఠాయి డబ్బా తెరిచిన చప్పుడు.

"ఇదిగో మేరీ! మిఠాయి."

"మా శారద మంచిది" జానకి మాట.

"అంతా ఒక్కటే....మనమంతా ఒక్కటే" పాటలా వినిపిస్తుంది.

గంట కొట్టారు-భోజనాల గంట.

క్లాసులో పిల్లలంతా కేకలేస్తూ పోవడానికి సిద్ధపడ్డారు. జానకి వారిని ఆపింది, అన్నది—

"ఇహ మనం వేరు వేరు కాదు. మనం అంతా ఒక్కటే, వేరువేరుగా టిఫిన్లు చేయం, అంతా కలిసి చేతాం, టిఫిన్ డబ్బాలన్నీ బల్లమీద పెట్టండి"

"టీచర్ నాకు టిఫిన్ డబ్బాలేదు, మా అమ్మ ఇవ్వలేదు"

"మరి?"

"ఇంతే టీచర్! రోజూ ఇంతే, నేనేం తినను"

"టీచర్! నా టిఫినుంది, మేరీ తింటుంది, నేను తినను" శారద.

"మా టిఫిన్లున్నాయి టీచర్. మేమంతా మేరీకి పెడ్తాం"

జానకి గుండె ఉప్పొంగింది. ఆమె గొంతు పూడుకుపోయింది.

"పాపలు! మీ రెంత మంచివారు! అందరం తిందాం. ఎవరూ ఆకలితో వుండొద్దు. ఉన్నదే అందరం పంచుకుందాం, తిందాం, పదండి చెట్లకిందకి."

"మా టీచర్ మంచిది, మా టీచర్ మంచిది'' అని పిల్లలంతా ఆమెను అనుస రించారు, చెట్లకిందకి చేరారు. వేపచెట్ల నీడ చల్లగా వుంది, ఆకాశంలో మబ్బులు చేరాయి, పసిపాపల మనసుల్లా చల్లని గాలి వీస్తూంది.

పిల్లలంతా వలయాకారంగా కూర్చున్నారు, మధ్యన కూర్చుంది జానకి. టిఫిన్లన్నీ ఒక చోట చేర్చింది. అందరికీ పంచి పెట్టింది. తానూ తీసుకుంది, జానకి తినడం లేదు, చూస్తున్నది. ఆమెకు కడుపు నిండినట్లుంది.

కలిసి తింటున్నారు పిల్లలంతా.

కొందరు నవ్వుతున్నారు.

కొందరు ముచ్చట్లాడుకుంటున్నారు.

కొందరు ఇకిలిస్తున్నారు.

కొందరు సకిలిస్తున్నారు.

వారంతా జానకి కళ్ళలో మసలారు. ఎంత ఆనందం వట్టిపోయింది ఇంత కాలంగా! ఇందరు పాపలు కలిసి వుంటే ఎంత హాయి! వీరంతా మందారాలు. కలిసి వుంటే దండలా వున్నారు. విడిగా వుంటే ఒక్కొక్క మందారం వేరు వేరు! ఇంత అందం వుండదు. ఇంత ఆనందం వుండదు అనుకుంది, జానకి మనసు నిండి పోయింది.

బెల్లు వినిపించింది.

"అంతా ఒక్కటే-మనమంతా ఒక్కటే" అంటూ పిల్లలంతా క్లాసులోకి పరిగెత్తారు.

జానకి క్లాసు గదిలో అడుగు పెడ్తోంది. ఇంతలో చప్రాసీ వచ్చి "అమ్మగారు పిలుస్తున్నారు" అని చెప్పింది. జానకి వెళ్ళింది.

శకుంతల చిరునవ్వు నవ్వింది.

జానకికి చురుక్కుమంది.

"ఛైర్మన్‌గారు వచ్చారు. చూచావా?"

''చూళ్ళేదండీ!'' గొంతులో భయం మాటల్లో కనిపిస్తూంది.

''నువ్వెందుకు చూస్తావు. చక్కగా ఉన్నావు కదూ! వారు గంట నుంచున్నారు నీ గదిముందు''

''నేను చూళ్ళేదండి''

''నీ చూపు కోసం ఆయన గంట నుంచున్నారు. నువ్వు చూడనే లేదు. మరొకరినయితే ఉద్యోగం ఊడ పెరికేవారు. నువ్వంటే వారికి సరదా!''

జానకి మాట్లాళ్ళేదు.

ఆమె శకుంతలను చూస్తున్నది.

''నిన్ను చాలా మెచ్చుకున్నారు! సొగసుగా ఉన్నావన్నారు. ఆయన రసికుడు.''

జానకికి ఏమీ అర్థం కావడం లేదు, గుండెలో భయం గూడు కట్టుకుంటూంది.

''నిన్ను ఇంటికి రమ్మన్నారు-వంటరిగా'' కిసుక్కున నవ్వింది శకుంతల.

* * *

'భీముడు భీషణమైన ప్రతిజ్ఞ చేశాడమ్మా?'

జానకి తండ్రిని చూచింది. అతని లోకం వేరుగా కనిపించింది. తండ్రికి భారతంలోని భీముడు మాత్రమే కనిపిస్తున్నాడు. తాను కనిపించడంలేదు.

''దుశ్శాసనుడు ద్రౌపది కొప్పు పట్టుకున్నాడు. సభా మధ్యమునకు గుంజుకొని వచ్చినాడు. వలువలు వలుస్తున్నాడు. భార్య బట్టలు వలుస్తున్నాడు దుశ్శాసనుడు. మండిపోయినాడు భీముడు. పండ్లు పట పట కొరికినాడు. దుశ్శాసనుని రొమ్ము చీల్చెదునన్నాడు. వాని రక్తము త్రాగుదునన్నాడు.''

జానకికి మరేవో దృశ్యాలు కనిపిస్తున్నాయి.

''నాన్నా! ద్రౌపదికి భర్త లేకుంటే ఎవరు పగ తీర్చుకునేవారు?''

ముకుందంగారు తికమకపడ్డారు. అది భారతదేశంలో లేని ప్రశ్న. ఏం చెప్పాలో అర్థం కాలేదు.

''అదేమిటమ్మా! అలా అడుగుతావు? ద్రౌపదికి భర్తలున్నారు కదా. లేకపోతే భారతమే ఉండేదికాదు.''

''ఏం లేదు నాన్నా! ఊరికేనే అడిగాను. భర్తల్లేకుంటే ద్రౌపదిని మానభంగం చేసినా అడిగేవాడుండడు గదా!''

''అదేమిటమ్మా! అదోలా ఉన్నావు ఇవ్వాళ?''

''ఏంలేదు నాన్నా!'' కప్పులందుకొని లోనికి వెళ్ళిపోయింది జానకి.

ముకుందంగారు దుర్యోధనుని సభలో పడిపోయారు. వారికి విదురుని మాటలు వినిపిస్తున్నాయి.

ఆ రాత్రి జానకి నిద్రపోలేదు. శకుంతల చెప్పింది చైర్మన్ రసికుడని. తనను ఇంటర్వ్యూ చేసిందతనే. అలా కనిపించలేదు. శకుంతల ఎందుకలా అన్నది? తాను అందంగా ఉన్నానని సెలెక్ట్ చేశాట్ట! ఏమో! తనను రమ్మన్నాట్ట! వంటరిగా రమ్మన్నాట్ట! ఎందుకు రమ్మంటాడు? తాను ఆడది. వయసులో ఉంది. అతడు మగాడు. ఆడది కనిపిస్తే మగాడికి మరో ఆలోచన రాదా? తాను వెళ్తుంది, చైర్మన్ తనను బలవంతం చేస్తాడు. తాను కాదంటుంది. తప్పించుకుంటుంది. బయట పడ్తుంది. వాడు పగపడ్తాడు. ఉద్యోగం ఉంటుందా? ఉండదు. ఊడుతుంది. ఉద్యోగం ఊడటం ఖాయమా? ఖాయం? ముమ్మాటికీ ఖాయం. తానే ఉద్యోగం మానేస్తే....మానేస్తే....అవును మానేస్తే? అదే మంచిది. ఈ దేశంలో ఆడవాళ్ళను ఉద్యోగాలు చేయనీయరు. ఆడది చూస్తే అపార్థాలు, మాట్లాడితే అపార్థాలు. ఆడది కనిపిస్తేనే వేరే ఆలోచనలు-మానేయడమే మంచిది. మానేస్తాను అనుకుంది. అనుకోగానే తండ్రి గుర్తుకు వచ్చాడు. దరిద్రం గుర్తుకు వచ్చింది. బియ్యం ఇవ్వనన్న కొట్టువాడు గుర్తుకు వచ్చాడు. ఈ ఇల్లు తన జీతం మీద ఆధారపడి ఉంది. ఇద్దరి జీవితాలు తన జీతం మీద ఆధారపడ్డాయి. ఉద్యోగం లేకుంటే బతుకు లేదు. ఉద్యోగం వుంటే శీలం లేదు. శీలమా ?....ఉద్యోగమా ? ...ఉద్యోగమా?.... శీలమా?....

ధనం ఎంత బలవత్తరమయింది?
అది అన్నింటినీ హరించగలదు!
హరించడం దాని స్వభావం.
భరించడం బ్రతుకు స్వభావమా?

కాదు; కారాదు; ఎదిరించాలి! ఎదిరించి గెలవాలి. ఎదిరింపు! గెలుపు!! పిచ్చి పదాలు. గెలుపు అధికారానిది. గెలుపు సంపదది. మనిషి గెలిచిందెప్పుడు? ఎప్పుడు గెలిచాడు మనిషి? మంచి నిలిచిందెప్పుడు! న్యాయం గెలిచిందెప్పుడు? గెలిచేది బలం. బలం గెలిచింది. శక్తి గెలిచింది. అంతే? తాను ఓడినట్లేనా? ఈ ఓటమి ఎవరిది? ఇది స్త్రీత్వానికి ఓటమి! మనిషికి ఓటమి. మంచికి ఓటమి! ఓడుతుందా తాను! కాదు-గెలవాలి. జయించాలి చీకట్లను! జయించాలి దానవత్వాన్ని!

గెలుస్తుందా తాను?

చిరునవ్వు నవ్వుకుంది జానకి.

ఆ రాత్రి నిద్రలేదామెకు.

మర్నాడు చైర్మన్ గారింటికి బయలుదేరింది. బోనులోకి పోతున్నట్లని పించింది. పద్మవ్యూహంతో జొరబడుతున్నట్లనిపించింది. గుండె దడ దడ లాడు తూంది. కాళ్ళు, చేతులూ వేళ్ళాడబడుతున్నాయి. చైర్మన్ ఇల్లు వచ్చేసింది. వరండాలో ఎవరో నలుగురు కూర్చుని ఉన్నారు, అంతా మగవాళ్ళే. వాళ్ళంతా ఆమెను చూచారు. వాళ్ళు వింతగా చూస్తున్నట్లనిపించింది. ఒక కుర్చీ ఖాళీగా వుంది. దూరంగా లాక్కుంది. కూచుంది. తల వంచుకుని కూర్చుంది. గోళ్ల గిల్లుకుంటూ కూర్చుంది. భయం భయంగా ఉంది. గుబులు గుబులుగా ఉంది.

ఏమిటీ భయం? ఏమిటీ గుబులు? ఏమిటీ నీరసం? ఎందుకీ ఆరాటం? తాను ఓడటానికి రాలేదు. పోరాటానికి వచ్చింది. గెలవడానికి వచ్చింది. తాను బలం పుంజుకోవాలి. భయాన్ని పారదోలాలి. అవును. తాను శక్తి కావాలి. ఆదిశక్తి కావాలి. గుణపాఠం నేర్పాలి. గెలవాలి.

లోపల్నుంచి ఒకరు వచ్చారు. జానకిని చూశారు. వెళ్ళిపోయారు. మరొకతను లోనికి వెళ్ళాడు. చూచింది జానకి. తాను లోనికి వెళ్ళాలా? వంటరిగా వెళ్ళాలా? నలుగురితో ఎందుకు మాట్లాడడు చైర్మన్? వీళ్ళు ముగ్గురూ వెళ్ళిపోతారు గావాల్ను! అప్పుడు తాను వెళ్ళాలి లోనికి వంటరిగా. తలుపు వేస్తాడేమో! ఇంట్లో ఎవరన్నా ఉన్నారా? కేకలేస్తే పలుకుతారా? ఎందుకు పలకరూ? పలకరా-తాను గొంతు నులిమేస్తుంది. ఒక హత్య జరుగుతుంది. కోర్టులో తనను హాజరు పరుస్తారు. మాన రక్షణకు హత్య చేశానంటూంది!

లోనికి వెళ్ళినవాడు వచ్చేశాడు. ముగ్గురూ లోనికి వెళ్ళారు. చూచింది జానకి. ఇహ తనవంతే. తానే వెళ్ళాలి. వెంట ఎవరయినా ఉంటే బావుండును. తండ్రిని రమ్మనాల్సింది. అతనూ వస్తాననలేదు. ఎందుకనలేదు? వంటరిగా పంపుతాడా తనను? ఆమాత్రం తెలీదు—అంత పెద్దవాడైనాడు! తండ్రిమీద కోపం వచ్చింది. మనసులో తిట్టింది. మళ్ళీ అనుకుంది—ఏమిటీ ఆడది! ఎప్పుడూ ఒకరిమీద ఆధార పడాల్సిందేనా? తాను వచ్చిందెందుకు – పోరాటానికి—గెలవడానికి! ఎందుకిలా అను కుంటోంది?

లోనికి వెళ్ళిన ముగ్గురూ వచ్చేస్తున్నారు, వచ్చేశారు. జానకి లేచి నుంచుంది. వధ్యస్థలానికి బయల్దేరినట్లుంది ఆమెకు. అడుగు ముందుకు పడ్డంలేదు. చైర్మన్ కనిపించాడు. వస్తున్నాడు బయటికి. ఇక్కడే కూర్చుంటే బావుండును. వీధికి దగ్గరగా ఉంటుంది, అరుస్తే వినిపిస్తుంది.

"నమస్కారం జానకిగారూ" చైర్మన్ గుమ్మంలో నుంచొని నమస్క రించాడు.

మనిషి సౌమ్యంగా కనిపిస్తున్నాడు, ముఖం ప్రసన్నంగా వుంది. 'ఏమిటీ మనిషి? ద్రోహం చేయగలడా? గోముఖవ్యాఘ్రం, వల పన్నుతున్నాడు' అనుకుంది, నమస్కరించింది.

"రండి" అని పిలిచాడు.

జానకి యంత్రవత్తుగా అడుగులు వేసింది. వరండాలో కూర్చుని మాట్లాడండి అందామనుకుంది, అనలేకపోయింది. మెదడు పనిచేయడంలేదు. సాగిపోయింది. గది వచ్చింది. అది పెద్దగది. వరండాలాగే వుంది.

"కూర్చోండి" అని కుర్చీ చూపించాడు చైర్మన్.

ఆమె కూర్చుంది, అతడు ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు. దూరం చాలావుంది ఇద్దరికీ. మధ్యన టీపాయ్ ఉంది. దానిమీద ఫ్లవర్‌వాజ్ ఉంది, దాన్లో గులాబీ లున్నాయి కొమ్మల సహితంగా. అందంగా ఉన్నాయి పూలు—ముళ్ళున్నాయి కొమ్మలకు!

"కాఫీ తీసుకుంటారా, కూల్‌డ్రింకా?"

జానకి చైర్మన్ను చూచింది, ముఖంలో ఎక్కడా చిలిపితనం కనిపించలేదు. శాంతంగా ఉన్నాయి కళ్ళు—వాటిల్లో ఆదరం కనిపించింది. శకుంతల అలా అంటుందేం?

ప్రవర్తన వ్యక్తినిబట్టి ఉంటుందేమో!

"ఎందుకండీ మీకు శ్రమ?"

"బాగా చెప్పారు, నాకు శ్రమేమిటి?'' కుర్రాణ్ణి పిలిచి కాఫీ తెమ్మన్నాడు.

"మతాలను గురించి మీరు చెప్పిన మాటలు నాకు బాగా నచ్చాయి, ఎంత బాగా చెప్పారండీ మీరు! మతాలన్నీ మంచికే పుట్టాయి, మనిషిలో మంచిదనాన్ని పెంచడానికి పుట్టాయి."

"మహాపురుషు లందరూ అందుకే పుట్టారు, మనిషిలోని మానవత పెంచడానికి అవతరించారు, వారు చెప్పిపోయినవి గొప్ప సందేశాలు. వీళ్ళు వాటిని మింగేశారు. మతాలపేర మానవులను చీలుస్తున్నారు."

కాఫీ తీసుకొని ఒక స్త్రీ ప్రవేశించింది. ఆమె కాఫీ ముందు జానకికి అందించింది. కాఫీ అందుకుంటూ చైర్మన్ పరిచయంచేశాడు ఆమె తన భార్య శాంత అని. జానకి నమస్కరించింది. శాంతను జానకికి పరిచయం చేశాడు. శాంత జానకి పక్కన కూర్చుంది.

"శాంతా! మతాల మూర్ఖత్వాన్ని గురించి పండు వలిచి అందించినట్లు చెప్పారు జానకి—చెప్పాగా రాత్రి! మనమంతా ఒక్కటే, మానవులంతా ఒక్కటే, మనం కొట్లాడుకోవద్దు, కొట్లాడుకోవద్దు అనేది వింటుంటే మనసు పులకరించిందనుకో, నీకు పరిచయం చేయింతామని ఇంటికి రమ్మన్నాను."

జానకికి అంతా అయోమయంగా ఉంది. తానేదో దానవత్వాన్ని గెలుద్దామని బయలుదేరింది. ఇక్కడ మానవత్వం కనిపించింది. ప్లెజంట్ సర్‌ప్రైజ్! ఆనందం పట్టరానంతగా వుంది. ఎంత మంచివాళ్లుంటారు లోకంలో! శకుంతల అలా ఎందు కంటుంది?

తన స్వభావాన్ని బట్టి లోకాన్ని చూస్తుంది.

"మీరంటే మావారికి గొప్ప గౌరవం ఏర్పడింది. నేనేం పెద్దగా చదువుకున్న దాన్ని కాదు. కాసేపు మీతో మాట్లాడితే, చదువుకున్న చాలామంది కన్నా విజ్ఞానవంతుల మవుతామని అన్నారు. విజ్ఞానమంటే ఏమిటో దాన్ని ఇప్పుడు కొత్తగా నేర్చుకోవాలన్న ఉబలాటం కూడా కాదు. మంచిని గురించి విని, మంచివాళ్ళని కలుసుకుంటున్నాం అని విన్నప్పుడు నాకు హాయీ, సంతృప్తి వుంటాయి" అంది శాంత.

జానకీ, శాంతి చాలా సేపు మాటాడుకున్నారు. చైర్మన్ పని చేసుకుంటున్నట్టు తలవొంచుకుని తమ పనిలో నిమగ్నమయ్యారు. అయినా వారి సంభాషణంతా ఆయన చెవిలో పడుతూనే వుంది.

కొంత సేపటి తరువాత ఎవరో వచ్చారని కబురు వచ్చింది. జానకి లేచి నుంచుంది "వస్తానండీ" అని.

"మంచిది అప్పుడప్పుడూ వస్తుండండి" అన్నాడు చైర్మన్ లేచి నుంచుంటూ. శాంత కూడా లేచి నుంచుంది

జానకి శలవు తీసుకుంది. సాగిపోయింది. ఆమె వీధుల వెంట సాగిపోతుంటే ఏవో తేలిగ్గా వున్నట్లుంది. తేలిపోతున్నట్లుంది. ఆనందంతో గుండె నిండిపోయింది. హాయిగా వుంది.

# 9

ఆటల మైదానం—స్కూలుకు సంబంధించింది—స్కూలుకు దగ్గర్లో వుంది. పిల్లలు వరుసగా నుంచున్నారు—దూరదూరంగా. డ్రిల్లు చేయిస్తూంది జానకి. జానకి సంకేతాలు ఇస్తూంది. పిల్లలు చేతులు ఎత్తుతున్నారు, దించుతున్నారు, శ్వాస బిగపడ్తున్నారు, వదుల్తున్నారు. నడుంమీద చేతులు పెట్టుకుంటున్నారు. ఎగురుతున్నారు.

దృశ్యం బావుంది.

క్రమశిక్షణలో అందం వుంది.

శారద తొలివరసలో వుంది. డ్రిల్లు చేస్తూ వుంది. కాని కదలికలో నీరసం కనిపిస్తూంది. చేతులు ఎత్తినా, దించినా యంత్రవత్తుగా జరుగుతూంది. ఉత్సాహం కనిపించడంలేదు, కాళ్ళలో ఏదో బరువు చేరినట్లుంది. జానకి శారదను చూసింది.

సంకేతాలు మానేసింది. పిల్లలంతా బొమ్మ గీసినట్లు నుంచుండిపోయారు. జానకి శారద దగ్గరికి వెళ్ళింది. భుజం మీద చేయివేసింది.

"ఏమ్మా! అలా వున్నావు ?"

"ఏంలేదు టీచర్!"

"చెప్పు, ఏం నీరసంగా వుందా?"

"అవును టీచర్! కళ్ళు తిరుగుతున్నాయి"

"అదేమిటి, చెప్పవేం మరి! మానెయ్యి డ్రిల్లు, కూర్చో ఆ పక్కన, కానే వుంచే సర్దుకుంటుంది"

జానకి శారదను ఒక పక్కకు తీసికెళ్ళింది. కూర్చోపెట్టింది. మళ్ళీ తన స్థానానికి వచ్చింది, అయినా మనసు శారద మీదనే వుంది.

శారద కూర్చున్నది, కూర్చుని....కూర్చుని పడిపోయింది.

జానకి పరిగెత్తి శారదను వడిలోకి తీసుకుంది. శారదకు చెమటలు పట్టాయి, నోట మాటలేదు, మెడ వ్రేలాడిపోతూంది.

జానకి గుండె దడ దడ లాడింది. మెదడు పని మానేసింది. పిల్లలంతా చుట్టూ మూగారు.

మేరీ పరిగెత్తికెళ్ళి గ్లాసుతో నీళ్ళు తెచ్చింది. శారద మొహాన కొడ్తూంది. శారద కనురెప్పలు కదలడం లేదు. శకుంతల వచ్చింది. గుంపును చీల్చుకొని లోపలికి ఉరికింది, చూచింది.

"ఇదేమిటీ పిల్ల విచిత్రం - ఇక్కడ పడిపోయింది. స్కూలుకు బదనాం- తీయండి-ఇంటికి చేర్చాలి-ఇక్కడ పోగూడదు." గంతులేస్తూంది శకుంతల. పిల్ల లంతా చూస్తున్నా రామెను వింతగా

"ఏమిటి చూస్తారు? పొండి రిక్షా తెండి" కసిరింది. పిల్లలు పరిగెత్తారు.

అంతలో జానకి లేచి నిలబడి శారదను భుజాన వేసుకుంది.

"అరే; ఏమిటది మొండితనం! ఆగు రిక్షా వస్తుంది." అరుస్తూంది శకుంతల. జానకి ఆమె మాటలు వినిపించుకోలేదు, వడివడిగా అక్కడి నుంచి బయలుదేరింది.

"డాక్టర్....డాక్టర్ ఈ ఊళ్లోలేదు. మీ ఊరిదాకా పోవాలి. నువ్వు పడి పోతావు. ఈ కాలపు పిల్లలు అంతేనమ్మా!" అడుగు ముందుకు వేయకుండా అరుస్తుంది శకుంతల.

జానకి సాగిపోతూంది. ఆమెకు ఏమీ వినిపించడం లేదు – ఉరుకుతూంది. ఎదురుగా రిక్షా వస్తూంది. చూచింది జానకి. అయినా ఆగలేదు. రిక్షాకు ఎదురుగా వురుకుతూంది.

రిక్షా తొక్కుతున్నది రమాదాసి. రిక్షాలో వున్నవాడు బ్రొరసేటు. రమాదాసి జానకిని చూచింది. భుజం మీద పాపను చూచింది. రిక్షా ఆపింది, జానకి ఆగింది.

"దిగు రిక్షా, ఈమెను తీస్కపోవాలె. ఆపదలో వున్నది." రమాదాసి సేటుతో అన్నది.

"అదేంది? అట్లంటవు. పైసలు తీసోక్వా? ఊళ్ళో దింపు" అన్నాడు సేటు బొర్ర దువ్వుకుంటూ.

"నీ యవ్వ–మనిషివా, దయ్యానివా? దిగుతవా కిందికి తొయ్యనా? నీ పైస లొద్దు నువ్వొద్దు. దిగుతవా కిందికి తొయ్యమంటవా ?"

"పైసలొద్దంటూవా? అయితే దిగుత" సేటు దిగాడు.

ఎవరో చెప్పకుండానే, ఎవరో తెలియకుండానే జానకి రిక్షా ఎక్కి కూర్చుంది-శారద భుజం మీదనేవుంది.

రమాదాసి రిక్షా తిప్పింది–ఎక్కింది, తొక్కింది.

రిక్షా వేగంగా సాగిపోతూంది.

రమాదాసి చెమటలు కక్కుతూంది.

కొందరు పిల్లలు అక్కడిదాకా వచ్చారు. వారిని జానకి చూళ్ళేదు. జానకి రిక్షా ఎక్కడంతో వారు ఆగిపోయారు. మేరీ ఆగిపోలేదు. రిక్షా వెంట పరుగెత్తుతూంది.

రిక్షా సాగిపోతూంది.

రమాదాసి చెమటలు కక్కుతూంది.

మేరీ రిక్షా వెనక ఉరుకుతూంది.

రిక్షా ఆస్పత్రి ముందు ఆగింది. జానకి దిగుతున్నది.

"డాక్టరుబాబు లేరమ్మా" ఏసుదాసు గుమ్మంలో నుంచుని అన్నాడు.

జానకి విన్నది. 'లేరా?' అన్నది. రిక్షా దిగే ప్రయత్నంలో ఒక కాలు కిందికి జార్చింది. ఇహ ఆ ప్రయత్నం మానేసినట్టు అలాగే కూర్చుంది.

ఫొటోలో బొమ్మలా వుంది జానకి–చలనం లేదు.

"మీరు దిగండమ్మా నేను తీసుకొస్తను డాక్టర్ను" రమాదాసి అన్నది. జానకి విన్నది, చలనం వచ్చింది, రిక్షా దిగింది.

రమాదాసి, ఏసుదాసును చురచుర చూచింది. రిక్షా ఎక్కింది, సాగిపోయింది.

ఏసుదాసు రమాదాసి పోయిన దిక్కు చూస్తున్నాడు.

జానకి రిక్షా దిగింది, వెనక్కు చూచింది.

మేరీ పరుగెత్తుకుని వస్తూంది. చెమటలు కారుతున్నాయి.

జానకి గుండె దడదడ లాడింది. "మేరీ, మేరీ" అంటూ ముందుకు వురక బోయింది. ఆమె భుజం మీద శారదను మరచి పోయింది. అడుగు ముందుకు వేయగానే అనిపించింది-భుజం మీద శారద వుందని. వురకలేక పోయింది. నిల బడింది. మేరీ చూస్తూ వురికి వచ్చింది. రొప్పుతూంది: "టీచర్ శారద....శారద.... శారద ఎలా వుంది టీచర్!" మేరీ అడిగింది.

జానకి నిన్నది.

జానకి గుండె చెరువైంది.

మేరీలోని ఆతురత, అమాయకత ఆమెను కలచివేశాయి

మేరీని ముద్దు పెట్టుకోవాలనుకుంది—కౌగిలించు కోవాలనుకుంది. అసలు మేరీని ఓదార్చాలనుకుంది.

భుజంమీద శారద కదలడం లేదు.

ఎదుట మేరీ కరిగి పోతూంది. మేరీ కళ్ళల్లో గుండెల దడదడయి వినిపిస్తున్నాయి.

ఏం చేయాలో అర్థం కాలేదు జానక్కి క్షణం.

ఏసుదాసు ఇటు చూశాడు—ఉరికి వచ్చాడు. శారదను అందుకున్నాడు.

"టీచర్ ఎలావుంది శారద....శారద ఎలా వుంది టీచర్?" మేరీ గొంతులో ఏడుపు నిండింది. తల పైకెత్తి అడుగుతూంది. అడుగు మూరాస ఉంది మేరీ జానక్కి.

"మేరీ ఎంత మంచి పిల్లవమ్మా నువ్వు" జానకి మేరీని ఎత్తుకుంది. ముద్దాడింది, పైట కొంగుతో చమట తుడిచింది.

"టీచర్ శారద ఎలా ఉంది?" చేతుల్తో కళ్ళు తుడుచుకుంటూ అడిగింది మేరీ!

"రామ్మా! చూతాం" మేరీని తీసుకొని ఆస్పత్రిలో అడుగు పెట్టింది జానకి.

ఏసుదాసు బల్లమీద పడుకోబెట్టాడు. ఇంకా స్పృహ రాలేదు. మేరీ బల్లి దగ్గరికి చేరింది. జానకిని చూసింది. కళ్ళలో నీళ్ళున్నాయి. "ఎలా వుంది టీచర్?" అడిగింది.

"డాక్టర్ వస్తారు, చూస్తారు. చెప్తారు"

బయట సంచలనం వినిపించింది. జానకి బయటికి వురికింది. శారద తల్లిలా వుంది. ఏడుస్తూ, తల బాదుకుంటూ వస్తూంది. వెంట ఆమె భర్త వున్నాడు—శారద తండ్రి. సుడిగాలిలా వచ్చింది తల్లి, కూతుర్ని పట్టుకొని ఏడుస్తూంది-గోడు గోడున ఏడుస్తూంది.

బయట రిక్షా ఆగింది. జానకి గుమ్మంలోకి వురికింది. డాక్టర్ పాల్ దిగాడు. వెళ్ళబోయాడు. జానకిని చూచాడు. ఆగిపోయాడు. జానకిని చూస్తున్నాడు. జానకి ఒడబడ్డది. పైట సర్దుకుంది. "పేషెంటును చూస్తారా! నన్ను చూస్తారా?"

"ఆయామ్ సారీ. మీరు... "

"ముందు పేషెంటును చూడండి. స్కూల్లో డ్రిల్లు చేస్తూ పడిపోయింది" అని ముందు నడిచింది జానకి. పాల్ అనుసరించాడు. టేబుల్ దగ్గరికి చేరాడు డాక్టర్. శారద తల్లి డాక్టర్ని చూచింది. కాళ్ళు కడుపూ పట్టుకుంది. కూతుర్ని కాపాడమని వేడుకుంటూంది.

"కాస్త ఊరుకో తల్లీ! పరీక్ష చేయనీ. మందివ్వనీ" అన్నాడు డాక్టర్. తల్లి గుడ్లనీరు కుక్కుకొని పక్కన నుంచుంది.

చకచకా పరీక్ష చేశాడు డాక్టర్. ఇంజక్షనులిచ్చాడు. ముక్కుకు ఏదో వాసన చూపించాడు. కొంతసేపు గడిచింది.

శారద కళ్ళు తెరిచింది.

తల్లి ఆనందం చెప్పలేం.

జానకి ముఖం విప్పారింది.

మేరీ మనసుకు మొలిచిన రెక్కలు కళ్ళలో కనిపించాయి.

"ఏమైందమ్మా నాకు?" శారద తల్లినడిగింది. తల్లికి ఏమీ తెలియదు. అది తెలుసుకోవాలనే ధ్యాస కూడా లేదు. తల్లి జానకిని చూచింది. జానకి ముందుకు వచ్చింది.

"టీచర్ వచ్చారా?"

జానకి శారద తల నిమిరింది. జరిగినదంతా క్లుప్తంలో చెప్పింది. "మేరీ ఏది?" శారద అడిగింది.

మేరీ దూరంగా చేతులు కట్టుకొని నుంచుని వుంది.

జానకి చూసింది.

శారద చూచింది. చేయి చాచింది. రమ్మన్నట్లు చూచింది. చేయి కలప మన్నట్లు చూచింది.

మేరీ శారద తల్లిని చూచింది. శారద తల్లి మేరీని చూచింది. మెడలో వ్రేలాడే శిలువను చూచింది. శారద ముందుకు జరిగింది. మేరీ కనిపించకుండా చేసింది.

శారద చిన్నబుచ్చుకుంది. జానకిని చూచింది. జానకి చూపు వాల్చుకుంది.

"డాక్టర్! శారదను తీసికెళ్ళమంటారా?" అడిగింది తల్లి.

"తీసికెళ్ళొచ్చు. రేపొకసారి తీసుకురండి. అవసరం అవుతే ఇంజక్షన్ ఇస్తాను."

శారదను తీసుకొని బయటికి వెళ్ళింది తల్లి. తండ్రి అనుసరించాడు. దాసి రిక్షా సిద్ధంగా వుంది. శారదను ఎక్కించింది. తల్లి ఎక్కింది.

శారద మేరీని చూచింది. చేయి చాచలేదు.

మేరీ శారదను చూచింది. ముందడుగు వేయలేదు. రిక్షా సాగిపోయింది.

చూపు అందినంత సేపు చూచారు మేరీ, జానకి.

"వెళ్తా టీచర్"

"వెళ్తావా? వెళ్ళు. శారదకి పర్వాలేదు. చూచావుగా." లేని సంతోషాన్ని కనబరచ ప్రయత్నించింది.

మేరీ వెళ్ళిపోయింది.

జానకి ఆస్పత్రిలో అడుగు పెట్టింది. డాక్టర్ చేతులు తుడుచుకుంటూ కుర్చీలో కూర్చుంటున్నాడు. జానకిని చూచాడు. "రండి కూర్చోండి" అని కుర్చీ చూపించాడు.

"డాక్టర్! ఒక పాప ప్రాణం కాపాడారు. మీ కెలా కృతజ్ఞత చెప్పాలో అర్థం కావడం లేదు" జానకి కుర్చీలో కూర్చుంటూ అన్నది. ఆమె గొంతు కృతజ్ఞతా భావంతో నిండి వుంది.

"అది మా డ్యూటీ. అభినందించాల్సింది మిమ్మల్ని. పాపను బుజాన వేసుకొని పరిగెత్తి వచ్చారు. రమాదాసి అంతా చెప్పింది. గడియలు ఆలస్యం అయినా ప్రమాదమే! సమయానికి చేసిందే ట్రీట్‌మెంట్! మించిపోయిం తరవాత మేమేమీ చేయలేం"

పొగడ్త విని జానకిలో సిగ్గు పొంగింది. ముఖంలో కనిపిస్తుందేమోనని తల వంచుకుంది. ఏమనాలో అర్థం కాలేదు. కాస్త తడబడ్డది. వేళ్ళ గోళ్ళు చూచుకున్నది.

రమాదాసి లోనికి వచ్చింది. జానకి చూచింది. అహ్లాదంగా స్ఫురించింది.

"నాదేముందండీ! అసలు అభినందించాల్సింది ఈమెను. సమయానికి రిక్షా కనిపించకుంటే...."

"నాదేముందండమ్మా - నా బతుకే అదాయె"

"ముగ్గురు కలసి కాపాడిన్రు" ఏసుదాసు అన్నాడు.

"ఇద్దరు క్రైస్తవులు – ఇద్దరు హిందువులు కలిసి ఒక హిందూ పాపను రక్షించారు" డాక్టర్.

"మనమంతా మనుష్యులం కామా? నలుగురు కలసి ఒక సాటి ప్రాణిని రక్షించారనుకుంటే?" జానకి.

డాక్టర్ ఉలిక్కిపడ్డాడు. మనసులో ఒక పచ్చనిచేను వెలసినట్లుంది. పూలతోట పరిచినట్లుంది.

"జానకిగారూ! మీరు మహోన్నతులు. మనిషిని మనిషిగా గుర్తించడం కంటే ఘనతలేదు. మతాల, కులాల, దేశాల రంగులు పూసి మనిషిని చూడమంటుంది లోకం! అది నాకు గిట్టదు. నేను చూచేది మానవతను–మతాన్ని కాదు. అయినా నేనూ అన్నానంటే ఆ తల్లిని చూస్తే అలా అనిపించింది. మేరీ పాపం పసిపాప. శారద చేయి చాచింది మేరీకోసం. తల్లి అడ్డం నుంచుంది. కూతురును తీసుకొని వెళ్ళిపోయింది. ఎందుకూ? మేరీ మెడలో శిలువ వుంది. అంతేగా? మరి నా మెడలోనూ శిలువ వుంది. నా సేవలు ఎలా పనికి వచ్చాయి? ఆ పాపల ఆర్తి, ఆరాటం, ఆప్యాయత–వారిని దూరంగా ఉంచడం ఎంతో బాధ కలిగించింది. అందువల్ల అలాంటి మాట వచ్చింది. మన్నించండి - మీ మనసు నొప్పిస్తే."

"మీ మనసు ఎంత వ్యధ చెందితే అలా అన్నారో గమనించగలను. వాళ్ళ

పద్ధతే అంత. అవసరం అవుతే అన్ని ఆచారాలూ మార్చుకోగలరు. అక్కర్లేనప్పుడు అన్నిటికీ దూరంగా ఉండగలరు."

జానకి పాల్ కళ్ళల్లోకి చూచింది.

పాల్ జానకి కళ్ళల్లోకి చూచాడు.

చూపులు రాచుకున్నాయి. అది అనుకున్నది కాదు. అనుకోకుండా జరిగి పోయింది.

కాలం భారంగా సాగుతున్నది.

"నన్ను గుర్తించనే లేదా?" పాల్ పెదవి కదిలింది.

జానకి పాల్‌ను తేరిపార చూచింది. ఏదో స్ఫురించింది. అయినా 'ఊఁహూఁ' అన్నది.

"మనం కలిసి చదువుకున్నాం? మరిచిపోయారా?''

"మీరు ఆ పాలా? అరే. గుర్తించనేలేదు. ఎంత మారిపోయారు?" పెదాలు గంతులేస్తున్నాయి. ఒక్కసారి బడి, ఆటలు అన్నీ మనోఫలకం మీద మెరిశాయి.

"గుర్తుందా మీకు! పూల కోసం గోడ దూకాం. పట్టు పడ్డాం" అన్నాడు పాల్.

"అది మరచిపోగలనా? వాళ్ళింట్లో పారిజాతం చెట్టుండేది. ఆ పూలంటే నా కిష్టం. ఇద్దరం పిట్టగోడ ఎక్కాం, దూకాం. పూలు ఏరుకుంటున్నాం. ఏదో అలికిడి అయింది. ఇంటివాళ్ళు వస్తున్నారనుకున్నాం, గోడ ఎక్కాం, దూకాం, ఉరికాం. ఉరుకుతుంటే నేను పడిపోయాను. కాలుకి రాయి గుచ్చుకుంది.''

"గాయం మానిపోయినా మచ్చ వుండాల్నే.''

"అవును, ఉంది, ఇదిగో'' అని కాళ్ళమీది చీర తీయబోయి ఆగిపోయింది. సిగ్గు ముంచుకొని వచ్చింది.

ఇంతలో బయట పక్క ఏదో అలజడయింది.

"పేషెంట్లు వచ్చినట్లున్నారు, చూడండి. నేను వస్తాను మరి''

"సరే, వస్తుండండి అప్పుడప్పుడూ-మీ మాటలు చల్లగా ఉంటాయి.''

"అలాగే వీలున్నప్పుడు....'' అని లేచి వెళ్ళిపోయింది జానకి.

రమాదాసి బయట రిక్షాతో సిద్ధంగా ఉంది, ఎక్కమంది. ఎక్కి కూచుంది జానకి. రిక్షా సాగిపోతూంది.

"ఆడదానివి రిక్షా ఎందుకు తొక్కుతావు?"

"కష్టపడేటోండ్లకు ఆడా, మగా ఏందమ్మా! పన్లే దొరుకుతలేవు; రిక్షా పట్టిన."

"నువ్వు చాలా మంచిదానివి రమా!"

"మీ కంటెనా?"

"నీలాంటి దానివి రిక్షా తొక్కడం ఏం బావుండలేదు."

"ఏం చేయమంటారమ్మా! అందరికి అనుకున్న పన్లు దొరుకుతాయా?"

"రమా, మా ఇంట్లో పని చేస్తావా?"

"అంతకన్ననా తల్లీ! చేస్త, తప్పక చేస్త."

"అయితే మా నాన్నతో చెప్పి పెట్టుకుంటా."

"మీరు పెట్టుకోలేరానండి."

"మా నాన్న వున్నారుగా - పెద్దవారు."

రిక్షా జానకి ఇంటి ముందు ఆగింది, జానకి దిగింది.

"నువ్విక్కడే వుండు, పిలుస్తా" అని లోపలి కెళ్ళింది.

ముకుందంగారు భాగవతం చదువుకుంటున్నారు, కూతుర్ని తలెత్తి చూచారు.

"ఇంత ఆలస్యం చేశావేమమ్మా, ఏమైంది?" ధ్వనిలో భయంవుంది.

"ఏం లేదు నాన్నా! ఒక పిల్లకు జబ్బు చేస్తే డాక్టర్ దగ్గరికి తీసి కెళ్ళాను...."

"కిరస్తాని డాక్టరు దగ్గరకేనా?"

"వైద్యుడు కిరస్తానీ ఏమిటి నాన్నా! 'వైద్యో నారాయణో హరిః' అని నువ్వే చెప్పావు."

"వైద్యుడంటే మన వైద్యుడు, కిరస్తానీ డాక్టర్ కాడు. సరే, వంటింట్లో ప్రవేశించు."

"నాన్నా! పనిమనిషిని తెచ్చా నాన్నా!"

"ఏది? కిరస్తానీ కాదు కదా!"

"అబ్బె! పేరు రమాదాసి. అచ్చం హిందువు. కిరస్తాన్లంటే మండి పడ్తుంది."

"అలాగా, అయితే పిలువు."

రమాదాసి వచ్చింది.

"మొహాన బొట్టుందా?"

"అదేందయ్యగారు—అట్లంటరు? చూడండి, కాసంత బొట్టున్నది."

"అయితే రేపణ్ణుంచి రా, జానకి ఒక్కతే పని చేసుకోలేకపోతున్నది."

"అట్లనే, రేపొస్త! వస్తనండమ్మగారూ" రమాదాసి వెళ్ళిపోయింది.

"మంచిదానిలా వుంది" అనుకున్నారు ముకుందంగారు.

జానకి వెళ్ళిపోయింది.

"అల వైకుంఠ పురంబులో ...." పద్యం బిగ్గరగా చదువుతున్నారు ముకుందంగారు.

# 10

చీకటి రాత్రి! చుక్కల వెలుగు మాత్రం వుంది. ఊరు నిద్రపోయింది. రమాదాసి చెంబు తీసుకొని బయలుదేరింది-ఊరి బయటికి. చీకటి చిక్కగా వుంది. కీచురాళ్ళు రొద చేస్తున్నాయ్. గబ్బిలాలు ఎగురుతున్నాయి. ఊళ్ళోంచి కుక్కల అరుపులు వినిపిస్తున్నాయి. రమాదాసికి భయం భయంగా వుంది, కొంతదూరం సాగింది. దూరంగా మంట కనిపించింది. అది చెట్టుమీద మండుతూంది. నిప్పు రవ్వలు కుప్పలు కుప్పలుగా రాలుతున్నాయి.

దడుచుకుంది రమాదాసి.

దయ్యం అనుకుంది- కొరివిదయ్యం! కొరివిదయ్యం అలాగే నిప్పు కురుస్తుందని విన్నది. ఆమె వణుకుతున్నది. తప్పుకోడానికి వెనక్కు వెళ్తూంది-మంటను చూస్తున్నది. అది తనమీద పడుతుందేమోనని భయం. "ఆంజనేయ–ఆంజనేయ" అని జపం చేస్తున్నది.

ఏసుదాసు కూడా అటే వచ్చాడు–మరోవైపు. అతనూ మంటను చూచాడు. అతనికీ భయం అయింది. అతనూ వెనక్కు వెళుతున్నాడు. ''ఏసుప్రభూ!'' అని జపిస్తున్నాడు. భయం భయంగా సాగుతున్నాడు. ఎదురుగా రమాదాసి కనిపించింది.

రమాదాసిని దయ్యం అనుకున్నాడు-దాసు.

ఏసుదాసును దయ్యం అనుకుంది-దాసి.

"అమ్మో దయ్యం" అని ఉరికింది దాసి.

"అమ్మో సైతాన్" అని ఉరికాడు దాసు.

ఇద్దరూ ఒకే పొదచుట్టూ తిరుగుతున్నారు–ఒకరికి ఎదురుగా ఒకరు. ఒకరిని ఒకరు ఢీ కొన్నారు. ఒకరిని ఒకరు పట్టుకున్నారు.

"అమ్మో! దయ్యం నన్ను పట్టుకున్నది ఆంజనేయా" అని వణుకుతూంది దాసి.

''అమ్మో సైతాన్ నన్ను పట్టుకున్నది ఏసుప్రభూ" అని వణుకుతున్నాడు దాసు.

ఇద్దరూ "నన్ను వదులు" అంటే "నన్ను వదులు" అని వణుకుతున్నారు. ఇద్దరూ గట్టిగా కళ్ళు మూసుకొని ఉన్నారు. ఇద్దరూ వదలడంలేదు. ఇద్దరూ వణికిపోతున్నారు.

రమాదాసి కళ్ళు తెరిచింది. ఏసుదాసు కనిపించాడు. నమ్మలేదు. దయ్యమే అలా వచ్చాదనుకుంది. అయినా అన్నది–

"నిజంగా ఏసుదాసువా? విడువు"

ఏసుదాసు విడిచాడు.

''నిజంగా రమాదాసివా, దయ్యానివా?''

ఇద్దరూ కాసేపు కీచులాడుకున్నారు.

''ఏదీ నీ కాళ్ళు చూపించు'' రమాదాసి అడిగింది. చూపించాడు. ''నీ కాళ్ళు వెనక్కు తిరిగిలేవు. నువ్వు మనిషివే! ఏసుదాసువే!''

''నీ కాళ్ళు చూపించు''

చూపించింది రమాదాసి.

ఇద్దరికీ నమ్మకం కుదిరింది.

''నిన్ను దయ్యమనుకున్న'' రమాదాసి అన్నది నిర్భయంగా.

''నిన్ను సైతాననుకున్న'' భయం లేకుండా అన్నాడు ఏసుదాసు.

భయం తీరిపోయింది.

చెట్టుతల మండుతూంది. నిప్పు రవ్వలు కురుస్తూంది. కీచురాళ్ళ రొద; గబ్బిలాల రెక్కల రెపరెప.

ఇప్పుడు భయంలేదు. నిబ్బరంగా వున్నారు. మనిషికి మనిషి తోడు. తోడుంటే భయం దూరం.

ఇద్దరూ మండే చెట్టును చూచారు.

చెట్టు మండుతున్నది-నిప్పు రవ్వలు కురుస్తున్నది.

''అదేంది? అట్ల మండుతది!'' అడిగింది రమాదాసి.

''రా, చూద్దాం'' ఏసుదాసన్నాడు.

''అమ్మో, భయం, దయ్యమేమో!''

''ఇద్దరమున్నం, ఇంకేం భయం?'' రమాదాసిని లాక్కుపోయాడు. ఇద్దరూ చెట్టు దగ్గరికి చేరారు, చూచారు.

అది ఈతచెట్టు. కొనకు నిప్పంటుకుంది. మండుతున్నది. గాలికి రాల్తున్నది, రాలి నిప్పురవ్వలు కురుస్తూంది.

''ఇంతేనా! దయ్యమనుకున్నం'' విరగబడి నవ్వింది రమాదాసి. ఏసుదాసూ నవ్వాడు. ఇద్దరూ కలిసి నవ్వారు. గలగలా నవ్వారు. నిప్పు రవ్వల్లా నవ్వారు. జలపాతంలా నవ్వారు.

''దయ్యమనేది యాడున్నది? మనం భయపడ్తె దయ్యం, లేకుంటె లేదు'' రమాదాసి అన్నది.

''అవును సైతాను మనలోనె వున్నది.'' అన్నాడు ఏసుదాసు.

దయ్యాన్ని జయించిన జంట సాగిపోయింది.

భయాన్ని ఓడించిన జంట సాగిపోయింది.

*     *     *

స్కూలు వదిలేశారు. జానకి ఇంటికి వెళుతోంది. తోవలో పాల్ కనిపించాడు. సైకిల్ పట్టుకుని నుంచొని ఉన్నాడు. జానకి చూచింది.

"హాఁ! మీరా .."

"మీరు మళ్ళీ కనిపించనేలేదు..."

"కాపలా కాస్తున్నారన్నమాట."

"కాదు. ఇలా వచ్చాను. మీస్కూలు అయిపోయింది. మీరు వస్తారేమోనని చూస్తున్నాను. అవునూ, కాపలా కాయడం నేరమా?"

"కాదుగాని ఇలా నుంచొని మాట్లాడుకోవడం నేరం. పదండి నడుద్దాం"

"అవును. నేను గమనించనేలేదు. పదండి" అని సైకిల్ తీసుకొని నడక సాగించాడు పాల్. జానకి పక్కగా నడుస్తూంది.

"పేషెంటును చూడ్డానికి వచ్చారా?"

"అవును, ఒక బూబమ్మకు కాస్తజబ్బు, ఆస్పత్రికే వస్తుంటారు. సీరియస్‌గా ఉందని మనిషి వచ్చాడు. రాక తప్పిందికాదు. మీరు కనుపిస్తారని నుంచు న్నాను

"థాంక్స్. ఎలా ఉంది బూబమ్మకు?"

"అలానే ఉంది. మనమేం చేయలేం, జబ్బు మానసికం. అసలే గుండె జబ్బు మనిషి."

"అంటే ఆ మనిషి....!!

"ఆమెకు నా అనేవారు ఎవరూ లేరట, ఒక్క మనుమరాలు తప్ప. ఆమె చదువుకునేందుకు పట్నం వెళ్ళి మతం కాని వాడి నెవడినో ప్రేమించిందట, అదే ఆమె దిగులు."

మాట్లాడుకుంటూ పాల్, జానకి చెరువు గట్టు మీదకు వచ్చారు. చల్లటి గాలి వీస్తోంది. 'కాసేపు కూచ్చుందాం!' అనుకున్నారిద్దరూ. బూబమ్మ మనస్తత్వం దగ్గర ప్రారంభమై వారి సంభాషణ తిరిగి మతాల వైపుకి మళ్ళింది. ఒకరి మతాన్ని ఒకరు గౌరవించటంలో వచ్చే ఆత్మానందం యీ పెద్దలు ఎందుకు గ్రహించలేక పోతు న్నారు? అక్కడ బూబమ్మే కాదు, తమ యిళ్ళల్లో పాల్ తండ్రీ, ముకుందరావు గారూ....వారి విశ్వాసాన్ని వారు నమ్ముకోవటం తప్పు కాదు. మరొకరిని ద్వేషించడ మనేది ఎప్పటికి పోతుంది? ఎలా పోతుంది? దాదాపు పాల్, జానకిల సంభాషణ చర్చలాగా సాగింది.

చెరువు కట్టమీంచి పశువులను తోలుకుపోతున్నారు కుర్రాళ్ళు. మర్రిచెట్టు మీదికి చేరిన కాకులు కొట్లాడుకుంటున్నాయి. సూర్యుడు పడమటి దిశన పరాగం పరిచాడు.

"సాయంకాలం అయినట్లుంది. వెళ్దామా?" జానకి లేచి నిలుచుంది.

"అరే, అప్పుడే సాయంకాలం అయిందా? పదండి వెళ్దాం. పేషెంట్లు వెయిట్ చేస్తుంటారు" పాల్ లేచి నుంచున్నాడు.

ఇద్దరూ నడుస్తున్నారు.

ఎవరూ మాట్లాడ్లేదు. నడిచి పోతున్నారు. మౌనంలోనూ ఏదో మాధుర్యం వుంది, అది చెప్పుకోరానిది, సాగిపోయారు కొంత దూరం. జానకికి వీడ్కోలు చెప్పాడు పాల్. సైకిలు మీద వెళ్ళిపోయాడు.

జానకి వెళ్ళిపోతున్న సైకిల్ని చూస్తూ - నుంచోలేదు. పెద్ద పెద్ద అంగలు వేస్తూ సాగిపోతున్నది. ఆమె అడుగులు తేలిగ్గా పడుతున్నాయి. గుండె చెండులా గంతులు వేస్తూంది. ఉల్లాసంగా ఉంది, ఉత్సాహంగా వుంది. గాలిలో తేలిపోతూంది. రమాదాసి ఎదురు వచ్చింది.

"నీకోసమే వస్తున్ననమ్మా, అయ్యా కోపంగున్నడు, దుమదుమ లాడుతున్నడు" అని చెప్పింది రమాదాసి.

"సరే నువ్వెళ్ళు" అని బయల్దేరింది. ఆమె గుండె గుబగుబలాడింది. ఉత్సాహం అడుగంటింది, ఆలస్యం అయిందని గమనించలే దామె. తండ్రి విషయం మరిచిపోయిందామె. ఇప్పుడు తల్చుకుంటే దిగులుగా వుంది. ఇంటి గుమ్మం ముందుకు వచ్చేసింది.

"నేను చచ్చిపోయా ననుకున్నావా?" ముకుందంగారి స్వరంలో కరకుదనం వుంది.

జానకి తల వంచుకుంది. మాట్లాడలేదు. ఇంట్లోకి వెళ్ళిపోదామనుకుంది. తండ్రి గుమ్మానికి అడ్డంగా నుంచున్నాడు.

"మాట్లాడవేం-ఎక్కడ చచ్చా వింతసేపు?"

జానకి తలెత్తి చూచింది. తండ్రేనా మాట్లాడేది? ఏమీ అర్థం కాలేదు జానకికి. "మనం వీధిలో వున్నాం లోనికి పదండి" అన్నది.

ముకుందంగారికి అప్పటికిగాని అర్థం కాలేదు - లోనికి నడిచాడు. జానకి లోన ప్రవేశించింది.

"చెప్పు, ఇహ చెప్పు, ఎక్కడికెళ్ళావు?"

"వస్తూనే ఉన్నాగద నాన్నా"

"వస్తూనే ఉన్నా. వస్తూనే ఉన్నా....ఈ ముసలివాడి కింత విషం పెట్టి తిపగు"

"ఏమిటి నాన్నా! మీరు మరీను."

"అవును, నీ కలాగే అనిపిస్తుంది. నీ సంపాదనమీద బతుకుతున్నా, నన్నెందుకు లెక్కచేస్తావు? నా బతుకే ఇలా తగలబడ్డది, ఎక్కడి కెళ్ళావంటే చెప్పవు? నీకు నేనేం లెక్కా? భగవంతుడా, త్వరగా నీ దగ్గరకి తీసికెళ్ళు" అని తల బాదుకోసాగారు ముకుందంగారు.

జానకి, తండ్రి చేతులు రెండూ పట్టుకుంది. "ఏం చేశానని నాన్నా! అలా ఇదైపోతావు. స్కూల్లో కాస్త ఆలస్యమైపోయింది. నువ్వలాగే బాధపడుతుంటే నేను

తల బద్దలు కొట్టుకుంటా" జానకి కళ్ళ వెంట బాష్పధార ప్రవహిస్తూంది ముకుందంగారు చూశారు.

"అమ్మా! జానకీ! తండ్రి ఉన్నాడని గుర్తుంచుకోమ్మా, గుర్తుంచుకో తల్లీ" అని బావురుమన్నాడు కూతుర్ను కావిలించుకొని.

జానకి తండ్రి కన్నీరు తుడిచింది. తన కళ్ళు తుడుచుకుంది.

"అమ్మా! నేను దౌర్భాగ్యుణ్ణి, దరిద్రుణ్ణి. ఆస్తిని హరించాను, మీ అమ్మను మింగాను, ఒక్కగానొక్క కూతురు, నీకు పెళ్ళి చేయలేకపోయాను. ఒక అయ్య చేతిలో పెట్టలేక పోయాను. కాలం కత్తుల వంతెన అయింది. కట్నాలు మనుషుల్ని కాలపెడ్తున్నాయి. ఏం చేయమంటావు తల్లీ! అత్తింట్లో ఉండగా చూడాల్సిన నిన్ను కొలువుకు పంపుతున్నాను. నీ సంపాదన మీద బతుకుతున్నాను. ఇంత కంటే నీచం ఏం కావాలి? నువ్వు ఆలస్యంగా వస్తే నా ప్రాణాలు లేచిపోతుంటాయి. నిన్నని లాభం లేదు. వయసు అలాంటిది. అది చంచలనం అయింది. అది దారి తప్పిస్తుంది, కన్ను కాననీయదు. గుంతలో పడేదాకా తెలియదు. ఆ తరువాత తెలిసీ ప్రయోజనం లేదు. నిగ్రహం వహించాలమ్మా, నిగ్రహం. మనం భారతీయులం— హిందువులం. సీతా, సావిత్రి, అనసూయ పుట్టిన భూమి ఇది. నిగ్రహానికి మారు పేరు భారత భూమి. మన కులానికీ, మతానికీ, వంశానికీ కళంకం రానీయకు. నిన్ను వేడు కుంటున్నానమ్మా" చెప్పాల్సిందంతా వడిసి పోవడంతో కుర్చీలో కూలబడ్డారు ముకుందంగారు.

జానకి నుంచోనే వుంది. వినడం అయిపోవడంతో ఏదో ఆలోచిస్తూంది. ముకుందంగారు కూతుర్ని తదేకంగా చూస్తున్నారు.

"నేనేం చేశానని నాన్నా?" ఎన్నో అడుగుదామనుకుంది జానకి. కట్నాలు మన సంప్రదాయమా? ఆడపిల్ల ఆర్జించటం కుసంప్రదాయమా? ప్రేమకు మతాలూ, కులాలు ఉంటాయా? మానవులందరినీ భగవంతుడు ఒకే విధంగా సృష్టించలేదా? ఇంకా ఎన్నో అడుగుదామనుకుంది. కాని అన్నమట అది.

"ఏం చేశావో? ఏం చేస్తావో? ఎలా తెలుస్తుందమ్మా! ఈ గోడ అవల జరిగేదాన్ని చూడలేం. నీ మనసులో ఏముందో నేను గ్రహించలేను. ఏం చేశావని కాదు, ఏమీ చేయవద్దని నేను కోరేది."

"చేయగూడని పని ఏదీ చేయను నాన్నా" అని అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది జానకి.

వెళ్ళిపోతున్న జానకిని చూచాడు తండ్రి. అనేక ప్రశ్నలు అతని మెదడ్లో ప్రవేశించాయి. ప్రశ్నల పరంపరలు. సమాధానం లేదు. అనుమానాలెన్నో-ఆధారా ల్లేవు.

ఆ రాత్రి ముకుందంగారికి నిద్రలేదు. జానకి ఏదో దాస్తున్నది. దాపరికం లేకుండా మాట్లాడం లేదు, దోవ తప్పుతుందా? తప్పదు. తన కూతురు! తాను

తప్పలేదూ? తప్పాడు. తాను మగాడు! అయినా బుద్ధి తెచ్చుకున్నాడు. భార్యను మింగాడు. ఆ తరువాత ఆడదాని ముఖం చూశ్శేదు. జానకి కూడా తరవాత బుద్ధి తెచ్చుకుంటుందా? ఛీ ఛీ ఏమిటి ఆలోచనలు! ఆడది కాలు జారడం ఒకేసారి. అంతే! పతనం. పాపం-అవన్నీ చెప్పాడు కూతురుకు. సావిత్రి, అనసూయ, సీత అందర్నీ గురించీ వివరించారు. అయినా కాలు జారుతుందా? ఏమో! ఎందుకలా అనుకోవాలి? తన బుద్ధులు ఎందుకు రావాలి జానకికి? తల్లి గుణాలు అబ్బకూడదూ! వెంకాయమ్మ పతివ్రత! ఎన్నడూ తనను పల్లెత్తుమాట అనలేదు. తానే హత్య చేశాడామెను! అవును తానే చంపాడు. ఆడది అలాగే ఉండాలా? ఆన్ని ఆశల్నా చంపుకోవాలా? హతమారిపోవాలా? అవును అంతే! అది మన వారసత్వం. అంతే, ఆడది ఉద్యోగం చేసిందా? చేసిందా ఎన్నడన్నా? ఎప్పుడు చేసింది? తాను ఉద్యోగం చేయిస్తున్నాడు. జానకి ఉద్యోగం మాన్పింతాం అనుకున్నాడు. వెంటనే దారిద్ర్యం వికృతరూపంతో ప్రత్యక్షం అయింది, నల్లని ముసుగుతో ప్రత్యక్షం అయింది. వికటాట్టహాసం చేస్తూ ప్రత్యక్షం అయింది. లేదు, జానకి కొలువు మాన్పించడానికి వీల్లేదు. జానకికి పెళ్ళి చేయాలి! పెళ్ళంటే—డబ్బు! కట్నాలు. అట్టహాసం! ఏముంది తన దగ్గర? ఏమిటి తాను? ఏమీలేదు. ఏమీకాడు. భగవంతుడే శరణ్యం. "లావొక్కింతయు లేదు." పద్యం చదివారు ముకుందంగారు. రెండు చేతులూ ఎత్తి దణ్ణంపెట్టారు. భారం భగవంతునికే అప్పగించారు. నిద్ర రాలేదు. కాని కళ్ళు మూసుకున్నారు.

ఆ రాత్రి జానకికి నిద్రపట్టలేదు. ఎందుకు తననలా అనుమానిస్తాడు తండ్రి? ఏం చేసింది తాను? ఆడపిల్ల అంటేనే అంతా? అనుమానాలకు మారుపేరు ఆడ తనమా? ఆడది అంటే అరికాలి క్రింద రాయాల్సిందేనా? చేసిందేమిటి తాను? కాస్త ఆలస్యంగా వచ్చింది ఇంటికి. అది మహాపాపమా? తాను పాతకం చేసిందా? తండ్రి తనను గుర్తించడా? తండ్రే అనుమానిస్తాడా? వంశం, సాంప్రదాయం, కుటుంబం- తండ్రి చేసిందేమిటి? తన తల్లిని దిగమింగాడు? అది సాంప్రదాయమా? అది ఆచారమా? అది నాగరికతా? తాను ఉద్యోగం చేస్తూంది. కుటుంబం గడుపుతూంది. మగానికంటే తానేం తక్కువ చేస్తూంది? అయినా ఇసుమంత స్వేచ్ఛ లేదా తనకు? ఆడది అంటే బానిసేనా? భర్తకు బానిస, అన్నకు బానిస, తండ్రికి బానిస, ఏమిటీ సంప్రదాయం? ఏమిటీ ఆచారం? తనకు కొన్ని భావాలున్నాయి. ఆలోచనలున్నాయి. ఆశలున్నాయి. ఆశయాలున్నాయి. తాను ఆడది. తనకో తోడు కావాలి. తనలాంటి జోడుకావాలి. పాల్ కనిపించాడు. మంచివాడు. తనవలే ఆలోచించేవాడు. తనకు జోడు, తోడు. ఇంత కాలానికి దొరికాడు. ఇప్పుడు విడుచుకోవడమా? అతను కిరస్తాని. తండ్రి సహించడు, తనకు వాటిలో నమ్మకం లేదు. మనిషిగా అతడు గొప్పవాడు. తండ్రిని ఎదిరించాలా? ఎదిరించగలదా? ఎదిరించాలి. అందుకు శక్తి కావాలి, బలంకావాలి. "శక్తి ప్రసాదించు స్వామీ! బలం కలగచేయి భగవంతుడా!"

ప్రార్థించింది జానకి. అయినా నిద్రపట్టలేదు జానకికి! ఏవేవో ఆలోచన్లు ముసురు కున్నాయి.

తెల్లవారింది, రమాదాసి వస్తే తలుపు తీసింది జానకి. తండ్రి మంచం చూచింది. ఇంకా పడుకునే ఉన్నారు ముకుందంగారు. జానకి ఆశ్చర్యపడింది, తండ్రి తనకంటే ముందు లేచేవారు, వాకింగ్‌కు వెళ్ళేవారు. ఇవ్వాళ ఇంకా లేవ లేదు. అంతగా పట్టించుకోలేదు. దొడ్లోకి వెళ్ళింది. రమాదాసి అడిగింది. తోటి ఆడది అడిగితే గుండె విచ్చింది, జరిగినదంతా వివరంగా చెప్పింది. డాక్టర్ కలిశాడనీ, మాట్లాడామనీ చెప్పింది. ఏదీ దాచలేదు. రమాదాసికి అందులో కానిపని ఏమీ కనిపించలేదు. డాక్టర్ను పొగిడింది. పేదవాళ్ళను దబ్బరగదన్నది. వైద్యం బాగా చేస్తాడన్నది. వివక్షత చూపడన్నది. దేవుడన్నది. దైవం లాంటి వాడన్నది.

జానకి కాఫీ కప్పు తెచ్చింది తండ్రికోసం. ముకుందంగారు ఇంకా లేవలేదు, లేపింది. మూలుగుతూ ముసుగు తొలగించారు.

"వళ్ళు బాగలేదమ్మా. కాసేపు పడుకోని."

''కాదు నాన్నా! కాఫీ తాగి పడుకో.''

ముకుందంగారు లేచారు. ముఖంలో జ్వరం కనిపిస్తూంది. నొసలు మీద చేయివేసి చూసింది. మండిపోతూంది.

"జ్వరం వచ్చింది నాన్నా? వళ్ళు మసిలిపోతూంది."

''వచ్చి ఉంటుందమ్మా-నాకేం తెలీడం లేదు. వళ్ళు నెప్పులుగా ఉంది. తల బద్దలవుతూంది. కాస్త అమృతాంజనం రాయి తల్లీ."

''నాన్నా! డాక్టర్ను పిలిపించనా?''

''ఎవరు? కిరస్తానీ డాక్టరునేనా? వద్దమ్మా. చూతాం. మరీ తగ్గకపోతే ఎటూ తప్పదు.''

''నాన్నా! డాక్టరుకూ....''

''నువ్వూరుకో తల్లీ! నీకు పిచ్చి పట్టింది. అందర్నీ వెనకేసుకొస్తావు. నేను అవునన్నది కాదనడం నీమతం. వాళ్ళు పాముల్లాంటివాళ్ళు. వాళ్ళు మన సంప్రదాయాన్ని, మతాన్ని నాశనం చేశారు. ఇంకా చేస్తారు; నీకర్థం కాదు. నన్ను వాగించకు.''

ఏదో అనాలనుకుంది జానకి. నోటిదాకా వచ్చింది. అనలేదు. కాఫీ కప్పు అందించింది. తాగారు తండ్రి. అమృతాంజనం రుద్దింది. అక్కణ్ణుంచి లేచిపోయింది. రమాదాసితో చెప్పింది. తాను డాక్టరు దగ్గరికి వెళ్తానంది. మందు తెస్తానంది. చూతామన్నది జానకి.

జానకికి మనసేం బాగా లేదు.

జానకి ఆ రోజు స్కూలుకు వెళ్ళలేదు.

పాల్ సైకిలు పట్టుకొని జానకి వచ్చే దారిలో నుంచున్నాడు. అంతా వెళ్ళి పోయారు. జానకి రాలేదు. చాలా సేపు నుంచున్నాడు. జాడ కనిపించలేదు. ప్రతి అలికిడినీ గమనించాడు. అన్ని దిక్కులూ చూచాడు. అందరినీ పరీక్షించి చూచాడు.

జానకి జాడలేదు.

జానకి ఎక్కడా కనిపించలేదు.

ఉత్సాహంగా వచ్చాడు. ఉరుకులు పెడ్తూ వచ్చాడు.

నిరుత్సాహంగా వెళ్ళిపోయాడు. మెల్లగా సాగిపోయాడు. తోవలో కనిపిస్తుం దనుకున్నాడు, కనిపించలేదు ఆస్పత్రికి వస్తుందనుకున్నాడు. రాలేదు.

ముకుందంగారికి జ్వరం తగ్గలేదు. ఎక్కువైంది. బాధపడి పోతున్నాడు. జానకి రమాదానిని పంపింది. డాక్టరు దగ్గరికి. రమాదాని వివరించి చెప్పింది. డాక్టరు మాత్ర ఇచ్చాడు. జానకి తండ్రికిచ్చింది. ముకుందంగారు అవగలేదు ఎక్కడి పని, అయినా మింగారు. నీళ్ళు తాగారు. మూడు రోజులకు జ్వరం కాస్త తగ్గుముఖం పట్టింది. బాగా నీరసించిపోయారు. లేచి కాస్త అటూ ఇటూ తిరుగుతున్నాడు.

# 11

చీకటి రాత్రి, ఊరు నిద్రపోతూంది. ఉరుములు, మెరుపులు మొదలయి నాయి. ఆకాశంలో కారుమబ్బులు కమ్ముకున్నాయి. చుక్కల వెలుగును మింగేశాయి. టపటప చినుకులు మొదలైనాయి. క్షణంలో చినుకులు ధారలైనాయి. ఆకాశానికి చిల్లిపడింది. హోరున వాన సాగింది, దొంగలు పడ్డట్టు కురిసింది వాన, వీధుల్లో వరదలు సాగేయి. ఏరు పొంగసాగింది. పొంగడానికి ఇక్కడి వాన అక్కరలేదు. ఈ వాన కూడా దోహదం చేసింది. ఏరు పొంగింది. గట్లు దాటింది. ఊళ్ళోకి సాగింది చీకటి! నీరు కనిపించలేదు. చల్లగా ఎదిగి వస్తూంది. ఊరు నిద్రపోతూంది.

ఫాదర్ జాన్‌కు మెలకువ వచ్చింది. నీరు కనిపించింది. దిగ్గున లేచాడు. హోరు వినిపిస్తూంది. పాల్ నిద్రపోతున్నాడు. లేపాడు ఫాదర్.

"వాన, వరద, మనం మునిగిపోతున్నాం రే."

పాల్ లేచాడు. చూచాడు. ప్రళయంలా ఉంది. చప్పున బేగ్ అందుకున్నాడు. "నాన్నా నడవండి ప్రళయం వస్తున్నది. ఊళ్ళో ఒకటే మేడ ఉంది. అది చైర్మన్‌ది. వెళ్దామా? వస్తారా? అది మనవాళ్ళది కాదుమరి. క్రైస్తవులది కాదు. నీరు ముంచు కొని వస్తూంది. ఏమంటారు?"

ఫాదర్ జాన్ ఉలకలేదు, పలకలేదు. పాల్ వెంట బయల్దేరాడు. ఏదీ జ్ఞాపకం రాలేదు. గొడుగు, టార్చి మాత్రం అందుకున్నాడు. గుమ్మం దాటాడు. మెరుపు మెరిసింది. వెలుగు వెలిగింది. వెలుగులో చర్చి కనిపించింది. చర్చి చుట్టూ

నీరు చేరింది. చర్చిలోకి జొరబడుతుంది నీరు. బొళ బొళా పోతున్నది. ఫాదర్ జాన్ చూపు తిప్పుకున్నారు. ఫాదర్ నీరసంగా ఉన్నారు. ఆరోగ్యం బావుండలేదు. కొడుకుతో కదిలారు. కాస్త తూలారు. డాక్టర్ పట్టుకున్నాడు. కన్ను పొడుచుకున్నా కనిపించడం లేదు అంతా జలమయంగా ఉంది. ఫాదర్‌కు భయంగా ఉంది. నీరు హోరు వినిపిస్తూంది. అంతా లేచినట్లున్నారు. ఫాదర్ అనుకున్నాడు, తనకు స్థలం దొరుకునా? అంతా నిద్రలోనే ఉంటే బాగుండును. తాను ఒక్కడే వెళ్తే విశాలం అయిన స్థలం దొరికేది. జబ్బుగా ఉన్నాడు తాను. అసలు ఛైర్మన్ రానిస్తాడా? తాను ఎన్నడూ సహించలేదు వాళ్ళను. తానే ఎక్కువనుకున్నాడు "ఛైర్మన్ రానివ్వాకుంటే" అడిగేశాడు. పాల్ జవాబు చెప్పలేదు. అతని ఆలోచన మరోవైపు వుంది. జానకి లేస్తుందా? మెలకువ వస్తుందా? మునిగిపోతుందా? భయంకరంగా ఉంది వరద! జానకి మునిగిపోతే? తానేం కావాలి? వరద బాగానే ఉంది. తాను పునగలేడూ! కాదు, జానకిని లేపాలి. రక్షించాలి! వాన. వరద. తడిసిపోతున్నారు. తండ్రిని తీసుకొని సాగిపోతున్నాడు పాల్ జానకి ఇంటివైపు.

జానకి నిద్రలో వుంది. ఏదో కేక వినిపించినట్లయింది. పాల్ ధ్వనిలా వుంది. దూరంనుంచి కేకవేస్తున్నాడు, పిలుస్తున్నాడు. తననే. అది ఆలాపన. అసలేం లేదు, అయినా మేల్కొంది జానకి. లేచి కూర్చుంది. ఇంకా ఆలాపన వినిపిస్తూనే ఉంది. వినడానికి ప్రయత్నించింది. ఏమీ వినిపించలేదు; హోరు వినిపించింది. కిందికి చూసింది. మంచం కిందికి నీరు వచ్చేసింది. గాభరా పడిపోయింది. 'నాన్నా" అని కేక పెట్టింది. కేక వినిపించలేదు ముకుందంగారికి. వారు నిద్రలో ఉన్నారు, ధ్యాసలేదు. గాఢ నిద్రలో వున్నారు. జానకికి భయంగా వున్నది. హోరు! చీకటి! వరద! మంచం దిగింది, తండ్రిని కుదిపింది, లేపింది. ముకుందం గారు కళ్ళు తెరిచారు. చూచారు, అయోమయంగా చూచారు. అర్థంకానట్లు చూచారు. "వాన! వరద! ఇల్లు మునుగుతున్నది." జానకి గాభరాగా అనేసింది. దిగ్గున లేచారు, కూర్చున్నారు. హోరు వినిపిస్తూంది, వరద వినిపిస్తూంది. నీరు కనిపిస్తూంది. ఎలా? ఏం చేయాలి? వణికిపోతున్నారు ముకుందంగారు. "ఛైర్మన్ మేడ మీదికి నడవండి, త్వరగా". యంత్రవత్తుగా నడిచారు ముకుందంగారు. చీకటి, ఏమీ కనిపించడంలేదు. గుమ్మం వైపు సాగుతున్నారు. గోడ కూలింది. ఆ చప్పుడు వినిపించింది. "దేవుని గది కూలినట్లుంది. విగ్రహాలున్నాయి. ఎట్లా? తెత్తునా?" జానకి అడిగింది. ఖిన్ను మన్నారు ముకుందంగారు "నడువ్ జీవన్భద్రాణి పశ్యతి" అన్నారు ముకుందంగారు. తడుముకుంటూ గుమ్మం దగ్గరికి చేరారు. ఎదుట ప్రళయం విలయనృత్యం చేస్తూంది. వానలో సాగిపోవాలి. వెలుగు లేదు.

"జానకిగారూ!" కేక వినిపించింది. ధ్వని డాక్టర్ పాల్‌ది. జానకి ఆశ అంకురించింది.

వెలుగు పడ్డది. టార్చి వెలుగు. ముకుందంగారి ప్రాణం లేచి వచ్చింది.

"ముకుందంగారూ! గొడుగు కిందికి రండి" పాల్ అరిచాడు.

"ముకుందంగారా? మా గొడుగు కిందకి వస్తారా?" ఫాదర్ జాన్ గునిశాడు. ముకుందంగారు వినిపించుకోలేదు. గొడుగు కిందకి చేరాదు. ముకుందంగారూ, ఫాదర్ జాన్ కలిసి సాగారు. ఒకరి భుజాలమీద ఒకరు చేతులేసుకున్నారు. జానకి, పాల్ తడుస్తున్నారు. సాగిపోతున్నారు ఒకరి పక్క వొకరు.

వాన కురుస్తున్నది. మెరుపు మెరిసింది.

రెండు జతలు కనిపించాయి.

గొడుగులో జాన్, ముకుందం! వానలో జానకి, పాల్.

కష్టాలు మనుషుల్ని ఏకం చేస్తాయా? మరి సుఖాలు???

రమాదాసి గుడిసె కురుస్తుంది. మెలకువ వచ్చింది, లేచింది, చూసింది, వరద కనిపించింది. వానలో బయటికి వచ్చింది. ఏసుదాసు గుడిసెవైపు నడిచింది. ఏసుదాసు నిద్రపోతున్నాడు. తడిక తీసింది, లేపింది, లేచాడు, రమాదాసి కనిపించింది. ఆమె చేయి పట్టుకున్నాడు. "వాన, వరద, లోకం మునుగుతున్నదిలే. లే, ఉరుకుదాం," దిగ్గున లేచాడు ఏసుదాసు. ఇద్దరూ బయటికి వచ్చారు. వాన, తడుస్తున్నారు. "డాక్టరయ్య ఏట్లున్నడో? వాండ్లింటికి పొయ్యొస్త." అన్నాడు దాసు. "జానకమ్మ ఎట్లున్నదో? వాండ్లింటికి పొయ్యొస్త" అన్నది దాసి. ఇద్దరూ విడిపోయారు. జానకి ఇంటి దగ్గర కలుసుకోవాలనుకున్నారు. ఏసుదాసు వెళ్లాడు. పాల్ లేడు. ఫాదర్ లేడు. ఇల్లంతా వెదికి చూచాడు. వానలో బయల్దేరాడు. రమాదాసి వెళ్ళింది. జానకి లేదు. ముకుందం లేరు. ఇల్లంతా వెతికింది. గుమ్మంలో నుంచుంది. ఏసుదాసు వచ్చాడు. చెప్పాడు. రమాదాసి చెప్పింది. నిలువెల్లా తడిశారు. వాళ్ళు వణకడం లేదు. చైర్మన్ ఇంటివైపు వెళ్తున్నారు.

వాన కురుస్తున్నది. మెరుపు మెరిసింది.

రెండు జతలు కనిపించాయి.

గొడుగులో జాన్, ముకుందం! వానలో జానకి, పాల్!!

వారు ఆశ్చర్యపడ్డారు ముందు. ఆనందపడ్డారు వెనుక. ఇద్దరూ ఉరికారు. వారిని కలుసుకున్నారు.

చైర్మన్ ఇంటిముందు సమ్మర్దంగా ఉంది. సుమారు ఊరు సొంతం అక్కడే చేరింది. కొందరు పేదలు. పాటకజనం ఇళ్ళ కప్పులమీద ఎక్కారు. చీకట్లో కనిపించడం లేదు. వరండాలోకి చేరారంతా. లైట్లు ఏర్పర్చాడు చైర్మన్. జనం తొక్కిసలాడుతున్నారు. మెట్లు ఇరుగ్గా ఉన్నాయి. అందరూ ఎక్కాలని ప్రయత్నం. ఎవరూ ఎక్కలేక పోతున్నారు. చైర్మన్ వారితో సతమతమవుతున్నాడు. వరండాలోకి నీళ్ళు వచ్చేశాయి. నీటిమట్టం పెరుగుతుంది. జనం వణికి పోతున్నారు. ప్రాణాలకై పరితపిస్తున్నారు. ఫాదర్ చూచారు స్థితి. ముకుందం చూశారు పరిస్థితి. ఇద్దరూ అనుకున్నారు తాము ఎక్కలేమని. వరద వస్తుందని—ముంచేస్తుందని.

పాల్ ముందుకురికాడు. జానకి ఉరికింది. జనాన్ని అదుపులో పెట్టారు. ఒక పద్ధతిలో అందరినీ ఎక్కిస్తున్నారు. చైర్మన్ చూచాడు ఫాదర్‌ను—ముకుందం గారిని. ఇద్దరినీ జతగా చూశాడు. జంటగా చూచాడు. ఆశ్చర్యపడ్డాడు. ఆనంద పడ్డాడు. వారిద్దరినీ పిలిచాడు. మెట్లు ఎక్కించాడు. ఒక క్రమంలో అందరినీ ఎక్కించాడు.

వరద పెరుగుతూంది. వాన హెచ్చుతూంది.

వరండా జలమయం అయింది.

వారు ఎక్కిపోయారు.

మెట్లు మునిగాయి.

ఉరుములు పెళపెళ మంటున్నాయి.

మెరుపులు తళతళ మంటున్నాయి.

ప్రకృతి విలయతాండవం చేస్తూంది.

జలప్రళయంలా వుంది, నీరు తప్ప ఏమీ కనిపించడంలేదు.

మేడమీద జనం తొక్కుకుంటున్నారు. నుంచోడానికి స్థలం లేదు. ఫాదర్ జాన్ సరసన ముకుందంగారు–ఇద్దరూ ఒరుసుకొని నుంచున్నారు. రమాదాసి, ఏసుదాసు అందరినీ కూర్చోపెట్టే ప్రయత్నంలో వున్నారు. ఆడవాళ్ళ అరుపులు—పిల్లల కేకలు అయోమయంగా వుంది. కల్లోలంగా ఉంది. కాళరాత్రిలా ఉంది. అందరినీ సర్ది కూర్చోపెట్టారు. జాన్ పక్కన ముకుందం, ముకుందం పక్కన జాన్.

ఫాదర్ జాన్ వణికిపోతున్నారు. తడిశారు. చలిగా ఉంది.

జ్వరం కూడా వచ్చినట్లుంది. జానకి చూచింది. ఫాదర్ వళ్ళు వేడిగా ఉంది. కూర్చోగలిగేటట్లు లేరు. పడుకొమ్మంది. ఫాదర్ జాన్ ముకుందం వళ్ళో తల పెట్టారు. కాళ్ళు ముడుచుకున్నారు, పడుకున్నారు. డాక్టర్ పాల్‌కు విరామం లేదు. చాలామంది వణికిపోతున్నారు. జానకి విసుగు లేకుండా అందర్నీ సర్దుతూంది. చైర్మన్ చూచాడు. ఫాదర్ వణుకుతున్నారు. చప్పున ఒక రగ్గు తెప్పించాడు. కప్పాడు. ఫాదర్ జాన్ చైర్మన్‌ను చూచాడు. కృతజ్ఞతతో వారి కళ్ళు నిండి పోయాయి. ఫాదర్ జాన్ ముకుందంగారిని చూచాడు. ముకుందంగారు తడిసి ఉన్నారు. నీరసంగా ఉన్నారు. వణుకుతున్నారు. వారి ఒడిలో తాను పడుకున్నాడు.

"ముకుందంగారూ! శ్రమ కల్గిస్తున్నాను" అన్నారు.

"మనమంతా మనుషులం. ఇంకా మాకులం కాలేదు. బాధ పడకండి" ముకుందంగారన్నారు. "చూడండి, మీవాడు ఎంత బాధ పడుతున్నాడో పాపం! అతను లేకుంటే మనం ఎక్కగలిగే వాళ్ళమే కాము."

"మీ అమ్మాయి ఎంత మంచిది! ఎలాంటి ఏర్పాట్లు చేస్తుందో చూడండి?"

"పిల్లలు మనకంటే బుద్ధిమంతులు'' ఇద్దరూ ఏకంగా అన్నారు. పెద్దగా ఉరిమింది. గుండెలు అదిరిపోయేట్లుంది.

ఫాదర్ జాన్ అదిరిపడ్డాడు. లేచి కూర్చున్నాడు. చేతులెత్తి ప్రార్థించాడు. "మహాప్రభూ! నన్ను రక్షించు!'' ముకుందంగారు చేతులు జోడించి ప్రార్థించారు. "మహాప్రభూ! నన్ను రక్షించు.''

పాల్, జానకి చేతులెత్తి ప్రార్థించారు. "మహాప్రభూ, వీరందరినీ రక్షించు."

చైర్మన్ చకితుడైనాడు. ఫాదర్ జాన్ దగ్గరికి వచ్చాడు. వారిద్దరితో అన్నాడు: "చూశారా! మీ బిడ్డలు సర్వ జనులకోసం ప్రార్థించారు. మీరు........''

"మా బిడ్డలు పెద్దవారు'' అన్నాడు జాన్.

తెల్లవారింది. చీకట్లు విడిపోయాయి. మబ్బులు విడిపోలేదు. వాన తగ్గలేదు, వరద తగ్గలేదు. హోరు వినిపిస్తూంది. ఏరు కనిపిస్తూంది. డాబా మీద ఒక క్రమం ఏర్పడింది.

ఒక బొర్ర షావుకారు ఒక మూల ఆక్రమించుకొన్నాడు. భార్య, అతను కలిసి కోటగోడలా ఉన్నారు. మూలన స్టవ్ పెట్టారు, కాఫీ కాచుకుంటున్నారు. అది ఎవరికీ కనిపించడంలేదు. కాని, స్టవ్ చప్పుడు వినిపిస్తూంది. తెల్లవారడంతో పాపలు ఏడ్పులంకించారు-పాలకోసం. ఫాదర్ జాన్ 'కాఫీ' అని పలవరిస్తున్నారు. ముకుందం గారు గుటకలు మింగుతున్నారు. రమాదాసి షావుకారు దగ్గరికి వెళ్ళింది. కాస్త పాలపొడి పెట్టమని అడిగింది. పిల్లలు అల్లాడిపోతున్నారన్నది. "అంత బాధపడేవారు తెచ్చుకోవాల్సింది. పాలపొడి ఇవ్వను పో'' అన్నాడు.

జానకి షావుకారు దగ్గరికి వెళ్ళింది. "ఒక రోగి మూలుగుతున్నాడు. పసి పాపలు ఏడుస్తున్నారు. అలాంటప్పుడు ఒక్కరు కాఫీ త్రాగడం మంచిది కాదు. ఆ పాలపొడి ఇవ్వండి. అందరికీ అవుతుంది!" బ్రతిమలాడింది.

"ఎవరి జాగ్రత్త వారు పడాలి. మా పాలపొడి మీ కెందుకిస్తాం?''

పాల్ దూరం నుంచి వింటున్నాడు. చైర్మన్ కూడా వచ్చేశాడు.

"మెల్లగా ఇస్తావా? లాక్కోమంటావా?''

"ఏం దౌర్జన్యం చేస్తావా? నేనివ్వను" స్టవ్ దగ్గరికి జరిగాడు.

"ఇదిగో ఇంతమంది ఏడుస్తుంటే నువ్వొక్కడివీ తాగడం న్యాయం కాదు. లాగండి పాల్‌గారూ" చైర్మన్ అన్నాడు.

అందరూ "లాగండి–లాగండి" అని అరిచారు.

జాన్, ముకుందం కూడా అరిచారు.

బొర్ర షావుకారు లొంగాడు. స్టవ్ అప్పగించాడు. ఒక పొట్లం ఉంచుకొని మిగతాది ఇచ్చాడు.

"ఏమిటి దాస్తున్నావు? తే అదికూడా" జానకి లాక్కుంది. బ్రొంర షావుకారు తెల్లబోయి చూచాడు.

"మరి మాకూ కాఫీ" షావుకారిణి ఏడ్చినట్లు అడిగింది.

"అందరితోపాటు మీకు" చైర్మన్ అన్నాడు.

రమాదాసి, జానకి కలిసి పాలు తయారు చేశారు. చైర్మన్ పసిపాపలకు అందే ఏర్పాటు చేశాడు.

పాల్, ఏసుదాసు కాఫీ తయారు చేశారు. జానకి అందరికి కాఫీ అందించింది—పాదర్ జాన్‌కు అందించింది. అతడు ఆశీర్వదించాడు. తండ్రికి అందించింది. మెచ్చుకున్నారు. షావుకారుకు, షావుకారిణికి కాఫీ ఇచ్చింది రమాదాసి.

అందరూ కాఫీలు తాగుతున్నారు.

"ఇదే బాగున్నాది. అందరితో మనం. ఎంత హాయిగా ఉంది" అన్నాడు షావుకారు. అంతా ఆశ్చర్యపడి చూశారు.

"నలుగురితో చావు పెళ్ళితో సమానం'' అన్నాడు చైర్మన్.

"చాల బాగా చెప్పారు చైర్మన్‌గారూ!" అన్నాడు ముకుందంగారు.

"ఏమిటో?'' అని ముకుందంగారిని చూశారు ఫాదర్ జాన్.

డాక్టరుకు చేతినిండా పని. ఒకరికి జ్వరం, ఒకరికి తలనెప్పి, ఒకరికి వాంతులు. జానకి, డాక్టర్ సతమతం అవుతున్నారు.

వంట ఏర్పాట్లలో ఉన్నారు. చైర్మన్, రమాదాసి, ఏసుపాదం సహాయం చేస్తున్నారు.

వంటలయినాయి,

భోజనాలయినాయి.

వాన తగ్గుముఖం పట్టింది. వరద గుంజుతున్నది.

సాయంకాలానికి తెరిపి ఇచ్చింది. వరద గుంజేసింది. ఇప్పుడు ఊళ్ళో వరద లేదు. ఏరు మాత్రం పారుతూంది. తుంపర సన్నగా రాలుతూంది. మబ్బు విడిపోతూంది. వేగంగా, దూదిపింజల్లా అదిరిపోతున్నాయి. గాలి వేగం హెచ్చింది. ఆకాశం ఒక దిక్కు నిర్మలం అయింది. నీలినీలి ఆకాశం కనిపిస్తూంది. ఎండపొడ తెల్లగా వచ్చింది, కొంతదూరం వ్యాపించింది, మాయం అయింది. మళ్ళీ వచ్చింది. దాగుడు మూతలాడుతూంది. జనానికి ప్రాణభయం తగ్గిపోయింది. ఇళ్ళు, వాకిళ్ళను గురించి ఆలోచన వచ్చింది. ఇళ్ళ కప్పులమీద జనం దిగారు. చైర్మన్ మేడమీద జనం కొందరు వెనకా ముందాడుతున్నారు, కొందరు దిగిపోతున్నారు.

ఫాదర్ జాన్ కొడుకును చూచాడు. వెళ్ళిపోదామా? అన్నారు. పాల్ జానకిని చూచాడు. జానకి అటు చూడ్డంలేదు. ఎటో చూస్తూంది. 'వెళ్ళొస్తాం' పాల్ అన్నాడు. జానకి విన్నది. అటు చూచింది. సరేనన్నట్లుంది ఆ చూపు. ఫాదర్ జాన్ లేచారు. పాల్ భుజంమీద చేయి వేశాడు. చైర్మన్‌కు కృతజ్ఞతలు చెప్పారు.

సాగిపోయారు-ఇద్దరూ తండ్రీకొడుకులు. ముకుందంగారు లేచారు. జానకి భుజంమీద చేయివేశారు. చైర్మన్‌కు కృతజ్ఞతలు చెప్పారు. సాగిపోయారు ఇద్దరూ, కూతురూ, తండ్రి. చైర్మన్ చూస్తున్నారు. వచ్చేటప్పుడు కలసి వచ్చారు. ఇప్పుడు విడిగా వెళ్ళి పోతున్నారు. ఆపదలు మనుషులను ఏకంచేస్తాయా అని ఆలోచించసాగారు. రమాదాసి, ఏసుదాసు కలసి కదిలారు. చైర్మన్‌కు దండాలు పెట్టారు. సాగిపోయారు. వీరు వచ్చేటప్పుడు కలిసే వచ్చారు. వెళ్ళేటప్పుడు కలిసే వెళ్తున్నారు, ఆదేమిటి? ఆలోచించసాగాడు చైర్మన్.

మూడు జతలు సాగిపోతున్నాయి, వేరు వేరుగా. దూర దూరంగా-వేరువేరు గమ్యాలకు!

# 12

ఫాదర్ జాన్ ఇంటికి వచ్చారు. ఎదురుగా చర్చి కనిపించింది. చర్చిచుట్టూ నీళ్ళు నిలిచాయి. గోడలను చాలవరకు ముంచింది వరద. ఇప్పుడు తీసింది. అయినా బురద కనిపిస్తూంది గోడలకు—గజంమేరకు. ఫాదర్ చూచారు. చేతులెత్తి మొక్కారు. ''క్షమించు ప్రభూ! పాపులం, నిన్ను వదలి వెళ్ళిపోయాం. చర్చికి వెల్ల వేయిస్తాను. మొత్తం కడిగిస్తాను. కొత్తగా చేస్తాను, పాపులం ప్రభూ, క్షమించు" అన్నాడు. పాల్ చూస్తున్నాడు. వింటున్నాడు, "వరద వచ్చినపుడు ఆటు చూడ లేదు. వరద పోయింది వేడుకుంటున్నాడు'' అనుకున్నాడు. అయినా మాట్లాడలేదు. ఇంట్లో అడుగు పెట్టారు. ఇంటినిండా బురద, మట్టి మేటపెట్టింది. "మురికిగా వున్నా ఇదే నయం. ఎలా గడిపాం రాత్రి – విశ్వాసం లేనివాళ్ళతో? ఛీఛీ అసహ్యం. ఏం జనం వాళ్ళు? ఎలా వున్నాం వాళ్ళల్లో?'' అన్నారు ఫాదర్.

"నాన్నా! వాళ్ళు మనకు రక్షణ కల్పించారు. నిన్ననేకదా వాళ్ళను మెచ్చు కున్నారు!" పాల్ అడిగాడు.

"ఆపదలో అనేక మాటలంటాం, అవన్నీ లెక్కలోకి వస్తాయా? విశ్వాసంలేని వెధవలు? ఛీ ఛీ!"

"మానవ సేవకు విశ్వాసం కావాలా? మనం వద్దన్నా చెట్లు పండ్లనిస్తు న్నాయి! మేఘం వర్షిస్తూంది. సూర్యుడు ఎండ కాస్తున్నాడు. వాటికేం విశ్వాసం వుంది?"

"నోర్ముయ్! ఏమిటా వెకిలి ప్రశ్నలు! నాస్తికులు అవుతున్నారు. ఈ కాలపు పిల్లలే అంత! నువ్వన్నది తప్పు. చాలా తప్పు, లెంపలేసుకో" అని లోనికి సాగి పోయారు ఫాదర్ జాన్. అర్థం కానట్లు తండ్రిని చూస్తూ నుంచున్నాడు డాక్టర్ పాల్.

గోడకు క్రీస్తుపటం వుంది. అది నిర్మలంగా వుంది. ఆతడు అందరికీ అభయం ఇస్తున్నాడు. అతడు శత్రువును ప్రేమించమన్నాడు. దూషించిన వారిని దీవించమన్నాడు.

ముకుందంగారు ఇంట్లో అడుగుపెట్టారు. ఇంటి నేల సొంతం బురదతో నిండింది. అడుగుపెట్టే అంటుకుంటూంది. అడుగు గుర్తుపడుతున్నది. ఇల్లంతా జిబజిబగా ఉంది. నిలబడ వీలుకానట్లుంది. ఇంటిని చూచారు ముకుందంగారు. "ఇలా ఉన్నా ఇక్కడే బావుంది. ఆ కిరస్తానీలతో ఎలా గడిపామో రాత్రి! ఛీ, ఛీ స్నానం చేయాలి. ఇంకా ఆ వాసన వదల్లేదు. ఏమిటలా వాణ్ణి పూసుకు తిరుగుతావు?" అన్నారు.

జానకి ఆశ్చర్యపోయింది. రాత్రే మెచ్చుకున్నాడు వాళ్ళను తండ్రి. ఇప్పుడు ఈసడించుకుంటున్నాడు. స్నానం చేస్తాట! స్నానంచేస్తే పోతుందేమో! ఆ మాటే అడిగింది - మనసులో అనుకున్నట్లు కాకున్నా - కాస్త మెత్తగా.

"ఆపదలో అనేకం అంటాం. అవన్నీ పాటిస్తామా? అవసరంవస్తే గాడిద కాళ్ళు పట్టుకోవాలి. వసుదేవు డంతటివాడు పట్టుకున్నాడు. అలా అని గాడిదను నెత్తిన పెట్టుకుంటామా? ఊరేగుతామా?"

"నాన్నా! గాడిద మనిషికి సాయం చేసిందనుకో. మరిచిపోతామా? అలాం టప్పుడు గాడిద మనిషికన్న మిన్నకదా?"

"గాడిద గాడిదే! మనిషికి సాయం చేయడమేమిటి? బరువులు మోయడం దాని పని. అయ్యో మరిచాను. దేవుని గది కూలిందికదా! నా రామచంద్రు డేమైనాడో! పద పద" అని దారితీశాడు.

దేవుని గది కూలింది. కూలిందంటే గోడలు కూలాయి. కప్పు గుంజలమీప నిలిచి ఉంది. గోడ కూలిన మట్టిలో ఉన్నాయి విగ్రహాలు. జానకి మట్టి తొలగించింది. విగ్రహాలు బయటికి తీశారు ముకుందంగారు. "స్వామీ! అపచారం జరిగింది. మన్నించు స్వామీ! నిన్నిలా వదలి వెళ్ళిపోయాం. ప్రభూ మన్నించు, ఆపదలో అన్నీ మరచాం. నిన్నూ మరచాం, క్షమించు ప్రభూ! క్షమించు" అని లెంపలు వాయించుకున్నారు. జానకి పెదవి కదల్లేదు. మనసులో ఏం ప్రార్థించిందో మనకు తెలీదు. విగ్రహాలను భక్తిగా బయటికి తీసింది. శ్రద్ధగా తోమింది. వేరే గదిలో అమర్చింది.

రెండు నెమ్మెలు వెలుగుతున్నాయి.

సీతా రామలక్ష్మణులు తళతళమంటున్నారు.

సీత చిరునవ్వు చిందిస్తూంది.

రాముడు అభయం ఇస్తున్నాడు-అందరికీ.

అతడు కరుణామూర్తి. కాకాసురునే రక్షించిన దయాసాగరుడు..

జానకి భజన ప్రారంభించింది.

ముకుందంగారు తాళం వేస్తున్నారు.

రమాదాని ఇల్లు కడుగుతూంది. మురికిని పారదోలుతూంది.

# 13

జానకి స్కూలునుంచి తిరిగి వస్తున్నది. వెనుక బెల్లు వినిపించింది, పక్కకు తప్పుకుంది, తిరిగి చూసింది, పాల్ సైకిలు దిగాడు.

"ఓహ్ మీరా! ఎవరో అనుకున్నాను, భయపడ్డాను"

"అలాగా! ఇప్పుడైతే భయంలేదుగా"

"ఇప్పుడెందుకూ భయం?"

"ఏం! ఎందుకుండకూడదూ?"

"మీరేగా"

"నేనంటే భయంలేదా?"

"ఎందుకుండాలి?"

"మగవాణ్ణి కాబట్టి"

"ఓహ్! అదా! మీ మగవాళ్ళంతా భయపెట్టాలని చూస్తారా?"

"అబ్బే! అదేంకాదు, ఆడవాళ్ళు భయపడ్తారు. అంతకంటే లేదు, మేమేం పులులమా, సింహాలమా!"

"పులులకేం, సింహాలకేం? అవేమంటాయి? పాపం అడవుల్లో వుంటాయి. మనిషినేమంటాయి? దానిదగ్గరికిపోయి పుల్ల పెడ్తే గుర్రుమంటాయి, వెకిలి వేషాలేస్తే మింగేస్తాయి, అబ్బో మీరలా కాదే! ఊళ్ళో వుంటారు, మనుషుల్లాగే కనిపిస్తారు."

"మేం మనుషులం కామా?"

"ఛ, ఛ మగవాళ్ళు మనుషులా? ఎవరన్నారు? రక్కసులు! రాక్షసులు!! ఆడవాళ్ళి బతకనివ్వరే! చూడండి — సింహాలు, పులులు, జంతువులు, పక్షులు— అన్నింటిలో ఆడ, మగా వుంటాయి. మగవి ఆడదానిమీద పెత్తనం చెలాయించవు, వేటి దారిన అవి ఏరుకుతింటాయి, కలిసి ఉంటాయి సుఖంగా. మగవాళ్ళలా కారు"

"ఏమిటలా మగవారి మీద విరుచుకుపడుతున్నారు! స్త్రీకి స్వాతంత్ర్యం కావాలి. ఆమె కలకాలం బానిసగా జీవించింది. అది నేను అంగీకరిస్తాను. కాని అది మగజాతి మీద దుమ్మెత్తి పోయడంతో వస్తుందా అని ఆలోచించండి"

"రాదు, ఒప్పుకుంటాను. మీరూ మగవారేగా! మీరూ భర్త కావలసిందేగా! మీ దృష్టిలో మీ స్త్రీకి స్వాతంత్ర్యం కలిగించటం అంటే ఏమిటో చెప్పండి"

"ఆమె నాలాంటి మనిషి, ఆమెకూ నాకున్నట్లే కొన్ని కోరికలుంటాయి. భావాలుంటాయి. ఆలోచనలుంటాయి. ఆమె మనిషి. నేను మనిషిని, తోటి మానవుణ్ని గౌరవించినట్లు గౌరవిస్తాను. నాకు నేను ఎంత స్వేచ్ఛ కావాలనుకుంటానో అంత స్వేచ్ఛ ఆమెకూ ఉండాలి. నాకు నచ్చినవి ఆమెకు నచ్చాల్సినపనిలేదు. ఇద్దరమూ భార్యాభర్తలం. కాబట్టి కొంత సర్దుకుపోవాలి. అందుకు ఇద్దరమూ యత్నించాలి. నేను ప్రయత్నిస్తాను. జీవితం మూన్నాళ్ళ ముచ్చట. ఈ మూన్నాళ్ళలో హాలాహలం సృష్టించడం నా కిష్టం లేదు. అమృతమే సృష్టిద్దాం అనుకుంటూ జీవితం సాగిస్తాను."

పాల్ మాటలు జానకికి ఏదో ఆనందం కలిగించాయి. ఆమె గుండె నిండింది. పొర్లింది. ఆమెకు తెలియకుండానే మాటలు వచ్చేశాయి.

జానకి పాల్ కళ్ళల్లోకి చూచింది. పాల్ జానకి చూపుల్ని కొల్చాడు.

# 14

"పెండ్లి చేసుకుందాం"

"ఎవరు చేస్తరు మన పెండ్లి?" అన్నాడు అమాయకంగా ఏసుదాసు.

"అవు, పాదిరి చేస్తడా మన పెండ్లి?" అంది రమాదాని.

"అమ్మో! దుడ్డుకర్ర అందుకుంటడు. ఆ పెండ్లి చేస్తడు"

ఇద్దరూ నవ్వుకున్నారు. గలగల నవ్వారు. గోదావరిలా నవ్వారు.

"అయ్యగారు చేస్తరా మన పెండ్లి?"

"అమ్మో! రోకలిబండ అందుకుంటడు. ఆ పెండ్లి చేస్తడు." అంది రమాదాని.

ఇద్దరూ మళ్ళీ నవ్వుకున్నారు. ముత్యాల్లా నవ్వారు. మల్లెపూలలా నవ్వారు.

రమాదాని ఆకాశాన్ని చూచింది.

నింగి నీలంగా ఉంది, మబ్బులేదు. మసకలేదు.

నీలపు వెలుగులా ఉంది, నిగనిగ లాడుతున్నది.

"దాసూ!"

"ఏం దానీ"

"ఆకాశం చూసినవా?"

"చూసిన"

"దానిదేం మతం?"

"దానికేం మతం?"

"దాసూ!"

"ఏం దాసీ!"

"ఈ ఏరున్నది చూసినవా?''

"చూసిన"

"దానిదేం మతం?"

"దానికేం మతం?"

"దాసూ!"

"ఏం దాసీ!"

"ఈ చెట్లు, పిట్టలు చూసినవా?''

"చూసిన"

"వాటికేం మతం?"

"వాటిదేం మతం?"

"దాసూ!''

"ఏం దాసీ!"

"మనం ఎవరం?''

"దాసులం"

"మనదేం మతం?''

"మనకేం మతం?''

"అట్లయితే ఆకాశం, ఏరు, చెట్లు-ఇవే మన పెండ్లి చేస్తయి"

"అదెట్ల?''

"రా, పోదం" అని దాసును లాక్కొని పోయింది.

ఇద్దరూ ఏటిముందు నుంచున్నారు.

ఇద్దరూ చేతులు జోడించారు.

"ఓ ఆకాశమా! ఓ భూదేవీ! ఓ చెట్టుల్లారా! ఓ పిట్టల్లారా! మేం పెండ్లి చేసుకుంటున్నం. మా జంట కలకాలం ఉండనియ్యండి'' రమాదాసి అన్నది.

"ఓ ఆకాశమా! ఓ భూమీ! ఓ చెట్టుల్లారా! పిట్టల్లారా! మేం పెండ్లి చేసుకుంటున్నం. మా జంట కలకాలం ఉండనియ్యండి, దీవించండి." ఏసుదాసు అన్నాడు.

పక్షులు కిలకిలమన్నాయి.

ఏరు గలగల మన్నది.

చింతచెట్టు పూత రాల్చింది.

ఆకాశం వెలిగింది.

"చూచినవా? అన్నీ దీవించినయి మన పెండ్లి అయింది!"

"పెండ్లంటే ఇంత తేలికా?'' ఏసుదాసు ఆశ్చర్యం వ్యక్తపరిచాడు. అతని కళ్ళు వెలిగాయి.

"అవుమల్లి!" సిగ్గు దొంతర్లు కనిపించాయి రమాదాసి ముఖంలో. తల వంచు కుంది, అన్నది "పేదోండ్ల పెండ్లంటే ఇంతే"

ఏసుదాసు చేయి చాచాడు. రమాదాసి చేయి అందించింది. ఏసుదాసు ఆమె చేయి అందుకున్నాడు. పాణిగ్రహణం జరిగిపోయింది.

"రా. పోదాం" ఆమెను పట్టుకొని నడిచాడు ఏసుదాసు. ఇద్దరూ గట్టె క్కారు.

# 15

జానకి తొందరగా బయల్దేరింది స్కూలు నుంచి. ఆమె చకచకా నడిచింది. మర్రి కిందికి వచ్చింది. అప్పటికే పాల్ వచ్చేశాడు. నేలమీద గీతలు గీస్తున్నాడు. పాల్ జానకిని చూచాడు.

"ఓ! వచ్చేశారా?"

"చాలా సేపైందా వచ్చి?"

"ఉహుఁ! ఏం కాలేదు. కూర్చోండి"

జానకి కూర్చుంది-పాల్ ముందు. ఏవేవో మాటల తరవాత వారి మధ్య వారి పెళ్ళి ప్రస్తావన వచ్చింది.

"మిమ్మల్ని కొన్ని విషయాలడగాలనుకున్నాను"

"అడగండి. సంకోచం ఎందుకు?"

"అది కాదు. మీకు మతం మీద నమ్మకం ఉందా?" జానకి పాల్ కళ్ళలోకి చూచింది. పాల్ కళ్ళు వెలిగాయి.

"ఉంది. నా మతం అంటే నాకు నమ్మకం. మరి మీకు"

"నేనూ అదే చెప్పాలనుకున్నాను మీకు. నాకు నా మతం మీద విశ్వాసం ఉంది. నేను ప్రతిరోజూ పూజ చేస్తాను. రాముడంటే నాకిష్టం. సీతమ్మ నాకు ఇష్ట దైవం."

"నాకు క్రీస్తుమీద విశ్వాసం. ప్రతి ఆదివారం చర్చికి వెళ్తాను. నేను దాన్ని వదులుకోలేను".

"బావుంది భవిష్యత్తు ఎంతో అందంగా ఉండేలా ఉంది. మీరు చర్చికి వెళ్తారు. నేను పంపుతాను. నేను గుడికి వెళ్తాను. నన్ను మీరు సాగనంపుతారు. మీరేమంటారు?"

"వండర్‌ఫుల్ అంటాను" అన్నాడు పాల్ నవ్వుతూ.

"ఇంతకూ మన వివాహాన్ని మన తల్లిదండ్రులు సమ్మతిస్తారా?"

"మా నాన్న వప్పుకోరు. మీ నాన్న అసలే వప్పుకోరు. అందుకే మనం దూరంగా ఉండాలి. పట్నం వెళ్ళిపోదాం. అక్కడ సమాజం ఇంత ఇరుకుగా ఉంటో

చించదు. నాకేం? ఎక్కడయినా ప్రాక్టీసు పెట్టుకోగలను. మీ ఇష్టం వుంటే ఉద్యోగం చేయండి. లేదా మానెయ్యండి. మీరు ఉద్యోగంచేస్తే మీ డబ్బుమీద నా పెత్తనం ఉండదు. మీరు మీ నాన్నగారికి పంపండి. పాపం ఆయనకు కష్టం అవుతుంది. నేను చెప్పానుగా-మనం మంచి మిత్రులుగా వుందాం."

"థాంక్స్! మెనీమెనీ థాంక్స్!! మీ ఔదార్యం నన్ను ఆకర్షిస్తూంది. మనం కలిసి జీవించగలం. మన జీవితాన్ని పూలబాటగా మలచుకోగలం. కాని, మన పెళ్ళి ఎలా జరగాలి?"

"అవును ఎలా జరగాలి? ఎవరు చేయాలి?" ఆలోచనలో పడిపోయాడు పాల్. ఆలోచనలో పడిపోయింది జానకి.

క్షణాలు మౌనంగా దొర్లిపోతున్నాయి.

రమాదాసి, ఏసుదాసు అక్కడికి వచ్చారు.

"ఇక్కడున్నామని మీకెలా తెలిసింది?" పాల్ అడిగాడు.

''మేం పెండ్లి చేసుకున్నం" ఏసుదాసు తననూ, రమాదాసినీ చూపుతూ అన్నాడు.

రమాదాసి సిగ్గు ఒలకపోసింది. తల వంచుకుంది. గోళ్ళు గిల్లుకుంటూంది. కాలి బొటన వేలుతో వలపు వలయాలు కలుపుతూంది,

"అవునా?" అడిగింది జానకి రమాదాసిని.

"అవును. చేసుకున్నం. మొక్కటానికి వచ్చినం" అని కూర్చున్న ఇద్దరి కాళ్ళ మొక్కారు నవదంపతులు.

దీవించారు ఇద్దరూ.

"ఎవరు చేయించారు పెళ్ళి" అడిగాడు పాల్.

"మేమే చేసుకున్నం" అని జరిగింది వివరించాడు ఏసుదాసు.

"బావుంది. మంచి పని చేశారు" అని జేబులోంచి కొంత డబ్బుతీసి అందించాడు పాల్.

డబ్బు అందుకున్నాడు దాసు. మళ్ళీ మొక్కారు ఇద్దరూ. వెళ్ళిపోయారు.

"చూశారా! వాళ్లెంత చిత్రంగా పెళ్ళాడేరో!" జానకి అన్నది.

"అవును. వాళ్ళనుంచి మనం నేర్చుకోవాల్సింది చాలా వుంది. వాళ్ళే నిజమైన మనుషులు."

ఇద్దరూ లేచారు. కొంత దూరం కలిసి నడిచారు. విడిపోయారు. శనివారం జానకి యింటిదగ్గర పూజ చేసుకుని, స్కూలుకి వెళ్ళేసరికి ఆలస్యమయింది. తను వెళ్ళేసరికే శకుంతల క్లాసురూంలో వుంది. మొహం ఎర్రబడి వుంది. కళ్ళు చింతనిప్పుల్లా వున్నాయి.

"ఇది స్కూలు. తెల్సా నీకు!" అంది ఆమె గర్జిస్తూ.

జానకికి ఏమీ అర్థం కావడంలేదు. అంతా అయోమయంగా వుంది.

"నీతి తప్పినవారికి ఇక్కడ స్థానంలేదు" అంది తిరిగి వురుముతూ శకుంతల.

జానకికి మెదడు పనిచేయడంలేదు. కాళ్ళు నీరసించిపోతున్నాయి. బలంగా నిలదొక్కుకుంది. గుడ్లప్పజెప్పి చూస్తున్నది. సమాధానం ఏం చెప్పాలో అర్థం కాలేదు.

"మాట్లాడవేం ? ఏమిటా ధైర్యం! చైర్మన్ను బుట్టలో వేసుకున్నాననా?"

జానకిమీద పిడుగు పడ్డట్టయింది. చీకటి గొయ్యారంలో వున్నట్లుంది. ఎక్కణ్ణించో వినిపిస్తున్నాయి మాటలు. తనమీద నింద వేస్తున్నారు. తాను.... చైర్మన్ను...బుట్టలో వేసుకుందిట! ఏమిటీ మాటలు.

"ఏం చేశానండీ నేను?"

"ఛీ! సిగ్గులేక ఇంకా అడుగుతున్నావా. ఆడదానివా? గాడిదవా?"

"మాటలు సరిగా రానివ్వండి. మీరూ ఆడవారే" కేక పెట్టింది జానకి. ఉన్న బలం సొంతం కూడదీసుకొని అరచినట్లుంది. ఆ కేక గదిలో ప్రతిధ్వనించింది.

"అరిస్తే దడుస్తారనుకున్నావా? సిగ్గులేక ఆ డాక్టరువెంట తిరగడం నాకు తెలియదనుకున్నావా? కిరస్తానీవెంట తిరుగుతావా! మీ నాన్న సంప్రదాయం గలవాడు. పెద్దవాడు. పండితుడు. ఇదేనా నువ్వు ఒరగబెట్టేది? నిన్ను ఉద్యోగం నుంచి ఊడపెరికేదాన్ని - చైర్మన్ లేకుంటే. తెలివైనదానివి. జాణవు. అతన్ని కట్టేశావు ముండే!"

"ఆపండి!" జానకి అరిచింది. అంతే! మరి మాట్లాడలేకపోయింది. ముఖం నిండా చెమటలు పట్టాయి. పెదవి అదరసాగింది. కళ్ళు నిప్పులు కురుస్తున్నాయి. "చైర్మన్ను బుట్టలో వేసుకున్నదెవరు? అది అందరికీ తెలుసు..."

"ఏమీ! నన్నే అంటావ్?" గట్టిగా కేక పెట్టింది శకుంతల. లేచింది పులిలా. లాగి చెంపమీద కొట్టింది.

జానకికి శక్తిలేదు. ఉద్రేకం పొంగింది. అది దుఃఖంగా మారింది. కంటివెంట జలజలా నీరు కారింది. అంతా అంధకారంగా ఉందామెకు. వళ్ళు తూలుతున్నది. తల బరువుగా ఉంది. కదలిక రావడంలేదు.

గుమ్మంలో జనం కూడారు. అదీ గమనించలేదామె. గుమ్మం దాటింది. పిల్లలు తప్పుకున్నారు. వెళ్ళిపోయింది. వెళ్ళిపోతుంటే వినిపిస్తున్నాయి మాటలు- 'డాక్టరుతో కులుకుతూంది. డాక్టరు కావాలట దానికి.'

* * *

ముకుందంగారు భాగవతం చదవటంలేదు. వ్యాసపీఠం ముందు కూర్చునిలేరు. ఇంట్లో పచార్లు చేస్తున్నారు. వేగంగా నడుస్తున్నారు. జానకి గుమ్మంలో

అడుగు పెట్టింది. ఆగిపోయాడు ముకుందంగారు. జానకి ముకుందంగారిని చూచింది, ముఖంమీద కోపం కనిపించింది. తోడేలులా తోచారు.

"ఉద్ధరించావు. రా! విన్నావా? లోకం కోడైకూస్తున్నది. వాడితో కులుకు తావా? అందుకే అన్నారు — ఆడదానికి చదువద్దని - స్వాతంత్ర్యం వద్దని. స్త్రీ బుద్ధి ప్రళయాంతకం. ముసలివాడున్నాడని సైతం అనిపించలేదు. సంపాదిస్తున్నా ననుకున్నావు. కళ్ళు నెత్తికొచ్చాయి. నీకు తండ్రి అవసరం లేదు. కుటుంబం అక్కరలేదు. కులం అక్కరలేదు. మతం అక్కరలేదు. వాడు కావాలి. ఆ కిరస్తానీవాడు కావాలి. వాడు - ఆ కిరస్తాని కావాలి. సిగ్గులేదు, శరంలేదు. వాడివెంట తిరుగుతావా? వాళ్ళు మనను, మన సంప్రదా యాల్ని నాశనం చేయాలని కంకణం కట్టుకున్నారు. వాడు వలపన్నాడు, నువ్వు అందులో పడ్డావు. నేను ఉరిబోసుకు చావాలి. వేరే గతిలేదు. 'జానకి గొప్పది, తన తండ్రిని చంపింది' అని లోకం నిన్ను స్తుతిస్తుంది. కానివ్వు, ఏం చేస్తాం? నా శవంమీంచి నడిచి వాడిదగ్గరికి వెళ్ళాలి, అంతే, ఈ బొందిలో ప్రాణం వుండగా సాగనివ్వను."

జానకి వింటూ నుంచుంది. ప్రతి మాటా బాణంలా గుచ్చుకుంటుంది. అయినా బొమ్మలా నుంచుంది, పెదవి కదపలేదు. అక్కణ్ణించి కదిలింది, లోనికి వెళ్తోంది.

"మాట్లాడవు, ఎందుకు మాట్లాడతావు? చేసి చూపిస్తావు నువ్వు. అవును, నన్ను పోషిస్తున్నావు, సంపాదించి పెడ్తున్నావు. నా మాట నీకేం లెక్క! ఎందుకు లెక్కచేస్తావు? నేను నీకు తండ్రినా? వాజమ్మను, తేభ్యను, దరిద్రుడిని, అగతికుడిని, నువ్వు పడేస్తే తింటున్నాను. భగవాన్! ఉన్నావా లేవా? చూస్తున్నావా? చూడ్డం లేదా! ఎందుకింకా ఉంచుకున్నావు. తీసుకుపోవేం! తీసుకుపో - తీసుకుపో'' అని చేతుల్తో తల బాదుకోసాగాడు.

జానకికి ఏమీ వినిపించడం లేదు. కనిపించడంలేదు. ఆమె మనసు పని చేయడం లేదు. మెదడు పనిచేయడం లేదు. గుండె మాత్రం కొట్టుకుంటుంది. గదిలో కూలబడింది, ప్రతిమలా కూలబడ్డది. ఎంతసేపు కూర్చుందో తెలియదు. రమాదాసి లాంతరు పట్టుకొని గదిలో అడుగు పెట్టింది. జానకి వెలుగు చూచింది. తోడు చూచింది. దుఃఖం పొంగింది. రమాదాసిని కావలించుకుంది. ఏడ్చేసింది. కుమిలి, కుమిలి ఏడ్చింది. రమాదాసికి తన సొద వెళ్ళబోసుకుంది. రమాదాసి మనిషిలా కనిపించింది. మనసున్న దానిలా కనిపించింది. రమాదాసి అనునయించింది. ఓదార్చింది. ధైర్యం చెప్పింది.

ఆ రాత్రి ఎవరూ అన్నాలు తినలేదు.

ఆ సాయంకాలం పాల్‌కు ఒక సీరియస్ కేసు వచ్చింది. వెళ్ళకూడదను

అనుకున్నాడు. ఒక ప్రాణం తీసిన వాడవుతాడు. త్వరగా ముగించుకుని వద్దామను కుని బయలుదేరి వెళ్ళాడు.

చీకటిపడే వేళయింది. అప్పటికి జానకి గుర్తు వచ్చింది. సైకిలు వేగంగా తొక్కాడు. స్కూలు ముందు దిగాడు. ఎవరూ లేరు. శకుంతల వచ్చింది. చూచింది.

"జానకి కోసం వచ్చారా? మీరెందుకు బాబూ ఆవిడకు. చైర్మన్ ఉన్నాడు. నేనామాటే అన్నాను, ఒక్కరిని చూచుకొమ్మని. అంతే. వెళ్ళిపోయింది స్కూలు నుంచి. కంప్లెయింటు చేస్తుందేమో నామీద. ఉద్యోగం తీసేయిస్తుందేమో! పాపం. నిన్ను చూస్తే జాలి వేస్తుంది. ఏం చేస్తాం?"

పాల్ వింటూ నుంచున్నాడు. అతనికి ఆకాశం అడుగుల కిందికి వచ్చినట్లని పించింది. సముద్రంలో సూర్యుడు పొడుస్తున్నట్లనిపించింది.

"ఎందుకు బాబూ! అలా చూస్తావు? నేను చెప్పేది నిజం. ఆ పిల్లను నమ్మకు. అది చైర్మన్‌తో కులుకుతూంది, మరిచిపో దాన్ని. నీకేం, డాక్టరువు – కావాలంటే వేలమంది వస్తారు. దానికేముంది..."

తరవాత వినలేదు పాల్. సైకిలు ఎక్కలేదు, నడిపించుకుంటూ ముందుకు సాగాడు. పాల్ వెనక శకుంతల నవ్వింది .... కాదు - నవ్వుకుంది. ఆ రాత్రి చాలాసేపు నిద్రరాలేదు పాల్‌కు. శకుంతల మాటలే అతన్ని వేధించసాగాయి.

ఆ రాత్రి జానకికీ నిద్ర రాలేదు! శకుంతల రక్కసిలా కనిపించింది ఎందుకు తనమీద పగ దానికి? తానేం చేసింది దానిని ? పాల్ సాయంత్రం వచ్చి వుంటాడు. తానక్కడ వుండదు. నిరాశచెంది వుంటాడు. అక్కడ శకుంతల కనిపిస్తే ! కనిపిస్తే ! ! కనిపిస్తే ! ! ! శకుంతల కసి వెళ్ళ బోసుకుంటే! అవును, తనకూ, చైర్మన్‌కు సంబంధం వుందని చెప్తే! చెప్తే!! చెప్తే!!! అవును. పాల్ ఏమౌతాడు? అనుమానపడడూ? తనను గురించి ఏమను కుంటాడు? జానకికి కొండంత దుఃఖం కురిసింది. వెక్కెక్కి ఏడ్చింది. ఎప్పుడో నిద్ర పట్టింది. కలలో పాల్ కనిపించాడు. పాల్ తనకు దూరంగా ఉండమంటు న్నాడు. అతన్ని బతిమాలుతుంది తాను. తాను నిర్దోషినని చెపుతూంది. వినడంలేదు పాల్. మౌనంగా వున్నాడు. మాట్లాడడు. బొమ్మలా ఉన్నాడు. రాతి విగ్రహంలా ఉన్నాడు. తాను ఉరికింది, రాతిబొమ్మకు తల కొట్టుకుంది. రక్తం కారుతూంది. తల పగులుతూంది. ఆకాశవాణి పలికింది. అదృశ్యవాణి మాట్లాడింది. 'జానకి నిర్దోషి. ఆమెను పరిగ్రహించు' రాతి బొమ్మకు ప్రాణం వచ్చింది. పాల్ తనను కౌగిలించుకున్నాడు. తన తల పగిలి ఉంది, రక్తం కారుతూనే ఉంది. అయినా బాధగా లేదు, హాయిగా ఉంది. సుఖంగా ఉంది, ఎంత హాయిగా ఉంది! ఎంత సుఖంగా ఉంది!!

జానకి కళ్ళు తెరిచింది. పిట్టలు కిచకిచ మంటున్నాయి. వాకిట్లో ఊడుస్తున్న చప్పుడు వినిపించింది. జానకి లేచింది చూచింది. తండ్రి లేడు. వాకింగ్‌కు వెళ్ళాడు. మంచి అదను అనుకుంది పాల్ ఇంటికి వెళ్దామనుకుంది, అన్నీ చెప్పుదామనుకుంది. కలలోవలే అతని భుజం మీద తలపెట్టి ఏడుద్దామనుకుంది. చప్పున తెలిసి వచ్చింది. జీవితం కల కాదని. పాల్ ఇంట్లో పాదర్ వుంటారు. తనను అడిగితే ఏమని చెప్తుంది? అయితే ఎలా మరి? రమాదాసి కనిపించింది. రమాదాసితో చెప్పుకుంది. స్కూలుకు వెళ్ళడం—నరకంలోకి వెళ్ళడమే నన్నది. అయినా వెళ్తానన్నది. పాల్‌ను రమ్మని చెప్పమన్నది. రమాదాసి ఓదార్చింది. జానకి మనసు తనకు తెలుసునన్నది. పాల్‌తో చెపుతానన్నది. ఇద్దరినీ కలుపుతానన్నది. రమాదాసి దేవతలా కనిపించింది జానక్కి. జానకి రమాదాసిని కావలించుకుంది. ముద్దులు కురిపించింది.

జానక్కి తేలిగ్గా వుంది. ఏదో హాయిగా వుంది. చీకటి పొర విడిపోయినట్లుంది. వెలుగురేఖ కనిపిస్తున్నట్లుంది. చకచకా పనులు చేసింది జానకి. కాఫీ కప్పు పట్టుకుని తండ్రి దగ్గరకి వచ్చింది. ముకుందంగారు వాలుకుర్చీలో కూర్చుని వున్నారు. జానకిని చూచారు; కాఫీ కప్పు అందుకున్నారు. జానకిని కూర్చోమన్నారు.

"ఇవ్వాళ నుంచి ఉద్యోగం మానెయ్యి. ఇల్లు కదలకు. బిచ్చం ఎత్తుకుని బతుకుతా. నిన్ను పని చెయ్యనివ్వను. బయటికి పోనివ్వను. తల ఎత్తుకు తిరిగేటట్లు లేదు. ఆడదానికి అలుసు ఇచ్చాను. అనుభవిస్తున్నాను. ఆ కిరస్తానీ వెధవ...."

"నాన్నా! అందరినీ వెధవలనే హక్కు...."

"అవును. పొడుచుకొస్తూంది, ఎందుకు? వాడు మందు పెట్టాడు నీకు. మన ధర్మాన్నీ; సంప్రదాయాన్నీ మంట కలపడానికి వచ్చారు వాళ్ళు. నీకు మైకం కమ్మింది. వాడు వట్టి వెధవ. చవట. దుర్మార్గుడు. లుచ్చా. వాడి నీడ ఇటు పడితే వాణ్ణి కూనీ చేసి జైలుకు పోతా. ధర్మం రక్షించినట్లవుతుంది. సంప్రదాయం కాపాడి నట్లవుతుంది. ప్రాణం పోయినా సరే నిన్ను వాడి చాయలకు పోనియ్యను. విన్నావా! కదలొద్దు ఇంటినుంచి, కదిలితే ప్రాణం తీస్తా."

"నాన్నా! మన ధర్మం ప్రాణాలు తీయమంటుందా?"

"పిచ్చిగా వాగకు. వెధవగా పేలకు. నీకు కిరస్తానీ మతం తల కెక్కించాడు వాడు. నీకు మనకు సంబంధించినవేవీ బాగనిపించవు, నిన్ను కిరస్తానీలో కలవ నివ్వను. విన్నావా?"

"వాదించేదేముంది? మీ కంటే నిజంగా ఆ కిరస్తానీ నయం. నిజం నమ్ముతాడు" అని విసావిస లేచి వెళ్ళిపోయింది జానకి.

## 16

పాల్ సాయంత్రానికి స్కూలు ప్రాంతానికి చేరాడు. ఇంకా వదల్లేదు. కాస్త దూరంలో నుంచున్నాడు. గడియలు రోజులుగా గడుస్తునాయి. అక్కణ్ణుంచి బయల్దే

శాడు. మర్రి కిందికి చేరాడు. కూలబడ్డాడు. చెరువును చూచాడు. చెరువు కట్టను చూచాడు. పిట్టల్ని చూచాడు. చెట్లను చూచాడు. మొన్న అన్నీ బావున్నాయి. ఇవ్వాళ ఏదీ బావుండలేదు. అన్నీ బావురుమంటున్నాయి. మర్రి ఆకు తీశాడు. ఈనెలు తీయసాగాడు. బడిగంట వినిపించింది. గుండెలో గంట కొట్టినట్లయింది. ఏదో ఆశ మొలకెత్తింది. జానకి వస్తుంది. తనతో మాట్లాడుతుంది. తన అనుమానాలు అబద్ధం అని చెప్పుతుంది. జానకి నవ్వుతుంది. చెరువు నవ్వుతుంది. చెట్లు నవ్వు తాయి. పిట్టలు నవ్వుతాయి.

పాల్ లేచి బాటవైపుకు నడిచాడు. నుంచున్నాడు. పిల్లలు వచ్చారు. వెళ్ళి పోయారు. వస్తున్న ప్రతివారూ జానకి లాగే కనిపించారు దూరం నుంచి. ఎవరూ జానకి కాదు ఎక్కడా జానకి లేదు. చాలాసేపు నుంచున్నాడు. జానకి రాలేదు. కాళ్ళలో బరువు చేరింది. నిరాశ వ్యాపించింది. అంతా ఖాళీగా ఉంది. లోకంలో మనుషులు లేనట్లుంది. ఇంత లోకంలో తానొక్కడేనా? ఎందుకు రాలేదు జానకి? అసలు స్కూలుకే రాలేదా? ఏం? ఏమైంది? జానకి జబ్బున పడిందా? తాను డాక్టర్. ట్రీటుమెంటు చేయలేడూ? జానకి ఇంటివైపు బయల్దేరాడు. కొంతదూరం వెళ్ళి నిలిచి పోయాడు. మంచిది కాదేమో! వెళ్ళకూడదేమో? అది నిజమే! వెళ్ళరాదు. సమాజం చాలా చెడ్డది. అది నిజాన్ని ఎన్నడూ గమనించదు. ప్రేమను అసలు సహించదు. అంతే. అలా అనుకున్నాడు. వెనక్కు మళ్ళాడు. ఆస్పత్రిలో అడుగు పెట్టాడు. పేషెంట్లున్నారు, చాలామంది ఉన్నారు. మనసు పేషెంట్ల మీద లేదు. మనసు ఉగ్గ పట్టుకున్నాడు. మరల్చుకున్నాడు. పేషెంట్లలో మునిగిపోయాడు. మందులు-మాత్రలు-ఇంజక్షన్లు-గడిచిపోతూంది కాలం.

అమాంతంగా ఏడుపు వినిపించింది. పాల్ బయటికి ఉరికాడు. ఒక అమ్మాయిని రిక్షాలోంచి దింపుతున్నారు. అమ్మాయికి స్పృహ లేదు. ఎత్తుకొచ్చి టేబుల్ మీద పడుకోబెట్టారు. ఆ అమ్మాయి నిద్రమాత్రలు మింగింది. ఎందుకు అంటే చెప్పలేదు. తనకు ప్రస్తుతం దాంతో నిమిత్తం లేదు. అమ్మాయి బతకాలి. అమ్మాయితో వాంతి చేయించాడు. సూదులు పొడిచాడు. చాలాసేపు తంటాలు పడ్డాడు. అమ్మాయి కళ్ళు తెరిచింది. డాక్టర్ గెలిచాడు. డాక్టర్‌కు హాయిగా ఉంది.

"ఎందుకు మింగావు మాత్రలు?"
"ఎందుకు బతికించారు డాక్టర్?"
"ఏం? ఎందుకూ అంత నిరాశ?"
"నేను ప్రేమించాను డాక్టర్?"
"అయితే!"

"ప్రేమించినవాళ్ళు బతగ్గూడదు డాక్టర్! మా అమ్మా నాన్నకు ఇష్టంలేదు. తప్పు అతని దన్నారు. అతన్ని కొట్టారు. ఊళ్ళోంచి వెళ్ళగొట్టారు. నేనెలా బతకాలి

డాక్టర్! ఎందుకూ బతకడం? అతను లేడు. ఇంత విషం ఇవ్వు డాక్టర్–డాక్టర్ బతకాలని లేదు."

"తప్పు ఏ డాక్టరూ అలా చేయడు. బతికించడం డాక్టర్ పని. చంపడం సమాజం పని. నిరాశ చెందకు. అతను వస్తాడు. నిన్ను తీసికెళతాడు."

"డాక్టర్! మీకు మందులు మాత్రమే తెలుసు. మనసులు తెలియవు."

అమ్మాయి తల్లిదండ్రులు వచ్చారు. వాళ్ళతో ఏదో చెబుదామనుకున్నాడు డాక్టర్.

"తెలియక మాత్రలు మింగింది. రక్షించారు" అని కృతజ్ఞత చెప్పాడు తండ్రి.

డాక్టర్ మాట మింగాడు.

వాళ్ళు అమ్మాయిని తీసుకొని వెళ్ళిపోయారు. పాల్ మనసునుంచి ఆ అమ్మాయి పోలేదు. వయసు చిన్నదే-పదారు, పద్దెనిమిది ఉంటాయి. అప్పుడే జీవితం అంటే విసుగు! "ప్రేమించినవాళ్ళు బతకూడదు డాక్టర్." ఎంత అనుభవంలోంచి వచ్చిన మాట అది! ఇది అందరికీ వర్తిస్తుందా! లైలా-మజ్నూ, షీరే(న్)-ఫర్హాద్, పార్వతి-దేవదాసు! ఎవరి ప్రేమ ఫలించింది సమాజంలో? వాళ్ళ ప్రేమ కథలు చెప్పారు రచయితలు-కాబట్టి తెలిశాయి. ఎందరు ఇలా బలి అయిపోతున్నారో! జానకిని కూడా నిర్బంధించారు? ఏమో! మరి ఎందుకు రాలేదు? స్కూలుకే రాలేదా? రానివ్వలేదేమో! ముకుందంగారికి తెలిసిందేమో! ఏమో! మరి తానేం చేయాలి? ఏం చేయాలి?

ఆలోచనలు ఊపిరి సలపనివ్వడంలేదు. పేషంట్లు లేరు. వాలుకుర్చీలో కూర్చున్నాడు. కణతలు పగులుతున్నాయి. ధమనులు చిట్లేట్టున్నాయి. ఏసుదాసు కాఫీ అందించాడు. తాగుతున్నాడు, రమాదాసి వచ్చింది. ఏదో వార్త వచ్చిందనుకున్నాడు. నిటారుగా కూర్చున్నాడు, కాఫీ కప్పు కింద పెట్టాడు.

"జానకమ్మను కదలనివ్వటంలేదు అయ్యగారు. ఇల్లు కదిత్తే కాలిరక్కొడ్త నన్నడు. ఎవరో చెప్పిన్రు అయ్యగారికి, నీ పానం తీస్తనన్నడు" కథ సాంతం వినిపించింది రమాదాసి. కంటతడి పెట్టింది. కన్నీరు దాల్చింది. జానకి పరితపిస్తున్న దని చెప్పింది. ఏడ్చింది.

పాల్ మనసు కుతకుత ఉడికింది. మతం అడ్డురాకుంటే తాను జానకి ఇంటికి వెళ్ళేవాడు. ఎవరు అవునన్నా, కాదన్నా తెచ్చుకునేవాడు. ఇప్పుడలాకాదు. తాను పోలేదు. జానకి రాలేదు. 'ప్రేమించినవాళ్లు బతగ్గూడదు డాక్టర్!' తానింత విషం తిని, జానకికి ఇంత పంపితే! అంతటితో సరి. అంతా అయిపోతుంది. ఒక అధ్యాయం ముగుస్తుంది. అంతేనా? అది తప్పు. ప్రేమ గెలవాలి. ఓడడానికి వీల్లేదు. ప్రేమ పవిత్రం అయింది. అది మతాలకు అతీతం అయింది. కులాలకు అతీతం అయింది. దేశాలకు అతీతం అయింది. అది గెలవాలి. దాని గెలుపు మనిషి గెలుపు. దాని ఓటమి రక్కసికి గెలుపు! ప్రేమ గెలవాలి; గెలిచి తీరుతుంది.

"జానకి నా గుండెలో ఉంది. జానకి కోసం నా ప్రాణం ఇస్తాను." అంతే అతను అన్నమాటలు. అవే రతనాల మూటలుగా కనిపించాయి రమాదాసికి

రమాదాసి వెళ్ళిపోయింది.

ఆస్పత్రి మూశారు.

పాల్ ఇంటికి వెళ్ళాడు. అతనికి భోజనం సయించలేదు. నిద్ర రాలేదు.

# 17

తెల్లవారింది. అయినా బద్ధకంగా ఉంది. పాల్ ఇంకా మంచంలోనే ఉన్నాడు. ఏసుదాసు కాఫీకప్పుతో వచ్చాడు. ఫాదర్ జాన్ వస్తున్నారని చెప్పాడు. పాల్ లేచాడు. గబగబా ముఖం కడుక్కున్నాడు. తుడుచుకొని కుర్చీలో కూర్చున్నాడు. కాఫీ అందుకొని చప్పరిస్తున్నాడు. ఫాదర్ జాన్ ప్రవేశించారు. పాల్ లేచాడు. గుడ్‌మార్నింగ్ చెప్పాడు. ఫాదర్ ప్రతి నమస్కారం చేశారు. వచ్చి ఎదుట కుర్చీలో కూర్చున్నారు. పాల్‌కు ఒక ఫోటో అందించారు.

"గుర్తించగలవా?"

పాల్ పటాన్ని చూచాడు. అది జూలీది. జూలీ మెడిసిన్‌లో పాల్ క్లాస్‌మేట్, చాల అందమైంది. అంతేకాదు. సంపన్నురాలు. జూలీ మనసు పాల్‌మీద పడింది. జూలీ పాల్‌కు సన్నిహితం కాసాగింది. పాల్ జూలీతో మాటలు కలిపాడు. మనసు కలపలేకపోయాడు. అభిప్రాయాల్లో వారిద్దరివీ భిన్న ధృవాలు. అదే జూలీతో చెప్పాడు. జూలీ పాల్‌ను వదల్లేక పోయింది. అలాంటి పరిస్థితుల్లో విడిపోయారు వారు. జూలీ ఎన్నడు గుర్తుకురాలేదు పాల్‌కు-ఆమె పటం చూచేదాకా—ఇప్పుడు.

"అవును డాడీ! తెలుసు. జూలీ నాతో చదువుకుంది."

"ఎలాంటి పిల్ల?"

"అమ్మాయి మంచిది. బాగా డబ్బున్నవాళ్ళు."

"నీకు నచ్చిందా?"

"అంటే?"

"నీకు నచ్చితే పెళ్ళి ఏర్పాట్లు చేస్తామని రాశారు."

విచిత్రమైన వల తనమీద పడుతూంధనుకున్నాడు పాల్. మెల్లగా నవ్వాడు పాల్. ఫాదర్ నవ్వును గ్రహించలేదు. పాల్ జవాబు కోసం చూస్తున్నాడు.

"నేనా అమ్మాయిని పెళ్ళాడలేను. ఎందుకో జూలీవైపు నా మనసు పోవడం లేదు."

"జూలీ డాక్టర్. సంపాదిస్తూంది. నువ్వూ డాక్టరువు. మీ జంట బావుంటుం దని మా ఉద్దేశం".

"కావచ్చు పెండ్లాడేవాణ్ణి నేను. నాకు జూలీమీద మనసులేదు. డబ్బును పెళ్ళాడ్డం నా కిష్టంలేదు."

"ఆ అమ్మాయికి నువ్వంటే యిష్టం."

"అది నాకు తెలుసు. నా విషయమూ ఆవిడకు చెప్పాను. జూలీని పెళ్ళాడే వాళ్ళకు కొదువలేదు. నేను ఆమెను ప్రేమించలేను."

"ఏం?"

"ఏమంటే ఎలా చెప్పడం? ప్రేమ గణితంకాదు. వైద్యంకాదు. ఎందుకు కలుగుతుందో చెప్పలేం. అలాగే ఎందుకు కలగదో చెప్పలేం. సూర్యుణ్ణి చూచి కమలం ఎందుకు వికసిస్తుంది? కలువ ఎందుకు వికసించదు? తుమ్మెద పూవునే ఎందుకు వెదుక్కుంటూ పోవాలి? ఆకులమీద ఎందుకు అనురాగంలేదు? ప్రేమ మనసుకు సంబంధించింది. మనసును కనుగొన్న మహామహులు లేరు."

"ఉపన్యాసం బావుంది. వినడానికి హాయిగా వుంది. కాని నీ భవిష్యత్తును గురించి ఆలోచించు. ప్రేమ భోజనానికి పనికిరాదు, జీవితంలో ప్రేమకూడా ఒక భాగం....కాని ప్రేమ మాత్రమే జీవితంకాదు. జూలీతో నీ భవిష్యత్తు బంగారం అవుతుంది. తొందరలేదు. ఆలోచించి నిర్ణయించు."

"ఆలోచించాను. ఈ పెళ్ళికి ఒప్పుకోలేను."

"మరి?"

"అంతే"

"జానకిని ప్రేమిస్తున్నావా?"

తుపాకిలోంచి వచ్చిన గుండులా వుంది ప్రశ్న.

పాల్ తండ్రిని చూచాడు. ఫాదర్ జాన్ కళ్ళలో ఉచ్చులు కనిపించాయి. అవి ఉరితాళ్ళవలే ఉన్నాయి. పథకం తయారుచేసి తన దగ్గరికి వచ్చారు, జూలీ ఆ పథకంలో ఒక పాచిక.

"అవును."

"ఆ విషయం నాకు తెలుసు. నువ్వు జానకిని ప్రేమించగలవు. పెళ్ళాడలేవు. జూలీని పెళ్ళాడగలవు. ప్రేమించలేనంటున్నావు. పెళ్ళిలేని ప్రేమను ఏ సమాజమూ గుర్తించదు. జానకిని వుంచుకుంటావా?"

"డాడీ! మీరు చాలా దూరం పోతున్నారు. జానకిని అనే హక్కు మీకు లేదు".

"అవును. తెలుసు నాకు. అది నీకు పిచ్చి తలకెక్కించింది. ఆ వెర్రి వేయి తలలు వేస్తున్నది. ఆ ముకుందంగాడున్నాడే - వాడు స్కౌండ్రల్. మన మతాన్ని మంటకలపడానికి కంకణం కట్టుకున్న రోగి. వయసొచ్చిన పిల్లకు పెళ్ళిచేయ్యలేక పోయాడు. వాళ్ళలో ఒక్కడూ ముందుకు రావడంలేదు. అయినా కట్నాలు అడుగుతున్నారు. జానకిని నీకు తాళ్ళడానికి....."

"డాడీ! మీరు అనవసరంగా...."

"అవును, నిజం నీకు నిష్ఠూరంగా కనిపిస్తుంది, ఆ ముకుందంగాడు వేసిన వలలో పడిపోయావు. నేనేం చెప్పినా నీకు చేదుగానే వుంటుంది. డబ్బుకోసం జూలీని చేసుకొమ్మంటున్నా ననుకుంటున్నావు. కాదు. మనవాళ్ళలో బిచ్చగత్తెను చేసుకో, వప్పుకుంటాను. పోనీ, జానకినే చేసుకో, అభ్యంతరంలేదు. మతం మార్చుకొమ్మను. అప్పుడు బయటపడుతుంది వాళ్ళ రంగు. విన్నావా? నీ తల కెక్కిన పిచ్చి వదులుకో. జూలీని చేసుకో! ఆలోచించుకో. మతం మారకుండా జానకిని చేసుకోడానికి వీల్లేదు. మతం మారితే జానకే జూలీ అవుతుంది. ఆలోచించు. ఇంకా నేను బతికే వున్నానని గ్రహించు. నా శవమే చూడాలి జానకితో నీ పెళ్ళి."

ఫాదర్ జాన్ పటం అందుకున్నారు, లేచారు. వెళ్ళిపోయారు. వెళ్ళిపోతున్న ఫాదర్ని చూస్తూ నుంచున్నాడు పాల్. "మతం మార్చాలట!" అని కూలబడ్డాడు. ఆ పూట ఆస్పత్రికి వెళ్ళలేదు.

# 18

ఛైర్మన్ స్కూలుకు వెళ్ళాడు.

"చాల రోజులకు జ్ఞాపకం వచ్చానే!" అన్నది శకుంతల.

"ఊళ్ళోలేను. ఇవ్వాళే వచ్చాను."

"ఉంటేమాత్రం నేను గుర్తుకు వస్తానా?"

"సంతోషించాంగాని కాస్త జానకిని పిలిపించు."

"ఓహో మనసు అటు తిరిగిందా! ఆ మహారాణి ఎక్కడుంది? స్కూలుకు రావడంలేదుగా!"

"నీ బుద్ధి పోనిచ్చావు కావు. ఆడవాళ్ళంతా నీలాంటివాళ్ళేననుకుంటావు. సరే గాని ఆమె స్కూలుకు ఎందుకు రావడంలేదు?"

"ఏమో నాకేం తెలుసు? అది ఆ కిరస్తానీ డాక్టర్ వెంటపడింది. ఇది ఆడ పిల్లల బడి, అలా తిరగడం మంచిది కాదన్నాను. అంతే"

"అయితే నువ్వే వెళ్ళగొట్టావన్నమాట!"

"నీతీ నిజాయితీ లేనివాళ్ళకు ఈ స్కూల్లో స్థానంలేదు."

"ఓహో! నీతీ నిజాయితీని గురించి నువ్వా మాట్లాడేది - సిగ్గు లేకుంటే సరి, ఆ అమ్మాయి పాల్‌ను ప్రేమించిందేమో! నువ్వెవరు అనడానికి?"

"ధర్మం, సంప్రదాయం ఉన్నాయి. కిరస్తానీవాడివెంట తిరుగుతుంటే ఎలా ఊరుకోను?"

"నీవంటిదాని నోటపడి ధర్మం, సంప్రదాయం ఎన్నడో భ్రష్టం అయిపోయాయి. నువ్వు యిప్పటికి ఎంతరివెంట తిరిగావో! ఇదీ సంప్రదాయమేనా? నా

వెంటపడ్డావు. నేను గ్రహించలేదు. ఒక వల పన్నావు. నన్ను గుంజావు. ఇదీ ధర్మమేనా? పిల్లలకు పోయాల్సిన పాలు బజార్లో అమ్ముకున్నావు. అదే సంప్రదాయమా? పిల్లలను మతాలపేర, కులాలపేర విడగొట్టి పసివాళ్ళలో ద్వేషాన్ని రగిల్చావు. అది నీ సంప్రదాయం కావచ్చు. జానకి పిల్లల్ని ఏకంచేసింది. స్కూలుకు ఒక ఆదర్శం చూపింది. మానవతను పెంచడానికి కృషి చేసింది. ఆమెను చూచి కంట్లో నిప్పులు పోసుకున్నావు. వెళ్ళగొట్టావు. నువ్వు ఎలా ఉంటావో చూస్తా. రేపట్నుంచి నిన్ను ఉద్యోగంలోంచి తీసేస్తున్నా. జానకి హెడ్ మిస్ట్రెస్ అవుతుంది" చైర్మన్ లేచి నుంచున్నాడు.

"నేననుకున్నా, అది నిన్ను బుట్టలో వేసుకుందని"

ఆ మాట చైర్మన్‌లో అగ్గి రగిల్చింది. "ఏమన్నావ్?" అని లాగి చెంపమీద వేశాడు. శకుంతల చెంప పట్టుకుంది. లోకం గిర్రున తిరిగినట్లయింది. వెళ్ళిపోతున్న చైర్మన్ మసక మసగ్గా కనిపించాడు.

* * *

చైర్మన్ నేరుగా ముకుందంగారింటికి వెళ్ళాడు. జానకి కనిపించింది. ఎక్కడ లేని మార్పు కనిపించింది జానకిలో.

ముఖంలో ఉండాల్సిన కళా, కాంతీ మాయమైనాయి. ముఖం ఉదాసీనంగా ఉంది. పాలిపోయి తెల్లగా ఉంది. కళ్ళు లోతుకుపోయి నిర్జీవంగా ఉన్నాయి. కళ్ళకింద నల్లని చార లేర్పడ్డాయి. జానకి అని గుర్తుపట్టేట్టులేదు. జానకి చేతులు జోడించింది.

"ఏమిటీ మార్పు?'' అన్నా డాశ్చర్యంగా చైర్మన్ ముకుందరావుగారితో.

"ఒంట్లో బాగోటంలేదు" అన్నారాయన.

"వైద్యం చేయించడంలేదా?"

"ఎందుకు లేదు. తేరుకోలేకపోతోంది. గాలిదోషమేమోనని అనుమానంగా వుంది."

"గాలి దోషాలేమిటండీ మీ పిచ్చిగాని. అవసరం అయితే పట్నం తీసి కెళ్ళండి. మనవాళ్ళున్నారక్కడ" అని ముకుందంగారితో చెప్పి జానకితో "శకుంతల మిమ్మల్నేమన్నా అన్నదా?" అని అడిగాడు. జానకి తల వంచుకుంది. మాట్లాళ్ళేదు. ఆమె ముఖంమీద చీకట్లు కమ్ముకోవటం గమనించాడు చైర్మన్.

"అర్థం అయింది! ఆమెను ఉద్యోగంనుంచి తొలగిస్తున్నాను."

జానకి తలెత్తింది. కంగారుగా చైర్మన్ ముఖంలోకి చూచింది.

"ఆమె నన్నేమీ అనలేదు. ఆమెను తొలగించకండి" అంది.

''అందరూ మీలాంటి వాళ్ళంటే..."

"నన్ను పొగడకండి. మంచితనం మనిషికి పనికిరాదు, కూర్చోలేను. వస్తాను. మన్నించండి."

జానకి వెళ్ళిపోయింది. చూస్తుంటే ఏదో కంకాళం నడిచినట్లనిపించింది. చైర్మన్ గొంతులో తడి చేరింది.

"ముకుందంగారూ! నాకేదో భయంగా ఉంది. రత్నంలాంటి అమ్మాయి. ఇలా తయారయింది. శ్రద్ధచేయండి. నా చేతనయినంత సహాయం చేస్తాను. వస్తా మరి."

చైర్మన్ వెళ్ళిపోతుంటే చూస్తూ నుంచున్నారు ముకుందంగారు. "ఎందుకిలా పొగుడుతాడు తన కూతుర్ని? ఆ కిరస్తానీవాడు పంపలేదుకదా!" అనుకున్నారు ముకుందంగారు.

పాల్ బ్రతికి ఉన్నాడు. అంతే అది అతని కదలికవల్ల తెలియాలి. పాల్ చిక్కిపోయాడు. గడ్డం మాసిపోయింది. ఎముకలు కనిపించడంలేదు. కళ్ళు పీక్కుపోయి ఎండిపోయిన బావుల్లా వున్నాయి.

పాల్ ఇంటినుంచి కదలడు. సాయంత్రందాకా గదినుంచి బయటికిరాడు. సాయంత్రం బయల్దేరాడు. స్కూలువైపు సాగుతాడు. స్కూలు బయట నిలుస్తాడు. జానకి వస్తుందని ఆశ. రాదని తెలుసు. అదొక ఆలాపన. అందులో ఏదో ఓదార్పుంది. స్కూలు వదుల్తారు. అందరినీ చూస్తాడు. అంతే జానకి రాదు. పాల్ అక్కణ్ణించి బయల్దేరాడు. మర్రికింద కూర్చుంటాడు. మర్రిని చూస్తాడు. జానకి కనిపిస్తుంది. చెరువును చూస్తాడు. జానకి కనిపిస్తుంది. చెట్లను చూస్తాడు. జానకి కనిపిస్తుంది. జానకి పూర్వంలా లేదు. ఆమె నవ్వదు. మాట్లాడదు. మౌనంగా కూర్చుంటుంది. చీకట్లు వస్తాయి. లేస్తాడు పాల్. యంత్రంలా నడుస్తాడు. ఆస్పత్రికి చేర్తాడు.

*　　　*　　　*

ఆ రోజు చైర్మన్ వచ్చాడు.

డాక్టర్ అభివందనం చేశాడు. ఇద్దరూ కూర్చున్నారు.

"ఏమిటలా అయిపోయారు?"

చిరునవ్వులాంటిది నవ్వాడు పాల్. ఆ నవ్వులో జీవం లేదు.

"డాక్టర్! జానకీ, మీరూ ప్రేమించుకున్నారని విన్నాను. మీ మధ్య నిలిచిన అడ్డుగోడలేమిటో నాకు తెలుసు. ఇలా దూరంగా ఉంటూ ఒకరికోసం ఒకరు క్షీణించిపోవటంలో అర్థంలేదు. ఏదోటి చేయాలి. దానికోసం నన్నేసహాయం చేయమన్నా చేస్తాను. నా సహాయం ఏ రకంగా కావాలో చెప్పండి." అన్నాడు

మళ్ళీ చిరునవ్వులాంటిది నవ్వాడు పాల్. అది నవ్వులా లేదు.

"చైర్మన్‌గారూ! ఒక ఉపకారం చేయండి. మేమిద్దరం చచ్చిపోతే మా ఇద్దర్నీ ఒకేచోట సమాధి చెయ్యండి."

"డాక్టర్!" చైర్మన్ కలవరపడుతూ "అలా అనకండి డాక్టర్! మీరిద్దరూ

మానవతామూర్తులు. మీరు ఓడిపోతే – మానవత ఓడినట్లు. మీరు చనిపోతే–ప్రేమ ఇగిరిపోయినట్లు. మీరు చదువుకున్నవారు. ఇలా నిరాశచెందితే ఎలా?"

"అంతే, చైర్మన్‌గారూ! ఇంకా లోకంలో మానవత ఉందంటారా? ప్రేమ నిలుస్తుందంటారా? కల్ల హుఁ! అంతే. మీరు అమృతమూర్తులు. మీ పేరుతో నాలో విషం చిలకాలని చూశారు. ఈ లోకం ఏం చేయలేదు? లోకంలో చావుకు సామగ్రి చాలాఉంది. బతకడానికే నీడలేదు."

"డాక్టర్! మీరు అనుమానిస్తున్నారా? దైవసాక్షిగా చెపుతున్నాను. జానకిగారు నాకు సోదరి. ఆమె దేవత; మానవతామూర్తి."

"నాకు తెలుసు చైర్మన్‌గారూ! జానకిని గురించి నాకంటే తెల్సినవారు లేరు. లోకం తీరు చెప్పాను. అది మీకూ మసి పూయగలదు! నా కోరిక మన్నించండి. అంతే. మా ఇద్దరినీ ఒకేచోట కాల్చండి. చాలు, బతికి కలుసుకోలేక పోయాం. మరో జన్మ ఉంటే...."

"కాదు మీరు ఈ జన్మలోనే కలుసుకుంటారు. భగవంతుడు ప్రేమమయుడు. కరుణామయుడు. దయామూర్తి."

చైర్మన్ పాల్‌కు ఏదేదో ధైర్యం చెప్పి వెళ్ళాడు.

*    *    *

జానకికి పెళ్ళి చేయాలని ముకుందంగారి పట్టు. వరుని కోసం వెదకసాగాడు. అప్పుడు తెలిశాయి కొన్ని వాస్తవాలు. సంప్రదాయాలూ, ఆచారాలు డబ్బు కింద కొరగానివని తెలిసి వచ్చింది. ఎవర్ని చూచినా కట్నాల మీదనే కూర్చు న్నారు.

ఒకనాడు శాస్త్రిలు వచ్చాడు. ఒక సంబంధం కుదిరించినట్లే చెప్పాడు. వరునికి అట్టే వయసు లేదు. నలభై, నలభై అయిదు లోపే. ఈ మధ్యనే భార్య పోయింది. ఆస్తి బాగానే వుంది. కాస్త అవిటి. ఎడం చేయి చచ్చు. పిల్లలున్నారు ముగ్గురు. వారిని చూచుకోడానికి తల్లి కావాలి. జానకి పటం చూశాడు వరుడు. వప్పుకున్నాడు. పిల్లను చూడ పని లేదన్నాడు. కట్నం కొద్దిలోనే వప్పు కున్నాడు. పెళ్ళి అట్టహాసంగా చేయనవసరం లేదన్నాడు.

బాగానే వుందనుకున్నారు ముకుందంగారు. కాని పితృహృదయం ఘోషిం చింది. బంగారం లాంటి పిల్లను రెండో పెళ్ళివాడికి కట్టబెట్టడమా? ఆశలు అందరికీ ఉంటాయి. అవి నెరవేరడానికి డబ్బు కావాలి. ఉన్నంతలో ఇంతకన్న మంచి వరుణ్ని కొనలేరు. సమాధానపరచుకున్నారు. షావుకారి దగ్గరికి వెళ్ళారు. ఇల్లు తాకట్టు పెట్టారు. డబ్బు సమకూర్చుకున్నారు. అడ్వాన్సు కూడా చెల్లించారు వరునికి.

జానకి కీ పెళ్ళి విషయం తెల్పలేదు. తెల్పడం వల్ల ప్రయోజనం లేదు.

ఆమె ఒప్పుకోదు. అది తెలుసు ముకుందంగారికి. పెళ్ళి రెండు రోజులుందనగా తెల్పాలనుకున్నారు.

శాస్త్రిగారు ముహూర్తాలు లేకున్నా పెట్టారు. అతనికి తొందరగా ఉంది. ముహూర్తం పెట్టుకున్నారు. ఆ తరువాత మరో విషయం తెలిసింది—వరునికి ఒక ఉంపుడుకత్తె వుందని. ముకుందంగారు విలవిల్లాడారు. ఆ తరువాత మరో విషయం తెలిసింది—ఆస్తి పాస్తులేమీ లేవనీ, జానకి ఉద్యోగం మీద ఆధారపడాల్సిందేననీ— జానకిని కసాయికి అప్పగిస్తున్నానా అనుకున్నాడు. ఆ డాక్టరును చేసుకుంటేనే సుఖపడ్తుందేమో అనుకున్నారు. అంతలోనే వేదాంతం గుర్తుకు వచ్చింది. ఖర్మ అనుకున్నారు. జానకి నొసట రాసి ఉన్నది రెండో పెళ్ళివాడే! దాన్ని ఎవరు చెరపగలరు?

పెళ్ళి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

ముహూర్తం దగ్గర పడ్డది—ఎల్లుండే పెళ్ళి.

ముకుందంగారు జానకి దగ్గరికి వెళ్ళారు. జానకి పడుకొని ఉంది. తండ్రిని చూచింది. లేచి కూర్చుంది. ముకుందంగారు మంచం మీద కూర్చున్నారు. కూతురు తల నిమిరారు.

"అమ్మా! జానకీ! వరుడు కుదిరాడమ్మా నీకు"

జానకి మాట్లాడలేదు. తల వంచుకుంది.

"కూతురుకు పెళ్ళి చేయడం తండ్రి కర్తవ్యం. ఈ పెళ్ళి ద్వారా నీకెంత న్యాయం చేకూర్చుతున్నానో చెప్పలేనమ్మా! అయితే, తండ్రి బాధ్యత నేను నెరవేర్చు తున్నానమ్మా! ఈ వృద్ధుడితో సహకరించు తల్లీ!" అన్నారు.

# 19

తెల్లవారితే పెళ్ళి. ఇల్లు సందడిగా వుంది. పందిళ్ళు వేశారు. తోరణాలు కట్టారు. బాజాలు మ్రోగాయి. జానకికి తలంటి పోశారు. పెళ్ళిపిల్లని చేశారు. జానకి మౌనంగా వుంది. యంత్రవతుగా కదులుతూంది. తండ్రికి మొక్కమన్నారు. ఆమె మొక్కింది. తండ్రి దీవించారు. అది ఆమెకు వినిపించలేదు. తల్లి పటానికి మొక్కమన్నారు.

జానకి మొక్కింది. ఆమె కళ్ళలో నీళ్ళు నిండేయి, దుఃఖం ఉబికి వచ్చింది. "అమ్మా!" అని ఏడ్చేసింది. గుండెను చీల్చుకొని వచ్చిన పదం అది. ఎక్కెక్కి ఏడ్చింది జానకి. దాగిన దుఃఖం సాంతం వడిసేదాకా ఏడ్చింది. ఓదార్చారు అమ్మలక్కలు, ఏడవరాదన్నారు.

ఎంగిలి చేశాననిపించుకుంది. జానకి గదిలో దూరింది. ఇంట్లో సంరంభమూ తగ్గింది. ఒక్కొక్కరే వెళ్ళిపోయారు. ఇల్లు మామూలు ఇల్లయింది.

సాయంకాలం అయింది. చీకటి పడుతున్నది. రమాదాసిని పిలిపించింది జానకి. రమాదాసి జానకిని చూచింది. దాచుకున్న దుఃఖం పొంగింది. రమాదాసిని పట్టుకొని ఏడ్చేసింది. రమాదాసి ఓదార్చింది. జానకి ఒక ఉత్తరం ఇచ్చింది. పాల్‌కు అందించమని చెప్పింది.

పాల్ ఆస్పత్రిలో ఉన్నాడు. వాలు కుర్చీలో కూర్చున్నాడు. అతని మనసు పరిపరి విధాలా పరిభ్రమిస్తూంది.

రమాదాసి గదిలో అడుగు పెట్టింది.

"అయ్యా! అమ్మ ఏడుస్తున్నది. నా గుండె పగులుతున్నది" అని బావురు మంది.

పాల్ భరించలేకపోయాడు. అక్కణ్ణుంచి లేచాడు. గదిలోకి వెళ్ళాడు. స్తంభాన్ని పట్టుకొని కుమిలి కుమిలి ఏడ్చాడు.

రమాదాసి దుఃఖాన్ని దిగమింగింది. కళ్ళు తుడుచుకొని గదిలోకి వెళ్ళింది. "ఇగో! ఈ చీటీ ఇయ్యమన్నది. నాకేమో భయంగా వున్నది." అని చీటీ అందించింది.

ఉత్తరం అందుకున్నాడు పాల్. కుర్చీలో కూలబడ్డాడు.

"నా ప్రాణంలో ప్రాణం పాల్‌గారికి—

సహనం చచ్చిపోయింది. బతికి ప్రయోజనం లేదని తేలిపోయింది. ఎదిరించే శక్తి అంతరించింది. చావుతప్ప గత్యంతరం లేదు. హాయిగా చావాలని వుంది. మంచి విషం పంపించండి. పంపకుంటే వేరే ఉపాయాలు చూసుకోవాలి. ఈ రాత్రికి చచ్చిపోవాలి. తప్పదు. తెల్లారితే పెళ్ళి.

మీ ప్రియురాలు
జానకీ పాల్"

పాల్ నెత్తిన కొండచరియ విరిగి పడింది. నిశ్చేతనుడైనాడు కొన్ని క్షణాలు. నక్షత్రాలు టపటపా రాలిపడుతున్నట్లనిపించింది.

జానకి చనిపోతుంది. ఉండదు. వెళ్ళిపోతుంది. జానకి ప్రేమమూర్తి. ఆమె చావరాదు, ఏం చేయాలి తాను? తాను వెళ్తాడు. జానకిని లాక్కొస్తాడు. ముకుందం గారు గొడవ చేస్తాడు. జనం కూడ్తారు, తిడ్తారు, కొడ్తారు. రాళ్ళు విసురుతారు. తమను బతకనీయరు. సమాజం ప్రేమను సహించదు. వీల్లేదు. వేరే గతిలేదు. జానకి చనిపోతుంది. జానకి లేని లోకం ఏది? జానకి లేని బతుకేమి? జానకి బలి అవుతుంది. తాను బలి అవుతాడు. అంతే బలి కావాల్సిందే!

పాల్ లేచాడు. గబగబా ఏవో మందులు తీశాడు. కాగితం అందుకున్నాడు. ఉత్తరం రాశాడు. రమాదాసిని పిల్చి "మందు జానకిగారికి ఇవ్వు. వళ్ళు బావుండ లేదని రాసింది. దీనితో బాగవుతుంది. మందు ఎలా వేసుకోవాలో రాశాను. ఉత్తరం ఇవ్వు. ఎవరికీ చూపకు."

"ఇంకేమన్న చెప్పమంటారా? తెల్లారితే పెళ్ళి"

"అన్నీ అందులో రాశా" పాల్ కళ్ళలో నీళ్ళు నిండాయి. "నువ్వెళ్ళు"

రమాదాసి మాట్లాళ్ళేదు. బయట ఏసుదాసు నుంచున్నాడు. "ఏమన్నారు?" అడిగాడు.

"చీటిచ్చిండు. మందిచ్చిండు, ఎవ్వరికీ చూపిచ్చొద్దన్నడు, నాకయితే గుబులు గున్నది."

"నా కట్లనే ఉన్నది. పీచుపీచు మంటంది. ఏం చేద్దమంటవు?

"ముంగల నడుప్ లోన ఇంటడు"

ఇద్దరూ నడిచారు-కొంతదూరం. చీకట్లో చెట్టుకింద నుంచున్నారు. "ఎట్ల, ఏం చేతమంటవ్?" అడిగింది రమాదాసి.

"మనకు చదువు రాదాయె" విచారం వ్యక్తపరిచాడు.

"చదువొచ్చినోరికి ఇద్దమా! చదివింతమా?"

"చైర్మన్ దొర మంచోడు"

"అవు"

"ఆయనకు చూపిస్తే?"

"బాగనే ఉంటది"

ఇద్దరూ చైర్మన్ ఇంటికి వెళ్ళారు.

చైర్మన్ వారిని చూచాడు. "ఏమిటిలా వచ్చారు?" అడిగాడు.

"చీటి ఎవ్వరికి చూపిచ్చొద్దన్నడు డాక్టర్ దొర. మాకు గుబులుగున్నది. మీ కాడికొచ్చినం" జరిగిందంతా చెప్పింది రమాదాసి.

చైర్మన్ గబగబ చీటీ అందుకుని చదివాడు.

"ప్రాణప్రియ జానకిగారికి

మీరన్నది నిజం. సహనం చచ్చిపోయింది. మనం ఓడిపోయాం. ఎదిరించే శక్తి అంతరించింది. మనం బ్రతికి ప్రయోజనం లేదు. మీరు కోరినట్లు విషం పంపుతున్నాను. అది చాలా శక్తివంతం అయింది. సరిగ్గా రాత్రి రెండుగంటలకు నేను తింటున్నాను. మనం రేపటి ఉదయం చూడం. మన ఇద్దరినీ ఒకేచోట సమాధి చేయించమని చైర్మన్‌గారిని కోరాను. వారు మంచివారు, అలాగే చేస్తారు.

మిమ్మల్ని మరువలేని
జానకి ప్రియుడు పాల్"

చైర్మన్ కళ్ళల్లో గిర్రున నీరు తిరిగింది. జానకి, పాల్ కనిపించారు. వారిద్దరూ పూలదండలు మార్చుకున్నారు. వెంటనే ఇద్దరి కళేబరాలు కనిపించాయి. వీల్లేదు, వారు చావడానికి వీల్లేదు. ప్రేమ జయించాలి. మానవత జయించాలి.

మూర్ఖత్వం మంటకలివాలి, మౌఢ్యం ఓడిపోవాలి. అవును ఓడాలి, వాటిని ఓడించాలి.

"మందు ఇచ్చారట డాక్టర్-ఏది?" ప్రెసిడెంట్ రమాదాసిని అడిగాడు. రమాదాసి తీసి అందించింది.

"అమ్మగారికి మందు అక్కర్లేదు, నేను చెప్పినట్లు చేయండి, ఎవరికీ తెలియొద్దు. తెలుస్తే ప్రాణాలమీదికి వస్తుంది" అని వాళ్ళిద్దరికీ ఏం చేయాల్సిందీ ఎలా చేయాల్సిందీ వివరించి చెప్పాడు. వాళ్ళిద్దరూ సమ్మతించారు. దండాలు పెట్టారు, వెళ్ళిపోయారు.

# 20

"డాక్టర్ కలిశారా?" అడిగింది జానకి.

"డాక్టర్ దొర కలిసిండు, ఉత్తరం ఏమి ఇయ్యలే, రాత్రి ఒంటిగంటకు గుడి కాడికి రమ్మన్నడు. నిన్ను తీసుకురమ్మన్నడు. విన్నవా?" రమాదాసి ముఖంలో ఉత్సాహం ఉంది. ధ్వనిలో అది కనిపిస్తోంది.

"ఏమన్నారు? ఎక్కడికి రమ్మన్నారు? రమ్మన్నారా నన్ను? నిజం! ఎప్పుడు? ఎక్కడికి? ఎలా? జానకికి అమాంతంగా సత్తువ వచ్చేసింది, ఉత్సాహం పొంగింది. రమాదాసి భుజాలు పట్టుకొని ఊపేసింది. రమాదాసి వివరాలు చెప్పింది.

జానకి హుషారుగా లేచింది, దేవుని గదిలోకి వెళ్ళింది, వత్తులు వెలిగించింది. విగ్రహాలు వెలిగాయి. పూలతో పూజ చేసింది. మంగళహారతి యిచ్చింది–హారతితో ముకుందంగారి దగ్గరికి వచ్చింది. ముకుందంగారు హారతి అందుకున్నారు. కళ్ళకద్దుకున్నారు. జానకిలో మార్పును గమనించారు. మనసు మార్చుకున్నదనుకున్నారు. పెళ్ళంటే అది వేరు, ఇలాగే మారిపోతారు ఆడపిల్లలు అనుకున్నారు.

జానకి విగ్రహాలముందు కూచుంది, చేతులు జోడించింది, కళ్ళు మూసుకుంది, ప్రార్థించింది. తన పథకం నెగ్గాలని ప్రార్థించింది జానకి. ధ్యానించింది. చాలసేపు అలా కూర్చుండిపోయింది. తరవాత లేచింది. తండ్రితో కూడా భోజనం చేసింది.

రాత్రి పదకొండు అయింది. ముకుందంగారు మంచంలో మేనువాల్చారు. వారికి ఏదో పెద్ద బరువు దించుకున్నట్లుంది. జానకి సమాధానపడింది, పెళ్ళి జరిగిపోతుంది, అన్నీ కుదుట పడ్తాయి. ముకుందంగారికి కన్ను మలిగింది. నిద్ర ఒడిలోకి జారిపోయారు.

జానకి గదిలో పడుకుంది. ఆమె కన్ను మలగటంలేదు. క్షణాలు బరువుగా దొర్లుతున్నాయి, కాలం కదులుతున్నట్లు కనిపించడంలేదు. రమాదాసి పక్కనే

పడుకుంది. ఆమె నిద్రపోతుందేమోనని భయం జానకికి. తేపా లేపుతున్నది. ఇంకా పన్నెండే కాలేదు.

"ఒంటిగంట ఎప్పుడవుతుందే!" అడిగింది జానకి.

"అయితదమ్మా. ఎంత? ఒక గంట! వస్తడు అడికి డాక్టర్‌దొర ఫికరు పెట్టుకోకు."

"కాదే! నాన్నగారు మెలకువతో ఉంటారేమో! ఎలా బయటపడ్తాం? చూసిరా కాస్త. నాకేదో గుబులుగా ఉంది."

రమాదాసి బయటికి వెళ్ళి వచ్చింది.

"గుర్రుకొట్టి నిద్రపోతున్నారమ్మా! దేవుడున్నాడమ్మా, దయతలుస్తాడు, భయపడకు, అంత బాగానే అయితది"

జానకి గుండెతో పాటు గడియారం ఆడుతున్నది. ముళ్ళు కదులుతూనే ఉన్నాయి. 12-45 అయింది, "ఇహ పోదాం లేవవే"

రమాదాసి లేచింది.

ఇద్దరూ నడుస్తున్నారు చీకట్లో - చిమ్మచీకటి. చుక్కలు మిలమిల లాడుతున్నాయి. కుక్కలు అరుస్తున్నాయి. వేటినీ లెక్కపెట్టడంలేదు వారు. సాగిపోతున్నారు గబగబా. గుడి దగ్గరికి వచ్చేశారు. అక్కడేదో అలికిడి వినిపించింది. మనుషుల జాడలు కనిపించాయి. పాల్ వచ్చాడని ధృవపరచుకుంది జానకి. ఉరికింది.

"జానకీ!" పాల్ అన్నాడు.

"పాల్!" జానకి అన్నది.

ఆ పిలుపులో అమృతం ఉంది. వారి గుండెల్లో అమృతవర్షం కురిసింది. పాల్ ముందు జానకి! జానకి ముందు పాల్!

వారి చూపులకు నాల్కలొచ్చాయి-గుండెలొచ్చాయి – పెదవులొచ్చాయి, తబ్బిబ్బవుతున్నారు-ఉక్కిరి బిక్కిరి అవుతున్నారు.

వారి ఆనందానికి అవధుల్లేవు.

చైర్మన్ వారిని చూచాడు. అతని గుండె చమర్చింది, కళ్ళు చెమ్మగిల్లాయి. మృత్యువు ఎంత కర్కశమైంది! ఇంత ఆనందాన్ని నలిపేసేది కదా అనుకున్నాడు.

"ఇహ కదలండి, ఇక్కడ క్షేమం కాదు"

చైర్మన్ మాటలు విని ఈ లోకంలోకి వచ్చారు ఇద్దరూ.

"ఎవరు! చైర్మన్‌గారా" ఇద్దరూ ఆశ్చర్యం ప్రకటించారు.

"అవునుగాని త్వరగా బయల్దేరండి, జీపు సిద్ధంగా ఉంది. బస్తీకి పోదాం"

"మీరా! మీరేనా దీనికి కారకులు? మీరేనా మమ్ముల మృత్యువు నుండి రక్షించినవారు?"

"కాదు, నేను కాదు, మీ ప్రేమ, మీలోని మానవత. ప్రేమ గెలుస్తుంది, మానవత గెలుస్తుంది. నేనేం చేయలేదు, అదిగో వాళ్ళిద్దరు అక్కడ నుంచున్నారు. వారు మానవమూర్తులు. వారిని అభినందించాలి"

ఇద్దరూ అటు చూచారు. ఏమీ ఎరగనట్లు నుంచొని ఉన్నారు రమాదాసి, ఏసుదాసు.

"రమాదాసీ!" అని కౌగలించుకొంది జానకి.

"ఏసుదాసూ!" అని ఆలింగనం చేసుకున్నాడు పాల్.

"చూశారా! జీవితంలో ఎంత ఆనందం ఉందో! చనిపోతా మన్నారే!"

"బైర్మన్‌గారూ! మీరు వాస్తవంగా మానవతామూర్తులు. మీలాంటి వారుంటే అనేకమంది జీవించగలరు; ఆనందించగలరు. మానవసేవ చేయగలరు"

"సరేగాని నడవండి, ఆలస్యం మంచిదికాదు."

అంతా కదిలారు. జీపులో ఎక్కారు. జీపు కదిలింది.

# 21

తెల్లవారింది. ముకుందంగారు లేచారు. మామూలుగా గుమ్మందగ్గరికి వెళ్ళారు. గడియ వేయలేదు, తలుపులు దగ్గరగా వేసి ఉన్నాయి. ముకుందంగారి గుండె పగిలింది. దొంగలు పడ్డారనుకొన్నారు, దోచుకుపోయారనుకున్నారు. గబగబా గదిలోకి ఉరికారు, జానకి కనిపించలేదు. పెట్టెలు, సామగ్రి యధాతథంగా ఉన్నాయి. బండపడ్డట్లయింది నెత్తిన. జానకీ జానకీ అంటూ దొడ్లోకి ఉరికారు, జానకి కనిపించలేదు. రమాదాసి లేదు. గబగబా వాకిట్లోకి వచ్చారు. కూలబడ్డాడు.

"కిరస్తానివాడు నన్ను ముంచాడు. జానకిని లేవదీసుకు పోయాడు" అని ఏడ్పు లంకించుకున్నారు. తల బాదుకోవడం మొదలు పెట్టారు, గుండె బాదుకున్నారు, కొంప కూలిపోయినట్లు ఏడ్పు సాగించారు.

జనం ఒక్కొక్కరే కూడసాగారు. షావుకారు వచ్చాడు. శకుంతల వచ్చింది. జనంలో గుసగుసలు బైల్దేరాయి. చర్చలు సాగాయి. అన్యాయం జరిగిందనుకొన్నారు కొందరు. అక్రమం జరిగిపోయిందన్నారు మరికొందరు. ధర్మం లోపిస్తూందన్నారు కొందరు. కలికాలం ఇలాంటి బుద్ధులే పుడ్తాయన్నారు అన్యులు.

"దీన్ని ఎదుర్కోవాలి. ఫాదర్ జాన్‌ను అడగాలి" అన్నది శకుంతల.

"అంతే. అలాగే చేయాలి. నడవండి" అన్నారు షావుకారు.

ముకుందంగారు కూలబడ్డవారు లేచారు. తలుపులు వేసి బయలుదేరారు.

జన సమూహం ఫాదర్ జాన్ ఇంటిమీదకి పోయింది. గోలమొదలుపెట్టింది. కేకలు వేసింది.

ఫాదర్ జాన్‌కు మెళుకువ వచ్చింది. లేచారు. కాస్త కంగారుపడ్డారు. తలుపు తీశారు. బయటికి వచ్చారు.

"మా జానకిని అప్పగించు" ముకుందంగారు కేకపెట్టారు.

ఫాదర్ జాన్ కళ్ళు నల్చుకున్నారు. చూచారు. జనం కనిపించింది. కాస్త బెదిరారు "జానకి ఏమిటి! ఏమికథ!" అడిగారు.

"నాలిముచ్చు, తెలియనట్లడుగుతున్నాడు. చెప్పు ఎక్కడికి పంపించావో?" శకుంతల అరిచింది.

"రావణాసురునివలె ఉన్నాడు. చెప్పించాలి, ఎక్కడికి పంపించాడో?" షావుకారు అన్నాడు.

"నా కంతా అయోమయంగా ఉంది, నాకేమీ తెలియదు. నిజం, ఉండండి, పాల్ ఉన్నాడేమో చూసివస్తా" అని లోనికి ఉరికాడు.

"వీడు వేసిన నాటకమే! బొంకుతున్నాడు. అందరినీ కిరస్తానను చేయాలను కుంటున్నాడు, వెధవ" ముకుందంగారు అన్నాడు.

"పాల్‌కూడా లేడు. నాకేదో భయంగా ఉంది, ముకుందంగారూ! నాకేమీ తెలియదు, వాళ్ళిద్దరూ లేచిపోయినట్లున్నారు. నాకది ఇష్టంలేదు, సత్యం చెపు తున్నాను. వాళ్లు బస్తీకి వెళ్ళుంటారు. ఈ పెళ్ళి జరక్కుండా ఆపాలి. మీకూ ఇష్టం లేదు, నాకూ ఇష్టంలేదు. పెళ్ళి ఎలా జరుగుతుంది? పదండి పోదాం బస్తీకి, మనిద్దరం కలిసి ఈ కార్యం సాధించాలి"

ముకుందంగారి నోట మాట రాలేదు. వారు కళ్ళప్పగించి చూస్తున్నారు.

"ఏమిటి చూస్తారు? ఫాదర్ చెప్పింది బావుంది, బయలుదేరండి బస్తీకి'' శకుంతల నడుం బిగించింది.

"సరే నడవండి'' అన్నారు ముకుందంగారు.

ఫాదర్ జాన్, ముకుందంగారు కలిసి కదిలారు, కలిసి సాగారు, కలిసి నడిచారు, వరద ముంచిన్నాటివలె నడిచారు.

షావుకారు ఉరికాడు, కారు తెప్పించారు.

ఫాదర్ జాన్, ముకుందంగారు కారెక్కారు.

కారు కదులుతూంది, శాస్త్రిగారు ఉరికి వచ్చారు. కారును ఆపుచేశారు. కాస్త బయటికి రమ్మని ముకుందంగారిని పిలిచారు. ముకుందంగారు కారు దిగారు. శాస్త్రి గారు చాటుకు తీసికెళ్ళారు. చెవిలో చెప్పారు. జానకి శీలాన్ని గురించి అనుమాన మట, పెళ్ళివారు రావడంలేదట"

ముకుందంగారు మండిపోయారు.

"వెధవ! జానకి శీలాన్ని శంకిస్తాడూ! అవిటి వెధవ, రెండో పెళ్ళివాడికి ఇస్తాననటమే నా తప్పు. బిడ్డను బావిలో తోసుకోడానికి సిద్ధపడ్డాను మనవాళ్ళని. పోనీ చేసుకోమంటే పీడా విరగడయింది.''

శాస్త్రిగారు ముకుందంగారి ముఖం చూస్తూ నుంచున్నారు.

"జానకి మంచిపనే చేసిందేమో!! మనవాళ్ళందరికీ కట్నాల కొరివి దయ్యాలు పట్టాయి. మతమేమిటి? ధర్మమేమిటి? అన్నీ డబ్బే అయిపోయాయి మనవాళ్ళకు" అన్నాడు.

ముకుందంగారిముందు లోకం తలకిందులయినట్లు కనిపించింది. పరిసరాలు గిరగిరా తిరుగుతున్నట్లనిపించింది. శాస్త్రిగారిని ఎగాదిగా చూచారు. శాస్త్రిగారి ముఖాన విభూతి రేఖలున్నాయి. గుండ్రని కుంకుమ బొట్టుంది, భుజాన జంధ్యం ఉంది, లొండిన నశ్యం కాయవుంది.

"మతమేమిటి? ధర్మమేమిటి? అన్నీ డబ్బే అయిపోయాయి మనవాళ్ళకు" ఈ మాటలే వినిపిస్తూ వున్నాయి ముకుందంగారికి. ముకుందంగారు అక్కడ్నుంచి కదిలారు, కారు ఎక్కారు. కూర్చున్నారు. వారి వదనంలో ఒక విచిత్రం అయిన మార్పు స్ఫురించింది. కారు స్టార్టు అయింది.

* * *

బస్తీలో కళ్యాణ మంటపం, వేదిక అలంకరించి ఉంది. అరటిచెట్లు మామిడి తోరణాలతో కళకళలాడుతూంది. సభాస్థలిలో కొద్దిమంది యువకులు, యువతులు ఉన్నారు చైర్మన్ మిత్రులు. కొందరు పెద్దలు కూడా విచ్చేశారు.

వేదికమీదికి జానకి వచ్చింది. ఆమె వెనుక పాల్ వచ్చాడు. ఏసుదాసు, రమాదాసి పూలమాలలు తీసుకొని వేదికమీదికి వచ్చారు. చైర్మన్ అంతకుముందే వేదికమీద ఉన్నాడు.

రమాదాసి పూలమాల అందించింది జానకికి.

జానకి పూలదండ పాల్ మెడలో వేసింది.

ఏసుదాసు పూలదండ అందించాడు పాల్‌కు.

పాల్ పూలదండ జానకి మెడలో వేశాడు.

సభలో చప్పట్లు. చైర్మన్ ముందుకు వచ్చారు.

వీరిద్దరిది నిజమైన ప్రేమ. ప్రేమకోసం గొప్ప త్యాగానికి తలపడ్డారు! ప్రేమ భగవత్స్వరూపం. భగవానుడు కరుణించాడు. వీరిద్దరికీ మానవతలో అపారమైన విశ్వాసం ఉంది. మీరంతా ఆశీర్వదించారు, వీరు ఖార్యాభర్తలైనారు. జానకి మానవతామూర్తి. ఆమె మాట్లాడితే సెలయేళ్ళు పారినట్లు చెట్లు చిగిర్చినట్లు ఉంటుంది. జానకిగారు మాట్లాడాలని ప్రార్థిస్తున్నాను."

జానకి ఇసుమంత సిగ్గుపడ్డది, పాల్‌ను చూచింది.

మాట్లాడమన్నట్లు చూచాడు పాల్.

జానకి మాట్లాడింది.

"చైర్మన్ మానవతామూర్తి. వారివల్లనే మా పెళ్ళి సాధ్యం అయింది. రమా

వాసి, ఏసుదాసు మాకు ఆదర్శదంపతులు. వారి ప్రయత్నమే లేకుంటే మేము ఇప్పటికి పరలోకంలో ఉండేవాళ్ళం''

సభలో చప్పట్లు.

''ప్రేమ మానవతకు మారుపేరు. మానవతకు మతాలు, కులాలు, దేశాలు, భాషలు లేవు. ప్రేమ ఏ మతానికి గుత్తసొమ్ముకాదు. ప్రేమ మనస్సులోంచి పుడ్తుంది. మనస్సు మంచిని సూచిస్తుంది. ప్రేమ భగవత్స్వరూపం. దానికి రంగులు, దేశాలు, రాజకీయాలు లేవు. హిమాలయం అంత చల్లనిది-అంత ఉన్నతం అయింది.

మేం ప్రేమించుకున్నాం, మనసులు మార్చుకున్నాం—మాలలుకాదు. మా మతాలు వేరు, అవి మాకు అడ్డురావు. పాల్ ఆదివారం చర్చికి వెళతాడు, శనివారం వాడు నేను గుడికి వెళతాను. మా ఇంట్లో క్రీస్తు-రాముడు పక్కపక్కనే ఉంటారు."

కరతాళధ్వనులు ప్రతిధ్వనించాయి.

వేదికమీదికి వస్తున్న ఇద్దరు నన్స్ కనిపించారు పాల్‌కు, వారి చేతుల్లో పుష్పగుచ్చాలున్నాయి, వార్కు దగ్గరికి వచ్చారు.

గుర్తించాడు పాల్, 'జూలీ!!!'' అని కేక పెట్టాడు.

జూలీ పాల్‌కు పుష్పగుచ్ఛం అందించింది.

''జూలీ నువ్వు....!''

"అవును పాల్! నేను జూలీనే! నేను నిన్ను ప్రేమించాను! ప్రేమ ఫలించలేదు. జానకి గొప్పది, నీకు తగింది, ఆమె ప్రేమమూర్తి. ఆనాడు నిన్నుమాత్రం ప్రేమించాను, ఈనాడు మీ ఇద్దరినీ ప్రేమిస్తున్నాను—కాదు—సకల మానవాళినీ ప్రేమిస్తున్నాను. లోకంలో దీనులున్నారు. దుఃఖితులున్నారు, వారి కన్నీరు తుడవడానికి జీవితం అంకితం చేశాను. నాకెంతో ఆనందంగా ఉంది పాల్. నేను మానవాళిని ప్రేమిస్తున్నాను'' జూలీ కంఠం రుద్ధం అయింది. ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి. జానకి గుండె కరిగింది, కళ్ళు నిండాయి.

ఆమె ముందుకు ఉరికింది.

జూలీని కావిలించుకుంది—గట్టిగా!

''అక్కా! నువ్వు త్యాగమూర్తివి'' అన్నది.

పాల్ కళ్ళు తుడుచుకున్నాడు.

దూరంగా నుంచున్నారు ఫాదర్ జాన్—ముకుందంగారూ.

వారు ఒకరిని ఒకరు చూచుకున్నారు.

ఇద్దరి కళ్ళూ చెమ్మగిల్లాయి.



# మానవ మకుటం

నేను డోర్నకల్లులో టీచర్‌గా పనిచేసిన రోజుల్లో గురువయ్య అనే ఒక హమాలి ఉండేవాడు. అతనికి జ్ఞానతృష్ణ ఎక్కువ. ఏదో వినడానికో, చర్చించ డానికో నా దగ్గరికి తరచూ వస్తుండేవాడు. కొన్నాళ్ళు రాలేదు. నేనూ అంతగా పట్టించుకోలేదు.

ఒకనాడు ఒకడు ఉరికివచ్చి "గురువయ్య ఘాశయనం చేసిండు. రమ్మంటు న్నడు" అని చెప్పాడు వగర్చుకుంటూ. నేనూ పరుగెత్తివెళ్ళాను. గురువయ్యను చాపమీద పడుకోబెట్టారు. అవసానదశలో ఉన్నాడు. చేతులు జోడించి వెళ్ళి పోతున్నట్లు సంజ్ఞ చేశాడు. మాటలేదు. వింటున్నాడు. "దైవాన్ని తలచుకో. అన్నీ మరచిపో" అన్నాను. సరేనన్నట్లు కళ్ళు మూసుకున్నాడు గురువయ్య.

ఇంతలో మరొకతను వచ్చాడు. "గురువయన్నా! ఇన్ని సారనీలు తాగుతవా?" అడిగాడు.

గురువయ్య అది విన్నాడు, కళ్ళు తెరిచాడు. ఇప్పుడే తాగాను - రేపు తాగుతాను అన్నట్లు సైగలు చేశాడు.

నేను చకితుణ్ణయినాను! నిముషం క్రితం పోతున్నానన్నవాడు రేపటిమీద ఆశ పెట్టుకొని ఉన్నాడు!! గురువయ్య రేపటి సూర్యుణ్ణి చూస్తాడా? అనుకున్నాన్ను.

గురువయ్య తెల్లవారి మరొకతను ఇచ్చిన సారాయి తాగి కన్ను మూశాడు!!

మనసుంటే మృత్యువును జయించవచ్చునేమో అనుకున్నాను. ఆ ఆలోచన నన్ను వెన్నాడింది. వదల్లేదు.

నేను డోర్నకల్లు నుంచి మరో ఉద్యోగంలో చేరి సికిందరాబాదు చేరు కున్నాను.

"మనయేవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః" మనిషి బంధ మోక్షా లకు మనసే కారణం అన్న గీతావాక్యం కంటపడింది.

మనసు అన్నింటినీ జయించగలదేమో ననిపించింది.

"ఇష్క్ కోయీ కిసీకె మర్నే సే మర్ జాతానహీ
రూహ్‌మె గిమ్ బన్కె రహజాతాహై మగర్ జాతానహీ"

అనే ఉర్దూ కవిత కనిపించింది. కవి ఏమంటాడంటే

"ప్రణయం ఏ ఒక్కరిచావుతోనూ చచ్చిపోదు.
గుండె గూటిలో నిలిచి ఉంటుంది. పోదు."

అంటే మనసు చావుకన్నా గట్టిది అని అర్థం చేసుకున్నాను. సంకల్ప బలం ఉండాలి. దేనినైనా సాధించవచ్చును అనుకున్నాను.

ఒక పత్రికవారు నన్ను ఒక నవల వ్రాసి ఇమ్మన్నారు. అప్పుడు నాకు గురువయ్య మనసులో మసిలాడు.

భగవంతుడు మానవుణ్ణి సృష్టించాడు. మనిషి కులమతాలను సృష్టించు కున్నాడు. జ్ఞాని అయినవాడు కులమతాలకు అతీతుడు అవుతాడు. మానవత అతని మతం అవుతుంది అని నారాయణ స్వామిని సృష్టించాను. గురువయ్యను ఎంతో ఎత్తుకు పెంచి నారాయణస్వామిని తమ్ముణ్ణి చేశాను. అన్నగారిని మించి ఎదిగి పోతాడు తమ్ముడు!

'అన్నగారూ మీ ఋణం ఎన్ని జన్మలకు తీర్చుకుంట.'

"గురువయ్యా!" స్వామి కంఠం రుద్ధం అయింది. "గురువయ్యా! నీకు మరో జన్మ లేదయ్యా," స్వామి కన్నీరు జలజలా రాల్చాడు.

శిల్పి రాతిని చెక్కి దేవతా విగ్రహం చేస్తాడు. శిల్పి అక్కడే ఉండిపోతాడు! ఎదగడు!!

గురువయ్య జ్ఞానంలో నారాయణస్వామిని మించిపోతాడు. నారాయణస్వామి గొప్పదనం గురువయ్య మహత్తును ఆమోదించడం.

మానవ జీవితం భౌతిక అవసరాల మీద మాత్రం ఆధారపడిలేదు. అది నమ్మకం, విశ్వాసం మీద ఆధారపడి ఉంది.

గురువయ్య భాగవతాన్ని నమ్ముకున్నాడు. అది అయిపోగానే పరమపదిం చాడు.

పిచ్చమ్మ గురువయ్యను నమ్ముకుంది. గురువయ్యతో వెళ్లిపోయింది.

మానవత, మనసు ఉన్నవానికి కుల మతాలు, ప్రాంతాలూ, దేశాల సరిహద్దులూ ఏవీ అడ్డంకులు కాబోవని నా సంపూర్ణ విశ్వాసం.

"శరతల్పం" ఇది చెప్పగలుగుతే ధన్యుణ్ణి.

విశాలాంధ్ర ప్రచురణాలయంవారు 'శరతల్పం' రెండవ ముద్రణ వెలు వరిస్తున్నారు. వారికి కృతజ్ఞుణ్ణి.

"సర్వే భవన్తు సుఖినః"

సికిందరాబాదు
29-5-97

దాశరధి రంగాచార్య

# శరతల్పం

వాన! ముసురు!! ఈదురుగాలి!!!

వారం రోజులుగా మనుషులు, పశువులే కాదు సూర్యుడు కూడా బయటికి రాలేదు. పశువులు కొట్టాల్లో, మనుషులు ఇళ్ళల్లో, పక్షులు చెట్లమీదా వణుకు తున్నాయి. మేకలు, గొర్రెలు వణికి చస్తున్నాయి. ఉరుములు, మెరుపులు. ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకొని జీవిస్తున్నారు గుడిసెల వాళ్ళు.

ప్రళయం వచ్చినట్లుగా ఉంది. లోకాల్ని ముంచేసేట్లుంది.

ఊరూ నాడూ జలమయం అయినాయి.

వారం తరువాత ఇవ్వాళే వాన వెలిసింది-పంజరం నుంచి బయట పడ్డ పక్షుల్లా జనం, జంతువులు ఇళ్ళల్లోంచి బయటపడ్డాయి. ఇన్నాళ్ళనుంచీ ఊపిరి బిగబట్టి మళ్ళీ ఇవ్వాళే ఊపిరి పీల్చుకున్నట్లుంది ఊరు.

ఏటి ఒడ్డుకు చేరుకున్నారు నారాయణస్వామి. ఏరు పొంగి పారుతూంది. చూస్తూ నుంచున్నారు. గట్లను ముంచి పారుతూంది నది. హోరు ధ్వని చేస్తూ సాగి పోతూంది.ఎర్రటినీరు ఎగిసి పడుతూంది. అలలు ఊగుతున్నాయి. కర్రా, కంపా కాదు పశువులను కూడా లాక్కొనిపోతూంది.

విలయతాండవం చేస్తూంది నది.

చూస్తున్నారు నారాయణస్వామి. ఆకాశానికి చేతులు జోడించి ''ప్రభూ! ఎందుకీ ప్రళయం తెస్తున్నావు? పాపం కూటికి లేని జనం గూళ్ళలో మ్రగ్గుతున్నారు. కరుణించు ప్రభూ! కోపం చాలించు" అని ప్రార్థించారు.

నది హోరుమంది.

అది వేగం పెంచుకుంటూ నురగలు కక్కుతూంది.

నది ఆవలి ఒడ్డున కొట్టుకొని పోతున్న ఒక దుంగ కనిపించింది నారాయణ స్వామికి. అది తరంగాల మీద ఊయలలోవలె ఊగి వచ్చేస్తూంది. అది ఏటి మధ్యకు వచ్చింది. మరో దుంగ ఎక్కణ్ణుంచి వచ్చిందో దాని కొనకు తాకింది. రెండు దుంగల కొనలు తాకి కొంత దూరం సాగాయి. తరువాత రెండూ కలిసిపోయాయి. జంటగా సాగాయి. తరువాత విడిపోయాయి.

ఆ దుంగల విషయంలో ఆసక్తి ఏర్పడింది నారాయణస్వామికి. ఏటి ఒడ్డున కొంతదూరం నడిచారు. మొదటి దుంగ కనిపించలేదు. రెండవది మునుగుతూ తేలుతూ సాగిపోతూంది.

ఆగిపోయారు నారాయణస్వామి. "ఏం బోధించదలచావు ప్రభూ! మనుషులూ ఇంతేనా! ఎక్కణ్ణుంచో వచ్చి, ఎక్కడో కలుసుకొని విడిపోతారనా! లేక నాకే ఏమైనా చెప్పదలచావా ప్రభూ! గురువయ్యకు ఆయుర్దాయం ప్రసాదించు. నన్ను వేరుచేయకు'' అన్నారు. వారికి తెలియకుండానే కళ్ళు చెమ్మగిల్లాయి. పైపంచెతో కళ్ళు తుడుచుకొని ఆకాశాన్ని చూశారు.

ఆకాశంలో కారుమబ్బులు కమ్ముకుంటున్నాయి.

మందలు మందలుగా మబ్బులు ఆకాశంలో పురివిప్పుకొని సాగిపోతున్నాయి. నాలుగు చినుకులు కూడా రాలేయి.

అప్పుడు గాని అర్థంకాలేదు నారాయణస్వామికి-తాము వచ్చి చాలాసేపైందని! రేవువైపు నడక సాగించారు. రేవుకు చేరేంతరువాతగాని తాము నదీతీరాన చాల దూరం సాగామని తెలియలేదు. వెంటనే పైపంచె నడుముకు కట్టుకొని వంగి నది నీటిని తాకి, సంధ్యావందనం సాగించారు.

మబ్బులు బాగా కమ్ముకున్నాయి. మసక చీకటి పడుతూంది.

నారాయణస్వామి సంధ్య ముగించారు. కళ్ళు మూసుకొని, చేతులు జోడించి ధ్యానంలో నిమగ్నులైనారు.

పెద్ద ఉరుము! ఎక్కడో పిడుగు పడ్డట్లుంది!

నారాయణస్వామి ధ్యానం చెదిరిపోయింది.

వారు తటాలున ఆకాశాన్ని చూశారు.

ఆకాశమంత మెరుపు మెరిసింది. ఆ మెరుపులో వారికి మర్రిచెట్టు కనిపించింది. మర్రిచెట్టులోంచి తాటిచెట్టు పెరిగింది. తాటిచెట్టుకు అల్లుకొని పాకుతున్న తీగ కనిపించింది.

అదంతా లిప్తలో జరిగింది.

అయినా ఎందుకో చెరగని ముద్ర వేసిందా దృశ్యం నారాయణస్వామి మనసు మీద.

మెరుపు మాయం అయింది. మసకచీకటి ఏర్పడింది.

అయినా ఆ చెట్టునే చూస్తూ నుంచున్నారు నారాయణస్వామి.

ఆ తాడిచెట్టును ఎలా బంధించింది ఆ మర్రి!

ఎక్కణ్ణుంచి వచ్చిందా తీగ!

ఎలా అందుకుంది! ఎంతగా అల్లుకుంది!

"ఏం బంధం ప్రభూ ఇది! బంధంతో ఆనందం సృష్టించావా! దుఃఖమా!!

ఎంత విచిత్రమైంది నీ సృష్టి! ఎవడికి అర్థం అవుతుంది? ఎవనికి కాగలదు! ఎందుకీ దృశ్యం చూపావు నాకు! ఆశ చిగురించు కొమ్మంటున్నావా?"

దబదబా చినుకులు రాలేయి.

మళ్ళీ యీ లోకంలోకి వచ్చారు నారాయణస్వామి. పెద్ద పెద్ద అంగలు వేస్తూ ఊరివైపు సాగిపోయారు.

వాన పెద్దదయింది. తడిసిపోయారు నారాయణస్వామి.

దారి వదిలి పొలాల గట్లమీంచి సాగిపోతున్నారు. వాన దెబ్బకు పొలాలు తలలు వంచాయి, వరిచేలు తలలు ఎత్తలేక పోతున్నాయి.

స్వామి బాగా తడిసిపోయారు. తలమీంచి నీరు ధారాపాతంగా కారుతుండగా ఇంటికి చేరారు.

నాంచారమ్మ వాకిట్లో స్వామికోసం ఎదురుచూస్తూ నుంచుంది- గూట్లో ప్రమిద వుంది.

స్వామి వాకిట్లో అడుగు పెట్టగానే "ఉత్తరం వచ్చింది-గురువయ్య దగ్గర నుంచి కాదుకదా-చూడండి" అని అందించింది. స్వామి తడిసి ఉన్నారనేది ఆమె గమనించలేదు-బయట పడుతున్న కుండపోత వాన ఆమెకు కనిపించలేదు. ఉత్తరం వచ్చినప్పణ్నుంచీ ఆమె ముళ్ళ మీద వుంది. వచ్చిన ఉత్తరం గురువయ్య నుంచేనని ఆమె మనసు చెపుతూంది. మనసేమో ఏదో కీడు శంకించింది. అలా కాకూడదని భగవంతునికి మొక్కింది మనసులో ప్రార్థించింది. కాలు కాలిన పిల్లిలా ఇంట్లోకి బయటికీ తిరిగింది. వేళ కాకముందే గూట్లో దీపం పెట్టింది. కళ్ళల్లో వత్తులేసు కొని వాకిట్లో స్వామికోసం ఎదురుచూస్తూ నుంచుంది. అందుకే స్వామి తడిసింది కాని, బయట కుండపోత వానగాని ఆమె గమనించలేదు!

ఉత్తరం అందుకున్న స్వామికి తాము తడిసి ఉన్నామని తెలిసి రాలేదు. "తే-తొందరగా లాంతరు తే" అని కవరు చించి ఉత్తరం మడత విప్పి బల్లపీటమీద కూర్చున్నారు.

క్షణంలో సగంలో లాంతరుతెచ్చి బల్లపీటమీద పెట్టి కాంతి పెంచింది నాంచారమ్మ-పక్కనే నుంచుంది ఉత్తరంలో విషయం వినాలని ఆదుర్దాతో.

స్వామి మౌనంగా ఉత్తరం చదువుతున్నారు. లాంతరు కాంతి వారి ముఖం మీద పడుతూంది-ముఖంలో రంగులు మారడాన్ని నాంచారమ్మ గమనిస్తూంది.

"ఏమండీ! ఎక్కడినుంచి ఉత్తరం?" ఆమె ధ్వనిలో ఆవేశం, ఆవేదన ఉన్నాయి. గొంతు జీరవోయింది.

స్వామి ఉత్తరాన్ని మడిచి పక్కన పెట్టారు. ముఖం పైకి ఎత్తకుండానే "గురువయ్య దగ్గరినుంచే-డాక్టరు రాసిండు" వారి కళ్ళు చెమ్మగిల్లాయనే విషయం గమనించింది నాంచారమ్మ.

నాంచారమ్మ కళ్ళవెంట నీరు జాలువారింది. "చెప్పండి! ఏమైంది? గురువయ్య

బాగున్నాడా? చెప్పండి బాగున్నడని" స్వామిని బుజాలు పట్టుకొని ఊపి అడిగింది.

గాలి వడిగా వీచింది.

జల్లుతెర ఒకటి ఇంట్లోదాకా వచ్చి పోయింది.

భగ్గు భగ్గుమని లాంతరు ఆరిపోయింది.

స్వామి నాంచారమ్మ ముఖంచూస్తూ "ప్రమాదంగ ఉన్నదని డాక్టరు రాసిండు."

"హమ్మయ్యా, అంతేగద! బతికున్నడుగద గురువయ్య. లేవండి స్తానం చెయ్యండి-శ్రీయఃపతిని ప్రార్థించండి లేవండి, నేను సీతమ్మను వేడుకుంటా" అని, "అయ్యో లాంతరు మలిగిపోయింది. పద ముట్టిస్త" అని అగ్గిపుల్ల తెచ్చి గిరి లాంతరు ముట్టించింది.

అప్పుడు చూచింది స్వామిని—పూర్తిగా తడిసి ఉన్నారు.

"అయ్యో! నా మతి మండ! ఎంత తడిసిపోయిన్రండి-చెప్పనన్న లేదు" అని కొంగుతో స్వామి తలా, వహ్నా తుడిచి, కట్టుకోవటానికి చిన్న పంచె తెచ్చి ఇచ్చింది.

చిన్న పంచె కట్టుకుంటున్న స్వామి మౌనంలో ఏదో గాంభీర్యత, గాఢమైన ఆలోచనా కనిపించాయి నాంచారమ్మకు.

"ఏమండీ ఎట్లనో ఉన్నరు. ఏమైందండి! నిజం చెప్పరా!" ఆమె మాటల్లో గుండె దడలు వినిపించాయి.

"ఏం లేదు పిచ్చిదాన! ఏదో ఆలోచన వచ్చింది. ఉత్తరం సంగతి కాదు. పా స్నానం చేస్తా" స్వామి పెదవులపై చిరునవ్వు కనిపించింది.

నాంచారమ్మ మనసు కొంత నిమ్మళించింది.

"మీరు స్తానం చెయ్యండి. నేను వంట ఇల్లు అలికి ముగ్గుపెట్ట. నా మతి మండ మడి కట్టుకోవటమే మరచిన" అని వంటింట్లోకి వెళ్ళిపోయింది నాంచారమ్మ.

స్వామి స్నానంచేసి వచ్చేవరకు వంటిల్లు అలికి ముగ్గుపెట్టి, సెమ్మెలు వెలిగించింది నాంచారమ్మ. స్వామి తిరుమన్కాపు చేసుకొని తిరువారాధనకు కూర్చున్నారు. "కౌసల్యా సుప్రజా రామా...." ముగించి భువనేశ్వరపు తలుపులు తెరచారు. సీతారామచంద్రుల విగ్రహాలు దివ్వెల కాంతికి వెలిగిపోతున్నాయి. రాముని తొడపై కూర్చొని వుంది సీతమ్మ— పక్కన లక్ష్మణుడున్నాడు. స్వామి భద్రాద్రిరామునివంటి ఆ విగ్రహాల్ను చాలా కష్టపడి సంపాదించారు. ఆ విగ్రహాలంటే వారికి ఎనలేని భక్తి.

స్వామి మధుర స్వరంలో మంత్రపఠనం మనుషుల మనసులను ముగ్ధుల్ని చేస్తుంది.

నాంచారమ్మ స్నానంచేసి తడిబట్టలతోనే పొయ్యిలో నిప్పువేసి వంట ప్రారంభించింది. వంటచేస్తూ మంత్రపఠనం వినడంలో ఆవిడకేదో ఆనందం ఉంది.

వంట పూర్తి అయ్యేవరకు తిరువారాధన ముగిసింది కాని స్వామి ధ్యానంలో నిమగ్నులయినారు. అంతసేపు ధ్యానంలో కూర్చోవడం నాంచారమ్మ ఎరుగదు. వంట ఇంటిలోని మౌనం వింతగానూ, విచిత్రంగా తోచిందామెకు. ఆమె సైతం దేవునిముందు కూర్చొని మౌనంగా ప్రార్థించ సాగింది.

బయట వాన కురుస్తూనే ఉంది. ఈదురుగాలి వీస్తూనే ఉంది.

ముందు కళ్ళు తెరచినవారు స్వామి. వారు నాంచారమ్మను చూచారు. ఆమె ముఖంలో ఏకాగ్రత కనిపించింది. వారికి ఆశ్చర్యం కలిగింది. ఆమె అలా కూర్చొని ధ్యానించడం అంతకుముందు వారెరుగరు. ఆమెకు అంతరాయం కలిగించకుండా మెల్లగా లేచి అక్కడ్నుంచి వెళ్ళిపోయారు స్వామి.

చాలా సేపటికిగాని కళ్ళు తెరిచిందికాదు నాంచారమ్మ. చూస్తే భర్తలేరు. ఒకసారి విగ్రహాలకు సాష్టాంగ నమస్కారంచేసి, వంట ఇల్లు దాటింది. స్వామి వెనుక గుమ్మంలో నుంచొని వానను చూస్తున్నారు. నాంచారమ్మ భర్తను పిలిచింది. వానను చూస్తూనే ఊఁ అన్నారు స్వామి.

"విన్నారా! సీతమ్మ ఏమన్నదో!"

అప్పటికీ వానమీంచి దృష్టి మరలించలేదు స్వామి.

అది గమనించకుండానే "పిచ్చమ్మ పసుపు కుంకుమ రక్షిస్తానన్నదండి" అన్నది నాంచారమ్మ.

స్వామి నాంచారమ్మవైపు తిరిగి "అందుకేనా ఇంతసేపు ధ్యానించినవు! సరేగాని వాన చూసినవా! పిచ్చమ్మ పాపం ఆ గుడిసెలో ఎట్ల ఉంటున్నదో!"

"మరిచినం అసలు పిచ్చమ్మకు ఈ వార్త."

"అదే ఆలోచిస్తున్న. ఎట్ల చెప్పాలె. ఏమని చెప్పాలెనని."

నాంచారమ్మ కూడ ఆలోచనలో మునిగింది.

"ముందు సాపాటు చేతాం. ఇంతలో వానేమన్న తగ్గుతదేమొ చూతం" అన్నారు స్వామి.

నాంచారమ్మ అక్కడ్నుంచి వెళ్ళిపోయింది.

ఇద్దరూ భోజనాలు చేశారు. తాంబూలం వేసుకోకుండానే బయలుదేరారు స్వామి. నాంచారమ్మ గొడుగు అందించి గుమ్మానికి ఆనుకొని నుంచుంది-పైట చెంగుతో వళ్ళంతా కప్పుకొని.

వాన పడుతూనే వుంది-కాని వడి తగ్గింది.

వీధులు కాలవలుగా పారుతున్నాయి. స్వామి సాగిపోతుంటే నీళ్ళ చప్పుడు వినిపించింది. అప్పుడు గుర్తువచ్చింది నాంచారమ్మకు భర్తకు కనీసం లాంతరు ఇవ్వలేదని. "ఏమండీ" అని పిలిచి లోనికి పరిగెత్తి లాంతరు తెచ్చింది.

స్వామి నాంచారమ్మ పిలుపు వినలేదు—సాగిపోయారు. చీకట్లో తడుము కుంటూ గురువయ్య యింటికి చేరుకొని ముక్కు మూసుకున్నారు- తోళ్ళవాసన. ఆ గూడెమంతా అంతే. మామూలు పరిస్థితి అయితే అప్పుడు అడుగు పెట్టేవారుకారు స్వామి. ఇప్పటి స్థితి వేరు.

గురువయ్యకు ప్రమాదంగా ఉంది!

ఆ విషయం పిచ్చమ్మకు చెప్పాలి!!

వాన ముసురు ఎక్కువైంది.

వాకిట్లో నుంచొని పిచ్చమ్మను కేకవేశారు స్వామి.

మూడు నాలుగుసార్లు పిలిచినతరవాత ఉలిక్కిపడి లేచింది పిచ్చమ్మ. "ఎవ్వరు! అయ్యగారా! ఇట్లొచ్చిన్రు—ఇంత రాత్రి-వానల-పిలిపిస్తె రాకపోయి నాను బాంచెను" అని లోపలినుంచి తడక తీసుకొని బయటికి వచ్చింది.

వాకిట్లో-వానలో స్వామి కనిపించారు. పిచ్చమ్మ ప్రాణాలు పైపైనేపోయాయి. ఏమనాలో అర్థంకాలేదు-మాటలు తడబడ్డాయి.

"అయ్య.... మీరు పెద్దలు ... ఇంట్లకు రమ్మందునా.... వానల నానమం దునా.... ఏమందును....అయ్యా! ఎందుకొచ్చిన్రు?" అని తానే వానలోకి ఉరికివచ్చి స్వామి ముందు నుంచుంది.

"గురువయ్య దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది."

"వచ్చిందా? బాంచెను.... ఏమన్నడు.... ఎట్లున్నడు?.... నాకేమన్న రాసిండా?..."

"బాగున్నడు....రమ్మని రాసిండు. నేను పోతున్నా"

"అయ్యగారు.. మీరు పోతున్రా...ఎట్లున్నది ఆయనకు? నిజం చెప్పండి.... కాల్మొక్త...మీరు పోతుంటె నే నెట్లుండ? నేను వస్త తీస్కపోండి బాంచెను" అన్నది పిచ్చమ్మ.

పిచ్చమ్మ తలమీంచి కారుతున్న వాన నీటిలో కన్నీరు కలిసిపోయింది.

"గురువయ్య బాగనే ఉన్నడు. ఎందుకు రమ్మన్నడో తెలియదు...వస్త నంటవా, రా .. తీస్కపోత"

"అట్లనే బాంచను...నా పెనిమిటిని కాపాడుండి...మీరు పెద్దలు మా ఇంటికొచ్చిన్రు ...అట్లనే వస్త కాల్మొక్త...."అని కాళ్ళమీద పడబోయింది పిచ్చమ్మ. అయినా పాదాలు తాకలేదామె. ఆమె చేతులు బురదలో పడ్డాయి. చేతులమీద తల ఆనించింది.

స్వామి కరిగిపోయాడు. పిచ్చమ్మను రెండు చేతులా ఎత్తాలనుకున్నాడు. కాని-కాని ఏదో అడ్డుతగిలింది. దాన్ని సంస్కారం అనాలో-మూర్ఖత్వం అనాలో-ఆచారం అనాలో!

స్వామి కదలకుండానే అన్నాడు "లే పిచ్చమ్మా! లే! నేను బయల్దేరేటప్పుడు పిలుస్త – సిద్ధంగుండు .... వస్తమరి" అని వెనక్కు తిరిగి బయలుదేరాడు స్వామి.

పిచ్చమ్మ లేచి "నేనొస్త. జీకటిగున్నది ముంగల నడుస్త" అని ఉరికొచ్చి స్వామి ముందు నడిచింది.

వాన పడుతూనే ఉంది.

స్వామి యింటిముందుదాకా వచ్చి నిలిచింది పిచ్చమ్మ. స్వామివైపు తిరిగి దండంపెట్టి "ఇగవస్త .... పోయేటప్పుడు పిలువండి" అన్నది.

ఒక మెరుపు మెరిసింది.

ఎదురుగా పిచ్చమ్మ స్పష్టంగా కనిపించింది స్వామికి.

గుమ్మంలో నుంచున్న నాంచారమ్మ పిచ్చమ్మను చూచింది.

పిచ్చమ్మ వెళ్ళిపోయింది.

స్వామి గుమ్మంలో అడుగు పెడ్తూనే అన్నారు. "చూసినవా! ఎట్లాంటిది ఎట్లయిపోయిందో?"

"అవునండి ఎట్లయింది" చిన్న పంచె అందిస్తూ అన్నది నాంచారమ్మ. "బొమ్మోలె ఉండేది బొక్కల పోగయింది"

పిచ్చమ్మను మెరుపు వెలుగులో చూచినప్పుడే గుండె దసిలిపోయింది స్వామికి. నీలమణిలాంటి పిచ్చమ్మ బొగ్గుకంటె హీనమయిపోయిందే అనుకొన్నారు.

వాస్తవంగా అందమయింది పిచ్చమ్మ. కాకుంటె గురువయ్యను మురిపించి, వలపించి, మరపించగలదా?

ఆ రాత్రి నారాయణస్వామికి నిద్ర పట్టలేదు. నాంచారమ్మ ముసుగుతన్ని పడుకుంది కాని ఆవిడ పనీ అలాగే ఉంది.

నాంచారమ్మ లేచి మంచంలో కూర్చొని "నేనుకూడ వస్తనండి మీతోని".

"వస్తవా-రా" అన్నారు స్వామి.

"గురువయ్య మీకు తమ్ముడైతే నాకు మరిదికాడా మరి ... వస్తనండి నేను కూడ"

"నాంచారూ" మంచంలో లేచి కూర్చొని "ఏటి దగ్గర రెండు దృశ్యాలు కనిపించినయ్. అవి చూచినప్పటినుంచి నా మనసు కలతగా ఉన్నది."

"చెప్పండి ఏమిటవ్వి?"

"చూడు, ఏటికి వరద వచ్చిందికదా! ఆ ఒడ్డునుంచి ఒక మొద్దు కొట్టుకొని వచ్చింది. ఈ ఒడ్డునుంచి ఒకటి వచ్చింది. రెండూ నడి ఏట్లో కలిసినయ్. కొంత దూరం కలిసి సాగినయ్. తరువాత వేరే అయిపోయినయ్! నాంచారూ చెప్పు మళ్ళీ అవి కలుస్తయా?"

"ఇంకెట్ల కలుస్తయండి? వరదలో పోయిన మొద్దులు-దేని దారి దానిదే."

"అంతే నంటవా? అయితే గురువయ్య కూడ అట్లనే నంటవా?"

నాంచారమ్మ నివ్వెరపోయింది.

"అదేమిటండీ అట్లంటరు?"

"ఏమో నాంచారూ! అంతా భగవల్లీల! బంధం కల్పించినవాడు వాడే .... తెంచుకొని పోతే ..."

నాంచారమ్మ మంచంలోంచి లేచి స్వామి నోరుమూసింది. "అశుభం పలక కండి. గురువయ్య బతుకుతడు! బాగయితడు. మీరు అతనికి ఎంత సంస్కారం కలిగించిన్రు!" అన్నది – స్వామి మంచంలోనే కూర్చుంది.

"పిచ్చిదానా!'' అని ఆమె వెంట్రుకలు నిమురుతూ ''ఎవరు ఎవరికి సంస్కారం కలిగించిన్రో ఎట్ల చెప్పటం! అంటరానివాండ్లని అభాగ్యులకు దూరంగా ఉన్న మన కండ్లు తెరిపించి గురువయ్య మనకు సంస్కారం కలిగించలేదా? అయినా ఇంకా 'అహం' మనను వదిలిందా? పిచ్చమ్మ కాళ్ళమీద పడితే ఆమెను అంటుకొని లేవదీయటానికి మనసొప్పలేదు. వానలో నన్ను సాగనంపటానికి వచ్చినదాన్ని ఇంట్లోకివచ్చి తలదాచుకొమ్మనలేకపోయాము. ఎవరిది నాంచారూ సంస్కారం?"

ఎవరిది సంస్కారం?

నాంచారమ్మకేమీ అర్థంకాలేదు? ఆమె మనసు పరిపరి విధాల పరిభ్రమించింది. గురువయ్య ఆమె మనోఫలకం మీద అనేకసార్లు మసలాడు. పిచ్చమ్మ రూపం ఆమె కండ్ల ముందు ఆడింది. తుదకు ఏరు.... ఏట్లో కొట్టుకొనిపోయే దుంగల దగ్గరికి వచ్చింది. ఆగిపోయింది. ఏదుంగ దారి ఆ దుంగదే అనుకుంది. మనసులో అనుకున్న మాట బయటకే వచ్చేసింది.

"పిచ్చిదానా! నాక్కనిపించిన రెండో దృశ్యం చెప్పిన్నా!"

"చెప్పలేదు. చెప్పండి"

"ఒక మర్రిచెట్టులోంచి తాటిచెట్టు మొలిచింది. ఒక తీగ మర్రి చెట్టునుంచి తాటిచెట్టు కొనదాకా కావిలించుకొని పాకింది."

"అయితే ఏమిటంటరు."

"బంధానికి జాతులతో సంబంధంలేదు. మర్రి ఏ జాతిది? తాటిచెట్టు ఏ జాతిది? ఎక్కడ నుంచి వచ్చింది ఆ బంధం? అవి రెండు కలిసి ఎట్లు పెరిగినయి. ఆ తీగ ఎక్కడది? ఏ గింజ పడి మొలిచింది? అది ఆ రెండింటినీ బంధించి వేసింది. ఆ బంధం ఎక్కడి దంటవు? ఎవరు తెచ్చిందంటవు?"

"గురువయ్య బంధం వంటిదండి."

"అవును, ఆ తీగను చూచినప్పుడు నాకు ఆశ మొలకెత్తుతున్నది. ఏటిలో పోయిన మొద్దులను చూచినపుడు గుండె పగిలిపోతున్నది."

"గురువయ్య బతుకుతడు. బాగుపడ్తడండి–సీతమ్మ చెప్పింది. ప్రయాణం ఎప్పుడు? నేను కూడ వస్త"

"సరేలే" అన్నాడు స్వామి.

ఇద్దరూ పడుకున్నారు.

ఏట్లో దుంగలు పోతున్నాయి. కలుసుకున్నాయి—విడిపోయాయి. మర్రిచెట్టు లోంచి తాటిచెట్టు, ఆ రెంటినీ పెనవేసుకున్న తీగ.

ఈ దృశ్యాలు నారాయణస్వామిని వదలడం లేదు. కళ్ళు మూసినా, తెరిచినా అవే కనిపిస్తున్నాయి.

వాన ఇంకా వదల్లేదు. జల్లు సవ్వడి వినిపిస్తూంది.

## 2

తెల్లవారింది. జల్లు తగ్గింది. నారాయణస్వామి ఆకాశాన్ని చూశారు. మబ్బులు విడిపోతున్నాయి. ఎండపొడ వచ్చే జాడలు కనిపిస్తున్నాయి. గాలి విసురుగా వీస్తూంది. నారాయణస్వామి మనసు ఎందుకో తేలికపడినట్లయింది. వేపపుల్ల విరిచి పళ్ళు తోముకుంటూ వంట ఇల్లు అలుకుతున్న నాంచారమ్మతో "భగవంతుడు కరుణించిండు. వాన తగ్గింది. ఏరు ఎట్లున్నదో చూసి వస్త. వంట తొందరగా చేయి. ఆరగింపు కానిచ్చి బయలుదేరుదం" అని సాగిపోయారు.

నాంచారమ్మ ఏదో చెప్పదలచుకుంది—శూన్యాన్ని చూచి అలుకు ప్రారంభించింది.

నారాయణస్వామి ఏటి దగ్గరకు చేరుకున్నారు. ఏటి వడి తగ్గింది. అయినా వరద పూర్తిగా తగ్గలేదు. కర్రా కంపా ఇంకా కొట్టుకొని వస్తూనే ఉన్నాయి. రేవు పక్కన ఉన్న మర్రిని చూచారు. అది నిన్నటిలాగే ఉంది. విశేషం ఏమిటంటే పక్షులు తాటిచెట్టుమీద చేరి పోట్లాడుకుంటున్నట్లు కిచకిచ మంటున్నాయి.

ఏటిని చూచారు స్వామి. ఎలా దాటడం అని ప్రశ్నించుకున్నారు. రైలు స్టేషనుకు వెళ్ళాలంటే ఏరు దాటాల్సిందే. ఆకాశాన్ని చూచి పరాత్పరుణ్ని ప్రార్థించారు—ఏరు దాటించమనీ, గురువయ్య దగ్గరకి చేర్చమనీ.

ఏటి వరద చూడ్డానికి జనం వచ్చేస్తున్నారు.

మబ్బులను తొలగతోసి ఎండ వచ్చేసింది.

నారాయణస్వామి స్నానసంధ్యలు ముగించుకొని ఊళ్ళోకి బయలుదేరారు.

మబ్బులు పూర్తిగా విడిపోయాయి.

ఆకాశంలో పక్షులు స్వేచ్ఛగా ఎగురుతున్నాయి.

పొలాల్లో జనం కనిపిస్తున్నారు.

స్వామి ఇంటికి చేరేవరకు తడిచీరతో, నెత్తిన మంచినీళ్ళ బిందెతో చేరింది నాంచారమ్మ. స్వామి పట్టుబట్ట కట్టుకొని పీటమీద కూర్చున్నారు. ముందున్న మరో

పీటమీద తిరుమణి పెట్టె, తులసి మాలలు ఉన్నాయి. ముకుందమాల చదువుతూ బొట్టు పెట్టుకుంటున్నారు.

పొయ్యిలో నిప్పుచేసి వంటపనిలో మునిగిపోయింది నాంచారమ్మ తిరునామాలు పఠిస్తూ.

తిరువారాధన ముగిసింది. సాపాట్లు అయినాయి. తాంబూలం వేసుకొని బల్ల పీటమీద కూర్చున్నారు స్వామి. నాంచారమ్మ ప్రయాణానికి అవసరమైన సామాగ్రి సర్దుతూంది.

తలుపు తట్టిన చప్పుడైంది.

లేచి తలుపు తీశారు నారాయణస్వామి.

వచ్చింది పిచ్చమ్మ. పిచ్చమ్మను చూచి గుండె పగిలింది నారాయణస్వామికి. రాత్రి చూచారు పిచ్చమ్మను. చీకట్లో సరిగా కనిపించలేదు. ఎదురుగా పగటి ఎండలో పిచ్చమ్మ నుంచొని ఉంది. ఆమెకు ప్రాణం ఎక్కడుందో అర్థం కాలేదు స్వామికి!

"ఇప్పుడు పోతున్నా తయారయి వచ్చిన."

వెర్రిగా చూచారు నారాయణస్వామి పిచ్చమ్మను. పిచ్చమ్మలో గురువయ్య కనిపించాడు. గురువయ్య ఎద్దులాంటి మనిషి. అతన్ని రోగం నమిలేసింది. మరి పిచ్చమ్మ. పిచ్చమ్మ కేమయింది? ఎముకలు తప్ప శరీరంలో ఎక్కడా ఏమీ కనిపించలేదు. గురువయ్యంటే ప్రాణం పెడుతుంది పిచ్చమ్మ. ఈమె ఆరోగ్యం గురువయ్య ఆరోగ్యంతో ముడివేసుకొని ఉందనుకున్నారు. ఇంత కాలంగా కనీసం ఆమెను గురించి ఆలోచించక తప్పు చేశామనుకున్నారు?

"ఎట్లయినవేం పిచ్చమ్మా!"

"ఏమైంది. బాగున్నగద" అని చిరునవ్వు నవ్వింది పిచ్చమ్మ.

ఆ నవ్వులో వెన్నెలల్లేవు. కటిక చీకట్లున్నాయి.

ఆ నవ్వు అందంగా లేదు. పరమ వికారంగా ఉంది.

నారాయణస్వామి గుండెలో సూదులు గుచ్చుకున్నాయి. అయినా అగపడ నివ్వకుండా "తిన్నవా పిచ్చమ్మా!" అడిగారు స్వామి.

పిచ్చమ్మ నవ్వింది. ఆ నవ్వులో అనేక అర్థాలున్నాయి.

గ్రహించారు స్వామి. కులాన్ని విడిచి, గురువయ్యను కట్టుకొని ఏం సుఖ పడ్డది పిచ్చమ్మ అనుకున్నారు.

స్వామి నాంచారమ్మను పిలిచారు. పిండిచేతుల్తో పరిగెత్తి వచ్చింది నాంచారమ్మ.

"పిచ్చమ్మను చూసినవా?"

"పిచ్చమ్మా!" నివ్వెరపోయి చూసింది నాంచారమ్మ. గురువయ్యతోబాటు తన ఇంటికి వచ్చి కాళ్ళు మొక్కిన పిచ్చమ్మను తలచుకుంది. ఎక్కడ పోలిక?

ఎవరు ఈ ఆడది? అనుకుంది. ఇంతా నాంచారమ్మ పూర్తిగా తేరుకోకముందే స్వామి అన్నారు. "అన్నం పెట్టు తినలేదట."

"రా పిచ్చమ్మ అన్నం పెత్త" నిరామయంగా అన్నది నాంచారమ్మ.

"పెద్దలు మీ ఇంట్ల ఏం తింటగని పడెయ్యండి తిరొస్తా" అని కొంగు చాచింది పిచ్చమ్మ.

నారాయణస్వామి నెత్తిమీద ఏదో బండ పడ్డట్లనిపించింది. మౌనంగా మెల్లెక్కి ఇంట్లోకి వెళ్ళిపోయారు.

చరచర లోనికి వెళ్ళి విస్తట్లో అన్నం తెచ్చి పిచ్చమ్మ పైట కొంగులో వేసింది నాంచారమ్మ. బావి దగ్గరికి వెళ్ళి చేతులు కడుక్కొని వచ్చేసింది.

నారాయణస్వామి బల్లపీటమీద తలపట్టుకొని కూచ్చుని ఉన్నారు. నాంచారమ్మను చూచి అడిగారు.

"బియ్యం, పప్పులు కట్టినవా?"

"అదేమిటండి అట్లంటరు. మనకు చుట్టాలేర శిష్యుల్లేర పట్నంలో?" ముక్కుమీద వేలేసుకుని అడిగింది.

నాంచారమ్మను తలెత్తి చూచారు స్వామి.

నాంచారమ్మ ముక్కుపుడకలోని ఎర్రరాయి జిగేలుమంది. "పిచ్చిదానా! మనకింత చుట్టాల్లేరు; శిష్యులు లేరు. వారికోసం గురువమ్మను వదులుకోలేను. సత్రంలో దిగుదం. అక్కడినుంచే తిరిగి వద్దం, కానీ బండి వస్తుంది."

నాంచారమ్మకు కొంత చిరాకు వేసింది. కొంతలో కొంత దుఃఖమూ, కోపమూ వచ్చాయి. అయినా దిగమింగి ఇంట్లోకి వెళ్ళి పోయింది బియ్యం వగైరా మూటలు కట్టడానికి.

పిచ్చమ్మ చంకలో బట్టల మూటతో, ఇంటిముందున్న చింతచెట్టు కింద నుంచుంది. జీతగాడు బండిలో గడ్డివేసి, ఎద్దును కట్టి పగ్గాలు పట్టుకొని నుంచున్నాడు. నారాయణస్వామి, నాంచారమ్మ బయటికి వచ్చారు. ఇంటికి తాళంవేసి ఇరుగుపొరుగుతో చెప్పి వచ్చింది నాంచారమ్మ. చుట్టుపట్ల వాళ్ళు సాగనంపడానికి బండి వెనుక నుంచున్నారు. నారాయణస్వామి, నాంచారమ్మ బండి ఎక్కారు.

పిచ్చమ్మ మూటతో దూరంగా నుంచుంది.

బండి కదిలింది. జనం కదిలింది. పిచ్చమ్మ కదిలింది.

బండి ఊరు బయటికి వచ్చేవరకు వెంట వచ్చిన జనం వెనకపడ్డారు. ఇప్పుడు బండి, బండి వెనుక పిచ్చమ్మ మాత్రమే ఉన్నారు. స్వామి బండి నిలుపు చేయించి, పిచ్చమ్మను ఎక్కమన్నారు.

"మీతోని కూచూంటానండి, బాంచెను. నడిచొస్త, నాకేమైంది, కాల్మొక్త" అన్నది పిచ్చమ్మ.

"ఎక్కు పిచ్చమ్మా ఎక్కు. గురువయ్య నాకు తమ్ముడుగద. నువ్వెక్క కూనికేమి? ఎక్కు. కండ్లలో ప్రాణాలున్నయి ఏమి నడుస్తవు?" అన్నారు స్వామి.

నాంచారమ్మ కళ్ళు పెద్దవిచేసి చూచింది.

పిచ్చమ్మ బండి ఎక్కలేదు. "ఎందుకులేరి నడిచొస్త" అని బండి తప్పుకొని ముందుకు సాగింది.

అలాగే బండిమీద ఏరు దాటారు.

స్టేషనుకు చేరుకున్నారు. రైలెక్కి కూచున్నారు.

ముగ్గురూ మౌనంగా వున్నారు.

ముగ్గురి మనసుల్లోనూ గురువయ్యే ఉన్నాడు.

## 3

వరికోతలైనాయి. పంట ఇళ్ళకు చేరుతూంది. ఊరు సొంతం పంట కళ్ళంలా వుంది! ఎక్కడ చూచిన గడ్డి, ఎక్కడ చూచినా ధాన్యం.

ధాన్యం బండి నారాయణస్వామి ఇంటి ముందు ఆగింది. బండి మనిషి ముసిలివాడు. బస్తా బండిమీద నిలువుగా ఎత్తి నుంచున్నాడు. "మనిషిలేతు మల్లి బస్తలెట్ల దిగుతయి?" అన్నాడు.

నారాయణస్వామి, నాంచారమ్మ వాకిట్లో అరుగుమీద నుంచొని ఉన్నారు. మనిషికోసం అటూ ఇటూ చూచారు. ఎవరూ కనిపించలేదు. సూర్యుడు కుంగాడు, సాయంకాలం అయింది. మసక చీకట్లు ముసురుకో బోతున్నాయి. గింజలు ఇంట్లో పడాలి. గత్యంతరం లేదు. నడుముకు కంచవా బిగించి ముందుకు వచ్చారు స్వామి.

"అయ్యో, అయ్యో, మీరు బస్తాలు మోస్తరా! ఏమిటీ అన్యాయం? ఏమిటీ అధర్మం!" అని కేకలు పెట్టసాగింది నాంచారమ్మ.

నారాయణస్వామి బస్తా వీపుమీద వేసుకున్నారు. ఒక్క అడుగు కూడా వేయలేదు. తూలి పడబోయారు, క్షణం అవుతే సంచి స్వామి మీద పడిపోయేదే! తరవాత ఏమయ్యేదో తెలీదుగాని గురువయ్య అది చూచి అయ్యగారు, అయ్యగారు అని ఉరికి వచ్చి బస్తాను ఒక చేత్తో పక్కకు నెట్టేశాడు. సంచి ఒక పక్కన పడి పోయింది. స్వామి మరో పక్కన చతికిల పడ్డారు. నాంచారమ్మ వురికి వచ్చి స్వామిని లేవదీసింది.

స్వామి లేచి నుంచొని ఎదురుగా నుంచొని ఉన్న గురువయ్యని చూచారు.

నల్లగా, ఎత్తుగా ఇనుప మనిషిలా ఉన్నాడు!

"ఎవరు నాయనా నువ్వు! పరాత్పరునివలె వచ్చి కాపాడినవు! ఆ శ్రీమన్నారాయణుడు పంపించాడా?" అడిగారు స్వామి.

"అయ్యగారు! మీరు లోపల కూకోండి! బస్తాలు నేను ఇంట్లో ఏసి పోత" అని "ఎత్తన్నా బస్తలు" అన్నాడు, గురువయ్య బండి మనిషితో.

నాంచారమ్మ స్వామిని లోనికి తీసికెళ్ళి నడుము రుద్దసాగింది.

గురువయ్య అవలీలగా బస్తాలను ఇంట్లో వేశాడు. "దండముండి అయ్యగారు పొయ్యొస్తా" అన్నాడు చేతులూ వళ్ళూ దులుపుకుంటూ గురువయ్య.

నారాయణస్వామి బల్లపీట మీది నించి లేచి "కాస్త ఆగునాయనా" అని ఇంట్లోకి సాగిపోయారు.

గురువయ్య తల గుడ్డలోంచి పొగాకుతీసి, బొడ్లోంచి మోదుగాకు తీసి చుట్ట చుట్టుకోసాగాడు.

నాంచారమ్మ గురువయ్యను చూచింది-భీముడు ఇలాగే ఉండేవాడేమో అనుకుంది.

"నీ పేరేమిటి?" అడిగింది నాంచారమ్మ.

"గురువడు" తల వంచుకొని చుట్ట చుట్టుకుంటూనే జవాబిచ్చాడు.

"ఎక్కడుంటావు?"

"గూడెము" చుట్ట నోట్లో పెట్టుకొని నిప్పుకోసం అటూ ఇటూ చూచి "జర ఇంగలం ఏస్తారుండి" అడిగాడు గురువయ్య.

నాంచారమ్మకు అతడు నిప్పడిగింది వినిపించలేదు. ఆమెమీద ఎవరో చల్లని నీరు-కుండెడు గుమ్మరించినట్లయింది· అంతలోనే నిప్పులు కురిసింది.

"గూడెములో ఉండెటోనివా? అప్పుడే ఎందుకు చెప్పలేదు. అంటరానివాండ్లు నెత్తికెక్కుతున్నరు···ఇప్పుడు ఈ ఇంటికి నిప్పు...."

స్వామి బయటికి వచ్చి, ఆమె రౌద్రాకారం చూచి హడలిపోయారు.

"ఎందుకట్లరుస్తవు? నోరు మూసుకో" అన్నారు.

"మూసుకోక ఏం చేస్త? మాల మాదుగులు ఇండ్లల్ల దూరుతున్నారు. ఇక మన మడి ఆచారమేముంటుంది?" అని కేకలు వేసుకుంటూనే దొడ్డిగుమ్మంనుంచి బావిదగ్గరికి వెళ్ళిపోయింది.

"ఇదిగో ఈ డబ్బులు తీసుకో—నీ పేరేమన్నవు?" అడిగాడు స్వామి.

"గురువడు—డబ్బులెందుకండి—నేనేమన్న కూలి చేసిన్నా-జర ఇంగలం ఎయ్యుండి చుట్టకాల్చుకుంట" నాంచారమ్మ మాటలు విననట్టే అతిసాధారణంగా అడిగాడు గురువయ్య.

నారాయణస్వామి ఎంత చెప్పినా డబ్బు తీసుకోలేదు గురువయ్య. గురువయ్య చుట్టకు నిప్పూ ఇవ్వలేదు ఎవరూ. దానికోసం కూడా వేచి చూడలేదు గురువయ్య వెళ్ళిపోయాడు.

వెళ్ళిపోతున్న గురువయ్యను చూస్తూ నుంచున్నారు నారాయణస్వామి! ఇతను

మనిషేనా? అనుకున్నారు. ఆ ఆలోచన వచ్చేవరకు యాంత్రికంగా కాళ్ళు ముందుకు సాగాయి. వాకిట్లో నుంచొని చూశారు.

గురువయ్యే సాగిపోతున్నాడు!

సాగుతున్నది తాటి వనంవైపు ! !

బావిదగ్గరకు పోయిన నాంచారమ్మ, బొక్కెనతో నీళ్ళు తోడుకొని నెత్తి మీద పోసుకుంటూ—'గంగేచ యమునేచైవ' చదువుతూంది. మధ్య మధ్య గురువయ్యను సాపిస్తూంది. ఆనాడు ఏదో రాగూడని ఆపద వచ్చిందని తపించిపోతూందామె. ఎన్ని నీళ్ళు గుమ్మరించుకొన్నా తృప్తి కలగటములేదు. ఎక్కడో ఏ మూలనో మలినం ఉన్నట్లు బాధపడుతూంది. బావిలోని సగం నీరు వంటిమీద పోసుకుని ఇంట్లో అడుగుపెట్టి భర్తను పిలిచింది. జవాబు లేదు. నీరుకారుతూ వాకిట్లోకి వచ్చింది.

నారాయణస్వామి పరధ్యానంగా ఉన్నారు.

గురువయ్య వెళ్ళిన బాటనే చూస్తున్నారు.

"ఏమండీ! మిమ్మల్నే! అట్లా నిలబడ్డారేమండి! ఇల్లంత మైలపడ్డది! మనం మాదుగుల్ని కలిసినం. పొండి, స్నానం చెయ్యండి ఇల్లంత అలకాలె. ముగ్గులు పెట్టాలె. బట్టలన్ని పిండాలె. పెరుమాళ్ళుకూడ మైలపడ్డారు. తిరుమంజనం చెయ్యాలె నడవండి" అన్నది.

స్వామి ఈ లోకంలోకి వచ్చారు.

"నాంచారూ! వచ్చినవాడు మనిషనంటవా!"

"ఆఁ, కాక యతిరాజులు వచ్చారు. మీ పిచ్చిగాని పొండి చీకటి పడుతున్నది. స్నానం చెయ్యండి" అని తరిమింది నాంచారమ్మ.

నారాయణస్వామి ఇంట్లో అడుగుపెట్తోంటే దొడ్డిగుమ్మం నుంచి రమ్మంది నాంచారమ్మ.

భార్యమాట కాదనలేదు నారాయణస్వామి.

స్వామి నెత్తిన ఆవుపేడ పెట్టి నీళ్ళు గుమ్మరించింది నాంచారమ్మ. స్నానం ముగించి లోనికి వచ్చారు నారాయణస్వామి.

"వంటయిల్లు అలికి ముగ్గులుపెట్త మొదలు, మీరు తిరుమంజనం ఇస్తుండండి. ఇంతలో తక్కిన ఇండ్లు అలికి, పొయ్యిల నిప్పేస్త" అన్నది నాంచారమ్మ.

నారాయణస్వామి కాదనలేదు.

అలాగే జరిగింది.

భోజనాలు ముగించి పడుకున్నారు భార్యాభర్తలు-నారాయణస్వామి నాంచారమ్మలు. ఎంతకూ ఇద్దరికీ నిద్రరాలేదు. నాంచారమ్మకు తను మైలపడ్డాననే బాధ ఇంకా పోలేదు. నారాయణస్వామికి గురువయ్యను గురించిన ఆలోచన దూరం కాలేదు.

"నాంచారూ! గురువయ్య ఎంత గొప్పవాడు!" అన్నారు స్వామి-ఆ ధ్వనిలోనే ఏదో ఒక రకపు గౌరవం వ్యక్తం అయింది.

"ఏమిటండీ మీరంటున్నది!" చకిత అయి అడిగింది.

"నిజం నాంచారూ! గురువయ్య లేకుంటే నే నిప్పటికి ఎట్లగుండెటోణ్ణో! విరుగుతే నడుము విరిగేది. పోయినా ప్రాణంపోయేది! భగవంతునివలె వచ్చి రక్షించిండు. అతడు మనిషి అంటె ఇంకా నా మనసు ఒప్పటంలేదు."

"మాలముండ కొడుకును పట్టుకొని దేవుడో, దేవుడో అని జపిస్తున్నరేమండి! నీళ్ళతేనా ఆచమనం చేస్తరా!"

"పిచ్చిదానా! అతడు నా ప్రాణం కాపాడిండు. నీ కుంకుమ కాపాడిండు. డబ్బు ఇస్తనంటె తీసుకోలే. కనీసం మనకు ఉపకారం చేసినట్లు భావించలే. ప్రతిఫలంగా నువ్వు అతడిని తిట్టినవు. అతడు అది పట్టించుకోనేలేదు. ఒక యోగివలె నిరాసక్తంగ విన్నడు వెళ్ళిపోయిండు! ఎంత గొప్పవాడు!!"

"ఏమండీ! మీకేమన్న పిచ్చిలేస్తున్నదా? మరి వాణ్ణి నెత్తిన ఎక్కించుకొని ఊరేగుదామంటిరా!"

"అట్ల ఊరేగినా మనం వాని రుణం తీర్చుకోలేం."

"ఆ మాలవాణ్ణి...." నాంచారమ్మ వాక్యం పూర్తికాకముందే చెంప చెళ్ళుమంది. నారాయణస్వామి మంచంమీంచి లేచి, చరచరా నడిచి వసారాలోని బల్లపీటమీద కూర్చున్నారు.

నాంచారమ్మ దిగ్భ్రమ చెందింది. కళ్ళవెంట నీళ్ళు దుమికాయి. ముందు ఆశ్చర్యమూ, తరువాత ఏడుపూ వచ్చాయి. మూలకు కూర్చొని ఎక్కి ఎక్కి ఏడ్వసాగింది.

వసారాలో చీకటి, మూలన చీకటి, మధ్య ఇంట్లో లాంతరు వెలుగుతూంది.

నాంచారమ్మమీద నారాయణస్వామి అంతవరకు చేయి చేసుకోలేదు. వారిది ఆదర్శ దాంపత్యం. కనీసం కీచులాడుకోలేదు, పసిమిలాంటి రంగు, పసుపు పూసిన ముఖం, ఎర్రరాళ్ళ ముక్కుపుడక, దుద్దులతో నాంచారమ్మ లక్ష్మీదేవిలా వుంటుంది. సౌమ్యమయిన ముఖం, చామనచాయ, మకరకుండలాలతో నారాయణుడనిపిస్తారు నారాయణస్వామి. ఆ ఊరికి ఆ దంపతులు లక్ష్మీనారాయణులే.

అలాంటి దంపతుల మధ్య విభేదాలు వచ్చాయి - మనసుకు చిచ్చు రగులుతూంది.

నారాయణస్వామి తన తప్పు గ్రహించాడు.

అనూచానంగా వస్తున్న ఆచారాలు, తరతరాలుగా వస్తున్న నమ్మకాలు. పురాణాలు, కథలు, గాథలు "కులాలు, కులాలు" అని కేకలు పెట్టి చెప్పుతున్నాయి, ఈ నమ్మకాలలో పెరిగి పెద్దదయింది నాంచారు. కాదు తానుకూడా. ఈ సాయంకాలపు సంఘటనదాకా తానూ వాటిని నమ్మాడు. ఇప్పుడు నమ్మడంలేదా. ఇప్పటికీ

నమ్ముతున్నాడు. గురువయ్య విషయంలో తప్పు! గురువయ్య యోగి. తనకు ప్రాణ దాత. కాదు. పెరుమాళ్ళు. అతని విషయంలో తనకో గౌరవం ఏర్పడింది. గులక రాళ్ళలో మాణిక్యం! నిజంగా గొప్పవాడు గురువయ్య! ఎంత అనాసక్తుడు గురువయ్య! తన ప్రాణం కాపాడాడు! డబ్బు వద్దన్నాడు! తిట్లను లక్ష్యం చేయలేదు. కర్మయోగి గురువయ్య. కర్మచేశాడు గురువయ్య. ఫలితం ఆశించలేదు. అందుకే అతణ్ణి మాట అంటే భరించలేకపోయాడు. నాంచారమ్మను కొట్టాడు. తన భార్యను తానే కొట్టాడు. గురువయ్యను గురించి తనకున్న అభిప్రాయం వేరు. నాంచారుకు అతడు మాల-తన ఇంటిని అపవిత్రం చేశాడు. ఆమెకు తెలిసింది ఇంతే. బహుశా తెలియాల్సిందీ అంతే! ఆమెకు తాను నచ్చచెప్పగలడా! చెప్పాడా! కోపం చేతకానివానికి వచ్చేది! తనవద్ద సమాధానం లేకనే కోపం వచ్చిందా? వాస్తవంగా ఇందుకు సమాధానం లేదా! తను చేసిందే తప్పా? తప్పేనా? తప్పు చేశానా? నాంచారును కొట్టాను అనుకునేవరకు దుఃఖం ముంచుకొని వచ్చింది. నారాయణస్వామి పైకి ఏడ్వలేకపోయారు. మోకాళ్ళమీద తలపెట్టుకొని కుమిలి పోయారు.

మూలకు కూర్చున్న నాంచారమ్మ కుమిలిపోతూంది. కొలిమిలో పెట్టి తిత్తితో ఊదినట్లుంది ఆమె పరిస్థితి. ఆమె మనోఫలకంమీద గురువయ్య మసలాడు, భీముడు-గురువయ్య! ఎంత అవలీలగా బస్తాలు లోపల పడేశాడు. అవును స్వామి చెప్పింది నిజం. వాస్తవంగా ఆ భీముడు లేకుంటే!

ఆమెకు నారాయణస్వామి శవం కనిపించింది. తాను పక్కన ఏడుస్తున్నట్లని పించింది.

తన మాంగల్యం కాపాడినవాడు భీముడు - గురువయ్య. నిజంగా అతడు దేవుడు కాదుగదా! కాకుంటే స్వామి అలా ఎందుకంటారు! అతణ్ని తాను తిట్టింది. నిజమే. అతడు మారుపలకలేదు. అదీ నిజమే. మాలవాడు మారుపలకగలడా!

అవును మాలవాడు! అతడు మాలవాడు!!

అది తలచుకునేవరకే ఆవిడకు గురువయ్య విషయంలో ఏర్పడ్డ గౌరవం అంతా కరిగిపోయింది.

తాను ఉన్నమాట అన్నది. అన్నందుకు కొట్టాడు భర్త. తాను చేసిన తప్పేమి? ఏం చేసింది తాను? ఎందుకు కొట్టాడు భర్త?

ఏదో లోపం ఉంది అనుకుంది. భర్త మనసెరిగి ప్రవర్తించలేకపోయా ననుకుంది. అతని కంటే శాస్త్రాలు తనకు తెలియవనుకుంది, అతడు చెప్పిందే తనకు శాస్త్రం అనుకుంది. కొంగుతో కళ్ళు తుడుచుకుంది. లేచింది. వసారాలోకి నడిచింది. బల్లపీటమీద కూర్చున్న నారాయణస్వామి పాదాలంటి నమస్కరించింది.

"తప్పు నాది నాంచారూ" అన్నారు స్వామి గద్గద స్వరంతో.

"అట్లనకండి స్వామీ తప్పు నాది" అన్నది రుద్ధకంఠంతో నాంచారు.

"నాంచారూ!" అని చేతులు చాచాడు స్వామి.

నాంచారు స్వామి బాహుబంధాల్లో ఒదిగిపోయింది.

## 4

గురువయ్య:—

గూడెంలో గుడిసె ఉంది.

గుడిసెలో పడుచు పెళ్ళాం ఉంది-బుచ్చమ్మ.

తాటివనంలో కల్లుంది.

పాడుకోవడానికి పదాలున్నాయి.

దున్నుకోవడానికి 'ఇనాము' ఉంది.

కాజేయటానికి షావుకారు ఉన్నాడు.

గురువయ్య రెక్కలు దాచుకునే మనిషికాదు. కూలి ఇస్తాం రాళ్ళు కొట్ట మంటే గంటలో కొట్టిపడేస్తాడు. 'నీ వంతు వచ్చింది వెట్టి చేయా'లంటే పదాలు పాడుతూ చేస్తాడు. డబ్బు చేతిలో వున్నా లేకున్నా తాటివనానికి వెళ్తాడు-ప్రతిరోజూ. చింతచెట్టుకింద, కాలువ పక్కన, తాటివనంలో పాడుకగా కల్లు పోస్తుంది బుచ్చమ్మ. కల్లు తాగి, పదాలు పాడుతూ ఇంటికి చేరుకుంటాడు.

ఆనాడు తాటివనానికి పోతుంటేనే తటస్థపడ్డది నారాయణస్వామి గండం. గండం గడిపించానని తెలీదు గురువయ్యకు. మామూలుగానే వెళ్ళాడు వనానికి. మోదుగాకు నోటికాడ పెట్టుకున్నాడు. బుచ్చమ్మ ముంతెడు కల్లు పోసింది. తాగాడు. అప్పటికే చీకటి పడింది. పదం పాడుతూ బయల్దేరాడు—

ఆ మాట లంటదే

అట్టనే అంటదే—కోడిపిల్ల.

గంగల తానాలు చేసినానంటదే.

కంసాలి చిన్నోన్ని కరిచినానంటదే

ఉప్పూ, మిరియం రుచి చూచినానంటదే

కొండల ఉడుకుతుంటె

కాశీ కైలాసం చూచినానంటదే

ఆ మాట లంటదే

అట్లనే అంటదే-కోడిపిల్ల.

పాడుతూ వస్తుంటే రామకిష్టయ్య ఇంటి ముందు జనం కనిపించారు. ఏమిటో చూతామని దూరంగా నుంచున్నాడు. రామకిష్టయ్య వణుకుతున్నాడు - పెండ్లానికి చెమటలు పట్టాయి-నోటమాట రావడం లేదు-విధవబిడ్డ ఎంకమ్మ దుమ్ములో కూలబడి ఏడుస్తున్నదల్లా గురువయ్యను చూచి రాగయుక్తంగా.

"నాయనో గురువడొచ్చిండే" అన్నది.

రామకిష్టయ్యకు ప్రాణం లేచి వచ్చింది. "ఒరే గురువా! పాము దూలానికి పట్టుకొని ఉన్నదిరా! ఇంకోనికి చాతకాదురా! నువ్వే కొట్టాలెరా" అన్నాడు.

"పామొచ్చినాది! ఏది చూసొస్త" అని ఇంట్లోకి దూరాడు. అంతా తప్పు కున్నారు. లోపలివాళ్ళు బయటికి వచ్చేశారు. చూశాడు గురువయ్య! దూలంమీద ఉంది! తెల్లని త్రాచు!!

పడగ కనిపించలేదు కాని త్రాచని కనిపిస్తూనే ఉంది, ఒడుపు దొరకడం లేదెవరికీ. దూలందాకా ఎక్కి కొట్టడానికి గుండెల్లేవెవరికీ.

గురువయ్య పామును చూచాడు.

"దండం నాగమయ్యా! ఎల్లిపో, ఈడ ఏమున్నదని వచ్చినవు. కావల్నంటే కోమటాయన పాలు పోస్తడు తాగిపో" అని బయటికి వచ్చాడు. "అది నాగుంబాం.. నేను కొట్టనుండి. పామును కొడ్తె పిల్లలుండరట!" అని సాగిపోతుండగా అడ్డగించి బ్రతిమిలాడాడు రామకిష్టయ్య. రామకిష్టయ్య పెండ్లాం కాళ్ళ పట్టుకునేంత పర్యంతం బ్రతిమిలాడింది. రామకిష్టయ్య విధవ కూతురు ఎంకమ్మ గురువయ్య ముంబొచ్చి నుంచుంది. ఎంకమ్మ పడుచుదే-పరువులు పెడుతున్న పరువంలో ఉంది. రజస్వల కాకముందే భర్త పోయాడు. పోతాడని తెలిసే చేశాడు రామకిష్టయ్య. కూతురుతోపాటు ఆస్తినీ ఇంట్లో పెట్టుకున్నాడు.

మిసమిసలాడే వయసులో ఉంది ఎంకమ్మ. ఎంకమ్మను గురించి చాలా పుకార్లున్నాయి.

ఆమె కళ్ళల్లో కామం బుసలుకొడుతున్నది. ఎంకమ్మ గురువయ్య ముందుంది. పండువెన్నెల!

"భీమునోలె ఉన్నవు పామును కొట్టలేవా, హుఁ" అన్నది ఎంకమ్మ.

గురువయ్యలో అహం పడగ విప్పింది. "కఱ్ఱ తేరి. నిచ్చెన తేరి" అన్నాడు.

రామకిష్టయ్య దంపతుల ప్రాణం లేచివచ్చింది.

"కట్టె ఇగో, నిచ్చెనేసే ఉన్నది" అన్నాడు రామకిష్టయ్య.

కఱ్ఱ అందుకొని లోనికి వెళ్ళాడు గురువయ్య—ఒక్కడు—ఒంటరిగా.. బయట జనం వింత చూస్తున్నారు, ఒక్కడూ అడుగు లోన పెట్టలేదు—అది మాల వాడు అడుగు పెట్టిన ఇల్లు!!!

గురువయ్య పామును చూచాడు. మనసులో ఏదో సంకోచంగానే ఉంది, అయినా కఱ్ఱ అందుకొని నిచ్చెనెక్కాడు.

గుండె గుబగుబలాడింది. ఒడుపు దొరకడం లేదు. పాము కదిలినట్లయింది.

అది భ్రమ! పాము కదల్లేదు-అది పుబుసంలో ఉంది.

గురి చూచాడు గురువయ్య.

"ఒరే! గురవా! ఒక్క దెబ్బకు చావాలె. తప్పించుకుంటే పగ పడ్తది. పడిలంగ కొట్టు, పడగకు దెబ్బ తగిలేడు చూచికొట్టు." రామకిష్టయ్య అరుస్తున్నాడు.

పాము—గురువయ్య —పగ — దిగిపోదామనుకున్నాడు — భీమునిలాగె ఉన్నవు....గుర్తుకు వచ్చింది.

కళ్ళు మూసుకొని కర్ర లేపాడు గురువయ్య, లాగి పాము మీద బాదాడు. పాము 'ఫప్పు' మని కింద పడ్డది.

కళ్ళు తెరిచి చూచాడు గురువయ్య. పాము నడుములు విరిగాయి - తోక ఆడిస్తూంది.

"అరే! ఇంక పానమున్నదిరా! దిగి దెబ్బెయ్యి! దిగి దెబ్బెయ్యి!" ముగ్గురూ కేకలేస్తున్నారు.

గురువయ్యకు కళ్ళు చీకట్లు కమ్ముతున్నాయి. దిగాడు గబగబా—జూలి పడబోయాడు-నిచ్చెన కాళ్ళమీద లేచి మళ్ళీ గోడకు ఒరిగిపోయింది.

"ఎయ్యరా ఇంకో దెబ్బ-ఎయ్యి" రామకిష్టయ్య కేక పెట్టాడు.

గురువయ్య కర్రతో బాదాడు. పాము తల చితికి రక్తం కారెంది- తోక ఇంక ఆడుతూనే ఉంది.

"అబ్బ! చచ్చింది. జర కట్టెమీద ఏసుకొని ఇవుతలికి తీస్కరా" రామకిష్టయ్య పెండ్లాం ఆదేశం.

పామును కర్రమీద వేసి బయటికి తెచ్చి పడేశాడు—గురువయ్య. అతని వళ్ళంతా చెమటలు పట్టింది. ఇనుము చెమర్చినట్లున్నాడు గురువయ్య.

చచ్చిన పామును చూడ్డానికి చుట్టూ చేరారు జనం.

పడగ చితికిపోయింది—రక్తం కారుతూంది.

ఎందుకో ఉసూరుమనిపించింది గురువయ్యకు.

"అరే పామును చంపినవు—నాగుంబామును—దహనంజేసి పోవాలె—లేకుంటే పాపం చుట్టుకుంటుంది." రామకిష్టయ్య ఉవాచ.

దిగాలుపడి చూచాడు గురువయ్య. ఆ చూపులు ఎవరికీ అర్థం కాలేదు.

"పిడకలు పడేసిన్రు పేర్చు" ఆదేశం. పేర్చాడు గురువయ్య.

"పైసా పాము నోట్లో పెట్టు''. పెట్టాడు గురువయ్య.

"ఇగో ఈ పాలు దాని నోట్లో పొయ్యి". పోశాడు గురువయ్య. పిడకల్లో పామును పెట్టి నిప్పంటించాడు. నిప్పు అంటుకుని మండసాగింది.

ఎక్కడివారు అక్కడ వెళ్ళిపోయారు. గురువయ్య మాత్రం నుంచున్నాడు, పిడకలు బూడిద అయింతరువాత బయలుదేరాడు.

"మాలోడు ఇంట్ల దూరెండు. ఇండ్లలకాలె పెండతే-ఎ(్రమన్నతే" అనే శ్రీమతి రామకిష్టయ్యా మాటలు వినిపించాయి.

గురువయ్యా సాగిపోతున్నాడు—బరువుగా—భారంగా. మనిషిని తగలబెట్టి పోతున్నట్లుంది అతనికి.

తాను ఎందుకు చంపాడు? తనకేం చేసింది పాము!

ఆ ప్రశ్న అతని మనసులో ముసరగసాగింది.

రక్తం కారుతూ చితికిన పడగ అతని కళ్ళముందు నుంచి కదలడంలేదు.

అయినా సాగిపోతున్నాడు గురువయ్యా.

గుడిసెముందు - వెన్నెట్లో నుంచుంది లచ్చమ్మ – భర్తకోసం ఎదురు చూస్తూంది. ముద్దబంతిపూలు సిగలో తురుముకుంది. నొసట పైసంత కుంకం బొట్టు పెట్టుకుంది.

ఎంతకూ రావడంలేదు గురువయ్యా.

ఇవ్వాళ ఆమె సంతోషంగా ఉంది. ఏదో చెప్పాలని ఉబలాటపడుతూంది. వెన్నెట్లో వెలిగిపోతుంది లచ్చమ్మ.

గురువయ్యా వచ్చాడు. ఆమె చూచింది. గురువయ్యా ముఖం చూచింది. ఆమెలోని ఉబలాటం అడుగంటింది.

"ఏమో అట్లున్నవు?" అడిగింది వాకిట్లోనే.

గురువయ్యా మాట్లాడలేదు. తల వంచుకొని ఇంట్లోకి దూరాడు. లచ్చమ్మ అనుసరించింది. గురువయ్యా మంచం కుక్కిలో కూలబడ్డాడు.

దీపంబుడ్డి పొగ కక్కుతూ వెలుగుతూంది.

లచ్చమ్మ గురువయ్యా కాళ్ళ దగ్గర కూలబడ్డది. మొగని మోకాలిమీద చెయ్యి వేసి అడిగింది "ఏమైంది? అట్లున్నవు" అని.

గురువయ్యా లచ్చమ్మ కళ్ళల్లోకి చూచాడు—చూపు మరల్చుకున్నాడు—అన్నాడు "పాపం చేసిన లచ్చీ పాపం!" గోడకు చెప్పుతున్నట్లుగా చెప్పాడు.

"నువ్వు పాపం చేసినావు. ఏం పాపం చేసినవు చెప్పు" గురువయ్యాను ఊపి అడిగింది లచ్చమ్మ. తన భర్త పాపం చేయడానికి వీల్లేదు. చేయడనే విశ్వాసం ధ్వనించింది ఆమె మాటల్లో.

"పామును చంపిన నాగుంబామును చంపిన" గురువయ్యా స్వరం కంపించింది.

"నాగుబామును చంపినవులే. నాగుంబామును" భయం వ్యక్తపరిచింది లచ్చమ్మ.

"నేను చంపలే. సాహుకారు చంపించిండు. పడగ చితక్కొట్టిన రక్తం కారి. చచ్చింది" చితికి రక్తం కారుతున్న పడగ తన ముందే ఉన్నట్లు చెప్పాడు.

"ఎందుకు చంపినవు? పాముని చంపుతే పోరలు బతకరట" ఉద్వేగంతో అన్నది లచ్చమ్మ.

"నేను చంపలేదు లచ్చీ! చంపించిన్రు. నాతోని పాపం చేయించిన్రు" మాటల్లో దుఃఖం ఉబికిపడుతూంది. అది గ్రహించింది లచ్చమ్మ. దాన్ని మరింత నొక్కదలచలేదు. ఆమెలోని స్త్రీత్వం సంద్రంలా పొంగింది. మనసులోని దుఃఖపు గూటిని హాలాహలంగా మింగింది. చిరునవ్వు నవ్వి వెన్నెల కురిపించింది.

"అయిపోయింది, అయిపోయింది. లే బువ్వ తిందాం. కోడికూరొండిన" అన్నది లచ్చమ్మ. గురవయ్యను లాలించింది. ఓదార్చింది, అనునయించింది. భోజనానికి లేపింది.

ఇద్దరూ మట్టిమూకుళ్లలో అన్నాలు తిన్నారు. మంచంలో వాలారు.

గురువయ్య దగ్గరగా జరిగి చెవిలో చెప్పుతున్నంత మెల్లిగా అన్నది. "ఒక ముచ్చట చెప్పనా!"

"మంచి ముచ్చటయితే చెప్పు" పెళ్ళాన్ని దగ్గరకు లాక్కొని అన్నాడు.

"శాన మంచి ముచ్చట" లచ్చమ్మలోని ఆరాటం మళ్ళీ వ్యక్తం అయింది.

"అయితే చెప్పు."

చెప్పలేకపోయింది లచ్చమ్మ. ఆమెను సిగ్గు ముంచేసింది. అయినా అన్నది. "నేను నీలు పోసుకున్న."

గురువయ్య ఉలిక్కిపడ్డాడు. ఆమెకు దూరం జరిగాడు.

అతనికి చచ్చిన పాము కనిపించింది. తోకాడిస్తున్న పాము కనిపించింది. పిడకల మంట కనిపించింది–బూడిద కనిపించింది.

లచ్చమ్మ బెదిరిపోయింది. దిగ్గున లేచి కూర్చుంది.

బయట పెద్దపిట్ట అరచింది—కుక్కలు ఏడ్చాయి—ఒక ఉల్క రాలి పడింది.

చంద్రుడు మబ్బుల్లోకి వెళ్ళిపోయాడు.

# 5

నారాయణస్వామి చిత్రాసనం మీద, తూర్పు ముఖంగా కూర్చున్నారు. నాంచారమ్మ వ్యాసపీఠం తెచ్చి ముందుంచింది. తరువాత కళ్ళద్దాలు అందించింది. గోడకు ఆనుకొని కూర్చున్న స్వామి కళ్ళద్దాలు తగిలించుకొని భారతం విప్పారు. అలా పుటలు తిప్పుతుండగానే రామకిష్టయ్య వచ్చి నేలకు చేతులానించి నమస్కరించాడు తరవాత మరికొంత మంది వచ్చి నమస్కరించి కూర్చున్నారు. కొంతసేపు లోకాభిరామాయణం తరువాత పురాణం ప్రారంభించారు స్వామి:

"పాండవులు వనవాసమున నున్నారు. అప్పుడు వారికడకు మార్కండేయ మహర్షి వచ్చినాడు. అతడు వారికి అనేక ధర్మములు బోధించాడు. ఒకనాడు

మార్కండేయుడు "నిజభర్తృ శుశ్రూష యందు నిత్యాసక్తమయిన పతివ్రతకు నఖిల యజ్ఞ దాన తపంబులు సులభంబులగు నొక్క ఇతిహాసంబు చెప్పెద"నని కౌశికుని కథ చెప్పినాడు. నేడా కౌశికుని కథ విందము:

కౌశికుడు ఒక బ్రాహ్మణుడు. అతడు ఒక మంచి గ్రామమున నివాస మేర్పరచుకొనెను. ఒకనాడు అతడు ఒక చెట్టుక్రింద కూర్చొని వేదములు గుణించు చుండెను. ఆ చెట్టుపైనున్న కొక్కెర అతనిపై రెట్ట పెట్టెను. కౌశికునికి కోపము వచ్చెను. అతడా కొంగను చూచెను. కొంగ భస్మమై కూలెను. అందుకతడు చాల చింతించెను.

అప్పటికి మధ్యాహ్నమాయెను. అతడు భిక్షకు బయలుదేరెను. ఒక బ్రాహ్మణి ఇంటికి చేరెను. 'భిక్షాందేహి' అని వాకిట నిలిచెను. ఆ బ్రాహ్మణి భిక్షాపాత్రను కడుగుచుండగా, ఆమె భర్త వచ్చెను. ఆమె భర్తకు భోజనము చేయించి, పరుండ బెట్టి భిక్షాపాత్రతో బయటికి వచ్చెను. అమ్మగువం జూచి కౌశికుండు రోషరంజిత లోచనుండగుచు, అడిగినప్పుడు పెట్టక ఇంత ఆలశ్యమేల జేసితివి అని అడిగెను. అందుకా బ్రాహ్మణి భర్తృశుశ్రూష వలన అలస్యమయినదని చెప్పి, "నీవతి క్రోధుండ వగుటయు నెరుంగుదు. నీ కోపంబున నొక్క కొక్కెర నిహతంబయ్యెగాదె అని నీవు కేవల స్వాధ్యాయపరుండవుగాని ధర్మసూక్ష్మత మెరుంగవు గావున మిథిలా నగరమ్మునందలి ధర్మవ్యాధుని కడకేగుము" అనెను.

"ఇచ్చట మన మొక విషయము గమనించవలెను. ధర్మసూక్ష్మము నెరిగిన కిరాతుడు స్వాధ్యాయపరునకన్న మిన్నయని వ్యాసుడు చెప్పుచున్నాడు" అన్నారు స్వామి.

"అయ్యగారూ! మల్ల బాపనాయన కటికోనిదగ్గరికి పాయెనా?" అడిగాడు రామకిష్టయ్య.

కౌశికుడు మిథిలా నగరమునకేగెను. ధర్మవ్యాధుని మాంసశాల కేగెను. అల్ప మృగ మాంసఖండంబు లంగడిం బచరించి యమ్ముచున్న వాని ననవరత విక్రయాత గజన సమాతృతు నక్కిరాతుంగని యలిజు గుప్పితంబయిన సూనాపణంబు సేరనొల్లక తొలంగి యొక్క యెడ నుండెనంత, ధర్మవ్యాధుడు బ్రాహ్మణుని రాక నెరింగెను. అతడే దిగివచ్చి, కౌశికునకు మ్రొక్కి "మిమ్ము బ్రాహ్మణి పంపినదిగదా రండు" అని ఇంటికి తీసుకొని వెళ్ళెను. కటికవాడు బ్రాహ్మణునకు అనేక ధర్మములు బోధించెను. తరువాత ఇంటిలోనికి తీసుకునిపోయి ధర్మవ్యాధుడు తన తల్లిదండ్రు లను, తాను వారిని పూజించుచున్న విధమును వివరించి "నీకు వృద్ధులయిన తలిదండ్రులున్నారు, నీకై వగచి వగచీ వారి కన్నులు పోయినవి. నీవుతప్ప వారికి దిక్కులేదు. నీవు వారిని విడిచినావు. సదాధ్యయనశీలుడవయినావు. అది ధర్మము కాదు.

నీ యధ్యయనమ్మును నుక్కృ
తాయాసము నిష్ఫలంబులై చను గురుసే
వాయుక్తిలేక తక్కిన
జేయుము నా పలుకు మేలు సేకురు నీకున్."

అందుకు కౌశికుడు తాను చేసిన తప్పును తెలుసుకొని "నా పాలిటి వేల్పు నీవు," అని ధర్మవ్యాధుని కొనియాడి "నిను నొక శూద్రుగా దలప నేర గుణాకర నీ చరిత్రముంగన మది నద్భుతం బొలసె" అని వానికిం బ్రదక్షిణంబు సేసి వీడ్కొని చని కౌశికుండు నిజ జననీ జనకుల కతి భక్తి శుశ్రూష సేసి కృతార్థుం డయ్యె."

"మంగళం కోసలేంద్రాయ" అని మంగళహారతి ఇచ్చి ముగించారు స్వామి. రామకిష్టయ్య తెచ్చిన నువ్వులూ, బెల్లం అందరికీ పంచింతరవాత రామకిష్టయ్య అడిగాడు.

"అయ్యగారూ! అంటరుగని కటికోడు కటికోడే, బాపనాయన బాపనాయనే! వాడు ఈనకెట్ల నీతుల్సెప్పిండుండి? అందుకే అన్నరేమో రామాయణం రంకని భారతం బొంకని. అంత ఎట్లనో ఉన్నదుండి. నాకయితె నమ్మకం కలుగుతలేదు."

నారాయణస్వామి కళ్ళద్దాలుతీసి పుస్తకంమీద పెట్టి కళ్ళు నలుచుకొని "రామకిష్టయ్యా! ధర్మం అన్నిటికంటె గొప్పదయ్యా! కులాలు, అధ్యయనం దాని కింద పనికిరావు. ధర్మాన్ని ఆచరించినవాడు ధర్మవ్యాధుడు. ధర్మాన్ని వదులుకున్న వాడు కౌశికుడు. అందువల్ల వ్యాధుడు కౌశికుణ్ణి మించిపోయినాడు. భారతంలో ఉన్నది గదనయ్యా.

పాపవర్తనుండు బ్రాహ్మణుండయ్యును
నిజము శూద్రునికంటె నీచతముడు
సత్య శౌచధర్మశాలి శూద్రుండయ్యు
నతడు సద్విజుండ యనిరి మునులు."

నారాయణస్వామి పద్యం పూర్తిచేయకుండానే లచ్చమ్మ గురువయ్య ప్రవేశించి "కాల్మొక్తి అయ్యగారూ" అని అక్కడే నేలనంటి దండాలు పెట్టారు.

వారిని చూసి రామకిష్టయ్య మండిపడ్డాడు.

"ఒరే! మాలమాదుగుల అయ్యోర్లిండ్లకొస్తె ఇగ బాగుపడ్డట్టె. పొగరెక్కిందిర గాడ్దికొడుకులకు. బుక్కెటందుకు బువ్వుండెటార్కల్లె ఎగిరిపడ్తాంద్రు, ఇంక నిలబడ్తి రేమిరో ! పొమ్మంటె పోవేమిర గాడ్దికొడక ! పోతవమల్ల...."అని లేచి నుంచు న్నాడు. అక్కడున్న వాళ్ళంతా లేచి నుంచున్నారు. గురువయ్యమీదికి యుద్ధానికే సన్నద్ధులైనారు.

"ఎరకలేకొచ్చినం బాంచెను. పోతంలేరి. మీరెందుకు కోపంపడ్తరు" అని లచ్చమ్మ గురువయ్యను లాక్కొనివెళ్ళిపోయింది.

"పాపం ఎందుకోసరం...." నారాయణస్వామి మాట పూర్తిచేయకుండానే అందుకున్నాడు రామకిష్టయ్య.

"అయ్యగారూ ఇగో చెప్తాన్న, పురాణాల్లో ఏమన్న ఉండనియ్యండి. మాలోండ్లు మాలోండ్లే, మనం మనమే. మల్ల మాలోణ్ని బాపనోణ్ణి చేస్తమంటరా? ఇగ మీరున్నరు. మేమున్నం." అని లేచి వెళ్ళిపోయాడు రామకిష్టయ్య. మిగతావారు రామకిష్టయ్యను అనుసరించారు.

స్వామి వాకిలిదాకా వెళ్ళి వాళ్ళు వెళ్ళినవైపే చూస్తూ నుంచున్నారు.

నాంచారమ్మ వ్యాసపీఠం, గంధం, కళ్ళద్దాలు తీసి వంట ఇంట్లో తన పనిలో మునిగిపోయింది.

నారాయణస్వామి వాకిట్లో చాలసేపు నుంచున్నారు. వారికి పరిపరి విధాల ఆలోచనలు వచ్చాయి. ఎందుకు వచ్చాడో గురువయ్య! భార్యతో కూడా వచ్చాడు! ఏదో పని ఉండే వచ్చి ఉంటాడు. రామకిష్టయ్య ఎలా ప్రవర్తించాడు! పురుగును నెట్టినట్లు నెట్టేశాడు. గురువయ్య పాపం ఒక్క మాట అనలేదు. వెళ్ళిపోయాడు. ఏం తప్పు చేశాడతను? అతడు అంటరానివాడు. ఇంట్లోకి వచ్చాడు. అది తప్పే కావచ్చు. గురువయ్య విషయంలో అది సమంజసమా! అతడు తన ప్రాణం కాపాడాడు. ఎంత పరోపకారి!

ఇలాంటివే అనేక ఆలోచనలు వచ్చాయి. ఏమేమో ఆలోచించారు. అక్కణ్ణుంచి వంట ఇంట్లోకి వెళ్ళి నాంచారమ్మ పక్కన కూర్చొని "నాంచారూ! పాపం గురువయ్యను ఎట్ల కసిరిండు రామకిష్టయ్య! ఏం పని మీద వచ్చిండో పాపం!" అన్నారు.

నాంచారమ్మ ఆశ్చర్యపోయింది. నారాయణస్వామి అలా ఎన్నడూ ఆమెను ఏ విషయంలోనూ అడగలేదు. నాంచారమ్మ ఒక్కసారి నారాయణస్వామి కళ్ళల్లోకి చూచింది. ఆవేదన కనిపించింది. ఎన్నడూ దేనిని గురించీ లక్ష్యం చేయని స్వామికి ఈ ఆవేదన ఏమిటి! స్వామిలో ఏదో భయంకరమయిన మార్పు వస్తూంది అనుకుంది. ఆమెకు ఎందుకో గుబులు పుట్టింది. ఏమనాలో ఆమెకు అర్థం కాలేదు.

"మీరు చెప్పింది భారతంలో ఉన్నదా ?" అనాలోచితంగా అడిగేసింది నాంచారమ్మ.

ఎవరో వీపుమీద కొట్టినట్లయింది నారాయణస్వామికి.

"నాంచారూ? నమ్మకంలేదా నామీద! లేనిది ఎందుకు చెప్పుతాను? జ్ఞానం ప్రధానం నాంచారూ! దీపానికి ప్రాధాన్యం వెలుగుకదా? జ్ఞానం మనిషికి ప్రాధాన్యం. జ్ఞానంలేని బ్రాహ్మణునికంటే జ్ఞానం ఉన్న మాలడు మేలు."

"దేవుని ఇంట్లో అట్లాంటి మాటలనకండి."

"వెర్రిదానా ఇట్లరా" అని ఆమెను తీసుకొనివచ్చి బల్లపీటమీద కూర్చుండ

పెట్టి గ్రంథం తెచ్చారు. "విను మన యతిరాజులు ఉన్నరే ఎవరు? రామానుజులు వారే శూద్రులను ఆశ్రయించారే!"

వింతగా చూచింది నాంచారమ్మ.

"కాంచీపురంలో కాంచీపూర్ణుడనే భాగవతోత్తముడు ఉండేవారు. వారితో కంచి వరదరాజస్వామి సాక్షాత్తు మాట్లాడేవారట. కాంచీపూర్ణులు శతపద జాతికి చెందిన శూద్రులు. వారి మహిమ నెరిగిన రామానుజుడు వారిని గురువుగా వరించినారు. తాను శూద్రుడనని రామానుజుని శిష్యునిగా చేసుకోవటానికి కాంచీపూర్ణుడు అంగీకరించ లేదు. రామానుజుడు ఒక ఉపాయం ఆలోచించినారు. రామానుజుడు కాచీపూర్ణుని భోజనానికి పిలిచినారు. వారు వస్తామన్నారు. కాంచీపూర్ణుడు భోజనం చేసిన తరువాత వారి ఎంగిలి తిని పవిత్రం కావాలనుకున్నారు రామానుజులు.

కాంచీపూర్ణుడు భోజనానికి వచ్చేరోజు - రామానుజుని భార్య తంజయమ్మ వంట చేసింది. ఎదిరి చూచి, ఎదిరి చూచి కాంచీపూర్ణుల కోసరం బయలుదేరినారు రామానుజులు. వేరేతోవన కాంచీపూర్ణుడు రామానుజుని ఇంటికి వచ్చారు. తంజయమ్మ వడ్డించగా భోంచేసి వెళ్ళిపోయారు కాంచీపూర్ణులు. తలమీదినుంచి స్నానంచేసి వస్తున్న తంజయమ్మ తిరిగి వస్తున్న రామానుజునికి కనిపించింది. కారణం అడుగుతే "శూద్రునికి అన్నం పెట్టిన కాబట్టి స్నానం చేసి వస్తున్న" అని చెప్పింది.

రామానుజుడు చాలా బాధపడ్డారు. తంజయమ్మను ఎంతగానో దూషించిన్రు. ఇటువంటి ఇంకొక రెండు తప్పులు తంజయమ్మ చేసిన తరువాత భార్యను వదిలి రామానుజుడు సన్యాసం స్వీకరించిండు" అని చెప్పి "విన్నవా మనం రామానుజం కంటె ఎక్కువా?" అని అడిగారు.

నాంచారమ్మకు అర్థం అయింది రామానుజుడు భార్యను వదిలేశాడనేది. ఆమె భయపడ్డది! మరో ఆలోచన లేకుండా అనేసింది "గురువయ్యే మంచోడు" అని.

నారాయణస్వామి చాలా సంతోషించారు.

"నాంచారూ, సత్యాన్ని గ్రహించటం కష్టం. గ్రహిస్తే అది మనను నడిపిస్తుంది. వెలుగు చూపుతుంది" అన్నారు.

నాంచారమ్మకు ఏమీ అర్థం కాలేదు అయినా తల వూపింది.

రామానుజుడు ఉపదేశం పొందింది తిరుక్కోట్టి నంబియారు వద్ద. ఆ నంబి పంచములు. రామానుజుడు పదిహేనుసార్లు నంబి దగ్గరకు తిరిగిన్రు. పద్దెనిమిదో సారి మంత్రం ఉపదేశించిన్రు. రహస్యంగా ఉంచమన్నరు. రామానుజుడు దాన్ని రహస్యంగ ఉంచిండనుకున్నవా? అక్కడ శ్రీరంగనాధుని ఉత్సవం జరుగుతున్నది. అన్ని కులాల జనులు అనేకులు అక్కడ చేరిన్రు. రామానుజులు ఆలోచించిన్రు. ఈ

మంత్రం ఇంతమందికి మోక్షం కలుగజేస్తే నాకు నరకం వస్తే ఏం అనుకున్నారు. దేవాలయపు గోపురం ఎక్కిన్రను. "ఓం నమో నారాయణాయ" అనే అష్టాక్షరిని ఎలుగెత్తి అందరికి చాటిన్రను"

"ఆఁ, అట్ల చేసినార్రుండి. అబ్బ ఎంత మహాత్ములు!" అన్నది నాంచారమ్మ. అది ఆమె మనసులోంచి వచ్చిన మాట.

"ఇంక విను. రామానుజుడు అట్ల ఉపదేశించిండని నంబికి తెలిసింది. కోపం వచ్చింది. రామానుజుని పిలిపించిన్రను."

"గురుని ఆజ్ఞ ఉల్లంఘించిన వారికి ఏగతి కలుగునో తెలియునా?" అని అడిగిన్రను నంబి.

"తెలుసును స్వామీ? రౌరవ నరకము కలుగును" అన్నారు రామానుజులు.

"అట్లయితే మంత్రం అందరికెందుకు ఉపదేశించినవు?'' అని కోపంగ అడిగిన్రను నంబి.

"ఇంతమంది జనులు విముక్తులు కాగా నేనొక్కణ్ణి నరకానికి పోతేనేమి?''

అన్నారు రామానుజులు.

"అబ్బ! ఎంత గొప్పవారండి'' అన్నది నాంచారమ్మ.

"రామానుజుని మాట విని నంబి కూడ నువ్వన్నట్లే అని రామానుజుని కౌగిలించుకొని—

"సద్గురుండవు నీవెపో జనులకెల్ల

మా కొరంతలు దీరె నీ మహిమ కతన.''

అన్నారు" అని ముగించారు నారాయణస్వామి.

"అబ్బ ఎంత గొప్పవారండి రామానుజులవారు! నరకానికి పోతనని తెలిసి అందరికి ఉపదేశించిండు. మనం గురువయ్యకు సంస్కారం కలిగించాలెనండి'' ఉత్సాహంగా అన్నది నాంచారమ్మ.

"పిచ్చిదానా! అసలు గురువయ్యే మన కండ్లు తెరిపించిండు. ఇంత కాలం మనం ఆలోచించినమా ఇవన్నీ?''

"అవునండి. ఎన్నడు చెప్పకపోతిరి ఇవన్ని. గురువయ్యను పిలిపించ రాదుండి."

"పిలిపిస్త. నువ్వు వంట మరిచిపోయినవు. ఇవ్వాళ ఉపవాసమా?"

"అయ్యో! నా మతి మండ! మరిచేపోయిన. పోయి మడికట్టుకుంట" అని నాంచారమ్మ వెళ్ళిపోయింది.

నారాయణస్వామికి ఎంతో తేలిక అయినట్లయింది. గూట్లో వెలుగుతున్న దీపాన్ని చూస్తూ ఉండిపోయారు.

# 6

ఓరి మద్దెలకాడ! బహు వన్నెకాడ! నిను చూస్తే నా మనసు నిలువా కున్నదిరా! నీళ్ళకు నేపోంగ నా వంక చూడకురా! నీవు చూస్తే కడవ నీటా మునగదురా!

గురువయ్య తాటివనం నుంచి పదం పాడుకుంటూ పోతున్నాడు. పదం పిల్లగాలిలా ఉంది. పున్నమ వెన్నెల్లా వుంది. పిల్లకాలువలా సాగుతూంది.

పదం బాగనిపించింది నాంచారమ్మకు. బాగనిపించడం కంటే గురువయ్య గొంతు గుర్తుపట్టడం ఆమె సంబరం. భర్తను పిలిచి చెప్పింది. నారాయణస్వామి పరిగెత్తి వాకిట్లోకి వచ్చారు.

"నీవు చూస్తే కడవ నీట మునగదురా" పాడుతూ సాగిపోతున్నాడు గురువయ్య.

"గురువయ్య" పిలిచారు నారాయణస్వామి.

గురువయ్య వినిపించుకోలేదు. సాగిపోతున్నాడు.

మళ్ళీ పిలిచారు నారాయణస్వామి. అప్పటికి నాంచారమ్మ కూడా వచ్చేసింది.

గురువయ్య వెనక్కు తిరిగి చూశాడు.

"నన్నానుండి పిలిచింది?" అడిగాడు దూరంగా నుంచునే.

"అవును నిన్నే" నారాయణస్వామి.

గురువయ్య దగ్గరికొచ్చి "కాల్మొక్త గుర్విగా, గురవా అని పిలుస్తరుండి నన్ను. గురువయ్యా అని పిలిస్తే ఎవరినో అనుకున్న చెప్పండి అయ్యగారు ఏమన్న పనున్నదా?" అడిగాడు.

"ఎందుకో వస్తివి?" నాంచారమ్మ.

"ఆఁ గప్పుడా.... ఏదో వచ్చినంలేరి. కోమటాయన కోప్పడె.... పోతిమి.... మల్లెందుకులేరి. ఏమన్న పనుంటె చెప్పండి."

"గురువయ్యా! నీతోని పనుంటెనే వస్తవా? మాతో పనుండి రావా? ఎంత మంచోనివయ్యా!" నారాయణస్వామి ఎంతో మెత్తగా అన్నారు.

"అయ్యగారూ! ఎంత మంచోరుండి మీరు! నన్ను గురువయ్య అన్నరు. మంచోడన్నరు. కాల్మొక్త మీ కాళ్ళకాడ పరుండెటోల్లం. అనకుండి. అట్లనకుండి. ఎట్టి చేయించుకున్నోడు తన్నులు తన్నిండు గని ఇట్లనలేదుండి. మీరు దేవుళ్ళుండి. అయ్యగారు, అమ్మగారు మేం మనుసుల మానుండి! పురుగులోలె బతుకుతున్నం. నీ కాల్మొక్త. నీ కడుపున పుడ్త" అన్న గురువయ్య నేలకు తల అనించి దూరంనుంచే కాళ్ళు పట్టుకున్నట్లు చేసి, మూడుసార్లు మొక్కాడు.

నారాయణస్వామి కరిగిపోయారు. నాంచారమ్మ కళ్ళు చెమ్మగిల్లాయి!

మనసున్నవాని మనుగడ కష్టం. అన్నింటికీ ఏడుస్తాడతడు. అంతకంటే ఏం చేయలేడు గనుక!

"గురువయ్యా! నిజంగ నువ్వు మంచోనివి. ఒకరికి ఉపకారం చేస్తవు. ఒకరి నుంచి ఉపకారం కోరవు. అంతకంటె ఏంకావలె గురువయ్యా!" నారాయణస్వామి మాటల్లో తడి కనిపించింది.

"అట్లనకండి, అయ్యగారూ! అనకండి, బాంచోల్లం షేం, చాకిరి చేసేటం మకే పుట్టినం గులాపోల్లం. చెప్పుని ఏం పనున్నదో. నా చర్మం వలిచి చెప్పులు కుట్టనా?"

"వద్దు గురువయ్యా వద్దు. ఇప్పటికే చాల చేసినవు."

"మల్ల ఎందుకో పిలిస్తిరి?"

"ఎందుకో వస్తివి?"

"అట్లంటరా! మాలచ్చి కెరకనుండి. పొద్దాల తీసుకొస్త. కాల్మొక్త."

ఇప్పుడే రమ్మందామనుకున్నారు నారాయణస్వామి. రామకిష్టయ్య కోపం గుర్తుకు వచ్చి, అవును రామకిష్టయ్య గుప్పిట్లో అందరి ప్రాణాలూ ఉన్నాయి! అతని డబ్బుముందు ఇతని పాండిత్యం ఎంత? అయినా ఆ మాట అనలేదు స్వామి. "అట్లనేలే. తప్పకరా" అన్నారు—గురువయ్య తాగి ఉన్నాడని గ్రహించి అన్న మాట అది.

"అట్లనేవస్త" అని దండంపెట్టి వెళ్ళిపోయాడు గురువయ్య.

"ఇంత మంచివాళ్ళకు పంచములుగా ఎందుకు సృష్టించిండండి దేవుడు ?" భర్తనడిగింది నాంచారమ్మ.

నారాయణస్వామి భార్య కళ్ళల్లోకి చూచాడు. ప్రశ్నలు కనిపిస్తున్నాయి ఆమె కళ్ళలో. నారాయణస్వామి మెదడు సమాధానాలకోసం వెతికింది దొరక లేదు.

"ఖర్మ" అన్నాడాయన.

"అంతేనా?" అని మాత్రం అంది నాంచారమ్మ.

"మంచియన్నది మాలయయితే మాలనే యగుదున్" అన్న గురజాడ వారికి తెలియడు.

తెల్లవారి గురువయ్య లచ్చమ్మను తీసుకుని వచ్చాడు. స్వామిని పిలిచాడు వసారాకు దూరంగా నుంచొని. స్వామి వచ్చారు.

"దండంపెట్టె అయ్యగారికి. దేవునంటోరు" అన్నాడు లచ్చమ్మతో. ఇద్దరూ నేలనంటి నమస్కరించారు. ఇంతలో నాంచారమ్మకూడా వచ్చేసింది.

"ఏం లచ్చమ్మా! చెప్పకపోతివి" అడిగారు నారాయణస్వామి.

"పామును చంపిండుండి...." అని మొదలుపెట్టి యావత్తు కథ చెప్పేసింది.

ఆ కథకూ వీళ్ళు రావడానికి నిమిత్తం ఏమిటో అర్థంకాలేదు స్వామికి. తరవాత కథ చెప్పమన్నట్లుగా గురువయ్యను మోచేత్తో పొడిచింది అచ్చమ్మ.

"ఏంలేదుండి పామును చంపితే పోరలు బతకరటగద. బుగులు పట్టాంది అచ్చి. అచ్చి నీలుపోసుకున్నదుండి" తలవంచి సిగ్గుగా వేళ్ళు విరుచుకుంటూ చెప్పాడు గురువయ్య.

అచ్చమ్మ ముఖం జేవురించింది.

నాంచారమ్మ ముచ్చటగా అచ్చమ్మను చూచింది. ఆమెకు ఎందుకో చెప్పరాని ఆనందం కలిగింది. అచ్చమ్మ తల్లి కాబోతూంది. ఆ మాపే ఆమె మనసును పొంగించింది.

"పామునెందుకు చంపితివి గురువయ్యా!" ఎంతో సానుతాపంతో అడిగింది నాంచారమ్మ.

"నా కెరకానుండి, కోంటాయన చంపమన్నడు. చంపిన. పడగ మీద కొట్టిన్నుండి. చితికి నెత్తురు కారింది. అబ్బ అది తల్చుకుంటేనే పళ్ల వణుకుతాంది. నేను చంపలేదు బాంచెను. కోంటాయన చంపించిండు. చెప్పరి పోరలు నిజంగానే బతకరా!" అప్పుడే పామును చంపినట్లు వణికిపోతున్నాడు గురువయ్య. అచ్చమ్మ ముఖంలో సైతం భయం స్పష్టంగా కనిపిస్తూంది.

"చంపించినోడు ఒకడయితే పాపం గురువయ్యనెందుకు చుట్టుకుంటుందండి" ఆతురతగా అడిగింది నాంచారమ్మ.

గంభీరంగా ఆలోచిస్తున్నారు నారాయణస్వామి. తనకు రానున్న ఆపదను కూడా తెలుసుకోకుండా పామును చంపాడు గురువయ్య. దెబ్బ సరిగ్గాపడి ఉండక పోతే గురువయ్యే చావవలసినవాడు. దైవ సంకల్పంవల్ల గురువయ్య బతికాడు. పుట్టనున్న బిడ్డకు కలుగనున్న ప్రమాదం గురించి ఆలుమగలు అలమటిస్తున్నారు. చంపించింది రామకిష్టయ్య. తన భద్రత కోసం. తన ప్రాణాలకోసం. చంపినవాడు గురువయ్య. చంపింది స్వార్థంతో కాదు. పరులకోసం! అయినా రామకిష్టయ్యను ఒక్క మాట అనడంలేదు గురువయ్య! మరి రామకిష్టయ్యో? అమాయకంగా నా ఇంట్లో అడుగు పెట్టినందుకు గురువయ్యను నానా దుర్భాషలాడాడు. ఎంత కృతఘ్నుడు రామకిష్టయ్య! అనుకున్నారు. తరువాత భార్యతో అన్నారు.

"నాంచారూ! కర్తా కారయితాచైవ.....! పాపం చేయించినవాడికి చేసినవానికి చెందుతుంది. ఇద్దరూ అనుభవించవలసిందే."

"అయితే నేను పాపం చేసినట్లేనా అయ్యగారూ! దానికి ఉపాయం లేదానుండి" దీనంగా అడిగాడు గురువయ్య.

"పోరలు బతికే ఉపాయం చూడుండి. కాల్మొక్త. చచ్చి మీ కడుపున పుడ్త" మాతృ హృదయం కృశించింది. ఏడుస్తూనే అన్నది అచ్చమ్మ.

"అయ్యో! ఏదన్న ప్రాయశ్చిత్తం చెప్పండి. చూడండి పాపం ఆ పిల్ల ఎట్ల ఏడుస్తున్నదో" అని భర్తతో అన్న నాంచారమ్మ "లచ్చమ్మా! ఏడవకు దేవుడు నిన్ను రక్షిస్తడు. గుమ్మడిపండంటి కొడుకు పుడ్తడు" అన్నది.

ఆశగా చూచారు ఆలుమగలు.

"గురువయ్యా! పుట్టలో పాలుపోయించు లచ్చమ్మతో. పాలుతెస్తె మంత్రించి ఇస్త. పాపం దూరం అయిపోతుంది. పుట్టే బిడ్డ ఆరోగ్యంగా పుట్టడు."

"అట్ల చెప్పరి కాల్మొక్త. ఇప్పుడే తెద్దునా పాలు!" అడిగాడు గురువయ్య.

లచ్చమ్మ ముఖం వికసించింది.

"పాలు వాండ్లెక్కడ తెస్తరండి. నేను పోస్తలే గురువయ్యా! నెలకొక్కసారి పోయి పుట్టకు పాలు" నాంచారమ్మ అన్నది.

"అయితె పోయి" అన్నాడు గురువయ్య.

"అట్లకాదు గురువయ్యా. ఇద్దరూ స్నానాలుచేసి శుచిగా రాండి" నారాయణ స్వామి.

"అట్లనే లేని" అని బయల్దేరిన గురువయ్య నాపి లచ్చమ్మ "రేపు పొద్దాల వస్తముండి—బట్టలు ఉతికి ఎండేసుకోవలెగద" అన్నది ఉన్నవి వంటిమీద బట్టలేననే విషయం సూచిస్తూ.

నాంచారమ్మ హృదయం ద్రవించింది. "ఉండండి" అని గురువయ్య దంపతులను ఆపి లోపలనుండి ఒక దోవతి, చీర తెచ్చి వాళ్ళ మీదికి విసిరివేస "ఇవ్వి కట్టుకొని పాలు పొయ్యండి" అన్నది.

నాంచారమ్మ ఔదార్యాన్ని ఆశ్చర్యంగా చూచారు నారాయణస్వామి.

"కట్టుకుంటరు పాపం బట్టలన్న లేవట" వ్యధ నిండిన గొంతుతో అన్నది.

బట్టలందుకున్న గురువయ్య దంపతులు మూర్తీభవించిన కృతజ్ఞతా రూపాలుగా చేతులు నేలకానించి దండంపెట్టి వెళ్ళిపోయారు.

"మీరు మంత్రాలెప్పుడు నేర్చిను!" అడిగింది నాంచారమ్మ—ఆ మాటల్లో వెక్కిరింపు ధ్వనించింది.

"నాకు మంత్రాలు రావు నాంచారు. శ్రీమన్నారాయణుడు ఒక్కడే దేవుడు. తిరుమంత్రం ఒక్కటే మంత్రం. అది నా విశ్వాసం. గురువయ్య చేసిన పాపానికి వణికిపోతున్నడు, ఏదో ఒకటి చేయకుంటే అతనికి తృప్తి లేదు. అందుకే పాలు పొయ్యమన్న, మంత్రించిన పాలంటే మరింత నమ్మకం కలుగవచ్చు."

"అబ్బ ఎన్ని మాటలు నేర్చినండి" అని బిందె తీసుకొని చెరువుకు వెళ్ళిపోయింది నాంచారమ్మ. చిన్న పంచె తీసుకొని ఏటికి వెళ్ళిపోయారు నారాయణస్వామి.

నారాయణస్వామి, నాంచారమ్మ ఇంటికి వచ్చి తమ కార్యక్రమాలు పూర్తి చేసుకునేవరకు గురువయ్యా, లచ్చమ్మా మంచి బట్టల్తో ప్రత్యక్షమైనారు. నొసట

కుంకుమ, విరియబోసుకొని ఉన్న తడి వెంట్రుకలతో అచ్చమ్మ ముద్దుగా కనిపించింది నాంచారమ్మకు.

"పాలు మంత్రించిన 'రామ రామ' అంటూ పుట్టలో పోయండి" అన్నారు నారాయణస్వామి.

"అయ్యగారూ! ఒక్క మాట, కాల్మొక్త. మీరుకూడా అడిదాక వచ్చి మంత్రం చదువుతె బాగుండు నంటున్నది అచ్చి" దీనంగా వేడుకున్నట్లు అన్నాడు గురువయ్య.

ఇరకాటంలోపడ్డారు నారాయణస్వామి. వారికి రామకిష్టయ్య గుర్తుకు వచ్చారు. ఆతడు తమ ముందు రక్కసిలా నుంచుని అటకాయిస్తున్నట్లనిపించింది. అది కాకుంటే వారికి అడ్డంకి ఏమీలేదు. ఆలోచించి అన్నారు. "పాలు మంత్రించినవే పుట్టలో పోస్తే సరిపోతుంది."

అచ్చమ్మ చిన్నబుచ్చుకుంది. "వస్తైనే మంచిది బాంచెను— పోరలు బతుకుతరు."

"వెళ్ళిరారాదండి ఏం బోయింది-దూరంలో వుండి మంత్రం చెప్పండి" నాంచారమ్మ బ్రతిమాలినట్లుగా అంది.

తప్పలేదు నారాయణస్వామికి. మెడలో తులసిమాలతోనే బయల్దేరాడు.

వారు వెళ్ళేప్పుడు అచ్చమ్మతో "పోయేటప్పుడు రా చింతకాయపచ్చడి పెడ్త-పుల్లటిది తినాల్నని ఉంటదిగద!" అన్నది నాంచారమ్మ.

అచ్చమ్మ ముఖం చేటంత అయింది.

ఆలా ఏర్పడ్డ పరిచయం నానాటికి పెరగసాగింది. అచ్చమ్మ ప్రతిరోజూ నాంచారమ్మ దగ్గరికి వచ్చేది. పచ్చళ్ళు, ఊరగాయలు, కూరలు ఏదో ఒకటి పెడ్తూనే ఉండేది నాంచారమ్మ. అచ్చమ్మ కడుపు పెరుగుతుంటే నాంచారమ్మకు సంతోషంగా వుండేది. అచ్చమ్మ తన ఇంటి విషయాలన్నీ నాంచారమ్మతో చెప్పుకునేది. నాంచారమ్మకు చెప్పుకోవలసిందేమీ లేనందుకు విచారంగా ఉండేది.

గురువయ్య అప్పుడప్పుడు నారాయణస్వామికి కనిపిస్తుండేవాడు. కట్టెపుల్లలు కొట్టడమో, గడ్డిమోపు తేవడమో, తప్పిపోయిన బర్రెను పట్టుకురావడమో చేస్తుండేవాడు. గురువయ్య ఎన్నడూ ఏదీ అడగలేదు—నారాయణస్వామి ఇస్తే తీసుకోలేదు.

వారి పరిచయాన్ని ఊరు వింతగా చూచింది.

## 7

పుట్టకు పాలు పోయించిన్నాటి సాయంకాలం మామూలుగా పురాణం వినడానికివచ్చాడు రామకిష్టయ్య. రామకిష్టయ్యకు జరిగిన సంగతి తెలిసింది.

అయినా అతడు ప్రత్యక్షంగా స్వామిని అడగలేదు.

"సుద్దరోడు తపస్సు చేస్తుంటే రాములోరు తల తెగనరికిన్రటకాదుండి" అడిగాడు రామకిష్టయ్య. గ్రహించారు నారాయణస్వామి.

"అవును వధించిన మాట నిజం. కాని వధించిన రాముడే శంబూకునకు వైరాజలోకాన్ని ప్రసాదించినాడు" అని శ్లోకం చదివారు స్వామి:—

"యత్రానందాశ్చ మోదాశ్చ యత్రపుణ్యాశ్చ సంపదః
వైరాజా నామతే లోకా స్తపోమిసాః సంతుతే శివాః"

సంస్కృతం విని ఉలకలేదు పలకలేదు రామకిష్టయ్య. రామకిష్టయ్యకు కృతఘ్నతను గురించి చెప్పాలనుకున్నారు స్వామి.

"రామకిష్టయ్యా! రాముడు వాలిని వధించినాడు. శరత్కాలము వచ్చునంత వరకు సుగ్రీవుని సుఖములనుభవించమని రాముడు గుహలో ఉండిపోయినాడు. వర్ష కాలము గడచినది. శరత్తు వచ్చినది. కాని సుగ్రీవుని జాడ కానరాలేదు. అప్పుడు రాముడు లక్ష్మణునితో "అకృతజ్ఞో ప్రతికృతో హన్తి సత్యవతాంమనః" ఉపకా రమునకు ప్రత్యుపకారము చేయకున్న స్వాతికుల మనసు నొచ్చును. కాన నీవు సుగ్రీవుని కడకు పోయి యధోచితముగా చెప్పి అతనిని సీతాన్వేషణకు పురికొల్పుము అన్నవాడై లక్ష్మణుని సుగ్రీవుని కడకు పంపెను." అని "లక్ష్మణుడు సుగ్రీవుని దగ్గరికి పోవడం మున్నగు కథ సాంతం చెప్పి "లక్ష్మణుడు సుగ్రీవునితో ఇట్ల న్నాడు:—

బ్రహ్మఘ్నేచ సురాపేచ చోరే భగ్నవ్రతే తథా
నిష్కృతిర్విహితా సద్భిః కృతఘ్నే నాస్తి నిష్కృతిః

అనగా బ్రహ్మహత్యకు, సురాపానమునకు, దొంగతనమునకు, వ్రత భంగము చేసికొనినవానికి ప్రాయశ్చిత్తము విధించబడినది. కాని కృతఘ్నునకు ప్రాయశ్చిత్తము విధింపబడలేదు అని అర్థము" అని చెప్పిన నారాయణస్వామి సీతా న్వేషణవరకు గల కథ అంతా చెప్పారు.

ఆనాటి పురాణం అంతటితో ముగిసింది.

"బాగ శెప్పిన్రుండి. లక్ష్మణులోరు పోకుంటే సుగ్రీవులోరు వచ్చెటోడె కాదన్నమాట" అన్నాడు రామకిష్టయ్య.

తాను చెప్పదలచుకున్నది రామకిష్టయ్యకు అర్థం కాలేదా? అర్థమయ్యీ కానట్లు నటిస్తున్నాడా అర్థం కాలేదు నారాయణస్వామికి.

ఆనాటి నుంచి రామకిష్టయ్య పురాణానికైతే వస్తున్నాడు కాని పంపించాల్సింది పంపించడం మానేశాడు. అడిగే స్వభావం నారాయణస్వామి వద్ద లేదు. అందువల్ల ఇంట్లో కాస్త ఇబ్బంది మొదలయింది.

"రామకిష్టయ్య సామాన్లు పంపడం బందు చేసిండు. ఒక్కసారి అడగ రాదుండి" అన్నది నాంచారమ్మ.

నవ్వి వూరుకున్నారు నారాయణస్వామి.

"ఇంట్లో బొత్తిగ నెయ్యి అయిపోయింది. రామకిష్టయ్య ఇంటికిపోయి తెత్తునా?" మరొక నాడన్నది నాంచారమ్మ.

"నెయ్యిలేక తినలేకపోతమా!" అని గంభీరించారు నారాయణస్వామి.

"లచ్చమ్మకు వంకాయకూర తినాల్నని ఉన్నదటనుండి. నూనె లేదు..." తరవాత మాట మింగేసింది నాంచారమ్మ.

నారాయణస్వామి గదిలోకి వెళ్ళి ఎక్కణ్ణుంచో వెతికి డబ్బులు తెచ్చి "ఈ డబ్బిచ్చి లచ్చమ్మనే నూనె తెమ్మను" అన్నారు.

నాంచారమ్మ కేమీ అర్థం కాలేదు. భర్త చెప్పినట్లే చేసింది.

ఒకనాడు లచ్చమ్మ స్వామి ఇంటికి వచ్చింది—ఉసిరికాయపచ్చడి కావాలని. నాంచారమ్మ ఆకలో పచ్చడి తెచ్చి నేలమీద పెట్టి దూరం జరిగింది. లచ్చమ్మ ఆ ఆకు అందుకుంటున్నపుడు వీథిన వెళ్తున్న రామకిష్టయ్య చూచాడు.

"అమ్మగారూ! అంటరానివాండ్లకు అన్నం కూరలు పెడ్తారుండి. మీరు పెద్దలు. చెప్పేదిపోయి చెప్పించుకోవాల్సి వచ్చె" అని సాగిపోయాడు.

నాంచారమ్మ కొయ్యబొమ్మలా అరుగు మీద నుంచుండి పోయింది.

లచ్చమ్మకు అదేమీ అర్థం కాలేదు. పచ్చడి తీసుకొని వెళ్ళిపోయింది.

ఆనాటి నుంచి రామకిష్టయ్య పురాణానికి రావటం తగ్గించాడు. రాలేదనకుండా అప్పుడప్పుడూ ముఖం చూపించి పోతున్నాడు.

ఒకనాటి రాత్రి—వేసవికాలం—ఆరుబయట మంచాలు వేసుకొని పడుకున్నారు నారాయణస్వామి నాంచారమ్మ. ఇంకా నిద్ర పోలేదు. ఇంటి పరిస్థితిని గురించి మాట్లాడుకుంటున్నారు. గురువయ్య పదం వినిపించింది దూరంగా—

**లబ్బారిబొమ్మా!**

జర కన్నోని తిరగమ్మ లబ్బారిబొమ్మ!

**నా మగడు కుంటోడు, ఎడమ చేయి తొంటోడు.**

**నా అక్క మంకుది. ఊరంత బొంకుతాది.**

నాంచారమ్మకు గురువయ్య పదాలంటే మనసు. ముచ్చట ఆపి పదం వినసాగింది.

**లబ్బారిబొమ్మా, జర కన్నోలి తిరుగమ్మా.**

**మా అయ్య మాయగాడు. మందిని ముంచుతాడు.**

పల్లెపదం సాగిపోయింది. గురువయ్య దాటిపోయాడు. అయినా అది కొంతసేపు చెవుల్లో రింగుమంటూనే ఉంది.

"ఏమండీ" భర్తను పిలిచింది. "గురువయ్యకు తాగుడుమాన్పించరాదుండి. మీరు చెప్పుతె ఇంటడు" అన్నది.

"పిచ్చిదానా! పొద్దుందాకా కష్టం చేస్తడు. కాస్త తాగకేం చేస్తడు. తాగక మంది కొంపలు ముంచే రామకిష్టయ్య కంటె తాగే గురువయ్యే నయం" నారాయణ స్వామి సమాధానం విచిత్రంగా అనిపించింది నాంచారమ్మకు. "మీరు చెప్పుతె వింటడు. చెప్పండి" మళ్ళీ ప్రాధేయపడ్డది.

"అట్లనేలే పడుకో" అన్నారు.

ఒకనాడు గురువయ్యను పిలిచారు స్వామి. "ఒక బస్తా గింజలమ్మి పైకం తెచ్చిపెడ్తవు!" అన్నారు.

గురువయ్య బస్తా వీపున వేసుకుని రామకిష్టయ్య ఇంటికి చేరాడు.

"అయ్యగారిదేనా!" అడిగాడు రామకిష్టయ్య. అవునన్నాడు గురువయ్య.

"అరే! అయ్యగారికి లేకుంటే పాయె. మాలగాడ్డి కొడుకువు నీకన్న ఉండొద్దుర. ఏ జన్మల ఏం చేసినవో మాలోనివై పుట్టినవు. పురుగులు పడి చస్తవు కుక్కల కొడక" అని నానా చీవాట్లు పెట్టి "ఇప్పటికి ఇయే ఉన్నయి తీస్కపో, అటెన్క ఇస్తనని అయ్యగారితో చెప్పు" అని ఏదో కొంత పైకం ఇచ్చి పంపించాడు.

పైకం అయ్యవారి చేతిలో వేసి—రామకిష్టయ్య చెప్పమన్నది చెప్పి వెళ్ళి పోయాడు గురువయ్య. ఇంటికి వెళ్ళి, "అయ్యగారింటికి పోతె పురుగులు పడి చస్తమట కోంటాయన చెప్పిండు. ఇగఇంద్ అటు పోకు" అని లచ్చమ్మకు చెప్పి ఇంట్లోంచి వెళ్ళిపోయాడు.

లచ్చమ్మకు ఏమీ అర్థంకాలేదు. నాంచారమ్మ ఇంటికి వెళ్ళాలని గడపలోంచి ఇంట్లోకి పదిసార్లు తిరిగింది—కాలుకాలిన పిల్లిలా. తుదకు చతికిలపడి చేతులు తలకు పెట్టుకొని కూర్చుంది.

ఆ రోజునుంచి రామకిష్టయ్య పురాణానికి రావడం బొత్తిగా మానేశాడు.

సాయంకాలంకాగానే వ్యాసపీఠంమీద పుస్తకం పెట్టుకొని కూర్చుంటున్నారు స్వామి. కొన్నాళ్ళు నలుగురు, ముగ్గురు, ఇద్దరు, ఒకరు వచ్చారు. ఇప్పుడు ఎవరూ రావడంలేదు. నారాయణస్వామి మాత్రం వేళకు పుస్తకం పట్టుకుని కూర్చుంటూనే ఉన్నారు. వినేవారు ఎవరూ లేకపోవడాన నాంచారమ్మకే చెపుతున్నారు.

నాంచారమ్మ మనసు పురాణం మీద నిలువడంలేదు. లచ్చమ్మ రావడం మానేసినందుకు ఆమెకు అదోలా ఉంది. లచ్చమ్మ ఏం తింటూందో? ఎలాఉంటూందో? తనకు రుచులు చెప్పేది. పచ్చళ్ళు పెట్టించుకు పోయేది. కూరలు వడ్డించుకు తినేది. ఏదో చేతినిండా పని ఉన్నట్లుండేది. ఇప్పుడు మనసు శూన్యంగా ఉంది. ఇల్లు శూన్యంగా కనిపిస్తూంది. లచ్చమ్మ భౌతికంగా నాంచారమ్మకు ఎప్పుడూ దగ్గరగా రాలేదు. అయినా ఆమె మనసులో ఒక స్థానం సంపాదించింది. లచ్చమ్మ ఎందుకు రావడంలేదో ఆమెకు అర్థం కాలేదు. అనేకసార్లు గురువయ్య ఇంటికివెళ్ళి పిలుద్దా మనుకుంది. గడపదాకా వెళ్ళింది-ఏదో అహం అడ్డు వచ్చింది. ఏం చేయాలో తోచ

లేదు. ఆ రోజు భోజనాలయి పడుకున్నప్పుడంది. "లచ్చమ్మ రావటంలేదు-గురువయ్య రావటంలేదు. ఎందుకండి?"

"ఏమో మనకెట్ల తెలుస్తుంది?" నారాయణస్వామి ముక్తసరిగా సమాధానం చెప్పారు.

ఈమధ్య నారాయణస్వామి ఎక్కువ మౌనంగా ఉంటున్నారు. ఏదైనా మాట్లాడాల్సి వచ్చినా బహు సంక్షిప్తంగా మాట్లాడుతున్నారు. అది మరికొంత చిరాకుకు కారణం అయింది నాంచారమ్మకు.

"దేనికి సరిగ్గ జవాబు చెప్పరేమండి! లచ్చమ్మ రాకుంటె నాకు పిచ్చెక్కినట్లున్నది" నాంచారమ్మ.

నారాయణస్వామి జవాబు చెప్పలేదు. వారు ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నారు. రామకిష్టయ్య రావటం మానేశాడు. అంతేకాదు తనను ఇరకాటంలో పెట్టాడు. మిగతా ఊళ్ళోవాళ్ళు సుమారు తనను బహిష్కరించారు. ఇదంతా గురువయ్యతో తనకు కలిగిన ఆత్మీయత వల్ల. గురువయ్య కూడా ఇటు రావడం మానేశాడు. తాను దగ్గరకి తీసినవారూ తనను దగ్గరకు తీసినవారూ దూరం అయినారు. ఎందుకీ పరీక్ష ప్రభూ! ఏం పాపం చేశాన్నేను? అనుకున్నారు.

"గురువయ్య పాటకూడా వినిపించడం లేదు. అసలు ఊళ్ళ ఉన్నరా? ఎటన్న పోయిన్రా!"

నారాయణస్వామి మారు పలకలేదు. వారి ఆలోచన మళ్ళీ సాగింది. తాను ఓడిపోయినట్లా? ఎవరు ఓడించారు తనను? రామకిష్టయ్య. ఎందుకు? గురువయ్యతో పాటు పుట్టదాకా పోయినందుకు ? ఎందుకు వెళ్ళాడు తాను? రామకిష్టయ్య గురువయ్యతో చేయించిన పాపానికి. పాపం చేయిస్తాడు. పరిహారం వద్దంటాడు! ఎందుకు? గురువయ్య మాలవాడు కాబట్టి! మాలవానితో ఉపకారం పొందవచ్చు. ప్రత్యుపకారం చేయరాదు! ఎంత నీచం! ఎంత నీచుడు రామకిష్టయ్య? భగవంతుడు నీచులకే సంపద నిస్తాడా? అక్కడ ఆగిపోయాయి ఆలోచనలు. మనుషులు నీచులా? సంపద నీచమా? ఇక్కడ మొదలయింది చర్చ. సంపదలే నీచములు కావచ్చు. సామ్రాజ్యం లేకుంటే రాముడు అడవికి ఎందుకు పోయేవాడు? సంపద లేకుంటే భారతయుద్ధం ఎందుకు జరిగేది, అవును సంపదలే నీచములు. అవి మనిషితో నీచములైన పనులు చేయిస్తాయి. నహుషుడు ఇంద్రాసనం లభించగానే నీచుడు కాలేదా? మరి రామకిష్టయ్య నీచుడుకావడం తప్పేమీ? అవును. కాని తాను నీచునికి లొంగడమా?

ఇంతలో గురువయ్య గుర్తుకు వచ్చాడు. గురువయ్య! ఎంత గొప్పవాడు! ఉపకారం చేస్తాడు. ప్రత్యుపకారం ఆశించడు. అతనితో తాను స్నేహం చేశాడు. తప్పేం? అతడు మాల. అవును. తాను అతన్ని కావిలించుకున్నాడా? అతనికి

శాస్త్రిలు ఉపదేశించాడా? శాస్త్ర విరుద్ధమైనపని ఏంచేశాడు తాను? ఎందుకు రామ కిష్టయ్యకి తనమీద పగ? ఎందుకు? ఎందుకు?

సమాధానం అందలేదు. మేదస్సు శూన్యం అయింది. ఆకాశాన్ని చూచారు. చుక్కలు మిలమిలా మెరుస్తున్నాయి. వాటిలో అరుంధతి కూడా ఉందనిపించింది. అవును ఎవరు అరుంధతి? అరుంధతి ఎవరు? తాను మూర్ఖుడెందుకు కావాలి? గురువయ్యను ఎందుకు వదులుకోవాలి? రామకిష్టయ్యనే వదులుకోవడం మేలు.. రామకిష్టయ్యను వదులుకోవడమే. అంతే. రామకిష్టయ్యనే వదులుకోవాలి!

ఒక నిర్ణయానికి వచ్చేశారు నారాయణస్వామి. తుపాను తరువాత ఏర్పడ్డ ప్రశాంతతలా ఉంది వారి మనస్సు. ఇప్పుడు మనసు నిర్మలంగా ఉంది. ఏదో హాయిగా ఉంది. సుఖంగా ఉంది.

నాంచారమ్మను చూచారు నారాయణస్వామి. ఏ లోకాల్లోనో తిరిగివచ్చి స్థిర పడ్డట్లున్నాయి ఆ చూపులు! నాంచారమ్మకు తేలికనిపించింది. సుడిగాలికి ఎక్క డెక్కడో ఎగిరిన ఆకు ఒక కొమ్మకు తాకి నిలిచినట్లనిపించింది భర్తను చూస్తే.

"ఏమండీ! గురువయ్య ఇంటికి పొయ్యొస్తే ఒకసారి!" ఆమె మాటల్లో అభ్యర్థన ఉంది. గుండె గాయం ఉంది. ఆతురత ఉంది.

"అట్లనే రేపోత."

ఆ మాటలు నమ్మలేకపోయింది నాంచారమ్మ. ఆమెలో సంతోషం పొంగింది. లేచి కూర్చొని భర్త చేతులు పట్టుకొని ఊపుతూ అడిగింది. "నిజంగ పోతరానండి. నిజంగ....నా ...నాతోడు" అనబోయి మాట మింగేసింది.

"పోతనన్నగద నిజంగ పోత" నారాయణస్వామి చిరునవ్వు నవ్వారు. ఆ నవ్వు స్నిగ్ధంగా ఉంది. అలాంటి నవ్వు చూచి ఆమె చాలాకాలం అయింది.

చంద్రోదయం అయింది. వెన్నెల విరిసింది.

తెల్లవారి లేవగానే బయలుదేరారు స్వామి. వేపపుల్ల వేసుకొని గూడెం వైపు సాగారు. గూడానికి వెళ్ళి అలాగే ఏటికి వెళ్ళి స్నానం చేసి తిరిగి వస్తానని చెప్పి బయలుదేరారు. గూడేనికి వారెప్పుడూ వెళ్ళలేదు. ఆ చాయసైతం సోకలేదు వారికి. గూడెపు చాయలు చేరేవరకు తోళ్ళ వాసన! ముక్కులు బద్ధలవుతున్నాయి. ఆగి పోయారు. భరించలేక పోయారు. ఆలోచించారు. వెనక్కు మళ్ళారు. మళ్ళీ ముందుకు సాగారు. ధైర్యం చేశారు పట్టుదలతో సాగారు.

అప్పుడే తెల్లవారింది. ఆడవాళ్ళు పొన్నలు దంచుతున్నారు. అక్కడక్కడా రోకటిపాటలు వినిపిస్తున్నాయి. మగవాళ్ళు పనుల్లోకి వెళ్ళడానికి సిద్ధం అవు తున్నారు. నారాయణస్వామి ఒకణ్ణి గురువయ్య ఇంటిని గురించి అడిగాడు. అతడు నారాయణస్వామిని చూచి అదిరిపడ్డాడు. "అయ్యగారొచ్చిండు అయ్యగారొచ్చిండు." అని కేకలు వేశాడు. ఇళ్ళల్లో ఉన్న జనం అంతా వింత చూడ్డానికా అన్నట్లు బయట.

పడ్డారు. ఆడవాళ్ళు దంపుడు మాని బయటపడ్డారు. ఒకడు గురువయ్య ఇంటివైపు నడిచాడు. గుంపు సాంతం అటు నడిచింది.

"ఆరే! గురువ! అయ్యగారొచ్చిండురా-ఎళ్ళు ఇవుతలికి" నలుగురు కేకలు వేశారు.

నారాయణస్వామి ముక్కుమీద కండవావేసుకొని దూరంగా నుంచున్నారు. గురువయ్య ఉరికి వచ్చి స్వామిని చూచి దిగ్భ్రమ చెంది నిలిచిపోయాడు-వెనకనే లచ్చమ్మ వచ్చింది. గురువయ్యకు మాటలు తడబడ్డాయి. అయినా అన్నాడు-

"కాల్మొక్త. నాకోసం గూడేనికి వచ్చినారు! చెప్పంపుతె రాకపోయినాను.... గులాపోణ్ని....చెప్పండి ఏం చెయ్యమంటరో?"

"అమ్మగారు బాగున్నారుండి....కండ్లల్ల ఆడతాన్రు కాల్మొక్త....వద్దన్నడు వస్తనంటె" లచ్చమ్మ అన్నది.

జనం గుంపుకూడి వింత చూస్తున్నారు.

"రావటం బంద్‌చేసిన వెందుకు గురువయ్య?'' నారాయణస్వామి వేసింది ప్రశ్నే అయినా గాలం అయి గుండెలో గుచ్చుకుంది గురువయ్యకు.

"ఏం చెయ్యమంటరు కాల్మొక్త....మీ ఇంటికొస్తె పురుగులుపడి చస్త వన్నడు కోంటాయన....అందుకే"

నారాయణస్వామి హృదయం క్షోభించింది. రక్తం ఉడుకెత్తింది. కళ్ళు ఎఱ్ఱబడ్డాయి.

"వాడే పురుగులుపడి చస్తడు" గుండెను చీల్చుకొని వచ్చాయి మాటలు. గునపాల్లా ఉన్నాయి. వాడిగా ఉన్నాయి. వేడిగా ఉన్నాయి.

ఆ మాటలు పదును అక్కడ నుంచున్నవారినే ఆశ్చర్య చకితుల్ని చేసింది. చిత్తరువులా నుంచొని స్వామిని చూస్తున్నారు. స్వామి ముఖంలోకి ఎగదన్నిన రక్తం క్రమంగా దిగిపోతూంది. అప్పుడు నారాయణస్వామికే ఆశ్చర్యం అయింది తాను అలా అన్నందుకు! వారికి అంత కోపం ఎన్నడూ రాలేదు. అది గ్రహించారు స్వామి. అర్థం చేసుకున్నాక జనాన్ని చూచారు. తననే చూస్తున్నారు. ఒక చిరునవ్వు నవ్వి మామూలు దిశకు వచ్చారు.

జనం ఊపిరి పీల్చుకున్నారు.

"గురువయ్యా! రామకిష్టయ్య చెప్పింది నిజంకాదు. వస్తవా ఒకసారి ఇంటికి?" అన్నారు స్వామి.

"వస్తనుండి అయ్యగారు-వస్త. పురుగులు పడి చచ్చినా వస్త-దేవునసువంటి మీరు మా గుడిసె కొచ్చిన్రు - మా గూడేని కొచ్చిన్రు— వస్త కాల్మొక్త....వస్త.... గులాపోన్ని....పావెలచ్చి దేవుడొచ్చిండు మన ఇంటికి....రావె లచ్చి రా... కాల్మొక్తం అయ్యగారికి" అని ఇద్దరూ నేలమీదపడి స్వామికి మొక్కారు.

"సుపుత్రాప్రాప్తిరస్తు" అని దీవించారు స్వామి. అది వారికేమీ అర్థం కాలేదు.

"నేను ఏటికి పొయ్యొస్త. వస్తవుగద" అని సాగిపోయారు నారాయణ స్వామి.

"వస్త కాల్మొక్త..." అని నిలిచిపోయారు గురవయ్య—లచ్చమ్మ.

జనం ఎవరి పనులకు వారు వెళ్ళిపోయారు. గూడెం మామూలు గూడెం అయింది. రోకటి పాటలు వినిపించాయి.

నాంచారమ్మ నీరుకారే చీరెతో మంచినీళ్ళ బిందె తలమీద ఉండగా దూరం నుంచి వాకిట్లో లచ్చమ్మను చూచింది. మట్టెల చప్పుడుతో వడివడిగా వచ్చి "ఉండు బిందె దింపి వస్త" అని లోనికి ఉరికింది. బట్ట మార్చుకునేవరకు లచ్చమ్మ ఉండదేమోనన్నట్లుగా తడిబట్టలతోనే బయటికి ఉరికివచ్చింది.

"ఏం లచ్చమ్మ రావటం బంద్ చేసినవు. వళ్ళెట్లున్నది. పిండం తిరుగుతున్నదా....పచ్చళ్ళు తినాలెననిపించటంలే...ఊళ్ళో లేరా....గురువయ్య కూడా కన పట్టంలేదు" తుపాకి గుండ్లలా టపటపా వచ్చాయి మాటలు.

ఉక్కిరి బిక్కిరి అయింది లచ్చమ్మ. "ఈడనే ఉన్నం. యాడికి పోలె. పోవద్దన్న డుండి."

"ఎవరు? గురవయ్యేనా! ఏమయింది వానికి? ఎందుకొద్దన్నడు."

"మీ ఇంటి కొస్తె పురుగులుపడి చస్తమన్నడటనుండి కోంటాయన."

"వాడే చస్తడు పురుగులుపడి. అయ్యగారొచ్చిన్రా! పిలిచిన్రుగద....ఇగ వస్తుంటవా?"

"వస్తనుండి. వస్తుంట. రాకుంటె నాకెట్లున్నదనుకున్నరు....మా అవ్వను చూడనట్లున్నది."

"నా కట్లనే ఉన్నదే. బిడ్డను చూడనట్లున్నదే....ఏందో ఎతుక్కున్నట్లున్నది. ఉండు నిన్ననే నూరిన చింతకాయపచ్చడి....ఇంగువ పోపు పెట్టిన్నే తెచ్చిపెడ్త" అని లోపలికి పోయి కొబ్బరి చిప్పనిండా పచ్చడి తెచ్చి నేలమీద పెట్టి దూరం జరిగి చెంబులో నీళ్ళతో చేయి కడుక్కొని "వంటయినక రా. అన్నం కూరలు పెడ్త. ఇవ్వాళ నువ్వు...గురువయ్య మా అన్నమే తినాలె. ఇన్నవా?" అని లోపలికి పోయింది.

లచ్చమ్మ పచ్చడి తీసుకొని వెళ్ళిపోయింది.

గురవయ్య రాకపోకలు నారాయణస్వామి ఇంటికి సాగేయి. నాంచారమ్మకూ, లచ్చమ్మకూ పరిచయం పెరిగి ఆత్మీయతగా మారింది.

కొన్నాళ్ళు గడిచాయి.

ఒకనాడు రామకిష్టయ్య నారాయణస్వామి ఇంటికి వచ్చాడు. అది అసాధారణం అనిపించింది స్వామికి. పశ్చాత్తాపం చెంది వచ్చాడేమో ననుకున్నాడు.

వచ్చినవాడు నమస్కరించాడు. రామకిష్టయ్యకు స్వాగతం పలికి చాపవేసి కూర్చుండబెట్టి "నాంచారూ! చూసినవా ఎవరొచ్చిన్రో, మన రామకిష్టయ్య వచ్చిండు" అని పిలిచారు స్వామి.

నాంచారమ్మ పయటకొంగుతో చేతులు తుడుచుకుంటూ బయటకు వచ్చి "ఏం రామకిష్టయ్యా! పూర మరిచిపోయినవూ ఇటు రానన్న రావటం లేదు" అన్నది. మాటల్లో ఆత్మీయత ఉంది. కాని అది గమనించే స్తోమత లేదు రామకిష్టయ్యకు.

"పన్లు ఎక్కువయినయుండి. పుర్సతుంటలేదు. పైసకు శాన కటకట అయితాంది ఇయ్యాళ్రేపు."

"ఆదేమిటి అట్లంటవు. సర్లేగాని మంచి తీర్థం కావాల్నా" నాంచారమ్మ అడిగింది.

"ఒద్దులేరి. ఇప్పుడే తాగొచ్చిన. ఒక మాట చెప్పెటందుకు వచ్చిన. అయ్యగారితోని ఎట్ల చెప్పుదునా అని విశారిస్తున్న" రామకిష్టయ్య అన్నాడు.

వింతగా చూశారు రామకిష్టయ్యను నారాయణస్వామి—నాంచారమ్మ. ఏదో అమాంతంగా శూన్యం ఏర్పడింది. ఏదో ఆవాంతరం రానున్న సూచనలు గాలిలో కనిపించాయి.

ఎవరూ మాట్లాళ్ళేదు కొన్ని క్షణాలు.

"పైసకు కటకట ఉన్నదని చెప్పినగద!" రామకిష్టయ్య ప్రారంభించాడు. మిగతా ఇద్దరూ వింటున్నారు. "యాపారం బాగా సాగుటలేదు. అప్పులు తీసుకొనోళ్ళు సరిగ్గ ఇస్తలేరు. ఎట్ల చెప్పాల్నో తెలుస్తలేదు."

కొంత సేపు మళ్ళీ నిశ్శబ్దం.

"ఏమనుకోకండి అయ్యగారు. చెయ్యాల్నని చేస్తలేను. కష్టాలొచ్చినయ్—నష్టమొచ్చింది. మీరున్న ఇల్లు అమ్మాల్సి వచ్చింది. అమ్మిన."

పిడుగు పడ్డది ఇద్దరిమీద.

గ్రహించాడు రామకిష్టయ్య. "ఏం చెయ్యమంటరు చెప్పండి కాలం బాగలేదు. ఇచ్చింది ఇచ్చినట్లె పోతాంది. మళ్ళిచ్చెటోడు మచ్చుకన్నలేడు. మల్ల మా సావుకారు ఊరుకుంటడా? బస్తినించి మనిషిని పంపిండు. ఇస్తవా; చస్తవా? అని కూచున్నడు వాడు. ఎల్లకపాయె ఏంచేతను? ఇల్లే రాసిచ్చిన."

నాంచారమ్మ దిగ్గున లేచి వెళ్ళిపోయింది. వంటింట్లోకిపోయి దేవుని ముందు కూర్చుని ఏడ్వసాగింది.

ఏడ్వలేక నారాయణస్వామి అక్కడే కూర్చున్నారు.

"ఉన్నదున్నట్లు నేనుమాత్రం పొమ్మంటానాగాని జర తర్సతుగనన్న కాళీ చెయ్యండి. నాకే అనటానికి నోరొస్తలేదుగని ఏం చెయ్యమంటరు—తక్లీపొచ్చింది. కొనోడు వూరుకుంటాడు. వాడొచ్చి బోడి బొచ్చె బయట పారేస్తే ఏం బాగుంటది?

అందుకే నే నొచ్చిన. అయ్యగారుగద ఎట్లన్న అని. చెప్పిపోదమని వచ్చిన" అని ప్రశ్నార్థకంగా చూచాడు నారాయణస్వామిని.

"మంచిది రామకిష్టయ్య ఖాళీ చేస్తం" అన్నారు నారాయణస్వామి గంభీరంగా.

"అట్లయితె వస్తమరి" అని లేచాడు రామకిష్టయ్య. సాగనంపటానికి లేచి వాకిలిదాకా సాగారు నారాయణస్వామి. గడప దాటుతూ "జర జల్దిచేయటం మంచిది" అని వెనక్కు చూడకుండా చరచరా సాగిపోయాడు రామకిష్టయ్య.

తల కొట్టేసినంత పనైంది నారాయణస్వామికి. అయినా దుఃఖం పొంగలేదు. చరచరా లోనికి వెళ్ళారు.

"ఏమిటండీ మనకీ కష్టాలు?" కూర్చొనే తల ఎత్తి కన్నీటితో అడిగింది నాంచారమ్మ.

"పిచ్చిదానా!" నాంచారమ్మ పక్కన కూర్చొని కన్నీరు తుడిచి ఓదారుస్తూ "కష్టాలు మనుషులకు రాకుంటే మానులకు వస్తవా? కష్టాలు వచ్చినపుడు ధైర్యంగ ఉండటమే గొప్ప. లేనప్పుడు అందరు ధైర్యంగనే ఉంటరు. లే కండ్లు కడుక్కో. చూడు కండ్లెట్ల ఉబ్బినవో?" అన్నారు స్వామి అనునయిస్తూ.

"ఎందుకండీ రామకిష్టయ్య ఇట్ల పరీక్షిస్తున్నడు?" లేవకుండానే అడిగింది నాంచారమ్మ.

"పిచ్చిదానా! రామకిష్టయ్య ఎవడే మనను పరీక్షించటానికి భగవంతుడు పరీక్షిస్తున్నాడు. మన స్థయిర్యాన్ని పరీక్షిస్తున్నాడు. హరిశ్చంద్రుని, నలమహా రాజును, రంతిదేవుని పరీక్షించలేదా? ఎన్నటికైనా ధర్మం గెలుస్తుంది. మనిషి గెలుస్తడు. అధర్మానికి అపజయం తథ్యం. రాక్షసునికి ఓటమి తప్పదు."

"ఇప్పుడేం చేద్దామంటరు?"

"చేసేదేమున్నది? ఇల్లు ఖాళీ చేద్దం. మన జాగ ఉన్నదిగ వూరిబయట. అక్కడ పర్ణశాల వేసుకొని ఉందం."

నాంచారమ్మ మాట్లాడలేదు.

అసలు జరిగిందేమంటే నారాయణస్వామి తండ్రి లక్ష్మీనరసింహాచార్యులవారు పరమపదించినప్పుడు ఇంట్లో ఎర్రని ఏగానీలేదు. లక్ష్మీనరసింహాచార్యులు మహా పండితులు. వారికి సంస్కృత ద్రావిడ ఉభయ వేదాల్లోనూ అఖండమైన ప్రజ్ఞ ఉండేది. వారు ఆర్జించడం బాగానే ఆర్జించారు. ప్రయాణాల్లో పల్లకి దిగలేదు. అయితే వారికి పండిత గోష్ఠులన్నా, శాస్త్ర చర్చలన్నా ప్రాణం. ఇల్లు ఎల్లప్పుడూ పండితులతో నిండి ఉండేది. రేయింబవళ్ళు శాస్త్ర చర్చలతో గుబాళిస్తుండేది. ఆర్జించినన్నాళ్ళూ అలా కర్చు చేశారు. వార్ధక్యం వచ్చింది. మంచం పట్టారు. ఒక్కడూ గడప తొక్కలేదు. అప్పటికే ఉన్నదంతా తదీయారాధనకు కరిగి పోయింది. రామకిష్టయ్య అత్యంత భక్తి కనబరిచేవాడు. అయినా అయ్యవారి

ఆస్తిని హరించకుండా ఉండలేకపోయాడు. ఇల్లుతప్ప అన్నీ రామకిష్టయ్య ఇంటికి చేరాయి. లక్ష్మీనరసింహాచార్యులు పరమపదించేవరకు ఆ ఇల్లూ, బారెడు భూమి మాత్రం మిగిలాయి వారి తీర్థతిరువధ్యయనాలకు ఉదారంగా అప్పు ఇచ్చాడు. రామకిష్టయ్య. ఘనంగానే చేశారు నారాయణస్వామి-వారికి తండ్రి విషయంలో భక్తిమెండు. ఆ తరువాత ఆ ఇల్లు రాయించుకున్నాడు రామకిష్టయ్య. అది లాంఛనమే అన్నాడు రామకిష్టయ్య. నారాయణస్వామిని అందులోనే ఉండమన్నాడు, వారున్నారు. ఇంతకాలంగా బేరం రాలేదు. రామకిష్టయ్య పలకలేదు. ఇప్పుడు వచ్చిందని కాదు. సాధించాలనుకున్నాడు. కాళీ చేయమన్నాడు.

నారాయణస్వామి ఊరి బయట కొంత స్థలం కొన్నారు—మంచినీళ్ళ బావి ఉందని. కాని అక్కడ బావి తప్ప ఇల్లు లేదు. గురువయ్య ఆ స్థలంలో గుడిసె వేశాడు. గోడలు పెట్టడానికి లచ్చమ్మ మట్టి ముద్దలు అందించింది. ఇల్లు పూర్తి అయిన తరువాత నాంచారమ్మ గోడలు అలికి పట్టెలు పెట్టింది. నేల అలికి ముగ్గులు పెట్టింది. ముహూర్తం చూచుకొని తెల్లవారుజామున భువనేశ్వరం నెత్తిన పెట్టుకొని నారాయణస్వామి, పంచపాత్రలు సెమ్మెలు పట్టుకొని నాంచారమ్మా గృహప్రవేశం చేశారు.

నాంచారమ్మ ఆ రోజు పేరంటం పిలిచింది—కాని ఎవ్వరూ రాలేదు. అది ఆమెకు ఎంతో బాధ కలిగించింది.

ఇప్పుడు నారాయణస్వామి ఇల్లు గురువయ్య ఇంటికి దగ్గరకు వచ్చింది.

సాయంకాలాలు నారాయణస్వామి వ్యాసపీఠం ముందు కూర్చుంటూనే వున్నారు—కాని వినేవారు నాంచారమ్మ, లచ్చమ్మ మాత్రమే—గురువయ్యకది తాటివనపు సమయం!

# 8

సాయంకాలం అయింది. తాటివనంలో పొద్దుకుంకుతూంది. ఆకాశపు పడమటి పక్కన ఎర్రడాలు వేసింది. పక్షులు గుంపులు గుంపులుగా గూళ్ళకు చేరుకుంటున్నాయి. కొంగలు ఆకాశంలో మల్లెల దండలా సాగిపోతున్నాయి. చింతచెట్టు కిందికి వచ్చిన గురువయ్య మోదుగాకు అందుకొని దొంతు కూర్చొన్నాడు. పక్కనుంచి కాలువ గలగలా పారుతూంది. మెల్లని చల్లనిగాలి వీస్తూంది.

"పట్టు" ధ్వని వినిపించింది గురువయ్యకు. నోటికి ఆకు పట్టుకున్నాడు, కల్లు ముంతలోంచి పడుతూంది. తాగుతున్నాడు, అమాంతంగా అతని కళ్ళు పైకి చూచాయి.

పోస్తున్నది ముసలి బుచ్చమ్మ కాదు పడుచు పిల్ల.

ఆమెను చూస్తున్నాడు గురువయ్య.

నల్లగా నీలమణిలా ఉంది ముఖం.

ఆ ముఖంలో పడుమదనం పడగ విప్పింది. నిగనిగలాడుతూంది. చెంపలు నున్నగా ఉన్నాయి. చిన్న ముక్కుకు పెద్ద ముక్కెర—దానికి ఎర్రరాయి! చెవులకు గంటీలు. ముఖాన పొద్దుపొడుపులాంటి కుంకుమ. జుట్టు చక్కగా దువ్వి అణిగి ఉంది. పెదవులు ఎర్రగా మందారం మొగ్గల్లా ఉన్నాయి. అన్నింటినీ తలదన్నినవి కళ్ళు— వెడల్పుగా ఉన్నాయి — ఎర్రగా ఉన్నాయి. — అందంగా ఉన్నాయి. ఆకర్షణ ఉంది వాటిల్లో-ఆహ్వానమూ ఉంది.

ఆమె ముగ్ధంగా ఉంది. ముఖం ముద్దు వచ్చేట్లుంది- ముచ్చటగా ఉంది.

గురువయ్య కల్లుకాదు—ఆమె సోయగాన్ని తాగుతున్నాడు.

ఒక ముంత అయిపోయింది. అతడు చాలుననలేదు.

ఆమె మరో ముంత అందుకుంది.

గురువయ్య తాగుతున్నాడు- ఆమె మెడ అందంగా ఉంది. కురచగా నల్లగా ఉన్న మెడకు బంగారు పట్టెడ! దానిపై కంటె. ఎడమచేతికి బంగారపుదండ కడియం. ఎత్తుగా ఉన్న రొమ్ములు! అంతే ఇక అక్కడ నిలిచాడు గురువయ్య.

చూస్తున్నాడు. తాగుతున్నాడు. మూడో ముంత.

అదీ అయిపోయింది. బుచ్చమ్మ చూసింది. కోడల్ని అడిగింది ఎన్ని పోశావని. మూడని ముచ్చటగా చెప్పింది.

"గురువనికి పొయ్యాల్సింది ఒక్కటే ముంత - అంతే వాడికి - ఎరికేనా?" అన్నది.

తల ఊపింది కోడలు.

"అదేంది బుచ్చమ్మా! నా ఇష్టం—ఇంకోటి తాగుత వద్దంటవా?" గురువయ్య.

"అరే. పైకమెవడిస్తడ్రా! కాల్వలో నీళ్ళమ్ముతాన్న మనుకున్నవా?"

"ఏంది! ఎట్లనో మాట్లాడ్తవు! ఎన్నడన్న ఎక్కొట్టిన్నా! ఊళ్ళ సావుకా రున్నడు— ఊరుబయట జమీనున్నది. బుగులెందుకు పడ్తవు! తాగెడిదే కుషీగ్గద! పోయిపిల్లా!" అని "ఎవరు బుచ్చమ్మా ఈ పిల్ల?" అడిగాడు.

"ఓరి నీ కెర్కనే లేదుర! కొడుక్కు లగ్గమయింది గద—కోడలు" అని "పొయ్యి పిల్లా" అని కోడలుకు పురమాయించి వెళ్ళిపోయింది బుచ్చమ్మ.

గురువయ్య తాగుతున్నాడు- కాదు కళ్ళను చూస్తున్నాడు - ఆ కళ్ళల్లో ఏదో ఉద్రేకం కనిపించింది. ఉడుకుదనం కనిపించింది - తనకేదో పిలుపు కనిపించింది - ఏదో కవ్వింపు అనిపించింది.

ముంత కాళీ అయింది. ఆమె జరిగింది.

మోదుగాకు నేలకొట్టి లేచి నుంచున్నాడు గురువయ్య.

ఆమె సాగిపోతూంది.

వెనుకనుంచి చూచాడు గురువయ్య. జుట్టు బిగుతుగా ముడివేసి ఉంది. పొట్టి మెడ—పట్టెడ—కంటె—నడుముకు వడ్డాణం— కదులుతూంది.

ఆమె సాగిపోతూంది.

చీర కాసెపోసి కట్టింది. పిక్కలు నిగనిగలాడుతున్నాయి. కాళ్ళకు కడియాలున్నాయి —తోడాలున్నాయి—గొలుసులున్నాయి—వెండివి.

ఆమె సాగిపోతూంది.

ఊపిరి ఆమెతో పోతున్నట్లనిపించింది గురువయ్యకు.

ఆమె ఆగింది. గురువయ్య గుండె ఆగింది.

ఆమె కడవలు చేతబట్టుకొని వెళ్ళిపోయింది.

మసక చీకటి కమ్మింది, గురువయ్య గుండె కదిలింది.

గురువయ్య చూస్తున్నాడు—ఆమె లేదు—ఆమెపోయిన దిక్కుంది—దిక్కునే చూస్తున్నాడు గురువయ్య—అదే తనకు దిక్కనుకున్నాడు గురువయ్య.

గురువయ్య చూచిన దిక్కున చీకటి వుంది.

చీకటిని తిట్టాడు గురువయ్య. చింతనీడ నుంచి కదిలాడు. కాలవదరిన బండ మీద కూర్చున్నాడు. మనసులో ఏదో సన్నని మంటలా అనిపించింది. పిచ్చిపిచ్చిగా ఉంది. ఈల వేసాడు—గునిశాడు. ఆకాశం చూచాడు. చుక్కలు మిలమిల మెరుస్తున్నాయి. కిందకి చూచాడు.

కాలువ పారుతూంది. నీళ్ళల్లో చుక్కలు మెరుస్తున్నాయి.

నల్లపిల్ల కళ్ళల్లో చుక్కలు మెరిసినట్లనిపించింది.

కాలువలో నల్లపిల్ల కనిపించింది—నల్లకలువ కళ్ళు కనిపించాయి—గిలిగింతలు పెట్టినట్లయింది గురువయ్యకు.

మత్తుగా ఉంది—మస్తుగా ఉంది—మగువ కనిపిస్తూంది—గుండెలో గానం బయలుదేరింది—గొంతు దాటింది- పెదవులు పాడాయి.

చెలిని చూచిన కాడ
గుండె వదిలేసిన్ను
రొమ్ములో మసలేది
బిసరోరి అన్నయ్య—బిసరోరి చిన్నయ్య
పడతి చూచినకాడ
అసువు వదిలేసిన్ను
తనువులో మసలేది
గాలిలో రన్నయ్య—గాలితో చిన్నయ్య.

పదం గొంతెత్తి పాడుతూ బయలుదేరాడు—మత్తుబాగా తలకెక్కింది. రాత్రి అట్టే కాలేదు. కాని పల్లె-వీధులు నిర్మానుష్యంగా ఉన్నాయి. పాడుతూ సాగిపోతున్నాడు గురువయ్య.

కండ్లలో ఆ పిల్ల కాపురమున్నాది.

కంటి రెప్పలు వాలబోవురో రన్నయ్య—వాలబోవురో చిన్నయ్య.

ఇంతి చూచిన్నాడె చింతలను వలచిన్ను

నవ్వుపాయెను చాలదవ్వురో రన్నయ్య - చాలదవ్వురో చిన్నయ్య.

పదం పూర్తికాకుండానే ఇల్లు వచ్చింది. లచ్చమ్మ ఇంటిముందు కాచుకొని నుంచుంది. లచ్చమ్మను దగ్గరనుంచి చూచాడు గురువయ్య—నల్లపిల్ల గుర్తువచ్చింది. లచ్చమ్మ విచారంగా కనిపించింది—ఆమెలో ఏవో అవలక్షణాలు కనిపించాయి—గురువయ్య కంటికి ఆనాటికి! గురువయ్యకెందుకో చుర్రుమంది—కోపం వచ్చింది.

"ఎందుకో అట్ల నిలపడ్డవు—దయ్యమోలె."

"ఇంక రాకపోతె .." నసిగింది లచ్చమ్మ—ఊరంగా తాగాడని గమనించే.

"రాకపోతె నిలబడ్తవులే—నడువ్ లోపలికి" నెట్టాడు లచ్చమ్మను. తూలిపడ బోయి నిలదొక్కుకుని సాగింది.

"చెప్పుతుంటె నీక్కాదు—నడవమంటె నిలబడ్తవు."

లచ్చమ్మ నడుస్తూనే ఉంది. నుంచున్నట్లు కనిపించింది గురువయ్యకు. లచ్చమ్మ మీదికి ఉరికాడు. లచ్చమ్మ ఒక అడుగు ముందుకు వేసింది—పట్టు దొరక్క తూలి పడిపోయాడు గురువయ్య.

"పడేస్తవులే ఛినాల్" అని లేవబోయాడు గురువయ్య. లేవలేకపోయాడు. లచ్చమ్మ లేపింది. "పడేస్తవులే నన్ను" అని లచ్చమ్మ వీపుమీద గుద్దాడు. లచ్చమ్మ మాట్లాడలేదు. నడిపించుకుపోయి మంచం కుక్కిలో కూలేసింది.

"మాట్లాడవేం లంజె నేనేమన్న తాగొచ్చిన్ననుకున్నావా?" అని మూకుడులో అన్నం వేస్తున్న లచ్చమ్మను జుట్టు పట్టుకొని లాగాడు. లచ్చమ్మ చేతిలోని కుండ నేలమీద పడి పగిలిపోయింది.

"అన్నం పారేస్తవులే-మస్తీ ఎక్కింది" అని బాదాడు. దిండును గుద్దినట్లు గుద్దాడు. లచ్చమ్మ పల్లెత్తుమాట అనలేదు. దెబ్బలు కడుపుకు తగలకుండా కాపాడు కుంటూంది అంతే.

"మస్తీ ఎక్కింది లంజె మాట్లాడదు" అని బాది, బాది, మూలకు విసిరాడు.

మూలకుపడి ముకాన చేతులు పెట్టుకొని ఏడుస్తూంది లచ్చమ్మ.

ఏడుపు విని వీరావేశం వచ్చింది గురువయ్యకు.

"ఆఁయ్! ఏమనుకుంటున్నవ్ ఏడుస్తావు. పానాల్తీస్త" అని లంఘించాడు గురువయ్య.

ఇంట్లో దీపం రెపరెపలాడి ఆరిపోయింది.

మీదికి వచ్చిన గురువయ్యను చూచి వణికిపోయింది లచ్చమ్మ. మీద పడ్తున్న రెండు చేతుల్నూ చీకట్లోనే పట్టుకుంది లచ్చమ్మ.

"ఇగ ఏడవను. ఏడవనన్న గద ఏడవను. ఇగ పొయ్యి పండుకో. పండు కొమ్మంటున్న" అని లాక్కొచ్చి మంచంమీద పడేసింది.

"ఆఁ అట్లన్నవు బాగుంది. పండమన్నవు గద పంటున్న. అఁ. ఇంకే మన్నన్నవో ఖబడ్దార్" అని మంచంలో పడిపోయిగుర్రుపెట్టాడు గురువయ్య.

ఆ రాత్రి నిద్రపోలేదు లచ్చమ్మ.

# 9

తెల్లవారింది. కాని గురువయ్యకు ఇంకా తెల్లవారలేదు. లచ్చమ్మ లేచి జొన్నలు దంచింది. జొన్నన్నం ఉడికేవరకు లేచాడు గురువయ్య. ముఖం కడుక్కున్నాననిపించుకొని, బుక్కెడు బువ్వ బుక్కి బయటపడ్డాడు. బయట పడ్డాడనే కాని ఎక్కడికి పోవాలో అర్థం కాలేదు. నల్లపిల్ల ఇంకా అతన్ని వదల్లేదు. పనికి వెళ్ళబుద్ధి కాలేదు. నల్లపిల్లను వెదకడానికే బయలుదేరాడు. నల్లపిల్ల కులాన్ని గురించిగాని, అంతస్థును గురించిగాని ఆలోచించలేదతను. నల్లపిల్ల ఏమనుకుంటూంది కూడా ఊహించలేదు. నల్లపిల్లను నిన్న చూచాడు. అంతే ఆమె అతని మనసులో నిండిపోయింది. ఆ పిల్లను చూడాలి—ఆ తరువాత మాట్లాడాలి. అంతే మరో ఆలోచన లేదు. యుక్తాయుక్త విచక్షణ లేదు.

ఆమె కోసం గౌండ్లబుచ్చమ్మ ఇంటి ముందుదాకా వెళ్ళాడు. అక్కడ ఆగిపోయాడు. లోనికి పోలేదు. బయట నుంచోలేదు. పచార్లు చేశాడు. కొంతసేపు రాతిమీద కూలబడ్డాడు. ఎదిరి చూచాడు. ఆమె కనిపించలేదు. అక్కణ్నుంచి బయల్దేరాడు.

మంచినీళ్ళ బావి దగ్గర నుంచున్నాడు—కొంతసేపు. తరువాత రావి చెట్టు నీడన కూర్చున్నాడు. అనేకమంది ఆడవాళ్ళు బావికి వస్తున్నారు. కడవలు నింపు కుంటున్నారు. పోతున్నారు. వారు ముచ్చట్లు పెట్టుకుంటున్నారు. కిలకిల నవ్వుతున్నారు. వెళ్ళిపోతున్నారు. అందరినీ దీక్షగా చూస్తున్నాడు గురువయ్య. అతనికి పిల్లలు కనిపించారు. పడుచువాళ్ళు కనిపించారు—ముసలివాళ్ళు కనిపించారు. నల్లపిల్ల కనిపించలేదు. నల్లపిల్లను మించిన అందం కనిపించింది. అందవికారం కనిపించింది. నల్లపిల్ల కనిపించలేదు.

గురువయ్య చెరువుకు వెళ్ళాడు. నీళ్ళబంద దగ్గర నుంచున్నాడు. మర్రిచెట్టు కింద కూర్చున్నాడు. నీళ్ళు ఎత్తుకుపోయేవాళ్ళను చూడసాగాడు. పచ్చని పసిడి రంగు పడతులు కనిపించారు. చామనచాయ దానలు కనిపించారు. నలుపురంగు శివాలలు కనిపించారు, నల్లపిల్ల కనిపించలేదు. అలా చాలా సేపు కూర్చున్నాడు. పొద్దు ఎక్కిపోతూంది. నీలాటిరేవు ఖాళీ అయింది.

గురువయ్యకేమీ తోచలేదు. ఎక్కడికి పోవాలో అర్థం కాలేదు. ఆలోచిస్తూ మర్రిసీడ తలవాల్చాడు. ఒక మర్రి ఆకు రాలింది. దానికాడ నోట్లో పెట్టుకొని చెరువువైపు తిరిగాడు. చెరువు అందంగా వుంది. చెరువు నిండా తామరపూలు విచ్చికుని ఉన్నాయి. తామరాకుల మీద నీటిబొట్లు ముత్యాల్లా మెరుస్తున్నాయి. తామరపూల వనంలా ఉంది చెరువు. నీరు కనిపించడం లేదు. ఆకులు—పూలే. ఆకులు మీద ముత్యాలు అల్లల్లాడు తున్నాయి.

చెరువు అందంగా ఉంది. అది ఆకర్షించింది గురువయ్యను.

గురువయ్య లేచి కూర్చున్నాడు. చెరువునూ చెరువులోని తామరలనూ, ఆకులనూ, ఆకుల మీది నీటిబొట్లనూ చూశాడు. ఆ చెరువంతా అతని ఎదలో చేరి నట్లయింది. రోజూ చూస్తున్నాడు గురువయ్య చెరువును. ఇవ్వాళే ఇంత అందంగా ఉంది. ఎందుకో అర్థం కాలేదు గురువయ్యకు.

తామరపూలు—వందలు. వేలు ఎర్రగా రెక్కలు విచ్చుకున్నాయి. ఎండకు మెరుస్తున్నాయి.

కొన్ని మొగ్గలు, కొన్ని అరవిచ్చినవి-కొన్ని పూర్తిగా విచ్చినవి, విచ్చు కున్నవి.

పూలు! తామరపూలు!

ఆకర్షించాయి గురువయ్యను.

పూలన్నీ తన ముందుకు వచ్చి కుప్పబడాలనుకున్నాడు. పూలన్నీ తనవి కావాలి—తనవే కావాలి. అవును అన్నింటినీ తెంపాలి. తెంపి తన ముందు పేర్చు కోవాలి. అవి చెరువులో వుండరాదు. తన ముందు ఉండాలి. అక్కడెందుకుండాలి అవి? తన దగ్గర ఉండాలి.

లేచాడు గురువయ్య చెరువువైపు నడచాడు. చెరువు అందంగా వుంది. అంతే అతనికి కనిపించింది. చెరువు లోతు—తామరతీగ అతనికి గుర్తు రాలేదు. అందం చుట్టూ అనేక ప్రమాదాలుంటాయని అతనికి తెలియదు. గులాబీకి ముళ్ళుంటాయని అతనెరుగడు.

అందమే అలాంటిది.

అది ఏదీ తెలియనీయదు.

గురువయ్య చెరువులో కాలుపెట్టాడు. పూలు దూరంగా ఉన్నాయి. కనిపించు-లేదు. చేయి చాచాడు. ఒక మొగ్గ అందింది. అందుకున్నాడు. మరో చేతితో పట్టు కున్నాడు. మరో దానికోసం సాగాడు. కాలికి అడుగు అందటం లేదు. పూవు దూరంగా వుంది. అది రమ్మని పిలుస్తూంది. చేయి చాచాడు, అందటంలేదు.

మరో అడుగు ముందుకు వేద్దామనుకున్నాడు. చెరువుగట్టు మీంచి కేక వినిపించింది, "ఒరే గురవా చస్తవురా! తామర తీగున్నది! ఇవతలికిరా చస్తవు" వెనక్కి తిరిగి చూచాడు గురువయ్య. రామకిష్టయ్య. అరుస్తున్నాడు.

గురువయ్య పూవును చూచాడు.
నీటిని చూచాడు-నీటి లోతును చూచాడు.
తనను చూచుకున్నాడు. తన స్థితిని చూచుకున్నాడు.
చెరువు కట్టను చూచాడు. కట్టమీది రామకిష్టయ్యను చూచాడు.

పూవును వదులుకున్నాడు—చేతిలో ఉన్న మొగ్గతో బయటికి వచ్చాడు. "తామర మొగ్గ శాన బాగున్నది ఇస్తవా?" రామకిష్టయ్య అడిగాడు. గురువయ్య తామరమొగ్గను చూచాడు. రామకిష్టయ్యను చూచాడు. తామర మొగ్గ అక్కడ పెట్టి దూరం జరిగాడు. తామర మొగ్గ అందుకొని నవ్వాడు రామకిష్టయ్య.

"పనున్నది జర చేసిపెడ్తవా ?" రామకిష్టయ్య అడిగాడు.

"ఇయ్యాల చాతనైత లేదుండి" గురువయ్య జవాబు. రామకిష్టయ్యకు ఆశ్చర్యం కలిగింది.

"భీమునోలె ఉన్నవు. అట్లంటవేర! పైసలిస్త" డబ్బంటే కొండ మీది కోతి దిగివస్తుందని రామకిష్టయ్య నమ్మకం. అసలు దేవుణ్ణి సైతం డబ్బుపెట్టి కొన వచ్చునని అతని విశ్వాసం.

"ఏమోనుండి చాతనయితలేదు—కాల్మొక్త" అని సాగిపోయాడు మర్రిచెట్టువైపు గురువయ్య.

రామకిష్టయ్య అలా గురువయ్య వైపు కాసేపు చూచి తనదారితాను వెళ్ళి పోయాడు.

మర్రిచెట్టుకింద కూలబడ్డాడు గురువయ్య. అతని ఒంటిమీద తడిబట్ట ఎండి పోయింది. తామర వనాన్ని చూచాడు. అదంతా తాను కోసి ఉంచే అని ఆలోచించి రామకిష్టయ్య తీసికెళ్ళేవాడు అనుకున్నాడు. అలా అనుకోగానే నల్లపిల్ల గుర్తుకు వచ్చింది. నల్లపిల్ల గుర్తుకు వచ్చేవరకు మళ్ళీ పిచ్చి, పిచ్చిగా అనిపించింది. అక్క ణ్ణుంచి లేచాడు. చెరువు కట్టమీదపడి సాగిపోయాడు. ఎక్కడికి పోతున్నదీ తెలి యదు. ఎందుకు పోతున్నదీ తెలియదు. కట్ట దిగ్గాడు, చెట్లెక్కాడు. గుట్టలెక్కాడు. రాళ్ళెక్కాడు. దిగాడు. వళ్ళంతా చెమట పట్టింది. ఎండకు మెరుస్తున్నది. పొద్దు వాలేదాకా అలాగే తిరిగాడు.

పొద్దు వాలింది. తాటి వనానికి చేరుకున్నాడు, చింతచెట్టు బోసిగా కనిపిం చింది. అక్కడేమీ లేదు. ఎవరూ లేరు. కాలవ కనిపించింది. పారుతూంది. గురువయ్య తనను చూచుకున్నాడు; కాలవలో దిగి వళ్ళు కడుక్కున్నాడు—

ముఖం కడుక్కున్నాడు. బండమీద కూర్చొని ఊరివైపు చూడసాగాడు. బాటనే చూస్తూ కూర్చున్నాడు గురువయ్య. ఎవరూ రావడంలేదు. బాట శూన్యంగా ఉంది- అతని గుండెలాగే.

వస్తున్నది.

గురువయ్య గుండె గంతు వేసింది.

ఆమె వస్తున్నది-కల్లుకుండ నెత్తిన పెట్టుకొని వయ్యారంగా నడుస్తూన్నది- వస్తున్నది.

వచ్చేది నల్లసిల్లే!

లేచి అమాంతంగా ఎదురుగా పరుగెత్తుదామనుకున్నాడు. నిగనిగలాడే బుగ్గలను ముద్దు పెట్టుకుందామనుకొన్నాడు. కాని తీరా లేద్దామనుకునేవరకు నీరు కారిపోయాడు. ఆమె ఏమనుకుంటుందో? లోకం ఏమనుకుంటుందో?

అసలు తానెవరు? ఆమె ఎవరు?

తాను మాల-ఆమె గౌండ్ల.

సాధ్యమా? ఇది సాధ్యమా?

ఆలోచనలు అతన్ని అణగద్రొక్కాయి. అయినా అతనిలోని వెల్లువ తగ్గలేదు. గురువయ్య లేచాడు. ఆమెకు ఎదురు పోయాడు.

పరిగెత్తలేదు—మెల్లగానే సాగాడు.

ఆమె దగ్గరికి వచ్చింది - జగన్మోహినిలా కనిపించింది - సురాభాండంతో.

ఏమిటో అందామనుకున్నాడు గురువయ్య - అనలేకపోయాడు.

ఆమె చిరునవ్వు నవ్వింది.

గురువయ్య గుండెలో వెన్నెలలు విరిశాయి.

ఆమె రమ్మన్నట్లు తల వూపింది - సాగిపోయింది.

గురువయ్య యంత్రంలా అనుసరించాడు.

ఆమె కుండ దింపింది.

సాయంకాలం ప్రశాంత సమయం—అక్కడెవరూ లేరు. ఇద్దరే అయినా అతడేమీ చేయలేదు. ఆకు నోటి దగ్గర పెట్టుకొని కూర్చున్నాడు.

ఆమె కుండ అందుకొని వంగింది.

"నీ పేరేంది?" అడిగాడు గురువయ్య.

"పిచ్చమ్మ" ఆమె గురువయ్య కళ్ళల్లోకి చూచి అన్నది. వెంటనే చూపు తిప్పుకొన్నది.

"అట్లనా! నాకు పిచ్చెక్కిస్తున్నవు."

పిచ్చెమ్మ చేతులు వణికాయి. కుండలోని కల్లు తొణికి కింద పోయింది.

గురువయ్య ఆమె ముఖం చూచాడు-ఆమె ముఖంలో తామర పూలు కనిపిం

చాయి. ముద్దు పెట్టుకోవాలనిపించింది కాని పెట్టుకోలేదు. లేచి నుంచున్నాడు. "పిచ్చమ్మా నే చచ్చిపోత" అన్నాడు.

"అత్తొస్తున్నది కూకొ-ఆకు పట్టుకో" అన్నది పిచ్చమ్మ.

గురువయ్య ఆకు పట్టుకొని కూర్చున్నాడు.

పిచ్చమ్మ మొగ్గలో రెండు వ్రేళ్ళు అడ్డం పెట్టి వంపుతూంది.

గురువయ్య తాగుతున్నాడు-ఆమెను చూస్తున్నాడు.

పిచ్చమ్మ పోస్తున్నది–అతన్ని చూస్తున్నది.

కుండ ఒడిసింది ఇద్దరూ గమనించలేదు. అత్త పిలుపు విని లోకంలోకి వచ్చింది పిచ్చమ్మ. "ఈడనే ఉండు మాపటికి వస్త" అని తటాలున వెనక్కు తిరిగి వెళ్ళిపోయింది.

గురువయ్యకు ఈలపాట వచ్చింది.

> "ఇంటికాడా ఒంటిగాణ్ణి
> జంటలేకా పొగులుతుంటే
> అందకారి బంగరు బొమ్మా
> ఓరకంట నన్ను సూస్తావా?"

పాడుతూ సాగిపోతున్నాడు గురువయ్య మళ్ళీ రావడానికి—మల్లెలు ఏరడానికి.

పిచ్చమ్మ ఆ సాయంకాలం చాలా కల్లు పారబోసింది. అత్తతో చీవాట్లు తిన్నది.

రాత్రి.

ఆకాశాన చుక్కలు వెలుగుతున్నాయి. చింతచెట్టుకింద చిక్కని చీకట్లో గురువయ్య కూర్చున్నాడు—ఎదిరి చూస్తూ. నిరీక్షణలో ఉన్న ఆరాటం ప్రేమికులకే తెలియాలి! లేస్తున్నాడు. ఎదురు సాగుతున్నాడు. నిలుచున్నాడు. నిరీక్షిస్తున్నాడు. వెనక్కు వస్తున్నాడు. కూర్చున్నాడు. చింతాకు తెంపేస్తున్నాడు.

అతని ఆవేదన పెరుగుతూంది. ఆరాటం పెరుగుతూంది. ఆగలేకున్నాడు.

పిచ్చమ్మ కనిపించింది. ఎదురు పరుగెత్తాడు. ఆమె కూడా ముందుకు ఉరికి వచ్చింది.

చుక్కల కాంతికి మెరిసిపోతూంది పిచ్చమ్మ.

"పిచ్చమ్మా! కౌగిలించుకోనా!"

"ఊఁ. నేను జల్ది పోవాలె. పండబెట్టి వచ్చిన అందరిని."

గురువయ్య గుండెలో లావా పొంగింది. లిప్త సైతం నష్టం కానివ్వదలచలేదు. అతడు ఆమెను గట్టిగా కౌగిలించుకున్నాడు. ఆమె కౌగిట్లో ఒరిగిపోయింది.

రాత్రి, చుక్కలు, చల్లనిగాలి, ఏకాంతం.

రెండు నదులు కలిశాయి. రెండు మబ్బులు కలిశాయి. రెండు మనసులు కలిశాయి. రెండూ తనువులు కలిశాయి.

కలయికలో ఆనందం ఉంది-అనుభూతి ఉంది-మాధుర్యం ఉంది. ఆనందం ఎప్పుడూ ఉండదు. కలయిక కలకాలం కొనసాగదు.

పిచ్చమ్మ విడిపించుకుంది. "పోవాలె. ఆడ అందరు పన్నరు వదులు."

"పిచ్చమ్మా! అప్పుడే పోతవా?"

పిచ్చమ్మ గురువయ్యను ముద్దు పెట్టుకుంది. "పోవాలె. రేపు పొద్దాల—ఏటి కాడ—యాపచెట్లల్ల—రావాలె—నేనొస్త" సాగిపోయింది పిచ్చమ్మ.

ఏమీ తెలియనట్లే పోయింది. కొంతదూరం పోయి తిరిగి చూచింది. గురువయ్య ఆమెనే చూస్తున్నాడు. గిరుక్కున వెనక్కు తిరిగి వెళ్ళిపోయింది.

గురువయ్యకు ఈలపాట వచ్చింది.

"మనమిద్దరమూ కూడి
బండిమీద పోతుంటే
కన్నుకుట్టి ఏడ్చిందే
మన ఊరంత–కన్నుకుట్టి ఏడ్చిందే."

గురువయ్య కూనిరాగం తీస్తూ సాగిపోతున్నాడు. అతడు ఎంతో తేలిగ్గా ఉన్నాడు. రెక్కలు లేకున్నా తేలిపోతున్నాడు, లచ్చమ్మ చూచింది. మాట్లాడలేదు. దీపం ముందుంచి అన్నం పెట్టింది. మౌనంగా దీపం ముందు కూర్చుంది. గురువయ్య కూడా మాట్లాడలేదు. అన్నం తిని మంచంలో వాలిపోయాడు.

లచ్చమ్మ కళ్ళు కన్నీటి కొలకు లయినాయి.

ఆమె గురువయ్య మౌనం భరించలేకపోయింది. ఇవ్వాల్టి మౌనంకంటే నిన్నటి దెబ్బలే బాగనిపించాయి!

లచ్చమ్మ నిద్రపోలేదు. కన్నీటిలో మునిగిపోయింది. అయినా తెల్లవారింది. కాలం కర్కశమైంది. దానికి ఎవరి బాధా తెలియదు.

గురువయ్య లేచాడు. నిత్యకృత్యాలు తీర్చుకొని స్నానం చేశాడు. మంచి పంచె కట్టుకున్నాడు. అన్నం తిని బయల్దేరాడు. అతడు కూలికి పోలేదు. ఏటిఒడ్డుకు చేరాడు—అప్పటికే బారెడు పొద్దెక్కింది. వేప వనానికి చేరాడు.

పిచ్చమ్మ తలలో ముద్దబంతి పూలతో కూర్చుని, వేపపుల్లతో నేలమీద బొమ్మలు గీస్తున్నది. గురువయ్యను చూచి తల ఎత్తింది. "ఇంతసేపటికా!"

"ఇంత జల్ది వస్త వనుకొలేదు."

"అట్లనా!" నవ్వింది. కళ్ళు మరింత ఎరుపెక్కాయి—మోదుగుపూలలా.

"పిచ్చమ్మా!" గురువయ్య ఆమె ఎదుట కూలబడ్డాడు.

పిచ్చమ్మ కళ్ళు పెద్దవి చేసి చూసింది ఏమిటి అన్నట్లు.

"ఎంత పరేషానయ్యన్ననుకున్నావు నీ కోసం!"

"అట్లనా!" కిలకిలా నవ్వింది.

వెర్రెత్తింది గురువయ్యకు. కావిలించుకున్నాడు.

ఆమె అతని తొడమీద తలపెట్టి పడుకుంది. ఆ వేపచెట్ల పొద విచిత్రంగా ఉంది. చుట్టూ వేపచెట్లే—మధ్యన ఖాళీ స్థలం—వేపాకు రాలి ఉంది—పచ్చిది-పండుదీ, వేపచెట్ల చిరుచేదు వాసన!

"ఎందుకట్లయినవు?" వేపాకు కొరుకుతూ అడిగింది—కొంటెగా.

"అట్లనా! నిన్ను చూసి."

"నేనంత బాగున్నానా?"

"నాకు పిచ్చెక్కించిన వనుకో."

"అట్లనా?" అని కళ్ళల్లోకి చూసింది.

కళ్ళను చూసి పొంగిపోయాడు గురువయ్య. వంగి ముద్దుపెట్టుకున్నాడు. ఆమె లేచి అతణ్ని కౌగిలించుకుంది.

అతడు ఆమె తొడమీద పడుకున్నాడు—వేపాకు కాడ కొరుకుతూ.

"మనం ఇట్లనే ఉంటె ఎట్లుంటది?" అడిగాడు.

"ఎట్లుంటదా? మబ్బుల్ల తేలిపోయినట్లుంటది."

"ఉందామా మరి."

"మరి మా అత్త?"

"అవుతే మాలచ్చికూడున్నది."

"ఇట్లనే వస్తవుగద దినాం?"

"అబ్బ! ఎంత ఆశ!!" వేపాకుతో బుగ్గమీద కొట్టింది.

"రావా!" భయపడి దిగ్గున లేచి అడిగాడు.

"ఏం చేస్తవు రాకుంటె?" కిలకిలా నవ్వింది.

"ఏం చేస్తనా? వీట్లపడి చస్త!"

"నిన్ను చావనిస్తనా?" అని అతని తల బుజంమీద పెట్టుకొని జుట్టు నిమిరింది.

"ఎంత మంచిదానివి." అతడు ఆమె వీపు నిమిరాడు.

"బావా!" అలా ఆమె పిలవడం తొలిసారి. తలయెత్తి చూచాడు గురువయ్య.

"పిచ్చీ!"

ఆమె పెదవులు కలిపింది.

అలా ఉండిపోయారు-ఆనందానికి అవధుల్లేకుండా.

సూర్యుడు తలమీదికి వచ్చి సమయం చెప్పాడు.

పిచ్చమ్మ తటాలున లేచి నుంచుంది. "పోవాలె" అని. "పోతవా?" అని ఆ చేయి పట్టుకున్నాడు గురువయ్య.

"అత్త వచ్చేయాళయింది. ఇపుడు పోత."
''పోతవా?"
"పోవాలె."
"సరెపో" చేయి వదిలాడు. ఆమె అడుగులు బరువుగా వేస్తూ సాగిపో తూంది.
"మాపటికి తాటి వనానికి...." కేకవేశాడు గురువయ్య.
ఆమె తల ఊపుతూ సాగిపోయింది.
గురువయ్య వేప చెట్లలోనే పడి ఉన్నాడు - అక్కడే నిద్రపోయాడు.

# 10

కొత్త ఇంటికి చేరిన కొత్తలో నారాయణస్వామి చాల ఉత్సాహంగా ఉన్నారు. ఇల్లు కట్టే రోజుల్లో గురువయ్యతో బాగా సాన్నిహిత్యం ఏర్పడింది. అతడు ఇంట్లో మనిషికాదు—మనసులో మనిషిలా మసలసాగాడు. ఈ కొత్త ఇల్లు గురువయ్య ఇంటికి దగ్గర్లో ఉంది. తనను గురువయ్యకు దగ్గరగా తేవడానికే భగవంతుడు ఇక్కడికి రప్పించాడేమో ననుకున్నాడు. గురువయ్య సన్నిహితు డైన కొద్ది రామకిష్టయ్యమీద ఒక రకపు అసహ్యం ఏర్పడింది. ఇల్లు కాళీ చేయించడంతో అది మరీ బలపడింది. రామకిష్టయ్యను తద్వారా ఊరినీ వదులు కున్నాడు స్వామి – గురువయ్య స్నేహం కోసం. గురువయ్య దగ్గరగా ఉండడం వారికి ఒక రకంగా ఆనందంగానే ఉంది. పైగా పురాణం వినడానికి లచ్చమ్మకూడా వస్తూంది. నాంచారమ్మకు వేరే ఆలోచనలు లేవు కాబట్టి అర్థం అవుతూంది. అంత కంటే కావలసిందేమి నారాయణస్వామికి!

నాంచారమ్మకూ ఒక రకంగా హాయిగా ఉంది. ఇంటి వెనక మంచినీళ్ళ బావి ఉంది. ఇందువల్ల రెండు సమస్యలు పరిష్కారం అయినాయి. ఆమె చెరువుకు పోవాల్సిన అవసరం లేదు. బయటికి వెళ్తే ముక్కులు, మూతుల విరుపులు చూడాల్సి వస్తుంది. అది తప్పింది. లచ్చమ్మ తరచుగా ఇంటికి వస్తూంది. గురువయ్య ఇంట్లో నుంచి బయటపడితే లచ్చమ్మ నాంచారమ్మ ఇంటికే చేరుతూంది. వంటింట్లోంచి బయటపడ్తే నాంచారమ్మ లచ్చమ్మతోనే ఉంటూంది. లచ్చమ్మ నిగనిగలాడుతుంటే, ఆమెపొట్ట పెరుగుతుంటే ఏదో ఆనందం నాంచారమ్మకు. లచ్చమ్మను అడిగి, అడిగి చేసిపెట్టేది అన్నీ. లచ్చమ్మకూ, నాంచారమ్మకూ ముచ్చట్లు తెగడమంటూ ఉండేదే కాదు. లచ్చమ్మ చెప్పే కథలన్నీ విచిత్రంగా ఉండేవి నాంచారమ్మకు. వాళ్ళ కుటుంబాలు, వాళ్ళ సంసారాలు, వాళ్ళ తగాదాలు-తన్నులాటలు, వాళ్ళ సమాధానాలు, పెళ్ళిళ్ళు, లేచిపోవడాలు, తాగుళ్ళు, తన్నులాటలు వింతగా కనిపించేవి ఆమెకు. మళ్ళు, ఆచారాలు, పురాణాలు

వింతగా అనిపించేవి లచ్చమ్మకు. వారిద్దరి కలయిక రెండు విభిన్న సమాజాల కలయికగా, రెండు విభిన్న సంస్కృతుల సమ్మేళనంగా, రెండు విభిన్న నాగరికతల కూడలిగా వుండేది. లోన మంచంలో పడుకుని వినే నారాయణస్వామికి హాయిగా ఉండేది. అవి పురాణాల్లో కథలు కావు - అవి వారికి తెలుసు. రాజుల దండయాత్రలు కావు - అవి వారికి తెలుసు. ఇది కొత్తకథ—జీవితంలోంచి పొచ్చుకొని వచ్చింది. ఈ కథల్లో మనుషుల వాసన - వారి కష్టసుఖాలు, ఆచార వ్యవహారాలు ఉన్నాయి. ఇవి నేలనంటిన కథలు. నారాయణస్వామికి తెలిసినవి నేల విడిచిన కథలు. అందుకే వారికి లచ్చమ్మ కథల్లో ఎంతో ఆసక్తి-అయినా లచ్చమ్మకు నారాయణస్వామి పరోక్ష శ్రోత మాత్రమే. వారు వింటున్నారని సైతం లచ్చమ్మకు తెలియదు.

ఆలా హాయిగా గడిచిపోతా యనుకున్నారు రోజులు నారాయణస్వామి దంపతులు. కాని అలా జరగలేదు. అంతా తలకిందులైంది. గురువయ్య పిచ్చమ్మను చూచిన్నాటినుంచి నారాయణస్వామి ఇంటివైపు రావడం మానేశాడు. నారాయణస్వామి కాలుకాలిన పిల్లిలా వెనక్కూ, ముందుకూ తిరగసాగారు. వారికి లేనిపోని వంటరితనం, చిరాకు, కలవరపాటు మొదలయినాయి. ఏం చెయ్యాలో అర్థం కావడంలేదు. ఊళ్ళోకి వెళ్ళేట్లు లేరు—గడప దాటడం లేదు. ఇంట్లో తోచటం లేదు. లచ్చమ్మ స్నేహితంతో నాంచారమ్మకూ, నారాయణస్వామికి దూరం పెరిగింది. వారిద్దరూ అన్యోన్యంగా మాట్లాడుకోవలసిన విషయం కనిపించడంలేదు.

తొలి రోజు గురువయ్యతో తన్నులు తిన్న తరువాత లచ్చమ్మ నాంచారమ్మ ఇంటివైపు రావడం మానేసింది. తన ముఖం చూపించడం ఎందుకో సిగ్గనిపించింది లచ్చమ్మకు. ఇంట్లో కూలబడి కుంగి, కృశిస్తున్నదిగాని బయట అడుగు పెట్టడం లేదు. ఆమె మనసులోని క్షోభను దాచుకొని, ఆ అగ్గిలోనే ఆహుతి అవుతూంది లచ్చమ్మ. ఆమె బయటకి రాదు. ఒకరికి చెప్పుకోదు. నాంచారమ్మ చాలసార్లు కబురుపెట్టింది. లచ్చమ్మ ఏదో నెపం చెప్పింది. పోలేదు.

"ఏమండీ! నాకు పిచ్చిలేచేట్లున్నదండి" ముసుగు కప్పుకొని పడుకున్న నారాయణస్వామిని లేపి అన్నది నాంచారమ్మ. నారాయణస్వామి ముఖంమీది కప్పు తీసి నాంచారమ్మను చూచాడు అంతే. ఏమీ అనలేదు.

"నిజంగనండి, మనసు గుబులు గుబులుగున్నది. ఎందుకంటరు?"

నారాయణస్వామి లేచికూర్చున్నాడు. నాంచారమ్మ బుజంమీద చేయివేసి "ఏది! ఏమన్న మాట్లాడు!" అన్నారు.

"ఏం మాట్లాడమంటరండీ" ఇంటి కప్పులోకి చూచింది. ఎక్కడో ఉన్న సందులోంచి సూర్యరశ్మి దారలా వస్తూంది. అది నేలమీదపడి ఒక వెలుగు వలయం ఏర్పడింది.

"ఆఁ ఏం మాట్లాడాలె నంటవుకద! ఇవ్వాళ వంకాయ కూర బాగ కుదిరింది. నువ్వులు వేసినవా? ధనియాలా?"

"లచ్చమ్మకు పెద్దె శాన సంతోషించేదండి" వద్దనుకున్నా అదే ముచ్చట వచ్చినందుకు నాలిక్కరుచుకుంది నాంచారమ్మ.

"నాంచారూ అంతా భగవన్మాయ. ఈ బంధాలు ఎందుకు కలిపిస్తడో, ఎందుకు తెంచుతడో వానికే తెలియాలె. ఈ బంధం తగిలిందని వేరే బంధాలు వదులుకున్నాం. గురువయ్య బాగయితున్నడనుకున్నం. అట్ల సంతోషపడవచ్చునను కున్నం. మన సంతోషం ఆ పరాత్పరునికి ఇష్టం లేదు. గురువయ్య చెడిపో తున్నడు—మనకు దుఃఖం తెచ్చేటందుకు! మనం ఏం చేయగలం? మన చేతులో ఏమున్నది? గురువయ్యకోసం సంఘాన్ని వదులుకున్నం. గురువయ్య మనను వదిలిండు. ఈ బంధంకూడా వదులుకోవటం మంచిది నాంచారూ—లచ్చమ్మను మరిచిపో" నారాయణస్వామి మాటల్లో దుఃఖపు జీరలు కనిపించాయి.

"ఎట్ల వదులుకుంటమండి! వదులుకొని ఇంక బతుకెందుకండి ... ఎందు కండి బతుకు?" నాంచారమ్మ దుఃఖం కట్టలు తెంచుకుంది. వద్దనుకున్నా చెక్కిళ్ళ వెంట కన్నీరు ధారగా పారుతూంది.

"నిజమే నాంచారూ; కాని చావు మనం అనుకున్నప్పుడు వస్తుందా? అదీ మన చేతులో లేదు" నారాయణస్వామి కళ్ళు చెమ్మగిల్లాయి.

ఎక్కడో దూరంనుంచి లచ్చమ్మ పిలుపు వినిపించి నట్లయింది—ఆలాప ననుకున్నారు ముందు. మళ్ళీ వినిపించింది పిలుపు. దిగ్గున లేచి ఉరికి వచ్చింది నాంచారమ్మ.

లచ్చమ్మ నుంచొని ఉంది!

నాంచారమ్మ "లచ్చమ్మా!" గట్టిగా అని ఆగిపోయింది—నివ్వెరపోయింది—లచ్చమ్మను చూచి.

"ఎట్లయినవు లచ్చమ్మా!" నాంచారమ్మ అనగలిగిన మాటలవి. అంతలో నారాయణస్వామి వచ్చేశారు.

"లచ్చమ్మా! నువ్వేనా!" అన్నారు.

లచ్చమ్మ పూర్తిగా మారిపోయింది. పోలికలు సైతం లేవు. బాగా శుష్కించి పోయింది. కాళ్ళూ చేతులూ పుల్లల్లా ఉన్నాయి. పొట్ట తప్ప ఏదీ కనిపించడంలేదు. ముఖం పూర్తిగా మారిపోయింది. కళ్ళు లోతుగా పీక్కుపోయాయి. దవడ ఎము కలు కనిపిస్తున్నాయి. చెంపలు పీక్కుపోయాయి. జుట్టు చిందర వందరగా ఉంది.

ముఖంలో కళ లేదు. కళ్ళల్లో ప్రాణాలు కనిపించలేదు.

"అవునండి" నవ్వుదామని ప్రయత్నించింది లచ్చమ్మ "జర నవుస్తున్న—వళ్ళు బాగలేదు. జరన్ని నూకలుంటె పెట్టకపోతిరి – గంజి కాచుకుంట" ఈ నాలుగు మాటలకే తనుపు వస్తున్నట్లుంది. నుంచోలేకుండా ఉంది.

"కూచో లచ్చమ్మా! నిలబడ్డవెందుకు?" నాంచారమ్మ అనడమూ లచ్చమ్మ కూలబడ్డమూ ఒకేసారి జరిగాయి.

నారాయణస్వామి కనురెప్ప వాలడం లేదు.

"ఎందుకట్లయినవు?" అడిగింది నాంచారమ్మ.

"ఏం లేదుండి, జర మొస్తున్నది" రాకపోవడానికి ఇలా కావడానికీ రెంటికీ సమాధానముంది అందులో.

"గురువయ్య ఇంటికొస్తున్నడా?" నారాయణస్వామి అడిగారు.

లచ్చమ్మ తలెత్తి స్వామి కళ్ళల్లోకి చూసింది—గురువయ్య సంగతి వీరికి తెలిసిపోలేదుగదా అని. నారాయణస్వామి కళ్ళల్లో ఏమీ కనిపించలేదు. లచ్చమ్మ దీనత్వమే ప్రతిఫలించింది వాటిల్లో. "వస్తనే ఉన్నడు" తలవంచి చెప్పింది లచ్చమ్మ.

"వస్తుంటె ఇట్లెందు కయితవు?" నాంచారమ్మ.

"వస్తనే ఉన్నడు—రాకేం చేస్తడు?" నాంచారమ్మ ముకాన్ని చూచి చెప్ప లేక తలవంచుకొని అన్నది—కాని గొంతు దుఃఖాన్ని సూచిస్తూంది.

"గురువయ్య తప్పతాగవలు తొక్కుతున్నడు గద! తాగి నిన్ను కొడు తున్నడు గద! ఇంట్లకేం తేవటం లేదుగద!" నారాయణస్వామి మాటలు నగ్న సత్యాల్లా అనిపించాయి లచ్చమ్మకు. సత్యానికి తాను కప్పిన గుడ్డలు బరాబరా కాలి పోతున్నట్లనిపించింది. అలా నిటారుగా నుంచొని కంటిరెప్ప వాల్చకుండా గంట కొట్టినట్లు పలికిన నారాయణస్వామిని చూచి వణకిపోయింది లచ్చమ్మ. 'నాకు అబ ద్ధాలు చెపుతావా?' అని బెదిరిస్తున్నట్లున్నాయి స్వామి కళ్ళు.

"అవును అయ్యగారూ" తల వంచుకొని అన్నది లచ్చమ్మ.

"ఏం చేసిండే! ఎందుకు రావటంలేదే? ఎందుకొట్టుతున్నడే?" అడిగింది నాంచారమ్మ-ఆవేదనగా.

నాంచారమ్మలో లచ్చమ్మకు చనిపోయిన తన తల్లి కనిపించింది. నాంచారమ్మ నుంచున్నది దూరంగానేనైనా, దగ్గర కూర్చొని కళ్ళు తుడిచి అడుగు తున్నట్లనిపించింది. లచ్చమ్మ దుఃఖం ఆగలేదు. పొంగిపొర్లింది. "నా కర్మ అమ్మ గారూ నా కర్మ" అని తల బాదుకొని ఏడ్చింది. ఏడుస్తూనే తన ఇంట్లో జరుగు తున్న కథంతా వివరించింది. ఈరోజు బియ్యం తెచ్చి వండకుంటె లచ్చమ్మను చంపేస్తా నన్నాట్ట గురువయ్య. అందుకూ వచ్చింది నారాయణస్వామి ఇంటికి.

నారాయణస్వామి దంపతులు ఒకరి ముకాలు ఒకరు చూచుకున్నారు. వారి కళ్ళూ చెమ్మగిల్లాయి. నాంచారమ్మ లచ్చమ్మ దగ్గిరగా వెళ్ళి "లచ్చమ్మా! ఇగ ఏడ వకు. నా కడుపు తరుక్కొని పోతున్నది. గ్రహచారం మనకు బాగలేదు" అన్నది. లచ్చమ్మ చేతులు నేలకానించి మొక్కి "ఇగ ఏడవను తల్లీ ఏడ్వను. నాకు అమ్మ దొరికింది. మా అమ్మ బతికి వచ్చింది" అని కళ్ళు తుడుచుకుంటూన్న లచ్చమ్మను చూచి మాతృత్వం పొంగి పొరిలింది నాంచారమ్మలో. అవధులన్నీ అధిగమించింది—

అడ్డుగోడలు కూల్చింది. "బిడ్డా" అని కూలబడి లచ్చమ్మను కావిలించుకొని గట్టిగా ఏడ్చేసింది.

"అమ్మా" అని నాంచారమ్మను కావిలించుకొని ఏడ్చింది లచ్చమ్మ.

నారాయణస్వామి కళ్ళవెంట టపటపా కన్నీరు రాలింది.

కొంతసేపు ఏడ్చి లచ్చమ్మను ఓదార్చింది నాంచారమ్మ. "బియ్యం తెచ్చి పెత్తనుండు" అని వసారాదాకా పోయింతరువాత గాని తాను లచ్చమ్మను తాకి మైలపడ్డాననే విషయం గుర్తుకు రాలేదు. "ఏమండీ బియ్యం తెచ్చిపెట్టండి లచ్చమ్మకు" అని దూరంగా నుంచుంది.

నారాయణస్వామి బియ్యం సహితంగా సామగ్రి సాంతం మూటకట్టి తెచ్చి అందించారు. బియ్యపు మూట లచ్చమ్మ చేతిలో పెట్టి తల నిమురుతూ "ఇగ చూడు, ఏమన్న కావలిస్తేవచ్చి అడుక్కుపో, పొట్టలో బిడ్డను చూచుకొని ఒక ముద్ద తిను, వస్తుండు" అని గుమ్మందాకా సాగనంపింది. "నేను గురువయ్య నడుగుతలే" అన్నారు స్వామి. లచ్చమ్మ బెదిరి వెనక్కు తిరిగి "వద్దయ్యగారూ, వద్దు. అడగొద్దు" అన్నది బ్రతిమిలాడుతున్నట్లు. ఆ కళ్ళల్లోని భీతాహం గమనించారు స్వామి.

"అడగనులే లచ్చమ్మా!" అన్నారు.

లచ్చమ్మ సాగిపోతుంటే భార్యాభర్త లిద్దరూ గుమ్మంలో నుంచొని చూస్తు న్నారు. తమ ఇంటినుంచి ఆడపిల్ల కటికవాని ఇంటికి పోతున్నట్లనిపించింది వారికి.

అల్లుడు కటికవాడవుతే తలిదండ్రులు మాత్రం ఏం చేయగలరు? కసాయికి అప్పగించాల్సిందే!

రాత్రి బాగా పొద్దుపోయింది. తలుపు తట్టిన చప్పుడవుతే లేచి తలుపు తీసింది నాంచారమ్మ. లచ్చమ్మ గుమ్మంలో నుంచొని ఉంది.

"ఆయనింక ఇంటికి రాలేదుండి" అన్నది లచ్చమ్మ. లోపలికి వెళ్ళి నారాయణస్వామిని లేపింది. "ఏమండీ! గురువయ్యింక ఇంటికి రాలేదట. లచ్చమ్మొచ్చి నిలబడ్డది" అని చెప్పింది. కప్పు తీసివేసి బయటికి వచ్చారు నారాయణ స్వామి.

"గురువయ్య ఇంటికి రాలేదా?" అడిగారు.

"రాలేదుండి."

"ఎక్కడికి పొయ్యుంటడు?"

"ఎట్ల తెలుస్తది?"

"ఇప్పుడేం చేస్తమంటవ్!"

"ఏమో తెలుస్తలేదండి"

"రోజియ్యాళ్టికి ఇంటికొచ్చెటోడా?" నాంచారమ్మ అడిగింది.

"పొయ్యేటోడే గాని ఇంత సేపు పొయ్యేటోడు కాదుండి."

"పోతె పొయ్యిండు పోనీ. దెబ్బలే తప్పేవాడు నిన్నేమన్న సుఖపెట్టు న్నడా?"

"అట్లనకండి అమ్మగారూ! ఏడ పోయిండో? ఆయిన కేమైందో? గుబులు గుబులు గున్నదండి."

"సరే పా ఎతుకుదం పా" అని లాంతరు అందుకొని బయలుదేరారు నారాయణస్వామి.

"లాంతరక్కడ పెట్టుండి, బాంచెను. పట్టుకొస్త" అన్నది లచ్చమ్మ.

లాంతరక్కడ పెట్టి, లోనికి పోయి బాణాకర్ర తీసుకొని బయల్దేరారు. ముందు లాంతరు పట్టుకొని లచ్చమ్మ, వెనుక కర్ర పట్టుకొని నారాయణస్వామి సాగిపోతున్నారు. నాంచారమ్మ గుమ్మానికి ఆనుకొని నుంచుంది—వారు వెళ్ళిన వైపు చూస్తూ.

రాత్రి—చీకటి.

ఇద్దరూ ఊరు దాటారు.

"ఎక్కడికి పోదమంటవు?" నారాయణస్వామి నడుస్తూనే అడిగారు.

"తాళ్ళల్ల చూద్దాముండి మొదలు" సాగిపోతూనే అన్నది లచ్చమ్మ.

ఊరు దూరం అవుతున్నది.

చిమ్మన చీకటి. చుక్కల వెలుగు తప్పలేదు. కీచురాళ్ళ రొదలు. దూరం నుంచి నక్కల ఊళలు. చీకటి గుంపుల్లా గబ్బిలాలు. వాతావరణం భయం భయంగా ఉంది.

నారాయణస్వామి తాటి వనానికి ఎప్పుడూ వచ్చి ఎరుగరు. వారి కిది కొత్త. తాను! తాటి వనంలో !! ఏదో కించగా తోచింది. ఎవరైనా చూస్తారేమో నను కొన్నారు. తాను తాటి వనానికి పోవడం ఏమిటి? వారికే అర్థం కాలేదు. ఇవన్నీ కలిసి బుగులు మొదలైంది అయ్యవారికి.

ఇద్దరూ మౌనంగా సాగిపోతున్నారు. కాలవ-కాలవ ప్రక్కన చింతచెట్టు కనిపించాయి.

చింతచెట్టు కింద చిక్కని నీడ!

"లచ్చమ్మా నిలబడు."

లచ్చమ్మ నుంచొని నారాయణస్వామి వైపు తిరిగింది లాంతరు చేత్తో ఎత్తుగా పట్టుకొని.

నారాయణస్వామి వచ్చేశారు.

"ఈ చీకట్లో ఎక్కడని ఎతుకుతం?" తాటివనంలో ప్రవేశించటానికి సందేహం వ్యక్తపరుస్తూ అన్నారు.

"ఎట్లనన్న ఎతకాల్నుండి" స్వామి సందేహం లచ్చమ్మకు అర్థం కాలేదు. లచ్చమ్మ ఆతురతలో ఉంది. ఆమె కేమీ అర్థం అయ్యేట్లులేదు. ఆమె నారాయణ స్వామి జవాబుకోసం కూడా ఎదిరి చూతలేదు. లాంతరుతో ముందుకు సాగింది.

నారాయణస్వామి చూచారు. నిండు చూలాలు! నిస్సత్తువగా ఉంది! ముందు నడుస్తూంది. పాపం ఆమె కేమన్నా అవుతే!

"లచ్చమ్మా!"

ఈ తడవ ఆమె ఆగలేదు. "ఊఁ" అని సాగిపోతూంది.

తాటిచెట్లు దట్టంగా ఉన్నాయి చీకట్లో దయ్యాల్లా కనిపిస్తున్నాయి.

"లచ్చమ్మా! నిలబడు."

లచ్చమ్మ నిలిచింది. లాంతరు పట్టి స్వామికి దోవ చూపిస్తూ నుంచుంది.

"లచ్చమ్మా! అడివిలో కొచ్చినం, పురుగో బూచో, లాంతరు నాకియ్యి నేను ముందర నడుస్త."

"బతికి మాత్తరం చేసిడి దేమున్నదుండి. చస్తైనే నయం. నాకు చావురాదు లేరి. మొండిదాన్ని" అని సాగిపోయింది.

చుక్కలు మిలమిలా మెరుస్తున్నాయి. లాంతరు వెలుగు తప్ప ఏమీ లేదు. చీకటి స్తంభాల్లా ఉన్నాయి తాటిచెట్లు. ఒకదారి లేదు—డొంకలేదు—ఎక్కడా చూడ్డం? ఎలా చూడ్డం?

లచ్చమ్మ లాంతరు పట్టుకొని అటూ ఇటూ తిరుగుతూంది—అది వెర్రి తిరగడమేనని గ్రహించారు స్వామి. అయినా ఆమె వెంట తిరిగారు. ప్రయోజనం లేకపోయింది. లచ్చమ్మ అలసిపోయింది. లాంతరు కింద పెట్టి నేలమీద కూలబడ్డది.

"ఏం చేస్తమంటవు?" నారాయణస్వామి లాంతరు ముందు నుంచొని అడిగారు.

"ఏమన్న చెయ్యాల్నుండి. ఈణ్నే యాణ్నో ఉంటడనిపిస్తున్నది. పేరుపెట్టి పిలుస్తే మాట్లాడ్తడేమో!" ఉపాయం అమాంతంగా తోచినట్లు నారాయణస్వామిని చూచింది.

లచ్చమ్మను చూచారు నారాయణస్వామి. బాగా అలసిపోయింది. అసలే నీరసంగా ఉంది. ఇంక ఆమె లేవగలిగే స్థితిలో కూడా లేనట్లుంది.

"అయితె నువ్విక్కడ్నే వుండు. నేను పిలిచి చూస్త" అని బయల్దేరారు.

"గురువయ్యా! ఓ గురువయ్యా" అంటూ తిరగడం మొదలుపెట్టారు. చెట్టు చెట్టూ వెదకడం—పిలవడం—ఇదీపని!

ఎంత వెదికినా దొరకలేదు ఎంత పిలిచినా పలకలేదు.

తిరిగి వస్తున్నారు నారాయణస్వామి లచ్చమ్మ దగ్గరికి—కేక వేస్తూనే వస్తున్నారు.

ఎక్కడో మూలుగు వినిపించింది.

జాగ్రత్తగా విన్నారు నారాయణస్వామి.

అవును. మనిషి మూలుగే!

వెదికారు. చీకటి. స్పష్టంగా ఏమీ కనిపించలేదు.

"లచ్చమ్మా! లాంతరు పట్టుకరా! ఇక్కడేమో మూలుగు వినపడ్తున్నది" కేక వేశారు నారాయణస్వామి.

లచ్చమ్మ క్షణంలో లాంతరుతో ప్రత్యక్షం అయింది. మూలుగు వచ్చినవైపు వెళ్ళి చూచారు.

గురువయ్యే!

స్పృహ లేకుండా మట్టిలో పడి ఉన్నాడు! వంటి నిండా దెబ్బలు!

లచ్చమ్మ చూచింది. లాంతరు పడేసింది. గురువయ్యమీద పడి 'హోరు' మంది.

నారాయణస్వామి నుంచొని చూశారు—దూరంగా.

ఎలాంటివాడు ఎలా అయినాడు! ఏమయింది గురువయ్యకు? ఎందుకిలా అయినాడు? అర్థంకాని ప్రశ్నలు మెదడును బాధించ సాగేయి. గురువయ్య తప్ప వారికి అన్యం కనిపించలేదు.

లాంతరు బోర్లపడి భగ్గుభగ్గు మని, మసిపట్టి, ఆరిపోయింది! లాంతర్లోని నూనంతా ఒలికిపోయింది. అది అక్కడున్న ఇద్దర్లో ఎవరూ గమనించలేదు.

లచ్చమ్మ గురువయ్యమీద పడి ఏడుస్తూంది.

నారాయణస్వామి చూస్తున్నారు-దూరంగా.

ఏం చేయాలో వారికి తోచలేదు.

గురువయ్య కెలా ఉందో తెలియదు.

లచ్చమ్మ గుండెలవిసేట్టు ఏడుస్తూంది. తాను దూరంగా నుంచొని చూస్తున్నాడు. గుండె లవుస్తున్నాయి! కళ్ళో నిండుతున్నాయి—కాని కదలరు!

తాను బ్రాహ్మడు! అతను అంటరానివాడు!

ఎదుట బాధ! దుఃఖం! వ్యధ!

ఏం చేయాలి తాను? ఏమిటి చేయడం? ఏం చేయాలి తాను? ఏమిటీ చేయడం?

తటాలున లాంతరు వైపు చూచారు. అది ఆరిపోయి మట్టిలో పడి ఉంది.

"భగవాన్! పరీక్షిస్తున్నావా?" అని ముందడుగు వేసి లచ్చమ్మ చేతులు పట్టుకొని ఆమెను ఓదార్చారు.

చుక్కల వెలుగు మాత్రం వుంది.

గురువయ్య ముఖం స్పష్టంగా కనిపిస్తూంది.

"గురువయ్యా!" కండువాతో గురువయ్య ముఖంమీది మట్టి తుడుస్తూ పిలిచారు నారాయణస్వామి.

గురువయ్య పెదవులు కదిలాయి.

పెద్ద మూలుగు వచ్చింది! కళ్ళు తెరిచాడు!

"దూప, నీలు" అన్నాడు.

అక్కడ నీళ్ళెక్కడున్నాయి! లచ్చమ్మ పరిగెత్తింది. కాలువలో దోసిలితో నీళ్ళు తెచ్చింది. అక్కడికి వచ్చేవరకు మిగిలినవి కొన్నే. అయినా పెదవులు తడపడానికీ, నాలుక దాటడానికీ సరిపోయాయి.

గురువయ్య చూపుకు స్పష్టత వస్తూంది.

"ఎవరు - అయ్యగారా - అయ్యగారా—మీ రెందుకొచ్చిన్రు - నే నెక్కడున్న?" గురువయ్య గొంతు భారంతో తగ్గిపోయింది.

లచ్చమ్మ కళ్ళు నిండాయి-అరచేత్తో తుడుచుకుంది.

"అవును. నేనే, లచ్చమ్మగూడ వచ్చింది. తాటివనంలో ఉన్నాం—లే ఇంటికి పోదం."

గురువయ్య కనుకొలుకుల్లో నిలువలేని కన్నీరు కణతమీంచి చెవి దాకా పారింది.

"అయ్యగారూ! మీ రెందుకొచ్చిన్రు" అన్నాడు చేతులు జోడించి దెబ్బల బాధకన్నా సిగ్గు గురువయ్యను ఎక్కువగా క్రుంగదీస్తూంది.

"లే. ఇంటికి పోదం" అని వీపు కిందికి చేయి పోనిచ్చి గురువయ్యను లేపారు నారాయణస్వామి. లేచి కూర్చున్నాడు గురువయ్య. చంకల కింద చేతులువేసి చెరొక వైపు పట్టుకొని గురువయ్యను లేపారు. లేచి నుంచున్నాడు గురువయ్య. తన బుజం మీదికి చెయ్యి లాక్కొని "నడువ లేస్తవా?" అడిగారు నారాయణస్వామి.

గురువయ్య మాట్లాడలేదు-కాని ఒక అడుగు వేశాడు—లచ్చమ్మ బుజంమీద మరొక చేయివేసి, నడుస్తూనే లాంత రందుకుంది లచ్చమ్మ.

మెల్లగా అడుగులు వేస్తూ ఊరివైపు సాగారు.

ఊళ్ళో కుక్కలు మొరుగుతున్నాయి!

గుమ్మంలో నుంచున్న నాంచారమ్మ అలికిడివిని ఎదురుగా ఉరికింది. గురువయ్యను చూచింది.

"ఏమైంది? ఎట్లున్నడు? ఎక్కడ దొరికిండు?"

గురువయ్య తల వంచుకున్నాడు.

మిగతావారు మాట్లాడలేదు.

గురువయ్య ఇంటివైపు సాగిపోయారు.

నాంచారమ్మ గుమ్మంలో నిలిచిపోయింది.

నారాయణస్వామి తిరిగివచ్చి బావి దగ్గరకు చేరాడు—దొడ్డి గుమ్మం నుంచి. నాంచారమ్మ నీళ్ళతోడి బొక్కెనతో నారాయణస్వామిమీద పోసింది.

# 11

పిచ్చమ్మ వ్యవహారం కొంతకాలం సాఫీగానే సాగింది. భర్త గుర్తించలేదు. బుచ్చమ్మ కనిపెట్టలేదు. ఉభయుల కళ్ళుమూసి ఉదయం వేపవనంలోనూ, రాత్రి తాటివనంలోనూ గడిపింది గురువయ్యతో. ఒకనాడు బుచ్చమ్మకు అనుమానం కలిగింది. పగలు ఇంటికి వచ్చేవరకు పిచ్చమ్మ లేదు. తరవాత వచ్చి కోమటింటికి వెళ్ళొచ్చానంది. బుచ్చమ్మ తెలివైంది. పిచ్చమ్మ కళ్ళల్లో కాంతి చూచింది. కనిపెట్టింది. కనిపెట్టిందంటే గురువయ్య అని గ్రహించిందని కాదు-కోడలు అడ్డదారి తొక్కుతూందని! ఆ రాత్రి కనిపెట్టింది. పిచ్చమ్మను కదలనివ్వలేదు. కొడుకునూ, కోడల్నూ కూర్చుండబెట్టుకొని ముచ్చట సాగించింది. పిచ్చమ్మకు ముచ్చట గిట్టడంలేదు. ముండ్లమీదివలె కూర్చుంది. ఆమె కళ్ళల్లో తాటివనం, గురువయ్య కనిపిస్తున్నారు. ఏదో పనిమీద అటూ ఇటూ తిరిగింది. కూర్చోలేక పోయింది. నుంచోలేకపోయింది. పడుకుంటే నిద్రపట్టలేదు.

ఆ రాత్రి తాటివనం బోసిపోయింది.

గురువయ్య వంటరిగా బోలెడు తంగేడు పూలు కోసిపోశాడు.

ఉదయం కడవ తీసుకొని ఏటికి బయల్దేరింది. గురువయ్య ఎప్పుడొచ్చాడో ఉన్నాడు. రాత్రి రానందుకు కోపగించచేదతను. దొరికిన అవకాశాన్ని ప్రశ్నలతోనూ, పంతాలతోనూ వదులుకోలేదతను. వచ్చింది పిచ్చమ్మ. అతనికి కావలసిందదే! అనుభవించాడు.

రాత్రికి రాలేనేమో అని చెప్పి వెళ్ళిపోయింది పిచ్చమ్మ.

రాత్రి కాకుండా ఉండాలనుకున్నాడు గురువయ్య.

తెల్లవారి కడవ పట్టుకొని ఏటికి బయల్దేరింది పిచ్చమ్మ. వారించింది బుచ్చమ్మ. బావికి వెళ్ళి రమ్మంది. పిచ్చమ్మ బావికే వెళ్ళి వచ్చింది. కాని మనసు మనసులో లేదు.

వేపవనం—వేచి వున్న గురువయ్య.

ఆ దృశ్యమే చేరింది మనసులో. వంట చెడగొట్టింది. మొగుడు తినేశాడు. అత్త పట్టేసింది. వళ్ళు బాగుండలేదని బొంకింది. కణతలకు శొంఠిగంధం వేసింది బుచ్చమ్మ. గంధానికి తిరిగే రోగం కాదది.

ఆ సాయంకాలం వనంలో కల్లు పోసేప్పుడు చూచాడు గురువయ్య పిచ్చమ్మను. కళ్ళు నిండి ఉన్నాయి. గురువయ్య గుండె పొంగుతున్నది.

"ఏంది కత?" గురువయ్య.

"అత్త కనిపెట్టింది."

"ఎట్ల మరి?"

"ఎట్లనన్న వస్త. వనంలనే వుండు."

"రాకుంటే చచ్చిపోత."

"వస్తగని చావకు" చిలిపిగా నవ్వింది పిచ్చమ్మ. అత్త పిలుస్తే అటు వెళ్ళిపోయింది. బుచ్చమ్మ గురువయ్యను చూచి ఉరికి వచ్చింది. "ఊదంగ తాగు తున్నవు. బాకి పెరుగుతాంది మల్లి పైక మెప్పుడిస్తవు?" అడిగింది గురువయ్యను.

"ఇసిత్రంగా మాట్లాడ్తున్నవు బుచ్చమ్మ-పంట లొచ్చినంకగద బాకికట్టెడిది."

"వచ్చిందమ్మ దొర-పంటల్దాక పోస్తం" చేతులు ఊపుతూ "ఇగొ మాడు చెప్తాన్న. కోంటాయిన కాడికి పోయి బాకి వాల్చుకొమ్మంటెనే రేపిటురా. లేకపోతే బంద్" ఖచ్చితంగా చెప్పేసింది.

"అట్లనే చెప్పుత. వస్తవా మరి నాతోని" తాటివనానికి రావడం ఆగిపోతుం దేమో నన్న భయంతో అన్నాడు గురువయ్య.

"అయితె జరుండు. చేతుల పనున్నది వస్త" అని అటు వెళ్ళిపోయింది బుచ్చమ్మ.

తరవాత బుచ్చమ్మను పిల్లిలా అనుసరించాడు – రామకిష్టయ్యకు రెండేళ్ళ పంట రాసిచ్చాడు గురువయ్య. రెండేళ్ళదాకా బికారి అయిన గురువయ్య చేతులూపు కుంటూ ఇంటిదోవ పట్టాడు.

ఆ రాత్రి నిగా వేసింది బుచ్చమ్మ కోడలుమీద. కొడుకుతో చెప్పింది కోడల్ను కదలనివ్వొద్దని. అసలు అన్నాలు ఆలస్యంగా తిన్నారు. ఆ తరువాత ముచ్చట పెట్టింది బుచ్చమ్మ-రానున్న కాలాన్ని గురించీ-రావలసిన బాకీలను గురించీ-కలపాల్సిన నీళ్ళను గురించీ. ఊళ్ళో మల్లిమీద ఎల్లిపడటం—ఎల్లిమీద మల్లి పడడం కొంతసేపు సాగింది.

పిచ్చమ్మ ఆవులించింది.

బుచ్చమ్మ ముచ్చట చాలించింది.

అందరూ మంచాల్లో పడుకొన్నారు.

పిచ్చమ్మకు నిద్రపట్టలేదు. ఆమె ఆరోజు మల్లెపూలు పెట్టుకుంది. ఆమెకు తాటివనం-గురువయ్యా కనిపించారు. ఆమెకు ఆరాటం పెరుగుతూంది. మొగుడు ముచ్చట పెట్టాడు. కాసేపు ఊఁ కొట్టింది-నిద్ర నటించింది. మొగుడు నిద్ర పోయాడు. ఆమె సర్వేంద్రియాలూ అతి జాగరూకంగా ఉన్నాయి. చెవులు అత్త గుర్రు విన్నాయి. కళ్ళు తెరిచి చూచింది. మొగుడు నిద్రపోతున్నాడు. మెల్లగా కదిలింది. మొగుడు కదల్లేదు. లేచింది—జాగ్రత్తగా కూర్చుంది. నాలుగు దిక్కులా పరికించింది.

పిల్లి మ్యావ్‌మంది—గోడమీంచి ధమ్మున దూకింది.

పిచ్చమ్మ గుండె దడదడ లాడింది. చప్పున మంచంలో పడుకుంది. గుండె అరచేతులో ఆడుతున్నట్లుంది. ఊపిరి బిగపట్టుకుని వింటూంది—ఎక్కణ్ణుంచి ఏ శబ్దం వస్తుందోనని.

పొద్దుపోతున్నది. గురువయ్య వస్తానన్నాడు. తాను వెళ్ళలేకుండా ఉంది. పరిగెత్తాలని ఉబలాటం? గుండె దడదడా కొట్టుకుంటూంది.

"పిచ్చీ!" పిలుపు—సన్నగా-తీయగా-దూరంగా - గురువయ్య ధ్వని-నిజమా? ఆలాపనా?

"పిచ్చీ!" మళ్ళీ పిలుపు.

అవును. గురువయ్యదే. వచ్చాడు—లేవాలి. ఉరకాలి. అది ఊహ, ఉబలాటం, గుండె దడదడ లాడుతూంది. వళ్ళు నీరసించింది. చెమట పట్టింది-లేవలేకుండా వుంది. పడకలో మొగుడు-అటుపక్క అత్త.

గుండె దడ! దాహం! ఆరాటం!

"పిచ్చీ!" మరోసారి పిలుపు-దొడ్డివైపునుంచి వస్తూంది ధ్వని. అది పిచ్చమ్మను లాగుతూంది. రక్తం వేడెక్కుతూంది-కళ్ళు పొగలు కక్కుతున్నాయి-ఆలోచన అడుగంటింది—ఆరాటం ఆకాశాన్నంటింది-భయం పరుగు పెట్టింది- పరిణామాలు అగుపించలేదు——లేచింది పిచ్చమ్మ.

పిచ్చమ్మ అడుగు ముందుకుపడింది.

ఆమె భర్తను చూడలేదు—అత్తను చూడలేదు. ఇల్లు చూడలేదు. వాకిలి చూడలేదు. ఇరుగు చూడలేదు-పొరుగు చూడలేదు.

ఆమె వింటున్నది-చూస్తున్నది-పిలుపు "పిచ్చీ"-అది దొడ్డిగుమ్మం నుంచి.

అటుసాగింది. తలుపు తీసింది-అంతే! గురువయ్య వళ్లో వాలిపోయింది.

"పిచ్చీ నువ్వు రావనుకున్న."

ఆమె మాట్లాడలేదు. అతని మెడమీద చేతులు వేసింది—ముద్దు పెట్టుకుంది.

ఆమె ఊపిరి వేడిగా ఉంది. పెదవులు కాలుతున్నాయి.

"పిచ్చీ! ఇక్కణ్ణా! పా. అగో అ చెట్టు కింద్దికి....."

"వాండ్లు లేస్తరు—నేమ పోవాలె" పిచ్చమ్మ గురువయ్యన్ను లాక్కుంది.

గురువయ్య ఆమెను అదుముకున్నాడు.

రెండు గుండెలు దడలు విన్నాయి. రెండు ఊపిర్లు కలిసి ఆడేయి. చీకటి గొంగళి పరచింది.

విడిపోయేప్పుడు అడిగాడు గురువయ్య "రేపెక్కడ?" అని.

"పొద్దాల రాలేను....రేత్రి తాటివనంల."

"రావాలె. రోజంత ఆడనే ఉంట."

"వస్త....నేను రాకుంటె....నా పీనిగన్నొస్తది."

"ఏం దట్లంటవు?"

"అత్త కని పెట్టినట్లున్నది....ఏం చేస్తదో చూడాలె."

"పిచ్చీ!"

ఇంట్లో ఏదో చప్పుడు వినిపించింది.

విడిపించుకొని ఉరికింది పిచ్చమ్మ.

పిచ్చమ్మ తలుపేస్తుంటే అత్త కనిపించింది.

ప్రాణాలు పైపైనే పోయాయి.

"యాడికి పోయినవు?" బుచ్చమ్మ అడిగింది.

"అవుతలికి" గుండె దడ హెచ్చింది.

"అట్లనా?" అని వెళ్ళిపోయింది బుచ్చమ్మ.

పిచ్చమ్మ వేయిదేవుళ్ళకు మొక్కి పోయి పడుకుంది, కాని నిద్ర పట్టలేదు. ఏవేవో పీడ కలలు వచ్చాయి – ఏదో బెదురు ఆవహించింది.

తెల్లవారి ఆలస్యంగా లేచింది పిచ్చమ్మ. ఆమెను చూస్తే బుచ్చమ్మకు అదో రకంగా అనిపించింది. ముఖం కళావిహీనం అయిపోయింది. కళ్ళు లాక్కుపోయాయి. చూపులు దేన్నో వెదుకుతున్నట్లున్నాయి.

"ఏమో అట్లున్నవు?" అడిగింది బుచ్చమ్మ.

"ఎట్లున్న బాగున్నగద" నవ్వింది పిచ్చమ్మ — ఆ నవ్వులో కూడా ఏదో బెదురు కనిపించింది.

"వంట్ల బాగలేదా?"

"బాగున్నది గద."

"నువ్వింట్లనుంచి ఎల్లకియ్యాళ. పన్లన్ని నే చేసుకుంటలే."

"అట్లనే."

అక్కణ్నుంచి సాగిపోయిన బుచ్చమ్మ మళ్ళీ వెనక్కొచ్చి అడిగింది "జోకొచ్చినట్లున్నదా?"

"ఉహుఁ" లేదన్నట్లు తల ఊపింది.

బుచ్చమ్మ వెళ్ళిపోయింది.

పిచ్చమ్మ మంచంలో కూలబడ్డది. ఏదో రిక్తంగా ఉన్నట్లనిపించింది. ఏదో పోగొట్టుకున్నట్లూ – పోయినదానికోసం వెదకాలన్నట్లూ వెదికినా అది దొరకనట్లూ ఉంది ఆమె స్థితి. ఇల్లు బోసిగా ఉంది. మనసు బోసిగా ఉంది. అసలు మనిషి బోసిగా ఉంది. బోసిగానే పొద్దుకుంకింది. పిచ్చమ్మను ఇంట్లో ఉండమని బుచ్చమ్మ తాటివనానికి వెళ్ళింది.

బుచ్చమ్మ వెళ్ళగానే పిచ్చమ్మకు ప్రాణం లేచివచ్చింది. లేచి చకచకా ముఖం కడుక్కుని అలంకరించుకుంది; దొడ్డిగుమ్మంనుంచి బయలుదేరింది. ఆవిడకు తెలుసు బుచ్చమ్మ వచ్చే వేళ! అప్పటికి తిరిగి రావాలని ఆమె సంకల్పం!

పిచ్చమ్మ కనిపించకపోగా గురువయ్యకు పిచ్చెక్కినట్లయింది. బాగుండదని బుచ్చమ్మ పోసింది తాగాడు. తాటివనంలో పడ్డాడు.

పిచ్చమ్మ ప్రాణాలు పైపైనే పోయాయి, "ఎవరో చెప్పకో" అనే

గురువయ్య ధ్వని వినేదాకా. చేతులు తొలగించి "అబ్బ ఎంత బయపెట్టినవు?" అన్నది.

"ఎందుకంత బుగులు!"

"బుగులా? నీకో అత్తుంటె తెలుస్తది."

"బుచ్చమ్మ చచ్చినా దయ్యమై పట్టెటట్లున్నది."

"బావా!" పిలుపులో గారాబం ఉంది కాని వెనుక ఏదో భయం వ్యక్తం అవుతూంది.

"ఏంది మరదలా!" ఆమెను దగ్గరకు తీసుకొని కూర్చున్నాడు గురువయ్య.

పిచ్చమ్మ గురువయ్య ముందు కూర్చుంది-తల వంచుకుంది-వేలుతో నేలమీద బొమ్మలు గీస్తున్నది.

"నాకు బుగులు గున్నది.''

"నే నుండగనా!''

"నేం చచ్చిపోతె" గొంతు జీరవోయింది.

"పిచ్చీ!" అని రెండు చేతుల్తో వంచివున్న ఆమె తల ఎత్తాడు. చెంపలమీంచి కన్నీరు జాలువారుతూంది.

కన్నీరు చూచి గురువయ్య గుండె పగిలింది. "పిచ్చీ! నీకేమన్న పిచ్చా! ఎందుకేడుస్తవు?" అని ఆమె తల తన బుజంమీద పెట్టుకొని ఓదార్చాడు.

"నేనిగ ఇంటికి పోను. ఎటన్న పోదాం" పిచ్చమ్మ దీనంగా అన్నది-అందులో ఏదో అర్థింపు ఉన్నది.

గురువయ్య అంతవరకు అందును గురించి ఆలోచించలేదు. అతడు అనుభూతిని తప్ప బాధ్యతను ఊహించలేదు. ఆకాశంలో హాయిగా విహరిస్తున్న పక్షికి తుపాకి గుండు తగిలినట్లయింది అతని స్థితి. కాసేపు ఉక్కిరి బిక్కిరి అయినాడు.

"ఎటు పోదం?" ప్రశ్న విసిరాడు.

"చచ్చిపోదం-కలిసి."

"పిచ్చీ!" అని కావలించుకున్నాడు గురువయ్య. ఆమె అతన్ని గట్టిగా పట్టుకుంది-ఎవరైనా లాక్కుపోతారేమో నన్నట్లు-కరచిపట్టుకుంది.

ఆమె గురువయ్యను విడువలేదు.

గురువయ్య ఆమెను వదలలేదు.

కాలం కర్పూరం లాంటిదని వారు గమనించలేదు.

వారు గమనించకున్నా కరిగిపోసాగింది కాలం-సూర్యుడు కుంగాడు-చుక్కలు వచ్చాయి. జాము రాత్రి అయింది.

గురువయ్యమీద లాఠీ దెబ్బ పడేదాకా తెలియలేదు.

ఒక్కదెబ్బకే పడిపోయాడు గురువయ్య.

దెబ్బ బలంగా తాకింది—చాటునుంచి పడ్డది—ఎరగకుండా తగిలింది. భీముని వంటి గురువయ్య పడిపోయాడు. గురువయ్యను చుట్టుకొని ఏడుస్తున్న పిచ్చమ్మను, బుచ్చమ్మ తెచ్చిన మనుషులు లాగారు. పిచ్చమ్మ మొగుడు ఆమెను గొర గొర లాక్కొపోయాడు.

ఆమె ఏడ్పు వినలేకపోయాడు గురువయ్య.

అయినా బడితెలతో బాదారు గురువయ్యను.

ఆ చీకట్లో తాటివనంలో ఆ స్థితిలో వదిలి వెళ్ళిపోయారు వచ్చినవారు-గురువయ్యను.

ఆ రాత్రి పిచ్చమ్మను దెబ్బలు కొట్టాడు మొగుడు. బుచ్చమ్మకూడా బాదింది — నానా తిట్లుతిట్టింది. పిచ్చమ్మ మాట్లాడలేదు — కనీసం మూలగలేదు. స్తంభానికి అనుకొని మోకాళ్ళమీద తలపెట్టుకొని కూర్చుంది. ఆమెకు ఏడుపుకూడా రాలేదు — కళ్ళు ఎండిపోయాయి.

బాదుడు — తిట్లు అయిపోయిం తరువాత ఒక మూలకూర్చొని బుచ్చమ్మ కూడా ఏడ్చింది. ఏడ్చి కొంగుతో కళ్ళుతుడుచుకొంది. కోడల్ను అన్నానికి పిలిచింది.

పిచ్చమ్మ ఉలకలేదు — పలుకలేదు.

రాతిబొమ్మలా కూర్చుంది.

మొగునికి కోపం వచ్చింది — తల్లి పిలుస్తే పెండ్లాం లేవనందుకు. "లే.. పో" అని గట్టిగా అరచాడు. ఆమె కదల్లేదు. దగ్గరికి వచ్చి మళ్ళీ అరచాడు. పిచ్చమ్మ లేచింది. యంత్రంలా వంటింట్లోకి పోయింది. కంచంలో అన్నం కెలికి, చేతిమీద చెంబుడు నీళ్ళు పోసుకొని వచ్చి పడుకుంది.

పిచ్చమ్మ దర్వాజా లన్నింటికీ గట్టిగా తాళం వేసింది.

ఆ ఇంట్లో ఎవరూ నిద్రపోలేదు — "మన ఇంట లేదు, వంట లేదు" అటు ఏడు తరాలు — ఇటు ఏడు తరాల్ను గురించి చెప్పింది కొడుక్కు బుచ్చమ్మ. కొడుకు వింటూ కూర్చున్నాడు — కోడలు మంచంలో పడుకుంది. ఆమె ఏమీ వినడంలేదు — గురువయ్యకు ఎలా ఉందా అని ఆలోచిస్తూంది — కళ్ళు తెరిచే పడుకుంది.

కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుంది—ఈ గుట్టును రట్టుచేసి లాభం లేదనుకున్నారు తల్లీ కొడుకులు. అంతటితో నిద్రపోయారు.

తెల్లారి పిచ్చమ్మకు జ్వరం వచ్చింది. మూసిన కన్ను మూడు రోజులకుగాని తెరవలేదు. ఆనాడే కాస్త ఎంగిలి పడింది. ఇంట్లో పిచ్చమ్మనుంచి తాళాలువేసి పనికి వెళ్ళిపోతున్నారు తల్లీ కొడుకులు.

పిచ్చమ్మకు పనిలేదు-మంచంలో పడి వుంటున్నది.

పనిలేని మనసుకు పలురకాల ఆలోచనల్లు. లేనిపోనివన్నీ ఆలోచించింది. గురువయ్య కళ్ళల్లో మసలసాగాడు. ఎన్నో సాహస కృత్యాల్ను గురించి ఆలోచించింది.

తనను చూచుకుంది—బలహీనంగా ఉంది. బయట చూచింది-ఎండ! వెలుగు! ఈ వెలుగులో తాను ఎక్కడికి పోగలదు! మరి చీకటి ఎప్పుడు రాను!

రానే వచ్చింది రాత్రి. అన్నం తిని మామూలుగా పడుకున్నది. అర్ధరాత్రి లేచింది. నడికట్టు వేసుకుంది. అత్తనూ, మొగుణ్ణి చూచింది-ఇద్దరూ నిద్రపోతు న్నారు. బయటికి నడిచింది. వాకిట తలుపుకు పెద్ద తాళం ఉంది. పక్కకుచూచింది. కోటిమీదికి ఎక్కింది. దానిమీంచి గోడమీదికి ఎక్కింది. ఎక్కి కూచుంది. వెన్నెల పిండారబోసినట్లుంది. ఊరంతా నిశ్శబ్దంగా ఉంది. చీమ చిటుక్కుమంటే వినిపించే ట్లుంది.

పిచ్చమ్మ కిందికి చూచింది. గోడ ఎత్తుగానే ఉంది. దిగడం ఎలా అని ఆలోచించింది. దూకుతే చప్పుడవుతుంది—ప్రమాదం కూడా. మార్గాంతరం కనిపించ

ఒక గబ్బిలం తలమీంచే ఎగిరిపోయింది.

ఒక కుక్క దూరం నుంచి ఊరికి వస్తూంది.

కుక్కను చూచింది పిచ్చమ్మ—అది మొరుగునేమో అని భయపడింది.

కుక్క తల పైకి ఎత్తకుండా సాగిపోయింది.

పిచ్చమ్మ కాలు కింది గూట్లో పెట్టింది — దిగింది—గోడల నీడకున్న చీకట్లో గూడెం బయలుదేరింది—గురువయ్య ఇంటికి.

గురువయ్య—ఒక్కడే బయట పడుకొని ఉన్నాడు. పిచ్చమ్మ వెళ్ళి లేపింది. చిగ్గున లేచి కూర్చున్నాడు. చూచాడు—కళ్ళను నమ్మలేకపోయాడు.

"పిచ్చీ!"అన్నాడు.

"వచ్చిన బావ....వచ్చిన. ఇగెక్కడికి పోను" అని గురువయ్య కాళ్ళు గట్టిగా పట్టుకుంది.

గురువయ్య చూస్తూ కూచున్నాడు-పలకలేదు.

పిచ్చమ్మ కాళ్ళమీద పడి ఏడుస్తూంది-ఆ ఏడుపు తప్ప వేరే ధ్వని ఎక్కడా ఏమీ లేదు.

"ఎవరు?" మూలిగింది లచ్చమ్మ లోపల్నుంచి.

"లచ్చి - సీలాడింది - పోరడు పోయిండు - రోగం నవుస్తున్నది" వేదన కనిపించింది గురువయ్య మాటలో.

పిచ్చమ్మ ఆశాసౌధాలు కూలి కుప్ప అయినాయి-గురువయ్యతో లేచిపోదా మనుకుంది.

"మాట్లాడరు....ఎవరు!" లోపల్నుంచి మళ్ళీ ఒక మూలుగు.

ఇద్దరూ తలుపువైపు చూచారు-ఎవ్వరూ మాట్లాడలేదు. పిచ్చమ్మ లేచింది. నిశ్శబ్దంగా కదిలింది, తలుపు తీసుకొని లోన ప్రవేశించింది.

దీపం బుడ్డి వెలుగుతూంది.

ఇల్లంతా గలీజుగా ఉంది.

లచ్చమ్మ మంచంలో పడి వుంది-దుప్పటి కప్పుకొని.

పిచ్చమ్మ ఇదివరకు లచ్చమ్మను చూడలేదు-ఇదే మొదటిసారి చూడ్డం.

లచ్చమ్మ ముఖంలో సౌమ్యత కనిపించింది.

పిచ్చమ్మ కెందుకో నమ్మకం కుదిరింది. లచ్చమ్మ కాళ్ళమీదపడి హోరుమంది.

లచ్చమ్మకు జ్వరం-పురిట్లో సంధి తగిలింది. పుట్టినబిడ్డ పోయాడు. లేవ లేకుండా వుంది. నీరసంగా ఉంది. వళ్ళు మసిలిపోతూంది. కాళ్ళమీద ఎవరో పడ్డారన్నుకున్నది-ఏడుపు విన్నది.

"ఎవరు-ఎవర్నువ్వు-ఎందు కేడుస్తవు?" లచ్చమ్మ మాటలు నీరసంగా ఉన్నాయి.

"అక్కా!" పిచ్చమ్మ ఏడుపులోనే అన్నది.

ఆ పలుకే ఏదో ఉత్సాహం తెచ్చింది లచ్చమ్మకు. ఎందుకో బాగనిపించింది.

"చెప్పు ఏంది చెల్లె!"

"అక్కా! బావ లేకుంటె బతకలేను....నీ కాళ్ళకాడ పడుంట....జరంత జాగియ్యి....అక్కా....కాదనకు....బాయిలనన్న చెర్లనన్న పడ్త....ఇక బతకను...."

లచ్చమ్మ కళ్ళల్లో నీళ్ళునిండాయి. ఆమె మనసు నీరు నీరయింది.

"చెల్లే! ఇట్లరా!" అన్నది లచ్చమ్మ.

పిచ్చమ్మ ఆమె తల దగ్గరికి వచ్చి నేలమీద కూలబడ్డది.

"పిచ్చమ్మవా!" పిచ్చమ్మ చేయి చేతులోకి తీసుకొని అడిగింది లచ్చమ్మ.

అవునన్నట్లు తల ఊపింది పిచ్చమ్మ.

"చెల్లె....ఆయన అన్ని చెప్పిండు నాకు! ఉండు....ఈడనే ఉండు....నువ్వు లేకుంటె ఆయన బతికెటట్లు లేడు....ఉండు....నువ్వుండు....బతికుంటె నేనుంట.... ఏమంటవు?....ఉండనా?....ఉంటవా?"

"అక్కా! ఎంత మంచిదానివి నువ్వు! నువ్వు మనిషివి కావు....దేవతవు! అక్కా! నే నిక్కణ్నే ఉంట!" అని లచ్చమ్మ మీదపడి ఏడ్చేసింది పిచ్చమ్మ.

అంతా విన్న గురువయ్య లోనికి వచ్చాడు.

"లచ్చి నిజంగ నువ్వు లచ్చిందేవివే! ఎంత పెద్ద బుద్ధి నీది! పిచ్చి నుండ మన్నవు కాదు!" కళ్ళు చెమ్మగిల్లగా, గొంతు బొంగురుపోగా అన్నాడు గురువయ్య.

"అంత అమ్మగారి దయ! అయ్యగారి దయ! మనం మందికోసం బతకాల్నట! ప్రేమ ఎంత ఇస్తె అంత వస్తదట!'

"లచ్చి! అక్కా!" ఇద్దరూ ఒకేసారి అన్నారు. "ఎంత గొప్పదానివి" అని.

తరువాత ఎవరూ మాట్లాళ్ళేదు.

ముగ్గురూ ఒకర్నొకరు చూచుకున్నారు.

ముగ్గురి కళ్ళల్లోనూ కన్నీరుంది.

కన్నీటిలో కలిసిపోయారు-ముగ్గురూ!

తెల్లవారి బుచ్చమ్మ వచ్చి పిచ్చమ్మను రమ్మంది-పిచ్చమ్మ రానంది. గురువయ్యను తిట్టింది-సాపించింది. నడిబజారులో నిలబడి గురువయ్య ఇంటిమీద దోసెడు మన్ను పోసింది. పంచాయతి పెట్టిస్తానని చెప్పి, బెదిరించి, కొడుకును పట్టుకొని వెళ్ళిపోయింది బుచ్చమ్మ.

తరువాత తాటివనం తొక్కలేదు గురువయ్య-సారా దుకాణంలో కాతా సాగించాడు! ఇన్నాళ్ళ తర్వాత ఇవ్వాళ గురువయ్య పదం వినిపించింది నారాయణ స్వామికి. నాంచారమ్మ శ్రద్ధగా వింటూంది.

"ఏటి కేతాం పెట్టి
ఎయిపుట్లు పండిస్తె
మింగ మెతుకే ఎరగనన్నా
గంజిలో
ఒక్క మెతుకూ ఎరగనన్నా!"

"ఏమండీ; గురువయ్య పోతున్నాడండీ" నాంచారమ్మ చెప్పింది.

"నాంచారూ! ఎవరి ఖర్మ వారిది. మనకు వారితో బంధం తీరిపోయింది. బాగుచేతామనుకున్న. వాడితోపాటు నేను బొందలపడ్డ. ఇగ వాణ్ని ఎవడు ఎత్త లేడు. నన్ను ఎత్తలేడు. బతికినన్నాళ్ళూ తల నేలకేసుకొని బతకాలె. మరిచిపో నాంచారూ! మరిచిపో" మాటలయితే అన్నారు. కాని అందులో ఏదో బంధం కనిపిస్తూనే ఉంది.

"లచ్చమ్మ ఎట్లున్నదో! పాపం బిడ్డ పుట్టిపాయె! ఏమండి పామును చంపిన పాపమే నంటరా!"

"పిచ్చిదాన! భగవంతునికి పసిపాపలమీద కసి ఉంటాదె! చూసినవు గద-రోజు తన్నులేనాయె-డొక్కనింద తిండి లేదాయె-మనసుకు రంపపు కోతాయె - బిడ్డ ఎట్ల బతుకుతది చెప్పు!"

"పాపం లచ్చమ్మ కెట్లున్నదో!"

"మనిషి వరుగైంది. పైనుంచి కాన్పు. ఇప్పుడు రోగాన పడ్డది. ఇప్పుడే పిచ్చొచ్చింది. దాని మనసు కెట్లుంటదంటవు! కోత కోసినట్లుండదు! అది బతికి మాత్రం ఏం చేస్తదంటవు."

"అట్లనకండి. పిచ్చమ్మకక్కడుంటె లచ్చమ్మ మనింట్లో ఉంటుంది."

"సరెలే! భగవంతుడు మంచిగా చూడనీ!"

భగవంతుడు మంచిగా చూడలేదు. లచ్చమ్మ మూణ్ణాడు కన్ను మూసింది. పిచ్చమ్మ, గురువయ్య గోడు గోడున ఏడ్చారు. నాంచారమ్మ గురువయ్య ఇంటికి వచ్చి చచ్చిన లచ్చమ్మకు పసుపు కుంకుమ పెట్టింది. గురువయ్య దగ్గర పైస లేదు. నారాయణస్వామి సహాయంతో ఉత్తరక్రియలు జరిపాడు గురువయ్య.

## 12

పిచ్చమ్మను వదులుకున్నా పిచ్చమ్మ నగలు వదులుకో దలచలేదు బుచ్చమ్మ. రామకిష్టయ్య బుచ్చమ్మను పురికొల్పాడు—గురువయ్య ధర్మాన్ని నాశనం చేస్తున్నా దన్నాడు. "బాపనాయన్ను పాడుచేసిండు, ఇగ మీ యెంటపడ్డాడు. వానికి బాగా బుద్ధి చెప్పకుంటే అసలు బూమ్మీద నిలిచెటట్లు లేదు" అన్నాడు రామకిష్టయ్య బుచ్చమ్మ ఇంటికి వెళ్ళి-అతనికి గురువయ్య పొలం మీద కన్నుంది.

బుచ్చమ్మ పంచాయతి పెట్టింది. రామకిష్టయ్యను పెద్ద మనిషిగా ఎన్నుకుంది. గురువయ్య నారాయణస్వామిని కోరుకున్నాడు. కాని నారాయణస్వామి ఈ తగాదాలో తల దూర్చనన్నారు. గురువయ్య కులం పెద్దలనే పట్టుకున్నాడు.

"ఓరి గురువా! పంచాయతి చెప్పటమంటె ఊరికెనె ఉన్నాదిర! నువ్వు చేసింది తప్పు. పెద్దకులపు పిచ్చమ్మను తెచ్చినవు. ఇగ కాదు కూడ దంటావా నాలుగు కల్లు కుండలో సైగాని కదలం—ఏమంటవా—మల్లకులపోనికి కులమోడు సాయం చెయ్య కుంటె ఎవడు చేస్తడు?" అన్నారు పెద్దలు.

గురువయ్యకు గత్యంతరం లేదు. అతను రామకిష్టయ్య దగ్గర అప్పు తెచ్చాడు. బుచ్చమ్మ దగ్గర కల్లు తెప్పించాడు. గూడెంలో పెద్దలు కూడి తాగి తందనాలాడి చిందులు తొక్కారు. కులంపెద్ద మైసయ్య "ఓరి గురువా! నువ్వేమన్న అనుర నువ్వు చేసింది తప్పే. పెద్ద కులపోల్లను తెచ్చి గూడెంల పెడ్తె గూడానికి మచ్చయితాదిర! గూడానికి నిప్పంటుకుంటది - కాలబడిపోతది-తగలబడి బూడిదయి తది. పిచ్చమ్మను తీస్కపోయి బుచ్చమ్మకాడ తోలిరార-అరే గురువా అదే మంచిదిరా! అంతేర,అట్లనే చేయ్యాల!" అన్నాడు.

మైసయ్యకు తాగిన మైకం ఉన్నమాట నిజమే కాని అతడు అలా అన్నది బుచ్చమ్మ పోయిస్తానన్న కల్లును గుర్తుంచుకొని. మైసయ్యకు తాళం వేశారు మిగతా వాళ్ళు "అవు! గట్లనే చెయ్యాలె. పిచ్చమ్మన్తోల్కపొయ్యి బుచ్చమ్మ కిచ్చి రావాలె" అనేశారు - వాళ్ళకూ కొంత ఆశ ఉంది-బుచ్చమ్మ నుంచి.

ఆ మాటలు విని నిలువునా కుంగిపోయాడు గురువయ్య. కంటతడిపెట్టి మైసయ్య కాళ్ళమీద పడ్డాడు :—

"అన్న? మైసన్న! అట్లనకే. ఆ మాటనకే. పిచ్చిని వదలమనకె - నీ కాల్మొక్తనె-నీ కడుపున పుడ్తనే - నీకు బాంచోన్ని అయిత. ఆ మాటనకు. పిచ్చంటె ఏంతె! నా రకతంల రకతమైంది. పానంల పానమైంది. అదెట్లపోతదె. అది మాలల్ల కలిసె - మల్ల అడికెట్ల పోతదే - కాల్మొక్త - ఆ మాటనకు" భళ్ళున ఏడ్చేశాడు గురువయ్య.

"ఓరి గురువయ్య! లేర లే. మల్ల పిచ్చిపోకుండ ఇశారిచ్చమంటవు. గట్లనే

గని మల్లి రొండు కుండలు తెప్పించు - ఏమో గట్ల చూస్తడు - పిచ్చి కావాలె పైకం కావల్నంటెట్లరో?"

గురవయ్య కుండలు తెప్పించాడు.

తుమ్మచెట్లకింద మళ్ళీ హడావుడి మొదలైంది. గందరగోళం - తిట్లు - ఊసు కోవడాలు - తారాపథానికి అందుకున్నాయి. కుండలు కాళీ కావడంతో ఇంటితోవ పట్టారు.

గురవయ్యకు బాగా తలకెక్కింది. గడపలో అడుగు పెడ్తూనే ఏడుపు అంకించుకున్నాడు - లచ్చమ్మ పోయినందుకు ఏడ్చాడు. పిచ్చమ్మ పోతుందేమోనని ఏడ్చాడు. పిచ్చమ్మ తన బుజంమీద గురవయ్య తల పెట్టుకొని, తల నిమురుతూ ఓదార్చింది.

"పిచ్చీ! నువ్వు పోవద్దే నేను చచ్చిపోత" అని బావురుమన్నాడు గురవయ్య.

"బావ! నేనేడికి పోత! చచ్చిపోతే నీతోనే వస్త - ఏడవకు" అని పిచ్చమ్మ కూడ కంట తడిపెట్టింది.

"పిచ్చీ! అట్లను. పిచ్చీ అట్లను" అని గట్టిగా చుట్టేసుకున్నాడు గురవయ్య-పిచ్చమ్మ నింకెవరూ లాక్కోపోవడానికి వీల్లేదన్నట్లు.

తెల్లవారి ఊరి బయట మర్రిచెట్టు కింద జనం కూడారు. గద్దెమీద రామకిష్టయ్య కూర్చున్నాడు. అతని కుడిపక్క దగ్గర్లో చాపలు పరిపించి తన వాళ్ళను కూర్చోపెట్టింది బుచ్చమ్మ. ఎడంపక్క దూరంగా నేలమీద చతికిలబడి కూర్చున్నారు గురవయ్య కులంవాళ్ళు. చుట్టలు తాగుకుంటూ తుపుక్కున ఊసు కుంటూ కూర్చున్నారు. తగాదా చూడ్డానికి వచ్చిన జనం దూర దూరంగా నుంచు న్నారు. మొత్తంమీద జనంతో కిటకిట లాడింది స్థలం.

ఈ మధ్య ఆ ఊళ్ళో వినోదా లేమీ లేవు.

కిష్టయ్య బీడీ కాల్చుకొని పొగ వదులుతూ అన్నాడు:—

"ఒరే గుర్విగా ఇదేం ఊరనుకున్నవా? పాడనుకున్నవా? మంది పెండ్లాల నెత్కపోతే ఊరుకుంట రనుకున్నావురా! పక్కలిరగతన్ని ఊళ్ళ నుంచి ఎళ్ళ గొడ్తరు! ఊళ్ళ ఎవరికన్న పెండ్లాలుండాల్నా వద్దురా! ఆ బుచ్చమ్మ కాబట్టి ఊరు కున్నది. ఇంకొకళ్ళయితె నెత్తురు పారెడిది - నెత్తురు. అయిందేమో అయింది. పిచ్చమ్మను తెచ్చి బుచ్చమ్మ కిస్తవా! చిత్కకొట్టి గుంజ్క పొమ్మంటవా?"

గురవయ్య మాట్లాడలేదు-తల వంచుకొని కూర్చున్నాడు.

"అట్లంటెట్ల కాల్మోక్తం" చుట్ట నేలకు రాచి తలగుడ్డలో దాచుకుంటూ అన్నాడు మైసయ్య. "ధర్మపీట ఎక్కిన్ను నాలం చెయ్యాలె నాలం - పాలకు పాలు, నీలకు నీలు తియ్యాలె. పాలల్ల నీలు కలిసినా, నీలల్ల పాలు కలిసినా నాలం చూడుంటది! ఉండదు. మా గురవడు తీసుకొచ్చిండంట్రాను పిచ్చమ్మను. మల్ల పిచ్చమ్మ పసిపోరా! చంకనేసుకొని ఎత్తుకొచ్చిండా! రొండు చేతులు కలువంది

చప్పుడెట్లయితది. అవునంటర! కాదంటర! ఇసువంటి పన్లల్ల మొగోనిది తప్పంటర- మల్ల ఆడదెట్లొచ్చె. తప్పు చేసింది ఇద్దరాయె. మల్ల గుర్విగాణ్ణి పట్టుకొని గుంజుత నంటె బాగుంటాది బాంచెను."

"ఒరే మైసిగా!" చేతులు అర్చుకుంటూ చండికలా లేచింది బుచ్చమ్మ. "నీ ధరమం నాకెరిక లేదనుకున్నావుర! గురువడు కల్సిల్లు పోయిస్తె గురువని దిక్కు మాట్లాడ్తవు-నేను పోయిస్తె నా దిక్కు మాట్లాడ్తవు. అయితే బాపనోండ్లపోరి వస్తనంటె ఎత్కపోతనంటవు! ఎత్కపోయెడిది ఏడ్చెడిది కులపోండ్లను. పెద్దకుల పోండ్లను ఎత్కపోతె ఊరుకుంటారు! ఊళ్ళకెళ్ళి ఎళ్ళగొడ్తరు-ఆఁ, ఏమనుకున్నవో."

"ఇగో బుచ్చమ్మ! మాటలు చక్కగ రానియ్యి. నాలం చెప్పేటప్పుడు కల్లు సంగలి గిట్ట ఎత్తినవంటె బాగుండదు. పెద్ద కులం ఆడది మాలోనెంట ఎందుకు పడాలె అసలు! చెప్పవేమమ్మ - చెప్పవేమమ్మ. నోరు దగ్గర పడ్డది—మాటెళ్ళదు!"

"ఒరే మైసిగా! మితిమీరి మాట్లాడ్తాన్నవు. ఎంట ఎవరొస్తె వాండ్లను తీస్కపోవటమేనా? గురువయ్య తప్పు చేసిండుర! అంతె. తప్పు చేసిండు! ఏరే మాటలేదు. ఇప్పుడేమంటవు!" రామకిష్టయ్య.

"అన్నాలం. అన్నాలం" మైసయ్యతో పదిమంది లేచి ఇంతటితో ఖతం. నాలం అంటె ఏందుండి నిప్పు చేతుల పట్టుకునె టట్లుండాలె. మాలోండ్లు గదాని మామీద బట్టకాల్చేస్తె బాగుండదు. లేర గురువయ్య పోదం" అని బయల్దేరారు గురువయ్య కులంవాండ్లు.

జనంలో కలకలం బయల్దేరింది. బుచ్చమ్మ మనుషులు వీరంగం వేసి లేచారు అక్కణ్ణుంచి కదుల్తే పుర్రెలు పగుల్తాయని! పట్టుదల అటూ హెచ్చింది.

"ఒరే! మైస! అలిగిపోతె పంచాయతైతాదిర? చిన్నపోరడు చేసినట్లు చేస్తవు" బీడి చేతులో పట్టుకొని లేచి నుంచొని ముందడుగు వేయబోతున్నట్లు "నేం చెప్పింది కాదంటె నువ్వేం చెప్పుతవో చెప్పు" అన్నాడు రామకిష్టయ్య.

"అట్ల కాదుండి. వచ్చి ఇంట్ల చేరిందేమో పిచ్చమ్మాయె! మల్ల గుర్విగాడు తప్పు చేసిండని వానిమీద తోస్తె నాలం అయితాదుండి" మైసయ్య అన్నాడు.

"నువ్వు కూచో ముంగల" అన్న రామకిష్టయ్య ముందు తాను కూర్చొని "ఇప్పుడు చెప్పు ఏమంటవో" అడిగాడు.

"ఏం లేదు కాల్మొక్త పిచ్చమ్మను పిల్పించాల్నుండి" అని కూర్చున్నాడు.

పిచ్చమ్మను పిలవాల్సిన అవసరంలేదని బుచ్చమ్మవర్గం వాళ్ళ పట్టు. పిలవకుంటె తగాదా ముందుకు సాగడానికి వీల్లేదని మైసయ్య పట్టు పట్టాడు. అనేక తర్జన భర్జనల తరువాత పిచ్చమ్మను పిలిపించారు.

"ఏమె పిచ్చమ్మా! నీకేం తక్కువని ఎళ్ళొచ్చినవు! తిండితక్కువా? గుడ్డ తక్కువా? అత్త అరడి పెట్టిందా? మొగుడు దెబ్బలు కొట్టిండా?" రామకిష్టయ్య అడిగాడు.

పిచ్చమ్మ తల వంచుకుని నుంచుంది.

ఆమెకు చెరలో ఉన్నట్లుంది.

చుట్టూ పులులు, మధ్యన మేకలా ఉంది.

ఆమె గుండె దడ దడ లాడుతున్నది.

ఆమె చూపు నేలను చీలుస్తున్నది. పిచ్చమ్మ పలకలేదు.

"నంగనాచోలె నిలబడ్డవేమే! నా కొంపకు చిచ్చుపెట్టి లేహాస్తివి. చెప్పవేమే చెప్పు—నీతోని ఆవాలు నమిలించిన్నా! ఆరడి పెట్టిన్నా! బండ లెత్తిన్నా! బయపెట్టిన్నా! చెప్పు నిలపడ్డవేమి బొమ్మోలె....చెప్పు లం...."

పిచ్చమ్మ పలకలేదు. కన్నీరు కొలకుల్లో చేరింది.

"చెప్పు పిచ్చమ్మా! చెప్పకుంటె ఎట్ల తెలుస్తది!" బుచ్చమ్మ తరుపు మనుషులన్నారు. పిచ్చమ్మ పలకలేదు.

"పిచ్చమ్మా! అట్ల ఊరుకుంటె ఎట్ల! ఏదన్నా చెప్పు" మైసయ్య అన్నాడు.

పిచ్చమ్మ పలకలేదు

కన్నీటి బొట్టు కుడికాలి బొటనవ్రేలుమీద రాలింది.

"అట్ల నిలపడ్తె ఎట్ల! చెప్పనన్న చెప్పు. అత్త యెంబడి పోనన్న పో" రామకిష్టయ్య.

పిచ్చమ్మ గుండెలో రాయిపడ్డది.

తలెత్తి రామకిష్టయ్యను చూసింది.

కళ్ళు ఎర్రగా కన్నీటితో నిండి ఉన్నాయి. చూపుల వేడికి భస్మమయ్యేట్లు న్నాడు రామకిష్టయ్య.

రామకిష్టయ్య భరించలేకపోయాడు-తలవంచాడు.

పిచ్చమ్మ చూపు నేలకు అప్పగించింది.

ఆమె ఏదో చెప్పాలి—చెప్పనున్నది.

జనం సాంతం నిశ్శబ్దంగా ఉన్నారు. చీమ చిటుక్కుమంటే వినిపించేట్లుంది. గాలి సైతం భారంగా ఉంది. లిప్తలు బరువుగా దొర్లుతున్నాయి. "నా మొగుడు మొగోడు కాడు." పిచ్చమ్మ పలికింది.

జనమంతా తలలెత్తి ఆమెను చూచారు.

ఆమె తల వంచుకొని చరచరా నడిచి వెళ్ళిపోయింది.

జనం బుచ్చమ్మను చూచారు.

బుచ్చమ్మ కొడుకును ముందుకు నెట్టింది. "చెప్పవేమిర సన్నాసి! అదే మన్నదో ఇన్నవా?" అని.

బుచ్చమ్మ కొడుకు—పిచ్చమ్మ మొగుడు మాట్లాడలేదు—తల వంచుకుని నుంచున్నాడు.

రామకిష్టయ్య నోట మాట పెగల్లేదు.

"ఇన్నవా సేటూ? ఇంకేమన్న చెప్పేడి దున్నదా?" మైసయ్య రామకిష్టయ్యను అడిగాడు.

"ఇంకేం చెప్పేడి దున్నది!" అన్నాడు చేతులు తేలేసి రామకిష్టయ్య— అతనికి తన కూతురు గుర్తుకు వచ్చింది.

"రాయోలె కూకున్నవు. పిల్లపోతె మల్ల నా నగలు పోతయా? ధర్మం చెప్పు ధర్మరాజా! అంటే దూడ బర్రె నాదే నన్నడట" బుచ్చమ్మ రామకిష్టయ్య మీద విరుచుకుపడ్డది.

"అవు. అది నిజమె. నగలు బుచ్చమ్మకే రావాలెగద" రామకిష్టయ్య అనలేక అనలేక అన్నాడు. తన కూతురు నగలు తానే దాచి దొంగలెత్తుకు పోయారని చెప్పాడు.

"నాలానికేముంది! నగలు నీ కెందుకురా తెచ్చియ్యి గురువా?" అన్నాడు మైసయ్య.

గురువయ్య మాట్లాడకుండ లేచి వెళ్ళాడు.

పిచ్చమ్మ మొత్తం నగలు వలిచి గురువయ్య దోసిట్లో పోసింది. గురువయ్య తెచ్చి మైసయ్య దోసిట్లో పోశాడు. మైసయ్య రామకిష్టయ్య ముందు కుప్ప పోశాడు. బుచ్చమ్మ నగలు లెక్కపెట్టి కొంగున మూట కట్టుకొని "మల్ల నా పెండ్లి కర్చు!" అడిగింది.

దాన్ని గురించి వాగ్వాదాలు జరిగాయి. మైసయ్య బుచ్చమ్మ చూపిన ఆశకు లొంగాడు. రామకిష్టయ్యకూ కొంత ఆశపెట్టింది. అందరూ కలిసి బుచ్చమ్మ తన కొడుకు పెండ్లికి పెట్టిన కర్చు అణా పైసల్తో గురువయ్య నెత్తికి చుట్టారు.

గురువయ్య మాట్లాళ్ళేదు.

కులం తప్పుకింద కొంత వేశారు. గురువయ్య మాట్లాళ్ళేదు.

గురువయ్య పొలం రామకిష్టయ్య రాయించుకున్నాడు.

గురువయ్య అంగుష్టం వేశాడు.

గురువయ్య వట్టికూలిగా మారిపోయాడు.

ఇంటికి వస్తె పిచ్చమ్మడిగింది "అన్ని పోగొట్టుకున్నవట గద నా కోసం."

"పిచ్చీ నువ్వు పోలేదుగద, అదే చాలు" అన్నాడు.

అతని కళ్ళు వెలిగాయి—ఆమె కళ్ళల్లో వెలుగులు చిమ్మాయి.

"కొత్త చీర కట్టుకో. అయ్యగారింటికి పోయి దండంపెట్టి వద్దాం" అన్నాడు గురువయ్య.

కొత్త చీరతో కొత్త పెళ్ళికూతురులా తయారైంది పిచ్చమ్మ. ముందు గురువయ్య నడవగా అయ్యవారింటికి చేరారు.

నారాయణస్వామి వ్యాసపీఠం ముందు-వసారా అరుగుమీద కూర్చొని నాంచారమ్మకు పురాణం చెపుతున్నారు.

"రమ్మంటరా అయ్యగారూ!" అనే గురువయ్య మాటలు విని తలెత్తి చూచారు.

గురువయ్యా పిచ్చమ్మా కనిపించారు. కళ్ళద్దాలు తీసి ఒకసారి ఇద్దర్నీ చూచారు. "రా గురువయ్య! ఈ ఇల్లు నువ్వు కట్టిందేనయా! అడగాల్నా రావటానికి" అని లేచి నుంచున్నారు. నాంచారమ్మ కూడా లేచింది. ఇద్దరూ అరుగు చివరన వచ్చి నుంచున్నారు.

"ఇగో పిచ్చిని తెచ్చిన!" అని వారితో చెప్పి "పిచ్చీ! దండం పెట్టు-వీండ్లే మనకు దేవుండ్లు" అన్నాడు.

పిచ్చమ్మా, గురువయ్యా నేలనంటి దండాలు పెట్టారు.

"పుత్రపౌత్రాభివృద్ధిరస్తు" అని దీవిస్తున్న నారాయణస్వామి గొంతు బొంగుర పోయింది.

నాంచారమ్మకు పిచ్చమ్మలో లచ్చమ్మ కనిపించింది. "ఇగ వస్తమండీ" అని పిచ్చమ్మ చేయి పట్టుకొని బయల్దేరాడు గురువయ్య.

ఏదో గుర్తు వచ్చినట్లు "గురువయ్యా! కాస్త ఆగు" అని లోపలికి పోయింది నాంచారమ్మ.

గురువయ్యా పిచ్చమ్మా నుంచుండిపోయారు.

నారాయణస్వామి గుమ్మంవేపు చూస్తూ ఉండిపోయారు.

నాంచారమ్మ ఒక రవిక్షపేటీ, తమలపాకులూ, వక్కలు తెచ్చి పిచ్చమ్మ దోసిట్లో వేసి "గుమ్మడిపండు వంటి కొడుకును కను" అని దీవించింది. పిచ్చమ్మ మళ్ళీ దండం పెట్టింది.

ఇంటికి పోతుంటె గురువయ్యకు చితికిన పాము పడగ కళ్ళల్లో ఆడింది. ఆ రాత్రి సారా దుకాణానికి వెళ్ళి బాగా తాగేశాడు గురువయ్య. ఇంటికి వచ్చి లచ్చమ్మను తలచుకొని, పిచ్చమ్మమీద పడి భోరున ఏడ్చేశాడు.

ఆ నాటినుంచి గురువయ్య తాటివనానికి వెళ్ళడం మానేశాడు. సారాయికి అలవాటు పడ్డాడు.

తాగి ఏ అర్ధరాత్రికో ఇల్లు చేరేవాడు—పిచ్చమ్మది మూన్నాళ్ళ ముచ్చటే అయింది. తాగి వచ్చిన గురువయ్య లచ్చమ్మను తలచుకొని పిచ్చమ్మను తొలి రోజులలో తిట్టడం, తరువాత చచ్చేట్లు కొట్టడం సాగింది. పిచ్చమ్మ వల్లనే తాను సర్వనాశనమైనాననుకునేవాడు గురువయ్య. లచ్చమ్మ చావుకూ, పుట్టిన పాప పోవడానికీ పిచ్చమ్మే కారణం అని ఆమెను రాచి రంపాన పెట్టేవాడు. పిచ్చమ్మకు నరకయాతన అయింది. ఆమె ఇల్లు విడిచి కదిలేదికాదు. నాంచారమ్మకు పిచ్చమ్మతో అట్టే అనుబంధం ఏర్పడలేదు. గురువయ్య కూడా నారాయణస్వామి ఇంటికి ఎప్పుడోగాని వెళ్ళటం లేదు.

# 13

శ్రీమత్తిరుమల వేంకట వరద రామానుజాచార్య భాగవతార్ బండి రామకిష్టయ్య ఇంటి ముందు ఆగింది. రామకిష్టయ్య ఉరికి వచ్చి బండి మీంచి దిగ టానికి అయ్యవారికి ముక్కాలిపీట వేశాడు. ఆచార్యులవారు భారంగా దిగి రామ కిష్టయ్య ఇంటి వసారాలో వాలు కుర్చీమీద కూర్చున్నారు. రామకిష్టయ్య కూతురు ఎంకమ్మ ఆచార్యులవారిని చూడాలనే ఆదుర్దాతో విసనకర్ర తెచ్చి ఆచార్యులకు అందించింది. ఆచార్యులకు ఎంకమ్మ, ఎంకమ్మకు ఆచార్యులవారూ విచిత్రంగా కనిపించారు. ఎంకమ్మ కిసుక్కున నవ్వి లోనికి వెళ్ళిపోయింది. ఆచార్యులు విసన కర్రతో విసురుకోసాగారు.

భాగవతార్‌ది పచ్చని పసిడిచాయ. చిన్న బొజ్జ. నిండయిన విగ్రహం. అందంగా ఉంటారు. వారి వంటినిండా ఊర్ధ్వపుండ్రాలే. వారు పరమ వైష్ణవులు–వారి బండికి, ఎద్దులకు కూడ ఊర్ధ్వపుండ్రాలుంటాయి. ఆయన మంచి పండితుడు. రామాయణం అనర్గళంగా హరికథ చెప్పగల దిట్ట. అందుకే పిలిపించాడు రామ కిష్టయ్య-ఊళ్ళో హరికథ చెప్పడానికి. నారాయణస్వామిని బహిష్కరించిం తరవాత ఊళ్ళో కాలక్షేపం లేకుండా అయింది. ఊళ్ళో జనం చందాలు పోగుచేసి రామకిష్టయ్య కిచ్చారు. యథాశక్తి సేవచేయడం ఆయన లక్షణం. అందుకోసమే తన ఇంట్లో విడిది ఏర్పాటు చేశారు. దొడ్లో ఉన్న రెండు గదులూ శుభ్రం చేయించి ఆచార్యులకు ఇచ్చాడు - అక్కడికి బావి దగ్గర ఉంటుందని. సామగ్రి అందించ డానికి ఎంకమ్మను నియమించారు - అయ్యవారి మెడలోని తులసిదండలు చూచి, ఎంకమ్మ ఆచార్యులను వదలడం లేదు - ఆచార్యుల దగ్గర వశీకరణం ఉందని చెప్పుకుంటారు!

"అయ్యవారూ! యాణ్ణించి వచ్చిరను?" తిరువారాధనకు పూలు అందిస్తూ అడిగింది ఎంకమ్మ.

"గోలకొండ పట్నంనుంచి" పూలందుకోబోయి ఎంకమ్మ చేయి తాకి జవాబిచ్చారు.

"అయ్యగారూ! నన్ను తాకిరనుగద మైలపడ్డరా!"

"ఎంకమ్మా! నిన్ను తాకితె మైలేమిటి? శ్రీరంగనాయకుడు కలలో కనపడి ఫలాని ఎంకమ్మ ఫలాని ఊళ్ళో ఉన్నది వెళ్ళు. ఆమెను తరింపచేయి అని చెప్పితినే ఇక్కడికి వస్తిమి." అని రెండు చేతులు పట్టి ఆమెను దగ్గరికి లాక్కున్నారు ఆచార్యులవారు-తిరువారాధనకు!

"ఇప్పుడొద్దులుండి, పగటిపూట మా అమ్మయ్య చూస్తరు."

"అయితె రాత్రికొస్తవా ఎంకమ్మ?"

"హరికత అయినెన్క. నేనేడికి పోత? కూతెయ్యండి, ఉరికొస్త ఇగ పూజ చేసుకోరి" అని వెళ్ళిపోయింది ఎంకమ్మ.

రామానుజాచార్యులవారి పూజ సాగలేదు కాని రామకిష్టయ్య కుటుంబానికి తీర్థ ప్రసాదాలిచ్చారు.

"అయ్యగారూ! హరికత మాపటికి మొదలుపెడ్తరా! పందిరిగిట్ట ఏయించి అన్ని తయారుచేయించిన" అన్నాడు రామకిష్టయ్య.

"ఇవ్వాళ ప్రయాణపు బడలిక ఉన్నది. రేపు రాత్రినుంచి ప్రారంభింతాం" అన్నారు ఆచార్యులవారు!

"అట్లనేలేరి" అని వెళ్ళిపోయాడు రామకిష్టయ్య.

ఆచార్యులవారికి ఓ చిన్న బలహీనత ఉంది-సారాయి తాగందే హరికథ చెప్పలేరు. రహస్యంగా సారాయి తాగే ఏర్పాటు జరుగుతే గాని హరికథకు ఉపక్రమించలేరు. అందుకే ఓ రోజు వాయిదా.

ఆచార్యులు భోజనం చేసి విశ్రమిస్తే ఎంకమ్మ వారి కాళ్ళు వత్తసాగింది. ఆమెతో మాట్లాడుతూనే ఊరి వ్యవహారాలన్నీ తెలుసుకున్నాడు-ముఖ్యంగా నారాయణస్వామి వ్యవహారం. ఎక్కణ్నించో నారాయణస్వామి దూరపు చుట్టమని వెలికి తీశాడు. ఆ సాయంకాలం నారాయణస్వామి ఇంటికి వెళ్ళారు. పరిచయాదులు, క్షేమవార్తలు అయింతరువాత కొంతసేపు చర్చ జరిగింది. ఆచార్యులవారు నారాయణస్వామి విషయంలో సానుభూతి వ్యక్తపరచి, శాస్త్రానికి బాసటగా లౌకిక జ్ఞానం ఉండాలన్నారు. నారాయణస్వామి అందుకు బదులు చెప్పలేదు.

"స్వామీ! దేవరవారితో దాసునికి ఒక చిన్నకార్యం ఉన్నది. తమ సాయం లేనిదే నా కథ సాగదు" ఆచార్యులు.

"సాయించండి. దాసునికి చేతనైతే తప్పక నెరవేరుస్త."

"దాసునికి ఒక దురభ్యాసం ఉన్నది. కాస్తంత పానం లేందే కథ సాగదు."

నారాయణస్వామి తల కొట్టేసినట్లయింది. వారి ముఖంలోంచి రక్తం పూర్తిగా దిగిపోయింది. నిరుత్తరులైనారు.

"దాసుణ్ణి మన్నించాలె. ఎవరైనా మనిషిని అప్పగిస్తే నా తంటాలు నేను పడ్త" అని కాళ్ళు పట్టుకొని వదల్లేదు ఆచార్లు.

నారాయణస్వామి వంటికి చమట పట్టింది. వైష్ణవుడు కాళ్ళుపట్టుకున్నాడు—పని చాల నీచం అయింది. అర్థంకాక తికమకపడ్డారు. తుదకు తమ కాళ్ళు వదిలించుకొని అన్నారు:—

"మీరు పెద్దలు. పండితులు. ఇంటికి వచ్చి అర్థించినారు. చేయలేను కాదని అనలేను. గురువయ్య అని ఉన్నడు. అతన్ని మీకు అప్పగిస్త. మీ ఇష్టం. ఏమన్న చేసుకోండి. దాసుణ్ణి మాత్రం దూరంగ ఉంచండి."

"చాలు. అంతకంటెనా!" అని సెలవు తీసుకున్నారు ఆచార్లు.

ఆ రాత్రి నారాయణస్వామికి నిద్రపట్టలేదు. వారికి పరితాపం ఎక్కువయింది. 'ఎలాంటి నీచపు పని చేయిస్తున్నావు స్వామీ' అని కుమిలిపోయారు.

తెల్లవారి ఆచార్లు వచ్చాడు. గురువయ్యను పిలిచి వారికి పరిచయం చేశారు నారాయణస్వామి. గురువయ్యను దూరంగా తీసికెళ్ళి ఏదో గుస గుస చెప్పాడు ఆచార్లు. తరవాత ఆచార్లు వెళ్ళిపోయాడు తలవంచుకొని నిలుచున్న గురువయ్యను పిలిచారు స్వామి.

గురువయ్య గుండె దడ దడ లాడింది. స్వామివైపు సాగి అడుగు ముందుకు వచ్చి నుంచున్నాడు కుంచించుకుని-ఏదో నేరం చేసిన వానివలె.

"ఇవాళ్టినుంచి హరికథ ఉన్నది. వినటానికి వస్తవా?"

"నేనానుండి....నేను."

"అవును నువ్వే. పిచ్చమ్మను కూడ తీసుకొని రా - కథ బాగ చెప్పుతరట హరిదాసుగారు."

"మంచిదుండి....అట్లనేనుండి."

"అట్లనేనుండి అంటెకాదు తప్పక రావాలె. నీకోసం మేము కాచుకొని ఉంటం, మీరొస్తెనె మేం బయల్దేరేది."

"మంచిది వస్తముండి"

"శుచిగా శుభ్రంగా రావాలె."

"వస్తముండి వస్తం." ఉత్సాహంగా అని సాగిపోయాడు గురువయ్య. స్వామికి ఎందుకో చాల సంతోషం కలిగింది.

ఆ రాత్రి నాంచారమ్మ, నారాయణస్వామి త్వరగా భోజనాలు ముగించుకొని, ఇంటికి తాళంవేసి, లాంతరుతో బల్లపీటమీద కూర్చున్నారు.

"ఇంకెందుకు కూచోటం–బయల్దేరక" నాంచారమ్మ అన్నది.

"కాస్సేపు కూర్చో. గురువయ్య వస్తనన్నడు."

"గురువయ్యేమొస్తడండి. ఎక్కణ్నో తాగి పడుంటడు. కథ మొదలు పెడ్తరేమో మనం పోదాం పాండి."

"కాస్త కూర్చో చూతాం - పిచ్చిదానా గురువయ్య సంగతి తెలవదే-మాటంటే తప్పడు - ఎరికెన్నా?"

"సరెలేండి." అని కూచున్నది నాంచారమ్మ - ఆమెకు మాత్రం గురువయ్య వస్తాడని నమ్మకం కలుగలేదు.

"దండం పెడ్త—కాల్మొక్త" గురువయ్య పిచ్చమ్మ సహితంగా లోనికి వచ్చాడు. స్వామి దంపతులు వారిని చూచి ఆశ్చర్యపోయారు. గురువయ్య పొద్దటి గురువయ్య కాడు. శుభ్రంగా ఉన్నాడు. స్నానంచేసి మంచి బట్టలు వేసుకున్నాడు. నొసట కుంకుమ మెరుస్తూంది. తాగిన జాడ ఎక్కడా కనిపించలేదు! పిచ్చమ్మకూడా

శుచిగా వచ్చింది. పూర్తిగా తడి ఆరని వెంట్రుకలు వదులు ముడి వేసుకుంది. ఉతికిన చీర కట్టుకుంది. నొసట కుంకుమ దిద్దుకుంది.

"పోదమా?" అని లేచారు స్వామి—నాంచారమ్మ వారిని అనుసరించింది.

పిచ్చమ్మ లాంతరు అందుకుంది. గురువయ్య దంపతులు లాంతరుతో ముందు నడుస్తుంటె స్వామి దంపతులు కొద్ది దూరంగా వారిని అనుసరించి నడుస్తున్నారు. కథాస్థలం రాగానే బయటనే నిలబడిపోయారు గురువయ్య దంపతులు. వారికి లోనికి ప్రవేశం లేదు. స్వామి దంపతులు లోనికి సాగిపోయారు.

గద్దెమీద పెట్రోమాక్సులు వెలుగుతున్నాయి. హరిదాసు అప్పుడే ప్రార్థన ప్రారంభించారు. ఆ అరుగుమీద కొద్దిమంది పెద్దమనుషులు కూర్చున్నారు. స్వామి గద్దెమీద కూర్చున్నారు. నాంచారమ్మ ఆడవాళ్ళలో కూర్చుంది. మిగతా జనం అరుగు ముందు చాపలమీద—పందిళ్ళకింద కూర్చున్నారు.

రామకిష్టయ్య నారాయణస్వామిని చూచి అడిగాడు — "గురువడు కూడ వచ్చినాడుండి" వెటకారంగా.

"గురువయ్య, పిచ్చమ్మ వచ్చిను. "

"కథ ఇని బాపనాయిన అయితడా గురువడు! వాండ్లు బాగుపడరుగ్రని-మీ పిచ్చిగాని."

"బాగుపరచటంగాని, చెడగొట్టడంగాని మన చేతులో లేదు రామకిష్టయ్యా! అంతా భగవదిచ్ఛ."

ఇంతలో చిరతల చప్పుడు ఎక్కువైంది. హరిదాసు కథ ప్రారంభించాడు.

"తపస్స్వాధ్యాయ నిరతం తపస్వీ వాగ్విదాం వరమ్

నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్ముని పుంగవమ్.

సకల శాస్త్ర పారంగతుడును, బ్రహ్మ నిష్ఠాగరిష్ఠుండును అయిన నారద మహామునిం జూచి వాల్మీకి ఇట్లని అడిగెను."

కథ అనర్గళంగా సాగుతూంది. శ్రోతలు మంత్రముగ్ధులై వింటున్నారు. నాటికి కథ ఆగింది. మంగళహారతి వచ్చింది.

అది గురువయ్య దాకా పోలేదు.

నారాయణస్వామి హరిదాసును మెచ్చుకున్నారు. శ్లోకాలు బాగా చదివాడన్నారు. రామానుజాచార్యులవారు అది విని పొంగిపోయారు. గ్రామస్తులకుకూడా ఆచార్యులవారి విషయంలో గౌరవం పెరిగింది. ఇంటికివెళ్తూ గురువయ్య నడిగారు నారాయణస్వామి "గురువయ్యా కథెట్లున్నది?" అని.

"పిట్టకతలు శాన బాగ చెప్పిండుండి" అన్నాడు. అతని పలుకుల్లో ఏదో ఆనందం కనిపించింది.

పిచ్చమ్మ చాల సంతోషంగా ఉంది-కథను గురించి కాదు-గురువయ్య ఆ రోజు

త్రాగనందుకు, తనతోపాటు హాయిగా సాగుతున్నందుకు. "రేపుకూడ వస్తవా?" నారాయణస్వామి.

"వస్తనుండి-కత ఎందాక పోతదో ఇనాలె."

"మంచిది రేపుకూడా ఇదే సమయానికి రాండి" అని లాంతరు అందుకొని ఇంట్లోకి వెళ్ళిపోయారు నారాయణస్వామి.

"గురువయ్య మారిందండి" నాంచారమ్మ స్వరంలో ఏదో సంతృప్తి గోచరించింది.

"పిచ్చిదానా! అంతా భగవత్సంకల్పం" అన్న నారాయణస్వామి ధ్వనిలోనూ సంతృప్తి గోచరించింది.

అక్కడ హరిదాసు ఇల్లు చేరుకుని విశ్రమించగానే ఎంకమ్మ వచ్చింది— "శాన మంచిగ చెప్పినవుండి కత" అని మంచంమీద కూచున్నది. "కాళ్ళ పిసకనా?" అని తన తొడమీద అయ్యవారి కాళ్ళ పెట్టుకొని పిసకసాగింది.

లాంతరు వెలుగుతూంది. ఎంకమ్మ రంభలా కనిపించింది హరిదాసుకు. "ఎంకమ్మా! నీ మొఖాన కుంకుమ, నెత్తిన పూలు వుంటె ఎట్లుంటవో" అంటూ ఆమెను మీదికి లాక్కున్నాడు.

"బొట్టు, పూలు పెట్టుకోవద్దంటరుగద మా అయ్య అమ్మ!" ముద్దుగా అడిగింది ఎంకమ్మ హరిదాసు కౌగిట్లో.

"ఇక్కడ అందరు అట్లనే అంటరు పట్నంపోతె పెట్టుకోవచ్చు."

"మల్ల నన్ను పట్నం తీస్కపోతవా?"

"ఎందుకు తీసుకపోను. తీస్కపోత"

లాంతరు ఆర్పేశాడు హరిదాసు.

తెల్లవారి కూడా పిచ్చమ్మను వెంటపెట్టుకొని వచ్చాడు గురువయ్య నారాయణస్వామి ఇంటికి. నిన్నటి వలెనే గురువయ్య దంపతులు శుచిగా, శుభ్రంగా ఉన్నారు- గురువయ్య చెవి సందున పూవు పెట్టుకున్నాడు.

గురువయ్య తాగలేదు.

హరిదాసుకు తెచ్చిపెడ్తూనే ఉన్నాడు. హరిదాసు తాగుతున్నాడు.

గురువయ్య సక్రమంగా హరికథకు వస్తున్నాడు. అతనికి కథలో ఆసక్తి ఏర్పడుతూంది. అతని జీవితంలో అమాంతంగా మార్పు వచ్చింది. ఉదయం లేచి స్నానం చేయందే కూలికి పోవడంలేదు. పని కూడా పూర్వం కంటె శ్రద్ధగా చేస్తున్నాడు. విరామ సమయంలో అక్కడ కూడిన వారికి తనకు తెలిసినంతవరకు రామకథ చెపుతున్నాడు. సాయంకాలాల్లో సార దుకాణానికి-హరిదాసు కోసమేగాని, తాగడానికి వెళ్ళడం లేదు. సాయంకాలం మళ్ళీ స్నానం, ఉతికిన బట్టలు కట్టుకోవడం, హరికథకు వెళ్ళడం సారాయి బదులు అలవాటయిపోయినాయి.

పిచ్చమ్మ గురువయ్యను అనుసరించి రోజూ కథకు పోతూంది. కాని ఆమెకు కథలో ఆసక్తి లేదు. ఆమెకు అర్థం అయింది లేదు. ఆమె ఆసక్తి గురువయ్య విషయంలో, గురువయ్య తాగడంలేదు–అది ఆమెకు సంతోషం. గురువయ్య బాదడం లేదు–అది ఆమెకు సంతోషం. గురువయ్య ఆమెను వెంట తెస్తున్నాడు–అది ఆమెకు సంతోషం. గురువయ్య వెంట జంటగా నడిచి వస్తున్నది–అది ఆమెకు గర్వం.

పిచ్చమ్మ రోజూ నాంచారమ్మ ఇంటికి వస్తూంది గురువయ్యతో—అయినా నాంచారమ్మతో ఆమె పరిచయం అంతంత మాత్రమే. పిచ్చమ్మ నాంచారమ్మ ఇంటిని రోజూ చూస్తూంది. అందువల్ల ఆమె నేర్చుకుంది. తన ఇంటిని శుభ్రంగా ఉంచుతూంది. అలకడం, ముగ్గులు పెట్టడం ఆమెకు అలవాటయినాయి. ఆమె ఇంటిని ఎప్పుడూ అద్దంలా ఉంచుతుంది. స్నానంలేకుండా వంటపనికి పూనుకోవడం లేదు. పిచ్చమ్మ ఇల్లు గూడేనికి ఆదర్శం అయింది. గురువయ్యకు గూడెంలో గౌరవం ఏర్పడ్డది.

రామకిష్టయ్య కూడా గురువయ్యను చూచి లోలోన ఆశ్చర్యపడుతున్నాడు.

నారాయణస్వామి, నాంచారమ్మ ఎంతో సంతోషిస్తున్నారు—గురువయ్య పాత గురువయ్య కాకుండా ఉండాలని ప్రతిరోజూ భగవంతుని ప్రార్థిస్తున్నారు.

"అయ్యగారూ! రాముడు కూడ అన్యాయం చేస్తడా?" ఒకనాడు కథనుంచి తిరిగివస్తూ దారిలో అడిగాడు గురువయ్య.

"ఏమిటి గురువయ్య అట్లంటవు?"

"ఎరకలేక అడుగుతున్న. ఎరక చెప్పాలె మీరు."

"అడుగు"

"రాములోరు వాలి నెందుకు చంపిండుండి?" వాలి ఏం కీడు చేసిండని చంపిండుండి?"

నిశితమైన గురువయ్య పరిశీలనకు ఆశ్చర్యపడ్డారు నారాయణస్వామి.

"గురువయ్యా! రాముడు ధర్మసంస్థాపనం కోసం అవతరించిండుగద! ధర్మానికి కీడు చేస్తే రామునికి కీడు చేసినట్లు కాదా?"

అప్పటికి ఇల్లు వచ్చేసింది, నారాయణస్వామి బల్లపీటమీద కూర్చుంటే గురువయ్య లాంతరు పట్టుకొని కింద కూర్చున్నాడు. నాంచారమ్మ లోనికి వెళ్ళి పడుకుంది. పిచ్చమ్మ ఇంటికి వెళ్ళిపోయింది.

"వాలి చేసిన అధర్మం ఏందుండి?"

"అదేమిటి గురువయ్యా అట్లంటవు? తమ్ముని భార్యను అపహరించె. రాజ్యం అపహరించె."

"సుగ్రీవుడు మాత్రం తక్కువేం తిన్నడు? అన్న బతికుండంగనె రాజ్యం కట్టుకునె. అన్న కాబట్టి తమ్ముణ్ని శిక్షించిండు - రాజ్యం నుంచి ఎల్లగొట్టిండు.

అన్నదమ్ముల పంచాయితి రాముని కెందుకుండి?" పరిశీలన నిశితంగా ఉంది. అసలు నారాయణస్వామికే సంశయాలు ప్రారంభం అయినాయి.

"తప్పు గురువయ్యా! అట్లనకూడదు. అన్నదమ్ములు కొట్టుకొని చస్తుంటె ప్రభువులు ఊరుకుంటరా! ధర్మరక్షణ ప్రభువుల కర్తవ్యం. రాముడు లీలామానుష విగ్రహుడు-సాక్షాత్ శ్రీమన్నారాయణుడు. ఆయనకాక మరెవరు రక్షించగలరు ధర్మమును?"

"సరెనుండి తమ్ముని పెండ్లాన్ని గుంజుకున్నడని వాలిని చంపిండను కుందం - మల్ల సుగ్రీవుడు అన్న పెండ్లాన్ని కాజేసిండు కాదుండి - సుగ్రీవుణ్ణి ఎందుకు చంపడాయె!"

ప్రశ్నలో అనేక చిక్కులున్నాయని గ్రహించారు నారాయణస్వామి.

"సూక్ష్మాగతిర్హి ధర్మస్య దుర్జ్ఞేయా కృతాత్మభిః, ధర్మము అతి సూక్ష్మమైనది. సంస్కారము లేనివారు దానిని గ్రహించలేరు" అని చెప్పి సంపూర్ణ చర్చకే ఉపక్రమించారు నారాయణస్వామి.

గురువయ్య ప్రశ్నల్లో అమాయకత కనిపించింది స్వామికి. అయినా ఆగ్రహం తెచ్చుకోలేదు. ఓపికగా ధర్మసూక్ష్మం వివరింప సాగారు. వారి వివరణను గూర్చి ప్రశ్నలడిగాడు గురువయ్య.

ప్రశ్నలు, సమాధానాలు, వివరణలతో తెల్లవారింది.

ఉభయుల్లో ఎవరూ విసుక్కోలేదు.

"అయ్యగారూ! మీరెంత చదువుకున్నరుండీ? ఇన్నాళ్ళనుంచి మీ దాసుణ్నయి ఇది తెల్సుకోలేకపోయాను. ఎంతకాలం పాడు చేసిన్నుండి. ఇప్పుడు ఎరకైందుండి, రామునికంటె మీ గొప్పదనం ఎక్కువని."

"గురువయ్యా! అపచారం, అపచారం. చెంపలేసుకో. అట్లన కూడదు - రాముడు జగత్పిత - పరాత్పరుడు. లీలామానుష విగ్రహుడు - వాడు ఆడమన్నట్లు ఆడేవాణ్ణి నేను. వాణ్ణి కించపరచకూడదు."

"మీరు లేకుంటె నాకు రాము డెట్ల తెలుసునుండీ."

"గురువయ్యా!" ఆ పిలుపులో ఆర్ద్రత ఉంది "నువ్వు చాలా ఎదిగినవయ్యా!" నారాయణస్వామి కన్నీటి చుక్క నేలమీద రాలింది.

"అయ్యగారూ!" అని కాళ్ళు పట్టుకొని కాళ్ళమీద తలపెట్టి కన్నీటితో కడిగాడు గురువయ్య.

గురువయ్యలో ఆత్మీయత హద్దులు దాటి పొంగింది. అది అయ్యవారి అంతస్తును కూల్చేసింది. ఆలోచించలేదు గురువయ్య - అమాంతంగా కాళ్ళు పట్టుకున్నాడు. స్వామివారి బాష్పబిందువు గురువయ్య తలమీద రాలింది.

స్వామి ఆనందంలో తన్మయులైనారు. తన్మయంలో అన్ని హద్దుల్లూ చెరిగి

పోయాయి. గురువయ్య కాళ్ళమీద పడితే జరగలేదు. అది రెండు ఆత్మల సమ్మేళనం.

ఇద్దరూ తన్మయులైనారు - లోకాన్ని మరచారు.

తూర్పున అరుణోదయం అయింది.

"గురువయ్యా! లే" ముందు లోకాన్ని గమనించింది నారాయణస్వామి. రెండు చేతుల్తో గురువయ్య బుజాలు పట్టుకొని లేవదీశారు, చేతులు చాచి కౌగిలించుకున్నారు. "గురువయ్యా! నువ్వు పవిత్రునివి. ఇకనుండి నువ్వు నాకు తమ్మునివి." అన్నారు.

"అన్నగారూ!" అని విడిపించుకొని దూరంగా నుంచున్నాడు గురువయ్య.

# 14

రామానుజాచార్యులు ఊళ్ళో తన ప్రాభవాన్ని పెంచేశాడు. అందరికీ విముక్తి ద్వారాలు తెరిచేశాడు. రామనామ స్మరణ ప్రారంభింపజేశాడు. రామకోటి రాయించాడు. భజనలు సాగించాడు. భజనకు ఆడా మగా తండోప తండాలుగా రాసాగారు. అయ్యవారు తన్మయులై చిరతలతో భజన చేస్తుంటే శిష్యురాండ్రు ఊగిపోతున్నారు.

ఎంకమ్మ వారికి ప్రధాన శిష్యురాలయింది. ఆమె హరిదాసును వదలడం లేదు-హరిదాసు ఆమెను వదలడం లేదు. హరి భజనలో హరిదాసు పక్కనె ఉంటూంది ఎంకమ్మ.

ఊరంతా భజన వాతావరణం వ్యాపింప జేశాడు హరిదాసు.

హరిదాసు తనకు జ్యోతిష్యం వచ్చన్నాడు. చేతులు చూచి చెప్పసాగాడు. జరిగింది జరిగినట్లు చెప్పాడన్నారు కొందరు - అందు కాయన కొందర్ని కట్టుకున్నాడు ఎంకమ్మ ద్వారా. చుట్టు పక్కల ఊళ్ళనుంచి కూడా జనం రాసాగారు.

హరిదాసు తనకు మంత్ర శాస్త్రం వచ్చు నన్నాడు. ఆ మాట విని రామకిష్టయ్య గతుక్కుమన్నాడు. రామకిష్టయ్య ముందే వేపమండలు తెప్పించాడు. మంత్రాలు మహజోరుగా చదివాడు. నుంచున్న రోకలిని మంత్రాలతో బెత్తెడు లేవనెత్తాడు. ఇంకేముంది రామకిష్టయ్య గుండె గుటుక్కుమంది. హరిదాసు కాళ్ళమీద పడి తనను రక్షించమన్నాడు. హరిదాసు అభయమిచ్చాడు. ఎంకమ్మ అత్తవారి తరఫువాళ్ళు ఇంకొందరు మిగిలారు. రామకిష్టయ్య హరించిన ఆస్తిని కాజేయడానికి అదనుకు చూస్తున్నారు. వారిని అంత మొందించాలన్నాడు రామకిష్టయ్య. ముహూర్తం చూచి చేతబడి చేస్తే ఎక్కడి వాళ్ళక్కడే రక్తం కక్కుకు చస్తారన్నాడు హరిదాసు. రామకిష్టయ్యకు గురి కుదిరింది.

దొడ్డిద్వారం తెరిపించి సగం ఇల్లు హరిదాసుకు అప్పగించాడు. హరిదాసు ఇష్టారాజ్యం సాగించాడు అందులో. ఎప్పుడూ జనం తండోపతండాలుగా వస్తుండే వారు. అర్చనలు-ఆరాధనలు-మందులు-మంత్రాలు విరామం ఉండేది కాదు.

హరిదాసుకు గురవయ్యతో పని తీరింది. నారాయణస్వామి ఇంటివైపు పోవడం లేదు. సకల సౌకర్యాలూ రామకిష్టయ్య ఇంట్లోనే సమకూరుతున్నాయి. సారాయి అక్కడికే వస్తూంది. పట్టపగలే సేవిస్తున్నాడు హరిదాసు - ఎంకమ్మ కూడా కొద్ది కొద్దిగా అలవాటుపడింది. అన్నీ తెలుస్తున్నాయి రామకిష్టయ్యకు-అయినా నోరు మెదపడం లేదు. పైగా హరిదాసుకు సాగిలపడి మొక్కుతున్నాడు.

హరికథ రాత్రిళ్ళు మామూలుగా సాగుతూనే ఉంది. సీతాకళ్యాణం పేర వసూళ్ళు సాగించాడు హరిదాసు. కళ్యాణం అట్టహాసంగానే చేశాడు. ఊరంతా సంతర్పణ ఏర్పరచాడు. పానకం, వడపప్పు పంచిపెట్టించాడు. పట్టాభిషేకానికి పట్టీలు తయారుచేయడం ప్రారంభించాడు.

హరిదాసును పల్లకి ఎక్కించి ఊరేగించారు ఊళ్ళోవాళ్ళు-పల్లకీలో ఎంకమ్మ ఉంటే బాగుండుననుకున్నాడు హరిదాసు!

రామకిష్టయ్య హరిదాసుకు తన విన్నపం గుర్తుచేశాడు - చాలసార్లు-రహస్యంగా-అతి వినయంగా. లంకాదహనం తరువాత చూస్తామన్నారు.

ఎంకమ్మకు బాగా వెర్రి ఎక్కించాడు హరిదాసు. హరిదాసు లేకుంటే తాను చచ్చిపోతాననే దశకు తెచ్చాడు.

హరికథ సాగుతూనే ఉంది.

శ్రీరామ పట్టాభిషేక ఘట్టం వచ్చింది. హనుమంతుడు నందిగ్రామం వచ్చేదాకా చెప్పి, పట్టాభిషేకం ఉత్సవం జరిపి చెప్పుతానని ముగించాడు హరిదాసు.

నాలుగు రోజుల తరువాత పట్టాభిషేకానికి ముహూర్తం నిర్ణయం అయింది. కనకవర్షం కురిసింది హరిదాసుమీద. చుట్టుపట్ల ఊళ్ళనుంచి బళ్ళు కట్టుకొని వచ్చి విరాళాలు యిచ్చి పోతున్నారు. రామకిష్టయ్య ఇల్లు పెళ్ళిల్లులా ఉంది.

రామకిష్టయ్య తాను అడిగిందాన్ని గురించి విన్నవించుకున్నాడు. పట్టాభిషేకం తరువాత అని దాటవేశాడు హరిదాసు.

పట్టాభిషేకం మరి రెండు రోజులుంది.

రామకిష్టయ్య తెల్లవారుజామున లేచి చూస్తే తలుపులన్ని బార్లా తీసి ఉన్నాయి. గుండె గుబిక్కుమంది. గదిలోకి ఉరికాడు. ఇనప్పెట్టె ఖాళీగా తెరిచి ఉంది.

"కొంప మునిగిందే" అని కేకపెట్టి కూలబడ్డాడు.

క్షణంలో ఊరంతా గుప్పుమంది, హరిదాసు ఎంకమ్మను తీసుకొని ఉడాయించాడన్న సంగతి.

# 15

హరికథ అర్ధాంతరంగా ముగియడంతో గురువయ్య కేదో వెలితి, వెలితిగా ఉంది. సాయంకాలం ఇంటికి వచ్చి స్నానం చేసి, భోజనం చేసి పడుకుంటే పిచ్చి పిచ్చిగా ఉంది. లేచి నారాయణస్వామి ఇంటికి వచ్చాడు గురువయ్య. బల్లపీటమీద మోకాళ్ళకు కండువా చుట్టుకొని కూర్చొని ఉన్నారు స్వామి. నాంచారమ్మ లాంతరు తెచ్చి బల్లపీటమీద పెట్టి, గురువయ్యను చూచి "కథ లేదుగద!" అని లోనికి వెళ్ళి పోయింది.

కాళ్ళకు చుట్టుకున్న కండువా తీసి "రా గురువయ్యా రా" అని సరిగా కూర్చు న్నారు నారాయణస్వామి.

గురువయ్య దండం పెట్టి కింద కూర్చొని "అన్నగారూ! కథ అయిపోయిన కాణ్ణుంచి ఎట్లనో ఉన్నదుండి. అటెన్క కథ ఏమాయెనో ఆయన చెప్పకపాయె, మీరు చెప్పకపోతిరి. రాములోరి కష్టాలున్నకాడికి చెప్పి లేచిపాయె అరిదాసు. సుకపడ్డ సంగతి ఏమన్న ఇనాల్నా లేదా?"

గురువయ్య ఆతురత గ్రహించారు స్వామి.

"రామ కథ అటువంటిది గురువయ్యా! ఎంత విన్నా వినాలనిపిస్తుంది. తరువాత కథ ఏమంత లేదు. కాని కాస్త శాంతి లేకుండ చెప్పటము బాగుండదు. వినడం బాగుండదు."

"వసూలు చేసిందంత ఏసుకొని పారిపాయె అయ్యోరాయన! మల్ల ఎవరు చేస్త రుండి? మనం చేసుకుంటె తప్పయితదా?"

అంతవరకు ఆ ఆలోచన రాలేదు స్వామికి. గురువయ్య సలహా సమంజసం అనిపించింది – రామాయణం అసంపూర్ణంగా ఉండిపోవడం మంచిది కాదను కున్నారు.

"మంచిది గురువయ్య అట్లనే చేద్దం. రేపు మా ఇంట్లో పట్టాభిషేకం చేస్తం. ఇక్కడికే రాండి మీ రిద్దరూ?"

"అట్లనే నుండి కట్టెలు గిట్టెలు కొట్టెటిదుంటె చెప్పండి కొత్త. పొద్దున్నే పిచ్చొస్తది ఏమన్న పనుంటె చెప్పండి. రేపు కూలికిగిట్ట పోను. ఈడనే పడుంట."

"సరె అట్లనే కానియ్యి"

తెల్లవారి నారాయణస్వామి ఇంట్లో పట్టాభిషేకం జరిగింది. తీర్థప్రసాదాలు, హారతి తీసుకున్న గురువయ్య ఆనందానికి అంతులేకపోయింది. నారాయణస్వామి తరువాతి రామాయణ కథ చెప్పేవరకు సాయంకాలం అయింది.

"దశవర్ష సహస్రాణి దశవర్ష శతానిచ

భ్రాతృభిస్సహితం శ్రీమన్రామో రాజ్య మకారయత్"అని ముగించారు.

అప్పుడు భోజనా లయినాయి. పిచ్చమ్మ, గురువయ్య నారాయణస్వామి ఇంట్లోనే భోజనాలు చేశారు.

కథ అయిపోయింది. మళ్ళీ మామూలు స్థితి ఏర్పడ్డది గురువయ్యకు. రాత్రిప్పు నిద్రపట్టడంలేదు. ఏదో వెదుక్కున్నట్లుంటున్నది. అతడు ఒకనాటి సాయంకాలం నారాయణస్వామి ఇంటికివెళ్ళి "మళ్ల ఏదన్న మొదలుపెట్టుండి, పిచ్చి పిచ్చిగున్నది" అన్నాడు.

"గురువయ్యా! భాగవతం చెప్పుతున్న. ఇప్పుడు నాంచారు వింటూన్నది. నువ్వుకూడా రా."

"ఎప్పుడు రమ్మంటరు?"

"పొద్దు కుంకేయాళ రా."

"కూలినుంచి అప్పుడే వస్త కాదుండి."

గురువయ్య ఇబ్బంది గ్రహించారు స్వామి. "అట్లయితే ఒక పని చెయ్యి. అన్నంగిన్నం తిని కథ వినటానికి పోయెటట్లు రా. అప్పుడే చెప్పత నేను కూడ-ఎప్పుడయితె ఏం?"

"అట్లనే వస్త అన్నగారూ" అని వెళ్ళిపోయాడు గురువయ్య.

భాగవత కథాశ్రవణం ప్రారంభం అయింది. గురువయ్య క్రమం తప్పకుండా నారాయణస్వామి ఇంటికి వస్తున్నాడు. పందిరి గుంజకు ఆనుకొని కూర్చొని వింటున్నాడు. అతనికి భాగవతం బాగా నచ్చింది. స్వామి వివరణ అరటిపండు వలిచి ఇచ్చినట్లు ఉంటూంది. రోజు రోజుకు మరింత అర్థం అవుతూంది. వినడంలో ఏదో ఆనందం ఉంది గురువయ్యకు. ఒక్కోసారి జటిలమైన విషయాలు వచ్చినపుడు నిశితములైన ప్రశ్నలు అడుగుతున్నాడు. వివరించి చెప్పడంలో నారాయణస్వామికి మహదానందంగా ఉంది.

చకోరం వెన్నెల కోసం వలె, సాయంకాలం కావడం కోసం ఎదిరి చూస్తున్నాడు గురువయ్య. గురువయ్యకు మరో ఆసక్తిలేదు—భాగవతం వినా. అతడు కూలికి పోతున్నాడు. మిగతా నిత్యకృత్యాలు నిర్వర్తిస్తూనే ఉన్నాడు. అయినా అతడు అచ్చం భాగవతం వింటూన్నట్లే ఉన్నాడు. ప్రతిచోట భాగవతాన్ని గురించే మాట్లాడుతున్నాడు. అతని జీవితం భాగవతంమయం అయిపోయింది.

భాగవతంలో లీనం అయిపోయాడు గురువయ్య.

తులసిమాల – తెల్లని బట్టలు - ఊర్ధ్వపుండ్రాలు మునిలా కనిపించాడు గురువయ్య.

గురువయ్య ముఖం గంభీరంగా ఉంది-అతని ముఖంలో వర్చస్సుంది-అతని కళ్ళలో భక్తి ఉంది-అతడు నిరాసక్తు డయినాడు.

అతనికి ఊళ్ళో ఆదరం పెరిగింది-అతడు పట్టించుకోలేదు.

అతనికి గ్రామంలో పలుకుబడి హెచ్చింది-అతడు లెక్క చేయలేదు. అతణ్ని గూడేనికి పెద్దను చేశారు-అతను గమనించలేదు.

నిరంతర భాగవత కథాశ్రవణంలో నిమగ్నమైనాడు గురువయ్య. అతని జీవితంలో అది అత్యంత మహత్తర కాలం! అది ఎందరికి వస్తుంది! అందరికీ రానిది గురువయ్యకు వచ్చింది! అందును గురించి సైతం ఆలోచించలేదు గురువయ్య.

గురువయ్యకు శీతోష్ణ సుఖదుఃఖాలతో నిమిత్తం లేకుండా పోయింది.

గురువయ్య యోగిగా పరిణతి చెందుతున్నాడు!

గురువయ్య కూలికి పోవడం మానుకున్నాడు. రాత్రింబవళ్ళు నారాయణస్వామి ఇంట్లోనే గడుపుతున్నాడు. కథా శ్రవణం-చర్చ-దీంతోనే గడిచిపోతూంది కాలం. ఎప్పుడోగాని ఇంటికి వెళ్ళడంలేదు.

పిచ్చమ్మకు అంతా అయోమయంగా ఉంది. ఆమెకు ఏమీ అర్థం కావడం లేదు. ఆమెకు అర్థం అయిందల్లా గురువయ్య తనకు దూరం అవుతున్నాడు! ఆమెకు వ్యథ పెరిగింది. బాధ గుండెలో గూడు కట్టుకుంది. ఆమెమీద ఒకేసారి పదేళ్ళు పడ్డట్లు అనిపించింది. నొసటిమీది వెంట్రుకలు తెల్లబడ్డాయి. ముఖం ముడుతలు పడ్డది, కళ్ళు లోతుకు లాక్కుపోయాయి. ఆమె కూలినాలికి పోతూంది. ఉడకేసుకు తినడం-తడకేసుకు పండటంలా ఉంది ఆమె స్థితి.

గురువయ్య ఎప్పుడోగాని ఇంటికి రాడు.

అతడు మాట్లాడింది ఆమెకు తెలియదు.

దగ్గర్లో ఉన్నా ఆమడ దూరం ఉన్నట్లు అనిపిస్తుంది ఆమెకు. అయినా ఏం చేయగలదు పిచ్చమ్మ? మౌనంగా భరిస్తూంది—గురువయ్య భార్యగా.

ఒకనాడు స్వామి ధ్రువ చరిత్ర చెపుతున్నారు. పసిబాలుడు తపస్సుకు పోవడం-నారదుని ఉపదేశం—ధ్రువుని తపస్సు—నారాయణుడు ప్రత్యక్షం కావడం కళ్ళముందు జరిగినట్లుగా వివరిస్తున్నారు స్వామి. కథలో లీనం అయి వింటున్నాడు గురువయ్య.

గురువయ్యకు ఒక దగ్గుపొర వచ్చింది. ఊపిరి సల్పుకోకుండా కొనసాగింది. గిజగిజ లాడాడు గురువయ్య. దగ్గు ఆగిపోయిం తరువాత ఊస్తే తెమడలో రక్తం కనిపించింది. స్వామి గుండె లిప్త ఆగింది. గురువయ్య దాన్ని గురించి పట్టించుకోలేదు.

కథ సాగిపోయింది కాని గురువయ్య స్థితి దిగజారసాగింది. నిరంతరం దగ్గు - సాయంకాలాల్లో జ్వరం. అయినా అతడు కథ వినటం మానలేదు.

రోజు రోజుకూ క్షీణిస్తున్నాడు గురువయ్య.

అది క్షయ అని కనిపెట్టారు స్వామి. తమకు తెలిసినంతలో వైద్యం చేశారు——భాగవతంతోనే బాగుపడ్తా డనుకున్నారు!

గురువయ్య బాగా క్షీణించిపోయాడు. ఎముకలు, చర్మంతప్ప మిగల్లేదు. భాగవతం వినడం మానలేదు.

పిచ్చమ్మ గుండె పగిలింది.

ఆమె కన్నీటికి అంతులేదు - బాపల ఇంటికి రోజూ వెళ్ళబట్టే ఇలా అయిందని ఆమె నమ్మకం. ఆమె ఏడవటం తప్ప చేయగలిగింది ఏమీలేదు — ఆమె చేతులో పైస లేదు—కనీసం మంగళసూత్రం లేదు అమ్మడానికి!

స్వామికి తిరువారాధనలో రాముడు కాదు గురువయ్య కనిపించసాగాడు. భోజనాల సమయంలో నాంచారమ్మతో అన్నారు:—

"గురువయ్యను పట్నం తీసుకపోద మనుకుంటున్న."

"తీసుకపోండి. సొంతం ఎట్లనో అయిండు."

నారాయణస్వామికి ఎందుకో ధైర్యం వచ్చింది. గురువయ్య వచ్చినపుడు అడిగారు:—

"గురువయ్యా! రోగం ముదురుతున్నది. ఇక్కడ తగ్గేట్లు లేదు. పట్నం పోదం."

"అన్నగారూ!" దగ్గుతూనే అన్నాడు గురువయ్య. "ఆయువుకు ఎవడు కర్తండి. పరీక్షిత్తు పాము కరవకూడ దనుకుంటె ఆగినాదుండి" మళ్ళీ దగ్గుపొర వచ్చింది. గిజగిజ లాడాడు. తేలికపడి "బతికుండంగ భాగవతం పూర ఇనాలె! పట్నం ఎందుకు పంపుతరు! మీరు ముందరుంటె రోగం అదే తగ్గుతది."

"అట్లకాదు గురువయ్యా! వళ్ళు బాగుంటె ఏదన్న చెయ్యొచ్చు. మీ అన్నగారి శిష్యుడు డాక్టరున్నడు పట్నంల. బాగయ్యేద్దుంటే చచ్చుటెందుకు" నాంచారమ్మ.

"వదినగారూ! బతికి చేసెడి దేమున్నదుండి. భాగవతం ఇని చావాలె. అంతే."

"అది కాదు గురువయ్యా! ఆరోగ్యం బాగలేకుంటె ఏమి వింటవు? మునుపటి వలె చర్చ సాగుతున్నదా చెప్పు? నాకు గూడ చెప్పినట్లనిపించటంలే, ఏమంటవు?"

"అన్నగారూ!" దగ్గుపొరనుంచి తట్టుకొని "ఈ దాసుణ్ణి మీకు అప్పగించిన నన్ను బందాల్నుంచి తప్పించిన్రు. ఇంతవాణ్ణి చేసిన్రు. ఈ దాసుడు మీవాడు. మీరేమన్న చేసుకోండి. నే నొద్దనను."

మరొకసారి దగ్గుతెర తెరిపి ఇవ్వకుండా వచ్చింది. గిజగిజ తన్నుకున్నాడు గురువయ్య. నాంచారమ్మ, నారాయణస్వామి అతణ్ణి పట్టుకుంటె వళ్ళు మసిలి పోతూంది. ఇద్దరూ తీసికెళ్ళి, గురువయ్య వద్దన్నా వినకుండా, మంచంలో పడుకోబెట్టారు. నారాయణస్వామి కుప్పె అరగదీసి గురువయ్యతో న్నాకించారు. గురువయ్యకు నిద్రపట్టింది.

గురువయ్య కోసం పిచ్చమ్మ ఏచ్చింది. ఇక్కడే ఉంటాడని నారాయణస్వామి చెపుతె చిన్నబుచ్చుకొని పోయింది.

తెల్లవారి రామకిష్టయ్య దగ్గర పొలం తాకటు పెట్టి డబ్బు తెచ్చాడు నారాయణస్వామి. బండి కట్టించి గురువయ్యను తీసుకొని కదిలారు. ఊరు సాంతం బండివెంట సాగింది. అందరికీ దండాలుపెట్టి శలవు తీసుకున్నాడు గురువయ్య.

కన్నీరు జలజలా రాల్చి సాగనంపింది పిచ్చమ్మ.

గురువయ్య మాత్రం చలించలేదు. "పిచ్చీ? ఎందు కేడుస్తవు? నువ్వెవరు? నేనెవరు? ఎక్కడ కలిసినం? ఎక్కడ విడిపోతం? ఎవనికెరెక! అన్నగారున్నరు. వదినగారున్నరు. వాళ్ళు మనకు దేవుళ్ళు. వాళ్ళు చెప్పినట్లు ఇనాలె. వచ్చే ఆపదను ఎవరు ఆపలేరు. అందుకు తయారుగుండు. ఏడవకు పిచ్చీ!" గురువయ్య మాటల్లు నిశ్చలంగా ఉన్నాయి. ఆ వేగం, దుఃఖం ఎక్కడా కనిపించలేదు. ఆ మాటలు భార్యకు చెప్పుతున్నట్లుగా లేవు. ఎవరికో చెప్తతున్నట్లున్నాయి. ఆ నిగ్రహానికి నారాయణస్వామి ఆశ్చర్యపోయారు!

పట్నం చేరి క్షయ ఆస్పత్రిలో చేర్పించారు నారాయణస్వామి. అక్కడి డాక్టరు నారాయణస్వామికి శిష్యుడు. గురువయ్య కథ విని స్వామి విషయంలో భక్తి ఇనుమడించింది డాక్టరుకు. గురువయ్య విషయంలో కూడా ఆదరం ఏర్పడింది డాక్టరుకు. గురువయ్యను డాక్టరుకు అప్పగించి బయలుదేరుతున్న నారాయణస్వామిని చూచి అన్నాడు గురువయ్య:—

"అన్నగారూ! మీ ఋణం ఎన్ని జన్మలకు తీర్చుకుంట?"

"గురువయ్యా!" స్వామి కంఠం రుద్ధం అయింది. "గురువయ్యా! నీకు మరో జన్మ లేదయ్యా" స్వామి కన్నీరు జలజలా రాల్చారు. డాక్టరు సహితం కంట తడి పెట్టాడు.

నారాయణస్వామి బలవంతంగా సాగిపోయారు.

గురువయ్య అటు చూస్తూ ఉండిపోయాడు.

## 16

రైలు పట్నం చేరింది.

నారాయణస్వామి దంపతులు, పిచ్చమ్మ రైలు దిగారు. వారు క్షయ వైద్యశాలకు చేరుకున్నారు. వేపచెట్లకింద మౌనంగా కూర్చున్నారు. ఇంకా లోనికి వెళ్ళే సమయం కాలేదు. స్వామి తెలుసుకుని వచ్చారు-గురువయ్య స్థితి ఏమంత బావుండ లేదన్ని చెప్పారు. గురువయ్య జీవించి ఉన్నందుకు ముగ్గురూ మనసుల్లోనె సంతోషించారు. అతన్ని చూడాలనే ఆతురత ముగ్గురికీ ఉంది.

లోనికెళ్ళే వేళకాగానే ముగ్గురూ లోనికి వెళ్ళారు.

గురువయ్య మంచంలో పడివున్నాడు. బాగా చిక్కి శల్యం అయినాడు. బట్టలో పొగాకు కాడలా కనిపించాడు.

పిచ్చమ్మ గొల్లుమంది, నారాయణస్వామి ధైర్యం చిక్కబట్టారు. నాంచారమ్మ కళ్ళు చెమ్మగిల్లాయి.

"గురువయ్యా! ఎట్లున్నది?" స్వామి అడిగారు.

"ఇట్లున్న. కండ్లపడుతున్నదిగద" అని చేతులు జోడించి "మీ దర్శనం అయింది చాలు." అన్నాడు. కళ్ళలో ఒక వెలుగు కనిపించింది. పిచ్చమ్మ మంచం కోడు పట్టుకొని నేలమీద కూర్చుంది.

"దగ్గు సొంతం తగ్గిందండి. జ్వరం మాత్రం వదలటంలేదు. మందులేం పనిచేస్తున్నట్లులేవు" డాక్టరు అన్నాడు.

"అన్నగారూ! భాగవతం పూర ఇనందిపోను. నన్నిక్కడ తెచ్చి పడేసి౹ను? ఏం బాగుంట చెప్పండి."

"అట్లనకు గురువయ్యా! బాగయితవు" చెప్పడానికి చెప్పింది నాంచారమ్మ కాని గురువయ్యను చూస్తే గుండె చెరువైంది—ఎక్కడో కళ్ళల్లో ఉన్నాయి ప్రాణాలు. రోజులు లెక్కపెడుతున్నట్లనిపించింది. అంతే చాలు ప్రాణంతో కనిపించాడు అనుకుంది.

"ఏం బాగయితలేరి! అయిన మన చేతు లేమున్నదంటరు" అన్న గురువయ్య "అన్నగారూ ఒక్క పద్యం ఇనిపించండి—ఎన్నాళ్ళాయె!" అని అర్థించాడు.

గురువయ్య ఆర్తికి స్వామి అబ్బురపడ్డారు. వారి గుండె పొంగింది. ఆటూ పోటూ వచ్చాయి. స్వామి కనులు తడిశాయి. గొంతు రుద్ధం అయింది—పద్యం అందుకున్నారు:—

లావొక్కింతయు లేదు. ధైర్యము విలోలంబయ్యె. బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను. మూర్ఛవచ్చె, దనువున్ డస్సెన్, శ్రమంబయ్యెడిన్.
నీవె తప్ప నితఃపరంబెరుగ. మన్నింపన్ దగున్ దీనునిన్
రావే ఈశ్వర కావవే వరద సంరక్షించు భద్రాత్మకా"

చేతులు జోడించి ఆకాశానికి మొక్కి పద్యం ముగించారు స్వామి. అప్పటికి కన్నీరు చెంపలమీది నుంచి జారింది.

పద్యం చదువుతుంటె గురువయ్యలో ఏదో చైతన్యం వస్తున్నట్లు కనిపించింది డాక్టరుకు. సిరంజీద్వారా నరాల్లోకి రక్తం పోతున్నట్లు పుంజుకుంటున్నాడు గురువయ్య.

"ఆహా! అన్నగారూ! నా ఆత్మ దన్యమైంది," అన్నాడు గురువయ్య. అతని ధ్వని శక్తివంతంగా ఉంది—పూర్వంకంటె ఎంతో బలంగా ఉంది. ఏదో విశ్వాసం కలిగినట్లుంది.

గురువయ్య లేచి మంచంలో కూర్చున్నాడు.

అతని ముఖంలో ఏదో కొత్త వర్చస్సు కనిపించింది.

డాక్టరు ఆశ్చర్యపడ్డాడు. ఏమిటీ పరిణామం! ఇంత జవ, అంత శక్తి, ఇంత చైతన్యం ఎలా వచ్చాయి?

"స్వామీ! మీ పద్యం మా మందులకంటె శక్తివంతంగా పని చేసిందండీ. ఇంజక్షన్లు, మందులు విఫలమయినాయి. నాకు నిరాశ కలిగి మీకు రాశాను. కాని మీ పద్యం—అబ్బ మీ పద్యంలో ఎంత శక్తి ఉన్నదండి!" గురువయ్య చురుకుగా కనిపించాడు.

చూస్తున్న ముగ్గురూ ఆశ్చర్యపోయారు.

"డాక్టరుగారూ! గురువయ్య పద్యం కోసం పరితపిస్తున్నడు. అది లభించే వరకు అతనికి ఉత్సాహం వచ్చింది. రోగానికి కావలసింది కాక రోగికి కావలసినవి ఉంటవిగదా!" నారాయణస్వామి వివరించారు.

గురువయ్య మరో పద్యం చదవమన్నాడు. పద్యం డాక్టరుకూ బాగనిపించింది. అతడూ అర్థించాడు. స్వామి "సిరికిం జెప్పడు...." చదివేశారు.

"అన్నగారూ! భగవంతుడట్ల వస్తడా?"

ఎంతకాలానికి గురువయ్యనుంచి ప్రశ్న విన్నారు స్వామి! వారికి ఎంతో ఆనందం అయింది.

"వస్తడు గురువయ్యా! వస్తడు. నీ వంటివారు నిండుమనసుతో ఎలుగెత్తి పిలిస్తే ఎందుకు రాడు? తప్పక వస్తడు గురువయ్యా! వస్తడు" అని వీపుమీద చేయివేసి నిమిరారు స్వామి!

"ధన్యుడవు గురువయ్యా! ధన్యుడవు నీ ఆత్మ పరిపక్వమైంది" అన్న స్వామి, డాక్టరు పిలువగా వెళ్ళిపోయారు డాక్టరు వెంట.

గురువయ్యతో పిచ్చమ్మ మాటలు సాగించింది.

గురువయ్య స్థితి ప్రమాదకరంగా ఉంటెనే పిలిపించా నన్నాడు డాక్టరు. అతని శారీరక స్థితి అతడు మరిన్నినాళ్ళు జీవించడని చెపుతూందన్నాడు. మందులు అతనికి పనిచేసేట్లు లేవు. అతన్ని తీసికెళ్ళడమే మంచిదని సలహా ఇచ్చాడు.

స్వామి గురువయ్యను తీసికొని ఊరికి చేరుకున్నారు. గురువయ్యను తమ ఇంట్లోనే ఉంచుకున్నారు.

గురువయ్య వచ్చాడని తెలిసింది, ఊరు సాంతం కదిలింది.

గురువయ్య చచ్చి బతికిండట! బాగోతం ఇనెటందుకే బతికిండట! గురువయ్య చచ్చిండట! దేవుడొచ్చి బతికించిండట! అసలు గురువయ్యనే దేవుడు పూనిండట! గురువయ్యలో ఇప్పుడు సగం దేవుడున్నడట?

వదంతులు అలా వ్యాపించాయి—ముందు ఊళ్ళో—తమవరి చుట్టుపట్ల గ్రామాల్లో—ఆ తరువాత ఆ ప్రాంతంలో.

జనం గురువయ్య దర్శనానికి వస్తున్నారు.

గురువయ్య ఉదయమే స్నానం చేసి, ఊర్ధ్వపుండ్రాలు ధరించి వసారాలో గుంజకు ఆనుకొని కూచుంటాడు. మంచంలో పడుకొమ్మంటే పడుకోడు. పడుకొని భాగవతం విననంటాడు. కూర్చునే శక్తి లేదు గురువయ్యకు. అయినా పట్టుదలగా కూర్చుంటున్నాడు.

నారాయణస్వామి గోడకు ఆనుకొని గురువయ్యకు ఎదురుగా కూర్చుంటారు—వ్యాస పీఠంమీద భాగవతం ఉంచుకొని చదువుతుంటారు. మధ్య మధ్య గురువయ్య ప్రశ్నలు—వాటికి స్వామి వివరణలు. అలా మధ్యాహ్న భోజనం వరకూ సాగుతుంది. భోజనం తరువాత విశ్రాంతి. సాయంకాలం మళ్ళీ భాగవత పఠనం. అలా జరుగుతూంది కార్యక్రమం.

పురాణం వినడానికి వందలు—వేలుగా జనం వస్తున్నారు, బండ్లు కట్టుకొని, కాలి నడకన, గుర్రాలమీద, జనం కుటుంబాలతో తరలి వస్తున్నారు. ఆ ప్రాంతంలో ఉన్న బాటలన్నీ ఈ ఊరికే సాగుతున్నాయి. ఊరు నిత్య తిరుణాళ్ళలా తయారయింది. చెట్లకింద, బండ్లకింద వంటలు. చెరువులో, ఏటిలో స్నానాలు. ఊరు జనంతో కిటకిట లాడింది. వ్యాపారస్తులు దుకాణాలు పెట్టారు. ధార్మికులు పందిళ్ళు వేయించారు.

ఊరు పరిస్థితే మారిపోయింది. ఊరు పది ఊళ్ళపెట్టు అయింది.

నారాయణస్వామి పురాణం చెపుతున్నపుడు జనం కిటకిటలాడి పోతూంది. కొబ్బరికాయలు, పూలు, పండ్లు గుట్టలుగా పడుతున్నాయి. వాటి సేకరణ, వితరణతో సతమతం అవుతూంది నాంచారమ్మ. పిచ్చమ్మ ఎప్పుడోగాని అటు రావడంలేదు. వచ్చినా గురువయ్యకు నమస్కరించి వెళ్ళిపోతూంది. ఆమె ఎవరితోనూ మాట్లాడంలేదు. మౌనంగా తన ఇంటి వాకిట్లో కూర్చుంటుంది. తనలో తాను గొణుక్కుంటూంది. అప్పుడప్పుడు నవ్వుకుంటుంది. అమాంతంగా లేచి గురువయ్య దగ్గరికి పోతుంది—మళ్ళీ వచ్చి అక్కడే కూచుంటుంది.

విసుగూ, విరామం లేకుండా భాగవతం చదువుతున్నారు నారాయణస్వామి. అతి త్వరగా ముగించాలని వారి పట్టుదల — గురువయ్య చాలా కాలం బతుకుతాడని వారికి నమ్మకం లేదు. గురువయ్యకు భాగవతం పూర్తిగా చెప్పాలని వారి పట్టుదల. వార్ధక్యంలో ఉన్న నారాయణస్వామి శ్రమకు తట్టుకోలేక పోతున్నారు. నడుంనొప్పి ప్రారంభం అయింది. ముఖంమీద బాగా అలసట కనిపిస్తూంది. రాత్రిళ్ళు నాంచారమ్మ స్వామి నడుం వత్తుతూంది. ఆమెకూ పని ఎక్కువైంది—కళ్ళు భారంగా ఉంటున్నాయి.

అయినా పట్టుదలగా సాగిస్తున్నారు స్వామి. గురువయ్యకూ శక్తి లేదు. అతనికీ పట్టుదలే.

ఊరంతా ఒక వింత వాతావరణం ఏర్పడింది. భజన మండలులు

ఏర్పడ్డాయి. ఊరినిండా పందిళ్ళతో భజనలు సాగుతున్నాయి – రాత్రింబవళ్ళు. ఇదంతా విచిత్రంగా ఉంది స్వామికి.

"అన్నగారూ! ఎందుకిట్ల వస్తున్నరు మంది ఎర్రోళ్ళోలె" ఒకనాటి రాత్రి అడిగాడు గురువయ్య స్వామిని.

"అర్థం కావటం లేదు గురువయ్యా! ఊరంతా భజనలు చేస్తున్నరు - నీ ఆరోగ్యానికేమో!"

"అన్నగారూ! నాకు బతకాల్నని లేదు. భాగవతం ఇనాలె. అటెన్క బతికి చేసెడి దేమున్నది! ఇంకెంతున్నది అన్నగారూ?"

"గురువయ్యా! మమ్ములను విడిచి వెళ్ళిపోతావా?" నాంచారమ్మ ఆపద మీద పడినట్లే మాట్లాడింది

"వదినగారూ! పారే నీళ్ళల్లో ఎక్కన్నుంచో రొండు కట్టెలు కొట్టుకొస్తయి, వరదలో రొండు కలుస్తయి, జర దూరం పోతయి, అటెన్క ఏరుపడ్తయి, ఏది ఎక్కడికి పోతదో ఎవరి కెరుక?"

నారాయణస్వామికి ఏట్లో తాను చూచిన దృశ్యం గుర్తుకు వచ్చింది. ఆ విషయమే చెపుతున్నాడు గురువయ్య. ఈ సామ్యత ఎక్కడిది? భగవంతుడు చెప్పిస్తున్నాడా? గురువయ్య విడిపోవడం తప్పదా? ఈ మధ్య తాను పోగూడదా? పోడు. తనకు గురువయ్యంత పరిపక్వత రాలేదు. పోతానని ఎంత విరాగిలా చెపుతున్నాడు గురువయ్య! అతను ఈ లోకంతో బంధనాలు తెంచుకున్నాడు. భాగవతం కోసమే బతికి ఉన్నాడు! అనుకున్నారు.

ఆ తెల్లవారి గురువయ్య స్థితి దిగజారింది, ప్రమాదకరంగా పరిణమించింది. నోట మాట నిలిచిపోయింది. చూపు పైచూపు అయింది. భూశయనం చేయాల్సి వచ్చింది. దర్భలు తెప్పించి వేసి రామనామంతో భూశయనం చేశారు స్వామి.

వార్త ఊరంతా పాకింది. జనం స్వామి ఇల్లు వాకిలి నిండిపోయారు. స్వామి రామనామ సంకీర్తనం సాగించారు. జనం అనుసరించారు. ఊరంతా రామనామం ప్రతిధ్వనించింది.

పిచ్చమ్మ వాకిట్లో కూర్చొని ఏడ్వసాగింది.

రామకిష్టయ్య తోపుడు బండిమీద నారాయణస్వామి ఇంటికి వచ్చాడు—అతనికి కాళ్ళూ నోరూ పడిపోయాయి—వచ్చి గురువయ్య కాళ్ళు పట్టుకొని కన్నీరు కార్చాడు.

గురువయ్య కోలుకోసాగాడు. గురువయ్యకు స్పృహ వస్తోంది—నెమ్మదిగా.

స్వామి గమనించారు—భజన వేగం హెచ్చించారు.

రామనామం తప్ప మరేమీ వినిపించటం లేదు.

గురువయ్య మాట్లాడాడు.

మళ్ళీ మంచంమీద పడుకోబెట్టారు.

ఆ నాటినుంచీ గురువయ్య కూర్చోలేకపోతున్నాడు. తుంగచాప మీద పడు కొని భాగవతం వింటున్నాడు. పిచ్చమ్మ తన ఇల్లు వదిలేసింది. నిరంతరం గురువయ్య పక్కనే ఉంటూంది.

కథాశ్రవణం సాగుతూనే ఉంది.

రామకిష్టయ్య తోపుడు బండిమీద వచ్చి వింటున్నాడు. కూతురు లేచి పోవడం, కూతురుతోపాటు ఉన్న సొమ్ము పోవడంతో డీలాపడిపోయాడు రామ కిష్టయ్య. అతను చేతబడి చేసి చంపింతామనుకున్న ఎంకమ్మ అత్తవారి తరుపువారు, ఎంకమ్మ లేచిపోవడంతో కోర్టులో దావా వేశారు—ఎంకమ్మ తెచ్చిన ఆస్తి కోసం, రామకిష్టయ్య కోర్టుల చుట్టూ తిరిగాడు. ఉన్నది ఊడింది...కోర్టులో ఓడిపో యాడు, దాంతో మనోవ్యాధి పడి మంచాన పడ్డాడు. ఇంతలో ఇంటికి నిప్పంటు కుంది....అర్ధరాత్రి. ప్రాణాలతో రామకిష్టయ్య బయటపడడం కష్టం అయింది. కాలూ చెయ్యి పడిపోవడమేగాక, మాటకూడా పోయింది. రామకిష్టయ్య భార్య మరణించింది. రామకిష్టయ్య ఏకాకి అయినాడు. అతడు నమ్ముకున్నది డబ్బు-ఆస్తి. వాటికోసం అతడు చేసినవి అనేకం. చేసిన చేష్టలు నిలిచిపోయాయి. వచ్చిన ఆస్తి— ధనం పోయింది. ఎక్కణ్నుంచో ఒక పనిమనిషిని తెచ్చి పెట్టుకున్నాడు. అతను ఇంత కాచిపోస్తే తాగుతున్నాడు. తోపుడు బండిలో తిరిగి బాకీలు వసూలు చేస్తు న్నాడు. మంచంలో పడి ఉంటే రామకిష్టయ్యకు తాను చేసిన అన్యాయాలు భూతాల్లా వెంబడిస్తున్నాయి. "పురుగులు పడి చస్తడు" అని నారాయణస్వామి అన్న విషయం అతనికి గుర్తు వచ్చింది. తన స్థితి చూసుకుంటే ముందేం జరుగనున్నదో తెలిసేట్లు లేదు. నారాయణస్వామి అన్నాడని చెప్పిన మాటలు అతనికి గుర్తు రాసాగేయి. ఎందుకో ఆలోచన సైతం భరించలేక పోతున్నాడు. తన వంటినిండా లుకలుక లాడుతున్న పురుగులు కనిపించాయి—తన శరీరం తనకే అసహ్యం అనిపించింది. తోపుడు బండిలో పురాణం వినడానికి బయలుదేరాడు. చేసిన పాపాలు అలా కడుక్కోవాలని అతని ఆశయం. ఒకనాడు ఎందుకో అతనికి అనిపించింది గురువయ్య భూమి, నారాయణస్వామి భూమి తన దగ్గర ఉండడం మంచిది కాదని. వాటిని వారికే దానం చేతామనుకున్నాడు. తోపుడు బండిలో స్వామి ఇంటికి చేరాడు. గురువయ్య కాళ్ళంటి తాను చెప్పేవన్నీ కాగితంమీద రాసి చూపించాడు.

"గురువయ్యా! నేను అపచారం చేసిన, నీ భూమి తీసుకున్న. ఇప్పుడు ఇచ్చిపోవడానికి వచ్చిన, తీసుకో."

"రామకిష్టయ్యా! నాకు భూమెక్కడిది? నా కిక్కడ ఏమి లేవు. మిగిలిన బాగవత మున్నది—అందుకు తగిన గింజలున్నయి. 'నాది' అనేది నాకు లేదు రామకిష్టయ్యా!"

రామకిష్టయ్య గురువయ్య కాళ్ళమీద తలపెట్టి పెద్దగా ఏడ్చాడు. ఏవేవో అనదలచుకున్నాడు. అనలేకపోయాడు. ఆ ఊహల్లు, ఆలోచనల్లు, అవతలచిన

మాటలు మనసులోనే మసలసాగాయి—మరగసాగేయి. నారాయణస్వామిని వారి భూమి వాపసు తీసుకోవలసిందని ప్రార్థించాడు రామకిష్టయ్య—దోసి లొగ్గి. దేహీ అనడం కాదు ఇస్తానన్నాడు.

"రామకిష్టయ్యా! నీకు దుఃఖానికి హేతువైంది నా కిస్తానంటవా! నీవు చంచలములైన ఆస్తిని ధనమును నమ్ముకున్నవు. అవి ఎన్నడూ ఎవరి దగ్గర కలకాలం ఉండవు. ద్రవ్యానికి ద్రవస్వభావం ఉన్నది. అది పారుతుంది గాని ఘనంగా నిలువదు. నిలునిదాన్ని నిలుపస్తుందని భ్రమపడ్డవు. అది నిలువలేదు. పోయింది. అన్యవస్తువులపై గాక ఆత్మపై ఆధారపడిన వ్యక్తికి బాధలుండవు. అతడు నమ్మినది ఆత్మను, అది పోయినప్పుడుగాని అతడు పోడు. ఆత్మను గాని, పరమాత్మనుగాని నమ్మిన వాడు చెడడు. "నమే భక్తః ప్రణశ్యతి" అన్నడు కృష్ణ పరమాత్మ. నీవు నాకు ఇస్తనంటున్న భూమి అశాశ్వతం అయింది. దానికి ద్రవ్యం నాకు ఇచ్చినవు. అది సదుపయోగం అయింది. నీవల్ల నాకు గురువయ్య లభించిండు. నాకు ఒక మహాత్ముడు దొరికిండు. ఆయన నుంచి చాల నేర్చుకున్న. 'నాది' అనటంలో అనేక దుఃఖాలున్నయి. "అందరిది" అనుకున్నప్పుడు దుఃఖాలు లేవు. నాకు ఇప్పుడు ఆనందం గున్నది. భూమి తెచ్చుకొని దుఃఖాలు తెచ్చుకోలేను రామకిష్టయ్యా!"

రామకిష్టయ్య గుండెలో అగ్గి రగలసాగింది కాని నోటమాటరాదు. నోరంతా తెరిచి, మూసి ఏమేమో అన్నాడు. అది అతనికీ అర్థం కాలేదు. విన్నవారికీ అర్థం కాలేదు. తలవంచుకొని తోవుడు బండిలో వెళ్ళిపోయాడు.

ఆరోజు భాగవత కథ ముగుస్తుంది. వాస్తవానికి క్రితం రోజే అయిపోయింది. లాంఛనంగా సమారాధన తరువాత చదవాలని వదిలివేశారు స్వామి.

ఉదయం స్నానం చేసి సిద్ధమై తుంగచాపలో పడుకున్నాడు గురువయ్య. పిచ్చమ్మ సహితం స్నానం చేసి అతని పక్కనే గోడకు ఆనుకుని కూర్చుంది. ఆఖరిరోజు కాబట్టి జనం ఎక్కువ వచ్చారు. వత్తిడి ఎక్కువగా ఉంది.

నారాయణస్వామి వ్యాసపీఠం ముందు కూర్చొని ధ్యానం చేసి గురువయ్యను చూచాడు. గురువయ్య కళ్ళల్లో ఆనందం తొణికిసలాడుతూంది. అతని కోర్కె పూర్తయింది—భాగవతం పూర్తి అవుతోంది. "గురువయ్యా! ప్రారంభింతమ!" అడిగారు స్వామి.

"ఇవ్వాళ ప్రారంభం కాదు అన్నగారూ! ముగింపు. ఆరంభం కాదు అన్నగారూ అంతం."

నారాయణస్వామి ప్రారంభించారు.

జనసందోహం అతిశ్రద్ధగా వింటున్నారు. ఆ నాడు పిచ్చమ్మ కూడ శ్రద్ధగా వినసాగింది.

గురువయ్య ప్రాణాలన్నీ భాగవత కథలో పెట్టాడు.

"ఇట్టి భాగవత పురాణంబు పఠియించి విష్ణుసాయుజ్యంబు జెందుదురని మరియు నిట్లనియె" నారాయణస్వామి చదివి గురువయ్యను చూచారు. గురువయ్య కథలో లీనం అయి ఉన్నాడు.

"అని యారీతి నుతించి భాగవత మాద్యంతంబు సూతుండు సె
ప్పిన సంతుష్ట మనస్కులై విని మునుల్ ప్రేమంబోనం పద్మనా
భుని జిత్తంబున నిల్పి తద్గుణమున్ బాషించుచున్ ధన్యులై
చని రాత్మీయ నికేతనములకు నుత్సాహంబు వర్ధిల్లగన్."

అనే పద్యం పూర్తి చేయగానే గురువయ్య నారాయణస్వామిని తన దగ్గరికి రావలసిందని సంజ్ఞ చేశాడు చేతితో.

నారాయణస్వామి లేచి గురువయ్య వైపు సాగారు.

గురువయ్య తన చేతిని వారి పాదాలమీద వేశాడు.

వేసినప్పుడు వేడిగా ఉన్న చేయి మంచుగా మారింది.

నారాయణస్వామి నుంచొనే ఉన్నారు-కదల్లేదు.

జనం సాంతం నిశ్శబ్దంగా నారాయణస్వామిని చూస్తున్నారు.

వాతావరణం స్థబ్దంగా ఉంది. నిశ్శబ్దంగా ఉంది. మౌనంగా ఉంది. వెళ్ళిపోతున్న ఆత్మను సాగనంపుతున్నట్లుంది.

నారాయణస్వామి పెదవి కదిలింది.

"గురువయ్య పరమపదించినను."

జనంలో సంచలనం.

గోడకు ఆనుకొని కూర్చున్న పిచ్చమ్మ నేలకొరిగింది.

పిచ్చమ్మ గురువయ్యను చేరుకొంది.





# అంకితం

మా

అన్నయ్య

దాశరథికి

-దాశరథి రంగాచార్య



# వినతి

నా షష్ఠిపూర్తి సన్మానోత్సవం ది 24-8-1988న శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో జరిగింది. కీర్తిశేషులు దేవులపల్లి రామానుజరావుగారు అధ్యక్షత వహించారు.

"దేహదాసు ఉత్తరాలు" ఆ సభలోనే ప్రచురణకర్త డాక్టర్ పొన్నాల సాందీప్‌చే ఆవిష్కరించబడింది.

అప్పటికే మా అన్నయ్య డాక్టర్ 'దాశరథి' కృష్ణమాచార్య పరమపదించారు

దేహదాసు ఉత్తరాలు దివంగతుడైన మా అన్నయ్యకు అంకితం సమర్పించాను. ఆ సభలోనే మా అన్నయ్య కొడుకు దాశరథి లక్ష్మణ్ అంకితం అందుకున్నాడు.

ఇప్పుడు ఈ పుస్తకాన్ని విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్‌వారు మలి ముద్రణం అందిస్తున్నారు. "విశాలాంధ్ర" వారికి కృతజ్ఞతలు.

సికిందరాబాదు
29-5-97

దాశరథి రంగాచార్య

# మా అన్నయ్య

"దేశే దేశే కళత్రాని, దేశే దేశేచ బాంధవాః తంతు దేశం నాపశ్యామి యత్ర భ్రాత సహోదరః" అని విలపిస్తాడు లక్ష్మణుడు మూర్ఛపోయినందుకు, రాముడు. మరి మా అన్నయ్య నా రాముడు, దాశరథి, కవితా శరధి మాటమాత్రం చెప్ప కుండా వెళ్ళిపోయాడు. దుఃఖంలో ముంచిపోయాడు. నా గుండెలో చీకట్లు నింపి తిమిరంతో సమరం జరపడానికి వెళ్ళిపోయాడు.

అక్కడ—ఆ లోకంలో-నైజాం పిశాచం వెలిసినట్టున్నాడు. అక్కడ చీకట్లు కమ్ముకున్నట్టున్నాయి. సమరం జరపడానికి పిలిచినట్లున్నారు. దేవుడు వట్టి స్వార్థ పరుడు. ఇక్కడి చీకట్లను ఇలాగే వుంచి, అక్కడి తిమిరంతో సమరానికి మా అన్నయ్యను తీసుకెళ్ళాడు.

మా అన్నయ్య చనిపోయాడంటే — అతని పార్థివ శరీరాన్ని నేనే అగ్నికి ఆహుతి చేయించానంటే నా మనసు నన్నే నమ్మడం లేదు.

తెల్లని దోవతి ధరించి, కాలరు లేని పొడుగు చేతుల చొక్కా వేసుకుని' చేతిలో బ్రీఫ్‌కేసు పట్టుకుని మా ఇంటి దర్వాజాలో నుంచొని "తమ్ముడూ" అని పిలుస్తున్నట్టనిపిస్తున్నది. మా అన్నయ్య యింకా మాట్లాడాడనీ, ఏ విషయాన్ని అయినా, ఎవరితో నయినా గంటల తరబడి మాట్లాడేవాడు మరణించడం అసాధ్యం అనుకుంటుంది మనసు.

20 సెప్టెంబరు నాడు మా అన్నయ్యను ఆస్పత్రిలో చేర్పించారని ఫోను వచ్చింది. నేను కదిలే స్థితిలో లేను. డాక్టర్‌ను అడిగాను. మీ ఆరాటం చూస్తుంటే మీరు వెళ్ళడమే మంచిది అన్నాడు. కమలా, నేను వెళ్ళాం. మా పిల్లవాడు విరించి అక్కడే ఉన్నాడు. నన్ను మా అన్నయ్య ఉన్న గదికి తీసికెళ్ళాడు. మంచం మీద దిండ్లు ఆనించి కూర్చోపెట్టారు. ఆక్సిజను వగైరా గొట్టాలతో కట్టి వేసినట్టున్నాడు. నాకు సమరసింహాన్ని బంధించినట్టు అనిపించింది. అన్నయ్య కళ్ళు మూసుకునివున్నాడు. అన్నయ్యను చూచాను. నాలో దుఃఖం కట్టలు తెంచు కుంది. పెద్దగా ఏడ్చేశాను. అన్నయ్య కళ్ళు తెరిచాడు. "తమ్ముడూ!" అన్నాడు. నా గుండె అవిసిపోయింది. నర్సులు వచ్చారు. నన్ను బయటకు నడిపించారు.

మా అన్నయ్యను నిజాం సైతం జైల్లో పెట్టగలిగాడు-కాని బంధించలేక పోయాడు. జైలులోనే "వద్దంటే గద్దె నెక్కి పెద్దరికం చేస్తావా?" అని గర్జించాడు. అలాంటి సింహాన్ని ఆస్పత్రి బంధించింది. చూడలేక పోయాను. ఎంతోసేపు విలపించాను.

9 అక్టోబరున మళ్ళీ ఆస్పత్రికి వెళ్ళాను. అన్నయ్య నన్నూ, మా అమ్మాయి ఉదయశ్రీని పట్టుకుని పెద్దగా ఏడ్చాడు. మా అన్నయ్య కన్నీరు రాల్చడం అంతకు ముందు నేను చూడలేదు మా అమ్మ పోయినప్పుడూ, నాయన పోయినప్పుడూ కూడా అన్నయ్య ఏడవలేదు. మా అన్నయ్య దుఃఖం చూచి నా మనసులో దుఃఖం పొంగింది. కాని దిగమింగాను. "అన్నయ్యా! నీలాంటి వాడికి ఇది తగదు. ధైర్యంగా వుండాలి" అన్నాను. "తమ్ముడూ! నాకు ధైర్యంలేదురా! పోయింది... పోయింది" అని మళ్ళీ ఏడ్చాడు. ఆ మాటా, ఈ మాటా చెప్పి ఓదార్చగలిగాను కాని బయటికి వచ్చి నేను భళ్ళుమన్నాను.

ఇప్పుడు ఏరీ, ఎవరు నాతో చెప్పుకుని ఏడ్చేవారు. మనసు నా ముందు భళ్ళున గుమ్మరించేవారు! మా అన్నయ్య వెళ్ళిపోయాడు! మళ్ళీ రాకుండా వెళ్ళాడు.

అన్నయ్య ఆస్పత్రి నుంచి ఇంటికి వచ్చాడు. నేను, కమలా వెళ్ళాం. ఆస్పత్రిలో కంటే బావున్నాడు. పూర్వం వలె కాకున్నా, సరదాగానే మాట్లాడాడు. "మరదలు వచ్చిందంటే ఆపిల్స్ తెచ్చిందన్నమాటే. చెక్కుతీసి కోసి పెట్టమ్మా!" అన్నాడు. అన్నయ్య మాటల్లో దుఃఖపు తడి కనిపించింది. కమల ఆపిల్ చెక్కు తీసి ముక్కలు కోసి పెట్టింది. "తమ్ముడూ! ఈ ఉపిరితిత్తుల్లో నీరు ఎప్పుడు వచ్చిందో తెల్సుగా. 1950లో ఖమ్మం హీరాలాల్ ఇంట్లో, నువ్వు నా మూత్ర పురీషాలు ఎత్తిపోశావు" అని గతాన్ని తోడిపోశాడు. ఆపిల్ ముక్కలు ఒక్కటే తిన్నాడు. "అందరికీ ఆపిల్స్ సెలెక్ట్ చేయడం చేతకాదురా!" అన్నాడు.

మా అన్నయ్య బాగవుతున్నాడు. కోలుకుంటున్నాడు. మళ్ళీ కొద్దిరోజుల్లో మా ఇంటికి వస్తాడు. "తమ్ముడూ!" అని పిలుస్తాడు. మా ఇంట్లో ఆపిల్ తింటాడు. చాయ్ తాగుతాడు. లోకంలో ముచ్చట్లన్నీ చర్చిస్తాడు అనుకున్నాను. కాలేదు. బాగు కాలేదు. మా ఇంటికి రాకుండానే వెళ్ళిపోయాడు. ఆశలన్నీ అడియాశలు చేసి వెళ్ళి పోయాడు.

1-11-87 ఆదివారం నాడు నేనూ, కమలా వెళ్ళాం. అన్నయ్య నిద్రలో వున్నాడంటే బయటనే కూర్చున్నాం. గ్రహించాడు మేం వచ్చామని. "తమ్ముడూ" అని పిలిచాడు. వెళ్ళాం. నన్ను తన మంచం మీదనే కూర్చోమన్నాడు. తాను లేచి కూర్చున్నాడు. ఇదివరకు చూచినప్పటికీ, ఇప్పటికీ బాగున్నాడు. తాను ఇదివరకు రాసినవి, రాయవలసిన వాటిని గురించి ముచ్చటించాడు. "అన్నయ్యా! నీ జబ్బు నయమైంది. ఇంక కోలుకోవాలి. అంతే. వారంపదిరోజుల్లో బాగవుతావనుకుంటా.

మేము మళ్ళీ వచ్చేసరికి కోలుకుని నడుస్తుంటావు" అన్నాను. "నేనూ అదే అనుకుంటు న్నాను. నాకు జబ్బులేదు. నీరసమే వుంది. బాగయిపోతాను" అని ధైర్యం కనబర చాడు. నాకు చాలా సంతోషం కలిగింది.

ఇంటికి వచ్చిన తరువాత అనుకున్నాను. మా అన్నయ్యకు అన్నీ మా నాయన లక్షణాలు వచ్చాయని. మా నాయన 1979వ సంవత్సరంలో తన 81వ సంవత్సరంలో పరమపదించారు. మా అన్నయ్య కూడా 81 సంవత్సరాలు జీవిస్తాడు అనుకున్నాను. అన్ని అంచనాలను తలక్రిందులు చేశాడు. అందని తీరాలకు వెళ్ళి పోయాడు.

కార్తీక పౌర్ణమి అందరికీ పర్వదినం. మాకది దుర్దినం. అన్నయ్య, ఉదయం రక్తపరీక్షకోసం డాక్టరు దగ్గరికి వెళ్ళివచ్చాడు. రెండు ఇడ్లీలు తిన్నాడు. కాస్సేపు నిద్రపోయాడు. లేచాడు. ఇన్సులిన్ ఇంజక్షను తీసుకున్నాడు. బాత్‌రూంకి వెళ్ళాడు. తలుపు వేసుకోవద్దని వాళ్ళమ్మాయి ఇందిర బయట నుంచుంది. కమ్మోడ్ మీది నుంచి పక్కనే వున్న నీళ్ళ బకెట్‌లో పడిపోయాడు. ఇందిర "నాన్నా నాన్నా" అంటూ లోనికి వురికింది. ఇంకెక్కడి నాన్న! నాన్న ఎక్కడున్నాడు! ఎక్కడున్నాడమ్మా నాన్న? నాన్న వెళ్ళిపోయాడు. ఏ లోకాల నుంచో పిలుపు వచ్చింది. వెళ్ళిపోయాడు. అందరినీ వదిలి వెళ్ళాడు. వంటరిగానే వెళ్ళాడు. అర్థంకానిచోటికి వెళ్ళిపోయాడు.

మృత్యువు సైతం మా అన్నయ్య మందహాసాన్ని ఆర్పలేకపోయింది. చావు తరువాత సైతం మా అన్నయ్య ముఖంలో మార్పులేదు. అది వెలుగుతున్న దివ్వెలా వుంది. మా అన్నయ్యను యమపాశాలు బంధించినట్టు కనిపించదు. మృత్యుదేవి అతని అడుగులకు మడుగులొత్తి తీసుకెళ్లినట్టుంది. మరణాయాసం మా అన్నయ్య దరిచేరడానికి అదిరిపోయింది. మా అన్నయ్య శరీరం నిద్రపోతు న్నట్టుంది. కాళ్ళూ, చేతులూ కట్టెలవలె కాలేదు. మెత్తగానే వున్నాయి. ఏవో పనులమీద ఆ లోకాలకు వెళ్ళాడు. మరలి వస్తాడేమో అన్నట్టున్నాడు.

మా అన్నయ్య కల్లా కపటం ఎరుగనివాడు. స్నేహం అంటే ప్రాణం ఇచ్చేవాడు. అతడికి వేల సంఖ్యలో మిత్రులున్నారు. మా అన్నయ్య మానవతా మూర్తి. ఆయన మనసులో, కళ్ళలో, కవితలో, హృదయంలో మానవత నిండి నిబిడీకృతం అయివుంది. మా అన్నయ్య నిజమైన కవి. ప్రపంచంలో ఎక్కడ ఏది జరిగినా స్పందించేవాడు. దాన్ని కవితామయం చేసేవాడు. మా అన్నయ్య గొప్ప వక్త. సభలలో గంటల తరబడి అనర్గళంగా ఉపన్యసించేవాడు. ఉత్తరాలు రాయడంలో మా అన్నయ్యను మించినవాడు వున్నాడనుకోను. ఎవరు ఉత్తరం రాసినా వెంటనే జవాబు రాసేవాడు. కొంత మందికి వారి ఉత్తరం అవసరం లేకుండానే జవాబు రాసేవాడు. వేల సంఖ్యలో జాబులు రాశాడు. మా అన్నయ్య హెచ్చు తగ్గులు ఎరుగడు. ప్రధానితోనూ, పసిపాపతోనూ ఒకేరకంగా మాట్లాడే వాడు. మా అన్నయ్య మహా మానవతావాద కవి. అతని కవితలు అగ్గి కురిపించ

గలవు, పూలవాన రాల్చగలవు అతడు అన్యాయానికి శత్రువు. అందానికి మిత్రుడు. అతనిలో లావాను చూడవచ్చు. ఇంద్రధనస్సులు అవలోకించవచ్చు.

మా అన్నయ్య మృత్యువును గెలిచిన మహాయోధుడు. అతడు అగ్ని ధారలో వున్నాడు. రుద్రవీణలో వున్నాడు. తిమిరంతో సమరంలో వున్నాడు. గాలిబ్ గీతాల్లో వున్నాడు. మిత్రుల మనసుల్లో వున్నాడు. మా అన్నయ్య వున్నాడు, వుంటాడు, వుండితీరుతాడు.

దాశరథి రంగాచార్య

# ప్రకాశకీయం

చరిత్ర సామాన్యుడిది కాదు. ఏ చరిత్రలో సామాన్యుడు లేడు. చరిత్ర ప్రభువులది. వారి కథలూ, కార్పణ్యాలు చెప్పేది ప్రభువులకోసం. ప్రభువుల గురించి ప్రభువులు రాయించేది చరిత్ర.

ఇది రాజకీయ చరిత్రకు మాత్రమే గాక ఏ చరిత్రకైనా వర్తిస్తుంది. సాహిత్యచరిత్ర ఇందుకు భిన్నమైంది కాదు. రాజులు రాజ్యాలు పోయినాయి అన్నారు. ప్రభువులు, మంత్రులు మరో వేషాల్తో ప్రత్యక్షమైనారు. దానితో చరిత్ర సామాన్యుడ్ని అంటరాని వాడ్ని చేసింది.

కొంత వరకు సాహిత్యం అక్కడక్కడా సామాన్యుడ్నీ, అతని వేదననూ చూపించిన ఉదంతాలు ఉన్నాయి. సామాన్యుడు, పాపం తనను గూర్చి చెప్పు కోలేడు. చెప్పుకున్నా వినే వాడుండడు. వానిదేదో అరణ్యరోదనలే, అనేవారేగాని సానుభూతి చూపే రచయితలు తక్కువే.

ఒక విషయం మనం గుర్తుంచుకోవాలి. ఏ సమాజమైనా చాలా వరకు సామాన్యుడి మీదనే ఆధారపడి ఉంటుంది. ఆ విషయాన్ని అర్థం చేసుకోవడమే కష్టం. దాన్ని అర్థం చేసుకున్నవాడు శ్రీ దాశరథి రంగాచార్య. అతడు సామాన్యుడు గాబట్టి, సామాన్యుడి గురించి సామాన్యంగా రాయడం అతడు సహించడు. మనం సామాన్యులు అనేవారు సమాజానికి మూల స్తంభాలు. కాబట్టి వారిని గురించి రాసేటప్పుడు సంపూర్ణమైన శిల్పంతో, శిల్పసౌందర్యాన్ని కన్పిస్తూ రాయాలనే వారిలో ఈ రచయిత ఒకరు. ఇతడు అతి సామాన్యుల్ని గురించి రాసాడు. అందంగా రాశాడు. నలుగురికీ పరిచయం చేసేపద్ధతిలో రాసాడు.

శ్రీ దాశరథి రంగాచార్య అనేక ప్రక్రియల్లో రచించారు. ప్రస్తుతం మేం ప్రచురిస్తున్నది లేఖాసాహిత్యం. లేఖా సాహిత్యం తెలుగులో చాలా అరుదుగా వచ్చింది. గుడిపాటి వెంకట చలం ప్రేమలేఖల తర్వాత సాహిత్యంలో అంత ప్రసిద్ధమైన లేఖలు మళ్ళీ కన్పించలేదు. దాశరథి రంగాచార్య ఈ లేఖలు రాసిన వయసులో ప్రేమ లేఖలు రాయవలసి ఉండే, కాని అతడు దానిజోలికి పోలేదు.. సమాజాన్ని నిర్మిస్తున్న, మనం సామాన్యుడు అనుకునే, ఆసామాన్యుడి గురించి

రాసాడు. ఒక మహోన్నత ఆశయ సిద్ధికై అందుకు సరిపడే విధంగా ఈ ప్రక్రియను మలుచుకొని లేఖాసాహిత్యాన్ని సృష్టించాడు. ఈ లేఖలు ఎవరికో రాసినవి కావు. ప్రభుత్వంలో ఉన్న పెద్దలకు రాసినవి. వారేమైనా చేస్తారనే నమ్మకంతో రాసినట్టున్నది రచయిత.

ఈ ఉత్తరాలన్నీ 'స్వతంత్ర'లో ప్రచురింపబడినవి. ఆ ఉత్తరాల్ని మొదటిసారిగా చూసినప్పుడు అవి మరుగున పడిన మాణిక్యాలుగా కన్పించాయి. అవి మరుగున పడిపోరాదనీ, అవి ఆ నాటికీ, ఈ నాటికీ, ముందుతరాల వారికీ ఎంతైనా అవసరం ఉంటాయనిపించింది. ఆ ఉద్దేశ్యంతోనే మరుగున పడిన మాణిక్యాలను ప్రకాశంలోకి తేవడానికి నిశ్చయించుకున్నాము. రచయిత అందుకు అంగీకరించారు.

దాశరథి రంగాచార్యులు గారు రచించిన 'పరిశీలన' ప్రచురించిన గౌతమి విద్యాసంస్థ 'దేహదాసు ఉత్తరాల'ను పుస్తక రూపంలో మీ ముందుంచుతున్నది. శ్రమను ఆదరిస్తారనీ, సామాన్యుడ్ని అర్థంచేసుకుంటారని ఆశిస్తూ.

గౌతమీ ఎడ్యుకేషన్ సొసైటి,
4-1-96, పాత బోయి గూడా,
సికింద్రాబాద్-500 003.
తేది : 16-6-1988

పొన్నాల సాందీప్

# స్వకీయం

1947లో బ్రిటిషిండియాకు రాజకీయ స్వాతంత్ర్యం వచ్చింది. బ్రిటిషిండియా; రాజకీయ స్వాతంత్ర్యం, అనే పదాలు కావాలనే వాడాను.

"బ్రిటిషిండియా" అని ఎందుకన్నానంటే 1947కు పూర్వం బ్రిటిషువారు పరిపాలించింది కాక 500కుపైగా దేశీయ సంస్థానాలు లేక రాజ్యాలు ఉండేవి. వీటిని భారతీయ ప్రభువులే పాలించారు. అయితే బ్రిటిషిండియాలో ప్రజలకు ఉన్నంతటి హక్కులు కూడా ఈ సంస్థానాల్లో ఉండేవికావు. ఈ విషయాలు "చిల్లరదేవుళ్ళు" నవలలో వివరించాను.

బ్రిటిషువారి సామ్రాజ్యవాదపు కుట్రలకు అంతులేదు. భారతదేశాన్ని విభజించడంతో సరిపుచ్చక 500పైగా ఉన్న సంస్థానాలకు కూడా స్వాతంత్ర్యం ఇచ్చిపోయారు. అంటే వారు స్వతంత్రంగా ఉండవచ్చు లేదా భారతదేశంలో కాని పాకిస్తాన్‌లో గాని చేరవచ్చు.

అధికారానికి, ప్రభుత్వానికి సిద్ధాంతాలు తక్కువ. కాశ్మీర్ రాజు హిందువు. అక్కడి ఒక భాగంలో ప్రజలు ముస్లిములు. హిందూరాజు అయినప్పటికీ భారత దేశంలో చేరడానికి నిరాకరించారు. బ్రిటిషువారి కుట్రతో పాకిస్తాన్ కాశ్మీర్ మీదికి దండెత్తింది. భారతదేశం ముందు సైన్యాలను పంపింది. ఆ తరవాత లాంఛనప్రాయంగా భారత యూనియన్‌లో చేరినట్లు మహారాజు సంతకం పెట్టాడు. నలభై ఏళ్ళు గడిచిపోయినా ఆక్రమిత కాశ్మీరం ఇంకా పాకిస్తాన్ ఆధీనంలోనే ఉంది.

ఇంత పెద్ద బ్రిటిషువారి కుట్రను భంగపరచి భారతీయ సంస్థానాలన్నింటినీ భారతదేశంలో చేర్చి "ఒకదేశం" "ఒకప్రజ" అనే భావన కల్పించడానికి జవహర్‌లాల్‌నెహ్రూ, సర్దార్‌పటేల్ చేసిన నిరంతర ప్రయత్నం భారత చరిత్రలో స్వర్ణాక్షరాలతో లిఖించదగింది.

జనానికి మరుపు ఎక్కువ. చాలమంది నిన్నటినుంచి గుణపాఠం నేర్చుకోలేరు. రేపటిని గురించి ప్రణాళికలు పరచుకోలేరు.

మనకు పాఠ్యపుస్తకాలు వగైరా సర్కారు సామాగ్రిలో స్వాతంత్ర్యం గురించి చెప్పేప్పుడు బ్రిటిషిండియాలో జరిగిన పోరాటాన్ని గురించే చెప్పడం

జరుగుతుంది. ఇప్పటి తరాలవారికి అసలు సంస్థానాలు ఉండేవి అనే విషయం కూడా అనేక మందికి తెలియదు. తెలియపరచవలసిన బాధ్యత మన మీద ఉంది. తెలుసుకోవాలనే ఆసక్తి వారికి ఉంటే.

హైద్రాబాదు సంస్థానం భారతదేశపు నడిబొడ్డున ఉండిన పెద్ద రియాసత్ సంస్థానం. ఇందులో తెలంగాణం కాక మరత్వాడా, కర్ణాటక ప్రాంతాలు కూడా ఉండేవి. ఇంగ్లండు, ఐర్లండు కలసినంతటి వైశాల్యం గల రాజ్యం ఇది. ఈ రాజ్యానికి ప్రభువులు నిజాములు. అందువల్ల దీనికి నైజాం అని పేరు వచ్చింది.

నైజాం సుమారు సర్వతంత్ర స్వతంత్రం అయిన రాజ్యం. దీనికి ప్రత్యేక నాణాలు, పోస్టలు సర్వీసు, బస్సురూట్లూ, రైల్వేలైను కూడా ఉండేది. ఇంగ్లీషు వారికి నామమాత్రపు సార్వభౌమత్వం ఉండేది.

నైజాంరాజ్యాన్ని పాలించినవారిలో ఏడవవాడు చివరివాడూ మీర్ ఉస్మాన్ అలీఖాన్ 1911లో గద్దెకెక్కాడు. అతడు నిరంకుశుడు. అత్యాశాపరుడు. అతి స్వార్థపరుడు. గద్దెకెక్కిన నాటినుంచి మైనారిటీ మతం అయిన ముస్లిములను ఉద్ధరిస్తున్నట్లు నటించాడు. రాజ్యం ముస్లిములదే అని భ్రమ కల్పించాడు. మతాంతీకరణకు పూనుకొన్నాడు. వాస్తవంగా అతడు ముస్లిములకు చేసిందేమీలేదు.- పూజ్యం. తన స్వార్థంకోసం వాళ్ళ ఆవేశాలను వినియోగించుకున్నాడు. అతడు దేశీయభాషను, సంస్కృతిని అణచడానికి చేసినన్ని ప్రయత్నాలు బహుశా చరిత్రలో ఏ రాజు చేసి ఉండడు. ప్రైవేటుస్కూళ్ళు నిషేధించాడు. గ్రంథాలయాలు పెట్టుకోవద్దన్నాడు. సభలు, సమావేశాలు జరపడానికి ప్రభుత్వం నుండి అనుమతి పొందాల్సి వచ్చేది.

ఇలాంటి నికృష్ట పరిస్థితుల్లో ఉన్న తెలంగాణంలోని మానుకోట తాలూకా లోని చిన్నగూడురు గ్రామంలో 24.8.1928 సంవత్సరంలో నేను జన్మించానని మా నాయనగారు చెప్పారు. మా చదువుల కోసం మేము చిన్నగూడురు నుంచి ఖమ్మం మారాం. ఖమ్మంలో నేను ఆరోక్లాసు చదువుతున్నాను. అప్పుడు నాకు పన్నెండు సంవత్సరాలు, నా భార్యకు ఏడు సంవత్సరాలు. అప్పుడు మా పెళ్ళి అయింది.

ఆరో క్లాసు చదువుతున్న రోజుల్లోనే నైజాం నవాబు ఒక ఫర్మానా జారీ చేశాడు. దానిప్రకారం స్కూలుకు వెళ్ళే పిల్లలంతా నలుపు లేక, నీలం రంగు షేర్వానీ, తెల్లని పైజామా, కుచ్చుటోపి ధరించాలి. ఈ ఫర్మానా మీద ఖమ్మం హైస్కూ(మదర్సే ఫేఖాన్యా)ల్లోని విద్యార్థులలో అలజడి చెలరేగింది. ఒక మతస్తు లకు అన్యమతస్తుల దుస్తులు ధరించమని నిర్బంధించడం భరించరానిది అయింది. నాకు చెప్పరాని ఆవేశం వచ్చేసింది. విద్యార్థుల సమావేశంలో అతి ఘాటుగా మాట్లాడాను. భారత సంస్కృతిని అణచివేయడానికి నిజాం నవాబు పని కట్టుకొని ఈ ఫర్మానా జారీ చేశాడు అన్నాను. విద్యార్థులలో ఆవేశం పొంగింది. ఏది చేయమన్నా

చేయడానికి సన్నిద్ధులు అయినారు. సమ్మె చేయడానికి నిర్ణయం జరిగింది. సమ్మె జరిగింది. ఎన్నాళ్ళు జరిగిందో గుర్తు లేదుగాని ఒకరోజున హెడ్‌మాస్టర్ (సదర్ ముద్రిస్) మమ్ములను పిలిచాడు. యూనిఫారం తప్పదు కాని తప్పనిసరిగా కుచ్చు టోపి ధరించాల్సిన అవసరం లేదన్నాడు. అది అతడు చేసిన నిర్ణయం మాత్రం కాదని గ్రహించాం. ప్రభుత్వం లొంగివచ్చిందని మేము పొంగిపోయాం.

సమ్మె ముగిసింది.

కాని నా చదువు అంతటితో ఆగిపోయింది!

స్కూలువైపు వెళ్ళే వాణ్ణి. పలకరించే వాళ్ళు అంతగా ఉండేవారు కారు. కొందరు దూరదూరంగా ఉండేవాళ్ళు. అయినా అక్కడే మోరీ మీద కూర్చునేవాణ్ణి. తాబద్‌ఖాంత్ ఆలమ్ యహోరియాసత్‌రఖే అనే ప్రార్థనా గీతం తరువాత వంటరిగా కూర్చోలేక పోయేవాణ్ణి. ఇంటికి వెళ్ళడానికి ముఖం ఉండేదికాదు. బడి ఎగ్గొట్టి తిరిగే ఆవారా పిల్లలతో స్నేహం అయింది. ఖమ్మం ఏట్లో "లింగం మడుగు"లో స్నానాలు చేయడం, ఏటీ వంతెన కింది కమాన్ల కింద కూర్చోవడం, గుంట మల్లన్న గుడి ముందరి మర్రిమీద కోతికొమ్మచ్చి ఆడడం, సాయంకాలానికో రాత్రికో ఇల్లు చేరుకోవడం-ఇవీ కార్యక్రమాలు.

మా కుటుంబ పరిస్థితి అస్తవ్యస్తంగా ఉండేది. మా అమ్మా నాయనలది అనుకూల దాంపత్యంకాదు. ఎప్పుడూ జగడాలు పడుతుండేవాళ్ళు. నా చదువును గురించి గాని, నా బడిని గురించిగాని వాళ్ళు నన్ను ఎన్నడూ అడగలేదు.

ఇది ఇలా ఉండగా మా అన్నయ్య మెట్రిక్యులేషన్‌కు వచ్చాడు. మా అమ్మను మా ఇద్దరు చెల్లెళ్ళను గూడురులో వదిలి హైద్రాబాదు వచ్చాం.

హైద్రాబాదులో మా నాయన మాడపాటి హనుమంతరావు, సురవరం ప్రతాపరెడ్డి, కొత్వాల్ వెంకట్రామారెడ్డి, నాయని వెంకటరంగారావు దగ్గరికి వెళ్తుండే వారు. మా నాయన మత చర్చ జరిపినా వాళ్ళు మాట్లాడే రాజకీయాలను బట్టి మనం ఎంత హీనస్థితిలో ఉన్నామో అర్థం అవుతుండేది. నైజాం నవాబును కాల్చిచంపా లన్నంత కసి వచ్చేది. కాని ఆలోచనకూ ఆచరణకూ అనంతం అయిన అగాధం ఉంది.

ఒకసారి నేను సీతారాంబాగ్ నుంచి వస్తున్నాను. నేను బొట్టుపెట్టుకొని ఉన్నాను. పోలీసుస్టేషను దగ్గరే తురక పిల్లల గుంపు నా వెంట పడ్డది. ఏక్సో గ్యారా, నూటపదకొండు (మా బొట్టు) అంటూ ఇటికెలతో కొట్టారు. నేను పడి పోయాను. గాయాలు అయినాయి కాని ఒక్కడు నావైపు తొంగిచూడలేదు. మన జనం అంత జడంగా, నిశ్చేతనంగా ఉన్నందుకు నాకు విచారంకాదు దుఃఖం వచ్చింది.

మా కుటుంబ పరిస్థితులు మళ్ళీ మారాయి. మా అమ్మ చెల్లెళ్ళను తీసుకొని హైద్రాబాదు వచ్చింది. కాని సామరస్యం లేదు. మా అన్నయ్యా మా అమ్మా

చెల్లెళ్ళను తీసుకొని వెళ్ళిపోయాడు. నేనూ మా నాయనా మిగిలిపోయాం. నాకు కడుపునొప్పి. అన్నం తినడం వాంతి చేసుకోవడం. అన్నింటికంటే ఎక్కువ మా అమ్మావాళ్ళు నన్ను వదిలి వెళ్ళినందుకు బాధపడ్డాను.

మళ్ళీ కుటుంబ పరిస్థితులు మారాయి. అందరూ కలిశారు. మా నాయన ఒక ప్రణాళిక ప్రకారమా అనుకునేటట్లు మా మకాం గార్ల జాగీరుకు మార్చి, మమ్ములను ఒక గుడిసెలో ఉంచి, తాను మైసూరువెళ్ళి మళ్ళీ పెళ్ళిచేసుకొని ఖమ్మం ఇంట్లో మకాం పెట్టారు.

గార్లలో తలుపులూ, పూర్తి గోడలులేని ఇంట్లో తేళ్ళు, పాములు మధ్య మా కుటుంబం గడపాల్సివచ్చింది. మా నాయన వెళ్ళిపోయేప్పుడు మా అమ్మ గర్భిణి. ఆ గుడిసెలోనే ఆడపిల్లను కన్నది. ఇప్పుడు మేము ఇద్దరం అన్న దమ్ములం-ముగ్గురు చెల్లెళ్ళు. అంత చిన్న వయసులో కుటుంబ బాధ్యత మా మీద పడింది.

బ్రిటిషిండియా బానిసత్వంలో ఉంది. బ్రిటిషిండియాలో మాత్రపు హక్కులు నైజాంలో లేవు. నైజాంలోని ఖాల్సా ప్రాంతంలో ఉన్న మాత్రపు హక్కులు జాగీర్లలో లేవు. పత్రిక చదవడం కూడా నేరంగా పరిగణించడం, ప్రజల పోరాటం, ప్రజా విజయం "మోదుగు పూలు" నవలలో చిత్రించాను.

అవి రెండో ప్రపంచయుద్ధం ఉధృతంగా జరుగుతున్న రోజులు. తెలంగాణాలో ఆంధ్రమహాసభ తన కార్యకలాపాలను ఉధృతం చేసింది. జాగీర్దారు, దేశ్‌ముఖ్‌లకు వ్యతిరేకంగా పోరాటం సాగించింది. "బాంచను దొరా!" అని పడివున్నవాడు తిరుగుబాటు సాగించాడు.

ఆంధ్రమహాసభ ప్రభావం నుంచి తప్పుకున్న అభ్యుదయవాదులు ఆ రోజుల్లో తక్కువ. మా అన్నయ్య డా॥ దాశరథి తీవ్రమైన పోరాటం సాగించి "మా నిజాం రాజు జన్మజన్మాల బూజు" అన్నారు. ఖారి పోరాటప్రాంగణం విస్తృతం అయింది. "నా తెలంగాణం కోటి రత్నాలవీణ" అని తెలంగాణా మొత్తంలో వ్యాపించారు. అరెస్టు అయినారు. జేలులో చాలాకాలం గడిపారు.

యుద్ధం రోజుల్లో పంచదార, కిరసనాయలు వంటి వాటిమీద కంట్రోలు ఉండేది. వ్యాపారస్తులు బ్లాక్‌మార్కెటు చేసి ప్రజలకు అందనీయకపోయేవారు. నల్ల బజారు వర్తకులమీద ఆంధ్రమహాసభ పోరాటం ప్రకటించింది. నేను గార్లలో బ్లాక్ మార్కెటుకు వ్యతిరేకంగా యుద్ధం ప్రకటించాను. అనేక పంచదార బస్తాలు బయట పడేయించాను. కిరసనాయలు డబ్బాలు వెలికి తీయించాను. బియ్యం, జొన్నలు వెలికి తీయించాను.

ఆ రోజుల్లో తెలంగాణా నుంచి మూడు తెలుగు దినపత్రికలు వచ్చేవి. 1. గోలుకొండ పత్రిక, 2. తెలంగాణ పత్రిక, 3. మీజాన్. గార్లలో పంచదార కరువును గురించి "మీజాన్"లో ఒక లేఖ రాశాను. అది నా తొలి రచన. దాని

ప్రభావం కనిపించింది. పంచదారకోటా మార్పు చేశారు. తాసిల్దార్ నన్ను పిలిపించి "బద్ హోనా బద్నాం నహోనా" అని మళ్ళీ పత్రికలకు రాయవద్దు అన్నారు. నేను మానలేదు. "ప్రజాశక్తి" సహితంగా అన్నింటికీ జాగీర్ల పరిస్థితులను గురించి రాశాను. అది చూసి అధికారులు నామీద కారాలు, మిరియాలు నూరారు. అయినా ప్రజలు—కాదు—గ్రామం సొంతం మా కుటుంబాన్ని తమ స్వంత కుటుంబంగా చూచుకున్నారు. విచిత్రం ఏమంటే ఎవరి బ్లాక్‌మార్కెట్ వస్తువులు బయటపడేశానో వారు సైతం మా విషయంలో అభిమానం కనబరచారు.

ఇటు కార్యకర్తగా పనిచేస్తూనే ట్యూషన్లు చెప్పాను. పత్రికలు అమ్మాను. లైబ్రేరియన్‌గా పనిచేశాను. రహస్యంగా రాత్రి పాఠశాలలు నడిపించాను. ఆఖరికి పాన్ దుకాణం కూడా పెట్టాను.

నాగసాకీ, హిరోషిమాల మీద అటంబాంబు పడడంతో ద్వితీయ ప్రపంచ సంగ్రామం ముగిసింది. ఫాసిజం నశించింది. ప్రజాస్వామ్యానికి విజయం లభించింది. బ్రిటన్‌లో ఎన్నికలు జరిగాయి. లేబర్‌పార్టీ ప్రభుత్వానికి వచ్చింది. బ్రిటిషిండియా వారు స్వాతంత్ర్యం ఇవ్వడం తప్పలేదు.

బ్రిటిషిండియాకు స్వాతంత్ర్యం వస్తే నిజాం నవాబు తానూ స్వాతంత్ర్యం ప్రకటించుకున్నాడు. బ్రిటిషువారి సార్వభౌమాధికారం అంతరించింది. అందువల్ల తాను సర్వతంత్ర స్వతంత్రుణ్ణి అన్నాడు. ఇండియన్ యూనియన్‌లో పాకిస్తాన్ ఏర్పరుస్తానన్నాడు. రాజ్యం ముస్లింలది అని వారిని రెచ్చగొట్టాడు. రజాకార్లను సృష్టించాడు. భారతదేశం నుంచి ముస్లిం శరణార్థులను రప్పించాడు. యు.ఎన్.ఒ. (U.N.O.)కు తన ప్రతినిధిని పంపాడు.

తెలంగాణా ప్రజలు దీన్ని సహించలేకపోయారు. కాంగ్రెస్ సహితంగా అన్ని పార్టీలు సాయుధ పోరాటం సాగించాయి. అపర రుద్రులుగా అవతరించారు.

1948 సంవత్సరపు కార్తీక పూర్ణిమ సాయంకాలం కొంతమంది మిత్రులం మా ఇంట్లో సమావేశం అయినాం. తెల్లవారి గ్రామంలో జాతీయ జండా ఎగరవేయాలని నిర్ణయించాం. అది పోలీసువారికి ఎలా తెలిసిందోగాని అర్ధరాత్రి సమయంలో మమ్ములను అందరిని అరెస్టు చేశారు. పోలీసు మొహితమీను నన్ను దుడ్డుకర్రతో విపరీతంగా కొట్టాడు. పోలీసు కస్టడీలో కొన్నాళ్ళు ఉంచారు. జేలుకు ఎందుకు పంపలేదో తెలియదు. కాల్చివేయాలనుకున్నారేమో అర్థం కాదు. మొత్తం మీద నేను తప్పించుకున్నాను. ఒక ప్రణాళిక ప్రకారం గ్రామస్తులు మా కుటుంబాన్ని అంతకు ముందే బెజవాడ పంపించారు. కొంతదూరం నడచి కొంత రైల్లో నేనుకూడా బెజవాడ చేరుకున్నాను. బెజవాడ దగ్గర "కేసరపల్లి"లో మా కుటుంబాన్ని ఉంచి నేను మునగాల పరగణాలో "సిరిపురం క్యాంపు" చేరుకున్నాను. అక్కడనుంచి సాయుధ పోరాటం సాగించాం.

నైజాం గవర్నమెంటు హోం సెక్రటరీ నన్ను రాజ్యంలో ఎక్కడ ఉన్నా అరెస్టు చేయవలసిందని వారెంటు జారీ చేశాడు. ఈ మధ్య ఆ వారెంటు కాపీ చూచినప్పుడు నిజంగా నేను అంత వయసులో అంత ఘనకార్యం చేశానా అని పించింది.

సర్దార్ పటేల్ హైద్రాబాదు రాజ్యం మీద పోలీసు చర్య జరిపించాడు. దక్షిణ పాకిస్తాన్ సృష్టిస్తానన్న నైజాం లొంగకతప్పలేదు.

పోలీసుచర్య జరిగింది. నైజాం భారతదేశంలో అంతర్భాగం అయిపోయింది. ఈ వార్త తెలిసినప్పుడు ఎగిరాం. గంతులువేశాం. కేకలువేశాం. నినాదాలుచేశాం. మిఠాయిలు పంచి పెట్టాం. ఆ ఆనందం ఆ తరానికే పరిమితం భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చినాడు మనసులోనే మురిసిపోయాం. కాని పోలీసుచర్య నాటి ఆనందాన్ని బహిరంగంగా అనుభవించాం. నైజాం విముక్తం అయింది. నరకుడు లొంగాడు. సుమారు దీపావళి జరుపుకున్నాం.

ఇది ప్రజావిజయం.

మా కుటుంబం కేసరపల్లిలో ఉండిందని ఇదివరకే చెప్పాను. సిరిపురం నుంచి కేసరపల్లివెళ్ళి కుటుంబయుక్తంగా గార్ల చేరేవరకు ఆలస్యం అయింది. అక్కడి పరిస్థితిచూస్తే ఆశలన్నీ అడియాస అయినాయి. కలలన్నీ కల్లలు అయినాయి. నేను నీరుకారిపోయాను.

అధికారపార్టీ కార్యాలయం స్థాపించారు. అందులో పూర్వపు దొరలు, బ్లాక్‌మార్కెటీర్లు, లంచగొండులు, పైరవీకారులు ఖద్దరుధారులలో ప్రత్యక్షం అయినారు. అప్పటికి ఇంకా పూర్తి ప్రభుత్వం ఏర్పడలేదు. వీరే ప్రభుత్వం చలాయించసాగారు. పచ్చినెత్తురు తాగిన రజాకార్లను లంచాలు తీసుకొని వదిలి పెట్టున్నారు. ధాన్యం దాచి ధర పెంచి అమ్ముతున్నారు. ఊళ్ళో తగాదాలను డబ్బు తీసుకొని పరిష్కరిస్తున్నారు.

నేను కార్యాలయానికి వెళ్ళాను. నన్ను లక్ష్య పెట్టలేదు. కనీసం గమనించ లేదు. గొర్రె కసాయివాణ్ణే నమ్ముతుంది. అలాగే వాళ్ళనే ప్రజలు నమ్ముతున్నారు. మొన్నటిదాకా తమవాణ్ణిగా చూచుకొని నన్ను ఆత్మీయునిగా చూచుకున్నవారు "మర్యాద"కు ఫలకరిస్తున్నారు. వారి చూపుల్లో "వీడు చేతకానివాడు" అనే భావం వ్యక్తం అవుతున్నది.

పోలీసుచర్య జరగ్గానే మద్రాసు రాష్ట్రం నుంచి అధికారులను పంపారు. వరంగల్లు జిల్లాకు "పళనియప్పన్"ను పంపించారు. వారు గార్ల వచ్చారు - మళ్ళీ ప్రభుత్వం యంత్రాంగాన్ని ఏర్పరచడానికి. వారు పెద్దమనుషులను పిలిపించి సమావేశం ఏర్పరచారు. అంతా నేను ఇదివరకు చెప్పిన ఖద్దరుధారులే ప్రత్యక్షం అయినారు. నేను కూడా వెళ్ళాను. పళనియప్పన్ గ్రామ పరిస్థితిని గురించి అడిగాడు. "అంతా సవ్యంగా ఉంది మహాప్రభో" అని చెప్పారు అంతా.

పళనియప్పన్‌కు కనిపించడానికి నేను కుర్చీ ఎక్కి నుంచున్నాను. సార్! వీళ్ళంతా నల్లబజారువారు. గింజదాచేశారు. అధికధరలకు అమ్ముతున్నారు. మీరు చౌక దుకాణాలు పెట్టించాలి, అని విన్నవించుకున్నాను.

నా మాటలకు అక్కడివాళ్ళు విరుగుడు చెప్పారు. పళనియప్పన్ పట్టించుకోలేదు. అప్పుడు నేను ఒక మహజరు తయారుచేశాను. వందల మందితో సంతకాలు చేయించాను. "చౌకదుకాణాలు కావాల" అని నినాదాలు చేస్తూ, స్టేషనులో కూర్చున్న "పళనియప్పన్"కు మహజర్ అందించాను.

"స్వాతంత్ర్యం రాకముందూ, వచ్చిం తరవాత అధికారులు ఒకే రకంగా ప్రవర్తిస్తున్నారు. ప్రజలను చూడండి. వారి నినాదాలు వినండి" అన్నాను.

ఇంత చిన్నవాడు ఇంతమందిని తీసుకొనివచ్చి ఇంత ధైర్యంగా మాట్లాడుతున్నాడని నన్ను మెచ్చుకున్నాడు "పళనియప్పన్". తెల్లవారి చౌకదుకాణాలు పెట్టించే ఏర్పాటుచేశారు. తరవాత దొంగచాటుగా రవాణా అవుతున్న 1800 జొన్నల బస్తాలు ప్రభుత్వానికి పట్టి ఇచ్చాను.

కలలు కన్న రాజ్యం కల్ల అయింది. ప్రజలకు మనతో పనిలేదు. మరిచిపోతున్నారు. కొత్తదొరలవెంట ఉరుకులు పెడ్తున్నారు. ఎవనికివాడు తన స్వార్థం చూసుకుంటున్నాడు. దేశాన్ని గురించి ఆలోచించేవాడులేడు. మనం చేసిన త్యాగాలు ఏమైనట్లు? జరిపిన పోరాటాలు ఏమైనట్లు? బలి అయిపోయిన అమాయకులు ఏమైనట్లు? ఎందుకు మనం పోరాటం సాగించింది అనే ఆరాటం పట్టుకుంది.

అప్పుడు మద్రాసు నుంచి "తెలుగు స్వతంత్ర" వారపత్రిక వచ్చేది. దానికి సంపాదకులు "ఖాసా సుబ్బారావుగారు". వారు తెలంగాణను గురించి ఒక సంపాదకీయం రాశారు. నేను అది చదివాను. "సుబ్బారావుగారికి తెలంగాణాను గురించిన వివరాలు తెలియవు" అని ఒక వ్యాసం రాసిపంపాను. సుబ్బారావుగారు సహృదయులు. మరుసటివారం వారి సంపాదకీయం ప్రక్కనే నా వ్యాసం స్వతంత్రలో వచ్చినందుకు నేను మురిసిపోయాను. అంతేకాదు, అనేకమంది అభినందిస్తూ ఉత్తరాలు రాశారు.

ఊరు, ఉద్యోగంలేని పరిస్థితిలో నా భార్య కమల కాపురానికి వచ్చింది. భార్యను పోషించడం ఎట్లా? పిల్లా జెల్లా కలిగితే వారి స్థితి ఏమిటి? ఆరో క్లాసులో చదువు వదిలి పెట్టాం. ఉద్యోగం ఎవడు ఇస్తాడు. ఈ ఆలోచనలతో సతమతం అవుతూ ఆంధ్రా మెట్రిక్యులేషన్‌కు కట్టాను. చెప్పే నాధుడులేడు. వచ్చింది మరచిపోయాను. స్వయంకృషితో మెట్రిక్ 1951వ సంవత్సరంలో పాసైనాను. ఒక టీచరు ఉద్యోగానికి ఒక రెవెన్యూ ఇన్స్‌పెక్టర్ ఉద్యోగానికి దరఖాస్తులు ఇచ్చాను.

ఆ రోజుల్లో విద్యావిధానంలో పెద్ద మార్పు వచ్చింది. ఉర్దూ మీడియం

పోయి తెలుగు మీడియం వచ్చింది. కాని తెలుగు మీడియంతో పాసైన ఉపాధ్యాయులు లేరు. అందువల్ల నాకు టీచరు ఉద్యోగం వెంటనే వచ్చింది.

రెవిన్యూ ఇన్స్పెక్టర్ కోసం నన్ను ఇంటర్వ్యూచేసింది "పళనియప్పన్". వారు వెంటనే ఉద్యోగం ఇచ్చారు. అందరూ గిర్దావరు ఉద్యోగానికి వెళ్ళమన్నారు. డబ్బు సంపాదించవచ్చని. డబ్బుమీద నాటికి, నేటికి అత్యాసలేదు. బి.ఎ కావాలని ఒక తృష్ణ ఉండింది. అది టీచర్ అవుతేనే సాధ్యం. ఇప్పటి వలె ఓపెన్‌యూనివర్సిటీలు, ఎక్స్టర్నల్స్ అప్పుడులేవు. టీచరుగా మాత్రమే ప్రైవేటుగా కట్టవచ్చు. నన్నప్పుడు టీచర్‌గా నేలకొండపల్లికి వేశారు. అక్కడ ఉపాధ్యాయ సంఘం ప్రారంభించాను. అధికారులకు కోపం వచ్చింది. "పమ్మి" అనే పల్లెకు వేశారు. అక్కణ్ణుంచి "గోకినేపల్లి" మిడిల్ స్కూలుకు వేశారు. నేను నా కార్యకలాపాలు మానలేదు. రైలు, బస్సు ఏది లేని "పెరుమాళ్ళ" సంకీసకు హెడ్‌మాస్టరుగా వేశారు. ఆ కుగ్రామంలో ఉండి "ఇంటర్" ద్వితీయ శ్రేణిలో పాసయినాను. అప్పుడు డోర్నకల్లు హైస్కూలుకు బదిలీ చేశారు. రెండు సంవత్సరాలు అక్కడ ఉన్నాను. స్కూలు అభివృద్ధి కోసం కృషిచేశాను. నేను బి.ఏ ద్వితీయ శ్రేణిలో పాసైనాను.

ఆ సమయంలో సికింద్రాబాద్ మున్సిపాల్ కార్పొరేషన్‌లో సూపరింటెండెంటు కావాలని ప్రకటన వచ్చింది. దరఖాస్తు పెట్టాను. ఆ ఉద్యోగం వచ్చింది. ప్రస్తుతం అసిస్టెంట్ కమిషనర్‌గా హైదరాబాదు కార్పొరేషన్‌లో పని చేస్తున్నాను.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడింతరవాత 1957వ సంవత్సరం నేను కార్పొరేషనులో చేరాను. మేము బట్టల బజారులో ఉండేవాళ్ళం. దాన్నే పూర్వం పొగాకు బజారు అనేవారు. మహాత్మాగాంధీరోడ్డు క్లాక్‌టవర్ పక్కన "స్వతంత్ర" వారపత్రిక కార్యాలయం ఉండేది. దానికి గోరాశాస్త్రిగారు సంపాదకులు. మా ఇల్లు స్వతంత్ర కార్యాలయం దగ్గరలో ఉండడాన గోరాశాస్త్రితో పరిచయం ఏర్పడింది.

పది సంవత్సరాల నిరంతర కృషి తరవాత జీవితంలో కొంత స్థిరత్వం ఏర్పడింది. నాలో ఉన్న రచయిత మేల్కొన్నాడు. ఏదైనా రాయాలనే తపన, తృష్ణ ఏర్పడింది.

దేశానికి రాజకీయ స్వాతంత్ర్యం వచ్చింది. దేశం ప్రగతి పథాన సాగింది. కాని వాటి ఫలితాలు సామాన్యులకు అందడంలేదు. రాజకీయాల్లో నిజాయితీ లోపించింది. లంచగొండితనం, బంధుపక్షపాతం, ముఠా రాజకీయాలు వీరవిహారం చేయసాగాయి. వీటిమధ్య మనం "ప్రజలు" అనుకునే సామాన్యుడు నలిగి నశిస్తున్నాడు.

నలిగే సామాన్యుణ్ణి గురించి, దిగజారుతున్న నైతిక విలువల గురించి రాయాలనుకున్నాను. ఏ పద్ధతి అవలంబించాలో అర్థంకాలేదు. చాల తపన తరువాత ఒక నిశ్చయానికి వచ్చాను.

స్వాతంత్ర్య సముపార్జనకు ముందు రాజకీయాలలో ఉన్న ఇద్దరు వ్యక్తులను గురించి ఊహించాను - ఒకతను అధికారం సంపాదించుకోగలిగాడు. అతడు

రాజకీయాల్లో ఉన్నాడు. అందువల్ల స్వంతభావాలు అతనికి ఉండవు. అతడు భావ దాసుడు.

స్వాతంత్ర్య సముపార్జనకు సర్వం త్యాగం చేసిన మరో వ్యక్తికి పదవి దొరకదు. అతనికి రాజకీయపక్షం లేదు. కావున అతనికి భావదాస్యంలేదు. జీవనకోసం దేహదాస్యం తప్పదు.

పదవిలో ఉన్నవాడు పదవిలేనివాడు మిత్రులే. దేహదాసు దేశపరిస్థితిని చూచి ఏడుస్తాడు. పాదచారిగా సంచారంచేస్తూ సామాన్యుల పరిస్థితిని గురించి భావదాసు గారికి ఉత్తరాల ద్వారా తెలియపరుస్తుంటాడు.

ఈ ఆలోచన వచ్చిన తరువాత "దేహదాసు" ఉత్తరాలు రాయడం ప్రారంభించాను. వాటిని గోరాశాస్త్రిగారు సుమారు ప్రతివారం ప్రకటించారు. ఉత్తరాలకు ప్రోత్సాహం కూడా బాగా లభించింది. కొన్ని ప్రత్యుత్తరాలు కూడా వచ్చాయి.

ముప్పయి ఏండ్ల కాలం దొర్లిపోయింది. రాజకీయాలు మరీ కలుషితం అయినాయి. సామాన్య మానవుని నిజాయితిని కూడా శంకించేటట్లు చేశాయి. స్వార్థం పురివిప్పి నాట్యం చేస్తూంది. నీతి, నిజాయితి కనీసం పుస్తకాల్లో కని పించడం లేదు. ఆత్మీయత, అనురాగం, ప్రేమ, అభిమానం, స్నేహం, మైత్రి ఇలాంటి వానికి విలువ లేకుండా పోయింది. మానవత ఏమైందో వెదకాల్సిన పరిస్థితి ఏర్పడింది. అన్ని రంగాలలోనూ విలువలు దిగజారుతున్నాయి. ఎదుటి మనిషిని నమ్మడం కష్టం అయిపోతూంది. దేశంకోసం ప్రాణాలు బలి ఇచ్చిన భగత్ సింగ్ లాంటి కాలంనుంచి మనం ఇంత పతనం అయినాం. ఇంకెంత అవుతామో కనీసం ఊహించలేకుండా ఉన్నాం. ఈ పరిస్థితిని "జనపదం"లో చిత్రించాను.

ముప్పయి సంవత్సరాల కింద రాసిన ఉత్తరాలను నేను మరచిపోయాను. అవి తొలి రచనలు. వాటిని ప్రచురించాలనే ఆలోచనే రాలేదు. ఈ మధ్య మిత్రుడు డాక్టరు సాందీప్ ఆ ఉత్తరాలు చదవడం సంభవించింది. వాటిలో ఏదో "విలువ" ఉందని గౌతమి ఎడ్యుకేషన్ సొసైటి ద్వారా ఈ ఉత్తరాలను ప్రచురిస్తున్నారు. ఇంతకు ముందు "పరిశీలన" పేరుతో నా వ్యాస సంకలనాన్ని సాందీప్‌గారు ప్రచురించారు.

ఈ పుస్తకం ప్రచురిస్తున్నందుకు డాక్టర్ సాందీప్ గారికి హృదయ పూర్వక కృతజ్ఞతలు తెలియపరుస్తున్నాను.

ఉత్తరాలు మీ ముందు ఉన్నాయి. బాగోగులు మంచి చెడ్డలు నిర్ణయించ వలసింది మీరు.

మారెడుపల్లి
సికింద్రాబాదు-500 020
1-8-1987

దాశరథి రంగాచార్య

ఉత్తరం (1)

# పాదయాత్ర

భావదాసుగారికి నమస్సులు :

మీతో సెలవు పుచ్చుకోక తప్పనందుకు మిక్కిలి విచారంగా ఉంది. మీరు వాయుయానం చేయగలిగినా మేము భావయానం మాత్రమే చేయాల్సి ఉంది. కాబట్టి మట్టి కొట్టుకునే గుంతల రోడ్డుపక్క చెట్టు కింద గంటన్నర వేచియుండక తప్పిందికాదు. బస్సులు జాతీయం చేయబడ్డకారణంగా గంటసేపు వేచియున్నాక ఒక బస్సువచ్చినా "ఈ హీనునికోసం ఆగనా" అనే ప్రభుత్వగర్వంతో కళ్ళలో దుమ్ముకొట్టి తుస్సున వెళ్ళిపోయింది. మళ్ళీ గంటగ్గాని బస్సు లేదు. ఈలోగా ముంద్రానుంచి మిగులు బడ్జెట్లదాకా ఏవేవో ఆలోచనలు మెరుస్తుండగానే బుస్సున బస్సువచ్చి (నాకోసం కాదు సుమా) ఇద్దరి భారం దింపుకోడానికి ఆగింది. ధాన్యాగారాల్లో ధాన్యం ఇలాగే నింపుతారని ఇన్నాళ్ళ తర్వాత మళ్ళీ కార్పొరేషను వారు చూపగలిగినందులకు వారికి నా కృతజ్ఞతలు. "ఫుట్‌బోర్డు మీద ప్రయాణీకులు నిలువరా"దనీ ముచ్చటైన పచ్చని ఫలకాన్ని కప్పేట్టు యూనిఫారంలో ఒక చక్కని సబిన‌స్పెక్టరు ఫుట్‌బోర్డు మీద నిల్చొని ఆ ధాన్యాగారం నుంచి దిగేందుకు సగర్వంగా అనుమతించారు. రెండు సంచులు దిగుతూనే ప్రజా ప్రభుత్వం ప్రసాదించిన భావ ప్రకటనా స్వాతంత్ర్యాన్ని వృధాపోనీయకుండా అటు ప్రభుత్వాన్నీ ఇటు కార్పొరేషనునూ కఠినంగా తిట్టు—కాదుకాదు—విమర్శించు కుంటూ ఆ యుద్ధరంగం నుండి బైటికి రాగా చిరిగిపోయిన బట్టలవైపు చూసుకుంటూ మూటముల్లె సద్దుకొని జొన్నచేల వైపు నడక సాగించారు. ఇద్దరు దిగిపోగా ఎక్కినవాడు ఒక్కడేగదా అనే సంతోషంతో ఒక్కసారి మోత మోగించి కదిలింది నడిచే గరిసె. ఎక్కేదాకా అందరూ నాలాగే తహతహలాడుతుంటారు. ఇక ఇప్పుడు సాగించారు, వారి వాక్స్వాతంత్ర్యాన్ని సార్థకం చేసుకోవడం. నేనూ తీసిపోలేదనుకోండి! సహనశీలయైన పోలీసు ఆఫీసరు మౌనముద్ర వహించి ఊరుకున్నారు. గాంధీరాజ్యంగదా అమాత్రం సహనం లేకుంటే ఎలా మరి! కొంత దూరం పోయినాక మా వాహనానికి విశ్రాంతి కావలసి ఆగిపోయింది. అవును

కార్మిక శాసనం ప్రకారం పని చేయవలసింది 8 గంటలే ఐతే పాపం దానితో 10 గంటలు పని చేయిస్తే అది సమ్మె చేయక ఏం చేస్తుంది? మోసే వాళ్ళు కొందరు మోయబడేవాళ్ళు కొందరూ ఉండే అసమానతలను రూపుమాపడానికి కంకణం కట్టుకున్న మా సామ్యవాద పక్కి సమాజంలో ఇంతసేపు మమ్మునెట్టుకొచ్చిన వాహనాన్ని మేము నెట్టే అవసరం కల్పించే హక్కు తనకూ ఉందని తెలిసే గామాలు ఆ వాహనం తన హక్కును వినియోగించేందుకు సమ్మె చేసింది. స్వయం పోషకత్వాన్ని ఉగ్గుపాలతో నూరి పోసిన సమాజంలో వాహనాన్ని నెట్టడం పెద్ద ఏహ్యమైన పనేమీ కాదు. అందులో ఈ బస్సులు ప్రభుత్వానివి. ప్రభుత్వం ప్రజలది. అంటే మనం మనను నెట్టుకుంటున్నట్లేగా అర్థం. కొందరు హుందావాళ్ళు మాత్రం తమను తాము నెట్టుకోవడం చేతకాక బస్సులోంచి దిగలేదు. మా సబిన్స్పెక్టరు తన డ్రెస్సు నలిగిపోతుందేమోనని దూరంగా నిల్చొని యుద్ధం చేస్తున్నట్లు "ఇదిగో ఇలా నెట్టండి ఇలా" అంటూ చేతుల్తో చూపిస్తున్నాడు. "ఆ లోపలకూచున్న వాళ్ళేం మొనగాళ్ళా? వాళ్ళుమాత్రం ఎందుకు నెట్టరు" అని కేకలేస్తూనే మా వాళ్ళు వాహనాన్ని నెట్టుంటే లోపల కూర్చున్నవారు, ఈ మాటలు తమని గూర్చినవి కావన్నట్లే హాయిగా పిచ్చా పాటి మాట్లాడుతున్నారు. తాత్కాలిక సహాయం లభించింది గదా అని బస్సు బుర్రుమన్నది. మేమంతా తుర్రున దూరాం. బస్సు పెద్దగా మూలుగుతూ కదిలింది. అలా కొంతదూరం పొయ్యామో లేదో ఫుట్బోర్డు మీద నుంచున్న సబిన్స్పెక్టరు ముళ్ళేదో క్రింద పడ్డట్లు "హోల్డ్ ఆన్" అని కేక వేశాడు. బస్సు ఆగింది. మేం తొందరగా వెళ్ళాలని కొందరూ, ఆలస్యమైపోతూందని కొందరూ, రైలు వెళ్ళిపోతుందని కొందరూ గోల మొదలు పెట్టారు. ఇవన్నీ ఏమీ లక్ష్యం చేయనట్లే సబిన్స్పెక్టరు దిగి అటు పక్కగా వస్తున్న ప్రైవేటు బస్సునాపి అందులో వున్న సీట్లకంటె ఇద్దరు ప్రయాణీకుల్ని ఎక్కువగా ఎక్కించినందుకు ఆ డ్రైవర్పై మామీద ఉన్న కోపం చక్రవడ్డీతో సహా చెల్లించి అతని లైసెన్సు లాక్కొని తనను పోలీసుస్టేషనులో కలుసుకోమని చెప్పి విజయగర్వంతో బస్సెక్కి "రైట్" అన్నాడు. బస్సు మూలుగుతూ ముక్కుతూ ఏడుస్తూ గమ్యం చేరింది. బస్సు ఆగగానే సబిన్స్పెక్టరు దిగి దూరంగా నుంచున్నాడు. అతని స్థానం కండక్టరు ఆక్రమించాడు. దిగేవాడి దగ్గరల్లా డబ్బు వసూలుచేసి సంచిలో వేసుకోవడం మొదలుపెట్టాడు. నేను టికెట్టు ఇస్తే కాని వల్ల కాదని పట్టుపట్టాను. ఇద్దరికీ ఘర్షణ సాగింది. లోపలినుంచి జనమంతా "పెద్ద వచ్చాడయ్యా మొనగాడు మాకు రైలు తప్పిపోతుంది. ఎవరికైతేనేం డబ్బియ్యా -నికి అతను మాత్రం గవర్నమెంటు మనిషికాదూ" అంటూ గొల్లుమన్నారు జనం. అప్పుడుగాని నేను రైలుకెళ్ళాలనే విషయం గుర్తుకొచ్చింది కాదు. రూపాయి కాగితం కండక్టరు మొఖాన కొట్టి దిగి గబగబా స్టేషన్ వైపు పరుగెత్తాను.

స్టేషన్ నిండా జనం. పీక్కుపోయిన కండ్లూ, తోక్కుపోయిన చెంపలూ, ఎండిపోయిన పెదవులూ, రేగిపోయిన జుట్టూ, పీక్కుపోయిన డొక్కా, మాసి పోయిన చొక్కా, పెరిగిపోయిన గడ్డాలతో జనం స్టేషన్ నిండా కిటకిటలాడు తున్నారు. ఎవర్ని చూసినా రైల్వే డిపార్టుమెంటునో, ప్రభుత్వాన్నో స్వేచ్ఛగా తిడుతున్నవారే. ఎవర్నడిగినా సరియైన సమాధానం చెప్పందే. "ఆ తెల్లోడు పోయినకాణ్ణించి ఈ ముదనష్టపు రైళ్ళకు ఇదో రోగం పుట్టింది. నల్లోనికి రైలు నడపొస్తదా?" అనే వాళ్లేగాని అసలు విషయం తెలిసిన వాళ్ళేవరూ కనిపించలా. వీటన్నిటినీబట్టి చూస్తే ధూమ శకటం ఎక్కడో నిరశన వ్రతం పట్టిందని ఊహించా. ఇంత కాఫీ వేస్తేగాని వెధవ మెదడు పని చేసేట్టు లేదు. దానికి లంచమే కావాలి. గబగబా రిఫ్రెష్‌మెంట్ రూముకు పరిగెత్తా. రాళ్ళ ఉప్మా తిని నీళ్ళ కాఫీ మింగి మేనేజరును ఈ అన్యాయానికి కారణం అడిగి "ఇష్టమైతే తాగు లేకపోతే మానుకో" అని కసిరింపించుకొని చేసేది లేక మామూలు కంటే అణా ఎక్కువ తగలేసి (మొత్తం తగలేసేదేగా అణా ఎక్కువేస్తే వచ్చే నష్టంలేదని) సిగరెట్లుకొని ఆనాడు గాంధీజీ వదిలిపెట్టిన విదేశీ వస్తుదహనం నేటికి అక్షరాలా పాటించి రైలు విషయమై ఆరా తియ్యటం ప్రారంభిస్తే తెలిసిన విషయం ఇది.

ఇవ్వాళ ఉదయం ఫలానా ఫలానా స్టేషనుల మధ్య నడుస్తుండగా — కాదుకాదు పరుగెత్తుతుండగా — గోమాత పుత్ర సమేతమై అయో మార్గ మధ్యంలో నిలబడ్డంచూసి ధూమ శకట చోదకుడు భారతమాత కపర రూపమైన గోమాతను చంపడంవల్ల గోహత్యా పాతకం అంటుకుంటుందని భయకంపిత హృదయుడై ధూమ శకటంబునాపి గోమాతను పూజించి దాని నావలకు పార ద్రోలి శకట చోదనకుం దగులుకొనియె. ధూమ శకటం బాలస్యమైన భారతాభివృద్ధి ప్రణాళిక వెనుకబడునను భయాందోళిత హృదయుడై శకటంబును వాయు వేగంబున నడి పించుచు గోమాతను రక్షించి అహింసా వ్రత పిశాచియైనందుకు ఆనందకందళిత హృదయుండై గోమాత ధ్యానమున నుండ ధూమ శకటంబు సహితంబు, అనాది సంక్రమిత హరిచరణారవిందములందు ధ్యానముంచి మనోవేగంబుతో పరుగెత్త సాగ కర్మవశంబున వారధికాహారంబు లభించక శల్యావశిష్టయై ప్రవాహవేగంబు లెదిరించలేక విజితయైయున్నను పరాయత్త చిత్తులైన శకట సారధులు 200 మందిని గంగామాత కర్పించి వారికి రంభా సాంగత్యావకాశము కల్పించియు ఇంకనూ అనేక మంది పామరులను గడతేర్చుటకు తాము మాత్రము సురక్షితముగా ఇహ లోకముననే నిలిచి పోయినందున ధూమ శకటములు తిరిగి ఏదినంబు నుంచి నడువ ప్రారంభమగునో తెలియరాకుండె.

రైలు ప్రమాదం సంభవించినట్లు తెలియగానే హుటా హుటిగా మంత్రు లందరూ హృదయవిదారక దృశ్యములను చూడ్డానికి విచ్చేశారట. రైల్వే మంత్రి గారు ఆ సంఘటనకు తమ సంతాపాన్ని వెలిబుచ్చుచుండగా అక్కడ చేరిన ప్రజ

ల్లారు. "గౌరవనీయులైన మంత్రివరేణ్యా! తాము ఏ తాదృశ ప్రమాదంబులు సంభవించినపుడెల్ల సంతాపంబు ప్రకటించుచుండ తిరిగి తిరిగి ప్రమాదంబులు సంభవించుచున్నవిగాన దయతో ఈ తడవ తమ సంతోషంబు ప్రకటించ ప్రార్థితులు" అని ఈ విధంగా సచివ శేఖరులు ప్రమాద కారణాలన్నిటినీ గుర్తెరిగి ఇలాంటి ప్రమాదం సంభవించినందుకు శోక సభలో (ప్రజల అభీష్టానుసారం) సంతోషం ప్రకటించారని తెలియవచ్చింది.

ఇంక రైలు ప్రయాణం ప్రాణాపాయకరమనీ, భారత భూమిలాంటి సనాతన భూమిలో అప్రాచ్యుల ప్రభుత్వం వచ్చేవరకూ కాలి నడకనే ప్రయాణాలు సాగిస్తూ ఉండేవారనీ నడమంతరపు రైళ్ళు రావడం వల్లనే ఇన్ని అవాంతరాలు సంభవిస్తున్నాయనీ గాంధీజీ ప్రియ శిష్యులైన భారతీయ సంస్కృతికి ఏకైక ప్రతినిధులైన శ్రీశ్రీ వినోబాజీ అడుగు జాడల్లో నడువ నుంకించి పాదయాత్ర సాగిస్తున్నాను. అక్కడక్కడి విషయాలు అప్పుడప్పుడు తెలియజేస్తుంటాను.

ఉత్తరం ఆలస్యమైనందుకు మన్నించ ప్రార్థన.

భవదీయుడు

'దేహదాసు'

ఉత్తరం (2)

# ప్రజారహిత పార్టీ

భావదాసుగారికి

నమస్సులు

ఈ మధ్య పత్రికల్లో ఒక వ్యాసం చదివాను. అది తమాషాగా ఉంది. కాబట్టి దానిని ఇందులో జతపర్చి పంపుతున్నాను. మీకేమైనా ఉపకరిస్తుందేమో చూడండి.

భవదీయుడు

'దేహదాసు'

ఇటీవల కంఠ శోషలిస్టు పార్టీ ప్రారంభోత్సవం మహా వైభవంగా జరిగిందని తెలియ వచ్చింది. ఈ సమావేశానికి దేశం నలుమూలలనుండి ప్రేక్షకులను ఆహ్వానించడానికి ఆంగ్లాంధ్ర ద్రవిడ వంగ ఉత్కళాద్యనేక పత్రికలలో చేసిన ప్రకటనకు గాను ఒక్కలక్ష రూపాయలు మాత్రం ఖర్చు పెట్టబడినట్లు లాబీ వర్గాలవారు అంటున్నారు. అయినప్పటికీ సామాన్యులు రాలేకపోయినా కార్లలో వేంచేసిన కోటీశ్వరులు వేయికి పైగా హాజరైనట్లు ఆ సమాజ సభ్యుల యాజమాన్యాన నడిచే సమస్త అఖిలభారత పత్రికలూ పతాక శీర్షికల్లో ప్రకటించాయి. అయితే ఒక్క సున్నా మాత్రమే యెక్కువ పడి వుంటుందని విశ్వసనీయ వర్గాల ద్వారా తెలియవచ్చింది.

మన దేశం భారీ అడుగులు వేస్తూ సోషలిస్టు ఫక్కీ సమాజం వైపు పరిగెత్తి చూస్తున్న ఈ శుభసమయంలో కోటీశ్వరులు ఈ కంఠ శోషలిస్టు పార్టీ స్థాపించడం యెంతో ముదావహం అని రాజధానిలో అనుకుంటున్నట్లుగా తెలియ వచ్చింది. కోటీశ్వరులు సైతం తమ ఆస్తికి తాము ధర్మకర్తలు మాత్రంగానే భావించిన మన సనాతన సమాజంలో నేటి కోటీశ్వరులు సైతం ముందంజ వేయడాన్ని మున్షీ లాంటివారు మిక్కిలిగా మెచ్చుతున్నట్లు కూడా వినికిడి. ఇలాంటి సత్కార్యానికి పూనుకున్నందుకు అనేక మంది మహా మహులు సంతోష సందేశాలు పంపినట్లుగను, వాటన్నింటినీ మువ్వన్నెముద్రలో ఆర్టు పేపరు మీద అందంగా అచ్చొత్తించి జనాభా పట్టిక ప్రకారం అఖిలభారత ప్రజానీకానికి అందజేయడం కారణంగా, చిత్తుకాగితాల వ్యాపారస్తులకు గిరాకీ హెచ్చి కాగితం చౌక అవుతుందని ఒక వ్యాపారవిలేఖరి భోగట్టా. అయినప్పటికీ ఆ పార్టీలో సభ్యులు కావడానికి ముందుకు రానందున అస్మదాదులకు ఏదో ముట్టచెప్పినందున వారి మేలు మరువలేక అందరికీ యెరుక పర్చేందుకుగాను అందుకు సంబంధించిన నియమ నిబంధనలు యిందు మూలంగా తెలియ పర్చబడుతున్నాయి. (దీనిని అడ్వర్టైయిజ్‌మెంటుగా భావించకుండా వుండగలందులకు రెండింతల చార్జీ చెల్లించబడింది) సభ్యులుగా చేరదల్చుకున్న వారెల్లరూ తమ ఆమోదం తెలియపరుస్తే (ఇదివరకే స్వంత వేలిముద్రల్తో చేర్పించిన సభ్యులు గాక) అన్ని ఖర్చులూ పార్టీవారు భరించడమే కాక కృతజ్ఞతా సూచకంగా కొంత వ్యయం (రహస్యంగా) ముట్టచెప్పుకోవడం కూడా జరుగుతుంది.

ఈ పార్టీ పేరు కంఠ శోషలిస్టు పార్టీ. అవసరాన్ని బట్టి పేరు మార్చుకునే హక్కు స్థాయీ సంఘానికుంటుంది. స్థాయీసంఘంలో కనీసం కోటికి తక్కువ ఆస్తిలేని వారిచే యెన్నుకోబడిన పదిమంది సభ్యులుంటారు.

ప్రధాన కార్యాలయం నల్లబజారు నగరంలో వడ్డీ వీధిలో వుంటుంది. శాఖా కార్యాలయాలు సమస్త భారతదేశంలోనూ ఒకనికంటే ఎక్కువ సభ్యులున్నచోటల్లా వుంటాయి.

జాతి, మత, కుల, వర్గభేదం లేకుండా అందరూ ఇందు సభ్యులు కావచ్చు. అయితే కనీసం ఈ దిగువ అర్హతలుండడం అవసరం.

(1) ప్రతీ సభ్యుడూ కనీసం లక్ష రూపాయల ఆస్తిపరుడై వుండాలి. ఆ లక్షా ఎలా సంపాదించాడో ఆ కిటుకును అతి రహస్యంగా ఉంచాలి.

(2) 1947కు ముందు కాంగ్రెసువాదియై ఉండరాదు.

(3) అమ్మకం పన్ను, ఆదాయం పన్ను ఇత్యాదులు ఎగవేసే టెక్నిక్ మాత్రం తెలిసి ఉండడంకాక కనీసం పదివేల రూపాయలు ఎగవేసినట్లు సాక్ష్యాధారా లుండాలి.

(4) ప్రభుత్వానికి కనీసం లక్ష రూపాయిల దొంగ షేర్లు అమ్మగల ధైర్యం ఉండాలి.

5) తమ క్రింది కార్మికులు వగైరాలు సమ్మె చేసినప్పుడు వారిని ఎదుర్కోవ డానికి నష్టాన్నైనా భరించి దేశ సౌభాగ్యానికి కృషిచేసే ఔదార్యం కలిగి ఉండాలి (ఇత్యాదయః)

వ్యక్తి స్వాతంత్ర్య వ్యాపార స్వాతంత్ర్యాదుల సంరక్షణకు కంకణం కట్టు కోవడమేకాక ఇంకా ఈ దిగువ ఆశయాలకోసం ఈ పార్టీ పాటుపడుతుంది. ధనికులు తమ డబ్బును పెంచుకునే స్వాతంత్ర్యాన్ని రక్షించడం. పేదవానికి తిండి లేక పోవడానికి వాడి పూర్వజన్మ సుకృతమే కారణమని భారీయెత్తున ప్రచారం చేయ డానికి శక్తివంచన లేకుండా కృషి చేయడం. రైల్వే ప్రమాదాలు ఇన్స్యూరెన్స్ కార్పొరేషన్ గూడుపుఠాణీ ఇత్యాదులవల్ల ప్రభుత్వ కంపెనీల బలహీనత బట్ట బయలు చేసి ప్రైవేట్ వ్యాపారాభివృద్ధికి ప్రభుత్వం నుంచి వడ్డీలేకుండా అప్పు పొందటానికి ప్రయత్నించడం. భూమి పంపకం వగైరా హింసా విధానాలను వ్యతిరే కిస్తూ భూదానోద్యమంలాంటి శాంతియుతమైన ఉద్యమాలకు శాయశక్తులా సహాయం చేస్తూ శాంతియుతంగా ఒకటి రెండు శతాబ్దాల తరువాత మాత్రమే హృదయ పరివర్తన ద్వారా భూ సమస్యను పరిష్కరించడం.

ఈ పార్టీ కార్యకలాపాలుకూడా సంక్షిప్తంగా నివేదిస్తాను.

కనీసం నెల కొకసారి ఈ దేశంలోని వివిధ ప్రదేశాల్లో ఇలాంటి సమావేశా లేర్పరచడం. ఈ పార్టీ ఆదర్శాలను ఆచరణలో పెట్టడానికి అవసరమైన రీసర్చికి భూరిగా ధనం ఖర్చు పెట్టడమేకాక సాధ్యమైనంతవరకూ గొప్పగొప్ప వారితో ఉపన్యాసా లిప్పించడం, సాధ్యమైనంతవరకు ఇతర దేశాలనుంచి ఉపన్యాసకులను పిలిపించడం. ఈ దేశంలో అన్ని భాషల్లోనూ మంచి మంచి రచయితల్ని పోషిస్తూ, పత్రికలు ప్రకటించి ఉచితంగా పంచిపెట్టడం. గ్రంథాలయాలు వగైరాలు స్థాపించడమేకాక సిలోన్ రేడియోద్వారా ఇందుకు గురించి ప్రచారం చేయడం. కవులు, రచయితలు మున్నగువారికి విరాళాలిచ్చి, వారు పెడమార్గం పట్టకుండా చూడడం.

**కాన అందరూ ఈ పార్టీలో చేరి మమ్ము ప్రోత్సహించ ప్రార్థితులు.**

ఉత్తరం (3)

# బాటల మాటలు

శ్రీ భావదాసుకు నమస్సులు. సర్వోదయ పాత్ర ఆవిష్కర్త అడుగుజాడలో నడువ నుంకించి పాదయాత్ర సాగిస్తున్నానని యిదివరకే మనవి చేశాను. వెంట పది బండ్లు, శిష్యవర్గం లేనివాణ్ణి కావడంచేత కలవారి ప్రతినిధినైన దరిద్రనారాయణుణ్ణి కాకపోవడం చేతా ఏక భుక్తం సదారోగ్యంగా రోజులు వెళ్ళి పోతున్నాయి. మా సనాతన రుష్యాదులు వందలేండ్లు ఉపవాసాలుండి ఆత్మశక్తి నార్జిస్తే, నేను ఈ తపస్సు ద్వారా ఆహారం పొదుపు చేస్తున్నానని సంతృప్తి చెందుతున్నాను.

మా సమాజానికి హృదయాలు విశాలమైనవి కానీ మార్గాలు మహా సంకుచితాలైనవి. అలాగే మా బాటలు సైతం బహు సంకుచితాలు. జీవితపు ఒడిదుడుకుల పాఠం నేర్పేందుకు మా బాటలు మిట్టపల్లాలే. బాటలు విశాలంగానూ, సాఫీగానూ ఉంటే పల్లె ప్రజలు దారిద్ర్యంతో అనుభవిస్తున్న ఆత్మానందం పట్టణాలకు ఎగుమతి అవుతుందేమోనని భయంతో వాటిని యథాతథంగా ఉంచడానికి అవసరమైన జాగ్రత్తలన్నీ తీసుకొనబడుతున్నాయి. ఈ దేశంలో నడిచేవాళ్ళు ఎక్కువ ఉండడం చేత బహుజన సౌలభ్యానికై భగవంతుడు అనేక కాలి బాటల్ని వేశాడు.

నడిచీ నడిచీ కాళ్ళు పీక్కుపోతూంటే, ఊళ్ళో ధాన్యం కరువుగా వున్నందున, పట్నానికి ధాన్యం చేరవేస్తున్న బండి కనిపించింది. ఆ బండి మనిషి నన్నుచూచి జాలివేసి ఎక్కించుకున్నాడు. గమ్యంలేని నేను బండెక్కాను. అతిథి మర్యాదకు అసమానమైన మా సమాజంలో ఇంటివాణ్ణి చంపైనా అతిథిని గౌరవించడం ఆచారం.

ఎద్దులు చచ్చేట్టున్నాయి. ఎముకలు వెళ్ళి పుల్లలలా ఉన్నాయి. ప్రాణం ఏకోశాన ఉందో తెలియదు. మా బండిమనిషి వాటిమీద యుద్ధం ప్రారంభించాడు. తోకలు మడిచీ, తోళ్ళూడగొట్టి పరిగెత్తించాలని విఫల ప్రయత్నం చేస్తున్నాడు. బండిని మోటార్లా పరిగెత్తించాలని చేసే ప్రయత్నం స్పుత్నిక్ యుగంలో అంబర్ చర్కాతో గుడ్డ సరఫరా చేయడంలా అనిపించింది. దారినిండా గులకరాళ్ళు. బండి పరిగెత్తుతూంటే ఎగరేస్తుంది, పేగులు కదిలి పోతున్నాయి. అయినా ఎడ్లు పరిగెత్తాల్సిందే.

ఎద్దులు పరుగెత్తుతున్నాయి. బండి సాగుతుంది. నా శరీరం నుసి అవుతూంది. ఒక పెద్ద ఇసుక పర్ర వచ్చింది. ఎడ్లు నడవలేకపోతున్నాయి. బండి మీద ఉండి ఎద్దులను సాధించే ప్రయత్నంలో విఫలుడైన శకట చోదకుడు బండి దిగాడు, లాగుతున్నాడు. ఒక్క అడుగుకంటే ముందుకు వేయడం లేదు ఎడ్లు. ఇద్దరమూ చెరొక చక్రం పుచ్చుకున్నాం. కదిలిస్తున్నాం. ఇక సాగలేదు. ఎడ్లు కూలబడ్డాయి. ఉన్న కర్ర విరిగిపోయింది. ఇక దెబ్బలతో ప్రయోజనం లేదు. ఎద్దులను విప్పాడు. బైటికి తోలుకొని వెళ్ళాడు. కట్టేశాడు. ఇద్దరం చెరొకవైపు పట్టుకొని లాగుతున్నాం. లాగాలి మరి. తిండి లేకుండా బ్రతుకు లాగేవాళ్ళెంత మంది ఈ దేశంలో! ఒక పర్వతాన్ని మోసుకుపోయినట్లు దాన్ని ఒడ్డుకుచేర్చేవరకు తల ప్రాణం తోకకు వచ్చింది. బండిని చూచి ఈ భారం మళ్ళీ మామీద వేస్తారా అని జాలిగా చూసినై ఎడ్లు. ఏంచేస్తాం గత్యంతరం లేదు. రేపు వచ్చేవాడు సైతం కూలి చేయకుంటే కూడు దొరకదు.

బండి సాగుతూంది. చరచరా చీమలా నడుస్తూంది. మా ప్రణాళికలా. అది విమానంలా పోతుంది – భ్రమపడుతున్నాడీ అమాయకుడు. మళ్ళీ సాగింది ఎద్దుల్ని కొట్టడం. చర్మం లేస్తుంది. కాని ప్రాణంలేదు - కదిలేట్టు లేవు - అయినా నడుస్తున్నాయి బండి మనిషి వాటిని తిడుతున్నాడు. కొడుతున్నాడు. అహింసను అక్షరాలా పాటిస్తున్నాడు. వాడి మాటకు అక్కడ తిరుగులేదు. ఎడ్లు తిరుగుబాటు చేయలేవు. నాకు జాలివేసింది. అలా కొట్టవద్దన్నాను, హనుమంతునిలా లంఘించాడు. "కొట్టకుంటే మాట యింటాయండీ ఎడ్లు?" గప్‌చిప్. రెండు చేతులా నోరు మూసుకున్నాను.

బండి సాగుతూంది. అమాంతంగా దారి పక్కనే నందీశ్వరుని విగ్రహం కనిపించింది. ఎద్దులను "నీ తల్లీ! నీ అమ్మా!" అని పది తిట్లు తిట్టి, పగ్గాలు నా చేతికిచ్చి బండి దిగాడు. తలగుడ్డ తీసి, చెప్పులు విప్పి మహా భక్తిగా నందీశ్వరుని దగ్గరకు వెళ్ళి సాష్టాంగ దండప్రణామం చేశాడు. చెంపలు వాయించుకొని, కొంతసేపు కళ్ళుమూసుకొని ధ్యాన నిమగ్నుడై, మళ్ళీ అక్కడినుంచే ఎద్దుల మీదకు లంఘించాడు. ఈ బండి ఎద్దులుకూడా అమాంతంగా రాతివైపోతే! వాటికి దండం పెట్టించుకునే అదృష్టం కలిగేదికదా! ప్రాణం ఉన్నన్నాళ్ళు ఈ సమాజంలో దేవునికి సహితం గౌరవం లభించదు. చస్తే రాతి విగ్రహాలు ప్రతిష్ఠించబడతాయి.

బండి పాకుతోంది. బాట మిట్టంగా ఉంది. గుట్టల్లా ఉన్న బాటగుండా ప్రాణం కొలుకుల్లో ఉన్న ఎద్దులు ఎక్కాలి. ఎక్కుతున్నాయి. బాట ఒడుదుడుకులుగా ఉంది. ఏ కొద్ది కదిలినా హోయి! కైలాసమో పరమపదమో చేరుకోవచ్చు. "ఏ పున్నాత్తుడూ గీదారికి గింత మన్నన్న యెయ్యడంటి. మా తాతల నాటి నుంచి గిట్టనే తగలబడ్డది గీబాట. బండిని పెమాదం నుండి తప్పించమనేగా నందీసురుని మొక్కుకుంట," అన్నాడు బండి మనిషి. అవును అంతా దేవుడు చేయాల్సిందే. మా మనుషులంతా దేవుని

మనుషులే. బండి ప్రమాద దశలోంచి సాగుతోంది. ఒక చక్రం రెండు-గజాల ఎత్తున ఉంటే, వేరొకటి రెండుగజాల కింద ఉంది. ఎడ్లు ఓర్పుతో నడుస్తూనే ఉన్నాయి. శిఖరానికి చేరాం. ఇంక బండి పల్లంలోకి దిగాలి. బండి జారుతూంది. ఈ తోపిడికి ఎడ్లు పరుగెడుతున్నాయి. ఇక్కడ ఎద్దులు పరుగెత్తితే ప్రమాదం. ఆపాలని బండి మనిషి విశ్వప్రయత్నం చేస్తున్నాడు. అవి ఆగేట్లు లేవు. బండి వేగంగా పోతూంది. మలుపొచ్చింది. రాయి తగిలింది. బండి పడిపోయింది. బండివాడు దూకాడు. నేను మాత్రం కిందపడక తప్పిందికాదు. నేను నన్ను సంబాళించుకోవడం ఎందుకని భారమంతా భగవంతునికే అప్పగించినా దెబ్బలు మాత్రం ఈ శరీరానికే తగిలినై.

బండి పడింది. మళ్ళీ ఆ కళేబరాల మీద పెట్టాలి. దానిలో ఎక్కి ఊరే గాలి. తప్పదు. భుజం మీద గుడ్డ వేసుకొని ఒక వైపు నుంచి బండి మనిషి నెట్టుతున్నాడు. రెండో వైపు నుంచి నేను లాగుతున్నాను. సముద్ర మథనమంత పని చేయగా బండి లేచింది. మళ్ళీ కాడి ఆ కంకాళాల మీద పెట్టబడింది. అప్పుడు మాకు మేమే సేవకులం. ఇప్పుడు మాకు సేవకులు ఎద్దులు. ఇంక వాటి మీద మా పెత్తనం. వాటి పరిస్థితి మాకవసరంలేదు. మా పని కావాలి — అంతే "ఎక్కుంరి, చూసినా గిట్ట ఎన్ని బండ్లు పడ్తున్నాయో లెక్కలేదాయె. ఒక్కదన్న కూసింత మట్టి పోసిన పాపాన పోడుండి!" అన్నాడు.

మా బండి సాగుతూంది. డబ్బు లేకున్నా మా ప్రణాళిక సాగినట్లే తిండి లేకున్నా ఎడ్లు లాగుతూనే ఉన్నాయి. బండి చెరువు కట్టమీద నుంచి పోతూంది. బాట సాపుగావుంది. పల్లెలంటే స్వర్గ సీమలనుకునే వారంతా కనీసం విమానాల మీద నుంచి ఈ దృశ్యం చూస్తే? అయినా వారికి తీరిక ఎక్కడుంది లేండి. పొదుపు ఉద్యమానికై విమానాల్లో తిరగడానికే సమయం చాలడంలేదాయెను.

చెరువులో ఒక్కచుక్క గూడా నీరులేదు. ఎండమావుల యినా ఏమీ కనిపించడంలేదు. చెరువు లోతట్టు భూమి సాంతం పగిలి బీటలు వారింది. పచ్చని చెట్టు ఒక్కటికూడా కనిపించడంలేదు. పట్నంవాసులకోసం గడ్డి పెంచడానికి చేసే కర్చు ఇక్కడ చేస్తే ఎన్నో జంతువులు బ్రతికిపోవును. మందలు మందలుగా పశువులు ఎర్రటి ఎండలో కాల్తున్నాయి. ఎముకల ప్రాణులకు చర్మం తొడిగినట్లున్నది. ఏ కోశాన ప్రాణం వున్నట్లు కనిపించదు. కాకులు వాటిని మృతకళేబరాలనుకొని పొడుస్తున్నాయి. వాటిని అదలించే శక్తి సైతం వాటి దగ్గర లేదు. దప్పి, ఆకలి, అరుస్తున్నాయి. ఆదుకునే నాథుడు లేడు. నేల నాకుతున్నాయి. దూడలు ఎండ మావుల్ని చూసి పరిగెత్తుతున్నాయి. ప్రణాళికలను చూసి మురిసిపోయే మా ప్రజల వలె కొమ్ములతో పొడుస్తున్నాయి. నీరువస్తుందని భ్రమ వాటికి. ఇందుకు కారణం తెలుసుకుంటే ఆ చెరువు ఒక్కసారి నిండుతే పండగలిగిన భూమికంటే మూడు రెట్ల భూమి ఆ చెరువు కింద ఉందట. చెరువు మూడుసార్లు నిండితేగాని పూర్తి పంట పండదు. ప్రభుత్వానికి కావల్సింది శిస్తు-ఈ పశువులు కాదు. ఎంత పొలం

ఎక్కువ చేస్తే అంత శిస్తు ఎక్కువ వస్తుంది. ఈ పశువులు ఎన్ని బ్రతికినా దేశానికి ఏమి లాభం? ఈ దేశపు పశుసంపద నిజంగా గర్వించ తగిందిగా కనిపించింది.

ఇంకాస్త ముందుకు సాగాం. ఆకుల్లేని చెట్లునీడన భావి భారత పౌరులు పడివున్నారు. ఈ తరాలవారికోసమే మేమంతా త్యాగం చేయాల్సింది! వారిలో మా సంస్కృతి నగ్నంగా గోచరిస్తుంది. ఎండమాడిపోతూంది. నీడలేదు. నాలుక ఎండి పోయినా నీరులేదు. డొక్కమాడి పోయినా తిండి లేదు. ప్రాణం ఎగిరి పోయినా అడిగే నాధుడు లేడు. శరీరానికి ఎక్కడా ఆచ్ఛాదన లేదు. ఎముకలు వెళ్ళిన రొమ్ముక్రింద జానెడు పొట్ట. పౌరక పుల్లల్లా వ్రేలాడుతున్న కాళ్ళూ చేతులూ, ఎండా కాలపు బావిలా పీక్కుపోయి ఎక్కడో కనిపిస్తూన్న కండ్లూ, ఎండిన చెరువులాంటి చెంపలూ గలిగిన బాలురు, గోపాలురు, ప్రకృతిమాత ఒడిలో ఆనందిస్తున్నారు. వీరిని విద్యావంతుల్ని చేయడానికి మహోద్యమం సాగుతూంది. తిండికల్పించడానికి మాత్రం కాదు. వీరే భారత ప్రజలు, నాయకులు, ప్రభుత్వమూ, అన్నీ.

బండి సాగుతూంది. ఆ ఎడ్లు మమ్మల్ని లాగుతూనే ఉన్నాయి. లాగాలిగా మరి. అది ధర్మం. పూరిగుడిసెలు కనిపిస్తున్నాయి. మా ముందునుంచి కొందరు మనుషులు దేన్నో మోసుకొనివస్తున్నారు. అదేమిటో చూడాలని ఆదుర్దా పెరుగు తూంది. మేం సాగుతున్నాం. వారు సాగుతున్నారు. పై గుడ్డల్లేక మోకాలివరకు గాంధీజీ వలె పంచె కట్టుకున్న పురుషులు మోసుకొస్తున్నారు. దేన్ని? అదే తెలియడం లేదు. ఓహో అది ఆవు. అదేం అలా మోసుకొస్తున్నారు? చచ్చిపోయింది—కాబట్టే అంత గౌరవం! ఆ కళేబరానికి పసుపు కుంకుమతో పూజ చేయబడింది. పుష్ప మాలికలు కూడా వేయబడ్డాయి. దాన్ని-గోమాతను-మోసుకొనిపోతుంటే పేలాలు చల్లుతున్నారు. గుమి కూడిన నగ్న శరీరాల బాలురు వాటికై పోట్లాడుకుంటున్నారు. ఆ పేలాలు చల్లే మనిషికి అది సర్దాగా ఉన్నట్లుంది. వారు ఒక వైపు పోట్లాడు కుంటుంటే, ఇంకోవైపు చల్లుతున్నాడు. ఈ విధంగా పిల్లలు తన్నుకొని కాళ్ళిర క్కొట్టుకుంటుంటే ఆనందిస్తున్నాడు మహాశయుడు.

బండి మనిషి నన్ను దింపాడు. బండి సాగిపోయింది. నాదోవను నేను సాగుతున్నాను. ఇంకేమైనా విశేషాలుంటే రాస్తుంటాను.

భవదీయుడు

'దేహదాసు'

ఉత్తరం (4)

# నీళ్ళకోసం

శ్రీ భావదాసుకు నమస్సులు. రోజున్నరనుంచీ కాలిబాటలు పట్టుకొని తిరుగుతున్నాను. ఊరు అంతదూరంలో కనిపిస్తుంది. మాయమౌతుంది. ఏ బాట ఎటు పోతుందో ఆ బ్రహ్మకే తెలియాలి. కనీసం తాగుదామంటే నీరు దొరకడం లేదు. నాలుక ఆరుకు పోతూంది. కాళ్ళల్లో సత్తువలేదు. వంట్లో బలంలేదు. నడుస్తున్నా. అంతదూరాన కొన్ని గుడిసెలు కనిపించినై. ప్రాణంలేచి వచ్చింది. కాళ్ళు పరుగెడుతున్నై. పెద్ద మర్రిచెట్టు ఊడలు జారివుంది. చల్లని నీడప్రక్కనే చక్కని బావి గిలకల్తో సహా. బావి శిథిలమైంది. జీర్ణావస్థలో వుంది. కాని ధర్మ కర్తల పితృ పితామహుల పేర్లు మాత్రం చక్కగా కనిపిస్తున్నాయి. అక్కడికి చేరాలి. యంత్రంలా ముందుకు సాగుతూ వెళ్తున్నా. ఎండ. బావిదగ్గర ఎవరూ కనిపించలేదు. ఎలా నీరు తాగడం? ఇంకా ఒకటి రెండు ఫర్లాంగులు నడవాలి. ఒకావిడ చేతిలో బొక్కెన, చంకన బిందె పెట్టుకొని బావి దగ్గరకొస్తూంది. ఆవిడ అక్కడనుంచి వెళ్ళకముందే అక్కడికి చేరాలి. కాళ్ళు పరుగెత్తుతున్నాయి. అక్కడికి చేరాను. ఆవిడ స్నానం అయింది. బిందె నిండింది. ఆఖరు బొక్కెన తలమీంచి పోసుకుంది. ఇంకోటి చేది అందులో నీటితో వెళ్ళబోతూంది. బొక్కెన సగందూరం వచ్చింది. అక్కడికి చేరా. 'కాసిని నీళ్ళు పొయ్యమ్మా, ప్రాణం పోతూంది' అన్నా. ఆమె నావైపు చూడకుండానే 'అగు పోస్తా' అంది. బొక్కెన నిండా నీళ్ళు వచ్చినై. అవి చూచి నా ప్రాణం లేచివచ్చింది. ఒక చేత్తో చేద అందుకొని రెండవ చేత్తో దాని అడుగుపట్టుకొని నీరు పోయడానికి నా వైపు తిరిగింది. నేను దోసిలి పట్టుకొని సిద్ధంగా ఉన్నా. ఆమె నన్ను చూచింది. నేను ఆమెను చూచాను. ఆమెది లేతవయస్సు. చక్కని సౌష్టవమైన శరీరం. తెల్లని చీర మడి బారుపోసికట్టింది. అది మోకాలుకు కొద్దిగా కింటికి ఉంది. రవికలేదు. పైటను కండువాలా పైకి వేసింది. స్నానం చేయడంవల్ల చీరంతా తడిసి నీరు కారుతూంది. అందులోంచి ఆమె బలిష్ఠమైన దేహం ఆమెలోని యవ్వనంలా తొంగి చూస్తూంది. ఆమెది పచ్చని జామపండులాంటి చాయకాకున్నా చామనచాయ. మాంసలములైన నేత్రాల్లో యవ్వనంచేరి యర్రపడిపోయినై. వెంట్రుకలు నెమలి పింఛంలా విరపోసివున్నా చివరన చిన్నముడి వేసి ఉన్నందున అవి వ్రేలాడ లేవు. ఆమె కండ్లు, ముఖం ఒకటేమిటి ఆమె శరీరంలోనే ఏదో తీరని తృష్ణ

కనిపించింది. ఆమె ముఖాన రవ్వంత బొట్టుంటే బహుశా ఆ తృష్ణ కనిపించి యుండదు. ఇరువురకూ తెలియకుండానే చూపులు కలిసినై. ఆమె రెప్పలు వాల్చింది. నేను దోసిలి పట్టాను. ఆమె కండ్లలో నీరు నిండింది. రెండు ముత్యాలు నా దోసిల్లో రాలినై. నేను తాగడం అయిపోయింది. ఆమె బిందె నెత్తుకొని చేత్తో చాదపటుకొని వెళ్ళిపోయింది. నేను మర్రినీడను పడుకున్నా. అనాద. వీరికోసం కందుకూరి వెలిశాడు. ఆయన గతించాడు. ఆయన తర్వాత? వేలకొద్ది ఆయన్ను భజించే వారున్నారు. వారంతా ఆయన ఆశయాల్ని భజిస్తున్నారా? అయినా సర్వోత్కృష్టమైన ఓటుహక్కు మహిళకు ప్రసాదించబడింది. ఇంకేం కావాలి? ఇలాంటి వారు లేకుండా సనాతన భారతనారి ఇంద్రియ నిగ్రహం, సహనశీలతా లోకానికి ఎలా తెలుస్తాయి? అనాధలుండాల్సిందే. అయినా ఈ సమాజంతా సనాధులెవరు?

మర్రిచెట్టునీడ, చల్లగా వుండి స్పృహలేకుండా నిద్రపట్టింది. లేచేవరకు సాయం కాలం అయింది. పర్చుకున్న గుడ్డ దులిపి సంచిలో పెట్టుకొని నడుస్తున్నా ఊరివైపు.

నేనొక చిత్రకారున్నైనా కవినైనా అయితే ఎంత బాగుండేది. ఎంత చక్కనైన సామాగ్రి! ఈ అర్ధనగ్న శరీరాలను చిత్రిస్తే బహుశా బహుమానం కూడా లభించి ఉండును. ఇలాంటి అర్థాచ్ఛాదిత శరీరాలను ప్రదర్శించడానికి ఎంత శ్రమపడ్డారు చలన చిత్ర దర్శకులు! నలుగురు మాతంగ కన్యలు చిరిగిన చీరకు నూరుకుట్లు వేసి కట్టుకున్న రంగురంగుల గుడ్డ తొడలపైకి మాత్రమే సరిపోయింది. చిరిగిన రవికెలోంచి కనిపించేభాగం దాచుకోవాలనే యత్నం సహితంలేని ముగ్ధలైన వారు చేతిలో కుండలతో అటు వెళ్తున్నారు.

అది ఒక గుంట. దాన్ని చెలమ అనాలేమో! అక్కడ ఈవరకే పదిమంది కూడి నీళ్ళకై బాహాబాహి కబాకబి యుద్ధం చేస్తున్నారు. వీరూ అక్కడికే చేరారు. మురికినీరు - అందులో కుండమునగదు. దోసిలితోనో చిప్పల్తోనో నింపుకోవాలి. అంతా ఒకేసారి నింపుకోవాలని ఆదుర్దా. అర్ధగంటగ్గాని ఒక కుండ నిండేట్లు లేదు. ఈ వెళ్ళినవారు ఆ గుంటకు చేరారోలేదో తగాదా మొదలైంది. మొదలు చేరినవాళ్ళకేదో హక్కున్నట్లూ, అది హరించడానికి వీళ్ల వస్తున్నట్లూ రాయరాని తిట్లతో వారి వాగ్యుద్ధం సాగింది. జగడం సిగలు పట్టుకునే వరకు వచ్చింది. సిగలు పట్టుకొని గుద్దుకుంటున్నారు. నేలమీదపడి పొర్లుతున్నారు. హా రామరామ! ఆడదాని సిగ్గుకాపాడే బాధ్యత ఆడదానికే లేదా? క్రిందపడి పొర్లుతున్నది. అసలే జానెడు గుడ్డ. అది అజంతా సౌందర్యం. మిగతా వాళ్ళకేమీ పట్టనట్లే నీరు నింపుకొని వెళ్ళిపోతున్నారు. వీళ్ళ తగాదా అయ్యేవరకు నీరు కాస్తా వడిసి పోయింది. ఉత్తకుండల్తో మళ్ళాల్సివచ్చింది. మేము మూడో ప్రణాళిక ముచ్చట లను ఆలోచిస్తున్న సమయంలో మూడో దానికి నీరు (మాత్రం) దొరకక యుద్ధం జరుగుతూంది. పల్లెల్లో ఉండే స్వచ్ఛమైన గాలి తినలేక ఈ నీటి కోసం

తగాదా ఎందుకో! కోట్లు ఖర్చుచేసి జీవనదుల్ని కట్టేస్తుంటే వర్జన్యుడికి హఠాత్తుగా వచ్చింది. ఆయన్ను ప్రసన్నుణ్ణి చేయడానికి లక్ష ఖర్చుతో యజ్ఞాలు చేస్తుంటే ఇంకా నీటికి తీరనిదాహం ఎందుకో?

ఇంక ఊళ్ళోకి ప్రవేశించాలి. ఊరి బయటనే వుంది హరిజనాశ్రమం. నిజంగా అది ఆశ్రమమే. రాతి కాలంనాటి పర్ణశాలలు వినా ఒక్క పెంకుటిల్లు లేదు. ఇండ్లన్నింటికీ మట్టిగోడలు, మట్టి పెచ్చులు లేచిపోతున్నాయి. తలుపులు పెట్టడం అనాగరికమని అన్ని ఇండ్లకూ తడకలు పెట్టుకున్నారు వీరభద్రునికి నైవేద్యం పెట్టలేక. పై కప్పులమీద గడ్డి ఆగాలిదేవుడు కటాక్షం వచ్చినప్పుడల్లా కాస్త లేపుకొని పోతుంటాడు. అందువల్ల ఇండ్లలోకి గాలి, వెల్తురూ ప్రవేశపెట్టాలనే ఉద్దేశం వినా వేరే తలంపు ఆ దేవుడికి మాత్రమే ఎందుకుంటుంది? ఈ ఆశ్రమం ప్రక్కనే పొలాలు. పొలాలకంటే అట్టే ఎత్తుగా ఇండ్లు లేని కారణంగా వర్షాకాలంలో జల దేవత నాట్యమాడడానికి తగిన హంగులన్నీ ఉన్నాయి. అగ్ని దేవుడికి వీళ్ళ యిండ్లంటే చాలా ప్రేమ. ఆయన కటాక్షం మొదట వీరి యిండ్ల మీద పడ్డాకే ఇంకెవరిమీదనైనా పడటం. దరిద్ర దేవత వీరి యిళ్ళల్లో స్థానం ఏర్పర్చుకున్నది. అందరూ యీ హరిజనులను ఉద్ధరించడానికి కంకణం కట్టుకుని వీరందరినీ దేవాలయాల్లో ప్రవేశపెట్టి వీరి సమస్యలను పరిష్కరింప చేయడానికి మహామహా త్యాగాలు చేస్తున్నారు.

లోపలికి ప్రవేశించాలి దారి ఎటు? చుట్టూ పెంటకుప్పలు, మా పెద్దల్లో అవినీతి వలె పెరిగివున్నాయి. వీటిని అధిగమిస్తేనేగాని ప్రవేశం లభించదు? కష్టంగా అది దాటగలిగాను.

పిల్లలు దిశమొలలతో బుట్టతలల్తో కుండ పొట్టల్తో తాటాకుమీద ఒకతన్ని కూర్చోపెట్టి దానికి తాడుకట్టి మరొకడు లాగుతూ ఆడుకుంటున్నారు. పక్కనే ఒక గుడిసె. దాని ముందు ఒక బర్రె బారెడు కొమ్ములూ అదీ. దూడలేదు. పాలివ్వదు. మేపాలి. దాని చుట్టూ బురద, అసహ్యం. చొప్పముక్కలు అక్కడ క్కడా పడి వున్నాయి. ఒక కోళ్ళ గుంపు. అవి వుండడానికి మాత్రం సరిపోయే యింట్లో కాపురం. అవి యింటి నిండా రెట్టవేస్తూ గలీజు చేస్తున్నాయి. పక్కనే చూరునీడన బస్తామీద ఒక శరీరం పడివుంది. బస్తా మీద మనిషి వున్నదని కూడా గుర్తుపట్టలేనంత బక్కగానూ నల్లగానూ ఉంది. ఆ శరీరం కదిలింది. దగ్గుతూంది. ఉమ్మిస్తే రక్తం. గట్టిగా దగ్గే శక్తి కూడా లేదు. ఊపిరి పీల్చడం కూడా కష్టంగా ఉంది. ఎన్నో రోజులేమో గాని ఎన్నో గంటలుకూడా జీవించే నమ్మకం లేదు. కోడిపిల్లలు ఎక్కిపొడుస్తున్నాయి. వాటిని అదిలించే శక్తి కూడాలేదు. ఈ అశాశ్వతమైన శరీరం వుంటే ఏం? పోతే ఏం? శాశ్వతమైన ఆత్మ ఆనందం అనుభవిస్తున్నది. ప్రక్కనే పొయ్యిలో పిల్లి నిద్రపోతూంది.

లోపల నుంచి ఒక చింపిరితలా, జానెడు పీక్కుపోయిన కండ్లూ, అర్ధగజం

పీక్కుపోయిన పొట్టతో ఒక ఆకారం బయటకి వచ్చింది. ఎన్నాళ్ళైందో ఆ కుండలు అలా పడివుండి. తడి సైతం లేదు.

పిల్లిని లేపింది. జానెడుదూరం పొరకతో చెత్తను అటూ ఇటూ నెట్టింది. పుల్లలు విరిచి పొయ్యిలో వేసింది. జడలు కట్టిన చింపిరినెత్తి రెండుచేతుల్తో గోక్కుంటూ తల పొయ్యివరకూ ఒంచి ఊదుతూంది. లోపలినుంచి మూలుగు వినిపించింది. లోపలకూడా ఇంకొక రోగి వున్నదన్నమాట. అతడు ఆ ఇంటి యజమాని. జ్వరం వస్తుందట రెండు నెలల నుంచి. రెక్కాడితేనే డొక్కాడేది కష్టమాయె. రెండు నెలలు పనిలేదు. చేద్దామన్నా ఎండాకాలం పని దొరకలేదు. లోపలికి వెళ్ళి మళ్ళీ వచ్చింది. ఊదుతూంది. ఇద్దరు రోగులూ దగ్గుతున్నారు.

ఈ మధ్యన ఆ వూరికి మంత్రిగారు వచ్చారట. దళిత జాతీయ సంఘం వారు మనవి పత్రం సమర్పించుకోగా కొంత భూమి హరిజనులకు మంజూరు. అయితే అది దొరవారి భూమికి కలిసివుందట. వీరందరికీ అరకలూ ఎద్దులూ; ఎరువులూ అన్నీ కొనే కష్టం ఎందుకు పట్టాలని వారే దున్నడం ప్రారంభించారట. ఈ రోగిష్టివాడు అలా వీల్లేదని కొంతమందిని తీసుకొని అడ్డుతగిలాడట. దొర మీదికి ఇంత సామాన్యుడు తిరగబడ్తాడా? దొరగారి అనుగ్రహానికి పాత్రుడు కావడంచేత లేవకుండా అయిపోయినాడట. అయితే మన రాజ్యాంగం ప్రసాదించిన సర్వహక్కులూ వినియోగించుకునేంత సాధన సంపత్తిలేక మంచపు సత్యాగ్రహం చేస్తున్నాట్ట. ఆయనకు గాని ఆయన కుటుంబంలో వారికిగాని దొర పని దొరకదు. అలాంటప్పుడు ఇతరులూ పని చూపించడానికి జంకుతున్నారట.

పొయ్యి మండింది. ఏం పెట్టాలి? ఏమున్నది? ఉన్న ఆస్తి అంతా ఆ కుండలే. అమ్మాయి తేచి కక్కుకుంది. రక్తం వరద. అయినా ఎవరూ కదిలినట్లని పించలేదు. వారికి అలవాటే కాబోలు వరద పొయ్యిలోకి పోతుంది. చేతితో తుడిచింది తల్లి. చెయ్యి శుభ్రంగా కడుక్కోవాలి. కుండలో కాళీ. చీరకు తుడిచింది. అమ్మాయి ఉత్తకుండతో యిల్లుచేరింది. ఆ కుండనుచూచి నోరు తెరచింది తల్లి. జరిగిన విషయమంతా చెప్పి, దెబ్బలు చూపింది. ఆ అమ్మాయి. ఒక యువకుడు. నడుమునుంచి జానెడువరకు గుడ్డ, నెత్తిన తలగుడ్డా, భుజాన గొడ్డలి, నెత్తిన కట్టెల మోపుతో వచ్చి మోపు అక్కడ పడవేసి తలపాగా దులుపుకుంటూ లోపలికి చేరాడు. అతడు ఆ కట్టెలు అమ్మి తెచ్చే గింజలతో వంట వండాలి. తల్లి నిప్పు చేసింది. ఆమె గట్టిగా నిట్టూర్పు విడచి 'ఇదంతా మన ఖర్మ' అని లోపలికి వెళ్ళి పోయింది. నేను బయటపడ్డా. అమాంతంగా జనం గొల్లుమన్నారు. ఇక్కడ పైసకొక్క ప్రాణి లభిస్తుంది. వెనక్కు తిరగడం వృథా. సాగుదాం.

భవదీయుడు

"దేహదాసః"

ఉత్తరం(5)

# పనికిరాని చదువులు

(భావదాసుగారి బుద్ధుకు)

వైశాఖం. సూర్యుడు నిప్పులు చెరుగుతున్నాడు. వేడిగాలి దుమ్మును లేపుతూ సుడిగుండంలా తిరుగుతూ ఆకాశానికి ఎగురుతూంది. లేనివాడు బ్రతుకు బరువులో వంగినట్లు కాయల బరువుతో మామిళ్ళు వంగినాయి. ఎక్కడో కోకిల అరణ్య రోదనంలా అరుస్తూంది. నెత్తికి గొడుగేమో కాని కనీసం ఖద్దరు టోపీ లేదు. చెప్పులు చర్మంతో తయారు చేస్తారు కాబట్టి మానేశాను. అయితే అలా మానేసిన మహామహులవలె కార్లలో మాత్రమే తిరిగే అదృష్టవంతుణ్ణి కాకపోవడం చేత కింద కాళ్ళు, పైన నెత్తి మాడుతున్నాయి. అక్కడక్కడ చింతచెట్లున్నా, చింతకాయల కోసం కొమ్మల్ని సైతం విరిచేయడం కారణంగా నీడ ఎక్కడా లేకుండాచేసి పుణ్యం ఆర్జించుకున్నారు. ఇది వసంతం. వీటిని చూసి విరహ బాధపడ్తారు కావ్య కన్యలు. ఆ భావకవిని ఈ ఇసుకలో నిల్చోపెడ్తే చక్కని విరహ గేయం రాసేవాడు.

కాళ్ళు మండుతూంటే గమన వేగం పెరుగుతూంది. ఇసుక బాట. బాట కిరు ప్రక్కల చెదిరిపోయిన కంచె ఉంది. అంత దూరాన తుమ్మచెట్టు క్రింద ఒకదేహం పడివుంది. మృతకళేబరమేమో అనాధ ప్రేత సంస్కారం చేస్తే కోటి యజ్ఞఫలం లభిస్తుందని ఆశపడి దగ్గరికి వెళ్తే, నా దురదృష్టం ఊపిరి పీలుస్తూనే ఉంది ఆ ప్రాణి. తుమ్మచెట్టు నీడ అక్కడక్కడ నువ్వులు చల్లినట్లు ఉన్నది. పచ్చని నిమ్మపండు లాంటి శరీరం. వేలెడు పొడవు వెండి పోగుల్లాంటి తెల్లని వెంట్రుకలు, గడ్డం సమేతంగా ఎండకు మెరుస్తున్నాయి. ఒకనాడు బలిష్టమైన శరీరంలా కనిపిస్తున్నా ముడత పడిపోయింది శరీరం. ముఖం మీద, వంటినిండా ద్వాదశోర్ధ్వపుండ్రా లున్నాయి. తెల్లని జన్నిదం. మోకాలు పైకి బట్ట, భుజం మీద ఒక అశ్వసంచి. అందులో ఏదో బియ్యమూ వగైరాలున్నాయి. వడదెబ్బకు పడిపోయి ఉంటాడు. ఎలా ఆతనికి సహాయం? అనుకుంటుండగానే "సమాజసేవ శాఖ ఫలానా ప్రభుత్వం" అని తాటికాయల్లావు అక్షరాలను మోసుకొని ఒక జీపు వస్తూంది. వారు నాకు

సహాయపడవచ్చునని పరిగెత్తి ఆపమన్నట్లుగా చెయ్యి చూపగా ఇంత మన్ను కంట్లో కొట్టి దూసుకొనిపోయింది జీపు. నా పిచ్చికాకుంటే ఈ దరిద్రుడూ నేనూ సమాజం ఎలా అవుతాం? వారు సేవ ఎలా చేస్తారు? సమాజం అంటే కనీసం కారున్నవాడు. కాకపోతే ఈ సేవకునికి కారెలా లభించింది? కారు ఒకటి రెండు ఫర్లాంగులు వెళ్ళింది. సత్యాగ్రహం చేసింది. అందులోంచి ఇస్త్రీ మడతలు చెరగని సూటులోని ఒక ఆజానుబాహువైన సమాజ సేవకుడు, ఒక జార్జెట్టు చీర ధరించి షట్పుష్ప వేషంలో ఉన్న సమాజ సేవికా దిగారు. వారు డ్రైవరు మీద ఏదో కస్సుబుస్సు మంటున్నారు. పెదవుల కదలిక మాత్రమే కనిపిస్తూంది. డ్రైవరు జీపులోని దిండ్లను నాలుగింటిని తీసికెళ్ళి ఒక ఫర్లాంగు దూరంలో ఉన్న చింతచెట్టు కిందికి చేర్చాడు. ఒక పెద్ద నీళ్ళడబ్బా, ఇంకేమేమో తీసుకుని చింతచెట్టు వైపు పరిగెడుతున్నాడు డ్రైవరు. ఆ పెద్ద నీళ్ళడబ్బా చూచి నా ప్రాణం లేచి వచ్చింది. కొంచెం నీళ్ళు ఈ దౌర్భాగ్యుని ప్రాణాలు రక్షింపవచ్చు. సంచి అక్కడ పడేసి పరిగెత్తా. ఆ అధికారికి కారణం తెలియపర్చి నీళ్ళు పోయమన్నా. అక్కడి నుండి వెళ్ళి పొమ్మని అదిలించారు. నేను ఇంకాస్త వినయంగా ప్రార్థించా. డ్రైవరుతో చెప్పారు నన్ను పంపించేయమని. అధికారుల మాట పాటించక పోవడం నా తప్పేకాక— ఆయన ఆస్తిమీద నాకేం హక్కుంది. నీటిని డబ్బాలో పట్టుకున్నంత మాత్రాన అతని ఆస్తి అయిపోయింది. రేపు కొందరు గాలిని కూడా పట్టుకొని స్వంత ఆస్తిగా చేసుకుంటారేమో! అతని ఆస్తితో, ఆకలితో చచ్చేవాడిముందు పంచభక్ష్య పరమాన్నాలు తినే అధికారం అతనికుంది.

వెంటనే సర్వోదయ జలపాత్రోద్యమం తీయాలని బుద్ధి పుట్టింది. అయినా అందర్నీ అడుక్కునే అధికారం మాత్రం నాకెక్కడుంది? ఈ అడుక్కునే అధికారపు సర్వహక్కులూ ఒక మహా పురుషుడు రిజిష్టరీ చేయించుకున్నాడు ఇది వరకే. ఏం చేయను? అలా పరిగెత్తాను. సొరబుర్రలో నీరు తీసుకొనిపోతున్న దంపతులు కనిపించారు. భుజం మీద బుడతణ్ణి ఎక్కించుకొని ముందునడుస్తున్న వాణ్ణి పరిస్థితి అంతా చెప్పి ప్రార్థించాను. అతను చాలా ఆదుర్దా పడ్డాడు. అతని భార్య ఆదుర్దా చెప్పలేను. "అయ్యో గాయన గట్లపడ్తే సూస్తరేమండీ" అని బుడతణ్ణి తీసుకొని అతన్ని వెళ్ళమంచే. ఇద్దరం అక్కడ పడివున్న శరీరం దగ్గరకు చేరాం. దాన్ని నీడకు చేర్చాం. గుడ్డ తడిపి ముఖాన వేశాం. నీరు ముఖాన కొట్టాం. శరీరమంతా తడిగుడ్డతో తుడిచాం. అతడు పై పంచెతో విసిరాడు.

వృద్ధుడు కళ్ళు తెరిచాడు. నోరు తెరవమన్నా, నీరు పోస్తానన్నా. పెదవులు గట్టిగా మూసుకుంటాడు. కళ్ళ వెంబడి నీళ్ళు వస్తున్నాయి. చేత్తో వద్దంటాడు. కాస్త సేపటికి ఇంకాస్త తెలివి వచ్చింది. నీరు పోయవద్దంటాడు. ఈ బతుకులో తనను చండాలుణ్ని చేయవద్దని ప్రార్థించాడు. చస్తే ఇలాగే చస్తానంటాడు. ఈ మూఢ విశ్వాసం చూసి నాకు కోపంకంటే ఎక్కువ జాలికలిగింది. ఈ ఐ వేల

సంవత్సరాలలో పీళ్ళలో వచ్చిన మార్పేమిటి? బుద్ధుని నుంచి గాంధీ వరకూ అనేక మంది సంఘ సంస్కర్తలు బైల్దేరారు. వారి శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరేనా? ఆ పక్కనే ఒక తోట ఉందని ఆ యువకుడు చెప్పగా ఇద్దరం కలిసి ఆ వృద్ధుని అక్కడికి తీసుకొని వెళ్ళాం.

అది మంచి తోట. మామిడి, నిమ్మ, జామ, దబ్బ వగైరా అనేక చెట్లు ఉన్నాయి. చుట్టూ చక్కని ప్రహరీ ఉంది. చల్లని నీరు. పెద్ద బావి. చక్కని రాతి కట్టడం కట్టి మెట్లు కూడా ఉన్నాయి. నాలుగు వైపుల ఇదివరకు మోటలు వేసిన గుర్తులు కనిపిస్తున్నాయి. ఇప్పుడు నీరు మరతో లాగుతున్నారు. నలుగురు మనుషులకూ ఎనిమిది ఎద్దులకూ అయ్యే ఖర్చు తప్పింది. ఇలాంటి ఇంజను ఆ ఊరికి పది వచ్చాయని తెలిసింది. అంటే సుమారు ముప్పయ్ కుటుంబాలకు పని లేకుండా పోయిందని అర్థం. పారిశ్రామికంగా అభివృద్ధి కావడానికి ఈ మాత్రం బలిహరణం అవసరం కదూ!

మేము ఆ వైష్ణవుని తీసుకొని వెళ్తున్నాం. ఆ తోటమాలి వృద్ధుడు. చూశాడు అంత దూరంనుంచే. పరిగెత్తుకొని వచ్చి "అయ్యా! నీకాల్మొక్త బాంచెను. ఎక్కడి గతి పట్టేనుర్రి నీకు. ఆ పెద్దోరుండగా నిన్ను కాలు కింద పెట్టనిచ్చినాడుండి. ఎన్ని సంతర్పన్లు పెట్టిర్రు, ఎన్ని పురాణాలు సెప్పిర్రు, నీ కెంతగతి పట్టెనుండ్రి" అని అతడూ మాకు సహాయంచేశాడు. అతడ్ని బావివద్దకు తీసుకొని వెళ్ళాం. యువకుడు వెళ్ళి పోయాడు. నీటిలోకి దిగి స్నానంచేసి బైటికి వచ్చి మిగతా కర్మంతా కానిచ్చారు అయ్యవారు. ఆ వృద్ధుడు మంచి మామిడి పండ్లు తెచ్చాడు. అవి తిని, నీరు త్రాగిన తర్వాత మళ్ళీ మనిషి అయినాడు వృద్ధుడు.

"నువ్వు నిజంగా పెరుమాళ్ళవు నాయనా! నిర్హేతుక జాయమానకటాక్షం వచ్చినపుడు ఆ శ్రీహరే అనేక రూపాల్తో వచ్చి దాసులను రక్షిస్తుంటాడు" అన్నారు. వారు నాకు చేసిన ముఖస్తుతి నచ్చినా 'ఆఁ నాదేముందిలెండి' అని ఏదో అనాల్సిన మాటలని వారిలా ఈ వృద్ధాప్యంలో ఈ చెట్టు క్రిందపడి అఘోరించాల్సిన అవసరం ఎందుకు వచ్చిందో చెప్పమని వేడుకున్నాను. వారు చెప్పింది సంక్షిప్తంగా ఈ విధంగా ఉంది.

ఆయన సంస్కృతాంధ్ర, ద్రవిడ భాషల్లో నిధి. రామాయణాన్ని, భగవద్గీతనూ కూలంకషంగా మధించిన మహా యోగి.

ఇప్పటికి 50 సంవత్సరాల క్రితం, వారికి 20 సంవత్సరాలున్నప్పుడు వీరితో శ్రీ సూక్తులు సేవించి తరించాలని ఆ ఊరు దొరవారు వారిని పిలిపించారు. ఆయన వారికి కొంత భూమికూడా ఇచ్చారు. అయితే ఐహిక విషయంలో అంతగా పట్టించుకోని వీరు ఆ భూమి విషయమైన పట్టా వగైరా వ్యవహారాల్లో ఎక్కువగా జోక్యం కలిగించుకోలేదు. వారి జీవితం ఆ రోజుల్లో మహా వైభవంగా గడిచింది.

వారికి ఇద్దరు కుమారులు. ఇద్దరికి క్షుణ్ణంగా ద్రావిడ వేదాంతమంతా కంఠోపాఠం చేయించారు. కాలపు మార్పును గమనించి వారికి మ్లేచ్ఛ విద్య చెప్పించాలనుకున్నా, ఆ ఊళ్ళో 4వ తరగతి వరకే ఉండటాన అంతకు పై చదువు చెప్పించలేక పోయారు. ఏదో ఉన్న పొలాలతో, పాండిత్యంతో, శిష్య వర్గంతో తమ కుమారుల జీవితం హాయిగా గడిచిపోతుందనుకున్నారు. అయితే పెదదొర గతించిన తర్వాత, పట్నంలో చదువుకున్న చిన్న దొర పరిపాలన వచ్చేవరకు ఈ అయ్యవారి కిచ్చిన భూమి వృధా అనుకొని తామే సేద్యం చేయడం ప్రారంభించాడు. గ్రామ ప్రభువులకు వ్యతిరేకంగా మాట్లాడటం బావుండదని వారు ఎలాగో రోజులు వెళ్ళబుచ్చుతుండిరి.

మహా మారి వారి పెద్ద కొడుకునుకాస్తా మింగేసింది. చిన్నవాడు సంస్కృత ద్రావిడ భాషల్లో తండ్రిని మించినవాడు. కాని పాండిత్యానికి విలువ ఎక్కడ? పేరుపడ్డవారి పుస్తకాలు బండ్లమీద ఊరేగించడంతో సంతృప్తిపడే మా సమాజంలో అఖండ భాషా పాండిత్య నిధికి తిండి దొరకకుండా అయింది. బడి పంతులుగా చేరుదామన్నా అంతా ఆయన పాండిత్యాన్ని కొనియాడేవారేగాని ఒక్క కాగితం లేనందుకు ఆయనకు ఎవరూ ఉద్యోగం ఇప్పించలేక పోయారు.

ఆయన ప్రస్తుతం ఎవరి ఇంట్లోనో వండి పెడుతూ కాలం గడుపుకుంటు న్నారు. వృద్ధ దంపతులకు తిండికి వెళ్ళడం దుర్భరంగా ఉంది. ఆయన వేదాంతాలు వినేవారు ఈ రోజుల్లో ఎవరున్నారు? కాయకష్టం చేతకాదు. మిగిలింపల్లా పెళ్ళిళ్ళకూ, తద్దినాలకూ వెళ్ళి సంభావనల డబ్బుతో బ్రతకడం. తమ ఊరికి 15 మైళ్ళున్న ఒక ఊరి పెళ్ళికి వెళ్ళి అక్కడి నుండి వస్తుండగా తమకు ఈ గతి ప్రాప్తించిందని చెప్పారు వారు. ఈ జీవితం కంటే చావు మేలన్నారు. "కాని ఆత్మ హత్య మహా పాతకం. ఆ దయామయుని పిలుపు వచ్చేదాకా ఇట్లాగే బ్రతకాలె వాయనా" అన్నారు.

సాయంకాలం అయింది. వారిని అక్కడి దాకా పంపిస్తామని బైల్దేరా. సమాజ సేవా శకటం స్వయంగా కదిలేట్టులేదు. ఊళ్ళోంచి రెండు ఎద్దులను తెచ్చి దానికి కట్టి లాక్కుపోవడానికి ప్రయత్నిస్తున్నారు. సమాజ సేవికా సేవకులు చిలుకా గోరువంకల్లా ఆ జీపులో కూర్చునే, సమాజాన్ని ఉద్ధరించే ప్రణాళికలను గూర్చి ఆలోచిస్తున్నట్లున్నది.

వైష్ణవుణ్ణి పంపి నా దోవన బైల్దేరా. శలవు

భవదీయుడు

'దేహదాసు'

ఉత్తరం (6)

# చితికిన బతుకులు

(భావదాసు గారి ఖుద్దుకు)

నమస్సులు. మధుమాసం మోదుగులు నిప్పులు కక్కుతున్నాయి. పక్షులు సైతం ఆకుల్లోచేరి నోళ్ళు విప్పుకొని వగరుస్తున్నాయి. ఏదైనా ఒక పక్షి ఎగిరినా పచ్చని చెట్టు కనిపించగానే దబుక్కున అందులో దూరుతోంది. చెప్పులు తొడుక్కోనని శపథం చేసిన విషయం ఇదివరకే మనవి చేశాను. పాదరక్షణకు గాను మోదుగాకులు అంగుళం మందంగా కాళ్ళకు కట్టుకున్నాను. ఒక తాటాకు, గొడుగులా నెత్తిన పెట్టుకొని నడుస్తున్నా. అయితే అది నీడనిచ్చేదానికంటే ఎక్కువ చేయిలాగుతుంది. బతకనిచ్చినందుకు అంతకంటె ఎక్కువ బరువు గల పన్నులు చెల్లించాల్సివచ్చినట్లు!

అంత దూరాన మోదుగులు దట్టంగా ఉన్నాయి. అది మోదుగుల పొద. అందులో ఏదో కదులుతుంది. అభయారణ్యం కాదు గదా! ఏదో జంతువు బైటికి వస్తూంది. ఆకుల కదలిక ఎక్కువైంది. బైటికొచ్చింది. అది మూడు కాళ్ళజంతువు. ముగ్గు చుట్టలాంటి తల-వంగిన నడుము—వణికిపోతున్న కాళ్ళు, చేతులూ, తలాగల వృద్ధాతివృద్ధ. మోదుగాకులు కోసుకొని వస్తుంది. ఆ అభయారణ్యాల్లో అంతరించి పోతున్న సనాతన వన్యమృగాలను రక్షించే వ్యయం ఈ అంతరించి పోతున్న మూడుకాళ్ళ ముదుసళ్ళకు పెడితే? వీళ్ళూ వన్యమృగాలౌతారేమోనని భయం! ఆకులు తోరణాలు గుచ్చి ఎండవేస్తే, మళ్ళీ వాటిని తడిపి అనాగ పెట్టి విస్తళ్ళు కుట్టి కట్టలు కట్టి బస్తీల్లో అమ్మితే ఏదో ఇంత అంబలికి సరిపోయేంతన్నా దొరికేది. కాని అన్ని రోజులు నిరాహారదీక్ష కొనసాగించే ఆత్మశక్తి ఈ సామాన్య మానవులకు ఎలా వస్తుంది? ఈ పచ్చి ఆకులన్నా ఎక్కువధర ఇచ్చిన వాడికి అమ్ముకునే హక్కున్నా బాగుండేది. ఆవిడకు ఒక షావుకారు ఎన్నడో తాతల్నాడు అప్పుపెట్టాడు. ఆమె అతనికే, అతడిచ్చిన ధరకే అమ్మాలి. అలాకాకుంటే అప్పు అడుగుతాడు.

ఆమె అలా బైటికి వచ్చిందో లేదో ఒక ఖాకీ మనిషి తయారు. ఆజ్ఞ లేకుండా ఈ ఆకులు తెంపరాదు. అలా చేయటం నేరం; ప్రభుత్వాజ్ఞలు ధిక్క-

రించడం, ప్రభుత్వ ఆస్తిని దొంగిలించడం లాంటి వందకారణాల క్రింద ఆమె మీద కేసు పెట్టవచ్చును. ఆమెను పోలీసుస్టేషన్‌కు నడవమని బెదిరిస్తున్నాడు.

ఆమె దీనంగా బ్రతిమలాడుతుంది. కడుపూ కాళ్ళూ పట్టుకుంది. తననోట్లో మట్టి కొట్టవద్దంటూంది. అధికారానికి, శాసనానికి హృదయమూ కళ్ళూ ఉండవు. వాటికి చెవులు మాత్రమే ఉంటాయి. ఈమాత్రం దీనాలాపాలకు లొంగిపోతే శాసనం ముష్టివాళ్ళకు లొంగినట్లే! ఇలా లొంగితే ఇక శాంతి కాపాడినట్లే. నేనక్కడికి వెళ్ళా. ఒక పావలా బిళ్ళ జవాను చేతిలో వేశా. శాసనం మారింది. అనుమతి లభించింది. నాకు ఒక సలాం కూడా దొరికింది. కుటీర పరిశ్రమల ఉద్ధరణ కూడా జరిగిపోయింది. అశోక చక్రం నవ్వింది. శాసనం ఈ పావల లోంచి పుడుతుందా? దానికి లొంగుతుందా?

ఆ వృద్ధురాలు కఱ్ఱ కిందవేసింది. రెండు చేతుల్తో నడుము పట్టుకుని కష్టంగా తలపైకెత్తి నావైపు చూచింది. ముడుతలు పడ్డ ముఖం మీద తెల్లని వెంట్రుకలు పడుతున్నాయి. ఆ కళ్ళలోని కృతజ్ఞత ప్రవాహంలో నేను ఉక్కిరి బిక్కిరి అయినాను. ఎక్కువసేపు నన్ను చూడలేక తలవంచుకుంది. కర్ర అలా పడేసి మోదుకు నీడన చతికిలపడింది. నేనూ అలసి ఉన్నాను. నీడ, సహవాసం దొరికాయి. సంచీ క్రిందవేసి నీడన కూర్చున్నాము.

"కొడకా! ఆ ముదనష్టపోనికి పావులా ఎందుకిస్తివి? గీ ఆకులన్ని అమ్మిన గంతరాదాయె. నీ రుణం ఎట్ల తీర్చుకొందును?" అని రొప్పడం ప్రారంభించింది. ఎక్కువ మాట్లాడే శక్తిలేదు ఆమెకు.

ఆమె వయస్సు ఆ బ్రహ్మకే తెలియాలి, ఆమె చెప్పిన ఆనవాళ్ళను బట్టి ఆమెకు 90 సంవత్సరాల కంటె తక్కువ ఉండదు. ఆమె కాపురానికి వచ్చిన రోజుల్లో సైతం మరగుడ్డ ఊళ్ళోకి రాలేదట. వారుసాలీలు. వారికి ఒక మంచి ఇల్లూ ఆరు మగ్గాలు ఉండేవట. ఎప్పటికీ రెండు గరిసెల ధాన్యం నిలువ ఉండేవట. పాలు అమ్ముకోవడం పాపంగా పరిగణించేవారు కాబట్టి ఉన్న రెండు బఱ్ఱెల పాడితో మునిగితేలేవారట. అగ్రుల నుండి అధములదాకా వీరి బట్టలే కట్టుకునే వారు. దోవతికి రెండు వేళ్ళ వెడల్పు ఎర్రని పట్టంచు మామూలుగా ఉండేది. అంచుకు పై పక్క తెల్లటిది క్రింద ఊదరంగుది సన్నని గీతలుండి మధ్యన తెల్లని పూలుండేవి. వీటిని రుద్రాక్ష అంచు దోవతులు అనేవారు. చీరెలకూ అలాంటి అంచే నాలుగు వేళ్ళ వెడల్పు ఉండేది. పండుగలు వచ్చినప్పుడు ఆరు మగ్గాలకు విధీ విరామం లేకుండా పని ఉండేది.

కొంత కలం తర్వాత మర బట్టల కొట్టుతోసహా వీరికి శని కొనితెచ్చాడు ఒక షాహుకారు. క్రమక్రమంగా కొట్లు పెరుగుతున్న కొద్దీ మగ్గాలు మూల పడడం ప్రారంభం అయింది. చివరకు ఒక్క మగ్గం మీద పని సాగుతుండేది. పేద జనం మాత్రమే వీరి బట్టలు కట్టుకునేవారు. మిల్లు నూలు తేవడం నేయడం ఇదీ పని.

ఆరు మగ్గాలు నడిచిన్నాడు బంగారంలా నడచిన సంసారం క్షీణించి చితికిపోయింది. నిత్యం గండంగా కూటికి వెళ్ళడం కష్టం అయింది. ఆ మధ్య ఖద్దరు దుమారం లేచినా ప్రత్యక్షంగా వీరికి జరిగిన మేలేమీ లేదు. కొద్దిమంది ఖద్దరు ధరించే వారు బస్తీనుంచి తెచ్చుకుని కుట్టుకునే వారు. అది దేశభక్తి చిహ్నం!

ఊళ్ళో గత్తర మొదలైంది. బైండ్లవాని వీరవిహారం ఎక్కువైంది. కోళ్ళు, కుక్కలు, ఒక్కటేమిటి సమస్త జీవరాసుల్నూ బలి ఇచ్చారు. అయినా అది తగ్గలేదు. అంతేకాక హెచ్చడం ప్రారంభించింది. మూక చావులు. చచ్చినవాడ్ని కాల్చకూడదని నియమం. ఈవిడ భర్తకు కలరా తగిలింది. కోళ్ళను కోసినా ముడుపులు కట్టినా అమ్మవారి కోపం తగ్గలేదు. అతణ్ణి ఆహారంగా తీసుకున్నది.

ఆవిడకు ఆరుగురు కొడుకులు. మగ్గాలు ఆగిపోవడంతో కూలికి తగిలారు. కూలి దొరకడం కష్టమైంది. దొరికిన కూలీతో బతకడం అంతకంటే కష్టమైంది. ఇద్దరు మిలటరీలో చేరారు. ఇద్దరు షోలాపూరు మిల్లులకు వెళ్ళారు. అప్పణ్ణుంచి ఇప్పటిదాకా పత్తాలేరు. ఈ విషయాలు చెప్పేటప్పుడు ఆమె కంఠం గద్గదితం అయింది. ఎడమ చేత్తో చీమిడి తీసి పైట చెంగుతో కండ్లూ ముక్కూ తుడుచుకుంది. ఆమెలోని మాతృత్వం గుండె నిండి కండ్ల ద్వారా గండికొట్టి ప్రవహిస్తూంది. అయినా ఇద్దరు మాత్రం నేత పనిని అంటుకునే ఉన్నారు. కంట్రోళ్ళు వచ్చి నూలు దొరకడం కష్టం అయింది. షాహుకార్లు నూలు పోగుల్ని బంగారపు పోగులకంటే గిరాకీగా అమ్మడం మొదలుపెట్టారు. అదేదో సంఘం పెట్టి వీరికి సహాయం చేస్తూందని తెలిసినా అందులో సైతం ముందు కొంత డబ్బు కట్టాల్సిన అవసరం ఉండటాన, తిండికి వెళ్ళడమే కష్టంగా ఉన్న రోజుల్లో డబ్బు చెల్లించలేక వృత్తి వదులుకున్నారు. ఇద్దరు బొగ్గుగనుల్లో చేరారు. ఒకసారి గని కూలినప్పుడు ఒకడు మరణించాడు. రెండోవాడికి రెండవసారి కాళ్ళు విరిగిపోయినై. జీతాన్ని బట్టి ప్రాణం విలువకట్టి గని యజమానులు కొంత డబ్బిచ్చారు. ఆ కుంటివాణ్ణి వేరే ఎవరో తీసుకొనివెళ్ళి రైలు పెట్టెల్లో బిచ్చం అడిగిస్తున్నాడు. ఇద్దరు కోడళ్ళూ ఇల్లు చేరారు. వారిద్దరికీ నలుగురు బిడ్డలు. కొన్నాళ్ళుండి కోడళ్ళిరువురూ మారు మనువులెళ్ళారు. నలుగురు బిడ్డల్నీ తననూ, ఈ మోదుగాకులతో పోషించుకోవాలి. ఈ దరిద్రుల ప్రతినిధికి శాసనసభలో గౌరవస్థానం ఉంది. మేడ వుంది. కార్లున్నాయి. వీరందర్నీ రక్షించినందుకు బిరుదం సైతం లభించింది. ఆమె ఇంకెంత చెప్పిందో? చల్లని పొదలో నిద్రపట్టింది. లేచిచూస్తే పడమర మబ్బులు నెత్తురు కక్కుతున్నాయి. లేచి నడక సాగించాను.

భవదీయుడు

'దేహదాసు'

ఉత్తరం (7)

# వెర్రి తలలు

(భావదాసుగారి బుద్దుకు)

నమస్సులు. సాక్షాత్తు తమ ఉత్తరం అందుకోవడానికి ప్రయాణం సాగించ పల్లెలు వదలి పట్టణం చేరుకున్నాను. తమలాంటి 'ఘనుల' నుండి వచ్చిన ఉత్తరం అందుకోవడానికి ఈ మాత్రం శ్రమ చేయకుంటే సామాన్యులకూ తమకూ ఎట్టి అంతరం లేకుండాపోయి అంతా సంకరమై నరకమూలం కాదూ మరి!

తమ అభిమాన పాత్రమైన హోటలు ముందుకు వచ్చేవరకు లాటిపిచులాంటి జుట్టు, కొబ్బరి జుట్టు గడ్డము, లొట్ట చెంపలూ, సొట్ట కండ్లూ, మిట్ట నొసలూ, పిట్ట ముక్కూ, కొంగ మెడా, కోతి చెవులూ గల హైందవ యువక శేఖరుడు పైజామాలాంటి లాల్చి, లాల్చీ లాంటి పైజామా చెప్పులాంటి కాళ్ళకు కాళ్ళలాంటి చెప్పులు తొడుక్కొని చేతులో ఒక రంగు బకెట్టు ఇంకో చేతులో అచ్చం స్వదేశీ (అంటే అమెరికా మేక్) బ్రష్ పట్టుకొని స్వర్గానికి నిచ్చెనవేసి ఎక్కుతున్నాడు. క్రిందనుంచుని జోదుపూరుకోటు, కోటుకు తగ్గ సీటు, సీటుకు తగ్గ జోరు, ఆ జోరుకు తగ్గ స్పీడుగా మాట్లాడుతూ ఆదేశాలిస్తున్నాడు ఒక అసామాన్యుడు.

ఆ హోటల్‌కు ఉన్న ఆంగ్లపదాల బోర్డుకు రంగురాసి ఆ అప్రాచ్యపు వాసన చెరిపి, పుణ్యాహ వాచకంతో పవిత్రం చేసి తిరిగి అదే పదాలను హిందీలో ముచ్చటగా వాటిమీద రాయమని ఆదేశిస్తున్నాడు అసామాన్యుడు. రాస్తున్నాడు సామాన్యుడు.

క్రిందనున్న మహాశయుడు కేకలేస్తున్నాడు - కాదు-ఉపన్యసిస్తున్నాడు- "భాయియో! అంగ్రేజి విదేశీభాషాహై" ఎవరో అతనివెంట నిల్చున్న పచ్చి ఆంధ్రాభిమాని అంటే తప్పేమో కాని అచ్చం తెలుగు మనిషి.

"సోదరులారా ! ఆంగ్లము విదేశీభాష" అని అనువదిస్తున్నాడు. వీరిని చూస్తే మందులమ్ముకునే హిందుస్తానీ వాడు గుర్తుకొచ్చినాడు. ఇక్కడ విశేష మేమిటంటే ఆ మందులవాడి చుట్టూ చేరినంత జనం ఈ సామాన్యుని చుట్టూ చేరలేదు. తన ముందు ఎవరూలేరని నిరాశ చెందకుండేందుకుగాను కండ్లుమూసుకొని గట్టిగా

ఉపన్యాసం దంచుతున్నాడు. బజార్లో వెళ్ళేవాళ్ళంతా సానుభూతి పూర్వక దృక్కులు విసరుతు సాగి పోతున్నారు. ఆ ఉపన్యాసమంతా రాస్తే మీరు నన్ను పిచ్చివాణ్ణను కుంటారేమో అనే భయంతో దాని సారాంశం మాత్రం రాస్తున్నాను క్షమించండి.

"ఆంగ్లేయులీ దేశంబును వీడిన మరుక్షణంబుననే ఈ దేశంబున భూతల స్వర్గంబవతరించి "అమృతం" బెల్ల దేశీయులకు పంచి ప్రజలాహార పానీయంబు లడగక సంతృప్తిగా వారి యదృష్టంబులకు వదిలి ఈ దేశంబును సనాతన వేద యుగంబు వైపునకు నడిపించుటకై రేడియో దగ్గరి నుంచి పేడిమూతి వాడి వరకూ ప్రయత్నించుట జరుగుతున్నది. ఆంగ్లంబీ దేశంబు నుండి మాయంబైన మరుక్షణంబు ననే సాక్షాత్తు స్వర్గంబవతరించి అందరికీ 'అమృతంబు' పంచిపెట్టి సామ్యవాద తరహాగా ఎల్లరకు సమానమైన మోక్షంబు ప్రసాదించబడును. అంతియ గాక యావిధంబున నాంగ్గంబీ దేశంబు నుండి యదృశ్యంబైన తక్షణంబు పర్ణశాలలెల్ల మహా భవనంబులై దేశీయులెల్లరు దేవతలై అప్రాచ్యుల వాసనేని సోకనీక నహుష పరిపాలనంబున నాల్గు పాదంబుల ధర్మంబునడచు."

ఈ విధమైన చండ ప్రచండ పదఘాతానికి తట్టుకొని బైటనిల్చోలేక హోటల్లోకి ప్రవేశించానో లేదో పోష్టువాడు మీ ఉత్తరాన్ని హోటలు యజమాని కందించగా యజమాని సగర్వంగా నా కందించాడు. నేనా ఉత్తరం చింపితే అందు లోంచి వచ్చిన విలువైన కాగితం పైన అక్షరాలు చూచి, బేడా చెల్లించి మూడణాల పేపరు నమిలి మింగడానికి సిద్ధపడుతున్న జర్నలిస్టు - కమ్ - పొలిటీషియన్-కమ్-సోసియల్ వర్కర్ నా వైపు కొరకొరా చూడ్డం మొదలుపెట్టేసరికి ఆ ఉత్తరానికీ నా పోలికకూ ఎక్కడా సామ్యం లేనందున అంత దూరాన కూర్చొని విమాన ప్రయాణంలో తమకు కలిగిన ఇబ్బందుల్ని గురించి వివరించుకుంటున్న కార్మిక నాయకులూ, మద్య నిషేధంవల్ల బ్రాండీ, విస్కీలాంటి పానీయాలు దొరక నందున తమకు కలుగుతున్న ఇబ్బందుల్ని ఒకరికొకరు నివేదించుకుంటున్న కర్షక నాయకులూ, పర్వతం కూర్చొని పదిహేను మంది సంతానానికి కప్పుకాఫీ ఎలా పంచి పోయాలో తెలియక సతమతమౌతు కుటుంబ నియంత్రణను గురించి ఉపన్యాసం దంచుతున్న గంధారీ మహాతల్లి, కాబోయే ముఖ్యమంత్రి జన్మదినోత్సవానికి ప్రశస్తి కవిత బనాయించడాన్ని గురించి చర్చించుకుంటున్న ఇద్దరు వీర ప్రజాకవులూ, నోళ్ళు తెరచుకొని గుడ్లప్పజెప్పి నావైపు చూడడం మొదలుపెట్టేసరికే ఉక్కిరి బిక్కిరౌతున్న నన్ను ఎక్కణ్ణో మూలకు కూర్చున్న బొజ్జ సాహుకారు, ఉత్తరం చదవడానికి ఇది శుభ సమయం కాదని మళ్ళీ కవర్లో పెట్టి పదిలపర్చి, అడ సర్వర్లను ప్రవేశపెట్టడానికి దశవర్ష ప్రణాళికను గురించి చర్చిస్తున్న హోటల్ యజమానికి అవసరమైన అద్దాన్ని అదీ చెల్లించుకొని ఒక కుర్రవాణ్ణి వెంటపెట్టుకొని బయల్దేరాను.

చక్కని అల్మారాలో వివిధ వర్ణాల్లో సువాసన గుమ్మరిస్తున్న పదార్థాలు నోట్లో నీళ్ళూరిస్తుండగా జేబు అదమాయిస్తుండగా అది దాటాము. ఇంకేముంది నలభీము లేకమైనంత భీకర రూపం బొగ్గులో ముంచి తీసినంత తెల్లని పరిశుభ్రమైన గుడ్డ ఒకటి చుట్టుకున్న నలభీముడు పాకంచేస్తుంటే సాక్షాత్తుగా అతని ఘర్మ బిందువులు ఆ వంటకాల్లోపడి ఆ వంటకాలన్నింటినీ పారిశ్రామికుల స్వేదబిందువుల్తో నింపేస్తూ పవిత్రతను చేకూరుస్తున్నాయి. ఇంకొక నలుడు పిండి పిసుకుతున్నాడు. ఆయనకున్న మూరెడు వెంట్రుకలు పిండిని వత్తటానికి వంగినపుడల్లా ముందు పడ్తుంటే రెండు చేతుల్తో వెంట్రుకల్ని పైకి దువ్వినట్లు చేయడం, ఒకసారి సవరిస్తూ కసరత్తు చేస్తున్నవాడిలా ఆరోగ్య సూత్రాలను అక్షరాలా పాటిస్తూ నెత్తినంటిన మసినంతా చాకచక్యంగా పిండికి అప్పగిస్తున్నాడు. ఈలోగా ఇంకొక భీముడు బీడీ త్రాగడం పూర్తై పారెయ్యబోతే పెద్దగిన్నెలో మరుగుతున్న పప్పుచారు-తప్పు-తప్పు-సాంబారులోపడి పవిత్రం చేసింది. ఈ పదార్థాలను, చక్కని బీరువాల్లో పెట్టి చలువ మడతల వాళ్ళు అందిస్తుంటారు, అహింసా తుపాకితో అలగా జనాన్ని కాల్చివేసినట్లు!

ఇంక నాకివ్వడానికి ప్రతిపాదించిన గది తాళం తీశాడు కుర్రాడు. ఆ తాళం ఏ తాళం చెవితోనైనా వచ్చేటట్లుంది. ఒకరి ఆస్తి మీద అందరికీ సమానమైన హక్కుందనే సోషలిస్టు సూత్రాన్ని అక్షరాలా పాటింపచేస్తున్నాడు హోటలు యజమాని.

తలుపు తెరిచాడు. ఇంకేం చెప్పను? నిజంగా ఇది ఇంద్ర భవనం, సిగరెట్టు పీకలు, కాళీ సిగరెట్టు పెట్టెలు, కాల్చి వేసిన అగ్గి పుల్లలు, ఎవరో కుస్తీపట్లు పట్టినట్లు కనిపిస్తూ పడకమీద నలిగిపోయిన సిగరెట్లు, సిగరెట్టు పెట్టెలు, వీటన్నిటి కంటే ఎక్కువ గాజుల మలారం పగిలినట్లు పడివున్న గాజులముక్కలూ, గోడలమీద వేసివున్న బొమ్మలూ, రెండు పగిలిపోయిన గ్లాసులూ, సీసాలు ఈ సమాజంలో స్త్రీల నుద్ధరించడానికి కట్టుకున్న కంకణపు ప్రతిరూపంలో వికటాట్టహాసం చేస్తున్నాయి.

గది శుభ్రం చేయమన్నాను. నావైపు వింతగా చూస్తూ బండెడు చెత్త ఎత్తి పోశాడు. మంచం మీది పరుపు కింద పారేసి. నా సంచిలో గుడ్డ పర్చుకున్నాను. ఫ్యాన్ కాలచక్రంలా తిరుగుతుంటే నా ఊహలు భూ భ్రమణంలా పరిభ్రమిస్తున్నై.

పడుపు వృత్తి నిజంగా భయంకరమైంది. కాని అంతకంటే భయంకరమైన అనేక వృత్తులు ఈ సమాజంలోని 90 శాతంగా ఉన్న దరిద్రుల మూలుగులు పీల్చి మృత్యువుకు అప్పజెప్పుతున్నాయి. ఒకని మనసు మార్చి తేదలుచుకున్న ప్రశాంత విప్లవాన్ని వేరొకరిపై శాసనమనే అంకుశంతో పొడవడం ఏమంత న్యాయమో విజ్ఞులైన తామే ఊహించుకోవాలి. ఉన్నవాడి మనసు మార్చడానికి శతాబ్దాలు గడపడం, లేనివాడి మీద శాసనపు పిడుగుల వర్షం కురిపించడం చూస్తే రాతి

యుగానికీ నేటి యుగానికీ వచ్చిన మార్పేమిటో దయతో శలవిస్తారా? రాతి యుగంలో దేహబలం జయిస్తే నేటి యుగంలో అర్థబలం జయిస్తూంది.

మీ ఉత్తరం విప్పాను. చక్కని కాగితం మీద ముచ్చటైన అక్షరాలు. ఆ ఉత్తరం తల మీద కొట్టొచ్చేట్టు కనిపించే మోనోగ్రాం కళ్ళను మిరిమిట్లు గొల్పింది. మీ ఉత్తరం ఎంత సంక్షిప్తంగా ఉంది? నేను కూడా మీకు అంత సంక్షిప్తంగా రాసే కాలం ఏనాటికోకదా!

నా క్షేమం తెలియపర్చమని రాశారు. మీకు- ఈ మాత్రం శ్రద్ధ మన సమాజంలో దారిద్ర్యం, హైన్యం, దైన్యం, ఆకలితో అలమటించి, కృంగి, కృశించి, నశించే కోట్లాది జనం విషయంలో ఉంటే ఎంత బావుండేది? తరువాత నా శరీరం గురించి రాస్తూ నీ 'అల్సర్'ను గురించి జాగ్రత్తపడమన్నారు. కోట్లకొద్దీ జనం తిన తిండిలేక, కట్ట గుడ్డలేక, రోగాల్తో, నొప్పుల్తో ప్రతిరోజూ మృత్యువుతో యుద్ధం చేస్తున్న సమయంలో నా 'అల్సర్'ను గురించి శ్రద్ధ తీసుకునే హక్కు నాకు ఉందనేగా మీ అభిప్రాయం?

మీవి బూజుపట్టి విరిగి పోయిన కొలబద్దలు. వాటితో పై నుంచి క్రిందికి కొలుస్తున్నారు. మీ కొలబద్దకు సమాజపుటినుప ఇరుసుల్లో పడి నశించే అనాధులూ, కుండ పొట్టల్తో, దిస మొలల్తో తిండికి అలమటించే బాలురూ, దొరతో పోట్లాడి వచ్చిన హరిజనుడూ, 90 ఏళ్ళ వృద్ధాప్యంలో సైతం ఆహారం లేక అలమటించే ఆ వైష్ణవుడూ, సాలె స్త్రీ, అందేవారు కాదు. నా కొలత వీరినుండి ప్రారంభం అవుతే మీకు ఆశ్చర్యం వేస్తుంది. వెటకారంగా కూడా ఉంటుంది కదూ?

నా ఉత్తరాలు చాలామందికి చూపుతున్నామని రాశారు. ఇదికూడా మీకొక వినోదమైంది!—

భవదీయుడు

**'దేహదాసు'**

ఉత్తరం (8)

# పాప పంకిలం

(భావదాసుగారి ఖుద్దుకు)

నమస్సులు. మీకు ఉత్తరం రాసిన వెంటనే ఈ కుహ్మర్థంలోంచి బైటపడుదామని మూటాముళ్ళె సర్దుకుంటుండగానే భీమా కంపెనీ ఏజెంటులాపట్టుకుంది నొప్పి. చంపేస్తూంది. వంటిని మెలి పెట్టేస్తూంది. అరుద్దామంటే ఆర్తత్రాణ పరాయణులంతా శంఖచక్రాద్యాయుధంబులు వదిలి పరిగెత్తుకొని వచ్చి క్షేమంగా బైటికి నడిపిస్తారేమోనని భయం. కాకుంటే మాత్రం ఏ నవలలోని నాయకునిలాగో జేబునిండా డబ్బుందా ఇక్కడ విరజిమ్మడానికి! నెత్తురూ కండాగల మనిషికి జేబునిండా డబ్బుండడం చూడనోచుకోనని ఆ రచయితలంతా అలా తమ నాయకులతో డబ్బు విరజిమ్మించి తృప్తిపడి ఉంటారు. ఈ గదిలో ఎంతోకాలం వుండే అదృష్టము లేదు. వెళ్ళిపోయే శక్తిలేదు. చెంబులో తలకాయ ఇరికించిన పిల్లిలా ఉంది పరిస్థితి. నొప్పి మెలికలు తిప్పుతూంది. ఒంటరితనం భరించేట్టులేదు. నలుగురిలో ఉంటే కాస్త ఊపిరి పీల్చుకోవచ్చునని ఇంద్రభవనంనుంచి చర్చావేదికకు దిగాను. మజ్జిగకు అర్డరిస్తే గంటైనా పత్తాలేదు. అది ఉత్తమ హోటళ్ళ లక్షణం. మోచేతుల వరకు మడచి రెండు చేతుల్నీ టేబుల్ మీద పెట్టి తల టేబుల్ కానించి బాధనోర్చుకోవడానికి ప్రయత్నిస్తున్నా. స్త్రీ జనాభ్యుదయాన్ని గురించిన మాటలు చెవుల్లో ములుకుల్లా గుచ్చుకుంటున్నాయి.

వేదయుగంలో స్త్రీకి అత్యున్నత స్థానం ఇవ్వబడిందట. స్త్రీని ఆదిశక్తిగా కొలవటం అందుకు నిదర్శనమట. రామాయణకాలంలోనే స్త్రీని బానిసగా చేసి ఊడిగం చేయించుకోవటం ప్రారంభించారట. భారత కాలం నాటికి స్త్రీ పురుషునికి భోగైక వస్తువుగా మారి జూదంలో ఓడే వస్తువుగా తయారు చేయబడిందట. బుద్ధుడు సైతం ప్రథమంలో స్త్రీలను మిక్కిలి నీచంగా చూచాడట. తదుపరి బ్రాహ్మణమతోద్ధరణ పేరుతో సహగమనాది ఆచారములు సృష్టించి స్త్రీని స్థిర చరాస్తుల కంటే హీనంగా చేశారట. అయితే ఆంగ్లేయులీదేశానికి వచ్చిన తర్వాతే స్త్రీలకు శుక్లపక్ష చంద్రునిలా గౌరవం పెరుగుతూ వాళ్ళు వెళ్ళిపోయే ఎఱకు మిగిలి

ఉన్న గండిని సనాతన ధర్మనిష్ణాతులు పూర్తిచేశారట. స్త్రీకి మళ్ళీ వేదయుగం నాటి గౌరవం లభింప జేయడానికి మహిళోద్యమానికై పాటుబడి పద్యాలు రాసిన నారీ లలామ విగ్రహాలు ప్రతిష్ఠితం చేయడానికి 20 లక్షలు వసూలు చేయవలసి ఉందట. స్త్రీ జనోద్ధరణకుగాను, సనాతన కళలైన భరతనాట్యాదులను ఉద్ధరించడానికి ఒక పాఠశాల నడిపిస్తున్నారనీ, వరకట్న నిషేధాన్ని గూర్చి గొప్ప గొప్ప వారితో (ఉల్లిగడ్డ నీతి) ఉపన్యాసాలిస్తున్నారట. షర్బతులూ, పిండివంటలూ చేయడాన్ని గురించిన భోగట్టా అందుకై ప్రత్యేకించబడిన పత్రికలద్వారా సోదరీమణుల కందిస్తున్నారట. చీరెలు, జాకెట్లు, పరికిణీలు, బెడ్‌షీట్లు వీటి మీద కుట్టే నమోనా లను గురించి ఉన్న వారికి బోధిస్తూ చేతిపనుల వాండ్లను ఉద్ధరిస్తున్నారట. పోతే మహిళలకు పురుషులతో పాటు 50% సీట్లు శాసన సభల్లో సంపాదించడానికి పాకిస్తాన్ ఫక్కీ ఉద్యమం నడపాల్సి ఉందట ఇత్యాదయ. అయితే ఆ వసూలైన డబ్బుతో వాళ్ళ పంపకం దగ్గర ఏదో తగాదా వచ్చిందని ఎక్కువ విరాళాలు పోగు చేసి తనకు సరియైన పదవి ఇవ్వబడ లేదని ఇంకేదేదో చదువుతూంది గుక్క తిప్పకుండా. మధ్యమధ్యన పకపకలు కికవికలు. ఆ ఉపన్యాసానికి రంగులు దిద్దుతూ విన సొంపుగా నున్నందున తల నేలకేసి వింటూ కూర్చున్న వాణ్ణల్లా తల ఎత్తేవరకు నాకు రెండు మూడు సీట్ల అవతల అత్యంతాధునిక వేషధారులైన చకోర దంపతులు స్త్రీ జనాభ్యుదయాన్ని గురించి మాట్లాడుతున్నారు. ఆ మహిళా నాయక లేత పసుపుపచ్చని ఉల్లిపొర చీర కట్టుకుంది. ఆమె ఉడుపులోని ప్రతీ నూలు పోగూ ఆమె శరీరాన్ని ఇతరులకు ప్రదర్శించాలనే ఆతురతను వ్యక్తపరుస్తూంది. బంగారు ఛాయ, ముఖం కోలగా ఉండి మాంసలములైపాల మీగడల్లాంటి కపోలాలూ, కొద్దిగా పొడుగైన ముక్కు పాడిలో పుట్టి పెరిగినట్లుండి ఆమె అందానికి వన్నె పెట్టుతున్నాయి. చెవులకు తాటికాయల్లాంటి నల్లని రాళ్ళు, జుట్టు పూర్వకాలపు ఋషుల్లా బర్మా ఫేషన్‌లో ముడివేసింది. ఉక్క చంపేస్తుంటే దాన్ని చంపేందుకుగాను యువకుడు బూడిదరంగు ఉన్ని కోటులో గాలి లోనికి చేరకుండా బంధించి "కంఠలంగోటీ" వగైరాలతో మేజోళ్ళ యుక్తమై పుల్‌షూతో వేడివేడి కాఫీ త్రాగి సిగరెట్టు వెలిగించి ఫ్యాన్ వేయమని సర్వర్ మీద అరుస్తున్నాడు.

ఆర్డరిచ్చి సరిగ్గా 75 నిమిషాలైందని తెలిసి కాబోలు సర్వర్ మజ్జిగ నా ముందుంచాడు. మజ్జిగ తాగుతూ ఆ యువకుని వైపు చూస్తున్నా. ఎక్కడో చూసినట్లు గుర్తొస్తూంది. అయితే ఆ ఉడుపుల్లో ఉన్న వాణ్ణి మందలించడం సంభవిస్తే చిన్న ప్రపంచ విప్లవం జరుగుతుందేమోననే భయంతో గప్‌చుప్‌గా కళ్ళు మాత్రం అప్పగించి చూస్తున్నా. ఆ యువకుడు కూడా నా వైపు అలానే చూస్తున్నాడు. అతడు కూడా అమాంతంగా ఈ దరిద్రుణ్ణి మందలిస్తే సోషలిస్టో, కమ్యూనిస్టో అయి పోతానని జంకుతున్నట్లున్నాడు.

మజ్జిగ ముగిసింది. సిగరెట్టువంతు వచ్చింది. యువకుడు లేచాడు. నా వద్దకు వచ్చాడు. మీరు...అంటూ ఓరి నువ్వా అని గట్టిగా కౌగలించుకున్నాడు. నొప్పి చస్తున్నాను. పైగా మగచేతులు! మేధస్సులో అడుగున పడిపోయిన స్మృతులు పైకి వచ్చే వరకు కొంతసేపు పట్టినా చటుక్కున గుర్తొచ్చింది. స్కూల్లో బలపాలకు ఎర్రచింత కాయలమ్మేవాడు. ఒక చింతకాయ తినడం అయిపోయిన తర్వాత ఇంకా ఊరించేవాడు. బలపాల్లేకున్నా అప్పు పెట్టేవాడు. అప్పు సమయానికి చెల్లించనివాణ్ణిలా పక్కలిరగ తన్నేవాడు.

కొత్తగా కలిసిన మిత్రునితో కావలసిన రోదన పారాయణాదికములు ముగిసిన తర్వాత నా పరిస్థితి వివరిస్తే చాలా చాలా జాలిపడ్డాడు. తన గొప్పతనం చెప్పి మెప్పు పొందడం ఒక కోర్కె. ఆ కండూతితోనే వాడు నన్ను సత్కారాగ్నిలోకి దింపాడు. నన్నో వింత మృగంగా చూస్తున్న నారీలలామకు నన్ను గురించి బ్రహ్మాండంగా (అంటే'ం'గా) పరిచయం చేసినా ఆమె ఫోటో కోసం వవ్వే నవ్వు నవ్వి నా పైనున్న భక్తి తరుగక దూరం నుంచే ఒక దండం పారేసింది.

నొప్పి మంటగా మారింది. పొట్టలో నిప్పుపెట్టి తిత్తిలో ఊదినట్లవుతూంది. కార్లో ఎక్కాం. (వీటిల్లో ఎక్కగూడదనే శపథం చేసినా గాంధీలాంటి వాళ్ళెక్కగా నేనెంత అని సంతృప్తిపడ్డాననుకోండి)

హాస్పిటల్‌ను చేరాం. గొర్రెల మందలు పడిగాపులు కాస్తున్నారు. మా కారు ఆగ్గానే డాక్టరుగారొచ్చారంటే డాక్టరుగారొచ్చారని అంతా లేచారు. తీరా మమ్మల్ని చూచే వరకు మెరుపు తర్వాత చీకటిలా అంతా మళ్ళీ మామూలు ముఖాలలో తలలు నేలకువేసి కూలబడ్డారు.

అది ఒక చక్కని భవనం. అయితే మెయిన్ రోడ్డులో ఉండటాన రెండు గదులు మాత్రమే దవాఖానాకు తీసుకొనబడ్డాయి. పారిశుద్ధ్యం అచ్చంగా పుస్తకాల్లో చదివినట్లుంది. వచ్చే జనాన్ని గూర్చిన సౌకర్యాన్ని అట్టే పట్టించుకోని ధన్వంతరి రోగుల ఆరోగ్యం చెడకుండేందుకు గాను ఆరుబైట ఫుట్‌పాత్ మీదనే వారుండే ఏర్పాటు చేసి ఈ ప్రాంతాల్లో మహా ధార్మికుడని గణనకెక్కాడని తెలిసింది. గోడలనిండా చక్కని కేలండర్లు స్త్రీల అవయవాల్ని నేనంటే నేనని పోటీపడి చూపిస్తూ ఆయా కంపెనీల వారికి హిమాలయం లాంటి లాభాల్ని చేకూర్చి పెడుతు న్నాయి. అయితే వారంతా సంపత్తి దానం చేసేవారు కాబట్టి ఈ పాపం పరిహారం కాకపోతుందీ! సరిగ్గా ఈ హాస్పిటల్‌కు ముందే ఇంకో హాస్పిటల్ యివే యోగ్యతలు గల డాక్టర్ ఇంతకంటే చక్కటి కేలండర్లను ఉంచి సమయానికి ముందే వచ్చి ఈగల్ని కొడుతూ కూర్చున్నాడు.

బీరువాల్లో మందులు కొద్దిగానే ఉన్నా దూది చుట్టలు మాత్రం 20 బీరువాల నిండా ఉన్నట్లున్నాయి. బహుశా వత్తులు చేసి రోజూ దీపారాధన చేస్తారేమో! పక్క

మున్న గదిలో చక్కని కుర్చీ. దానికో తెల్లనికోటు తగిలించి ఉంది. అది తొడు క్కొని డాక్టర్ ఫాదర్ అయిపోయి అందరి పాపాల్ని హరిస్తాడు కాబోల్ను! ముందున్న టేబుల్ మీద చక్కని టేబుల్ క్లాత్. దానిమీద వివిధములైన బొమ్మలు కొన్ని పెట్టున్నాయి. వివిధ కంపెనీల వారందించిన డైరీలు దొంతర్లుగా పడి ఉన్నాయి. దానికి దగ్గరే తెరవేసి గదిలా తయారుచేయబడిన దానిలో ఒక మంచం లాంటి బల్ల రోగుల శల్యపరీక్షకై ఏర్పరచబడింది. కార్లో వచ్చిన వాళ్ళం కాబట్టి ఆ గదిలో ప్రవేశింపచేయపడ్డాం.

నాకు సరిగ్గా ఎదురుగా ఒక తురుష్క యువతి అవయవాల్ని దాచుకొన డానికి సరియైన ఆచ్ఛాదనం లేక వక్షోజాలపై చేతులు కప్పుకొని చింకి బట్టలోంచి అవి కనిపించకుండేందుకు విఫలప్రయత్నం చేస్తోంది. అసంస్కృత కేశాలు చిందర వందరగా పడివున్నాయి. ఆమె కూర్చున్న భంగిమను ఏ కొద్దిగా మార్చినా మానం దక్కదు. బంగారాన్ని మించిన ఛాయ, మాంసహీనములైన నేత్రాలు, పాలిపోయిన కపోలాలు కలిగి ఉన్నా సహజంగా ఆమె మిక్కిలి అందగత్తె. జ్వరం తీవ్రంగా ఉన్నట్లుంది. మగత రొప్పుతూంది. చూచే నాథుడు లేడు. దుప్పటిగా ఉపయోగించు కోవడానికి తెచ్చిన ఛిద్రాలుగల కండువా ఆమె చలిని ఆపేట్టులేదు.

కాంపౌండర్ యంత్రంలా పనిచేస్తున్నాడు. డబ్బు తీసుకొని మందుపోసి ఇవ్వడం. "పాలు బాగా తాగాలి, పులుపు తినవద్దు, విశ్రాంతి తీసుకోవాలి." ఆదిగా గల పురమాయింపులతో మందలిస్తున్నాడు. ఒక అవ్వ కిటికీ దగ్గరకొచ్చి "అయ్యా పోరడు ఎట్లనో చేస్తాండు గుడ్లు తేలేస్తాండు. పాలు తాగడంలేదు. కాస్త గట్టి మందియ్యిరి" అన్నది. ముప్పావలా ఇవ్వు రేపటికల్లా రోగిగాని రోగంగాని ఉండరని, ముసిముసి నవ్వులు నవ్వుతూ సీసానింపి ఇచ్చాడు. ప్రాణాలతో కాదు నాణేలతో పని అన్నట్లుగా.

డాక్టర్ వచ్చాడంటే, డాక్టర్ వచ్చాడని కలకలం బయల్దేరింది. డాక్టర్ గదిలో ప్రవేశించగానే మావాడు ప్రత్యుద్ధానం చేయడమూ డాక్టర్ 'హల్లో' అని నమస్కరించినంత పనిచేసి ప్రతి నమస్కారం స్వీకరించి కరచాలనంచేసి ఫాదిరీ కోటు వేసుకొని గత రాత్రి చూచిన ఇంగ్లీషు చలన చిత్రాన్ని గురించి ముచ్చ టించుకున్నారు. జన ప్రవాహం ప్రారంభమైంది. డాక్టర్ ఒక రోగికి నాడిచూస్తు న్నాడు. ఇంకొకళ్ళకు స్టెతస్కోపుతో పరీక్షిస్తున్నాడు. వేరొకని పొట్టలో గుచ్చి చూస్తున్నాడు. మరొకతె కంటి రెప్పలు చీల్చి చూస్తున్నాడు. చీట్లు రాస్తున్నాడు. మావాడితో మాత్రం మాట్లాడుతూనే ఉన్నాడు. ఏ రోగికీ డాక్టర్‌తో మాట్లాడే ధైర్యం చాలటం లేదు. "అయ్యా! నీ కాల్మొక్త పోరడు చచ్చేట్టున్నడు జర్ర చూసిపోరా" అన్నాడు డొక్కలేని దౌర్భాగ్యుడొకడు. వారి సంభాషణకు అంతరాయం కలిగించాడనే కోపంతో "తీసికొనిరా పో" అని కసిరాడు. ఝం ఝూ మారుతానికి లేచిన గడ్డి పరకలా అంతదూరం పడ్డాడు పేదవాడు. ఇంకొక రోగి

వచ్చింది. "జ్వరం కాదూ! కాంపౌండర్ జ్వరం చూడు" అని పురమాయించి సంభాషణ తిరిగి కొనసాగిస్తున్నాడు. ఇంకొక రోగి చెయ్యి చూస్తూ సంభాషణకు బ్రేక్ వేసి, పథ్యం చెపుతున్నాడు. జరీ అంచుగల రుమాలు చుట్టుకొని అక్కడక్కడ తూట్లుపడ్డ చొక్కా తొడుక్కున్న షాహుకారు వంతు వచ్చింది. "ఓహో! మీరా! ఒక్క నిమిషం బ్రదర్" అని ఆయన్ను ఆ శల్యపరీక్షశాలలోకి నెట్టి, క్షణంలో చేతులు తుడుచుకుంటూ, బైటికివచ్చి, ఇది క్షయ అన్నాడు డాక్టరు. "ఆఁ" అని నోరు తెరిచాడు సెట్టి. "తరువాత సావకాశంగా మాట్లాడుకుందాం కూర్చోండ"ని వేరేవాడి గుండె చూడ్డం ప్రారంభించాడు.

మావాడు తన లోకాభిరామాయణంలో నన్ను మరచినట్లున్నాడని ఒక గట్టి మూలుగు మూలిగాను. అప్పుడుగాని నేను మావాడికి గుర్తుకొచ్చానుకాను. మావాడు నన్ను గూర్చి గొప్పగా పరిచయం చేసినా నా రూపూ వేషం అతని మీద పెద్దగా ప్రభావం చేయకున్నా మావాణ్ణి సంతోషపెట్టడాని కన్నట్లుగా నాకో షేక్‌హ్యాండ్ పారేసి నన్ను ఆ శల్య పరీక్ష గదిలోకి తీసుకెళ్ళాడు. పొట్టంతా నొక్కి చూచి గట్టి జబ్బేనని చేతులు కడుక్కొని తువ్వాలుతో తుడుచుకుంటూ బైటికి వెళ్ళాడు.

ఆ తురుష్క యువతి వంతు వచ్చింది. డాక్టర్ ఆమె నాడి చూస్తున్నాడు. సిగ్గు ఆమెను క్రుంగతీస్తోంది. ఆమెది టైఫాయిడ్. డాక్టర్ ఇంజెక్షన్ ఇస్తానన్నాడు. ఆమె రిక్తహస్తం చూపింది. డాక్టర్ ఆమెను వెళ్ళిపొమ్మన్నాడు. నా హృదయం దహించింది. జేబు నీళ్ళు జల్లింది. మౌనం వినా గత్యంతరం లేకపోయింది.

ఇంకా రోగుల్ని పరీక్షిస్తున్నాడు. నాకు పథ్యం చెపుతున్నాడు. మూడు గంటల కొకసారి కనీసం కప్పు పాలు తాగాలి. ఎలాంటి విచారమూ పెట్టుకోరాదు. మనస్సు సంతోషంగా ఉండాలి. అన్నం కంటే కూరలు ఎక్కువగా తినాలి. బాగా విశ్రాంతి తీసుకోవాలి. ఇత్యాది లక్ష నియమాలు చెప్పి ఒక పది మందుల లిస్టు రాసి వాటిని వాడాల్సిన విధం ఒక భారతంలాంటి కాగితంమీద రాసి మావాడి కప్పగించాడు.

పాలు, విశ్రాంతి, చిత్తశాంతి ఇవి మా దేశంలో ఎవరికున్నాయి. నాకుంటానికి! అసలు ఈ రోగం ధనికులకు రావల్సిందో లేక చికిత్స ధనికుల కోసం ఏర్పడ్డదో అర్థం కాలేదు. అయిదు రూపాయలు ఇవ్వలేక చావటానికి సైతం సిద్ధమైన అందాల అబల నా ముందు ప్రత్యక్షమై నన్ను వెక్కిరిస్తూంది. "నీ కోసం ఇంత భారీ ఖర్చు చేసుకుంటావా?" అని.

మా వాడి ఇల్లు చేరాం. అర్థ చంద్రాకారంగా అత్యంతాధునిక పరికర యుక్తమైన అమోఘమైన భవనం అది. ఒయ్యారం కురిపిస్తున్న నారీ లలామ నాకు స్వాగతం చెప్పింది. క్షణంలో పాలు, పండ్లు, కూరలు, మందులు, నర్సులు ప్రత్యక్షమయ్యారు. ఆ నారీమణికి నా పైన ఆప్యాయత ఎక్కువైంది. దైవోప

చారాలు జరుగుతున్నాయి. అయితే మా వాడు కుబేరుడు కావడానికి చేస్తున్న విచిత్ర వ్యాపారాన్ని గురించి తెలుసుకున్నాక అందులో నిలువలేక పోయాను. అనేక కంకాళాలు నా చుట్టూ చేరి వికటాట్టహాసం చేసినట్లు అనిపించింది. మరు నాడు అక్కణ్ణుంచి వెళ్ళిపోయాను.

భవదీయుడు

'దేహదాసు'

ఉత్తరం (9)

# మాయ సాములు

(భావదాసుగారి ఖుద్దుకు)

నమస్సులు. సుమారు సంవత్సరం తరువాత తమకు వ్రాస్తున్నాను. ఇంత కాలం నుంచీ ఈ కడుపునొప్పి ఫ్యాక్టరీ యజమానిలా పీల్చి పిప్పి చేసింది. అల్లోపతీ క్వారి ఇంజక్షన్లూ, ఆయుర్వేదం వారి మాత్రలూ, హోమియోపతీ వారి గ్లోబుల్స్ అన్నీటివంతూ అయిపోయింది. అయినా మన సనాతన దేశంలో కర్మతీరి రోగం తగ్గడమో ఆయ్యుష్యం మూడి కైవల్యం చేరడమో జరగాలి గాని చికిత్స జరుగు తుందా? ఇక్కడ ప్రాణులు కారు పైసలు లెక్కకు వచ్చేది. ఈ నెప్పి-భౌతిక కాయంతో మాత్రమే అంతంకాగల ఈ యాతన - తోనే ఊరు ఊరూ పల్లెపల్లె తిరుగుతున్నా. రేపుచచ్చేవాడు ఈరోజు తన శ్రమను అమ్ముకోంది జీవించలేని ఈ దేశంలో నాదీ ఒక బాధేనా అనిపిస్తూంది. సూర్యుడు అగ్గి కురిపిస్తున్నాడు. రక్త బిందువులు లెక్కపెట్టి తాగేస్తున్నాడు. కడుపులో అగ్ని జ్వాలలు రేగుతున్నాయి. అడుగు ముందుకువేసే స్థితిలోలేను. అయినా నడవాలి. మంటనార్పాలంటే పాలు-మజ్జిగ, బిస్కెట్లు - వెన్న కావాలి. అమెరికాలాంటి దేశంలో రావాల్సిన రోగం. భగ్గున మండిపోతున్న భారతదేశంలో వస్తే ఎలా? చావు వినా గత్యంతరంలేదు. చూస్తూ ఎలా చస్తాం. అయినా బాధలకు అంతం కాదట! మళ్ళీ జన్మలో బాధ పడాల్సిందేనట!! అలాంటప్పుడు చావడం ఎలా ? బ్రతకడం మాత్రం ఎలా? చస్తూ బ్రతకాలి.

కనుచూపు మేరలో కొన్ని గుడిసెలు కనిపిస్తున్నాయి. అది ఒక ఊరు అయివుండాలి. అక్కడ నాకోమిత్రుడున్నట్లు జ్ఞాపకం. కాసిన్ని మజ్జిగైనా దొరుకుతే ప్రాణం నిలుపుకోవచ్చు ఈనాటికి. ఎండుడొక్కతో సైతం కాళ్ళు శరవేగంతో పరిగెత్తుతున్నాయి. ఆశయేకదా అసువుల్ని నిలిపేది!!

ఊరి ముందుచేరా. అంతచిన్న ఊళ్ళో అనంత జనవాహిని కనిపించింది. పిన్నా, పెద్దా, స్త్రీలు, పురుషులు, ధనికులూ, పేదలూ, బట్టల్లేనివారూ, పీతాంబర దారులూ, అంతా కూడివున్నారు. ఒంటెద్దుబళ్ళు, రెండెద్దుల బళ్ళు, గుఱ్ఱాలు, గాడిదలూ, ఒకటేమిటి అన్నిరకాల జంతువులూ, కనిపిస్తున్నాయి. చెట్లక్రిందా బండ్ల క్రిందా తెరలు కొట్టుకొని వంటలు చేసుకుంటున్నారు. సద్దులు విప్పి అర్ధనగ్న శరీరులు అన్నాలు తింటున్నారు. పక్కనే ఉన్న మురికి గుంట లాంటి బావిలోంచి నీరు తోడుకొని తెచ్చుకుంటున్నారు. త్రాగుతున్నారు.

ఒక సంసారం. చిరిగిన చీర నాలుగు కట్టెలకూ కట్టుకొని నివాసం చేస్తున్నారు. ఒక అబల. అందవతి. డోక్కుపోయిన ముఖం, పీక్కుపోయిన కండ్లూ, రేగిపోయిన జుట్టూ, ముసురుతున్న ఆశలూ కల్గి కటిక నేలమీద పడివుంది. వాంతి చేసుకుంటూంది. విరేచనాలు కూడా అవుతున్నాయి. అది కలరా. అక్కడ సూది మందులు లేవు. నీటి మందుల్లేవు. పరిగెత్తుకొని వస్తున్న ఒక యువకుని చేతిలో మురికి నీళ్ళు ఉన్నాయి. పరిగెత్తుకొని వచ్చి 'సామి ప్రసాదం'. తాగు. బీమారి తగ్గుతది అంటూ ఆ అమ్మాయితో తాగించాడు. చుట్టుపట్లవాళ్ళంతా దూరంగా వెళ్ళిపోతున్నారు. స్వీయ రక్షణార్థం, "శరీర మాద్యం ఖలు ధర్మసాధనం."

ఊళ్ళో ప్రవేశిస్తే జనం కిటకిట్లాడిపోతున్నారు. ఈగలు ముసురుతున్న మిఠాయి కొట్టుచుట్టూ దిసమొలల బాలురు మూగి ఉన్నారు. జనాన్ని త్రోసుకుని లోపలికి వెళ్ళడం సాధ్యపడలేదు. ఒక బంగళా. ఆ బంగళా ముందు జనం ఈగల్లా మూగి ఉన్నారు. మురికి కాలువ ఊరి మధ్యనుంచి ప్రవహిస్తూంది. నీరే దొరకని ఊళ్ళో ఈ ప్రవాహం ఏమిటి? ఆశ్చర్యం. ఊళ్ళోంచి దారి దొరకడం అసాధ్యం అని ఊరి బైటనుంచి బైల్దేరా. ఈ గొడవేమిటో తెలుసుకునే ఓపిక కూడాలేదు. మిత్రుని ఇంటికి చేరాలి. అదొక్కటే ధ్యాస. కాళ్ళు యంత్రప్రాయంగా ఒక గుడిసె ముందు చేరాయి. అదే మా మిత్రుని ఇల్లు. అతని కోసం అడిగాను. లేడు. ఒకనెత్తి నెరిసిన పెద్దవ్వ కుక్కిమంచం మీద పడుకొని "ఖసుక్కు ఖసుక్కు" మని దగ్గుతూంది. ఆమెకండ్లు గజం లోతు ఈడ్చుకోపోయాయి. కంట్లో ప్రాణాలేమోగాని కళ్ళే కనిపించేట్లులేవు. చొరవ చేసుకొని లోపలికివెళ్ళా. అతని భార్య ఉంది. నాపరిచయం నేనే చేసుకున్నా. ఆమె కరుణామయి. నా పరిస్థితి చూచి నిలువునా నీరైంది. నన్ను కూర్చోమని, మజ్జిగకు గాని బైల్దేరింది. నామంట నన్ను కూర్చోనిచ్చేట్లుగాని పడుకో, నిచ్చేట్లుగాని, నించోనిచ్చేట్లుగాని లేదు. ఎటూ తోచక పిచ్చివానిలా తిరుగుతున్నా. ఆమెకోసం వేయికళ్ళతో ఎదురుచూస్తున్నా. క్షణాలు యుగాలుగా గడుస్తున్నాయి. ప్రాణం నిలువునా పోయేట్లుంది. ఇక్కడ ప్రాణంపోతే ఎలా ? అని బాధ. నేను అనుభవించే ఆనందానికి దూరం అవుతానని కాదు. ఈ పేదకొంపలో చస్తే నా మిత్రుని మీదపడే భారాన్ని గురించి.

ఆమె రాలేదు. అతడు వచ్చాడు. నన్ను గుర్తించలేదు. నేను గుర్తుపర్చుకున్నా. కావిలించుకున్నాడు. అతని వేడికన్నీటి బొట్లు నా వీపుమీద పడినాయి. నా స్థితిచూచి ఏడ్చాడు. ఏడ్పు తప్ప మనకు గల ధనం ఏముంది కాబట్టి! అతడు నిర్విణ్ణుడైనాడు. నా బాధ చెప్పుకోలేదు. నా బాధ దవాగ్నిలా పెరుగుతూంది. ఆమె వచ్చింది. వట్టిముంతతో. నా ప్రాణాలు నిలువునా పోయినాయి. ఆమె లోపలి నుంచి గంజి తెచ్చింది. అమృతంలా ఉంది. కడుపునిండా తాగా. మాట్లాడలేని పరిస్థితిలో మంచంమీద ఒరిగా. మావాడు నన్ను పలకరించలేదు. నేను పలకలేదు. నిద్ర పోయా. ఈ జనం ఏమిటి? ఈ గంద్రగోళం ఏమిటి? ఏదీ అడగలేదు.

మెలకువ వచ్చింది. కళ్ళు తెరిచాను. అంధకారం. జీవితపు ఎడారిలో ఎక్కడో కన్పించే ఒయాసిస్సులా మిణుకు మిణుకు మంటున్న దీపం ముందు కూర్చుని ఓ వాడు పత్రిక చదువుతున్నాడు. నేను లేచానని ఆ దీపం నా దగ్గరికి తెచ్చి కూర్చొని నన్ను గురించి అడిగాడు. సవివరంగా విన్నవించాను. పట్టభద్రుడనైన నేను పడుతున్న బాధల్ని చూచి అతడు కంటతడి పెట్టుకున్నాడు. నేను ఊళ్ళో కోలాహలాన్ని గురించి అడిగాను..

" హిమాలయా పర్వతాల నుంచి ఒక రుషి వచ్చాట్ట. అతడు ఎక్కడో చెట్టు కింద కళ్ళు మూసుకొని జపం చేసుకుంటూ ఉండగా ఆ ఊరి సాహుకారు చూశాడు. ఆ సాహుకారికి దమ్మురోగం. అతడు ఆ రుషికి సాగిలపడి మొక్కి తన బాధ చెప్పుకున్నాట్ట. కొద్దిగా నీళ్ళు తెచ్చి అతని కాళ్ళు కడగమన్నాడు. సాహుకారు అలాగే చేశాడు. వెంటనే జబ్బు తగ్గింది. ఆ సాహుకారు ఆ యోగీశ్వరుని తన ఇంటికి తెచ్చాడు. ఈ వార్త అగ్గిలా పాకిపోయింది. జనం చీమల పుట్టల్లా తయారౌతున్నారు. నన్ను అతని దగ్గరికి తీసికెళ్తానన్నాడు మా మిత్రుడు. నాకు యోగిమీద నమ్మకం లేకున్నా అతన్ని చూడాలనే ఆదుర్దా కలిగింది.

ఆ రాత్రే అక్కడికి బైల్దేరాం. ఆ ఇంటికి రెండు ఫర్లాంగుల దూరం చీమ దూరే సందు లేకుండా ఉంది. బహుప్రయత్నం మీద ఆ ఇంటి అరుగు దగ్గరకి చేరాం. రెండు పెద్ద గంగాళాల్లో నీరు నింపి ఉంది. దాని ప్రక్కనే ఏదో ఒక చెక్క పర్వతంలా అడ్డై పడివుంది. ఒక బల్లమీద కాషాయవస్త్రాల మనిషి ఒకడు కూర్చుని ఉన్నాడు. అతడు వచ్చిన వానికల్లా నీళ్ళు పోస్తున్నాడు. నీరు పోసిన మనిషల్లా అక్కడ ఉన్న మురికి కాలువలో పొర్లుతున్నాడు. అతడు లేవగానే మరి కొన్ని నీళ్ళుపోసి ఒక చెక్క పేడు పారేసి బెత్తంతో కొందరిని చిన్నగా కొందరిని గట్టిగా వారివారి తాహతును బట్టి అంటిస్తున్నాడు ఆ యోగీశ్వరుడు. జనం నెట్టుకుంటున్నారు. తొక్కుకుంటున్నారు. తిట్టుకుంటున్నారు. ఆడా మగా భేదం లేకుండా తోసుకుని ముందుకు రావడానికి ప్రయత్నిస్తున్నారు. స్వామి ముందు ఒకే ఒక పెట్రోమెక్సు ఉంది. జనంలో కల్లోలం రేగింది. కొట్టండి, తన్నండి, గుద్దండి, అని అరుపులు వినబడుతున్నాయి. జనం గొర్రెల మందలా అటు పడ్డారు. ఎవరో ఒక అమ్మాయిని పట్టుకొని లాగారట. అతని మీదికి ఈ దాడి. ఈ త్రొక్కిడిలో ఓ అంఛే ఓ అని కేకలు వినిపిస్తున్నాయి. ఎంత మంది ఎవరి కాళ్ళ క్రింద పడి నలిగి పోతున్నారో ఎలా తెలియాలి? ఇంత గంద్రగోళం జరుగుతున్నా పోలీసు పేరుకైనాలేదు. మత స్వేచ్ఛగల మనదేశంలో పోలీసులు కల్పించుకుంటారా?

అడావిడి కొంత అణిగింది. జనం మళ్ళీ నీటికి ఎగబడ్డారు. నేను ఆ కూర్చున్న వాడే స్వామి అనుకున్నా. కాని ఆయన శిష్యుడు మాత్రమేనట. స్వామి లోపల జపం చేసుకుంటున్నాడట. మా వాడి ప్రయత్నంతో బంగళాలో చేరగలిగాం. బంగళా నిండా యువతీమణులు, ధగధగ మెరిసే బట్టలూ, జగజగ మెరిసే

సొమ్ములూ, తళతళ మెరిసే బొట్లూ గలిగి గుసగుసలాడు కుంటున్నారు. మా ఇద్దర్నీ వింత మృగాల్లా చూశారు. మా వాడు ఆ ఇంటియజమానితో ఏవో మాట్లాడి నన్ను ఒక గది ముందుకు తీసుకెళ్ళాడు. అది స్వామి వారిగది. ఆయన భోంచేస్తు న్నారు. భోంచేసేదాకా కూర్చోమన్నారు. కూర్చున్నాం.

అర్ధగంట తరువాత తలుపు తెరువబడింది. స్వామి పట్టెమంచం మీద శేషునిపై నారాయణునిలా శయనించి ఉన్నారు. మంచి ఆజానుబాహు విగ్రహం, కసరత్తు చేసిన లాంటి కండలు తీరిన శరీరం. నున్నని గుండు. స్వామిలా లేడు సిపాయిలా ఉన్నాడు. మంచి సిల్కు కాషాయ వస్త్రాలు ధరించి సాక్సుపైన ఫ్లెక్సుషూ తొడిగాడు.

ఒక బంగారు రంగు యువతి. నన్నని నాజూకైన శరీరం, తాకితే కంది పోయేట్లు ఉంది. పాల మీగడల్లాంటి బుగ్గలు, ఎఱ్ఱని పెదవులూ, విశాలమైన నేత్రాలూ, తుమ్మెదల గుంపులాంటి జుట్టు కలిగి ప్రబంధనాయిక ప్రాణం పోసు కున్నట్లుంది. లేత గులాబిరంగు ఉల్లిపొర చీర ఆమె శరీరాన్ని కప్ప లేక పోతూంది. ఆమె స్వామికి కాళ్ళు పిసుకుతుంది. ఆమె సాహుకారి భార్య. సంతానం లేదు. ఈ విధంగా మూడు రోజులు స్వామికి సేవలుచేస్తే పిల్లలు పుడ్తారట!!

మేం గదిలో ప్రవేశించాం. స్వామి ధ్యాన నిమగ్నులై ఉన్నారు. స్వామి ప్రసాదం అందించబడింది. వివిధ రకాల పిండి వంటలు. సన్యాసులకు తగిన ఆహార మేమో? నా ముందుకోపళ్ళెం వచ్చింది. క్షమించమన్నా. పాలు ఇవ్వబడ్డాయి. పుచ్చుకున్నా. స్వామి ధర్మమా అంటూ కడుపు చల్లబడింది.

స్వామి కళ్ళు తెరిచారు. ఆయనకు తెలుగు రాదు. వస్తే ఇంత గౌరవం ఎక్కడిది? మా వాడు నా బాధంతా వల్లించాడు. నేను కాదన లేక పోయాను. స్వామి శ్రీపాదతీర్థం లభించింది. అది మురికినీరు. మట్టి పేరుకొని ఉంది. నేను తాగనన్నా. స్వామి బెత్తం తీసుకున్నారు. నేను వణికిపోయా. బెత్తం ఎత్తారు. 'ఆగు' అని అరిచా. అంతా నిర్విణ్ణులైనారు. 'నువ్వు దొంగవు. నాకు తెలుసు. ప్రజల్ని మోసగిస్తున్నావు. సన్యాసికి ఉండాల్సిన లక్షణాలు........' అంటూండగానే సాహుకారు నా నోరు మూసి బైటికి పంపించారు. ఒగర్చుకుంటూ స్వామి మంచంలో కూల బడ్డాడు. నేను మా వాడితో కలసి వెళ్ళిపోయా. నేను తెల్లారితే బతక నన్నారు జనమంతా. ఆ రాత్రే అక్కడినుంచి ప్రయాణం అయినా.

ఇది వారంరోజుల క్రితపు విషయం. ఇవ్వాళ తెలిసింది, ఆ స్వామి ఆలివతో సహా అదృశ్యం అయినాడని.

ఇది ఐహిక (secular) రాజ్యమేనా ?

భవదీయుడు

'దేహదాసు'

ఉత్తరం (10)

# గి రి జ ను లు

(భావదాసుగారి ఖుద్దుకు)

ఇది వర్షకాలం. ఇది మా ప్రజలకు హర్షకాలం. మబ్బులు ఆకసంలో కమ్ముకుంటే నెమలికంటె ఎక్కువ ఆనందిస్తారు మా పల్లె జనులు. ఈ కాలం రైతులకే కాదు. దేశానికే ప్రాణం. ఉన్నవాడికీ లేనివాడికి ఇంత కూడూ గుడ్డా పెట్టగలిగింది ఈ కాలమే. పల్లెల్లో హలం ఆడడానికీ నగరాల్లో భేతాళునిలాంటి చక్రాలు తిరగడానికీ, ప్రభుయంత్రం సాగడానికీ అన్నిటికీ ఈ కాలమే ఆధారం.

ఆకాశం మబ్బులతో నిండుతుంది. సింహంలా, సముద్రంలా గర్జిస్తుంది. జనం అర్జునుణ్ణి తల్చుకుంటారు. ఆకాశం తళుక్కుమంటుంది. రైతుల, కూలీల గుండెల్లో ఆశాజ్యోతి మెరుస్తుంది. వర్షం ధారాపాతంగా కురుస్తుంది. ఆకలితో, దప్పితోనున్న భూమిని తడుపుతుంది. నేల పసిరిక కప్పుకుంటుంది. హలం భూమిని చీలుస్తుంది. వీత్తులు నిండుతుంది. ఏర్లు పొంగుతాయి. యవ్వనవతులై ప్రవహిస్తాయి. పొడుగైన తాటిచెట్టు నీడలా ఎవ్వరికీ పనికిరాకుండా పోయే నదులు అనేకం ఉన్నాయి. ఉప్పెన తెచ్చి దేశానికీ ప్రజలకు ముప్పు తెచ్చినప్పుడు విరాళాల పేరుతో కొందర్ని ఉద్ధరించే నదులు కొన్ని ఉండగా, అరటి చెట్టులా అన్నిటికీ ఉపయోగించే నదులు కొన్నే ఉన్నాయి.

వర్షం పడుతుంది హర్షం పెరుగుతుంది. ఎండు డొక్కల్తో జంతువులూ, మనుషులూ కట్టు నాగళ్ళ సహితంగా అడవి చేర్తారు. ఊళ్ళు వదులుతారు. భూమాతను ఆడా, మగా భేదం లేకుండా కరువుతో యుద్ధం చేయడాని, నాగళ్ళూ, గొడ్డళ్ళూ, కొడవళ్ళూ పట్టుకొని పరుగెడతారు. తమ స్వేదంతో భూమిని తడుపుతారు. గింజలు చల్లుతారు. తర్వాత....? వర్షం మా దేశానికి అమృతం. ఆ అమృతం వర్షించే దేవుడు పర్జన్యుడు. ఆయన దయకై వేచి యుంటారు. మానవుడు ప్రకృతిపై ప్రభుత్వం చలాయిస్తూ చంద్రమండలానికి ప్రయాణం పోతున్న ఈ రోజుల్లో, సరిహద్దులు మిలిగి లోకం ఏకం కావడానికి ప్రయత్నాలు జరుగుతున్న ఈ రోజుల్లో, మృత్యువుతో పోరాడి జయించడానికి ప్రణాళికలల్లుతున్న ఈ

రోజుల్లో, మానవతను నాశనంచేసే ఈ రాణాయుధాలను మానవ కళ్యాణానికి వినియోగించడానికి ఉద్యుక్తులౌతున్న ఈ రోజుల్లో, మా రైతులు, మా కూలీలు, మా భూస్వాములు, మా జమీందారులు, మా ప్రభుత్వం, మా మిల్లులు, అన్నీ పర్జన్యుని దయమీద ఆధారపడాల్సిందే. ఇది వేదకాలం నుంచి వస్తున్న ఆచారం. ఇందులో నేటికీ మార్పులేదు. మార్పులేకుండా ఉంచడానికి ప్రయత్నించే మహా మహులున్నారు.

ఇది వర్షకాలం. మానవునికి హర్షకాలం. ఆకాశం మొగిళ్ళుకప్పి ఉండాల్సింది. భూమి నీటితో తడిసి ఉండాల్సింది. నేల పచ్చని పంటలు కప్పుకోవాల్సింది. దినకరుడు చండ ప్రచండుడై మండిపోతున్నాడు. పర్జన్యునికి పవనుని సహవాసం లభించింది. భూదేవత కాగిపోతూంది. ఆకాశం ఎర్రవారింది. ప్రజలు నల్లపడ్డారు. నేనూ నల్లపడి ఉప్పు పేరిన ముఖంతో చచ్చుపడ్డ కాళ్ళతో నడుస్తున్నాను.

అడవి. ఊరివాసన ఎక్కడా లేదు. కాని పది పర్ణశాలలు కన్పిస్తున్నాయి. ఇది ఇంకోకాలమైతే రుష్యాశ్రమం అనుకునేవాణ్ణి. కాని ఇది రుషుల కాలం కాదు. మరి ఈ అడవిలో ఈ గుడిసేమిటి? ప్రతి గుడిసె ముందూ పశువులున్నాయి. అవి తమ మల మూత్రాల్తో ఆ ప్రదేశాన్ని పవిత్రం చేస్తున్నాయి. రాతి యుగంనాటి గుడిసెల్లా కనిపించేవాటిలో, ఆఫ్రికా అడవుల్లో - అనాగరక దేశంలో - ఆదివాసులు నివసిస్తున్నలాంటి పూరిగుడిసెల్లో మనుషులు నివసిస్తున్నారు. వీరు ఆదిమజాతుల వారేనేమో? ఎర్రని లంగా అద్దాలతోసహా కుట్టి ఉన్నది. నాలుగు చీరలకు సరిపోయే గుడ్డ, మంచి 5 చీరల ఖరీదుచేసే పరిఖిణి, సంస్కృత నాటకాల్లో కనిపించే లాంటి వీపు కాళీగా ఉన్న రవిక, దుప్పటికంటె మందమైన గుడ్డా, నేడు నవనాగరకులు కొత్తగా నేర్చుకుంటున్న అద్దాల పనితనం చేయబడినట్టి రవికలు ధరించిన నారీమణులు, దేహ దార్ఢ్యత వయసు సొంపూగలవారు కనిపిస్తున్నారు. మోకాలి వరకు నెట్టుకున్న ఎర్రని కావిపంచా, నెత్తికి పెద్ద రుమాలు వినా మిగతా నగ్న శరీరంగల పురుషులూ, అతి నగ్నంగా నెత్తికి ముందు భాగంలో కొద్దిగా జుట్టుంచి మిగతా నున్నని తల గల బాలలు ఆ ఆశ్రమంలో ఉన్నారు.

వీరు లంబాడీలు. అనాదినుంచీ అడవుల్లో ఉంటున్నారు. వేల సంవత్సరాల తర్వాత సైతం వారు ఊరికి చేరలేక పోయినారు. వారిని చేర్చే ప్రయత్నం ఇంతవరకు జరగలేదు. జరిగితే వినోదంకోసం జరిగింది. వీరు పురాతన భంగిమల్ని పరిపోషించడానిగ్గాను వీరని ఊళ్ళకు తీసుకొని పోరాదు. వీరి విలక్షణ సంస్కృతిని రక్షించడానికిగాను వీరి దారిద్ర్యాన్ని దూరం చేయరాదు. వారి ఉడుపులు మారుస్తే వారి ప్రత్యేకత మంట కలుస్తుంది. ఈ సనాతన సంస్కృతి పరిరక్షింపబడాల్సిందే. ఈ దారిద్ర్యం వర్ధిల్లాల్సిందే. ఇది - ప్రశాంతమైన విప్లవం. మహా ఫలితాలనిచ్చే ఉద్యమం కానివ్వండి. శాంతంగా రెండు మూడు యుగాల్లో వారు మనతో సమానులౌతారు.

నేను ఆ తండా దగ్గరికి చేరాను. లక్ష్మీదేవి అమడ దూరంనుంచైనా తొంగి చూడదాని సుపరిమళ భరితమైన ప్రదేశం. సరస్వతి కనీసం తల్చుకోనైనా తల్చుకో రాని మూఢత్వం. ధన్వంతరి సదా నివాసం చేయవలసియుండి సైతం అటు తొక్కి చూడలేని ఆరోగ్యం. సర్వవ్యాపి అయిన విష్ణువు సైతం ఆ ప్రదేశం మినహా ఇతర స్థలంలో వ్యాపించి ఉండాలని కోరుకునేలాంటి పవిత్ర స్థలం.

ప్రతి గుడిసెకు ఒకే ఒక గది. గోడలు. మట్టివి కాని ఇటుకవి కాని కావు. అలా అయితే వీరు నాగరికత వెలుగు చూసినట్లేనాయె! ఈతమండలూ లేక కంది మండలూ కూర్చి కట్టినవి. ముందొక పందిరి. దానికి గోడల్లేవు. సరిగ్గా ముందు పశువులు. వాటికి కొట్టంలేదు. వారి ఇండ్లే పశువులు నివసించేలా ఉన్నప్పుడు, పశువులు నివశించడానికి ఎలాంటి కొట్టాలు వేయాలి? ప్రతి ఇంటి—దాన్ని ఇల్లు అనడం శావ్యమైతే - ముందు పెద్ద తిరగలి. అది ఆడుతేనే వారి బుక్కాడేది. వారు పండించే పచ్చని జొన్నలు ఆ పెద్ద తిరగలిలో వారి ఎముకల్తో సహా పిండి అవుతాయి. ఆ పిండితో మట్టి పెంకపై కాల్చిన రొట్టెల్లో మీరు కనీసం వినని శాకములు—కూర వండి దానితో సహా తింటారు. అది వారి ఆహారం. పుష్టికర మైన ఆహారం. ఇదే ఆదర్శనీయమనే ప్రచారం జరిగినా మన ఆహార సమస్య చాలా వరకు పరిష్కరించబడును.

మొదటి ఇల్లు ఆ తండా నాయకునిది. 12 మంది సంసారం. 60 ఏళ్ళ వృద్ధుల దగ్గర నుంచి 6 నెలల పాపల దాకా ఉన్నారు. మంచం మీద కూర్చొని పెద్ద చుట్ట పీలుస్తున్నాడు. సుమారు 15 పశువులు ఇంటిముందే కట్టివేసి ఉన్నాయి. అందులో సగం ఆవులు. ఒక్కటీ పాలివ్వదు. అన్నీ అరక దున్నలే. అన్నిటికీ కండతప్ప మిగతా అన్ని అవయవాలు సక్రమంగా ఉన్నాయి. ఇవి పొలం దున్ని వాండ్లకు సంపాదించి పెట్టాలి. చుట్టూ జొన్న చేలు ఎర్రబారి ఉన్నాయి. ఎదురుగా కూర్చున్న ఇద్దరు యువతులు ఆ కుశుద్ధంలోనే కూర్చొని పేడతో పిడకలు చేస్తున్నారు. అదే రొంపిలో బాలురు ఆడుకుంటున్నారు.

ప్రక్కకు మంచంమీద ఒక అస్థిపంజరం పడివుంది. కళ్ళు ఇంకా తళుక్కు మంటున్నాయి. కాబట్టి ప్రాణం ఉందనుకోవాలి. అంతకంటే ప్రాణం ఉన్న లక్షణా లేమీ లేవు. డోక్కుంటున్నాడు. తెల్ల వాంతులు నిముష నిముషానికీ అవుతున్నాయి. పక్క గుడ్డలన్నీ తడిసి ఉన్నాయి. బహుశః విరేచనాలుకూడా అవుతూ ఉన్నాయి. ఆ విషయం లెక్కచేసిన నాదుడు లేడు. దప్పి కాబోలు నీటికోసం సంజ్ఞ చేస్తు న్నాడు. కాని విన్న యజమాని ఎవరూ లేరు. అన్నీ దేవునికి అప్పగించారు. ఒక యువకుడు కోడిని తెచ్చి అతని చుట్టూ తిప్పి దాని మీద కత్తి చలాయించాడు. దాని ప్రాణం బలియిచ్చి, తనవాడి ప్రాణం కొనుక్కోవాలనే అమాయక ప్రయత్నం. ఒక యువతి చాలా అందవతి. పచ్చని బంగారుఛాయ. భుజం మీద పచ్చని పచ్చ బొట్టు. వెంట్రుకలు రెండు పాయలుగా తీసి చెవుల వైపు రెండు పెద్ద బుట్టల్లో ఇరికించి

ఉన్నాయి. ఆమె తెల్లని గంగాళంలాంటి బిందెలో నీరు తెచ్చింది. కనీసం వడపోసి నట్లు లేదు. బాగా చూస్తే పురుగులు కనిపించేట్లున్నాయి. ఆ నీరు ఒక ముంతలో తెచ్చి రోగికి అందించింది. ఆమె రోగి భార్య. గర్భవతిలా ఉంది. రోగి నీళ్ళు గటగటా తాగాడు. పెద్ద వాంతి చేసుకున్నాడు. అది ఆమె మొఖం మీద పడింది. అతని చేతిలోని మట్టి గురిగి క్రిందపడి పగిలింది. పైనున్న వోణీతో ఆమె మొఖం తుడుచుకుంది. రోగి బట్టతీసి తుడిచి మళ్ళీ వేసింది. రోగి పెద్దగా మూలిగాడు. ఆమె లోపలికివెళ్ళింది. ఇంకో మట్టిముంతలో జొన్న సంకటి తెచ్చింది. అది జొన్నరవ్వతో చేసిన జావ, రోగికి ఇచ్చింది. ఆదరువు లేకుంటే మరీ డీలాపడి పోతాడని ఆమె ఉద్దేశం కాబోలు. రోగి సంకటి తాగాడు. మళ్ళీ భళ్ళున కక్కాడు. ఈ తడవ గుడ్డలన్నీ పాడయినాయి. ఇక గుడ్డల్లేవు. వృద్ధుని తలపాగా ఇచ్చాడు. ఆ పడిన వాంతి తుడిచి యువతి లోనికి వెళ్ళింది.

ఒక వైద్యుడు. పైజామా, బుష్‌షర్ట్ వేసుకున్నవాడు, సైకిల్‌మీద వచ్చాడు. డాక్టరులా కనిపించాలని విరిగిన స్టెతస్కోపు తగిలించుకున్నాడు. బక్కగా గట్టిగా ఊదుతే పడిపోయేట్టున్నాడు. కళ్ళద్దాలు, బుట్టెడు జుట్టూ, చేతులో ఒక బ్యాగుతో ప్రత్యక్షమైనాడు. అతనికి అనుభవం వినా అన్య విద్యాభ్యాసం లేదు. అక్కడికి చేరగానే ఆ వృద్ధుడు 'రాం రాం' అని సత్కారం చేశాడు. ఆ మంచం మీద కూర్చొని సంచీ విప్పాడు. వారిద్దరూ ఏదో బేరం ఆడారు. యువతి మెళ్ళోని పాత రూపాయల దండ అతనికిచ్చారు. బహుశః ఇక్కడ కరెన్సీ చెలామణీలేదు. వినిమయపు పద్ధతే అమల్లో ఉండవచ్చు.

డాక్టరులాంటి మనిషి సిరంజిలోకి మందెక్కించాడు. ఆ సూది తుప్పుపట్టకుండా లేదని నా అనుమానం. అయోడిన్ రాసి ముక్కు మూసుకొని కండ లేనందున చర్మంలోకే ఇంజెక్షన్ ఇచ్చి ఉంటాడు. సూది గుచ్చగానే చెయ్యిలాగి కొట్టాడు రోగి. మిగతా ఇద్దరు పట్టుకున్నారు. సిరంజి కాస్త బయటకు లాగి మందు లోపలికి నెట్టాడు. అతని ధర్మం తీరింది. రోగి మళ్ళీ కక్కాడు. వైద్యుడు తోవబట్టాడు. వైద్యుడు పదిగజాలు వెళ్ళాడో లేదో రోగి కన్నుమూశాడు. జనం గొల్లుమన్నారు.

భవదీయుడు,

'దేహదాసు'

ఉత్తరం (11)

# పుణ్యభూమి

(భావదాసుగారి ఖుద్దుకు)

నమస్సులు

అప్పు పెట్టిన రోహిలా వాడిలా నొప్పి వెంటపడింది. మార్వాడీ వడ్డీలా గంట గంటకూ పెరుగుతూంది. గంటగంటకూ వాలు, కూరలు అందించే ఇల్లు వదులు కొని మళ్ళీ ఈ స్వర్గంలో పడ్డాను. మందు తెచ్చుకొనే సత్తా లేనివాళ్ళంతా దేవుణి దూషించడమో, భూషించడమో చేయాలి.

కడుపులో చిచ్చుపెట్టినట్లుంది. నీళ్ళుపోస్తుంచే పెరుగుతూంది. ధర్మాసుపత్రిలో నా మిత్రుడు ఒక డాక్టరున్నట్లు తెలిసింది. అన్యథా శరణం నాస్తి.

నొప్పి నడ్డి విరుస్తుంటే నడుస్తున్నా రోడ్ల వెంట. అది స్టేషను. రైలాగింది. జనం దిగుతున్నారు. బయటికి వస్తున్నారు. సూటుతో ఫస్టుక్లాసులోంచి దిగిన మహా మహుని టిక్కెట్టు అడగలేక నెత్తిన తట్టల్తో దిగిన ఎరుకల వాళ్ళమీద ఎక్కువ లగేజీ ఉందని కసురుతున్నాడు టి. సి. రాలే చెట్టుకే రాళ్ళు కొట్టాలి. మరొక టి. సి. నలుగురిని వెంటతెచ్చి టి. సి.తో గుసగుస చెప్పి టిక్కెట్టు లేకుండానే పంపించాడు. గేటు దాటి రావాలని జన ప్రవాహం తొక్కుకుంటున్నారు. సామాను మోసుకొచ్చిన లైసెన్స్ కూలీకి అరణాలిచ్చిన ఒక యోగీశ్వరుడు రిక్షావాడికి మూడణాలిస్తానని బేరమాడుతున్నాడు. లైసెన్సు ఉంచే లక్షమందిని దోచవచ్చు.

విమానం మోతతో, ఏనుగు నడకతో ఎద్దుల బండి అంత ఉన్న బస్సు మూలుగుతూ, ముక్కుతూ, ముప్పైనాలుగు మందికి సీట్లు మోసుకొచ్చి గునుస్తూ ఆగింది. పేలాలు చల్లితే మూగిన కోతుల్లా మూగారు జనం. బస్సులో కండక్టర్ ఆసీనుడు అయి ఉన్నాడు. డ్రైవర్ బస్సుదిగి క్యూ తయారుచేశాడు చివరకు వచ్చిన నాయకమ్మన్యుని ముందు నుంచోబెట్టి. క్యూ హనుమంతుని తోకలా చుట్లు తిరుగుతూంది. కండక్టర్ టిక్కెట్లు ఇస్తున్నాడు. జనం టిక్కెట్లు తీసుకుంటున్నారు. బస్సు ఎక్కుతున్నారు. క్యూలో బేడావంతు జనం కూడా బస్సు ఎక్కలేదు. బస్సు

నీళ్ళ టాంకులా నిండిపోతుంది. ఇంక ఎక్కనిచ్చేది లేదు. తరువాత మళ్ళీ బస్సు లేదు.

బస్సు కదలటానికి సిద్ధంగా ఉంది. అప్పుడే చేరాడు ఒక ఖద్దరు మనిషి. ముతక ఖద్దరు దోవతి కట్టాడు. ఖద్దరు లాల్చీ వేశాడు. గాంధీ టోపీ, భుజానికి ఒట సంచీ, అందులో రాట్నంకూడా ఉన్నట్లుంది. కండక్టరుతో మాట్లాడుతున్నాడు. ఇదివరకు వేసినట్లు పెద్ద బస్సు వేయమంటున్నాడు. ఇంతమంది జనానికి అసౌకర్యం కలిగించడం న్యాయం కాదంటున్నాడు. పెద్ద బస్సులన్నీ జాతీయం చేయబడిన దేవతల రూటుకు పంపబడ్డాయని, పురాతనం అయిన ఈ బంగారు బస్సులే ఈ మనుష్యులకు అప్పగించారనీ అంతకుమించి గత్యంతరం లేదనీ కండక్టరు చెపుతున్నాడు. బస్సు కదిలే సమయం అయింది. కండక్టరు డ్రైవరుకు సంజ్ఞ చేశాడు. ఖద్దరు మనిషి దిగి బస్సుకు అడ్డంగా పండుకున్నాడు. పెద్ద బస్సు వేసి అందర్నీ తీసుకెళ్ళేదాకా సత్యాగ్రహం చేస్తానంటాడు. బస్సు ఎక్కిన వాళ్ళలో కలకలం బయలుదేరింది. దిగితే తమ హక్కు పోతుందని బస్సులోంచే గోల పెడుతున్నారు. బయట నిల్చున్న జనం అతని మీద సానుభూతి చూపుతున్నారు. కండక్టరు ఖద్దరు మనిషికి నీతులు చెపుతున్నాడు. తమ ధర్మ నిర్వహణకు ఆటంకం కలిగించడం నేరంగా పరిగణించబడుతుందని కండక్టరు హెచ్చరిస్తున్నాడు. అయితే గాంధీజీ ఉప్పు సత్యాగ్రహం చేయడమూ, సహాయ నిరాకరణ ఉద్యమం సాగించడమూ నేరం అన్న వారికంటే మీరేం తక్కువ అని వాదిస్తున్నాడు ఆ ఖద్దరు మనిషి.

కండక్టరు పరుగెత్తాడు. షెడ్డునుంచి అధికారులంతా వచ్చారు. టెలిఫోన్ల ప్రవాహం సాగింది. ఒక నిండు ప్రాణాన్ని ఎలా తీయడం? అలా చేయకుంటే బస్సు కదిలేట్టు లేదు. శాసనం జనానికి లొంగిపోతుంది కదా అని మహా విచారపడుతున్నాడు పోలీసు అధికారి. గంటల తరబడి అలాగే పడుకున్నాడు ఖద్దరు మనిషి. ఇంకో బస్సు వచ్చింది. అందులో అందరూ ఎక్కారు. అయితే ఎక్కింది వడ్డీ మాత్రమే. అసలు మళ్ళీ అలాగే మిగిలిపోయింది.

ఇలాంటి సత్యాగ్రహం ఇన్నాళ్ళ తరువాత ఇప్పుడే వినడం-చూడడం. జనం తండోపతండాలుగా వస్తున్నారు. రాళ్ళను కరిగించే ఎండలో ఖద్దరు మనిషి రోడ్డు మీద పడుకునే ఉన్నాడు. అతనికి నిమ్మనీళ్ళు, మజ్జిగ ధారాళంగా అందించబడుతున్నది. విద్రోహికి ఆశ్రయం ఇవ్వడం, ఆహారం సరఫరా చేయడం కూడా నేరమే అనే సెక్షన్ను నెమరువేస్తున్నాడు పోలీసు అధికారి. రెండవ బస్సు వెళ్ళిపోయింది. పెద్ద బస్సులు ఈ రూటుకు వేసేదాకా కదలను అంటున్నాడు సత్యాగ్రహి. మొదటి బస్సులోని వాళ్ళు టిక్కెట్లు కొన్నందుకు విచారిస్తున్నారు. ఎక్కువసేపు డ్యూటీ చేయాల్సివచ్చినందుకు డ్రైవరూ, కండక్టరూ విసుక్కుంటున్నారు.

పోలీసు అధికారికి ట్రంక్‌కాల్ వచ్చింది. హడావుడిగా పరిగెత్తాడు. చిరు నవ్వుతో తిరిగివచ్చాడు. "మీరు ఉద్యోగుల ధర్మ నిర్వహణకు అవరోధం కలిగిస్తున్నారు కాబట్టి మిమ్ములను అరెస్టు చేస్తున్నాను" అన్నాడు సత్యాగ్రహితో. సత్యాగ్రహి ఆజ్ఞను శిరసావహించాడు. జనానికి అది నచ్చలేదు. అయినా సత్యాగ్రహి అరెస్టు చేయబడినాడు. బస్సు కదిలింది.

కడుపు నొప్పి పెరుగుతూంది. కడుపులోన తేళ్ళు, జెర్లు చేరి కుట్టుతున్నట్లుంది. ఒక కప్పు పాలు పడేద్దామని రైల్వే హోటలుకు చేరాను. పాలు, విదేశీ దాతలు ఈ దేశపు దరిద్రులపై కనికరించి బిచ్చంగా ఇచ్చిన పాల డబ్బాలు దరిద్రుల నోట్లో మట్టి కొట్టి చౌకగా కొని గిరాకీగా అమ్ముకుంటున్న పాలు. కనీసం స్వదేశీ పాలయినా దొరికేట్లు లేవు. విదేశాలకు మేక పిల్లను పట్టుకొని పోయిన కాలం పోయింది. ఈ దేశంలో విదేశాల పాల కాలం వచ్చింది!

నొప్పి కొద్దిగా తగ్గింది—వడ్డీ చెల్లించబడింది కాబట్టి-ఇక నడవాలి. నడక సాగించా. అది పట్నానికి రాచబాట! శరీరానికి తల ఎంత ముఖ్యం అయిందయినా చిన్నది అయినట్లు ఈ రాచబాటకు కాలిబాటలు తల నిష్పత్తిలోనే ఉన్నాయి. కార్ల వాళ్ళ నుంచి కాక కాలి బాట వాళ్ళు ఏమి ఇచ్చి చచ్చారు గనుక! వాటిని ఎందుకు విస్తృత పరచాలి. అసలే ఇరుకు కాలిబాట. దాని మీద సమస్త విధాలయిన చిల్లర వ్యాపారాలు జరుగుతున్నాయి. కూరగాయలు, పొరిక కట్టలు, సూదులు, పొప్పదంట్లు, పుస్తకాలు, మస్తకాలు, అత్తరు బుడ్లు, రిబ్బన్లు, ఇత్తడి గిన్నెలు, కొబ్బరి మిఠాయిలు, ఒకటేమిటి సమస్త రకాల వ్యాపారం జరుగుతూంది. అంతేకాదు. హోటళ్ళలోకి విచ్చేసినవారి ద్విచక్ర శకటాలు సగం కాలి బాటనూ, సగం కారు బాటనూ ఆక్రమించుకొని ఉన్నాయి. గొప్పగొప్ప దుకాణాల్లోకి వచ్చే వారికి వేడి తగలకుండా రక్షించడానికై వేసిన లంకంత పరదాలు కాలిబాటలనూ తమవిగా చేసుకున్నాయి. ఈ కాలిబాట మీద నడిచేవారు వేలు! కారుబాటమీద నడిచేవారు ఎందరు?

కాలి బాటకు ఆ చివర ఒక కారు ఆగింది. కార్లోంచి కొందరు ఖాకీ ఖద్దరు జాకీదారులు దిగారు. తన ఉద్యోగులకు ఖద్దరు భారం అప్పగించి, తాను వేతన భారం మాత్రం మోస్తున్న అధికారి ఆంగ్లేయుల దుస్తులు ధరించి దిగాడు. వారి రాకతో, కాలిబాట వ్యాపారుల్లో కలకలం బయలుదేరింది. "ఆయారే!" అంటే "ఆయారే!" అని బట్టలూ, తట్టలూ, పుస్తకాలూ, మస్తకాలూ, పెట్టెలూ, గుట్టలూ నెత్తిన వేసుకొని పరిగెడుతున్నారు. ఖాదీ ఖాకీవారు వ్యాపారులను తరుముతూ ఉరుకుతున్నారు. పావురాల వెంట పడిన డేగల్లాగా, డేగలకు దొరక్కుండా ఉండాలని పావురాలు. పావురాళ్ళను పట్టితీరాలని డేగలూ పోటీలుపడి పరుగు పెడుతున్నారు. కూరగాయల బుట్ట నెత్తిన వేసుకొని ఉరుకుతూంది ఒక కోమలి. యవ్వనంలో ఉన్నది. మిసమిసలాడు తున్నది. అయినా పరుగెత్తలేకపోతుంది. ఆయాసపడుతుంది. కారణం అనూహ్యం కాదు. ఒక ఖాకీ ఖాదీవాలా ఆమెకొంగు

పట్టాడు. తప్పించుకోవడానికి ఉరికే ప్రయత్నంలో అరటి తొక్క మీద కాలు పడింది. కూరగాయలు చెల్లాచెదురుగా రోడ్డు మీద పడ్డాయి. ఆ కోమలి రోడ్డు మధ్యన పడిపోయింది. మైకంలో వస్తున్న కారు చక్రాలు ఆమెను వడిలోనికి తీసుకున్నాయి. కారు కీ్రున ఆగింది. ఆమె తల చితికిపోయింది. రోడ్డు రక్తసిక్తం అయింది. కీ్రున ఆగిన కారులోని కుక్క సింహంలా రోడ్డు మీదకు దూకింది. ఇద్దరెని పట్టింది. ఆ గ్రామ సింహాన్ని అదుపులోనికి తెచ్చేవరకు రక్షక భటుల ప్రాణాలు వాళ్ళ తోకల్లోకి వచ్చాయి. ఆమె - ఆ కూరగాయల కోమలి - కనీసం మూలుగయినా లేని కమ్మని చావు చచ్చింది. రాజబాటలో కలకలం చెలరేగింది. ఖాదీ ఖాకీవారు చుట్టూ చేరారు. పోలీసులు వారి కారు నెంబరు నోటు చేసుకున్నారు. కారు సాగిపోయింది. ఆమె కళేబరం శవ పరీక్షకు పోయింది. ఇంతలోనే ఏమీ జరగనట్లే ఉంది. మామూలుగా రాకపోకలు సాగుతున్నాయి. సభల్లేవు. సంతాప తీర్మానాల్లేవు. నాయకుల ఉపన్యాసాల్లేవు. వినాయకుల అట్టహాసాల్లేవు. ఈ దేశంలో ప్రాణాలకు మించిన చౌక వస్తువు లేదు.

అదిగో నన్ను మించిన దరిద్రులు. ఫుట్‌పాత్ సంసారీయులు. బుద్బుద ప్రాయం అయిన ఈ లోకపు అశాశ్వతత్వాన్ని చాటే చోటు రెండు సన్నని ఎదురు బొంగుకు గోనె సంచులు కట్టిన మహాభవనం. పడక గది, వంటగది, వసారా, అలంకారగృహం, కోపగృహం, స్నానాలయం, మూత్రశాల, మరుగుదొడ్డి అన్నీ అదే - ఆ జానెడు స్థలమే. అందులో ఒక గోనె సంచి వ్రేలాడ దీసిన ఊయల, అందులో చిట్టి పాప. ఈ దరిద్రంగానీ, ఆ సంపదగానీ ఎరుగని అమాయక ప్రాణి! ఎండ, గాలి, చలి, వెలుగు, ఆ చిట్టి పాప పాలే. వారు అదృష్టవంతులు కారు. సెక్యులర్ రాజ్యంలో అదృష్టం ఇంత బలవత్తరం ఎందుక్కావాలి?

జడలో కట్టిన జుట్టు, స్నానపు పేరు ఎరుగని ఉప్పు పేరిన శరీరాలూ, కట్టిన్నాటి నుంచీ నేటి వరకూ పేరిన మురికిని కొలుస్తున్న దుస్తులు గల బాలురు, యువకులు, యువతులు, వృద్ధులూ ఆ కుటుంబ సభ్యులు.

ఒక పొయ్యి, పొయ్యిమీద నల్లని మసిపటిన జర్మన్ సిల్వర్‌గిన్నె. దాని పక్కన అలాంటిదే మరొక పొయ్యి. పొయ్యి మీద మరొకగిన్నె. క్రింద గుట్టలాంటి రొట్టెల మడతలు. అది హోటల్ అశోకా! చుట్టూ వీళ్ళలాంటి జనమే. రిక్షావాళ్లు, బిచ్చగాళ్ళు, రోగులు, యోగులు రొట్టెలు కొని తింటున్నారు. అది అచ్చపు అనారోగ్యకర ఆహారం! పక్కనే ఒక వృద్ధుడు కళ్ళు మూసుకొని మూలుగుతున్నాడు. మా సమాజపు నగ్న స్వరూపం చూడాలంటే ఇక్కడికి రండి. పాప ఏడుస్తూంది. కుర్రాళ్ళు తల్లి మీద పడి గోల పెడ్తున్నారు. తల్లి రొట్టెలు చేయడంలోనూ, అమ్మడంలోనూ నిమగ్నం అయి ఉంది. ఈ బాటనుంచి రోజూ ఎంత మంది నాయకులు సాగిపోతున్నారో? ఎంతమంది సంస్కరణవాదులు వెళ్తున్నారో? ఎంత మంది కవులు, భావవాదులు విహారాలు చేస్తూ విహరిస్తున్నారో? ఇది స్వర్గం. వారు

దార్రిద్ర్యంలో అనుభవిస్తున్నది ఆత్మానందం. కష్టించి పని చేసిన వానికి మిగిలే ఫలితం. మరణం తరవాత లభించే రంభా సమాగమం!

నొప్పి తెరలు తెరలుగా వస్తూంది. సముద్ర తరంగాలు ఆగిన్నాడే బహుశా ఈ నొప్పి ఆగుతుందేమో! ఇక కళ్ళు మూసుకొని నడవాలి. అడుగడుక్కూ ఇలాంటివి లక్ష! ఇది గొంగళి. ఇందులో తాను వెంట్రుకలు ఏరడం తప్పు. మనది మనుషుల దేశం కాదు. ఆత్మల దేశం. మనది ఐహిక రాజ్యం కాదు-పారలౌకిక రాజ్యం. ఆ చచ్చిన కోమలి, ఈ ఫుట్‌పాత్ సంసారీయులు, ఆ కారులోని కుక్క సహజీవనం చేయవలసిన రాజ్యం. ఇది సనాతన దేశం! పుణ్యభూమి! ఇక్కడ మార్పు ఉండదు. ఉండరాదు.

డాక్టరు ఇల్లు చేరుకున్నాను. మా మిత్రుడు అక్కడే ఉన్నాడు. డాక్టరు నన్ను గుర్తించాడు. నా చరిత్ర విన్నాడు. గౌరవించినంత పనిచేశాడు.

ఇంతలో ఒక కారు ఆగింది. చిలకా గోరింకలు దిగారు. డాక్టరుతో పాటు గదిలోకి వెళ్ళారు. డాక్టరు బయటికి వచ్చాడు. కారు బుర్రుమంది. "విన్నారా! వారికి కుటుంబ నియంత్రణ కావాలట. ఆ ఉద్యమం కూలి వాని నుంచి ప్రారంభం కావాలని నేను చెప్పాను" డాక్టరు వాదం నాకు నచ్చింది. అయితే ముఖస్తుతి చేయగలవాణ్ణికాను. ఈ పూటకు డాక్టరు దగ్గరే ఉంటున్నా. రేపు ధర్మాసుపత్రిలో చేరుతున్నా. మీకు తీరిక ఉంటుంది అనుకోను. ఉంటే ఒకనాడు ఆస్పత్రిదాకా విచ్చేయండి.

మీ

'దేహదాసు'

